# మాతృభారతి.



"కం. పురుషుఁడు చదివిన, నొక్కఁడు
నరనుఁడగుం దాన; తరుణి చదివిన జాత్యు
ద్ధరణమె సేకుఱుఁ; గావునఁ
దరుణిం జదివింపకుండఁదగ దెవ్వరికిన్."

# మాతృభారతి

బాలికల ఉన్నత పాఠశాలయందలి విద్యార్థినీసంఘము పక్షమున,

౧౯౩౮-౩౯ లో వెలువడిన సచిత్ర-లిఖిత-మాసపత్రికలలోని

## వ్యాసముల సంపుటము.




సంపాదకుఁడు,

బిదురు వేంకటశేషయ్య, బి. ఏ.

సహోపాధ్యాయుఁడు.





ఈసంచిక ౨౧ వ పుటనుండి,

ప్రేమసాగర ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

గౌలిగూడ, హైదరాబాదు - దక్కన్.




రాజాబహద్దర్ వేంకటరామా రెడ్డిగారు, ఒ. బి. ఇ.
స్పెషల్ ఆఫీసర్, సర్ఫెఖాస్ ముబారకు.

# తొలిపలుకు

"మాతృభారతి" యను లిఖితమాసపత్రిక మాపాఠశాలవిద్యార్థినులలో లేఖనోత్సాహమును వృద్ధిపరచు నుద్దేశముతో గతసంవత్సరమునుండి వెలువడుచున్నది. సంవత్సరాంతమున దీనియందు వ్రాయఁబడిన వ్యాసములను సంపుటముగా ముద్రించి ఆంధ్రమహాజనుల కందఁజేయవలెనని నిశ్చయింపఁబడెను. ఈప్రయత్నము ఫలరూపమును దాల్చుట సంతోషావహము.

బాలికలకు తమతమ మాతృభాషలలో స్త్రీల కనుగుణ్యమగు ప్రత్యేకవిధానము ననుసరించి ఉన్నతవిద్యను నేర్పుటకు హిందూదేశమునం దవకాశములను మొట్టమొదట కల్పించగలిగినది భారతమహిళావిశ్వవిద్యాలయమే. దీని స్థాపకులగు ఆచార్యకర్వేగారు నాకు చిరకాలమిత్రులు. వీరీవిషయమున చేయుచున్న కృషి, త్యాగము ఆదర్శప్రాయములు.

నిజామురాష్ట్రములోని ఆంధ్రదేశమున కంతటికిని ఈపాఠశాల ఏకైక సంస్థయై యొప్పుచున్నది. బాలికలను ఆదర్శగృహిణులుగను, ఉత్తమమాతలగను చేయుటయందేగాక కుటుంబినులకును వితంతువులకును గూడ ఈసంస్థ ఉపయోగపడుచున్నది. దీనిలోని విద్యార్థినుల సంఖ్య దినదినాభివృద్ధిగాంచుటయే దీని ప్రజామోదమును చాటుచున్నది. ఈపాఠశాలను అన్ని విధముల ఆదర్శసంస్థగా చేయుటయే మాసంకల్పము.

ఇట్టి ఆశయముతోనే పత్రికారచనకార్యము పాఠశాలయందు ప్రారంభింపబడినది. దీనికి వలయు సాధనసంపత్తి గత ఏడుసంవత్సరములలో సమకూరి మాతృభారతిస్వరూపమున వెలువడినది. ఈకొద్దికాలములోనే గద్య వ్యాసములు, చిత్రరువులు, విజ్ఞానప్రదమగు వివిధ విషయములందేగాక పద్యరచనయందుగూడ బాలికల కభిరుచి కలిగినదనుట కీవ్యాససంపుటమే సాక్షి. లిఖితమాసపత్రికలోని రచనలన్నియు దీనిలో ముద్రించజాలకపోయితిమి.

ఈ యుద్యమమునందు ప్రత్యేకముగ కృషిసలిపి బాలికల సర్వతోముఖాభివృద్ధికయి తోడ్పడుచున్న సహోపాధ్యాయులగు శ్రీయుత. బిదురు వేంకటశేషయ్య బి. ఏ. గారు మాతృభారతీసంపాదకత్వమును వహించి చేసినసేవ ప్రశంసాపాత్రమై యున్నది.

రుక్మిణీవిలాసము,
హైదరాబాదు.
౨౫—౧౨—౧౯౩౫

రాజాబహద్దూరు వేంకటరామారెడ్డి.
అధ్యక్షుడు:
బాలికల ఉన్నతపాఠశాల కమిటీ.

# అభిప్రాయములు

## ౧. గోలకొండ పత్రిక.

—◆ మాతృభారతి ◆—

ఇదియొక సచిత్ర లిఖిత మాసపత్రిక. హైదరాబాదు నగరమున సుల్తాన్‌బజారులోని బాలికల ఉన్నతపాఠశాలలో చదువు విద్యార్థినుల వ్యాసరచనాశక్తిని వికాసము నొందింపఁజేయు నుద్దేశముతో ప్రారంభింపఁబడినది. దీనికి సంపాదకులు బిదురు వేంకటశేషయ్య బి. ఏ. గారు. మద్రాసు "భారతీ" పత్రిక ఆకారమున నీ 'మాతృభారతి' ౩౨ పుటలు గల్గి ౨౦ గద్యపద్య వ్యాసములతోను పెక్కు విచిత్రాంశములతోను ఒప్పారుచున్నది. ఇందలి వ్యాసములలో ననేకములు పాఠశాలా బాలికలే రచించియుండుటయు, అవి రచనాసౌష్ఠవమునందేమి భావౌన్నత్యమునందేమి, కడుంగడు శ్లాఘనీయముగ నుండుటయు, ముదావహము. ఈ పత్రిక యంతయు ముత్యములవంటి అక్షరములతో తుడుపులులేకుండ, తప్పులులేకుండ సందర్భానుసారముగ వివిధములగు విచిత్రాక్షరములు కలిగియుండుట గమనింపఁదగిన విషయము.

## ౨. హైదరాబాదు బుల్లెటిను.

బాలికల ఉన్నతపాఠశాలలోని బాలికలచే నడపఁబడుచున్న లిఖిత మాసపత్రికయగు మాతృభారతి యిప్పుడే చేరినది. ఇది చక్కని చిత్రములతో, చక్కఁ వ్రాతతో నొప్పుచున్నది. భూగోళము చరిత్ర, విద్యావిషయములు, కళాత్మకము మున్నగు పెక్కు విషయములపై నిందు వ్యాసములుగలవు. ఇందు బాలికలచే వ్రాయఁబడిన చక్కని పద్యవ్యాసములు మాతృభాష నేర్చుకొను వ్యక్తులకెట్టి యభివృద్ధినియ్య వీలగునో చెప్పుచున్నవి. ఇట్టిదానిని, మాసపత్రికగాఁ గాకపోయినను, సంవత్సర సంచికగానైనను ముద్రించుటకు ప్రజామహాశయులు తోడ్పడుదురని తలంచుచున్నాము.

## ౩. శ్రీయుత దివాన్‌బహదురు అరముదయ్యంగారు.

"బాలికలే మాతృభారతిని నెలకొల్పి నిర్వహించుట చాల ప్రశంసనీయము.

## ౪. విద్వాన్ యస్. వి. దీక్షితులుగారు, ఎం. ఏ.

"అయ్యా! మీ మాతృభారతియొక్క అపూర్వపు సంచికలను జూచినాను. అందలి వ్యాసములు ఇంపుగొల్పుచున్నవి. చిత్రపటములతోను, తదితర సామగ్రితోను, నిండియున్న మీ సంచికలు బాలికల ఉత్సాహమును, బోధకుల ప్రోత్సాహమును వెల్లడించుచున్నవి."

## ౫. విద్వాన్ యన్. వి. శాస్త్రిగారు, M. A., P. O. L.

"ఇచ్చటి బాలికలు, తక్కిన పత్రికవలె నూతనపద్ధతులపైన నడపఁబడుచున్న మాతృభారతియను లిఖితమాసపత్రికకు ఇచ్చు చక్కని వ్యాసములద్వారా, తమ మాతృభాషయందలి పాండితిని, అభిరుచిని వెలిఁబుచ్చుచున్నారు."

# విషయసూచిక


| వ్యాసముల పేర్లు. | | వ్యాసకర్తల నామములు. | | పుటసంఖ్య |
|---|---|---|---|---|
| 1. స్వవిషయము | ... | ... ... ... | | i—iv |
| 2. ఈశ్వరస్తవము | ... | శ్రీయుత. బిదురు వేంకట శేషయ్యగారు. బి. ఎ. | | ౧ |
| 3. భారతమహిళా విశ్వవిద్యాలయము | ... | ,, వడ్లకొండ నరసింహారావుగారు | | ౨ |
| 4. జీవిత లక్ష్యము | ... | శ్రీమతి. జె. రాధాబాయి | ... | ౪ |
| 5. ధ్రువుఁడు [ప] | ... | ,, కె. వనజాక్షి | ... | ౫ |
| 6. సహకారమే జీవామృతము | ... | శ్రీయుత. అ. నారాయణరావుగారు. | ... | ౬ |
| 7. పరిసరముల ప్రభావము | ... | శ్రీమతి. డి. కమలావతి | ... | ౮ |
| 8. హితోపదేశము | ... | ,, పి. సావిత్రి | ... | ౧౦ |
| 9. ఆశీర్వాదము [ప] | ... | శ్రీయుత. బిదురు వేంకటశేషయ్యగారు, బి. ఎ. | | ౧౧ |
| 10. అహింస | ... | శ్రీమతి. జె. రాధాబాయి | ... | ౧౨ |
| 11. కర్మ | ... | ,, డి. కమలావతి | ... | ౧౫ |
| 12. హైందవ చిత్రకళ | ... | ,, మ. దమయంతి | ... | ౧౬ |
| 13. కడుపుఁదీపు [ప] | ... | శ్రీయుత. బిదురు వేంకటశేషయ్యగారు బి. ఎ. | | ౧౭ |
| 14. నాట్యకళ | ... | శ్రీమతి. డి. కమలావతి | ... | ౧౯ |
| 15. సీత-ద్రౌపది | ... | శ్రీయుత. ఆదిరాజు వీరభద్రరావుగారు | | ౨౧ |
| 16. కావ్యవిమర్శ-మొల్లరామాయణము | ... | శ్రీమతి. కె. లక్ష్మీబాయి | ... | ౨౪ |
| 17. బీదబాలిక [ప] | ... | ,, యన్. భారతీరత్నాకరాంబ | ... | ౨౭ |
| 18. గానకళ | ... | ,, వి. ఆర్. కోమలవల్లి | ... | ౨౮ |
| 19. పంచాంగము | ... | ,, డి. కమలావతి | ... | ౨౯ |
| 20. బమ్మెరపోతరాజు | ... | ,, కె. రాఘవమ్మ | ... | ౩౧ |
| 21. అనుతాపము [ప] | ... | ,, కె. ఫ్లారెన్సు | ... | ౩౨ |
| 22. సావిత్రి [ప] | ... | ,, వై. కౌసల్యాదేవి | ... | ౩౩ |
| 23. రూపాయస్వీయచరిత్రము | ... | ,, పి. సావిత్రి | ... | ౩౪ |
| 24. వ్యాధులు-మందులు | ... | ,, వ. ఇందిరాదేవి | ... | ౩౫ |
| 25. స్త్రీవిద్య | ... | ,, ఇందుమతి | ... | ౩౭ |
| 26. ప్రహ్లాదుఁడు [ప] | ... | ,, వి. లక్ష్మీదేవి | ... | ౩౯ |
| 27. మాచిన్న కథలు / అనుమానము, తగ్గింపు | ... | ,, పి. సావిత్రి / ,, ఇందుమతి | ... | ౪౦ |
| 28. శంకరాభరణరాగము | ... | ,, పి. కమల | ... | ౪౧ |
| 29. మానవసేవ ఈశ్వరసేవయే | ... | శ్రీయుత. కె. రామమూర్తిగారు | ... | ౪౨ |
| 30. సూర్యోదయము | ... | శ్రీమతి. వి. ఆర్ కోమలవల్లి | ... | ౪౪ |
| 31. విద్యాప్రభావము | ... | ,, బి. మణి. | ... | ౪౫ |
| 32. ధ్యానము [ప] | ... | ,, యన్. భారతీరత్నాకరాంబ | ... | ౪౬ |
| 33. కైక-మంథర [ప] | ... | ,, వి. లక్ష్మీదేవి | ... | ౪౭ |
| 34. ప్రాయశ్చిత్తము | ... | ,, బి. మణి | ... | ౪౮ |
| 35. కష్టాలు | ... | ,, మ. దమయంతి | ... | ౪౯ |
| 36. రఘుజననము [ప] | ... | ,, యన్. భారతీరత్నాకరాంబ | ... | ౫౦ |
| 37. ఏసుక్రీస్తువారి జీవితకథ | ... | ,, కె. ఫ్లారెన్సు | ... | ౫౨ |

38. మాశాస్త్రిగారి శౌర్యము ... ,, వ. ఇందిరాదేవి ... ౫౩
39. మతి, విన్నారా నాకథ? ... ,, బి. మణి ... ౫౫
40. గర్వభంగము (ప) ... ,, పి. సావిత్రి ... ౫౭
41. గోపాలుఁడు ... ,, పి. స్నేహలత ... ౫౮
42. శారద, శ్యామ ... ,, ఆర్. లలిత ... ౫౯
43. ప్రబోధము (ప) ... ,, వ. ఇందిర ... ౬౧
44. రహస్యాపరాధపరిశోధకురాలు!! ... ,, వ. ఇందిర ... ౬౨
45. కృష్ణుఁడు, తృణావర్తుఁడు (ప) ... ,, వి. లక్ష్మీదేవి ... ౬౬
46. శకుంతలా ప్రయాణము ... ,, వి. లక్ష్మీదేవి ... ౬౭
47. అశోక చక్రవర్తి ... ,, యస్. భారతీ రత్నాకరాంబ ... ౬౮
48. ప్రతిఫలము (ప) ... ,, కోమలవల్లి ... ౭౦
49. రసపుత్రశౌర్యము ... ,, యస్. భారతీరత్నాకరాంబ ... ౭౧
50. కోడంగ్రసభ ... ,, వై. అమృతమ్మ ... ౭౪
51. కోరిక (ప) ... ,, వై. కౌసల్యాదేవి ... ౭౬
52. పూజ ... ,, వి. లక్ష్మీదేవి ... ౭౭
53. పరీక్ష [ప] ... ,, వ. ఇందిర ... ౭౮
54. చెవిటివారి సంభాషణము ... ,, యస్. భారతీరత్నాకరాంబ ... ౭౯
55. భారత నాగరకతాదర్శనము ... ,, కె. లక్ష్మీబాయి ... ౮౧
56. చలి! చలి!! [ప] ... ,, కె. లక్ష్మీబాయి ... ౮౫
57. వియోగము (ప) ... ,, వి. లక్ష్మీదేవి ... ౮౬
58. భారతీయులపైఁ బాశ్చాత్యనాగరకతాప్రభావము ,, టి. విమలాదేవి ... ౮౭
59. పాతివ్రత్యము ... ,, డి. కమలావతి ... ౮౯
60. స్త్రీలు-దేశసేవ ... ,, వ. ఇందిర ... ౯౧
61. ఆంగ్లేయులనుండి మనమింకను నేర్చికొనవలసిన విషయములు ,, టి. ప్రేమలత ... ౯౩
62. ఆంతఃపురోపన్యాసము ... శ్రీయుత. బిదురు వేంకటశేషయ్యగారు ౯౬
63. సహజగుణము [ప] ... శ్రీమతి వై. అమృతమ్మ ... ౧౦౦
64. భారతీలేఖలు ... ,, పి. సావిత్రి ... ౧౦౧
65. నేనే యుపాధ్యాయిని యయినచో ,, వై. కౌసల్యాదేవి ... ౧౦౨
66. కవిత్వకళ: బాలికలు ... ,, పి. సావిత్రి ... ౧౦౪
67. పతివ్రత [ప] ... శ్రీయుత. బిదురు వేంకటశేషయ్యగారు ౧౦౬
68. మాతృభారతి ... ,, బిదురు వేంకటశేషయ్యగారు ... ౧౦౮
69. „అగ్ని చందనశీతలుఁడయ్యె, నెట్లు ? శ్రీమతి. వై. అమృతమ్మ ... ౧౧౩
70. విద్యార్థినీదశ ... ,, వి లక్ష్మీదేవి ... ౧౧౪
71. మాతృభారతి ... శ్రీయుత. కె. రామమూర్తిగారు ... ౧౧౬
72. వీడ్కోలుపు [ప] ... ,, బిదురు వేంకటశేషయ్యగారు ... ౧౧౮
73. శ్రీరామచరిత్రమ్ ... శ్రీమతి. జె. రాధాబాయి ... ౧౧౯
74. కలగూరగంప, సమస్యాపూరణము ౧౦౫, వెనుకటి సమస్యాపూరణ సమాధానము ౧౦౮, తమాషాలు ౧౦౭

---

## హెచ్చరిక.

సీ॥ కనులపండువుగాఁగఁ ♦ గట్టుబొట్టులఁ గూడ,
నాంధ్రతాముద్ర వే ♦ యఁబడునపుడుఁ,
గాళ్ళగజ్జెలు గట్టి ♦ గల్లున నింటింట
నాంధ్రభారతి నాట్య ♦ మాఁడునపుడు,
నివురెల్లఁ బోఁద్రోఁచి ♦ నిత్యోజ్జ్వలంబయి
యాంధ్రశౌర్యాగ్ని పి ♦ ప్పొలుచునపుడుఁ,
జతురబ్ధివీచికల్ ♦ ప్రతిఫలించెడురీతి
నాంధ్రకీర్తి జ్యోత్స్న ♦ లలమునపుడు,

గీ॥ ఆవఁద్రావిన యట్టులై ♦ యన్నపాన
ములకు లక్ష్యపెట్టక, నడు ♦ ముల్ బిగించి
ముందడుగు వైచి కృషిచేయ ♦ మొనయవలయు,
నాంధ్రబాలికలార ! మీ ♦ రంద ఱింక !!




మా మాతృభారతీపత్రిక ప్రారంభింపఁబడి దాదాపొక సంవత్సరమైనది. ఈలోపుగఁ బ్రకటింపఁబడిన మాసపత్రికలన్నియుఁ బ్రథమసంపుటముగఁ బ్రజామహాశయుల కందఁజేయఁబడును. ఇవి బాలికల శక్త్యుత్సాహములకుఁ బ్రబల నిదర్శనములయి యున్నవి. ఈ సంపుటమును సహృదయహృదయములతోఁ జిత్తగించు పాఠకమహాశయులకు స్వవిషయమును గూర్చి కొలఁదిగ ముచ్చటించుట యప్రస్తుతముగాదు.

ప్రస్తుతకాలమున విశాలమగు నాంధ్రదేశమునఁ జాలపత్రికలు వెలువడుచున్నవి. వానిలోఁ జాలవఱకు సర్వాంగసుందరములగు మాసపత్రికలు ప్రజలదృష్టి నాకర్షించి వారి సానుభూతినిఁ బడయుచున్నవి. పత్రికలన్నియుఁ బ్రత్యేకప్రత్యేకోద్దేశములతో నెలకొల్పఁబడి తమ ప్రత్యేకవ్యక్తిత్వమును స్థిరపఱచుకొనుచున్నవి. వ్యవస్థాపకులు తమ తమ పత్రికా సక్రమనిర్వాహణము ద్వారా ఆంధ్రభాషకు, నాంధ్రదేశమునకు, అమూల్యమగు సేవ యొనర్చుచున్నారు.

ప్రజాదృష్టిపథమున కెక్కిన ముద్రితపత్రికలేగాక, తమ తమ యోపినకొలఁదిని నాంధ్రదేశ - భాషాసేవలను సర్వాత్మపూర్వకముగఁ జేసి, చరితార్థములు కాఁదలఁచి, మెల్ల మెల్లఁగఁ దలయెత్తుచున్న యముద్రితపత్రికలు (లిఖితములు) నెన్నియేనిగలవు. వీనిలోఁగూడ మాసపత్రికలు, ద్వైమాసపత్రికలు, సచిత్రములయి సర్వాంగసౌందర్యముతో నొప్పునవి యున్నవి. ఇవియుఁ బ్రత్యేకోద్దేశములతోనే స్థాపింపఁబడి, ప్రత్యేకవ్యక్తిత్వమునే ప్రదర్శించుచుఁ, బాఠకవర్గముయొక్క యాదరణమునకుఁ బాత్రములగుచున్నవి. ఇట్టివానిలో మా మాతృభారతి యొక్కటి. ఇది బాలికల ఉన్నత పాఠశాలకుఁ జెందినదయి, యందలి బాలికా సంఘపక్షమున బయలుదేఱి, పాఠశాలాపాలకవర్గమువారి సహృదయతను సంపాదించుకొని, గోలకొండ-హైద్రాబాదు బుల్లెటిను పత్రికా సంపాదకుల విపులవిమర్శనముల ద్వారా యాంధ్రమహాజనుల వినికిడికిఁ గుదిరి, మెల్లమెల్లఁగ శ్రీరాజాబహద్దరు వేంకటరామారెడ్డిగారు ఒ. బి. ఇ., శ్రీ వేలూరి రంగధామనాయఁడుగారు, శ్రీమాన్ దివాన్‌బహదూరు అరవముదయ్యంగారు, శ్రీ శ్రీ శ్రీ గద్వాల, జటప్రోలు మహారాజ్ఞీలు, మున్నగు ప్రముఖుల ప్రశంసల నందుకొని, యిప్పుడిప్పుడే ప్రజాదృష్టి నాకర్షించుచున్నది.

మాతృభారతి యాకార సందర్భమున ‘ భారతి ’ ‘ గృహలక్ష్మి ’ మున్నగుపత్రికలను బోలియుండి, సచిత్ర-మాసపత్రికయయి, విజ్ఞాన సాధకములగు కథలు, నాటికలు, లలితకళలు, జ్యౌతిషము, సాంఘికము, లేఖలు, జీవితచరిత్రలు,

ఉపన్యాసములు, విమర్శలు, విద్యావిషయములు మొదలగు వివిధవిషయముల క్రింద సుమారు తొంబదివఱకు నన్నియు నించుమించుగ మొదటిఫారము మొదలు, యఫ్. వై. ఏ. తరగతివఱకుఁగల విద్యార్థినులచే వ్రాయఁబడిన గద్య-పద్యవ్యాసములను గల్గి ఉత్సాహపూరితమై యొప్పుచున్నది. విషయోద్బోధనమునకయి, వివిధశైలీ నిర్వహణమునకయి, బోధకవర్గమునుండియు, విద్యాధికులగు ప్రముఖులనుండియుఁ గృతజ్ఞతతో స్వీకరింపఁబడిన గద్య పద్య వ్యాసము లిందుఁ బొందుపఱుపఁబడినవి. ఇట్లొక్క వైజ్ఞానికవిషయములేకాక, చిక్కుప్రశ్నలు, (వివిధరీతులతో), చిత్రప్రశ్నలు, తమాషాలు, జాతీయములు, యుక్తి లెక్కలు, శ్లోకప్రశ్నలు, హాస్యపుగీతబొమ్మలు పొడుపుఁగథలు, గద్య పద్య సమస్యాపూరణములు, గృహవైద్యము, పాకపద్ధతులు, వార్తావళులు, ఉత్తర ప్రత్యుత్తరములు, మున్నగు భావోత్తేజక విషయములకుఁగూడఁ బ్రాశస్త్య మీయఁబడినది. లలితాంగులగు స్త్రీలకడ లలితకళ లెక్కుడు ప్రకాశింపఁ గలవను తలంపుతో బాలికలకు 'లలితకళ'లయందుఁ గూడఁ జక్కని ప్రవేశమియ్యఁబడి యొక్క సంవత్సర మాత్రమున బాలికలు కృషిచేసి లలితధారాశుద్ధితో వ్రాయనేర్చి యిచ్చిన ఖండకావ్యములు ఇందగ్రస్థానము వహించుచున్నవి. కవితకు సోదరీప్రాయలయి, చెలికత్తెలవలె మెలఁగు సంగీత చిత్రలేఖనములు గూడ నిందుఁ బెట్టని సొమ్ములగుచున్నవి. కావుననే సంగీతకళను గూర్చిన వ్యాసములు, గేయములు, కీర్తనలును గలవు. వానితోఁబాటు చిత్రలేఖనా కౌశలమును దెల్పునట్టి చిత్రములు—మాతృభారతి, శకుంతలా మేనకలు, నదీతీరము, చంద్రోదయము, నదీదృశ్యము, సరస్సు, గాయత్రీదేవి, పచ్చికబయళ్లు, మ.ఘ.వ. నిజాముప్రభువుగారు, శ్రీకర్వేపండితులు, కమలిని, శ్రీకృష్ణుఁడు, సూర్యోదయము, అత్తకోడండ్రు, ఏసుక్రీస్తు, బుద్ధుఁడు, ఆలోచన, గృహదృశ్యము, టాజ్ మహాలు, మరియమ్మ, బాలికల ఉన్నతపాఠశాల, భద్రాద్రి దృశ్యము, ముద్దుకృష్ణుఁడు, పూజ, భరతదేశము (ముగ్గు), ఆంధ్రవిద్యార్థినియని యిరువదెనిమిది చిత్రములు—నున్నవి. చిత్రములకుఁ జేదోడువాఁదోడయి, విస్మృతకళక్రింద మాఱిపోయిన, మన సంప్రదాయసిద్ధముగు 'రంగవల్లీశృంగారము' దీని నలంకరించియున్నది. ముగ్గులను గీయుటలోఁ బ్రతిభాచాతుర్యములను బ్రకటించి బహుమతుల నందిన బాలికలునుగలరు అంతేగాక యిందుసంస్కృత వ్యాసములు నుండుటచే బాలికల భాషాభిరుచి యింకను దేటపడఁగలదు.

ఈపత్రికానిర్వహణ మొక మహత్తరమైన యాదర్శము, ఉద్దేశముపై నాధారపడియున్నది. ప్రస్తుతము మన దేశమున మన పూర్వభారతవిజ్ఞాన సంప్రదాయ సందర్భములు మఱుఁగుపడిపోయి, మనము స్వదేశముననే విదేశీయులుగఁ గన్పడునంత విచిత్రరీతి యేర్పడియున్నది. ఇట్లు మనము స్వయంవ్యక్తిత్వమును గోల్పోవుచున్నట్లున్నందువలననే మనలను బ్రబోధించుకొనవలసిన నవసర మేర్పడుచున్నది. ప్రతి జాతికిని వెనుక సంఘమును, సంఘమునకు వెనుక గృహము నుండునుగావున సక్రమగృహ జీవితమే జాతిజీవితమును బ్రతిబింబించునుగదా! ప్రతిగృహమునకు నధికారిణి, లక్ష్మీస్వరూపిణి శక్తిస్వరూపిణి, స్త్రీయని మన సంప్రదాయసిద్ధమయినప్పుడు, జాత్యుద్ధరణమునకు స్త్రీలే

మూలకందమని వేఱుగఁ జెప్పఁబనిలేదు. అట్టి స్త్రీలు గృహజీవితములో స్వజాతీయతను నిలువఁబెట్టుకొని భారతనాగరకతాదర్శములు వెలిగ్రక్కు దివ్యజ్యోతినిఁ గనఁబఱచి, నూతనోజ్జీవపూరితమైన-జాతీయనిర్మాణమునకుఁ బూనుకొనుట ప్రతిభారతీయునకిని, ప్రత్యాంధ్రునకిని, ప్రత్యాంధ్ర స్త్రీకిని, ప్రత్యాంధ్రపత్రికకును, బరమకర్తవ్యము. ఈ పవిత్రోద్దేశమే మా మాతృభారతికిఁ బునాది, జీవభూతమును. ఇది యిట్లని యిందలివ్యాసములను దిలకించు పాఠక మహాశయు లెఱుఁగకపోరు.

## బాలికాసంఘము

మాతృభారతికి సర్వదా పోషకస్థానమైనది బాలికాసంఘము. ఈసంఘపు టుద్దేశము లించుమించుగఁ బత్రికోద్దేశములే! కావున మాతృభారతికి బాలికాసంఘము పట్టుఁగొమ్మ. బాలికాసంఘమునకు మాతృభారతి జీవగఱ్ఱ.

బాలికాసంఘ చరిత్ర పాఠశాలతోడనే ప్రారంభమయినను, రెండు మూఁడేండ్లనుండి, యది చాలఁ జుఱుకుగఁ బనిచేయుచున్నది. బాలికాసంఘమునందలి ప్రతిబాలికయు జాతీయోద్దేశములతో నిండి, తనభావిజీవితమునఁ బత్నిగఁగాని, మాతగఁగాని, అన్నివిధములను దేశాభ్యుదయమునకుఁ దోడ్పడవలసిన బాధ్యతలను గుర్తింప హెచ్చరింపఁబడు చుండుటచే, దీని ప్రాశస్త్యమెట్టిదో ప్రజామహాశయు లూహించుకొనఁగలరు. ఇది తఱచుగా సారస్వత సంఘరూపము దాల్చి, చర్చనీయాంశములను వారమున కొకసారి చర్చించుచు, బాలికలకుఁ బ్రధానముగ వక్తృత్వమును, విద్యావ్యాసంగమును గుదుర్చుచున్నది నడుమ నడుమఁ బ్రసిద్ధములగుపండుగలు-గీతాజయంతి దసరా, కర్వే జన్మదినోత్సవము, శ్రీ రామ జయంతి, వంటివి-జరుపుకొనుచుఁ వానిద్వారా బాలికలయం దుత్సాహము బెంపుచేసికొనుచున్నది.

## బాలికల ఉన్నత పాఠశాల

ఇట్టి బాలికాసంఘమునకు నిలువనీడ బాలికల ఉన్నతపాఠశాల. ఇది స్త్రీలకు-వివాహితలు, అవివాహితలని లేక యందఱికినిఁ గుటుంబినులకుఁ గూడ—ఉచితముగ మాతృభాషలో విద్యాబుద్ధులను నేర్పి, వారిని దేశాభ్యుదయమునకుఁ దగిన యాదర్శ గృహిణులనుగ, ఆదర్శమాతలుగఁ దయారుచేయుటకుఁ గాను నెలకొల్పఁబడిన సంస్థ. పాఠశాలా నిర్వాహకవర్గమువా రిట్టియుదారాశయముతో స్వలాభనష్టములను లెక్కింపక స్వార్థత్యాగశీలముతో బయలుదేఱి, యెన్నికష్టములకైన నోర్చి, దానిని సాగించుచున్నది యందఱికినిఁ దెలిసినదే. ప్రభుత్వమువారి సహాయమును బడయుభాగ్య మింకను లభింపకున్నను గేవలమిది ప్రజాప్రముఖుల యౌదార్యముపైననే యాధారపడి, వెనుబాటు లేకుండ నడపఁబడుచున్నది.

ప్రస్తుతము బోధకవర్గమునందు (గౌరవ ఉపాధ్యాయినిమై) ఉచితముగఁ బనిచేయుచున్న శ్రీమతి నడింపల్లి సుందరమ్మగారితోఁ గూడ ౧౩ గురున్నారు. కుట్టుపని, చిత్రికళ, సంగీతమునకుఁ బ్రత్యేకమైన ఏర్పాట్లుగలవు.

పాఠశాలలోఁ జదువు విద్యార్థినుల సంఖ్య క్రమముగా నభివృద్ధినిఁ జెందుచున్నది. నేఁటికి ౨౦౦ కి మించినది. విద్యాలాభమును జెందు విషయమున బాలికలు జాతి, మత, స్థితి, భేదములతోఁ బనిలేక యందఱును, ఆంధ్రి

కర్ణాటక, మహారాష్ట్ర, తమిళ, హరిజన, క్రైస్తవ బాలికలు చేర్చుకొనఁబడి పరస్పర సోదరీప్రేమతోఁ బెరుగుచున్నారు.

బాలికలయు బోధకవర్గమువారియొక్కయు నిరంతర నిర్వ్యాజకృషికి ఫలితముగఁ బ్రవేశపరీక్షలలోఁ బ్రశంసాపాత్రముగ ఉత్తీర్ణలగుచున్నారు. కడచిన సంవత్సరమిట్టి పరిస్థితులయందును **F. Y. A.** తరగతి పెట్టఁబడినది. పరీక్షకువెళ్ళిన నలుగురు బాలికలలో ముగ్గురు ఉత్తీర్ణలగుటయేగాక, యొకబాలిక విశ్వవిద్యాలయమున కంతటికిని రెండవదిగా వచ్చెను. భారతజాతికి భారతీయతను బ్రసాదించు భగవద్గీత గూడ యిచ్చట బోధింపఁబడుచు, బాలికల భావిజీవితములకు ఉత్తేజకముగా నున్నది.

ప్రత్యేకముగా బాంబేడ్రాయింగు పరీక్షకు హాజరైన బాలికలలో 3గ్గురు విజయమందిరి. అంతేగాక వైద్యశాఖాధ్యక్షుని యనుమతిపై నొసఁగఁబడిన డాక్టరుగారివల్ల నీపాఠశాలయందు రోగుల కుపచారము, ప్రథమచికిత్సా పాఠములు బోధింపఁబడుచున్నవి

పాఠశాల కనుబంధముగ నొక గ్రంథాలయమును, ఉచిత పఠనాలయమును నున్నవి. గ్రంథాలయము పేరు సందర్భమున దేశోద్ధారక కా. నాగేశ్వరరావుగారిని, శ్రీనాంపల్లి గారీ శంకరవర్మగారిని కృతజ్ఞతతో స్మరింపకతప్పదు. గ్రంథముల నుచితముగ దానముచేసి పోషించిన రచయితలు, గ్రంథవిక్రేతలును స్మరింపఁదగినవారు, పఠనాలయమునకుఁ బ్రధానపోషకులు శ్రీమతి హెచ్. బి. ఖుర్షీదుగారు. ఇదియు నిప్పుడభివృద్ధి దశయందున్నది. దాదాపు ౧౦ పత్రికలువచ్చుచుండుటచే బాలికలకును, నితరులకును బఠనమునకు వీలగుచున్నది.

దూరప్రదేశములనుండి వచ్చు విద్యార్థినుల సౌకర్యము నిమిత్తమై యొక వసతిగృహము (హాస్టలు) ఏర్పాటు చేయఁబడినది. అందిప్పుడు ౨౦ బాలికలున్నారు.

బాలికల ఉన్నతపాఠశాల, యిట్టి సదుద్దేశముతోడనే ఆచార్య కర్వేగారిచే పునహాలో స్థాపింపఁబడిన భారతమహిళావిశ్వవిద్యాలయమునకుఁ జతపఱుపఁబడియున్నది. కావుననే విశ్వవిద్యాలయమును, దాని పావనాదర్శములును మాపాఠశాలయందుఁ బ్రతిబింబించి, మాతృభారతీరూపమున వెలువడుచున్నవి.

ఈవిధముగ మామాతృభారతి ప్రారంభభింపఁబడి యొకసంవత్సరము మాత్రమేయైనను ఈస్వల్పకాలములో నిదికావింపఁగల్గిన సేవ యమూల్యము. బాలికలలో భారతీయత నెలకొనుటయేగాక, గుణమాత్రస్వీకారబుద్ధి, మాతృభాషాభిరుచి, దానియందుఁ గొంత విజ్ఞానము, కళాభిసంధి యన్నియుఁ జక్కఁగఁ బ్రకాశింపఁగల్గినవి.

## కృతజ్ఞత.

ఇట్టి పత్రికను ముద్రించి ప్రజల కందఁజేయుటకై మమ్ములను బ్రోత్సహించి, ముద్రణమునకుఁ దోవఁదీసిన శ్రీగద్వాలమహారాజ్ఞిగారికిని, ఎన్ని రాజకీయకార్యములలో మునిఁగియున్నను, బాఠశాలానిర్వహణమున నేమాత్రమును బ్రాలుమాలికఁ జూపక తదభివృద్ధికే కృషిసలుపుచు, నీకార్యమునకుఁగూడ దోడ్పడిన శ్రీరాజాబహాదరు వేంకటరామారెడ్డిగారికిని మేమెంతయుఁ గృతజ్ఞులము. ఇట్లే పత్రికాముద్రణమునఁ దగునౌదార్యముచూపనున్న విశ్వదాత దేశోద్ధారకులు మాకుఁ జిరస్మరణీయులు.



# ఈశ్వరస్తవము.

బిదురు వేంకట శేషయ్యగారు బి. ఏ.

౧. సీ. ఎవ్వాని పదసీమ ♦ నెలమిమై భూజముల్, పువ్వు లాకులతోడఁ ♦ బూజ సలుపు
నెవ్వాని కీర్తిని ♦ నెగ్గెత్తి పుల్గులు, నవ్య గీతికల గా♦నంబు సేయు
నెవ్వానిఁ గనఁ గోరి ♦ యిట్టటుఁ దమకాన, జంతుజాలము లెందు ♦ సంచరించు
నెవ్వాని భయమున ♦ నెల్ల భూతంబులు, తమ తమ విధులలోఁ ♦ దగులు సూపు
గీ. నట్టి విశ్వాత్మ, విశ్వజ♦నైక నాథు, వాఙ్మనోఽగోచరానంద ♦ భావు నిన్ను
నిత్యసుఖలబ్ధికయిసద్వి♦నీతి మెఱయఁ, బొల్చుకొనిచిత్తమున ధ్యాన♦ముంబొనర్తు.

౨. సీ. నీరాక విని ధామ ♦ నిధి స్నానమున కయి, కఱకు బంగరు నీరుఁ ♦ గాచి యిచ్చు
నీదు కైసేఁతకై ♦ నీరేజకుల వైరి, జ్యోత్స్నా దుకూలంబు ♦ లొప్పగించు
నీ పూజకొఱకయి ♦ ద్యోపాత్రమునఁ గాలుఁ, డమల తారాప్రసూ♦నములఁ దెచ్చు
నీతుష్టికొఱకయి ♦ నిత్యం బుషఃకన్య, యతిమనోజ్ఞముగ నృ♦త్యంబు సేయు
గీ. నిట్టు లెందెందుఁబోయిన ♦ నెల్లగతులఁ, బ్రకృతి యంతయు నీయంద ♦ భక్తి సేఁత
రెండుకన్నులఁగనితన్మ♦యుండుగాని, వాఁ డెవఁడు గల్గునో యీశ! వసుధయందు?

౩. సీ. ఱాతిలోనున్నఁ బ్రా♦ల్మాలక కప్పకు, జీవనం బొసఁగి పో♦షించు టెట్లొ?
కలికి సీతాకోక ♦ చిలుకకుఁ గోరిన, వెల్లచీరలను నే♦యించు టెట్లొ?
పై పంచమస్థాయిఁ ♦ బాడఁగాఁ బిక కుమా,రులకు లాలించి నే♦ర్పుట యెట్లొ?
కడుఁ జీఁకటిఁ జరించు ♦ మిడుగుఱుం బ్రువులకుఁ, జేతి 'లాంతరు'లందఁ జేయు టెట్లొ?
గీ, విదితహేతువుగాని యీ♦విశ్వమునకుఁ, గర్త పెత్తనపుఁ బ్రభుత్వ♦ కలనగాక
"అన్నియును నాకెగావలె" ♦ నన్నయట్టు, లరసి వేఁగండ్లఁ బ్రోచెద♦వఖిలమీవు.

# భారత మహిళా విశ్వవిద్యాలయము

శ్రీయుత వడ్లకొండ నరసింహారావుగారు

బాలికల పురోభివృద్ధి కేర్పఱుపఁబడిన శ్రీమాతృభారతివంటి పత్రికలో, భారతమహిళామతల్లుల విద్యావ్యాప్తికొఱకు స్థాపింపఁబడిన భారత మహిళా విశ్వవిద్యాలయమును గూర్చి కొంత ముచ్చటించుట యప్రస్తుతము కాదుగదా! ఆంధ్రమహాజనుల కీ విశ్వవిద్యాలయమును గూర్చి తెలిసికొనవలసిన యావశ్యకత, తెలిసికొని యాదరింపవలసిన బాధ్యత,యున్నదిగావున నీ వ్యాసలేఖనము తప్పనిసరి యగుచున్నది. భారతమహిళా విశ్వవిద్యాలయము పదునెనిమిది సంవత్సరములనుండి భారతస్త్రీలలో విజ్ఞానబీజములను వెదఁజల్లుటకై విరివిగాఁ గృషి జేయుచున్నది. ఉన్నతవిద్యను విద్యార్థినుల మాతృభాషద్వారా గరపుట విశ్వవిద్యాలయముయొక్క ముఖ్యలక్షణము. ఉన్నతపాఠశాలలయందును, గళాశాలలలోను ఆంగ్లేయభాష నిర్బంధముగ నేర్పఁబడుటతోఁబాటు స్త్రీలకుఁ బ్రయోజనకరముల విషయములకు బాఠ్యప్రణాళిక యందుఁ జేర్చుట విశ్వవిద్యాలయముయొక్క మఱియొక ప్రత్యేక లక్షణము. ఈ విశ్వవిద్యాలయము పూనాలో "ఆచార్య" కర్వేమహాశయునిచే నెలకొల్పఁబడినది. సక్రమమైనకృషి ఫలితముగా నిప్పుడు విశ్వవిద్యాలయముక్రిందఁ బదునారున్నత పాఠశాలలును, మూఁడు మాధ్యమిక పాఠశాలలును, నాలుగు కళాశాలలును, నొక బోధనాభ్యసన కళాశాలయును నడపఁబడుచున్నవి. పైవానిలో నాల్గింటిని విశ్వవిద్యాలయమువారు తమ స్వంత వ్యయముతో నడపుచున్నారు. తక్కినవానిలోఁ గొన్నింటికి కార్థిక సహాయము చేయుచున్నారు. తక్కినవి విశ్వవిద్యాలయముచే నంగీకృతములు. విశ్వవిద్యాలయమొక శిష్టసభపరిపాలనాధీనమై యున్నది. దీనికి సభ్యులు సక్రమ పద్ధతులపై నెన్నుకొనఁబడుదురు. ఎన్నికల పట్టికలోఁ బోషకులు, పట్టభద్రులు, విదుషీమణులు, సంస్థలు చేరియున్నవి. ప్రాథమికోపాధ్యాయినుల కొఱకు "డిప్లొమా" పరీక్ష; విద్యార్థినులకొఱకుఁ బ్రవేశ పరీక్ష, ప్రథమ-ద్వితీయ సంవత్సర కళాపరీక్షలు. పట్టభద్రురాండ్రపరీక్ష, పి. ఏ.( ఎం. ఎ. పరీక్షతో సమానము) పరీక్ష లేటేట జరుగుచున్నవి. పరీక్షాకేంద్రములు హిందూదేశములోని వివిధ ప్రాంతములందుఁగలవు. ఆంధ్రభాషా కేంద్రములుగ హైద్రాబాదు (దక్కను) విజయనగరము, చేర్పఁబడియున్నవి.

ప్రవేశపరీక్షాపాఠ్యప్రణాళిక:—

[1] నిర్బంధ విషయములు.

౧ దేశభాష (మాతృభాష)

౨ ఆంగ్లము

3 చరిత్ర

౪ గృహనిర్వాహకత్వము - ఆరోగ్యమార్గము

[2] ఐచ్ఛిక విషయములు:—

౧ సంస్కృతము లేక పారశీకభాష

౨ పదార్థవిజ్ఞాన శాస్త్రము లేక రసాయనశాస్త్రము

3 హిందీ (ఇది మాతృభాషకానివారికి

మాత్రమే)

౪ భూగోళశాస్త్రము

౫ చిత్రలేఖనము

౬ సంగీతము (శాస్త్రము—అనుభవము)

౭ కుట్టుపని

౮ బీజ - రేఖాగణితములు

(వీనిలో నేరెంటినైనను దీసికొనవలెను)

[౩] స్పర్టిఫికేటు విషయములు

౧ సంస్కృతము లేక పారశీకము సందుఁ ప్రాథమిక జ్ఞానము

౨ అంకగణితము

౩ చిత్రలేఖనము లేక సంగీతము

౪ కుట్టుపని

౫ గృహనిర్వాహకత్వము (పాకముసహా)

(వీనిలోఁ గృషిచేయఁబడినట్లు పాఠశాలాధికారులు రూఢిపఱుపవలయును)

స్త్రీలకుఁ బ్రత్యేకోపయోగకరమగు విషయములతోఁ గూడుకొనిన విద్యాప్రణాళికతోఁ బనిచేయుచు, ననుదినము ప్రజాదరణమును హెచ్చుగాఁ బడయుచున్న యీవిశ్వవిద్యాలయపు వార్షికవ్యయము డెబ్బదివేలుమాత్రమే. తదంగీకృతములగు పెక్కు పాఠశాలలకు నాయా ప్రాంతములలోని పురపాలక సంఘములు, స్థానిక ప్రభుత్వములు,సంస్థానములు, ద్రవ్యసహాయము నొసర్చుచున్నవి. హైద్రాబాదులోని బాలికల ఉన్నతపాఠశాలగూడ దీనితో జతపఱుపఁబడియున్నది. ౧౯౨౮లో నియ్యది నెలకొల్పఁబడినది. ఈయాఱు సంవత్సరములకాలములో నిది సంపూర్ణమైన ఉన్నతపాఠశాలగాఁ జేయఁబడినది. రెండుసంవత్సరములనుండి ప్రవేశపరీక్షకు విద్యార్థినులు పంపఁబడుచున్నారు, దీనికింకను ప్రభుత్వమువారి సాహాయ్యమునుబడయు భాగ్యమబ్బలేదు. విద్యాశాఖవారి దృష్టినాకర్షింపఁగలిగినది. ప్రస్తుతము విద్యార్థినుల సంఖ్య ౨౬ దీనికి బ్రక్కగనే వసతిగృహ మొక్కటిగలదు. జిల్లాలనుండియు విద్యార్థినులువచ్చి లాభమును బొందుచున్నారు. రూ ౫౦౦౦ వరకు వార్షికవ్యయముగలదు. ఇదియంతయుఁ జందాలవల్లనే కూర్పఁబడుచున్నది. ఆంధ్రదేశమున కంతకు నేకైకసంస్థయగు నీపాఠశాలను బోషించుభారమాంధ్ర సోదర సోదరీమణులపైఁగలదు. పాఠశాలయొక్క ప్రాఁతవిద్యార్థినులుతమతోనేబుట్టి, పెరిగి, వృద్ధిపొందుచున్న యీపాఠశాలను విస్మరింపకుందురుగాక! దీనియభివృద్ధినిగమనించుచుఁ దమకు వీలున్నంతవరకుఁ దోడ్పడుటకుఁ బ్రయత్నించెదరని నమ్ముచున్నాము. ఆర్థికముగనే గాక సేవారూపముగ సాహాయ్యమును జేయవచ్చును. విద్యార్థినులందు లేఖనోత్సాహమును, వ్యాసరచనా ప్రతిభను బెంపొందించు సదుద్దేశముతో నెలకొల్పఁబడిన లిఖితమాసపత్రికయగు "మాతృభారతి" కన్నివైపులనుండి యన్నివిధముల సాహాయ్యము లభించునుగాక!

(మాతృభారతి-సెప్టెంబరు ౧౯౩౪)

# జీవితలక్ష్యము

శ్రీమతి జె. రాధాబాయి (మెట్రికు)

మానవ జీవితముయొక్క ముఖ్యలక్ష్యమేది? దీనిని లోకులు పలువిధములుగాఁ దలఁచుచున్నారు. కాని నిజమైన భావమునిప్పటి కెవరును వెలిఁబుచ్చలేదు. ప్రతిమనుజుఁడును ఫలమును వాంఛించి ధనమునైనను దేనినైనను సంపాదించుకొనఁ బ్రయత్నించుచున్నాఁడు. కాని మనము ముఖ్యముగా మనోవాక్కర్మములచే నీశ్వరుని యనుఁగుబిడ్డలమై యాయనను సంతోషపెట్టఁ బ్రయత్నింపవలెను. ఇవి సాధింపఁగల్గిన మనమానవజన్మము సార్థకమగును. ఈశ్వరుని నిజమైనపుత్రుల మనిపించుకొనుటయే మానవజీవితముయొక్క ముఖ్యలక్షణము. ఈశ్వరుడు మనల నందఱిని సృజించి మన కేమాత్రముకష్టము, బాధ గలుగకుండఁ జూచుచున్నందులకు మన మాయన నెంతో సంతోషపెట్టినను, నింకను నాయన కప్పుబడియేయుందుము. ఎంతటి మహనీయుఁడు! ఆహా! మన భాగ్యము! మనమందఱ మా యీశ్వరుని పుత్రులము! కాని బ్రహ్మానందకరమగు నా "పుత్ర" శబ్దము మనయందు సమన్వయించుటయే మన సర్వప్రయత్నముల పరమావధి.

ఈశ్వరుఁడు పరమప్రేమస్వరూపుఁడు, "హృత్పుండరీక మధ్యస్థం। పరమప్రేమరూపిణం। ధ్యాయే"త్తని యుపనిషద్బోధ. అట్టి యీశ్వరుఁడొకఁడు కలఁడా? లేఁడా?యని సందిగ్ధహృదయులైన నాస్తికులు తటపటాయించెదరు. మన ప్రపంచ వ్యవహారమే యీశ్వర సద్భావమును వేనోళ్లఁజాటుచున్నది. ఎందులకు? మనమనుకొన్న ప్రతివిషయమును జయప్రదముగ జరుగుచున్నదా? "తానొకటి తలచిన దైవమొక[టి] తలచు" నన్నసామెతగూడఁ గలదుగదా! దైవమే, ఈశ్వరుఁడే లేనియెడల దైవము మనకుఁ బ్రతికూలముగాఁ దలఁచుటయేమి? ఇట్లు మన నిత్యానుభవమేకాక వేదములును బరాత్పరుని సద్భావమును ప్రశంసించుచున్నవి.

సర్వేశ్వరుఁడు ప్రపంచమునకు సృష్టికర్తయుఁ బాలకుఁడునుగూడ. ఆయన జగత్తును సదుద్దేశముతో సృజించి, దానినిఁదగినట్లుపయోగించుకొనుమని మనుష్యునికిఁదన యాదేశములను వేదములద్వారా నేర్పినను, నట్లుచేయనియెడల మనుష్యునిలోపమేగాని యీశ్వరుని దగున? ప్రపంచములోఁబాపమున్నది కనుక నీశ్వరుఁడు మంచివాఁడు కాఁడనుటయెట్టి పొరఁబాటు! ఆపదములన్నియు మన తెలివిలేమిచే నైనవిగాని ప్రపంచసిద్ధములుగావు. మనస్వల్పబుద్ధియు మంచెడుగుల నిదమిత్థమని గుర్తింపఁజాలదుగదా! ఇంక మన మీశ్వరుని నిందించిన లాభమేమి? అట్లుచేయుట మనపాపముల నినుమడింపఁజేసికొనుటయేగదా?

ఈశ్వరుఁడు తల్లిదండ్రులకంటె నెక్కుడు మనలను ప్రేమించుచున్నాఁడు. ఆయన ప్రేమసాగరమునుండి మన మొక యణుమాత్రమైన పొందఁగలుగుచున్నాము. ఇట్లాయన బిడ్డలమనుకొని యాయనయాదేశములకనుగుణముగనడచి సదాయాయన పరిచయమునే వాంఛించుచుండుదుమేని తుదకుఁ దదానందమునుబడయుటయే మోక్షము. మోక్షమనగాఁ బూర్ణమగు స్వేచ్ఛానందమే. ఈశ్వరుని బిడ్డలను బిరుదునొంది మనము సదా

సంతోషముతోఁ గాలక్షేపము చేయఁగల్గుటయే మోక్షము. మోక్షము సంపాదించుటయే మానవ జీవితము యొక్క లక్ష్యము. సర్వులును మనసార దీనిని సంపాదింప యత్నింతురు గాక యని యాశించుచు, నిదియే ముఖ్యమగు మన భారతధర్మమని విన్నవించుచున్నాను.

---

# ధ్రువుఁడు

శ్రీమతి. కె. వనజాక్షి [ ప్రి మెట్రికు ]

గీ. "తండ్రితొడమీఁదఁ గూర్చుండఁ ♦ దలఁచుచుండ
నేను దాఁ గన్నవాఁడనుఁ ♦ గాను గనుకఁ
దల్లి కోపంబుతో నన్నుఁ ♦ దరిమి వేసె"
నిట్లు నిజ మాతతోఁ జెప్పి ♦ యేడ్చె ధ్రువుఁడు. ౧

తల్లి చింతించి యిటులనెఁ ♦ దనయుతోడ.
"బాల! నీదు దుఃఖమును నేఁ ♦ బాపఁజాలఁ
బొమ్ము, దేవుని ధ్యానింపఁ ♦ బోయి రమ్ము,
వత్స! నీ కష్టము సతండె ♦ బాప వలయు." ౨

తల్లి చెప్పిన రీతిని ♦ ధ్యాన నియతి
నేగు చుండంగ నారదుఁ ♦ డెదురు వచ్చి,
"ఇట్టిదగు చిన్ని కోర్కెకై ♦ యింత వగవ
వలదు వలదని వారింపఁ ♦ దలఁచె నతని. ౩

అనుటయు, ధ్రువుండు "నారద! ♦ అట్లు వలదు;
ఏను దేవుని ధ్యానింప ♦ నేగు చుంటిఁ
గనుక విడువుమా? దేవుఁడే ♦ కాచు నన్ను
మనసునంగల వగపెల్ల ♦ మాన్పి" యనియె. ౪

---

# సహకారమే జీవామృతము

శ్రీయుత. అ. నారాయణ్ణరావుగారు, ప్రధానోపాధ్యాయులు.

## జీవామృత మెట్టిది ?

సహకారమునే ఆది కవు లమృతమని నుడివిరి.

ఇద్దానిని సాధించుటకై దివ్య తేజస్సుగల అనిమిషు లొకానొకప్పుడు మేరుపర్వతమున మూగి తపస్సునలిపిరి. శ్రీమహావిష్ణువు బ్రహ్మదేవునితో "సాగరమున దొరకఁగలదు. అందుఁ గల్పవృక్షము, కామధేనువు, చింతామణి, సర్వౌషధులునుగూడ లభించు" నని చెప్పెను. ఎట్లని ప్రశ్నింపఁబడి "మథనమున దేవదానవుల సహకారముతో శాంతముతోఁ బూనికతోఁ బట్టుదలతోఁ గార్యానుకూలమగు" ననియుఁ జెప్పెను.

ఆమీఁద

దేవతలు రాక్షసులు మందరగిరిని లేవఁదీసి సముద్రమునందు జగదాధారుఁడును, కూర్మావతారుఁడునగు పురుషోత్తమునిమీఁద నునిచి చిలుక నారంభింప, సముద్రము నురుగులు గట్టెను. కవ్వపుఁద్రాడేదీ? విశాలవిశేషభోగములుగల వాసుకి; మందరగిరి చుట్టునచ్చునట్లు చుట్టి తలపార్శ్వము నసురులును దోఁకవైపు దివిజులును బట్టి చిలికిరి. ఇట్టిమహాకల్లోలములో మందరగిరి పరిభ్రమణమువల్ల జారెను. వాసుకి తీవ్రమైన హాలాహలమును గ్రక్కసాగెను. కాని పూనికతో వారు మథనమును సాగించిరి. శ్రమాయత్తులయిన దేవదానవులమీఁద మధుర వర్షము కురిసెను. ఆవర్షానంతరము పర్వతశిలలపైఁ గమ్మని తావులఁగల పుష్పములు శోభిల్లెను మథనపు వడి హెచ్చించిరి. దానఁ బర్వత వృక్షములు నిప్పంటుకొని మండసాగెను. ఇంద్రుఁడు జ్వాలలను జల్లార్చెను. పగులసాగిన వృక్షములనుండి జిగురు-సువాసనతైలములు-సాగరమునఁబడెను. ఇంకను బూనికతో మథించిరి. కాని యమృతము రాదాయెను. ఆమహాప్రయత్నపరులకు "సోదరభావముతో - నేకాగ్రచిత్త హృదయములతోఁ - గృషిచేయుచు భుజస్కంధములతోఁ దోడ్పడుచుఁ బరిశ్రమించునెడలఁ - గార్యానంతరమున- నమృతసాధనము కాఁగల" దని శ్రీమహావిష్ణువు చెప్పెను. ఇట్లు పూనికతోఁ బాటుపడుచుండుటతోడ వారికి వింతగల్గ నుద్భవించిన వెవ్వి?

చంద్రుఁడు - లక్ష్మీదేవి - ద్రాక్షతీగ - శ్వేతాశ్వము - కౌస్తుభము - ధన్వంతరి (హస్తమం దమృతపాత్రతో)- ఐరావతము (ఇంద్రుఁడు వాహనముగాఁ గైకొన్నది). ఇట్టి సమయమునఁ బొగలుగ్రమ్మి జ్వాలలువ్యాపించి - నానాముఖముల - లోకములను దహించు హాలాహలమును జూచి, యందఱు భయభ్రాంతులై బ్రహ్మాది దేవతలు జగద్గురునగు శంకరమహాదేవుని శరణాగతులై వేడ, నా సాంబశివుఁడు హాలాహలము నంతయు నొక యుండఁజేసి మ్రింగి కంఠముననుంచుకొని గరళకంఠుఁడయ్యెఁగదా! భయరహితులై యసురులా యమృతమును ద్రాగనెంచి కలశమునుగైకొనిరి. మోహినీరూపముతో శ్రీహరి రక్కసులను భ్రమింపఁజేసి దానినిగ్రహిం

చెను. భ్రమ దెలియునంతలోలో నమృతమును దేవతలు ద్రావిరి.

రాహువుమాత్రము త్రాగినను, జక్రహతుండై, శిరస్సువేత్తై మొండెమువేత్తై నిలిచెను. దేవదానవులు పోరిరి; గాని సురలే విజయముం గాంచిరి. అమృతకలశము దేవలోకముం జేరెను; మందరగిరి స్వస్థానమునకుం జేర్పంబడెను.

బిడ్డలారా! సముద్రమథన మనగానేమి?

మనము నివసించు నీప్రపంచమే మహాసముద్రముకాదా? ప్రతిహోరయు ననుదినమును నెలనెలయుం బ్రతిసంవత్సరమును మనకృత్యములే మథనములుగావా? ప్రతివ్యక్తికిని దానుజేయవలసినపనిలేదా? మనకెల్లర కొండొరులసాయమక్కఱలేదా? ప్రజామోదములేని ప్రభువేమి చేయంగలడు? భర్త్రాదరణలేని భార్యయేమి చేయంజాలును? మాతృరక్షణలేని బిడ్డమాటయేమి? వేయేల? ప్రపంచాంగములెవ్వి? వేటకాండు,గొర్రెలమేపరి, కృషీవలుండు,పైరుకోతగాండు, నీటమునింగి గాలించువాండు, విశ్వకర్మ (ఇండ్లు గట్టువాండు,) పనిముట్లు చేయువాండు, యంత్రకారుండు, దర్జీ, వంటవాండు, దాది, ఉపాధ్యాయుండు, యామికుండు, చిత్రకారుండు, శిల్పి, గాయకుడు, కవి — ప్రపంచమును నడపు ఓమానవులారా! బిడ్డలారా! భౌతికలోకమనే మహాసముద్రమున మథనమునుజేయుండు. ఒకటిమాత్రము జ్ఞాపకముంచుకొనుండు. క్రూరబుద్ధిగల్గి జంతుబలి నేయువారే రాక్షసులు—(నోరులేని జంతువులు కూడ మనకుం దోడ్పడవలయును.)

మానవకృషియను నీమథనమునవల్ల నెట్టిరత్నములు, నెట్టిభోగభాగ్యము లుద్భవించునో యోజింపుండు— గృహములు, మేడలు, రాచనగరులు, పల్లెలు, పురములు, దేవాలయములు, తటాకములు, అయోమార్గములు, కాలువలు, రస్తాలు, నావలు, వాయువిమానములు, మోటారులు, నానావిధయంత్రములు, పుస్తకములు, మానవునిచేం జేయంబడువస్తువులసంఖ్యాకములు; శోభాయమానమైనచంద్రబింబము గూడ మానవునిసృష్టియే యనందగును. రజతప్రకాశమునిచ్చు ద్రావకశక్తి (ఎలెక్ట్రిక్) నుండి యుత్పత్తియగు- నంధకారమును బూర్తిగనణంచు - దివ్వెలెవ్వి?

ఇంక నమృతమన నెట్టిది? మేఘావరణమున కన్నం బైకిపోయియుండలేదు. అమృతకలశము చాలదూరముకావు. మానవుని కందంగలదు, ఎట్లు?

స్త్రీపురుషులు—ఆబాలవృద్ధముగ— బీదలును భాగ్యవంతులును, బలవంతులును బలహీనులును, నానాదేశీయులును జాతివారును, బశ్వాద్యన్నగతప్రాణులును దోడ్పడునెడల, నమృతము సిద్ధమగును. మానవుడు మానవునియందు హితభావ మవలంబించి పూజనీయులైన గురువులయందు గుఱియుంచి - మానవకోటియందేగాక పశుకోటియందును - ప్రేమయుంచిన నదియే యమృతము!

సహకారమే యమృతద్రవము! నిత్యకృత్యములయం దన్యోన్య సహకారమే "అమృతము."

# పరిసరముల ప్రభావము

శ్రీమతి డి. కమలావతి [ మెట్రిక్ ]

ప్రపంచమున మానవశరీర వ్యాపారముల ధర్మములఁదెలిసికొనవలెననఁగాఁ బ్రకృతివరణమే ముఖ్యమైనది. అదియే మొదటిసూత్రము. ప్రాణికోటి కంతయు వాని పరిసరముల ననుసరించి భౌతిక—శారీరక—సాంఘిక—నైతికధర్మము లనుకూలముగ నుండును. ప్రాణులకును బరిసరములకును బరస్పరసంబంధముగలదు. అది బాహ్యాంతరములని ద్వివిధము. మొదటిదానిలో శీతోష్ణస్థితులు, ఋతుభేదములు, రెండవదానిలో వంశపారంపర్యముగ వచ్చునవియు, వ్యాపార విద్యాదులును జేరును. ప్రాణి తనజీవయాత్రను నడపుకొనుటకుఁగాను బరిసరములతోఁ బోరాడుచు వానికి సరిపడుచు నిరాకరించుచు జయించును. ఈప్రయత్నములేనియెడలఁ జలనములేని నీరు క్రుళ్లును; దానివలె యత్నములేని జీవము శుష్కించును. కావునఁ బరిసరములకుఁ దగినట్లు ప్రాణిమారును. కొన్నిప్రాణులు తమకు విశేషములయిన ప్రత్యేకపరిసరములలోఁగాక వేఱొకచోట నిల్వఁజాలవు. లేని చో నవి నశించును. కాని కొన్నిసమయములందుఁ జెట్లను జంతువులను బెంచువారు మార్పులుచేసి పెంతురు. వానికవి యలవాటుపడి క్రమక్రమముగా వృద్ధిఁ జెందును. పరిసరములవలన జరుగు సృష్టిస్థితిలయములనెడు ఫలము లనుభవించుటకుఁ బ్రాణి తన మనశ్శరీర నిర్మాణముగూడ సరిపెట్టుకొనుటకుఁ బ్రయత్నించును. దీనివలనఁ బ్రపంచమునఁ బరిసరముల ప్రభావముయొక్క ప్రాధాన్యము దృఢపడుచున్నది. ఎందులకు? ఈవిషయము మన జనిపెంపులో విశదమగును. ఆహారములేనిది శరీరము నిల్వఁజాలదుగదా? క్షుద్బాధ కోర్వలేక శునకమాంసమైనను, జండాలుని గంజియైనను నంగీకరించి ప్రాణములు నిల్పుకొన్నవారిని గూర్చి పూర్వగాథలు చదువుచునేయున్నాము. ఇంకనట్టియాహారముకొఱకుఁ బ్రతిప్రాణియుఁ దన సర్వస్వమును గోల్పోవుట కంగీకరింపకపోదు. మొదట దాని సంపాదనమునకై యనేక ప్రయత్నములను జేయును. అందువలన గుణములు మార్పునకు లోనగును. కేవలమింతటితోఁగాక శీతోష్ణ పరిస్థితులవల్లఁగూడఁ బరిణామమునకు బద్ధుఁడగును.

ఉష్ణమండలమున నుండువారు నలుపుగ నుంటయేగాక, యచ్చటి చెట్లు జంతువులుగూడ వేఱుగా నుండును. సమశీతోష్ణమండలమువారెఱ్ఱగను, సముద్రసమత్వముగలచోట్ల నుండువారు తెలుపుగను, దేశీయ శీతోష్ణస్థితి సమత్వప్రదేశములలోఁ బచ్చగను నుందురు. ధ్రువముల యొద్ద నుండువారు వామనులే! అచ్చటివృక్షములు జంతువులు తుదకు నీటిజంతువులుగూడ విపరీతముగనుండును. ఎట్లనగాఁ జేపలు సహితమున్నిగల్గియుండును. ఇంతయేల?

మన భరతఖండమునందే వివిధప్రదేశములందుండువారిలో నెంతెంతభేదమున్నదో మన కండ్లారఁ జూచుచున్నాము. "ముంజేతికంకణమున కద్దమేల" యన్నట్లే పరిసరప్రభావ వ్యవ

హారమును బరిశీలించుటకు మనము ఖండాంతరములకుఁ బోనక్కఱయేలేదు ! ఈశీతోష్ణపరిస్థితులపై నాగరకతావ్యాప్తి యాధారపడియున్నది. శీతలదేశీయులచెంతకు నాగరకతయే చేరదు; వారును నాగరకజనులతోఁ గలిసియుండ నిష్టపడరు; వృద్ధిఁ గాంచఁజాలరు. సమశీతోష్ణస్థితుల యందు శాస్త్రప్రజ్ఞులును, శృంగారసంపద్ధాములును, బండితులును, కవులును, ధీమంతులును, శూరులు నుద్భవించెదరు. అట్లే యాయాప్రదేశములలోని చెట్లలో, జంతువులలోఁగూడ మార్పులున్నవి. శీతలదేశములలోని చెట్లు పొడవుగఁ బెరుగును. సృష్టియంతయుఁ జాలిపోయినట్లుండును. సమశీతోష్ణ ప్రదేశములలో శృంగారవనములు, ఫలవృక్షవనములు నుండి చూపఱకన్నుల పండువు సేయుచుండును. ఇఁక మనోవృత్తులపైఁ బరిసరప్రభావమును గమనింతము.

ఆత్మసంరక్షణమునకై యొనరించు శరీరవ్యాపారఅనుచరములే సౌఖ్యాసౌఖ్యములు; ఇష్టములు; అనిష్టములే దుఃఖములు; ఇవన్నియు నైహిక జీవితయాత్రలో నొకరితో నొకరుపోరాడుటలో స్వవిజయము కొఱకుపయోగపడి స్థిరపడును. ప్రతిమనుజుఁడును దనధర్మమునకుఁ దానె కారకుఁడైనను, దనప్రయత్నములద్వారా యితరుల కేయాటంకమును గల్పింపక, తగినంత సాహాయ్యము, సానుభూతి మున్నగు మనోవృత్తులను బ్రదర్శించి లబ్ధప్రతిష్ఠుఁడు గావచ్చును. కావుననే శరీరవ్యాపారములకును మనస్సునకును దృఢసంబంధము కలదని తేటపడుచున్నది. శరీరమందు మార్పుకల్గినచో, దానికనుగుణమైన మానసికపు మార్పు తప్పక కలుగును. ఇట్లు మనోవృత్తుల శక్తులు వ్యక్తపడుటకుఁ బరిసరములవసరములు. ప్రతిప్రాణికిని వాసనలనియు సంస్కారములనియుఁ గలవు. కనుక మనుజునకు నైసర్గికమైన స్వతంత్రవ్యక్తిత్వము బయలుపడుటకుఁ బరిసరములు ముఖ్యము. మనోవ్యాపారములపై బాహ్యపరిసరప్రభావము పనిచేయును. దేశీయ శీతోష్ణస్థితినిఁ బట్టి యాదేశపుఁ గవుల యంశములు, భావనావైభవము, కల్పనాశక్తి మున్నగునవి భిన్నములగుచుండును. భారతీయకవులకును, పాశ్చాత్య కవులకును గల వర్ణనా భేదములకుఁ గారణ మిదియే; ఫలవంతమైన దేశములయందుండు వారు సోమరులుగా నుందురు; శీతలదేశీయులన్ననో యట్లుకాఁజాలరు. ఇట్లే భాషలయందుగూడఁ మార్పులు గలుగును. కేవల మైరోపియనులయొద్ద భాష నభ్యసించువారి యుచ్చారణమునకును, మన దేశీయులయొద్ద నాభాషనేయభ్యసించువారి యుచ్చారణమునకును నెంత భేదముగలదు? ఒకయాంగ్లభాషయేగాక, తెనుఁగు, మహారాష్ట్రీయము, తురకము మున్నగు భాషలుగూడనట్లే; అందుచేతఁ బ్రాణి సర్వదా పరిసరముల ననుసరించియే తన జీవితయాత్రను జరుపుకొనును; లేనిచో నది దుర్ఘటమని చెప్పవచ్చును.

# హితోపదేశము

శ్రీమతి. పి. సావిత్రి [మెట్రిక్సు]

ఆంధ్రభారతి మఱల సాక్షాత్కరించినచో నిట్లు చెప్పును:—

“ప్రజలారా! మీరు భారతజాతీయులు గారా? మీరు మీయభిమానము నెక్కడ దాచి పెట్టితిరి? భారతీయులమని మీకే గౌరవములేకున్న నింకేమన వలయు? ఆంగ్ల నాగరకతావ్యామోహ పారావారమునఁ బడి కొట్టుకొని పోవుచున్న మీకు స్వదేశాభిమాన ముండదుగాఁ బోలును! ఆ పూర్వపు నిశ్చలహృదయము ఉండఁగూడదనియా మీయభిప్రాయము! లక్ష్మీదేవివంటి యామె చంచలహృదయమైన మే మెందులకుఁ గాఁగూడ దనియా మీ యభిప్రాయము? అయ్యో! పులినిఁజూచి నక్క వాతఁ బెట్టుకొన్నట్లు వారినిఁ జూచి మీరు నేర్చుకొనుచున్నారా? వారి నాగరకత మన నాగరకత కంటె మంచిదను కొంటిరా! ఆ ప్రక్కపాపటలు, మెడలోని పూసలు టీకాల మచ్చలు కనఁబడు నంతపైకుండు జాకెట్లు, మోకాళ్లపై కెగఁబ్రాకు గౌనులు మంచివను కొంటిరా!

వారి దేశమాత గౌరవము వారెట్లు నిల్పుకొను చున్నారో కాసంత గమనించితిరా మీరు! మీ దేశముయొక్క - మీ మతముయొక్క- స్థితి యెట్లున్నది, యేమగుచున్నది; మీరు చూడఁదలఁపరా? పూర్వపు నా స్థితికి నిప్పటి నాస్థితికి నెంత వ్యత్యాసమున్నదో గమనింపుఁడు. చేయి బ్రద్దలగునట్లు బల్లలుఁగుద్ది మన దేశమునుగూర్చి మంచిస్థితికిఁ దేవలయునని యూరక యుపన్యాసములిచ్చుచుఁ జవర కాంగ్లేయులనే యన్నివిధములఁ ననుసరించు చున్నారే! వారి నాగరకతయన్న నా కేవగింపేమియులేదు గాని, యందుచే మనది పాడుచేసికొను చున్నారుగదా! పొరుగింటి భోజనము దక్కిన దని మన యింటిలోని ప్రొయ్యినిఁ ద్రవ్వివైచుకుందుమా!

కొందఱు మీకుమాతృభాష యిష్టమా, ఇంగ్లీషుభాష యిష్టమా యనియడిగినచో, నిద్ర నుండిలేచియు నింగ్లీషేనని చెప్ప వెనుదీయరు- దేశమిట్టి స్థితికి వచ్చినను మీ రూరక ముక్కుమూసికొని కూర్చుండుట తగదు. మీరు మఱల నాంధ్రశ్రీ లెప్పుడయి నా కంటి కింపుగూర్తురో గదా! మీ తల్లినగు నేను గన్నీళ్లుగార్చుచుండ మీ రింతమంది పుత్ర పుత్రిక లుండియు నొక్కరైనను నిర్మలమైన హృదయముతోఁ గన్నీరు తుడిచి యోదార్చుటకు వచ్చుటలేదే! అయ్యో! ఇంతలో నంత కఠినహృదయురాం డ్రయినారా? ఆంధ్రదేశస్థితి జ్ఞాపకమువచ్చిన గుండెఁ బద్దలగు నట్టి విషయముకాదా? అట్టిచో మీ కొక్క కన్నీటిచుక్కయైన రాకున్న దెందులకో? మీకు మీతల్లి సాక్షాత్కరించి కన్నీటితోఁ జెప్పు నీమాటలకు మీ హృదయములు గరఁగుట లేదా?

ఆహా! పుత్రికలారా! ఇప్పటికైనను మేల్కొని మీ దేశము నుద్ధరింపుఁడు. మీకుఁగల మంచి గుణములను లోకమునకుఁ దెలియపఱుప వలెనన్న నిదియే మంచి సమయము. మీ

యాంధ్ర భారతికి సంతోషము గూర్పుఁడు! మీ రీయుద్యమమున జయమొందుదురుగాక! మీరం దఱు నక్కచెల్లెండ్రవలె, నన్నదమ్ములవలెఁ గలిసి మెలసి యుందురుగాక! నే నిచ్చిన యాశీర్వాదమును వృథా పోనియ్యకుఁడు. "జననీ జన్మభూమిశ్చ, స్వర్గాదపిగరీయసీ" యను విషయమును విస్మరింపకుఁడు! మీ పూర్వాచారములు త్రోసి రాజనక యవలంబించి కృతకృత్యులుగండు !! మీరు మీ నాగరకతను ప్రపంచమునకు వెల్లడి చేయుఁడు!!!

---

# ఆ శీ ర్వా ద ము

శ్రీయుత. బిదురు వేంకట శేషయ్యగారు, బి. ఏ.

శా. "మా పిల్లల్ కవయిత్రు లౌట కడు సంమాన్యంబు; ఏ పుట్టలో
నే పాము న్నదొ? ఏరి కే మెఱుఁగ! పోనిమ్మంచు నాచేయు య
త్నోపాయంబులు సిద్ధినిం బొరసి, మీ రుద్యద్యశో వల్లికం
బ్రాపై వర్ధిలుఁడమ్మ! భారతి కృపా వ్యాపార మేపారఁగన్.

# అహింస

శ్రీమతి. జె. రాధాబాయి [ పెటిసిక ]

ఐశ్వర్యణమశాశ్వతము మానవ దేహములు క్షణభంగురములు. మన యీజీవితము బుద్బుదప్రాయము. మానవుఁడిట్టి నశ్వరమగు ప్రపంచమునఁ గామక్రోధాదులకుఁగట్టివై యాత్మకుదైవత్వము గలదనునది మఱచి, ఫుట్టుచును గిట్టుచును సమస్తసుఖదుఃఖముల ననుభవించుచు, నీ జననమరణకాలచక్రము బారినుండి తప్పించుకొని పరమశాంతినిఁబడయఁజాలకున్నాఁడు. ఈ ప్రపంచబంధ మీశ్వరుని కారుణ్యాతిశయముననే నివర్తింపవలయు ననియు,నీశ్వరకారుణ్యము సత్యదయాది వ్రతనిష్ఠల విషయముననే ప్రవర్తిల్లుననియు, వేదములుద్ఘోషించు చున్నవి. ప్రపంచము భగవత్కుటుంబము. దీనిలోని ప్రతిజీవికినిఁబరమాత్ముఁడె తల్లియుఁ, దండ్రియుఁ గూడ నగును. కావున వానిబిడ్డలను దయతోఁ జూచుటయు, సత్యపథమున నడచుటకంటె వేఱు మార్గము వానికరుణకుఁ బాత్రులగుటకుఁ గన్పడదు. వేయేల! సత్యదయాదుల సారమగు నహింసయే పైనఁజెప్పఁబడిన పరమశాంతిప్రాప్తికిఁ జక్కని రాజపథమని చెప్పవచ్చును. కాని ప్రస్తుత ప్రపంచము సత్యాహింసావ్రతపరతంత్రుఁడగు మహాత్ముని యుగములోఁ గూడ నంతగా నహింసను బాటించుచున్నటులఁ దోఁపదు. దినదినమును హింసకు ముఖ్యకారణములగు విలాసప్రయత్నములు మనలోఁ హెచ్చుపెరుగుచున్నవి. కొందఱు జీవరక్షణపరులుగలరుగాని, జీవులను బాధింపక వానిని సంరక్షించుట కేవలము జీవకారుణ్యమగును; కాని యహింస గాదు. అహింస నాలుగు భాగములుగా నొప్పారుచున్నట్లు చాలమంది పెద్దలిదివఱకే నడిపియున్నారు. ఆత్మహింసాదమనమని, సూక్ష్మహింసానివారణమని, జీవహింసోత్పాటనమని, యనివార్యమగు హింస హింసగాదని యాభేదచతుష్టయము చెప్పఁబడినది. వీనినిఁగూర్చి ప్రత్యేకముగఁ దెలిసికొనినఁగాని యహింసాతత్వమంతయుఁ 'దెలిసినట్లుకాదుగదా! కాన నందులకై ప్రయత్నింతము.

ఆత్మహింసా దమనము:—

అంతరాత్మ యీశ్వరేచ్ఛకు భిన్నముగాదు. దానిని దుర్వినియోగపఱపక యాత్మశక్తిని నశింపఁజేయకుండుటయే యాత్మహింసాదమనము. భగవదుద్దేశమునకు విరుద్ధముగా నంతరాత్మను దుర్విషయములలో నష్టపఱచు వ్యక్తియే యాత్మహింసాపరాయణుఁడు. ఆత్మ కేవలముపరమాత్మప్రసాదము, దేవత్వముగలది. వివేకానందస్వామియు, Each soul is potentially divine ' అని నుడివిరి. ప్రాపంచిక వస్తువులనే దుర్వినియోగపఱచినవ్యక్తి రాజదండనమునకును లోకధిక్కారమునకును గుఱియగుచుండ, నీశ్వరేచ్ఛకు విరుద్ధముగా నాత్మహింసకుఁ గడఁగువాఁడెట్టి యధోగతికిఁ బాల్పడవలసి వచ్చునో!

సూక్ష్మహింసానివారణము:—

కేవలము దేహమును హింసించుటకంటె మృదులమగు నవనీత సమమగు మనస్సునుబాధి

చుటయే యత్యంతఘోరమగు పాపము. శీతో ష్ణాదులవల్ల శరీరమునకుఁ గల్గుబాధ క్షణికము; కాని పురుషవాక్య ప్రయోగము వల్లను, గృతఘ్నత మున్నగు వానివల్లను గల్గు మనోబాధ యపరిమితము. ఈ రెండిఁటికిని హస్తిమశకాంతరముగలదు. సాధారణ్ణముగఁ దీవ్రభాషాఫలమే సూక్ష్మహింస; కావుననే వాగింద్రియమును స్వాధీనపఱచుకొనుఁడని సద్గ్రంథములిట్లు చెప్పుచున్నవి.

"యస్యవాణ్యాస్తి మధురా
తస్యైవ సఫలం తపః।
ప్రియవాక్య ప్రదానేన
సర్వేతుష్యంతి జంతవః.
"వచనే కా దరిద్రతా.
"సత్యం బ్రూయాత్ ప్రియంబ్రూయాత్
నబ్రూయాత్ సత్యమప్రియం."

ఇట్లు ప్రమాణములు కోట్లకొలఁదిగఁ గలవు. కావున రెండవ మెట్టగు సూక్ష్మహింసా దమనము గల్గుట మూఁడవదానికిఁ ద్రోవఁ జూపును.

జీవహింసోత్పాటనము:—

జీవహింస సాధారణముగ స్వార్థపరులు పొట్టపోసికొనుటకై చేయుచున్నా రనునది సర్వవిదితము. తమకొఱకయి యెన్ని నోరులేని సాధుజంతువులు తెగటార్పఁబడుచున్నవో వారేమి యెఱుఁగుదురు? "ఆత్మవత్సర్వభూతాని", "అహింసా పరమోధర్మః" అను సూత్రములను మఱచి, "మాంసం మాంసేన వర్ధతే" యని యేదో మనస్సు గుదుర్చుకొని తమ ప్రవృత్తిని విడువకున్నారు. మనుష్యుఁడు ప్రకృతి ననుసరించి మాంసాహారుఁడు కాఁడని తోఁచుచున్నది. జంతుశాస్త్రజ్ఞులు, మనుష్యుని దంతనిర్మాణమును, జీర్ణకోశనిర్మాణమును బరిశీలించి యతనిని శాకాహారజంతువులలోఁ జేర్చినారు. శాకాదుల కుపయుక్తముల గువృక్షములకు మాత్రము హింస కాదా యది? యని యందురు కాఁబోలు! ఇదుగో సమాధానము. వృక్షముల కన్నమయప్రాణమయశక్తులు మాత్రమే యుండి మనోమయాది శక్తులు లేవు. మనోమయశక్తియే సుఖదుఃఖాది పరిజ్ఞానమునకు హేతువు. మనుష్యునికున్న జ్ఞాన మయశక్తి వీని కసలేలేదు. కావునమనోమయశక్తి లేని వృక్షాదులకు సుఖదుఃఖాదిజ్ఞానముండదు. ఆ జ్ఞానములేనివారికి హింస గల్గదుగదా! మఱియు వృక్షాదులుస్థావరములు. వానియందు సంచరించు శక్తిలేదు. దోమవంటి సూక్ష్మజీవియు దుఃఖమేర్పడిన స్థలమునువీడి సౌఖ్యమయ స్థలమునకుఁ బోవుట సామాన్యము. కావున నిట్లు సుఖదుఃఖ విషయ వ్యాపార నిదర్శనములేని వృక్షములకు మనశ్శక్తి యెట్లుండునని నమ్మఁగలము? ఇట్టి జ్ఞానముగలిగిన జంతువులను జంపుదానికన్న శాకాహారమే మేలుగదా!

అనివార్యహింస హింసకాదు:—

"సలిలము లుర్వి యాకసము సర్వము జంతుమయంబు." ఇట్టిస్థితిలో నహింసాధర్మము ను సమగ్రముగఁ బాలించుట కేవల మసంభవము. "జీవో జీవస్య జీవన"మ్మని గ్రంథములే చాటుచున్నవి. ఇట్టి శరీరపోషణార్థమై "శరీర

మాద్యం ఖలుధర్మ సాధనం" గాదా! అనివార్యహింస యవసరమగుచున్నది. అది లేకున్నచో మనుష్యుఁడే జీవింపలేఁడుగదా! కావున "..... తమతమ యోపిన యంతవఱకు, హింస తెరువున కెడగల్గి యేగవలయు, నదియె చూవె యహింసనా నతిశయిల్లు" నని భారత ముద్ఘోషించుచున్నది. అంతేగాక యే హింసవలన నుత్కృష్టమగు దానికి వృద్ధియు నికృష్టమగు దానికి క్షయమును గలుగునో, అట్టిది యహింసగనే పరిగణింపఁబడుచున్నది గూడను. ఇట్లు హింసాస్వరూపమును దెలిసికొంటిమి. ఇంకఁ దత్సాధనము నొకింతము.

దయాశూన్య మగు కఠినహృదయమును మృదులమగు నహింస యనలే స్పృశింపదుగదా! కావున నహింసాభ్యాసి ముందుగ దయార్ద్రహృదయుఁడగుటకుఁ బ్రారంభింపవలయును. తరువాత మధురభాషణుఁడు గావలయును. ఎందులకో పయినఁ జెప్పియుంటినిగదా! పిదప మాంసప్రియత్వమునుగూడఁ బూర్తిగవిసర్జింపవలయును. మానవునిజీవిత మశాశ్వతమని యనుభవసిద్ధము. "శ్లోకార్థేనప్రవక్ష్యామి, యదుక్తం గ్రంథకోటిభిః, పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనం." అనుటచేత నహింసాధర్మమునందే సమస్తధర్మము లిమిడియున్నవి. ఈ క్రింది భారతపద్యము నవలోకింపుఁడు—

"ఆ. దంతి యడుగులోనఁ దక్కిన జంతుచ
యంబు నడుగులెల్ల నడఁగియుండు
నట్లు ధర్మకోటు లన్నియు లోనగు
నిద్ధగుణ, యహింస కింతనిజము."

పాఠకమహాశయులారా! అహింసవల్ల గలుగు పరమశాంతినిఁ బరమార్థమును గ్రహించి హింస చేయువానికే హింస గలుగునను నీతి నీ క్రింద నియ్యఁబడిన పాదద్వయపద్యమువలనఁ రూఢి జేసికొని యహింసావ్రతబద్ధకంకణులరై భారతదేశమాతృకీర్తినిఁ బూర్వమువలెఁ బ్రజ్వరిల్లజేయుదురుగాక యని విశ్వసించుచున్నాను.

"హింసచేసినవాఁడె హింస తానొందు
కంసునకేహింస గలిగిన కరణి".

---

# కర్మ

శ్రీమతి. డి. కమలావతి (మెట్రిక్)

బ్రిటిషు సామ్రాజ్యమునకు మకుటప్రాయము మన హిందూదేశము. ఇందుఁ దక్కినవారికన్న హిందువు లెక్కుడుగ నున్నారు; కాఁబట్టియే యీ పేరువచ్చినది. హిందువులు తక్కినవారినుండి తమ మతపరిస్థితులనుబట్టియే ముఖ్యముగ భేదపడుచున్నారు. ఆ హిందూ మత రహస్యము రెండక్షరములపైఁ జాల వఱ కాధారపడి యున్నది. అదియే కర్మ. అట్టికర్మసిద్ధాంతమే హిందూపద్ధతికిఁ బ్రాణభూతము. కర్మయనఁ జేయుట, కేవల మది చేతితోఁ జేయుటయే ! కాదు. మనోవాక్కాయములచేఁ జేయున దంతయు కర్మయే. ఈ కర్మ మన మనస్సున శాశ్వతమైన సంస్కారముగల్పించును. ఈ కర్మసముదాయమే ప్రపంచమగుచున్నది. ప్రతివాని కర్మయును బ్రపంచముపైఁ బ్రతిబింబించుచున్నది. ఈవిషయము నిప్పటి "సైన్సు"గూడ బలపఱచు చున్నది. అత్యంతసూక్ష్మకర్మ రూపమైన మనశ్శక్తి తరంగములు సర్వదా ప్రవహించుచుఁ బ్రపంచ శక్తిపైఁ బడుచున్నది. అ దుచేఁ గలుగు చలనములు, మార్పులే ప్రపంచపరిణామమునకు నాధారమగుచున్నది. మన యిప్పటి "వైర్లెస్ టెలిగ్రాఫ్, రేడియో" మున్నగునవి యీ విషయమునే వేనోళ్లఁ జాటుచున్నవి. కర్మ ప్రపంచముపైననేగాక కర్తపైనఁగూడఁ బ్రసరించి, దాని వానిచే ననుభవింపఁ జేయుచున్నది. అందుచేఁ గర్మానుభవమునకు జన్మవచ్చును. అది భూతవర్తమాన భవిష్యజ్జన్మలలో ననుభవింపఁబడఁదగినదై, సంచిత-ప్రారబ్ధ- ఆగామిరూపములను దాల్చును. కర్మ పుణ్యమైనను పాపమైనను మనుష్యుఁ డనుభవింపకతీరదు. కాని కొందఱే కర్మ సిద్ధాంతము నొప్పుకొనరు. వారందఱికిని భారతారణ్యపర్వమునఁ గౌశికునిద్వారా ధర్మవ్యాధుఁడిట్లు సమాధానమిచ్చియున్నాఁడు."కొందఱు కోరకయే ధనము పొందెదరు;కొందఱెంత ప్రయత్నించియు నన్నను పొందలేరు. కొందఱికి సంతానమెక్కువ; కొందఱు దానికొఱకెంత పరితపించినను గలుగదు. కావునఁ బ్రపంచపరిస్థితులన్నియు మనకోరికలపై నాధారపడియున్నవా? అట్లయినచో జరామరణములు, ఆధివ్యాధులు, సుఖదుఃఖములు,నివన్నియు మనచేత నున్నవా? లేవుగదా! కావునఁ బ్రపంచము కర్మసూత్రబద్ధమని తెలియుచున్నది. ఈకర్మ చక్రమనుటయుఁ గలదు. కావునఁ గర్మలను జేసి కర్మబంధములఁ జిక్కుకొనుటకుఁ గలకారణములెవ్వియో తెలిసికొని, వానినుండివిముక్తుఁడగుటకుఁ బ్రయత్నించుట ప్రతిమానవుని కర్తవ్యము. కర్మాచరణముచేయుటకు మన మధికారులము గాని, దాని ఫలితమున కధికారులము గాము. ఫలముపై నాధారపడక నిష్కామకర్మచేయుట యుత్తమపద్ధతి; దానినే కర్మయోగ మందురు. పై కర్మసిద్ధాంతము వలనఁ దెలియవచ్చిన కర్మబంధములను గోయుట కీకర్మయోగమే ఖడ్గము వంటిది. మనగాంధిగారు చేయు పద్ధతి నిఁ

జూడుఁడు. కర్మఫలితముగోరక ? దాని మంచితనమునుబట్టియే చేయును. అట్టిమహాత్ము ల జీవితముల నాదర్శముగాఁగైకొని, సోదరీమణు లారా! కర్మయోగముచేతఁ గర్మాచరణమును స్వానుభవమునకుఁ దెచ్చుకొని సర్వదా మేలొం దెదముగాక యని తలఁచుచున్నాను.

---

# హైందవ చిత్రకళ

మ. దమయంతి (శ్రీ. మె. ట్రిక్)

భారతదేశము హిందూరాజుల పాలనము క్రింద నున్నంతకాలము హైందవచిత్రకళ చాల నున్నత దశయందుండెను. మన దేశము విదే శీయుల హస్తగతమైన తర్వాత, హిందూసంప్ర దాయము రాజసభలయందు మన్ననలఁ బొం దుట తక్కువయ్యెను. పాలకుల కంటికి మన నాగరకత మోటుగాఁ దోఁచెను. భారతదేశ మన్ని శాస్త్రములయందును ప్రపంచమునకు మార్గదర్శకమైతననాగరకతను సర్వత్ర వ్యాపిం పఁజేసెను. పాశ్చాత్యులకు మన దేశపు నాగ రకతా వైభవము దెలియకయో, లేక హిందూ సంప్రదాయము లనిన నసూయగల్గియో, యది సమంజసముగ లేదని నిరసించుచున్నారు.

ప్రకృతి భగవద్రూపకమనియు, నందుఁ బ్రపంచశక్తులు నిబిడీకృతమై యున్నవనియుఁ, దత్కారణమున నది పూజార్హమనియు, భార తీయులు తలంతురు. మన దేవాలయ శిల్ప నైపుణ్యము చాలమట్టుకు మతసంబంధముగల్గి యున్నది మనచిత్తరువులలో శ్రీరామునిశీలము, కృష్ణలీలలు, బుద్ధుని జీవితము చూచుచుందుము. అజంతాదిచిత్రముల నప్పటి వాఙ్మయమును బట్టి పరిశీలించిన, మన దేశమునఁ బూర్వము శిల్పకళ - చిత్రకళ — చాలనున్నతస్థితియం దున్నవనవచ్చును. భాగవతములోని చిత్రలేఖ చిత్రలేఖన మామె యా కళయందెంత ప్రవీణు రాలో తెలుపుచున్నది. దీనినిఁబట్టి స్త్రీలు - భారతస్త్రీలు - చిత్రవిద్యలలోఁ బ్రవేశము గల వారుగఁ గన్పట్టుచున్నారు.

ఈ దృష్టితోఁ జూచిన, మనకునుఁ బాశ్చ త్యులకును హస్తిమశకాంతరము గలదు. వారి యందు భగవద్భక్తి మిక్కిలి స్వల్పము. ధనార్జ నము, వ్యక్తిసౌఖ్యము, సంఘాభివృద్ధి వారికి ముఖ్య నియమములు. ఇట్టి వీరిచేతఁబడిన తరు వాత దేశమున మన శిల్పవ్యాప్తి కళారూప ముగ వెనుకడుగుఁ బట్టినది.

---

# కడుపుఁదీపు

శ్రీయుత. బిసురు వేంకట శేషయ్యగారు

చ. అడవియొక కొండలోయ—హరి ♦ తామలబాలతృణాంకురప్రభా
స్పదమయి చెంతఁ గట్లొఱసి ♦ పాఱెడి మేల్సెలయేటి గాలి స
మ్మదమొసఁ గూర్ప, భాస్కరుఁడు ♦ మందకరుండు, త్రియామవృద్ధుఁడై
చదల నటింపఁ, బక్షిరవ ♦ సంతతి దంతురమౌచుఁ బర్వఁగన్.

గీ. బ్రదుకుఁదెరువున కందొక్క ♦ పడుచువాఁడు
కట్టెలం గొట్టుచుండె, సు♦గ్గాత్రమైన
స్వేదకణములు జాల్వాఱఁ ♦ జెమ్మగిల్లి
మొఱకు పరశుధ్వనులు మాఱు ♦ మ్రోయ దెసల.

ఉ. ఆతనిభార్య—నవ్యనళి♦నాయతలోచన, సాధుభావ సం
పూతదరస్మితానన, ప్ర♦ముగ్ధవచోరుచిరానులాప, మో
ర్తాతటి గల్లు గల్లు మని ♦ హస్తయుగోజ్జ్వల కంకణధ్వనుల్
ప్రోతముగాఁగ లేఁజిగురు ♦ పుల్లల నేరుచునుండెఁ జేరువన్,

గీ. నాల్గు బారల దూరానఁ♦గల్గు దీర్ఘ
శీతలచ్ఛాయమగు నొక్క ♦ చెట్టు క్రిందఁ
జింపిగుడ్డల కూరుపు ♦ సెజ్జ నున్న
పూఁప బిడ్డను వేఁ గండ్లఁ ♦ బ్రోచు కొనుచు.

గీ. పయికిఁ బ్రక్కకుఁ జూచుచుఁ ♦ బక్షిరావ
ములకుఁ గవ్వించు చున్నట్లు ♦ బోసి నవ్వు
లొలయఁగాఁ గేకిసల్ గొట్టు ♦ చున్న పాపఁ
దలఁచుకొని పొంగి పోవుఁ జూ♦తలిరుఁబోఁడి.

ఉ. "ఎవ్వరికేని నైహిక సు♦ఖేచ్ఛలు నిత్యముగావు చూచితే!
యవ్వ!" యటంచుఁ జెప్పినటు ♦ లప్పుడు గ్రద్దయొకండు క్రొవ్వుచే

జివ్వున వచ్చి వ్రాలి యద ♦ లింపులఁ బోవక గోళ్ల గ్రుచ్చి యా
మవ్వపు బిడ్డఁ దన్నుకొని ♦ మార్గమునట్టె, యథేచ్ఛ మింటికిన్.

గీ. "అమ్మో! నాబిడ్డ!" యంచు బిట్టార్చి యామె
గుప్పునం గూలఁబడెఁ; జేతి ♦ గొడ్డలియును
జాఱఁగా మ్రానుపడి నిలిచె ♦ ధీరుఁడయ్యు
యువకుఁడా పక్షి దెసఁ గన్ను ♦ లొప్పగించి.

చ. అదియునుఁ బోయి పోయి తుద ♦ కగ్గలమౌ శ్రమఁజెంది, యింకఁబో
వఁ దివురలేక, నెమ్మదిగఁ ♦ బర్వతసానువుమీఁది మత్తష
ట్పద మధురస్వనప్రసవ ♦ భాసురభూజముఁ జేరి యందు స్వా
స్పదమగు గూటఁబెట్టె పసి ♦ పాపను—దానినిఁ జూచి తల్లియున్.

గీ. "అదిగో! అమ్మాయిఁ దెత్తురా! ♦ యరిగి?" యనుచు
మగని బ్రతిమాలెనా? లేదు! ♦ మాటవరుస
"కే నయినఁ బోయివత్తునా! యేమి?" యనుచుఁ
దెల్పెనా? లేదు—కనుమూసి ♦ తెఱచులోన.

క. అట్టె చివాలున లేచియు, నెట్టనఁ గార్ముక విముక్త ♦ నిశితాశుగము
ల్లట్టిట్టు వోని చూపులఁ, జెట్టుపయిన్నిల్పి యపర ♦ చింతన్ బఱచెన్.

ఉ. ఏ మొనరించు చుండినది ♦ యింత యెఱుంగక, చీర కుచ్చెళుల్
వేమఱుఁ గాళ్ల కడ్డమయి ♦ వేదుఱు గొల్పుటయేని దలంప, కు
ద్దామవిహార ధీరయయి ♦ తద్గిరిసానువుఁ జేరఁ బ్రాకి యా
భామిని వృక్షమెక్కి తన ♦ బాలికఁ గైకొనఁ గల్గె నొక్కటన్.

గీ. కరములం బిడ్డఁ గన్గొని ♦ కలికి యపుడు
చెట్టునుం జట్టునుం దిగు ♦ టెట్టులో యని
కలఁత వడఁ జొచ్చె; నయ్యది ♦ కలదె మొదలఁ?
"గడుపుఁ దీ"పెంతకును జాలుఁ ♦ గాదె యిట్లు!

---

# నాట్యకళ

శ్రీమతి. డి. కమలావతి [మెట్రిక్]

మహా కవుల మనస్సాహ్లాదకరముగ నుండుటకయి, యా దయామయుఁడగు నీశ్వరుఁడు సృష్టి నెంత చిత్రముగ సృజించెను! ఈ సృష్టివైచిత్ర్యము ప్రతిమానవుఁడు త్వరగఁ గనఁజాలఁడావె! తెలిసికొను భాగ్యము కవులకే గదా కలిగెను! స్వర్గమర్త్య పాతాళములున్నను, గవి తన నూతనప్రపంచమం దెట్లు మనల నిమగ్నులఁ జేయునో మనయందఱి యనుభవములో నున్నది. కవిబ్రహ్మ సృజించినది కావ్యప్రపంచము. ఈ కావ్య ప్రపంచమందున్నప్పుడు మనుజుఁడు తన్నుఁ దాను మఱచును. ఆ కవితప్పులను సహితమెఱుఁగఁడు. కవిగ్రంథమును జదువునప్పుడు కథలోని వారందఱును మనకుఁ బరిచితులగుదురు. వారితో మాట్లాడి నట్లుండును. ఇఁకఁ గండ్లారఁ జూచిన నెంత యాహ్లాదకరముగ నుండునో యూహింపుఁడు. నీతిదాయకములగు కావ్యములే చదువఁదగినవి. వానినిఁ జదివినను నెన్నియో దినములు పట్టునుగదా! కాని యవియే రెండు మూఁడు గంటలలోఁ బ్రదర్శింపఁబడిన యెడల నీతిగ్రహణ మెంత సులభము? చదివిన దానికంటెఁ గనులారఁ జూచినది మనఃఫలకమందుఁ జిత్రించినట్లుండును. అట్లు చూచినదియె

**నాటకము—దృశ్యకావ్యము.**

సంసారసాగరమందు నిమగ్నులయిన వారికి సమయమెంత చిక్కును? వారికెప్పుడేదో పనులుండును. దొరికినకొంతసమయములోను గ్రంథములను జదువవలెను: గావున నాటకములవలన వారు నీతిని గ్రహించుట కాక, యానందపవిత్రచిత్తులగుదురు.

"సంసారవిషవృక్షస్య । ద్వే ఫలేహ్యమృతోపమే।
కావ్యామృతరసాస్వాదః।సల్లాపస్సజ్జనైస్సహ".

సంసారమనెడి విషవృక్షమున కమృతముతో సమానములైన రెండు ఫలములు గలవు. ఒకటి కావ్యము; రెండవది సజ్జనులతోడి సల్లాపము. శ్రవ్యకావ్యములకంటె దృశ్యములె యాహ్లాదకరములు గావున " కావ్యేషు నాటకం రమ్య"మ్మని పెద్దలన్నారు.

నాటకము రచించు కవి సమర్థుఁడై యుండవలెను. నీతిని సులభముగా గ్రహింపఁజేయునట్లుండవలయును. కొండను ద్రవ్వి యెలుకను బట్టునట్లుండరాదు. నాటకమునం దౌచిత్యము దెస జాగరూకుఁడై యుండవలెను. స్వగతములుండరాదని కొందఱాక్షేపించుచున్నారు. అవి లేకుండ వ్రాయుట ప్రతిభకల కవికిఁ దగినదేగాని తక్కిన వారివి పాటింపక కావ్యమును జెడఁగొట్టుటకంటె, నదియున్నను నంత ప్రత్యవాయ ముండదు.

నాటకమందితివృత్తమెంతయు నాకర్షణీయముగ నుండవలయును. పాత్రపోషణము కవికిఁ జాలముఖ్యము. పాత్రోచితభాష రసవంతము.

నాటకమునఁ గవికి నటకునకుఁ బ్రధాన స్థానముగలదు. నటుఁడు శృంగార రసమును బ్రద

ర్శించుటలోఁ జాల నేర్పు, జాగరూకత గల్గియుండవలెను. ఒక్క శృంగారరస మనియేకాదు గాని తాను స్వీకరించిన పాత్ర కేరసము ముఖ్యమో యా రసమును జక్కఁగఁ బ్రదర్శింపవలెను. అట్లు కానిచో నాటకమునందుఁ గళయుండదు. కళయే రసనిష్పత్తికి సాధనభూతమగుచున్నది. ప్రతిమానవుని మనస్సునను వాసనారూపమగు స్థాయి నిల్చియుండును. భావసన్నివేశమువలన స్థాయి కానందము గూర్చుటయే రసనిష్పత్తి. అనుభవమునకు వచ్చి యాస్వాదింపఁబడు యానందమునకే రసమని పేరు. అది కావ్యోపనిబద్ధమై హృద్యమగుచున్నది. నటుఁడు, సామాజికుఁడు, అనుకార్యుఁడు వీరికిని రసనిష్పత్తికిని సంబంధము గలదు. నటుఁడు సమర్థుఁడు కానిచో నాటకము చెడినట్లే. ప్రధానపాత్రధారి సర్వసద్గుణములకు నాటపట్టయినవాఁడుగా నుండవలయును. నటుఁడు కవినిర్మితపాత్రలకు జీవము పోయవలయును. కవిరాజుల తర్వాత నటరాజులదేకదా రాజ్యము – ప్రజాహృదయ రాజ్యము! కవిపాత్రలకు వన్నె దెచ్చువాఁడు నటుఁడు - కవిప్రతిభను సంపూర్ణముగ గ్రహింపఁగలవాఁడు నటుఁడు- సామాజికుల హృదయముల నపహరించువాఁడు నటుఁడు. నాట్యకళాపోషణము కవిపై నెంతయాధారపడి యున్నదో, నాట్యకళాప్రదర్శనము నటునిపై నంత యాధారపడియున్నది. నాట్యకళానుభవవ్యగ్రత సామాజికునిది.

రామదాసుపాత్రధారి భక్తితో రాముని గొల్చుట, కబీరు సేవఁజేయుట చూచిన, ననుకార్యులలోఁ బ్రేక్షకులలో భక్తిరసము పొంగిపోవలదా? తానీషా తన భటులచే రామదాసును బందిఖానలోఁ దగని కష్టములఁ బెట్టునప్పుడు కరుణరసమున మునిఁగి కంటఁ దడిపెట్టనివారుందురా! ఇట్లు రసోచితప్రదర్శనములతోఁ బ్రేక్షకులఁ గళానుభవమున భాగస్వాములను జేయువాఁడుగదా నటుఁడు!

కావునఁ బ్రేక్షకులకుఁ గొంత బాధ్యత లేకపోలేదు. కవినేర్పును, నటకుల కళాసంపత్తిని సరసముగ గ్రహించువారుగ నున్ననే నాట్యకళ యభివృద్ధిపొందును. లేనిచో లేదన్నను సత్యదూరముకాదు.

కాన నేఁడు మన నటకులు, "పురుషులు స్త్రీపాత్రముల ధరించిన సహజముగా నుండదు; కాన స్త్రీపాత్రల స్త్రీలే ధరింపవలయు" నని ప్రచారము జేయుచున్నారు. కాని స్త్రీపురుషులు కలిసి నాట్యమాడినచోఁ గొన్ని యనిష్టములు కలుగకమానవు. అవి సాంఘికముగను, సామాజికముగను, నైతికముగను బరిణమించును. కావున స్త్రీలననవసరముగ రంగస్థలములపైకి దింపకుండుటమేలు. మఱికొందఱు నాటకములలో గానము—పద్యములు—వలయునా? వలదా? యను శంక దెచ్చిపెట్టుకొనుచున్నారు. కాని పూర్వకాలమునుండి యివి రెండును నాటకమందుఁ గనఁబడుచునే యున్నవి. కావున రసోచితముగనున్నచో నిప్పుడును దప్పేమియుఁ గనఁబడదు.

నాట్యకళాభివృద్ధి ప్రతిజాతికిని దగినది. అట్టిదానినిఁ బోషించుట యాంధ్రులకు మాత్రము కర్తవ్యముకాదా మఱి? కాన నాంధ్రమహాశయు లిందుకుఁ గడఁగుదురుగాక!



# సీత-ద్రౌపది

శ్రీయుత ఆదిరాజు వీరభద్రరావుగారు, [చాదర్ ఘాట్ హైస్కూలు ఆంధ్రపండితులు.]

వాల్మీకి మహర్షి యభిమానమునకుఁ బాత్రమైన నారీమణి సీత. వ్యాసమహర్షి యభిమానమునకుఁ బాత్రమైన నారీమణి ద్రౌపది. వయసునందు ద్రౌపదికంటె సీత పెద్దది. తరువాత జనించిన ద్రౌపదిని సీతను ముందిడుకొని దిద్దినాఁడు వ్యాసమహర్షి. అంతియె కాదు. ద్రౌపదిని సీతకంటె విలక్షణవతిగాఁ జేయుటకు వ్యాసమహర్షి తన కుంచెను ప్రస్ఫుటమును—ప్రకాశమానమును—నగు రంగులలో ముంచినాఁడు. వేర్వేఱు కవులు వేర్వేఱు విధముల సీతా ద్రౌపదులను జిత్రించినను, ఆదర్శ మొక్కటియే. హిందూనారీమణులు—ముఖ్యముగా మా యాంధ్రవిద్యార్థినులు—ఈ సతీద్వయము యొక్క జీవితవిశేషములను, సామ్యములను, విభేదములను, గమనింపవలయునని మా యాశయము.

సీతా-ద్రౌపదుల జీవితములందుఁ బెక్కు పోలికలు కనఁబడుచున్నవి. ఇద్దఱును—అయోనిజలు; ఇద్దఱును రాజులచేఁ బెంపఁబడినారు. ఇద్దఱి వివాహములకును ధనుర్విద్యాప్రదర్శనమే యుంకువ. ఇద్దఱు నా యాకాలములందు సుప్రసిద్ధి చెందిన క్షత్రియవీరులనే పెండ్లాడిరి. వివాహానంతరము కొంతకాల మిద్దఱును సౌఖ్యముల ననుభవించిరి. ఇద్దఱును వనవాసమునందపహరింపఁబడిరి. ఇద్దఱును దిరిగి భోగములను బొందిరి. ఇద్దఱు నాశ్రమవాసినులై జీవితములను గడపిరి. చివర కిద్దఱును జీవితములపై రోసి ప్రాణములను వదలిరి.

ఇఁక వీరిజీవితము లందలి విభేదములను గూడ స్థూలముగా విచారింతము. సీత జననము నాఁగటిచాలునందు, ద్రౌపది జనన మగ్నికుండమునందు. సీత తండ్రి శాంతశమదమాది సద్గుణసంయుక్తుఁడగు మహాత్ముఁడు. ద్రౌపది తండ్రి దుర్వార శౌర్యాటోప సంకలితుఁడగు గర్వి. సీతావివాహమున కుంకువగాఁ బెట్టఁబడినది శివధనుర్భంగము; ద్రౌపది వివాహమున కుంకువగాఁ బెట్టఁబడినది మత్స్యయంత్ర నిర్మూలనము. సీత వరించినది రాజకుమారుని- అందు రహస్యము లేదు; ద్రౌపది వరించినది బీద బ్రాహ్మణుని- ఆమెకు రాజకుమారుఁడని సుంతయేని తెలియదు. సీత కొక్కఁడే భర్త; ద్రౌపది కయిదుగుఱు భర్తలు. సీతకు సపత్నులు లేరు; ద్రౌపదికి సపత్నులు కలరు. సీత వనవాసమునకు భర్త కారణము గాదు; ద్రౌపది వనవాసమునకు భర్త (ధర్మరాజు) కారణము. సీతమూలకముగ భర్త దుఃఖముల పాలయ్యెను; ద్రౌపది మూలమున భర్తలు విముక్తులయిరి. సీత పదునాల్గేండ్లు వనవాసము చేసినది. ద్రౌపది పండ్రెండేండ్లు వనవాసము- ఒక్కయేఁడజ్ఞాతవాసము చేసినది. సీతను రా

వణుఁడెత్తుకొనిపోఁగా దీర్ఘకాలమునకు విడిపింపఁబడినది: ద్రౌపదిని సైంధవుఁ డెత్తుకొనిపోఁగా వెంటనే విడిపింపఁబడినది. సీత జీవితములోఁ బెక్కేండ్లు ఏకాంతముగాఁ గడపినది: ద్రౌపది భర్తల నెప్పుడును విడిచియుండలేదు. సీత పుత్రశోక మెఱుఁగదు: ద్రౌపది దుర్భరమైన పుత్రశోకమును బొందినది. సీత తనభర్త యడుగుజాడల ననుసరించి ప్రవర్తించిన నాధ్వీశీల: ద్రౌపది తన కనుసన్నల భర్తలు మెలఁగునట్లు చేసిన నెఱజాణ. సీత భర్త నెదిరించి మాటలాడుట యెఱుఁగని వినయవతి: ద్రౌపది పౌరుషవాక్కులను బల్కి భర్తలకుఁ గర్తవ్యమును బోధించిన ప్రౌఢ. సీత విధిచెయిదములకుఁ దలయొగ్గిన యమాయకురాలు: ద్రౌపది విధిచెయిదముల నెదుర్కొని పోరాడిన ధీర. సీత పరిభవముల నెఱుఁగదు: ద్రౌపది పెక్కు పరిభవముల పాలయినది. సీత మనస్సు శాంతమహాసముద్రము: ద్రౌపది మనస్సు ఉత్తుంగతరంగ కల్లోల మహాసముద్రము. సీత మేనికాంతి తెలుపు: ద్రౌపది మేనికాంతినలుపు. సీత చంద్రప్రకాశము: ద్రౌపది మహోజ్జ్వల ప్రకాశము.

ఇట్లే సూక్ష్మముగఁ బరిశీలించినయెడల నింకను సామ్యములును, విభేదములును గనఁబడఁగలవు. మా యాంధ్రవిద్యార్థిను లేతత్ప్రయత్నమునకుఁ గడఁగి, యాయా సమానఘట్టములయందు వారు ప్రవర్తించిన విధమును సోదాహరణముగఁ జర్చింతెదరుగాక !

ఇంతవఱకు దిక్ప్రదర్శనముగాఁ జూపిన పైవిషయములనుబట్టి వాల్మీకి—వ్యాసమహర్షు లిద్దఱు తమతమ కథావస్తువుల కనుగుణముగఁ బరికరమును గూర్చుకొన్నా రనుటలో సందేహములేదు. అయినను సమాన సందర్భములందును వ్యాసులవారు మార్పుచేయుటలోఁ గల స్వారస్యమేమో మనము కొంచెము విచారింతము.

సీత సుఖదుఃఖములందు నిర్వికారముగ సంచరించుజీవి గనుకనే, క్షమాగుణభూషిత యగు భూదేవి సీతకు మాతయైనది: ద్రౌపది యొక్క పుట్టినయింటివారగును, మెట్టినవారును, ఇతర రాజలోకమును సర్వనాశన మగుటయే వ్యాసమహర్షి కథావస్తువు. ఇట్టి నాశనమునకు ద్రౌపదియొక్క మహోజ్జ్వల సౌందర్యము చక్కని దోహదము గల్పించినది. కావుననే స్వ-పరభేదము లేకుండ నెదుర్కొని నవానినెల్ల భస్మీపటలముచేయు మహోజ్జ్వలాగ్నియందు ద్రౌపదిని జన్మింపఁ జేసినవారు వ్యాసులవారు.

వాల్మీకి నిర్మించిన శివధనుర్భంగకథ వ్యాసులవారికి నచ్చలేదు. శివధనుర్భంగము చేయుటలో విశేషమేమున్నది ? అచ్చట కావలసినది మొండిబలము. ధనుర్విద్యాకౌశలము కాదు. వేలకొలఁది మనుష్యులు మోసికొని రావలసినంత బరువుగల శివధనుస్సును బదునాఱు పదునెనిమిదేండ్ల వయిస్సుగలవాఁడు, అల్లారుముద్దుగా సుకుమారముగాఁ బెరిగిన బాలుఁడగు రాముఁడు త్రుంచినాఁడు; రాముఁడు మేటివీరుఁ డనుటకు సందేహము లేదు. కాని భీమునివలె బలశాలి యనుటకు వీలులేదు. వాని యాకారమేమి ? వాని బాల్యచేష్టలేమి ? రాముఁడు కొండంత దేహముగలవాఁ డనుటకుఁ గాని, యేనుఁగంత బలముగలవాఁ డనుటకుఁ గాని యవకాశములియ్యము. కావున వాల్మీకి రామునిచేతఁ జేయించిన శివధనుర్భంగకార్య

ము చాల యసహజముగాఁ గన్పించినది వ్యాసులవారికి. అయితే వ్యాసులవా రేమిచేసిరి ? ద్రౌపది యర్జునునకు భార్యగా నుద్దేశింపఁబడినది. ఆకాలపు వీరులలో నర్జునుఁడు మేటిధనుర్ధరుఁడు. అతఁ డెక్కడనున్నాఁడో ద్రుపదునకుఁ దెలియదు. కావున మేటి ధనుర్ధరులకు మాత్రమే శక్యమగు మత్స్యయంత్రి నిర్మూలనము మూలకముగా నర్జునుని గుర్తింపవచ్చు నను కొన్నాఁడు. అట్లే జరిగినది. వ్యాసులవారు చేసిన మా ర్పెంత సహజమునున్నదో చదువరులు గ్రహింపఁగలరు.

సీత రాముని వలచినది. వాని నే పెండ్లాడినది. కథలో నెడుదుడుకులేకుండ వాల్మీకులవారు నడపినారు. అట్లే నడపినచో రమ్యత యేమని వ్యాసులవారు కథను మార్చినారు. ద్రౌపది యర్జునుని వలచినది. కాని మత్స్యయంత్రమును గొట్టినవాఁ డెవఁడు ? ద్రౌపదికిఁ దెలిసినంతవఱ కొక పేదవిప్రుఁడు. ఈసందర్భమున వ్యాసులవా రందఱను గొంచెముసేపు విభ్రాంతిపఱచి యూఁడించినారు.

సీత మిథిలయందున్నపుడును, నయోధ్యయందున్నపుడును నతులిత రాజభోగము లనుభ విం చి న ది. పరిచారికలు పెక్కుమంది యామెను సేవించుచుచుండిరి. స్వయముగాఁ బాటుపడుటగాని, గృహనిర్వాహక కార్యభారముగాని, యామె యెఱుఁగదు. రాముని పదునాల్గేండ్ల వనవాసములోఁ బదిసంవత్సరములు ఋష్యాశ్రమములలో నివాసము. అప్పుడు ఋషిపత్నులే సీతకు సకలవిధోపచారములు సేసి గౌరవించిరి! పంచవటియందున్న మూఁడుసంవత్సరములలోను రామలక్ష్మణులే యాహారపానీయములను సంపాదించి పెట్టుచు, యామె ను బువ్వులతోఁ బూజించి కాపాడుచుండిరి. ఒకవేళ నెప్పుడయిన నామె వంటచేసినను మగఁడు మఱిది తప్ప వేఱు జనము లేరుగదా ! ఏమి పెట్టినను, అసలు పెట్టినను బెట్టకపోయినను, మాట్లాడని విధేయుఁడుగదా మఱిది లక్ష్మన్న ! ఇట్టి సందర్భమును బట్టి పంచవటిలోఁ సీత గృహనిర్వాహకభారమే యెఱుఁగదు. మిగిలిన యొకసంవత్సరము లంకలోఁ గడపినది. అప్పుడు రామనామస్మరణ తప్ప నామెకు వేఱు పనిలేదుగదా ! అయ్యో ! అయ్యో ! ఇదేమి ? స్త్రీజన్మమెత్తిన మానిసికిఁ దనయిల్లు చక్కపెట్టుకొనుట తెలియకుండుటయా? రాచకొమరిత యైననేమి? బీదవనిత యైననేమి? ఒడలువంచి పనిచేయఁజాలని స్త్రీ గృహిణీనామమున కనర్హురాలని తలంచినాఁడు వ్యాసమహర్షి. వెంటనే ద్రౌపది నాదర్శగృహిణిగాదిద్దినాఁడు.

ద్రౌపదియు నతులిత రాజభోగముల ననుభవించిన రాచబిడ్డయే. కాని యామె వనవాసమునందు స్వయముగా—నౌకరులు లేరుసుమండీ!— తన భర్తలకు, వచ్చిన యతిథియభ్యాగతులకు—వారు కొలఁదిమంది కారుసుమండీ !—వారి వారి యవసరములను గమనించి, పరిచర్యచేయుటయే గాక, గృహసంబంధములగు ప్రాఁచిపనులు, వంట, అంట్లుతోముట మొదలగు సమస్తకార్యములను గడునేర్పుతో నిర్వహించి, యందఱి మెప్పును బడసినది. ద్రౌపది తనయింటిపనులు తాను చేసికొన్నది గావున, నందులో నంతగా విశేషము లేదనుకొన్నాఁడు వ్యాసుఁడు. కాఁబట్టి విరాటరాజు నంతఃపురమున ద్రౌపదిని దాసిగా నియోగించి, యచ్చటఁ దనవిధుల నామె యెంత శ్లాఘనీయముగా నొనర్చినదో చూపి

నాఁడు. ఈ విధముగా ద్రౌపది యితరులచేఁ జేయించుకొనినది, తన యింటిపనులు తానే చేసికొనునది, ఇతరుల కూడిగము చేసినది. త్రివిధానుభవములుగల ద్రౌపదినిఁ జూచి వ్యాసుఁడు సంతోషించినాఁడు,

ఇట్లే సూక్ష్మముగఁ బరిశీలించినకొలఁదిని, వ్యాసులవారు చేసిన మార్పులయందలి సౌందర్యము గోచరము కాఁగలదు. మా యాంధ్రవిద్యార్థిను లిట్టి విమర్శనాపాటవమును బెంపొందించుకొనెదరుగాక!



# కావ్యవిమర్శ - మొల్లరామాయణము.

శ్రీమతి. క. లక్ష్మీబాయి, [మెట్రిక్.]

కవిత్వమనఁగాఁ బ్రకృతినిఁ జూచియానందించి, యా యానందమును బ్రదర్శించి పాఠకులను దల్లీనులనుగఁ జేయునదిగాన, మూలసృష్టి ననుసరించు ప్రతిసృష్టి యనఁదగును. సర్వమును దెలిసికొని యభేదదృష్టితోఁ జూచుచు నన్నివిధముల నన్నిచోట్లను సంచరించుచుఁ దనభావము వ్యక్తీకరించువాఁడు కవి ప్రతిభ-వ్యుత్పత్తి— ఈరెండును గవి కావశ్యకములు. "రచనా శబ్దార్థాలంకారోక్తి రసమార్గ శాస్త్రములను నీ యెనిమిది కవిత్వముఁనం దుండవలసినవి. వీనిలో మూఁడుగుణములు గలవారు సాధారణులు, ఐదు గుణములు గలవారు మధ్యములు; ఏఁడు గలవారు మహాకవు" లని పెద్దలు చెప్పియున్నారు.

కావ్యము, కవినిర్మితము- కళాత్మకము, ప్రపంచ పరిశీలనముచేతఁ గవులు సహజమైన పరవశతను, ఆనందమునుబొంది, వానిని యథాస్థితిగాఁ బ్రదర్శించి పాఠకులకు నట్టియావేశమునే పుట్టించు చమత్కృతిని 'కళ' యనవచ్చును. కళాధర్మము రసోత్పాదకమైనది. విశ్వమునకు శ్రేయమును గూర్చునది కావ్యమని శబ్దానుశాసనులు. కావునఁ గావ్యమునకుఁ గళ, ధ్వని, విశ్వమానవభావమువల్ల గల్గు స్థిరత యావశ్యకములు, రచనావిధానమును శైలియని యందురు వివిధకవుల శైలులఁ బరీక్షించి యాలంకారికులు ధ్వని, వృత్తి. రీతి, పాకాదులను శాసించిరి.

—♦ మొ ల్ల రా మా య ణ ము ♦—

మొల్లరామాయణమును రచించినది ఆతుకూరి కేసనసెట్టితనయ యగు మొల్ల. అందుచేతనే యిది "మొల్లరామాయణ" మని పిలువఁబడుచున్నది. ఈ కవయిత్రి జనకుఁడగు కేసనసెట్టి శివభక్తుఁడును, గవీశ్వరుండునయి యుండెనని యాశ్వాసాంత గద్యమునం దిట్లున్నది: "శ్రీగౌరీశ్వరవరప్రసాదలబ్ధ గురుజంగమార్చనవినోదసూరిజనవినుతకవితాచమత్కారా తుకూరి కేసనసెట్టితనయ మొల్లనామధేయ విరచితంబైన శ్రీరామాయణ మహాకావ్యము." దీనివల్ల మొల్లజనకుఁడు కవితాచమత్కారధురీణుఁడనియు, సూరిజనవినుతసద్వర్తనుఁడనియుఁ దెల్లమగుచున్నది. ముఖ్యముగా జననీజనకుల లక్షణములు వారి సంతానములకుఁ బట్టువడుట నైజమే గనుక మొల్లకు దైవభక్తి సహజమైనది. ఆమెకుఁ బ్రియత్నముచేఁగాక దైవవరప్రసాదముననే కవిత్వము లభించినట్లు గ నీ క్రిందిపద్యమువలన విశదమగును.

సీ॥ "..............................
..............................

గీ॥ కావ్యసంపద, క్రియలు, వి♦ ఘంటువులును
గ్రమము లేవియు నెఱుఁగ, వి♦ ఖ్యాతగోప
వరపు శ్రీకంఠమల్లేశు ♦ వరముచేత
నెఱుఁ గవిత్వంబుఁ జెప్పఁగా ♦ నేర్చికొంటి॥

మఱియు, "రామచంద్రుఁడు చెప్పుమని నందునఁ జెప్పుచుంటి" నని కూడ వ్రాసికొన్నది. అది నిశ్చయమో లేక, కవీశ్వరులకు సంప్రదాయసిద్ధముగ వచ్చుచున్న వాడుకను నీమె కూడ ననుసరించి యట్లు చెప్పుకొన్నదో, నిశ్చయింపఁజాలము, కాని ముఖ్యముగా భక్తిపెంపుననే యీగ్రంథమును రచించినట్లు చెప్పవచ్చును. చూడుఁడు.—

"ఉ॥ రాజితకీర్తిమైన రఘురామచరిత్రము
మున్ను గవీశ్వరుల్
తేజమెలర్పఁ జెప్పిరని తెల్పియుఁ గ్ర
మ్మఱఁ జెప్పనేలనన్
భూజనకల్పకంబగుచు భుక్తికి ముక్తికి
మూలమైన యా
రాజును, దైవమైన రఘురాము నుతిం
చినఁ దప్పుగల్గునే?"

నిరర్గళమును, సరళమునగు నీమె మృదుమధురకవిత్వశైలిగూడ దేవవరప్రసాదలబ్ధమని చాటుచున్నది. ఈమెకుఁ బూర్వమును బిమ్మటనుగూడ నీమె కీడగు కవయిత్రులున్నట్లు తోఁపదు. సహజపాండిత్యుఁడగు బమ్మెర పోతన భక్తిరసపూరితంబగు కవితి కీయమ కవిత్వము తీసిపోదేమో యని యనిపించెడిని.

—♦ కా ల ము ♦—

ఈ కవయిత్రి కాలము నిర్ణయించుటకుఁ దగిన యాధారము లంతగ లేవు. తన గ్రంథములోని కవిస్తుతిలో సంస్కృత కవీశ్వరులను నుతించి, నాచన సోముని, భీముని, రంగనాథుని, శ్రీనాథుని, భారత గ్రంథకర్తలగు నన్నపార్యునిఁ దిక్కనసోమయాజిని స్తుతించినది. తరువాతివారి నెవరి నామె పేర్కొనకపోవుటచే శ్రీనాథుని తర్వాతిది కావచ్చును. ఐనను, శ్రీనాథుఁడు పోతనామాత్యుఁడు సమకాలికులుగదా! ఆమెస్తుతిలోఁ బోతన యుల్లేఖింపఁబడలేదెందుచేతనో? పోతనామాత్యుఁడు తన కృతులను రాజుల కంకితముచేసి వారల సన్మానంబు వడయకపోవుటచే నాకాలములోఁ బ్రి

ఖ్యాతినొందియుండలేదా ? మొల్ల దాదాఁపు 15వ శతాబ్దమున నుండియుండవచ్చును.

—♦ ని వా స ము ♦—

ఈమె నివాసస్థానము నెల్లూరుమండలములోని గోపవరమని తెలియుచున్నది. ఆశ్వాసాంత గద్యమున నీమె జనకుని జన్మస్థితులే పేర్కొనఁబడినవికాని, భర్తయొక్కయు, సత్తివారియొక్కయు జాడ లేమియుఁ బొడకట్టకపోవుటచే మొల్ల బాలవితంతువో యవివాహితయో యైయుండవచ్చును. జాతి విషయమున నీమె కులాలకుల సంభవురాలు.

—♦ క వి త్వ ము ♦—

మొల్ల యాంధ్రకవితను గూర్చి ప్రౌఢముగాఁ దనయభిప్రాయము నిట్లు స్పష్టీకరించి యున్నది.

ఆ॥ "తేనెసోక నోరు ♦ తీయనయగురీతి
తోడ నర్థమెల్లఁ ♦ దోఁచకుండ
గూఢశబ్దములను ♦ గూర్చినకావ్యమ్ము
మూఁగ చెవిటివారి ♦ ముచ్చటగును॥

కం॥ కందువమాటలు సామెత
లందముగాఁగూర్చి చెప్ప ♦ నది తెలుఁగునకుఁ
బొందై, రుచియై, వీనుల
విందై మఱి కానుపించు ♦ విబుధులమదికిన్.

కవిత్వలక్షణము నిట్లుగ నిరూపించి లవలేశమును దాని కట్టుబాట్ల నతిక్రమింపక ప్రవర్తించి గ్రంథమును గమనీయకవితామనోహరముగఁ జేసియున్నది. మృదుమధురరసభావపూరితమగు నీ యమూల్యకావ్యమును రచించి యాంధ్రభాషాయోషకలంకారముగ నొసఁగుటయేగాక, మృతజీవయము, యాంధ్రకవయిత్రీమతల్లికలలోఁ దలమానికమయి పూజ్యస్థానమలంకరించి యున్నది. ఇహపరసాధనమగు శ్రీరామాయణమును రచించి తాను ధన్యయగుటయేగాక యాంధ్రప్రపంచమునకే ధన్యతగూర్చిన దనవచ్చును.

ఈమె ప్రదర్శించిన కవిత్వశిల్పమున రససౌభాగ్యము—అర్థసారస్యము— అన్వయసౌలభ్యము—స్వకీయకల్పనాచాతుర్యము—విశ్వభావనము—కళాకౌశలము—వర్ణనావైశద్యము—ఏమని చెప్పవచ్చును-చాలహృదయంగమములు. మఱియు నచ్చటచ్చట శ్లేషార్థము లందముగాఁ బొందుపఱుపఁబడినవి. ఆంధ్రరామాయణములు చాలయున్నను, మొల్లరామాయణ మన్నివిషయముల యందును బ్రత్యేకత్వమును గనఁబఱుచుచుఁ బ్రశంసాపాత్ర మగుచున్నది.

సీ॥ శుభపవిత్రోజ్జ్వల ♦ సూత్రధారులుగాని
టక్కరిహాస్య నా ♦ టకులుగారు
ఉభయసంధ్యాది వి♦ధ్యుక్తకర్మలుగాని
చర్చింపఁగా నిశా ♦ చరులుగారు

* * * * *
* * *

కం॥ భోగానురాగసంపద
భోగులువర్తింతురందు ♦ భూనుతలీలన్
భోగానురాగసంపద
భోగులువర్తింతురిందు ♦ భూనుతలీలన్॥

ఇట్టి శ్లేషలు, నుపమానములు నామె కవిత్వమునకుఁ బెట్టనిసొమ్ములు.

ఈమె కవిత్వము భావమునుబట్టి శైలి నడచుచు, శైలిలో సౌందర్యమును వర్షించుచు సౌందర్యముతో మాధుర్యమును జోడించి, పాఠకులను దన్మయులుగాఁ గావించుచున్నది.

(సశేషము.)



# బీదబాలిక

శ్రీమతి. యన్. భారతీరత్నాకరాంబ [ప్రిమెట్రిక్.]

చ॥ తిరుగుచు గాలిమమంతటను ♦ దిక్కటి,—'యంబరవీథియందు భా
స్కరుఁడు ప్రచండుఁడౌట వెదఁ ♦ జల్లునొకో! ధరసగ్ని?' నంచుఁ జూ
పఱ కెదఁ దోఁచునట్టి దిన ♦ భాగమునందున-భిక్షు వేఁడుచున్
అరయఁగ నొక్కబాలిక కృ ♦ శాంగముతోఁ జరియించె, నక్కటా!

గీ॥ మిహిరునింగని పద్మభా ♦ మినులు మోద, మంది సుందరమందహా ♦ సాననములఁ
బరఁగి చెలువొంద, నాబీద ♦ బాలికాము, ఖారవిందము వాడె న్వే ♦ దాంకితమయి॥

గీ॥ ఒక్క గృహవాటికడ కేగి ♦ యువిద యిట్లు, లడిగె ఊాలైనఁ గరగెఁడి ♦ వడువుదోఁప
"ఆకలిక్కి దాళలేను మా ♦ యమ్మలార! పట్టెడన్నముపెట్టి కా ♦ పాఁడుఁడమ్మ!"

ఉ॥ "వేళయుఁ బాళలేక తిరి ♦ పెంప బడుగం జనుదెంతు వీవు! ఈ
వేళలయందు భిక్షమును ♦ వేయఁగలార లెవారు నీకు ? నో
కూళ!" యటం చొకర్తె కడుఁ ♦ క్రోధముతోడుతఁ బల్కుచుండఁగా
బాలిక కండ్లనుండి యొక ♦ బాష్పకణం బదిజాఱెఁ జెక్కులన్ ॥

ఆ॥ "చింతచచ్చి పులుసు ♦ చెదరని విధమున, నేల దురభిమాన ♦ మింత నీకు ?
ఇంతమాట యనక ♦ యేరొసంగెద రోసి! ఇంత పేదరాలి ♦ కీ ధరిత్రి?"

కం॥ అను నామెపలుకు ములికిగఁ, గనలి మదింగుల్వ, భావ ♦ గర్భిత దృష్టిం
గనుగొని యొకపరి, బాలిక, తనత్రోవంబోయె, దైవ ♦ తంత్రవివశమై॥



# గా న క ళ.

శ్రీమతి. వి.ఆర్. కోమలవల్లి, [పిరిమెట్రిక్.]

గానకళ యనఁగా సంగీతకళ. సంగీతము మనుజుల హృదయముల నాకర్షించుచున్నది. అది మనోబలమునుగూడ వృద్ధిచేయుచున్నది. మనోబలమును వృద్ధిచేయని దేదియును గళ కానేరదు. మనోబలముతోఁబాటు బుద్ధిబల ము హెచ్చును.

గానకళకు రసనిష్పత్తి ముఖ్యము. రాగ సంచారమున నది ప్రవహించును. రాగసంచా రమున మనస్సు క్రిందిస్వరమునకు మిగుల దగ్గ అగ నాకర్షింపఁబడి యుండుటచేఁ బయిస్వరము ను దగ్గింపఁ బ్రయత్నించును. రసము నీరస మైనచోఁ గళాపుష్టియుండదు; ఏల శ్రీ కళయే కాదు.

స్వరములన్నియు సాధారణముగా షడ్జ-పంచమములు, లేక, షడ్జ-మధ్యమములయందు నప్పుడప్పుడు గాంధారముపైనను, నిల్చును; కావున విహీనములగు స్వరములు వానిమాత్రాకాల ము పెరుగునప్పుడు, అనఁగా స్వరములు దీర్ఘ ము లగునప్పుడు, శ్రుతులవిలువ హెచ్చగును. కాఁబట్టిభైరవియందుఁజతుశ్శ్రుతి-శుద్ధధైవతము లును, గా భోజీ—నీలాంబరీరాగములందు, కైశికీ-కాకలీనిషాధములును, ఈవిధముగఁ గొన్నిరాగములయందు నియతస్వరములకన్నఁ జాలవచ్చుచుండును ఇవన్నియు మనోధర్మము నను సరించియే వచ్చును. రాగములయందు "ధగ గ మగధ, నిసరిధగాగమ, ధమ, మధ, ధగరిగ" మొదలగు ప్రయోగములయందు గాంధార మధ్యమములతో మధ్యమసాధారణ గాంధారభావమున ద్విశ్రుతిధైవతము వచ్చును. "రిధని, ధరిని, ధరిస, ధధగరిగగ" మొదలగు ప్రయోగములందు ధైవత మేకశ్రుతిమై నుం డును. ఇట్లు ధైవత మారోహణమున ద్విశ్రుతికముగను, అవరోహణమున నేకశ్రుతికము గను నుండును.

ఇప్పుడీ శ్రుతుల చేరికగల స్వరప్రయోగములు సంగీతకళను బోషించుటయేగాని, యవి యంత స్పష్టముగఁ జెప్పుటలేదు. కాన నివి శరీరమందలి యస్థిపంజరమువలెమాత్రమేర్ప డుచున్నవి. శరీరమందలి నాడులు, కండరములు, ఎముకలు మున్నగువానియొక్క యసహ్యతను గప్పిపుచ్చుటకుఁ జర్మ మెట్లావశ్యకమో, అట్లే సంగీతమందును స్వరముల యసహ్యతను గప్పిపుచ్చుటకు గమకమును, శ్రుతులును, నావశ్యకము లగుచున్నవి. పాటఁబాడు ప్రతి గాయకుఁడును నొకే శ్రుతియందుఁ బాడుచుం డుటలేదు. కావున స్వరములు, శ్రుతులయొక్కయు, విలువయొక్కయుఁ జలనములఁజెప్పనఁ జెప్పుటకన్న, షడ్జమునకు మఱివానికిఁగల సంబంధమును జెప్పుటే, అనఁగా శ్రుతుల ప్రమాణమును జెప్పుటే యనఁజెల్లును. మన హిందూసంగీతమునందు మేళముల నేర్పఱచు నప్పుడు పండ్రెండు స్వరస్థానములును, రాగము

ల నేర్పఱచి స్పష్టపఱచుటకుఁ దక్కిన యిఱువదిరెండు శ్రుతులు నావశ్యకములగుచున్నవి.

తోడిరాగమందు షడ్జేలునఁ బ్రథమమున శ్రుతినిఁ దాఁకి క్రిందికి రావలయును. తోడి రాగజన్యమయిన 'అసావేరి' రాగమునందు మధ్య గాంధార–కైశికీ–కాకలీ నిషాదములు వచ్చుచున్నవి. దానికే మఱియొక జన్యరాగమగు 'పున్నాగవరాళి' యందుఁ ద్రిశ్రుతి ఋషభము, 'గరిగమ' మున్నగు ప్రయోగముల యందు వచ్చును. కావున నీ రాగము కోమల స్వరముగనే పరిగణింపఁబడుట ప్రతిగాయకుఁడు నెఱిఁగిన విషయమేగదా! మఱియుఁ బ్రాచీన వర్ణములయందుఁ దప్పఁ దక్కిన వర్ణములు, కృతులయందుఁ బంచమము వర్జింపఁబడుట లేదు.

ఇట్టి సర్వమనోహరమగు గానకళను శాస్త్రీయముగానభ్యసించి, దాని జీవమును దాని భారతీయతను నిల్పఁగలుగువారుధన్యులు.





# పంచాంగము.

శ్రీమతి. డి. కమలావతి. [మెట్రిక్.]

మన హైందవులలో బిడ్డ జన్మించినది మొదలు క్రమక్రమముగఁ గర్మలు చేయునప్పుడు, పంచాంగముఁ జూడనిది యేకార్యమును జేయరు. కర్మాచరణమున కిది ముఖ్యము. ఇట్టి మన జ్యోతిశ్శాస్త్రము రెండువిధములు. వీనిని స్కంధములందురు. (౧) గణితస్కంధము. (౨) జాతకస్కంధము. మొదటిదాని సత్యాసత్యత్వములను బట్టి రెండవదాని సత్యాసత్యత్వములను జెప్ప నవకాశము లేదు. కాని గ్రహణములు ప్రత్యక్షముగాఁ గానవచ్చుటచే. మన హైందవులు పూర్వకాలమునుండి పూర్ణవిశ్వాసముతో నుండిరి. ఒక్క మన పూర్వులే యేమి? మనకునుగలదు. మనమేకాక యితర ఖండవాసులుగూడ నమ్మెదురు.

అన్నియు నట్లుంచి ముందుగఁ బంచాఙ్గమన నేమో తెలిసికొందముగాక. దీనిపేరును బట్టియే యిది యైదంగములు గలదని తెలియుచున్నది. వానినే తిథి–వార–నక్షత్ర–యోగ–కరణములని యందురు. మొదటిది—

తిథి–ఇది సూర్యచంద్రులకుఁగల యంతరమునుబట్టి యేర్పడుచున్నది. అమావాస్యతో వీరి ప్రయాణముసాగును. వీరిమధ్య 12 డిగ్రీలయంతరము గలుగఁగనే యొక తిథియగును. అనఁగఁ బాడ్యమియగును. 24° డిగ్రీల యంతరముతో విదియయగును. ఇట్లే 18 డి. యంతర మున్నప్పుడు పూర్ణిమ యగుచున్నది. 30 తిథులయినచోఁ జాంద్రమాసమగును. కాని కొన్నిసమయములయందు 29 దినములే మాసమగుచున్నవి. ఇట్టి నెలలు పండ్రెండైనఁ జాంద్రసంవత్సర మగును. సంవత్సరమునకు

360 తిథులున్నను, గొన్నియెడల 294 దినములే యగుచున్నవి. అందువలనఁ గొన్నితిథులు వృద్ధిక్షయములను జెందుచున్నవి. ఒక చాంద్రసంవత్సరమున క్షయతిథులు 13 ను, వృద్ధితిథులు 17 ను వచ్చును. సూర్యోదయానంతరము ప్రారంభమై మఱునాఁటి సూర్యోదయములోపల ముగియుతిథి క్షయతిథి. ఒక దినమున సూర్యోదయమైన చాలకాలమునకుఁ బ్రారంభమై మఱునాఁడెల్లయుండి. మూఁడవ నాఁడు సూర్యోదయమైన తరువాత క్షయించునది వృద్ధితిథి. కావునఁ మనకుఁదిథులు సూర్యోదయములోఁ బ్రారంభమగును. సూర్యచంద్రు లొకప్పుడు వేగముగను, మఱొకప్పుడు మందముగను నడచుటచేఁ దిథులుకూడ సమానముగా నుండవు; కొన్ని 65 గడియలను మించును. కొన్ని 53 గ. ఉండును. ఇట్టి తిథివ్యవహారమునుబట్టియే మనవారి శుభాశుభకార్యములు జరుగుచున్నవి.

**వారము-** వారము లన్నిదేశములందును 7 గలవు. ఇవి గ్రహముల పేర్ల ననుసరించియున్నవి. శని-గురు-మంగళ-సూర్య-శుక్ర-బుధ-చంద్రులు గ్రహములు. శనినుండి నాల్గవవాఁడు సూర్యుఁడు; కావుననే యాదిత్యవారము (ఆదివారము) వచ్చును. సూర్యుని నుండి నాలుగవవాఁడు చంద్రుఁడు, కనుక సోమవారము. ఇట్లే తక్కినవారములును. సూర్యోదయకాలమున హోరాధిపతిగ నెవ్వఁడుండునో వాఁడే యాదినమున కధిపతి. వానిపేరే యాదినమునకు వచ్చును. గ్రీకుభాషలోనుండు 'హోర' యను పదమె యింగ్లీషులో 'hour' గా మాఱెను.

**నక్షత్రము-** చంద్రుఁ డెంతకాలములోఁ దిరుగునో యా కాలపరిమితి నే నక్షత్రమనియెదరు. ఇట్టి క్రాంతివృత్తమున కాకారమునుబట్టి పేర్లు పెట్టఁబడెను. చంద్రుఁ డొక దినమున నొక నక్షత్రము నడచును. కావున నక్షత్రమాసమునందు దాదాఁపు 27 దినములుండును. పంచాంగములోఁ దిథి, తరువాత నక్షత్రము ముఖ్యము. వీనినిఁ జంద్రనక్షత్రములందురు. సూర్యుఁడు $13\frac{14}{27}$ దినములలో నొక నక్షత్రమును దాటును; ఇది సూర్యనక్షత్రము ఇది వర్షసంబంధమైనది.

**యోగము-** ఆగమన సంయోగమే యోగము. చంద్రసూర్యులు (సూర్యుఁడు చంద్రుఁడు క్రమములో) 13°-20° అంతర మెంతకాలములోఁ బ్రయాణము చేయుదురో దానిని యోగమందురు.

**కరణము-** తిథిలో సగము కరణము. అమావాస్యనుండి చంద్ర-సూర్యుల గమనభేదము 6° అంశములగుట కెంతకాలము పట్టునో దానినిఁ గరణమందురు. రెండు కరణము లొక తిథి.

ఇట్టి పంచాంగములలో నొకటి మఱియొకదానితోఁ దిథుల ప్రారంభకాలములను బట్టి కలియుటలేదు. సూర్యచంద్రాదుల గమన మందతకిని సామాన్యము గనుక, తిథులన్ని ప్రదేశములవారికి నొక్కకాలమునందే పూర్తి యగును.

కాని తిథులమితి సూర్యోదయకాలము నుండి లెక్క వేయుదురు గనుకను, సూర్యోదయ మన్నిదేశముల నేకకాలములఁ గాదుగనుకను, దీనికిఁ గారణము 'శూన్యవిషువచ్ఛాయా మధ్యరేఖా' పరిగణనపద్ధతినిఁబట్టి మాఱునని తెలుచున్నది. మనవారు లంక-ఉజ్జయిని-కురుక్షేత్రముల మీఁదుగఁ బోవురేఖ

నట్లు భావించి గుణించియుండిరి. ఆంగ్లేయు లిప్పుడు గ్రీనిచ్ పట్టణము నట్లు భావించి లెక్క చేసెదరుగదా !

కావున దీనినిఁబట్టి ప్రతిదేశమునకు నొక్కొక్క పంచాంగ మవసరపడుచున్నది. మనలోఁ బంచాంగములన్నియు నొక్కరీతిగ గుణింపఁబడుట లేదు. ఆ సిద్ధాంతములు చాల భేదములుగ నున్నవి. పూర్వ-పర సిద్ధాంతముల నుబట్టి మన పంచాంగపరిగణనము సరిచేయఁబడవలసి యున్నది.



# బమ్మెర పోతరాజు.

శ్రీమతి. క. రాఘవమ్మ, [మెట్రిక్.]

నేఁడు మిక్కిలి సుదినము. ఏమందురా? బమ్మెర పోతనామాత్యునిఁ బ్రస్తుతింపఁ గల్గిన భాగ్యమబ్బుటచేత. "చేతులారంగ శివునిఁ" బూజించి, "నోరు నొవ్వంగ హరికీర్తి" నుడివి, "దయయు సత్యంబులోనుగాఁ" దలఁచి, యత్యంతము నిజముగఁ "దల్లుల కడుపుఁ జేటు"గఁ గాక, పుణ్యాత్ములగు కేసన లక్ష్మమాంబల పూర్వసుకృతఫలముగఁ బుట్టి, "జగద్ధితంబుగ" భాగవతమును మనకుఁ బ్రసాదించిన యామహాత్ము నొక్కసారి స్మరించు యోగ్యత లభించుటచేత.

పోతన మన దేశమందలి యాంధ్రకవులలో నొకఁడు. ఇతని నివాసస్థానము 'వరంగలు' దగ్గఱనున్న యొక చిన్నపల్లె. ఒరంగలునకుఁ బూర్వము 'ఓరుగ'ల్లనియుఁ బేరుగలదు. కాని కొందఱు 'కడపజిల్లా'లోని 'ఒంటిమిట' యనియనెదరు. కాని యది కానేరదు. మన నిజాము రాజ్యములోని యోరుగల్లు భాగవతమున "ఏకశిలాగర"మని చెప్పఁబడియున్నది. 'బమ్మెర' యను పల్లె యోరుగంటికి రెండుమూఁడామడల దూరమునఁ గలదు. పోతన చదువు చదువుకొనుటకయి యిచ్చటికి వచ్చియుండవచ్చును. ఓరుగల్లే యేకశిలానగరమని నిరూపింపను గూడవచ్చును. ఓరుగల్లప్పుడు కర్ణాటకరాజ్యములోనిది. కర్ణాటకభాషలో "ఓరు" అనఁగా "నొక్కటి" "కల్లు" అనఁగా 'ఱాయి' యని యర్థము. దానినే మనము సంస్కృతమున 'ఏకశిలానగర' మని పిలుచుచున్నారు. కాని, యొంటిమిట్ట యెన్నఁడు నేకశిలానగరము కాదు. 'మెట్ట' అనుదానికి శైలమని యర్థమిచ్చును. గాని 'శిల' యని కాదు. అదిగాక భాగవతమును మఱి ముగ్గురు కవులు పూరించిరి. వారి

యూళ్లు "ఓరుగల్లు"నకు సమీపమున నున్నవి. పోతన యొంటిమిట్టవాఁడయిన, వీరికి భాగవతము విషయము తెలిసియే యుండదు. కావున బమ్మెర పోతరాజు ఓరుగంటివాఁ డనియే చెప్పవలెను. మన నిజామురాష్ట్రీయుఁడగుటచే నాయనను గూర్చి మన మెంత గర్వపడినను జాలదు.

పోతన ౧౩౮౨ లో జన్మించెనని తెనుఁగు భాగవతము నచ్చువేనసినవారు పీఠికయందు వ్రాసియున్నారు. కాని యది నిజముకాదు. ఈకవి హూణశకము ౧౪౦౦ లో జన్మించెనని చాలమంది యనుచున్నారు

పోతనామాత్యుఁడు తన భాగవతమును శ్రీనాథాదికవులవలె నప్పటిరాజుల కంకితముచేయలేదు. "పలికించెడువాఁడు రామభద్రుండఁట!" యని శ్రీరాముని కంకితమిచ్చెను. ఈయన చాలభక్తిపరుఁడు. శ్రీనాథుఁ డీయన బావమఱఁది యని లోకప్రతీతి. ఈయన భక్తి ప్రభావమును దెల్పు కథ లనేకములు గలవు.

మచ్చునకొకటి. పోతన గజేంద్రమోక్షణకథను వ్రాయుచు, "అల వైకుంఠపురంబులో నగరిలో నామూలసౌధంబు" అని వ్రాసి తరువాత నేమియుఁ దోఁపక భోజనమునకుఁ బోయెను. ఇంతలో భగవంతుఁడువచ్చి "దాపల" యని వ్రాసిపెట్టి పోయెనని వాడుకకలదు.

భాగవతముశైలి యిట్టిదని వర్ణింపరానిది. కవితలోని రసోత్కర్షకది పెట్టినపేరు. భక్తికిఁ బట్టుకొమ్మ. అట్టి గ్రంథమునువ్రాసి, బమ్మెర పోతరాజు తనకును దన గ్రంథమునకును నిజముగనే "పునర్జన్మము లేకుండఁగఁ" జేసినాఁడు.



# అనుతాపము

శ్రీమతి. కె. ఫ్లారెన్సు, [ప్రిమెట్రిక్.]

గీ॥ ప్రార్థనముపైన మాకుఁ ద ♦ త్వరత నిచ్చి
నీతి మార్గప్రవృత్తిపైఁ ♦ బ్రీతినించి
సత్యశోధనమున మా న ♦ సంబొసంగి
కరము శోభిల్లఁజేయు జ ♦ గత్ప్రభుఁడవు!

గీ॥ మాకొఱకుఁగాను నీపుత్రు ♦ మమతఁజేసి
పంపితివి; కాని, యాయన ♦ బాధలువడెఁ
దల్లి మరియమ్మ యెంతగాఁ ♦ దల్లడిలెనొ,
చిన్నికొమరుఁ డేసుక్రీస్తు ♦ సిలువమోయ?

# సావిత్రి

శ్రీమతి. వై. కౌసల్యాదేవి, (పిఠిమెట్రిక్కు.)

గీ॥ సత్యవంతుండు కానన ♦ స్థలికి నేగు
చుండఁగఁ, నతండు కనుఁ గొని ♦ యువిదకిట్లు
పలికె, "ఓలలితాంగి! న ♦ న్విడక యెట్లు
రాఁగలవొ, నీవు భీకరా ♦ రణ్యమునకు ?"

గీ॥ అంత సావిత్రి, "ఎందునా ♦ కాంతుఁడుండు
నాకగును స్వర్గతుల్యమో ♦ నాథ! యద్ది ;
కాన, ననుఁగూర్చి మీమది ♦ లోనఁ జింత
పడకుఁ"డన లేఁతనవ్వుట్టి ♦ పడఁగ ననియె॥

సత్య:— గీ॥ "అటులఁ గాదుసుమీ? సరో ♦ జాక్షి ! నేను
నెటులయినఁ బోఁగల్గుదు ♦ నెన్నఁడేని ;
అట్టి కాననమునఁ గాలు ♦ పెట్టనట్టి
నీవు వెనువెంటరాఁగ స ♦ హింపఁగలనె ?"

సావిత్రి:— గీ॥ "వినుఁడు, కాదది-సతికిఁ బ ♦ తి నెడఁబాసి
తా నొకఁటనుండఁజెల్లునే? నూనె లేని
దీపమెట్లు తేజమునిచ్చుఁ? దెలియ, జలము
లేని నది యెట్లుప్రవహించుఁ ♦ బ్రాణనాథ !

సత్య:— గీ॥ "అతివ ! అతిసుకుమారివీ; ♦ వాయడవి న
సాధుజంతువులుండును ♦ సత్య ; మెట్లు
రాఁగలవు ? వత్తు నొకముహూ ♦ ర్తంబులోనె
అంతదా కత్తమామల ♦ చెంతనుండు ॥"

సావిత్రి:— గీ॥ వాదులేటికి ? క్షమియింప ♦ వలయునను; మి
ముడిచిన నాదుతనువు ని ♦ లువదు-కరుణఁ
బూని మీతోడఁ దోడ్కొని ♦ పొం"డనంగఁ
దుట్టతుద నొప్పుకొనియె నం ♦ దుల కతండు ॥

# రూపాయ స్వీయచరిత్రము

శ్రీమతి. పి. సావిత్రి, [ప్రిమెట్రిక్.]

"చాలమంది నాజీవితచరిత్రమును జెప్పమని యడుగుచున్నారు. నామీఁద నొకప్రక్కనే నిప్పుడు జన్మించినది యున్నప్పటికి, నన్నే యడుగుచున్నందువలనఁ జెప్పఁబోవుచున్నాను.

నే నాఫ్రికాలో నొకగ్రామము దగ్గఱ జన్మించితిని. ఒకమనుష్యుఁడు నన్నక్కడినుండి యీ దేశమునకుఁ దీసికొని వచ్చెను. ఒక ముద్దవలెనున్న నన్నతఁడు టంకసాలకుఁ గొనిపోయి యచ్చట నొక్క రూపాయిగమార్చెను. అప్పుడు నాకుఁ జెప్పనలవిగానంత సంతోషము కలిగినది. నా కింతవఱకుఁ బ్రపంచమనఁగా నేమో తెలియదు. కాని నన్ను రూపాయగ మార్పించిన తరువాత. నతఁడు 'నీవింకను జిన్నదానవు. కావునఁ బ్రయాణముచేసి ప్రపంచజ్ఞానమును నేర్చుకొను 'మని పంపెను.

మొట్టమొదటగ నేను బ్రయాణముచేయుచు, నొక కవిచేతిలోఁబడితిని. ఆతఁడు నన్నాశీర్వదించుచు నొకపద్యమువ్రాసెను. 'తథాఽస్తు'ను నతని నోటివాక్యమునుబట్టి, నేను నాజీవితకాలమంతయు సుఖముగఁ గడపుదును గదా యని తలఁచితిని; కాని 'తానొకటితలఁప దైవమొకటి తలఁచె' నన్నట్లయినది.

నన్నొక సంవత్సరమువఱకును బ్రజలు కొనియాడుచుండిరి. నే నాఱుమాసములలో హైదరాబాదు - సికిందరాబాదు మొదలయిన పట్టణములన్నియుఁ జూడఁగలిగితిని. సంవత్సరాంతమున నొక ధనవంతునిచేతఁ బడితిని ఆతఁడు నన్నొక తిజోరీలోఁబెట్టెను. అక్కడ నాకుఁ జాలమంది స్నేహితులతోఁ బరిచయమేర్పడెను. ఒక మాసమైన పిదప నతఁడు తన నౌకరులకు జీతము లిచ్చుచుండఁగా, నేనొకనిచేతఁ బెట్టఁబడితిని. నన్నతఁడు తనతల్లి కియ్యఁగా, నామె లోభదూషితమైనందునఁ గొన్ని రూపాయలతోఁబాటు భూమిలోఁ బాతిపెట్టెను. కాని కొన్నాళ్ళకు మమ్ము పెట్టినకుండ కొద్దిదూరము జరిగిపోయెను. మేమెప్పుడును బ్రయాణము నే ప్రేమించెదము కాఁబట్టి మాస్థితికి జాలి విసుగు చెందుచుంటిమి. ఒకదిన మాగ్రామాధికారి వచ్చి యాయింటి ప్రక్కగా బావినిఁ ద్రవ్వింప మొదలుపెట్టెను. ఆసమయమున మేమున్న కుండ బయటఁబడెను. నౌకరులు దానిలో ధనముండుటజూచి, దానినిఁ దీసికొనిపోయి గ్రామాధికారి కిచ్చిరి. ఆముదుసలి యదివఱకే చనిపోయినందున నెవ్వరినడిగినను 'మాదికాదు. మాదికా'దని న్యాయముగఁ జెప్పిరి. అతఁడును బరులసొత్తు నేను దినననియాఁకుండెను రూపాయలను దానధర్మములు చేసెను. నన్ను దానముగఁ బుచ్చుకొన్నవాఁడు తనపైవచ్చిన 'కేసు' సందర్భమున నన్నొక 'వకీలు'కు సమర్పించు

కొనెను. ఆయన నన్నును, మఱికొన్నిరూపాయలను గలిపి, యుదారహృదయుఁడు గావున సుల్తాను బజారులోని 'బాలికల ఉన్నత పాఠశాల'కుఁ జందాగా నిచ్చెను. నేనిప్పుడు బాలికలఉన్నతపాఠశాలా ప్రధానోపాధ్యాయిని యొద్ద నున్నాను.''



# వ్యాధులు-మందులు.

శ్రీమతి. వ. ఇందిరాదేవి. [ఎఫ్. వై. ఎ.]

నాకొకనాఁడు జ్వరము వచ్చినది. అట్లు తలంచితి నేమో! నాగరకతకు, విద్యకు, 'మలేరియా'మున్నగువానికి ముఖ్యస్థానమగు బొంబాయికివచ్చి సరిగా నెలకూడ ముగియలేదు. పైఁజెప్పిన వేవియు నంటకపోయినను, జివరది మాత్ర మబ్బఁగలిగెను. నాస్నేహితురాలు లీల కూడ నాతో సమానభాగస్థురాలయ్యెను.

కాని యొకమాటయందు మా కైకమత్యము లేకుండఁబోయినది. చెప్పనద్దా మఱి? ఆమెకు నాకుఁ గలభేదమిది—మందుపై నాధారము నాకు; దానిపై రోఁత యామెకు.

నాకు 'డాక్టరు' వైద్యములపై నమ్మకము మెండు; కాన నేనొక 'రిక్షా' యెక్కి పోయి మందులషాపులోఁ గొన్ని యణాలు సమర్పించుకొని, డాక్టరు చెప్పిన మందునీళ్ళుగొని త్రాగుచుండెడిదానను.

'డాక్టరు'ను దనరోగుల కాకర్షణీయాముగఁ గనఁబడుచు, రెండు తోలుపట్టాలను రెండు చెవులలో నిఱికించుకొని, వ్యాధిస్వభావమును గనిపెట్టినవానివలె గంభీరముగ నుండుచు, 'థర్మామీటరు' నోటిలోఁ బెట్టుకొండనుచు, మొత్తముమీఁదఁ జాల హడావిడి చేయుచుండెడివాఁడు, అయినను, నదంతయు మనకెందులకు? అతని దగ్గఱకు వెళ్ళునది మందుకొఱకుగదా! ఏనీళ్ళో యిప్పించుకొని, గొంతులోఁ బోసికొని జబ్బు తగ్గుచున్నదనుకొనుచు, నూరుకొనవలెఁ గాని.

సరే; అసలు చెప్పవచ్చినదేమో మఱచినాను. ఆనాఁడు నేనుగూడ మందుకొఱకు వెళ్ళితిని. అందఱును డాక్టరుకొఱకు నిరీక్షించుచుఁ గూర్చొనియుండిరి. 'షర్టు' చేతులు మీఁదికిఁబెట్టుకొని, చేతు లూపుకొనుచుఁ, దనకు గడియారమున్నదని యందఱికిఁ దెలియవలయునని కాఁబోలు! దానివంక మాటిమాటికిఁ జూచుకొనుచుఁ జివరకు డాక్టరుగారు ప్రత్యక్షమైనారు. పరీక్షకై నేను లేచి నిలఁబడితిని. అది యైనపిమ్మట,

„నీకేమి జబ్బు?'' అని డాక్టరడిగెను.

„జ్వరము—తలనొప్పి—''

,,చలితో వచ్చునా?''

,,ఔను''

,, ఎన్నిదినములనుండి వచ్చుచున్న దీ జ్వరము ?''

,,మూఁడు దినములనుండి.''

,,సరి. నేననుకొన్నట్లే యైనది. మీరు త్వరగా డాక్టరుదగ్గఱ కెందులకురారు? ఇన్ని రోజు లయినతర్వాత దబ్బునఁ దగ్గునా ?

ఇంతలో గంటసేపటినుండి కాచుకొని యున్న యొక యనాగరకవనిత యందఱిని దఱుముకొనివచ్చి,,ఓడాక్టరయ్యగారూ! కడుపు నొస్తావుందండీ ! రెండ్రోజులయిం దింకతగ్గనే లేదండీ!''అని బాధాసూచకస్వరములోఁ దన గోడవను జెప్పుచుండగా, డాక్టరుగా రూరక చూచి, ఒకటిరెండు నిముసముల నొకచుట్టుతిరిగి నాయొద్దకు వచ్చి, ,,అప్పుడు నాలుకను జూపింపుమన మఱచితిని. ఏదీ! ఇప్పుడు చూపు!'' మనియెను. నేను నట్లేచేసితిని. కాని డాక్టరూరక నాకేసి చూచుచు నేదో పరధ్యానముగా నుండెను. నాలుకఁ దెఱచితినని జ్ఞాపకముచేసితిని. చూచి. ''ఓ! నీకు జ్వరమున్నది'' అని అనెను. అదివిని ''నాకు జ్వరమువచ్చినదని నాకుఁ దెలియనట్లుగా నాల్గుగంటలు నాలుకదెఱువుచున్న దిందుల కేనా?''యని నాలోగొణుగుకొంటిని. ''డాక్టరుగారూ! మెడనొప్పి''; ''డాక్టరుగారూ! కాళ్ళు లాగుచున్నవి'' యని యొక్కొక్కరుగ రోగులతనికిఁ జెప్పుచుండిరి; కాని యతనివైఖరినిఁ గనిపెట్టినవారి కామాటలలో నొక్కటియు నతనిచెవికెక్కినట్లు తోఁచలేదు. అతఁడు మాత్ర మన్నియుఁ దెలిసికొనుచున్న వానివలె, నేమేమో యొక్కొక్కచీటియందుఁగీసి యిచ్చుచుం డెను. అదే మాకు మహాభాగ్యమని యని పించుచుండెను. ఇంతకు నేనొక చీటినిఁదీసికొని మందిచ్చుచోటఁ గాళ్ళు గుద్దులుపట్టునంతసేపు నిల్వఁగా, నప్పుడీయఁబడిన మందుతో బండి కొఱకు కీవలకు వచ్చితిని. అచ్చటికి వచ్చి యెంత సేపటినుంచియో కనిపెట్టుచున్న లీల యప్పుడు చేరువకువచ్చి నవ్వినది. నేను సీసాయందలి మందును గుటుక్కున మ్రింగితిని.

* * * * * *

నేను దీసికొన్న మందువలన ఫలమేమి యుఁ గనఁబడలేదు. లీల వేఁకువనే లేచి చన్నీళ్ల స్నానముచేసి నన్నుఁ బడకనుండి లేపినది.

''ఇదేమి? నిన్న జ్వరము, ఈనాఁడు చన్నీళ్ళ స్నానమా?'' అని యంటిని.

,,నాకు జ్వరమప్పుడే తగ్గినది.''

,,లీలా! ఈదినము నీవే మందు త్రేవల యునుసుమా! నాకు నిన్నటికంటె బలహీన ముగ నున్నది'' అని యొకరూపాయితీసి యా మెకిచ్చితిని. అట్లే నాల్గురోజులు గడచినవి. నాల్గురూపాయలతో నానిస్త్రాణ తగ్గెను.

నాస్నేహితురాలు--లీల—నాకుఁదగ్గినందుల కభినందించుచుఁ జిఱునవ్వుతో నొకకలము నిచ్చి తన ప్రేమచిహ్నముగ నుంచుకొనుమని ప్రార్థించెను. నేను దానివంకఁ జూచుచుండ, ,,ఇది నీదే! నేను నీడబ్బుఁ దీసికొని లాభపడఁ దలఁచుకొనలేదు. నే నీ నాల్గురోజులనుండియు, డాక్టరు దగ్గఱకు వెళ్ళనేలేదు. ఆమందు నేనే యిచ్చితిని'' అని చెప్పెను.

,,ఏమి?'' అని యాశ్చర్యముతోనంటిని.

,,నీళ్లు- నిమ్మరసము-కొంత 'క్వినైను' కలిపి డాక్టరుమందువలెనే-అంతకంటెనయమే- ఇచ్చితిని. నీవిప్పుడు నామోసముచేఁ ద్వరగా బాగుపడితివి.''

''లీలా! మోసమా ?—ఇప్పటి నా సంతోషమునకు మేరగలదా ? నేను నీఋణమెట్లు దీర్చుకొందునో యెఱుఁగలేకున్నాను. అందు కనియే మనపెద్దలు ,మిత్రమాపత్సుజానీయా' త్తని యన్నారు.''

'సరి. సరి. బాగున్నది. ఈవిషయమును

మాతృభారతిలో వ్రాయకుసుమా !!'





# స్త్రీవిద్య.

శ్రీమతి. ఇందుమతి.

ఒకానొక యూరిలో నొక తల్లి, కుమారుఁడు నుండిరి. వివాహవయస్సు రాఁగానే యతని కొక పిల్లనుదెచ్చి పెండ్లిచేసిరి. ఆమె పేరు కమలావతి. ఆమె వైదవఘార మింగ్లీషు చదువు చుండెను. ఆమె యట్లు చదువుకొనుట పెనిమిటి కిష్టము; అత్తగారికిఁ దలకంటగింపు.

ఒకదినమున నామె తన వియ్యంకుని యింటికిఁబోయి తనకోడలినిఁ గాపురముసేయఁ బంపుమని కోరెను. అందుపై వారు 'మాపిల్ల చదువుకొనుచున్నది. పరీక్షలు కాఁగానే పంపెద'మనిరి. ఆమె వారిని నిష్ఠురములాడఁగా వారు తిట్టి వెడలఁగొట్టిరి. ఆమె తనయింటికి వచ్చి తనకుమారునికిఁ దగ్గఱగా నిలుచఁబడి యేడ్చు చుండెను. ఆమెపే రన్నపూర్ణ; కుమారుని పేరు కేతరాజు.

కే:- అమ్మా ! సంగతిచెప్పకుండ నెందుకే యేడ్చెదవు ?

అ:- పెండ్లామును బి. ఎ. చదివించు; కూలిపనిని నాచేఁ జేయించు.

కే:- అదిసరే! అసలు విషయముచెప్పు.

అ:-సన్నమధ్యాహ్నము నేను మీయత్తగారింటికి వెళ్ళి కోడలినిఁ బంపుఁడని యడుగఁగా, వారు, 'మా అమ్మాయి చదువుకొనుచున్నది, పరీక్షలు ప్యాసయిన తరువాతఁ బంపుదుమన్నారు'' అని వెక్కి వెక్కి యేడువసాగెను.

కే:- తర్వాత నేమాయెను ?

అ:- ఇంకేమున్నది ? అందరు నన్నన్ని వైపుల దూయఁబట్టి, చాలచీవాట్లుపెట్టి వెళ్లఁగొట్టి—

కే:-అప్పుడే పనిలేక యెందుకనివెళ్లితివి?

అ:- సరేగాని, యింకను దానికిఁ జదువెందుకురా ?

కే:- ఎందుకా ! చదువుకొన్న యాడువాండ్లెక్కడ నెట్లుండవలెనో, గృహ మె

ట్లుంచుకొనవలెనో, మర్యాదలన్న నెట్టివో, తెలియును. చదువుకొనుచుండఁగా మన కిప్పుడేమి మునిఁగిపోయినది ?

అ:- ఊళ్లోవాండ్రు 'ఫలానా' అన్నపూర్ణ కోడలు 'మెట్రికు' చదివినదని యెంత యాక్షేపింతురో తెలియునామటి? నీకింత యిష్టమున్నప్పుడు నే నెంతచచ్చిన నేమున్నది ?

అని గిరుక్కునఁ దనపనిపై వెడలిపోయెను.

కొన్ని దినములకుఁ గమల యత్తగారింటికి సెలవులలో వచ్చెను. ఒకనాఁటి సాయంకాలమునఁ గేతరాజు కమలతో 'షికారు పోవుదము; వత్తువా?' యని యడిగెను.

కమల:- ఇదుగో! వచ్చుచున్నాను.

అని యింటిలోనికిఁబోయి పట్టుచీరెను బట్టు రవికెను దొడుగుకొని. స్లిప్పర్సు వేసికొని వచ్చినది. ఇంతలో నత్తగారు బయటికి వచ్చెను.

అ.- అయ్యయ్యో! ఎక్కడికీ వేషముతో వెళ్ళుట ? 'నీకోడ లేనమ్మా?' యని నలుగురు నన్నెంతదూషింతురో తెలియునా? మాట్లాడక యింట్లోకూర్చో.

కమల:- కావలసినంత మాత్రము బట్టలు వేసికొని, వీధిలోఁ జాల యశుభ్రముగా నుండుటవల్ల కాళ్ళకుఁ జెప్పులు వేసికొనుట తప్ప? మీరనకున్న చోజాలు; ఊళ్లోవా రెవరు ననరు.

అ:- అత్త నెదిరించి మాట్లాడుటయా నీవు చదువుకొని మాకుఁజేయవచ్చిన ఘనకార్యము? ఇంకను నిలఁబడి యుంటి వేమి యింటిలోనికి రాక?—ఇంతలో మామగారు రాఁగాఁ గమల యింటిలోపలికి వెళ్ళెను.

తండ్రి:- ఓరీ! అదేమిటిరా ? ఆలాగు పెండ్లాము నెదురుగా నిలుచోఁబెట్టుకున్నావు ?

కే.- తప్పేమున్నది?

తండ్రి:- అబ్బబ్బా! మే మీ యింటిలో నుండరాదు. కన్నకొడుకే మమ్మ్మ బెదిరించుటయా ? అని భార్యతోఁగూడ వెడలిపోవును.

వారు మఱొక యిల్లద్దెకుఁ దీసికొని యుండిరి. కమల కొన్నిదినములకు 'డాక్టరు పరీక్ష' ప్యాసైనది.

ఒకరోజున నన్నపూర్ణ కకస్మాత్తుగా జబ్బుచేసినది. కేతరాజది విని తల్లియొద్దకుఁ బోయి, "అమ్మా! డాక్టరును బిల్పింతు" నని చెప్పి, యెవ్వరికిఁ దెలియకుండఁ దనభార్యను గమలను—బిలిపించెను. ఆమెయు వెంటనేవచ్చి యన్నపూర్ణ జబ్బును నిమిషములమీఁదఁ గుదిర్చెను. ఆమె 'అమ్మయ్యా!' యని బాధయంతయుఁ దీఱిపోఁగాఁ, 'డాక్టరు'కుఁ దన కృతజ్ఞతాసూచకముగ నమస్కరింపఁబోయెను. కమల చివాలునలేచి యింటికిఁబోయెను.

అన్నపూర్ణ యడిగినమీఁదఁ గేతరాజు 'డాక్టరు'నుగూర్చి ముచ్చటించుటలోఁ నామె తనకోడలగు కమలయే యని తెలిపెను.

అ:- ఏమి! నాకోడలు కమలయా డాక్టరు? నాకు మఱలఁ బ్రాణదానము చేసినది కమలయా ?

కే:- ఔనమ్మా! ఔను.

అ:-అయ్యో!అది యిక్కడనే యున్నప్పుడు చెప్పవైతివేమి? నా నేరమునకు క్షమార్పణము కోరియుండెడిదాననేగదా!—

కే:- అమ్మా! అట్లనకు. ఇప్పుడుమాత్రము మించిపోయినదేమి? చూచితివా? ఎందులకైన మేలని నీకోడలికి 'డాక్టరు' చదువు చెప్పించితిని.

అ:- మంచిపని చేసితివి.

—:o:—

# ప్రహ్లాదుఁడు

శ్రీమతి. వి. లక్ష్మీదేవి, (పిఠాపురం.)

—♦ హిరణ్యకశిపుఁడు ♦—

గీ॥ బాల! రమ్మింక, నీదగు ♦ పట్టుచాలు;
విష్ణుదేవుని స్మరణంబు ♦ విడిచి వేగఁ
దలఁపులో నాప్రభావముల్ ♦ దలఁచుకొనుచు
నింక నీవిందు సుఖముండ ♦ నెంతువేని ॥

—♦ ప్రహ్లాదుఁడు ♦—

గీ॥ అయ్య! నీవేమి యైనను, ననుము; నీకు
నాదు దేవుని స్మరణము ♦ నచ్చకున్నఁ
బూని పొమ్మన్న నెచ్చటి ♦ కైనఁ బోదుఁ
గాని, శ్రీహరిన్ మఱచుట ♦ కానిమాట ॥

—♦ హిరణకశిపుఁడు ♦—

గీ॥ అయినఁ బ్రహ్లాద! నీవిట ♦ కరుగుదెంచి
చూడు మీ గిన్నెయందలి ♦ శుద్ధవిషము;
అచ్యుతుని భక్తినే మాన ♦ వైతివేని
సత్వరము దీనినిం ద్రాగి ♦ చావవలయు ॥

—♦ ప్రహ్లాదుఁడు ♦—

గీ॥ నేను విషమును నెట్టుల ♦ నైనఁ ద్రావి
చిత్తమాహరిపైఁ జేర్చి ♦ చత్తుఁగాని,
వీలుగాదయ్య, యాతని ♦ విడఁచు టనిన;
అతని నమ్మిన సర్వసౌ ♦ ఖ్యమ్ము లబ్బు ॥

# మా చి న్ని క థ లు.

## అ ను మా న ము.

శ్రీమతి. పి. సావిత్రి, [పిఠాపురము.]

ఒక యూరిలో నొక బ్రాహ్మణుఁ డుండెను. అతని కనుమానమ మెండు అనుమానము వలదని యెన్నిసారులు చెప్పినను వినఁడు.

ఒక దిన మతఁడప్పుడే వచ్చిన 'మాతృభారతి'ని మంచముమీఁదఁ బరుండి చదువుకొనుచుండెను. అప్పుడొక కిచకిచశబ్దము వినఁబడెను. అనుమానము కలవాఁడు కాఁబట్టి పైకిఁజూచెను. ఒకబల్లి కనఁబడెను. అంతే గదా! యని మఱలఁ జదువుకొనుచుండఁగా నది యతని బొజ్జపైఁబడెను. వెంటనే యతఁడు లేచి కూర్చొనఁగా, బల్లి యతని బొజ్జలోఁబడి యూపిరాడక ప్రాణములు విడిచెను. ఎంత చూచుకొన్నను దన కడుపుపై లేకపోవుటచే నది కడుపులోనికిఁ బోయినదని భయముఁజెందెను. కొంచెముసేపటి కతనికి జ్వరముకూడ వచ్చెను. ఇంటివారు వైద్యునిఁ బిలిపింపఁగా, నతఁ డావిషయమును గనిపెట్టి, 'నీ వెందులకు భయపడితివో జరిగిన వృత్తాంతమును జెప్పు' మనెను. కాని యతఁడు మొదటఁ జెప్పలేదు గాని, వైద్యుఁడు బలవంతపెట్టినందున, జరిగిన వృత్తాంతమంతయుఁ బూసగ్రుచ్చినట్లు చెప్పెను.

వైద్యుఁడు వాంతియగుట కప్పుడొక మందిచ్చెను. దానినిఁ ద్రాగి యాబ్రాహ్మణుఁడు వాంతిచేసికొనెను. వైద్యుఁడొక చనిపోయిన బల్లినిఁ దెప్పించి, యావాంతిలో వేయించెను. 'ఇదిగో నీవుచేసిన వాంతిలో బల్లికూడ వచ్చినది; భయపడవల'దని చెప్పిపోయెను. వెంటనే యతఁ డారోగ్యవంతుఁడయ్యెను!

అనుమానము ప్రాణసంకటమే సుమండీ!

---

## త గ్గిం పు.

శ్రీమతి. ఇందుమతి.

జీతముల తగ్గింపు సందర్భమున నొక యుద్యోగి జీతమును సగము తగ్గించిరి. అందుల కతఁడు చాల చింతపడి యింటికిఁబోయి, భార్యతోఁ దనజీతముసగంతి చెప్పి, రేపటినుండి నీవింటిలోని వస్తువుల నన్నింటిని దగ్గించి వాడుచుండు'మని వెడలిపోయెను.

భోజనము వేళ యయ్యెను. అతఁడింటికి వచ్చెను. భార్యయు నతని మాటచొప్పున మామూలుకన్న సగముగఁ గూర, పచ్చడి, అన్నము మొదలైనవానిని వడ్డించెను. అవితిని యింకఁ గొంచెమన్నము కోరఁగా, భర్తతో 'నిన్ననేగదా! మీ రన్నిఁటినిఁ దగ్గింపు'మని చెప్పితిరి! ఇంక నన్నములే' దనెను. అతఁడు పక్కున నవ్వి, 'అయ్యో! అన్నము తినుట తగ్గించినచో బ్రదుకు టెట్లు? ఇంకఁ గొంచెము

పెట్టు'మని గద్దించి వేయించికొనెను. ఎట్లో భోజనతంతును బూర్తిచేసికొని 'కచ్చేరి'కిఁ బోయె నాతఁడు.

సాయంకాల 'మాఫీసు' నుండి వచ్చుచు భార్యబిడ్డలకొఱకు మల్లెపూలు కొనితెచ్చి 'పిల్లలకు ముచ్చటగా జడకు ముందుగఁ బెట్టివేయు'మని చెప్పెను. ఆమెయు 'ఇప్పుడు పూలెందుకండీ?' యని పిల్లలను జూపఁగా, 'అయ్యో! వాండ్రజుట్టు కత్తిరించితివే? ఇదా నీ తగ్గింపు?' యనుచు 'పోనీ! నీవైనఁ బెట్టుకొ'మ్మని పలికెను. కాని యామెయు, 'నాకు మాత్రము పూలెందు'కని తనజుట్టునుజూపెను. 'అయ్యో! పాపిష్ఠురాలా! నీజుట్టుకూడఁ గత్తిరించుకొంటివఁటే?' యని యగ్నివర్షము గురిపించెను.

'అన్నిఁటితోఁ బాటదిమాత్రము తగ్గింపవలదా?' యని యామె బదులుచెప్పెను.



# శంకరాభరణ రాగము.

శ్రీమతి. పి. కమల, [మూడవ ఫారము.]

శంకరయ్య యొక మనుష్యుఁడే. ఒక యూరిలో నుండేవాఁడు. అతనికి 'శంకరాభరణరాగము' బాగుగా వచ్చును. ఎక్కడికిఁబోయినను, నెక్కడఁగూర్చున్నను, నతని కదియే యాలాపము. మీఁదుమిక్కిలి 'శాంకరీ .....

........................................

యని రాగపుటెత్తుగడ. అతఁడు పాడునప్పుడు మనుష్యులేకాక, పక్షులుకూడఁ జెవులు పెట్టి వినుచుండెడివి. అంత బాగుగా నితఁడా రాగమును బాడఁగలఁడన్నమాట.

ఒకరోజతనిని బరిహాసము చేయఁ దలఁచి కొందఱు స్నేహితులు సాయంకాల విహారమునకయి తమవెంటరమ్మనిరి. పిలిచినదే తడవు! 'ఓ!' యన్నాఁడు; వారితోఁ బోయినాఁడు శంకరయ్య. పచ్చికబయళ్లకేసి మెల్లఁగా దారిదీసినా రందఱును. ప్రక్కగా నొక వనము. చల్లనినీడ. శాఖామృగము లొక్కచెట్టుపైనుండి యొక్కచెట్టుపైకి గంతులు వేయుచుండెను. ఆవన మెంతయుఁ జూచుటకు రమ్యముగా నుండెను.

శంకరయ్య యూరకున్నాఁడా? ఊఁహుఁ. మెల్లఁగా శ్రుతి మొదలుపెట్టినాఁడు. ఆశ్రుతి కానురా నొక పాటగాఁ బరిణమించినది. ఇఁక నాపాటను దనకుఁగల పెద్దగొంతుకతో మిక్కిలి పెద్దగాఁ బాడ మొదలుపెట్టినాఁడు. ఎవ రూరకించిన నూరుకొనఁడు. పాట వినురేగాని బదులుమాట లేదు. ఐన నతనితోఁ బాటు వాగుట లాభము లేదని చెప్పి, వానికి మెల్లఁగ నొక చద్దిమాటనిచ్చి, 'ప్రక్కఁగా నొకదే

యున్నదిగాని, నాయనా! నీయిష్టము వచ్చినంత సేపు పాడుకొమ్మని చెప్పి, స్నేహితులందఱు నక్కడ నిలువక వారియిండ్లకు వెళ్ళిపోయిరి.

రాగాలాపముతోనే శంకరయ్య లేచినాఁడు. చద్దిమూట నొక చెట్టుకొమ్మకుఁ దగిలించినాఁడు. మఱలఁ గూర్చొని పాటసాగించినాఁడు. పాటకొఱకుఁ బక్షులు వచ్చినవి; చద్దిమూటను జూచినవి. మూటలోని యన్నమంతయుఁ దిని యెగిరిపోయినవి. అప్పుడతఁడు పాటను జాలించెను. అసలు పాటచాలించక పోయేవాఁడే గాని, కడుపులో మలమల మాడినది. దానికిఁదోడు చద్దిమూట 'సా' ఫయినది. ఏదోయొక తప్పుఁదోవను బోయి యొక్క యూరినిఁ జేరినాఁడు.

అక్కడ నొకరింట బీదలకు భోజనము పెట్టుచుండిరి. శంకరయ్యయుఁబోయెను. భోజనపంక్తిలోఁ గూర్చున్నాఁడు. 'శంకరీ...... ............................ యని రాగము ప్రారంభించినాఁడు. ఆయింటి యిల్లాలిపేరు శాంకరి. ఆమె కఱకాలిమంట నెత్తికి వచ్చినది. 'ఏమిటయ్యా! నీమొగము పాట?' యని యతనిని లేవఁగొట్టి పంపివేసినది. ప్రాయశ్చిత్తమైనది కాన, శంకరయ్య యింకెప్పుడా రాగము పాడలేదు.



# మానవసేవ ఈశ్వరసేవయే

శ్రీయుత. కె. రామమూర్తిగారు, [ద్వితీయ సహోపాధ్యాయులు.]

అది యొక ప్రశాంత నిశీథము. ప్రకృతికాంతగూడఁ బ్రశాంతముగ నిద్రపోవుచున్నట్లున్నది. అట్టితరుణమున నొకపుణ్యపురుషుఁడు తన గదియందు గాఢసుషుప్తినిఁ జెందియుండెను. పరమభాగవతోత్తములకు, నిర్విచారులకుఁ, బరోపకారపరాయణులకు, జగత్కల్యాణ వాంఛితులకు, సర్వభూతదయాళురకు, సర్వసోదరభావులకు సుఖనిద్రగాక కలవరపా టెక్కడిది? ఆసుఖనిద్ర నొందుచున్న పురుషుఁడే 'ఆడము'. ఆతఁడు కలఁగాంచినట్లు మేల్కొనెను. అతనికిఁ దనగదియందొక వింతదృశ్యము గోచరించెను. గదియంతయు నొక దివ్యకాంతిమయమై యుండెను. ఆకాంతిమధ్యమున నొకదివ్యవ్యక్తి సువర్ణాక్షరములతో నేదియో వ్రాయుచుండెను. అతఁడొక దేవదూత.

ఆడము స్థిరచిత్తుఁడు. శాంతస్వభావుఁడు. ఆశాంతస్వభావమే యతనికి ధైర్యోత్సాహములను గల్పించినది. ఆడ మాదివ్యపురుషునితో 'ఏమివ్రాయుచున్నా?' వనెను. ఆనూతనవ్యక్తి 'భగవద్భక్తుల నామములను వ్రాయుచున్నా

నని ప్రత్యుత్తర మిచ్చెను. ఆడము 'నాపేరు గూడ నందుఁగలదా ?' యని ప్రశ్నించెను; కాని వెంటనే 'లే'దని ప్రత్యుత్తరమును బడసెను. ఆడ మందులకు నిరుత్సాహుఁడు కాలేదు. పిమ్మట శాంతముగఁ దన నామధేయమును మానవసేవాపరాయణుల పట్టికలోఁ జేర్చుమని పలికెను. ఆ యపూర్వవ్యక్తి యట్లనే వ్రాసి యంతర్హితుఁడయ్యెను.

మఱునాఁటి రాత్రి మఱల దివ్యజ్యోతిర్మయవేషముతో నానూతన పురుషుఁ డరుదెంచెను. ఆతనిచేతియందు దొక పట్టిక కలదు. అయ్యది భగవానుఁడు ప్రేమించినవారి పేర్లను దెలుపుపట్టిక. అందు మన ఆడముపేరే మొట్ట మొదటిది.

ఆడ మది చూచి యాశ్చర్యచకితుఁ డయ్యెను. దివ్యపూరుషునితోఁగూడ నావింత జ్యోతియు నదృశ్యమయ్యెను.

---

అతఁడొక కర్షకుఁడు. స్వార్థత్యాగి. నిష్కామయోగి. మానవసేవాధురంధరుఁడు. జీవితనాటకములోఁ జివరయంకములో నున్నాఁడు. కుటుంబికుఁడు. నిరాడంబరజీవి.

సాధారణముగా వార్ధకములోఁ దీర్థయాత్రలుసేయుట యాచారము. అట్లే యతఁడు కూడఁ బుణ్యక్షేత్రమగు 'జెరుసలెము'నకుఁ బోవ నిశ్చయించినాఁడు. అందులకు వలయు ధనము, వస్తుసామగ్రిఁ గూర్చుకొన్నాఁడు.

ఆపురమునందే యొక వర్తకశ్రేష్ఠుఁడు గలఁడు. ఆతఁడు వ్యాపారముచేసి విశేషధనము సేకరించినవాఁడు. తానుకూడఁ బోవలెనని యభిప్రాయము. కాని వ్యాపారమును గుమారునిపై విడిచిపో మనసుపుట్టలేదు. తోడిబంధువులు కర్షకసోదరులతో యాత్రకుఁబోవఁ బ్రోత్సహించుచున్నారు. వ్యాపారము సన్నగిలునేమో యను భయమునఁ బోవుటకుఁ గాళ్ళు రావు. పోవకుండుటయు బాగుగలేదు. ఎట్టకేలకుఁ బోవుటకే నిశ్చయించినాఁడు.

ఇరువురును యాత్రకు బయలుదేఱినారు. కర్షకుఁడు నిశ్చింతగ భగవద్దర్శనార్థమేగుచున్నాఁడు. వణిజుని చింత యెల్లప్పుడు యింటిమీఁద, వ్యాపారము మీఁద. సరే. సాగి కొంతదూరము వెళ్ళినారు. ఇప్పటివలె నప్పుడు రైళ్ళులేవు; కాలినడకనుబోయి యే రేవుపట్టణమో చేరి, యోడప్రయాణముచేసి, మఱల కాలినడకతో యాత్రాస్థలమును జేరవలయును. అది మనపూర్వులు కాశీయాత్రకు వెళ్ళినట్లే శ్రమపడి.

దారిలోఁ గర్షకునికి దాహమువేసినది. సమీపమందలి పొలములోని గృహమునకు నీరముకొఱకేగెను. పాపము! అందొక ముదుసలి, యామె కొడుకు, కోడలు, నిర్వురుబిడ్డలు తిండిలేక స్పృహతప్పి పడియుండిరి. వృద్ధురాలు మన పురుషునిఁజూచి నీటికొఱకు సంజ్ఞచేసెను. అతఁడును బావికిఁబోయి నీరుదెచ్చి యామెకుఁ ద్రావనిచ్చి శైత్యోపచారములుచేసి, వారికందఱికి స్పృహ గలిగించెను. పిదపఁ దనయొద్ద నున్న రొట్టెను వారికిఁ గుడువఁబెట్టి, ప్రాణము నిలిపెను. అనంతరము వారికథ విని యొకనెల గ్రాస మింటఁ దెచ్చిపడవేసెను. ఆ యజమానికి బండి నెద్దులనుదెచ్చియిచ్చి వ్యవసాయమునకుఁ దగిన సదుపాయములను జేసెను. పిల్లల పాలకొఱకొక యావునుగూడఁ గొననిశ్చయించెను. ఇంతలో నిరుగుపొరుగువారు తన్నుఁగూర్చి

పలుకు స్తుతివాక్యములను విననొల్లక వెంటనే యెరికినిఁ దెలియకుండ నాతావువదలి బయటికి వచ్చెను. స్తుతిపాఠములను వినుట సజ్జనలక్షణము కాదుగదా!

ప్రయాణమునకుఁ దెచ్చిన ధనము సామగ్రి దాదాపంతయు నయిపోయినది. మిగిలిన కొలఁది సొమ్మును బ్రయాణమునకుఁ జాలదు. అంతట భగవానుని దయ యంతే యనుకొని, నిర్విచారముగ నింటి కే తెంచెను.

అట నున వణిజుఁడు తన మిత్రునికొఱకు వేచివేచి విసిగి తనకన్న ముందుగ నేగె నేమోయని ప్రయాణము సాగించి యెట్టకేలకు యాత్రాస్థలము చేరెను. దేవాలయములోని కేగునరి కతనికొక యపూర్వదృశ్యము గోచరించెను. మనకర్షకుఁడు మఠాధిపతులు మున్నగు శ్రేష్ఠు లలంకరించు నున్నతస్థానమున నున్నట్లు కన్పట్టెను. వణిజుఁ డాశ్చర్యచకితుఁ డయ్యెను. ఆతనిఁ గలిసికొని యట్టి స్థానము నెట్లు పొందఁగల్గెనో తెలిసికొనఁగోరెను. అందఱును వెడలిపోయిరి; కాని మన కర్షకుఁడు కానఁబడలేదు. నిరుత్సాహుఁడై యాత్ర ముగించుకొని యింటికి మఱలెను.

కర్షకుఁడు యాత్రికుఁ బోవలేదుగదా! అట్టిచో నతనిరూప మెట్లున్నతస్థానమున గోచరించినది? అతఁడు చేసినపని యెద్ది? మానవసేవ. అందులకే యతని కా యున్నతస్థానమబ్బినది. కావునఁ బాఠకులారా! ఈచిన్ని కథలు మానవసేవ యీశ్వరసేవయే యనుటకుఁ దగిన నిదర్శనములు కావా?

—)o(—

# సూర్యోదయము.

శ్రీమతి. వి. ఆర్. కోమలవల్లి, (ప్రిమెట్రిక్.)

గీ॥ తూర్పుదిక్కున నెఱ్ఱనై ♦ తోఁచె గగన, మంతఁ గఱకలనుదయించె ♦ నహిమకరుఁడు
ఎలమి గొల్పుచునున్నదా ♦ యెఱ్ఱరంగు, తీగుతీరుల నెంతయు ♦ మాఱుచుండి॥

గీ॥ కొంతతడవునఁ బ్రసరించెఁ ♦ గాంతులెల్ల, పుష్పితోద్యాన లతలపై ♦ బొలుపుమీఱ
లేఁతయాకులు బంగారు ♦ పూఁతవడసి, చెట్లకంతకు వన్నె హె ♦ చ్చింపఁజొచ్చె॥

గీ॥ తూర్పుదెసనుండి పడమర ♦ త్రోవఁబోవ, బాటసారి విధంబునఁ ♦ బయనమునకుఁ
బాలుపడు సూర్యునింజూచి ♦ పంకజములు, సత్కరించుచునున్నవి ♦ సంతసమున॥

# విద్యా ప్రభావము

శ్రీయుత. బి. మణి, [పిరిమెటిక్సు.]

ఒకనాఁడు లక్ష్మియు సరస్వతియు 'నేనే పెద్ద, నేనేపెద్ద' యని వాదించుకొనఁజొచ్చిరి. లక్ష్మి 'నాకటాక్షమున్నయెడలఁ బ్రజలకు సుఖము కలుగును; కావున నాశక్తియే యధిక'మని చెప్పెను. అందులకు సరస్వతి 'ఎంత సంపదయున్నను, విద్యయు బుద్ధియు లేకపోవునేని యేసౌఖ్యము నుండదు. కావున విద్యకును బుద్ధికినిఁ గారకమైన నాశక్తియే గొప్పది' యనెను. ఇట్లు వీరిర్వురును దమతమ శక్తులను బరీక్షించుకొనవెంచి పోవుచుండిరి.

దారిలో నొకచోట గుట్టలును గులకఱాలును గల పొలమునం దొక కాఁపువాఁడు బక్కయెద్దులను నాఁగటికిఁ బూన్చి యవిత్వరగా నడువనందునఁ గొట్టుచుండెను. లక్ష్మి సరస్వతులు వానిఁజూచి, 'వీనికంటె మూఢకర్షకుఁడు వేఱొకఁడుండఁబోవఁ'డని యతనిపైఁ దమతమ ప్రభావమును బ్రకటింపఁ దలఁచిరి. లక్ష్మి కటాక్షప్రసారమువలన ఱాలన్నియు రత్నములయ్యెను; కాని సరస్వతి వానిబుద్ధిలోఁ బ్రవేశించి వానియందతనికి నిస్పృహ గల్పించెను.

అప్పుడొక వర్తకుఁ డాదారిఁబోవుచు, నాపొలములోని రత్నములనుజూచి, 'ఇది యీ కాఁపువాని పుణ్యమువలనఁ గల్గిన'దని యాశ్చర్యపడి, తన బండి పట్టినన్ని రత్నముల నెత్తి నింపుకొని కాఁపువానినిఁ దనవెంట రమ్మనఁగా వాఁడు రానసెను. తన యీ గొప్పభాగ్యమునకు వాఁడే కారణము గావున, బలవంతముగ బండిలో వేసికొనిపోయెను. అది మొదలు వర్తకుఁడు రాజులకుఁగూడ డబ్బప్పిచ్చుచుండెను. అందుచే నతఁడు ధనపాలుఁడని పేరొందెను. అట్టి పరిస్థితులలోఁ గూడఁ గాఁపువానిని మఱవక, యతనికి మంచి వస్త్రములు, భోజనము నొసఁగుచుండెను. లక్ష్మిదేవి కాఁపువానికి రాజులకుఁ దగిన స్వరూపమిచ్చెను.

ఆ దేశాధిపతి కొక కుమారి గలదు. ఆతఁడు వర్తకునిఁ బిల్చి 'ఓయీ! నీవు దేశములు తిరుగుచుండెదవు గాన నాకూతునకుఁ దగిన రాజకుమారుని వరునిగాఁ జూడు' మని యాజ్ఞాపించెను. వర్తకుఁడును దన యింటియందున్న కాఁపువానినిఁ బిల్చి, యూరిబయట నొకగుడారమును వేసి యందులోనుంచి వచ్చి రాజుతో 'అయ్యా! ఒక రాజకుమారుఁడువచ్చి యూరిబయట నున్నాఁ' డనఁగా, నతఁడును జాల సంతోషించి యతనికొఱకుఁ బోయెను. లక్ష్మి దత్తమైన స్వరూపముతో సుందరముగ నున్న కాఁపువానిని రాజకుమారునిగఁ దలఁచి, యతనినిఁ దననగరునకుఁ దోడ్కొనివచ్చి, శుభలగ్నమునఁ దనకూతురితోడి వివాహమునకుఁ గూర్చొనఁబెట్టినప్పుడు, వాని కకస్మాత్తుగాఁ దనయెద్దులును, నాఁగలియు జ్ఞాపకమునకు వచ్చి యేడ్వ

సాగెను; కాని వ ర్తకుఁ డేమనునోయను భయమున, వెంటనే యూరకుండెను.

పెండ్లియైనది. కాపువాఁడు రత్నపురి లక్ష్మీకుమారుఁడని పిల్వఁబడసాగెను. కాని యెన్నియోసొమ్ములను ధరించియున్న రాజకుమారినిఁజూచి పెద్దపిశాచమని భయపడెను. తరువాత శయనగృహమునకుఁబంపఁబడి,యచ్చట రాజకుమారినే చూచి 'అమ్మయ్యో' యని గవాక్షముగుండ దుమికి పోఁజూచెను. కాని క్రింద యగాధమైన గొయ్యియైనందున నేమిచేయుటకును దోఁచక యట్లే కిటికీమవ్వలు పట్టుకొని వ్రేలాఁడసాగెను.

అప్పుడు లక్ష్మీసరస్వతులు ప్రత్యక్షమైరి. సరస్వతి తన య త్తగారితో 'నీకృప యెంతయున్నను, నెంతధనమున్నను, బుద్ధియొక్కటి లేనందున నేమిప్రయోజనము ? మన యిర్వురిలో నెవ్వరియోగ్యత యధికమందు ?' వని ప్రశ్నింపఁగా, నామె 'సరస్వతీ! నీదే, ముమ్మాటికిని నీదే' యని సమాధానమిచ్చెను.

తరువాత వా రా కాపువాని ననుగ్రహించ, యాపత్తునుండి తప్పించిరి. వాఁడును రాజకుమారితో సుఖముగ నుండెను.

విద్యాప్రభావ మెట్టిదో చూచితిరా !





# ధ్యా న ము.

శ్రీమతి. యన్. భారతీ రత్నాకరాంబ, [ప్రిమెట్రిక్].

గీ॥ శంఖచక్రములును, గదా ♦ జలజములుచు, జిలుగు పీతాంబరంపుఁ గు ♦ చ్చెళ్ళ చెలువు
నుజ్జ్వలంబయి యొప్పాఱు ♦ చున్న నీదు, రూపమును నేను ధ్యానింతు ♦ రూఢి దేవ !

శా॥ ఎన్నో జన్మములం బొనర్చితిని; నే ♦ నెన్నోగిరుల్ చూచినా
నెన్నో తీర్థములందుఁ గ్రుంకిడితి; నిం ♦ కెన్నెన్నియో కాంచితిఁ.
అన్నింటిఁ వలదంచుఁ బోవిడిచి, యా ♦ హా! కౌతుకం బొక్క నీ
సన్నామస్మృతియందు నిల్పితిని. నో ♦ స్వామీ ! జగద్రక్షకా !

కం॥ ప్రోచితి వటు ప్రహ్లాదునిఁ, గాచితి విందాదిసురులఁ ♦ గడు మన్ననతోఁ
జూచితివి మును గజేంద్రునిఁ, గాచుట భరమానె నన్నుఁ ♦ గరుణాసింధూ !

గీ॥ పాపురాలను సుమ్ము నేఁ ♦ బరమచరిత ! దీనురాలను మఱి నేను ♦ దివ్యచరిత !
భ క్తిరహితను బ్రోవుమో ♦ భవ్యచరిత ! ధన్యురాలను జేయుమో ♦ ధన్యచరిత !

# కైక - మంధర.

శ్రీమతి. వి. లక్ష్మీదేవి. [పిరిమెట్రిక్సు.]

మంధర.

గీ॥ అమ్మ! నీ వింతగాఁ ద్రొక్కు * లాఁడె దేల? కారణ మదేమియో పొడ * కట్టదయ్యె?
నిన్ని సొమ్ములు వేసితి * వేల యివుడు, దేవి! నా కించుకంతైనఁ * దెల్పఁదగదె?

కైక.

గీ॥ నాకు రాముని పట్టాభి * షేకమనుచు, నిపుడె తెలిసిన; దందుచే * నేనుబోవ
సిద్ధమగుచుంటి; నీవును * సిద్ధవగుము, మంధరా! పోవుదము, జాగు * మానిలెమ్ము॥

మంధర.

గీ॥ మగువ! కైకేయి! ఎంతటి * మాట వింటి, నేఁడు రాముని పట్టమ?— నిజమ? లేక
నేను దప్పుగ వినుచున్న * దానవే మొ?-స్పష్టముగఁ దెల్పుమమ్మ, య * శాంతిదీఱ॥

కైక.

గీ॥ నెలఁత! ఇదియేమి? ఇకను * నీకుఁ దెలియ, లేద యీవార్త? చిత్రము * గాదె యిద్ది?
పౌరులు పురంబు నెంతసం * బరముతోన, అంకరించిరొ చూడు మా * వంక నీవు॥

మంధర.

గీ॥ నిజమె యగుఁగాక నీమాట * నీరజాక్షి! పొమ్ము. నీ కంత యిష్టమే * పుట్టెనేని
నాకు నేమంతవచ్చె ని * క్ష్వాకుకులుని, పట్టమును జూచిరాఁదగి * నట్టి తీరు॥

కైక.

గీ॥ అహహా! మంధర! నీవిట్లు * లాడఁదగునె? చిన్నిపాపఁడు నీకేమి * చెట్టఁజేసె?
ఏల యీవింతవైఖరి? చాలులెమ్ము, ఇట్టికాఠిన్యమేటికిఁ * బుట్టె నేఁడు?

మంధర.

గీ॥ నీకు దాసిగ ననుఁజేసి * నిలిపె నీదు, తండ్రి యిటుఁ; గాని కౌసల్య * దాసికిట్లు
దాసిగాఁ జేయలేదు పో * తరుణి! యతఁడు, ఇంక నేనుండనోర్తునే * యిచటఁగైక?

కైక.

గీ॥ ఎవరు కౌసల్య దాసియౌం? దెలుఁగఁజెప్పు, మేన? నే నామెకుం దాసి * నెట్లగుదును?
ఈ వసిన దేమొ నాకించు? కేని యర్థ, మగుటయే లేదు, మఱిమాట * లాడవేమె॥

మంధర.

గీ॥ చెలువ! రాముని పట్టాభి * షేకమయిన, దెలియు, కౌసల్య పట్టపు * దేవియగును
అవుడు, "కైకేయి, నీవిట్టు*లరుగుడెంచి, కాళులొత్తు" మనఁగ దాసి * కావె నీవు?

కైక.

గీ॥ ఔనె, మంధర! నీమాట * లందు నెంత, యుక్తియున్నదె! ఇప్పుడా * యోజ మనము
నందుఁ దట్టుచునున్నది; అతివ! నీవు, తప్ప నాకాప్తులెవ్వ రీ * ధరణిఁ గలరు?

# ప్రాయశ్చిత్తము.

శ్రీమతి. బి. మణి. (పిఠాపురము.)

ఒకయూరిలో నొకరాజుండెను. ఆతని కొక కుమారి యుండెను. వారి యింటికిఁ దఱుచుగ నొక బ్రాహ్మణుఁడు యాయవారమునకు వచ్చుచుండెను. ఆయన రాజకుమారినిఁ జూచి యామెను బెండ్లాడఁ దలఁచెను. మెల్లఁగ నామెను మచ్చిక చేసికొనెను.

ఒకరోజున బ్రాహ్మణుఁ డాపిల్లను బిలిచి 'నీకుఁ బువ్వులు కోసి యిచ్చెదను రమ్మ' అని నచ్చఁజెప్పెను. ఆమె వానిమాటలు నమ్మి వానివెంటఁబోయెను. అతఁ డడవిలోనికి మెల్లఁగ దారిదీసి, మార్గమధ్యమున 'నన్నుఁ బెండ్లాఁడెదవా?' యని గద్దించెను. రాజపుత్రి యతని మోసపుఁ గృత్యమును గ్రహించి, "ఛీ! నిన్నుఁ బెండ్లాఁడెదనా? ఎన్నఁటికినిఁబడదు; దుర్మార్గుఁడా! మోసపుచ్చి తెచ్చితి!" వని కోపముతోఁ బల్కెను. దానిపై నతనికిఁ గోపమువచ్చి యామె నొక సంచిలో వైచి బిగించి మోసికొని పోవుచుండెను, కొంతసేపయిన తర్వాత, నా బ్రాహ్మణునికి దాహమయి, సంచి నొకచోటఁ బెట్టి నీళ్లకొఱకుఁ బోయెను. అప్పుడొక గొల్లవాఁడు వచ్చి సంచి మూతివిప్పి రాజపుత్రిని బయటికిఁ దీసెను. ఆమె జరిగిన సంగతి యంతయుఁ జెప్పి 'యేదైన నొక జంతువు నా సంచిలోఁ బడవైచి కట్టిన యెడల బహుమతి నిత్తునని' యాసపెట్టెను. వాఁడగు వెంటనే పోయి యొక యెలుఁగు గొడ్డును దెచ్చి యా సంచిలో వేసి కట్టి రాజపుత్రిని వెంటఁబెట్టుకొనిపోయి తండ్రి కొప్పగించి బహుమతినిఁ బడసెను.

ఇక్కడ బ్రాహ్మణుఁడో? వచ్చి సంచిఁ దీసికొనిపోయి, స్వగృహమును జేరి తల్లితో "అమ్మా! అమ్మా! పిల్లను దెచ్చితిని; పెండ్లి చేసికొందునా?" యని యామె యాజ్ఞకొఱ కడిగెను. అంతలోఁ దల్లి నేనుబోయి చూచెదనని సంచియొద్దకుఁ బోయి యెలుఁగుగొడ్డు తోఁకఁ జూచి, 'అదేమిరా! అబ్బాయీ! పిల్లకుఁ దోఁక యున్న?' దని ప్రశ్నించెను. అందుల కతఁడు, "ఛీ! ఛీ! నీకేమియుఁ దెలియదుగదా, అమ్మా! అది జడగాని, తోఁక కాదనెను. కొంచెము సేపటికి మఱల నామె, "అదేమిరా? గుఱ్ఱుగుఱ్ఱు మనుచున్న?" దని యనెను? కొడుకందులకు 'అబ్బే! గుఱ్ఱుకాదమ్మా! నీవు చెవిటిదానవు! పిల్ల సంగీతము పాడుచున్నది.' అని చెప్పి పోయి, భోజనము చేసివచ్చి, సంచినొక గది లోఁబెట్టి యొంటరిగఁ గూర్చుండి మూతివిప్పి "ఇదుగో! పిల్ల! లేచిరా!" యని పిలిచెను.

ఏమైనది? ఎల్గుగొడ్డు హఠాత్తుగఁ బయికి దూకి పెండ్లికొడుకువలెఁ గూర్చున్న బ్రాహ్మణునిఁ జంపెను' తెల్లవారిన తర్వాతఁ దల్లి యిదేమని యూరివారిచేఁ దలుపులు దీయించి చూడఁగా, మృతుఁడై బ్రాహ్మణుడటు! ఎల్గుగొడ్డిటు! వారు దానినిఁగాల్చి చంపి వానికిఁ దగిన ప్రాయశ్చిత్తమైన దనిరి. —

# కష్టాలు.

శ్రీమతి. మ. దమయంతి, [ప్రిమెట్రిక్.]

అసలారోజున నామనసు చాలఁ జీకాకుగా నుండెను. ఎందుచేతనంటే, మా నాన్నగారు నామీఁదఁ బోట్లాఁడుట; మాయాబిడకుఁ గోపమువచ్చి పుట్టింటికిఁబోవుట; మాయత్తగారు నే నేమో యంటినని సాధించుట– బాగుగాఁ గుదిరినవి. తరువాత నే నొకని స్నేహముచేసి కొని, యొకరూపాయి పుచ్చుకొని తెనాలికి వెళ్ళుద మనుకొన్నాను. మానాన్నకు నామీఁద నపనమ్మకము. కాని యాయన యొక తల తిక్క మనుష్యుఁడు. బయలుదేరి యెవ్వరికిఁ దెలియకుండ బండియెక్కి వెళ్లుదమని నాయుద్దేశము; చెప్పకుండ వెళ్ళిపోవుట నేనెన్నఁడు నెఱుఁగను.

నేను మానాన్నకుఁ దెలియకుండ వెళ్లుదమంటే, పెద్దపులిలాగునఁ గనఁబడినాఁ డాయన కెఱుకగల యొక మనుష్యుఁడు. పోనీ, మాటాఁడకుండఁ గూర్చుందమన్నను, నన్నాయన యట్లు కూర్చుండనిచ్చినఁగదా! ఏమేమో కుశలప్రశ్నలు వేయుట మొదలుపెట్టినాఁడు. నాకుఁ జాలఁ గోపముకూడ వచ్చినది. అయినను నాతిప్పలు వాండ్రి కెట్లు తెలియును?

ఒకచోటఁ జీకటిలోఁ గూర్చుంద మనుకొంటిని; కాని యచ్చటి కొకఁడు దీపము పట్టుకొనివచ్చి కూర్చున్నాఁడు. కన్నులుకూడ నా వెలుతురుకు మిఱుమిట్లుగొనుచున్నవి. అచ్చట నుండి పోయి 'ప్లాట్ ఫారం' [illegible] నీడఁ బరుండఁ దలఁచితిని. 'పోర్టరు' లాంతరొకటి పట్టుకొనివచ్చి 'ఎవరీ దయ్యా?' మని తిట్టి లేవఁగొట్టినాఁడు. లేచి పోవుచుండఁగా నొకచోట నొక కుఱ్ఱవాఁడు 'బీడీ' త్రాగుచుఁ గూర్చుండెను. 'అబ్బాయీ! నేనీ చీఁకటిలోఁ గూర్చుందమని వచ్చితిని నీవు కొంచెము వతలికిఁబోయి బీడీకాల్చుకో నాయనా! నాయనా!' యని బ్రతిమాలుకొంటిని. వాఁడు 'అచ్చట మావాండ్రున్నారు. నేను బీడీకాల్చుట చూచి కోపపడుదు!'రని బదులుచెప్పెను. 'సరే బాగుగనే యున్న'దని విసుగుకొంటిని.

బండి వచ్చినది. చూచి యొక పెట్టెలోఁ గూర్చుంటిని. బండి కదలినది. మనస్సు కుదుటఁబడినది. కాని యొకమూలకుఁ జూతును గదా, యొక యెఱిఁగిన మనుష్యుఁడు కనఁబడెను. అప్పుడు నాగుండెలు గరిసెలుపడినవి. అచ్చటనుండి మెల్లఁగఁబోయి మఱియొకచోఁ గూర్చుంటిని. ఇంక నే నిచ్చటనే యిఱికియుండవలయును; ఏమిచేయుటకును వీలులేదు. కాని యాయన నన్నుఁజూచినాఁడు. అసలే నారద మహర్షి! పైఁగా మాయింటిసంగతు లన్నియు నెఱిఁగినవాఁడు. నే నేమిచెప్పుదునోయని కాఁబోలు, నాదగ్గఱకు మెల్లఁగవచ్చికూర్చున్నాఁడు. నేనేమియు మాట్లాఁడకుండ భీష్మించుకొని కూర్చుంటిని. చివరకాయనయే 'ఓరీ! ఎచ్చటికి వెళ్ళుచున్నావు?'అని యడిగినాఁడు. నాకు

గుండెలు గుభేలుమన్నవి. తలను మెల్లఁగాఁ ద్రిప్పి, 'తెనాలిలో నాస్నేహితుఁ డున్నాఁడు. అచ్చటికిఁ బోవుచున్నా' నంటిని. కాని యాయన 'ఏడ్చినావులే! పద యింటికి. స్నేహితునితో మాట్లాఁడునఁట! అన్ని సంగతులు మీ నాన్న నాకుఁజెప్పినాఁడులే.' అని యొక పేమాట నుపయోగించినాఁడు. అప్పుడేదో 'స్టేషను' వచ్చినది. ఆయన దిగిపోయెను.

నేను ఖులాసాగాఁ గూర్చుంటిని. ఆ డబ్బా పెద్దది. నాసంతోషము చాలకాలము నిలువలేదు. ఏమందురా? ఆ డబ్బా వాఁకిలియొద్ద నొక పెద్దమనుష్యుఁడు చుట్టగాల్చుకొనుచుఁ గూర్చుండెను. ఆయన నన్నెట్లో గుర్తించి, 'అబ్బాయి! నీవెవరవు?' వన్నాఁడు! 'ఎందుల కండీ?' యని నేనంటిని. 'లేదు. మీనాన్నగారి పోలికలు కనఁబడుచున్నవి. ఆయనకు నాకుఁ జాలఁ బరిచయము.' అని యన్నాఁ డాయన. 'అయ్యో! ఏమో నుఅలవచ్చినదిరా బాబూ!' యని యనుకొంటిని. చూచితిరా నాకష్టాలు!





# రఘు జననము.

శ్రీమతి. యన్. భారతీరత్నాకరాంబ, [ప్రిమెట్రికు].

మ॥ ఇనవంశంబున జన్మమొందిన ధరిత్రీశుండు, శూరుండు, స
జ్జనసేవ్యుండు, దిలీపనామధరుఁడై * దండంబు చేఁబూని, శే
షునకైనం బొగడంగరాని సుగుణ * స్ఫూర్తిన్ విరాజిల్లుచున్
జనసంకీర్ణ మయోధ్య నేలె మును దా * శశ్వన్మహోదారుఁడై॥

కం॥ రూపున మారునిసతి, వి। ద్యాపద్ధతి వాణి, యోర్పు * నందున వసుధం
దోఁపింపఁజేయు గుణముల, పాఁపైన సుదక్షిణయను * పడఁతుకతోడన్॥

గీ॥ అంత నానృపవరుఁడును * నఖిలసౌఖ్య, సంతతుల నందియును * ప్రాణకాంత దాను
వంతనొందిరి మనముల * నెంతయేని, యంతమదిలేని యనపత్య * చింతచేత॥

శా॥ వేదాభ్యాసతపఃక్రియాదుల యశ * స్వి శ్రేష్ఠు నాచార్యు శ్రీ
పాదాబ్జంబుల మ్రొక్కి వేడెను మనో * వ్యాథం బెడంబాప ; స
మ్మోదంబొంది వశిష్ఠుఁ డిట్లనియె 'నో * భూమీశ ! నీచింతలన్
ఛేదింపందగు నందినీగవి సుమీ * సేవింపుమా భక్తితోన్ ॥

గీ॥ గురువు నుడివినరీతి న * కుంఠభక్తి, వఱలఁగను గొల్చె ధేనువున్ * వనిత దాను
ఇరువదియునొక్క దివసంబు * నిట్టె యిట్టె, జరిపి రిష్టార్థసిద్ధి త * త్పరతవారు ॥
కం॥ ఇరువది రెండవ దినమునఁ, బరమోత్సవమైన రౌప్య * పర్వతప్రాంతం
బరసి యట కేగె ధేనువు, నరపతియుం దా ననుసర * ణం బొనరించెన్ ॥
ఉ॥ హరిణసమూహముల్, మఱియు * నంచలబారును, నిర్మలోదకా
పరములు పల్వలంబులును * బర్హుల నృత్యము, దంతి సంతతుల్
విరివిగ సంచరించుటలు * వేడుకమై ననిమేషదృష్టియై
యరయుచునున్న, నత్తఱి గు * హాంతరసీమకుఁ జేరె ధేనువున్ ॥
గీ॥ నెట్టుకొని యొక్కఁడగు నార్త * నినద మేదొ, గట్టిగా వీనులంబడె * న్మాధవునకుఁ
బట్టి విల్లునమ్ములఁ జేతఁ * బఱచి నతఁడు, పట్టుటనుజూచె నొక మృగ * ప్రభుఁడు గవిని॥
కం॥ అదిగని సింహము నేయం, గఁదలంచి శరమ్ముఁదీయఁ * గర మథిపుండున్
బొదిలోనఁ బెట్టె, నెంతయు, విదిలించినఁ బయికిరాని * విధ మే మగుగదా !
గీ॥ అవనినాథునిఁ జూచి మృ * గాధిరాజు, వలికె నరభాష "నో క్షితి * పాల ! వినుము
ఏను కుంభోదరాఖ్యచే * నిర్ధరిత్రిఁ, బరగువాఁడ, మహేశ్వరు * బంట; మఱియు॥
గీ॥ చూడు, ననుదున్న నిందాద్రిది * సురులకైనఁ, దరముగాదు, మహాదేవు * కరుణచేత
నయ్యె, నీగోవు నాకు నా * హార మిపుడు, దిగులుచెందక పొమ్ము నీ * తెరువుఁబట్టి॥
మ॥ అనినన్ దద్వచనంబు లెల్లవిని యు * ట్లాఁడెన్ నృపుండున్ మహా
వినయంబొప్పఁగ "నో మృగాధిపతి ! నా * విజ్ఞప్తి మన్నింపుమా !
నను భక్షింపుము, ధేనువున్ విడువుమా ! నన్నుం గృపంజూడ ని
న్మనసారంగను గోరుచుంటి" నని సం * ప్రార్థించుచుం గేసరిన్ ॥
గీ॥ గోవును త్యజించి పొమ్మని * కోరి సింహ, మెఱుకపఱిచె నాత్మోద్దేశ * వృత్తిఁ; గాని
నరకుఁ గొనఁడయ్యెఁ దనవాక్య * సరణిగాక, ధర్మమార్గానువర్తియై * ధరణిధవుఁడు॥
మ॥ అని యాసింహము మాయమయ్యె; మఱి తా * నద్ధేనువుం జెచ్చెరన్
జననాథుం దఱియంగవచ్చి ప్రియభా * షల్ సేసె నీరీతి ; "నో
యనఘా ! మెచ్చితి నీదుభక్తికి, వరం * బర్థింపుమా !" యన్న, న
జ్జననాథుండు సుపుత్రుఁగోరెఁ బిమ్మదా * శ్చర్యంబులం బొందుచున్.॥

*** *** *** ***

కం॥ అంత సుదక్షిణయును భూ, కాంతుఁడు, బంధువులు, జనుఁలు * కరమింపొందన్
సంతానమునుం గాంచెను, సుంతయు నఱగొఱలులేని * శుభదివసమునన్ ॥

*** *** *** ***

గీ॥ సాధుహృదయుఁడు రఘు వుమా * శంకరులకు. ముదముఁగూర్చు షడాననుఁ * బోలి మఱియు
ఇందిరా ముకుందులకు ర * తీశువోలి, మోదము సుదక్షిణాదిలీ * పులకు నించె.॥

# ఏసుక్రీస్తువారి జీవితకథ

శ్రీమతి. క. ఫ్లారెన్సు. (ప్రిమెట్రిక్.)

ఏసుక్రీస్తువారు మానవుఁడు కాకపూర్వ మాయన యాత్మస్వరూపుఁడై సర్వశక్తిగల దేవుని యొద్ద నుండెను. అప్పు డాయన నామధేయము లోగాసు. ఈయననే సాలోమనుమహారాజు తన జ్ఞానకాలమందు మహాశిల్పకారుఁడని వ్రాసియున్నాఁడు; ఈయననే ఎషయా యను దీర్ఘదర్శి-శక్తిమంతుఁడైన దేవుఁడని వ్రాసియున్నాఁడు. ఈయన దేవుని పరిశుద్ధాత్మశక్తి వల్ల మహారాజు దావీదువంశమునకుఁ జెందియున్న కన్యయైన మరియమ్మ గర్భమున మానవుఁడై జన్మించెను. ఈ మహానుభావుఁ డిట్లు జన్మించునని ప్రవక్తలు ముందే ప్రవచించియుండిరి.

రోమనుచక్రవర్తి కైసరైగుస్తు కాలమందు కురేనియా సిరియాదేశమునకు రాజుగా నున్నప్పుడు జరిగిన మొదటిప్రజాసంఖ్య వ్రాయఁబడిన సమయమున బెత్లెహేమను గ్రామమున నొక పశువుల కొట్టములో నేసుక్రీస్తు జన్మించెను. ఈయన చిన్నవాఁడుగ నున్నప్పుడు దేవుని కృపకును మనుష్యుల ప్రేమకును బాత్రుఁడయి వర్ధిల్లుచుండెను. ఈయన పది పండ్రెండేండ్లవయస్సుననే పరిసరయ్యులతోడను శాస్త్రులతోడను జాలఁ జక్కఁగా వేదశాస్త్రములను గూర్చితర్కించుచుండెను ముప్పదేండ్ల ప్రాయమువచ్చినప్పుడు సువార్త పనికొఱకు దేవునిచే నభిషేకింపఁ బడినవాఁడై దైవచిత్తమును ప్రజలకు వెల్లడిచేయుచుండెను.

దేవుని రాజ్యము సమీపముగా నున్నది; కాన మీరు మాఱుమనస్సును బొందుఁడని యాయన ప్రారంభమున బోధచేసెను. పాలస్తీను దేశమందంతటను బోధించుచు, వేలకొలఁదిగ నంగహీనులను, గ్రుడ్డివారిని, స్వస్థపఱచుటచేతఁ బిశాచబలమైన కోటలను నాశనము చేయుచున్నాననియు, నది దేవుని చిత్తమును నెఱవేర్చుటనియుఁ, బలుమారు నొక్కి వక్కాణించెను. ఈయన బోధలలో శ్రేష్ఠమైన కొండమీఁది ప్రసంగములో వివరింపఁబడియున్నది. (మత్తయిసువార్త 5 మొదలు 7 వఱకుఁ జూడుఁడు.)

మూఁడున్నఱ సంవత్సరములు దేవుని సువార్తను-సేవను- ఉపమానములతో బోధించెను. తరువాత 'పొంతిపిలాతు' ఏలుబడి కాలములో-మన చైత్రశుద్ధ చవితికి సరియగు యూదుల మొదటి నెలయగు నీసాన్ లేక అబీబ్ ౧౪ తేదీన (పస్కాను సిద్ధపఱచు దినమున) సిలువ వేయఁబడి చనిపోయి సమాధి చేయఁబడెను.

ఆయన బ్రదికి యున్నప్పుడు లోకమును దర్శించుటకయి పరలోకమునుండి పంపఁబడిన లోకోద్ధారకుఁడనని నొక్కి పలుకుచుండెను, దానికి సరియైన గుర్తుగ మూఁడు పగళ్లు మూఁడు రాత్రులుండి ప్రాణముతో లేచెదనని

యాకాలపుఁ బంధితులగు పరిసరయ్యులతోఁ జెప్పుచుండెను అందుచే వారాయనపై శత్రుత్వమును బూని యసత్యవాది యని ఋజువు పఱచుటకై సమాధిని ముద్రింపఁజేసి మూఁడు దినములవఱకుఁ గావలియుంచిరి. కాని క్రీస్తు ముందుగఁ జెప్పినట్లే మూఁడవదినమున సమాధినుండి పునరుత్థితుఁడయ్యెను. అప్పుడా పరిసరయ్యులాయన లేవలేదని కావలివారికి లంచమిచ్చి యనిపించిరి. అంతేగాక రాత్రి యాయన శిష్యులువచ్చి కావలివారు నిద్రించుచుండఁగా నాయన శరీరము నెత్తుకొని రాత్రివేళ దొంగతనముగాఁ బోయిరని యబద్ధసాక్ష్యము చెప్పించిరి. ఇప్పుడా యబద్ధము చెప్పుట యూదులకొక నిత్యకృత్యమయ్యెను.

క్రీస్తు తరువాత ౪౦ దినములకు శిష్యులకును బ్రజలకును గనఁబడియెను. వారందఱు ప్రార్థించుచున్నప్పుడు క్రీస్తువారు స్వర్గమునకుఁ బోవుచున్నట్లు గోచరించెను. మేఘద్వారమున వెడలిపోయెను.



# మాశాస్త్రిగారి శౌర్యము.

శ్రీమతి. వ. ఇందిరాదేవి, (యఫ్. వై. ఎ.)

సికిందరాబాదునందు సాధారణముగా 'క్రికెటు' ఆట పందెములు జరుగుచుండుట యందఱికినిఁ దెలిసినవిషయమే. అట్టివే ప్రస్తుతము జరుగుచున్నవి. నాకు 'క్రికెటు' వారితో నేమాత్రపు సంబంధము లేకున్నను, నేను మన మాతృభారతి ద్వారా వారికొక సలహా (ఆఁటగాండ్రకు) యియ్య సాహసించుచున్నాను. అదేమన, వ్యక్తికి జాతికి బలము నొసఁగునట్టి ముష్టియుద్ధము (Boxing)- పరుగుపందెములనుగూడఁ బెట్టిన బాగుండునని. పై రెండు బాగుగాఁ దెలిసినవారును, సంఘమునకు, మాతృభూమికి, వన్నెదెచ్చువారు నగు మా శాస్త్రిగారొకరు గలరు. వారి పేరు పందెముల 'కమిటీ'కి సూచింపవలసియున్నది. వీరి విషయము విశేషముగఁ జెప్పనక్కఱలేదని నాకే తోఁచినదిగాని, పాఠకమహాశయులకు శాస్త్రిగారి దర్శనభాగ్యము లభింపనందున వారి పరిచయము గల్గించుబాధ్యత నాపైనున్నది. శతవిధముల వారిదిచూడరు; గాని చూచినయెడలఁ జిక్కే!

వీరిని 'మెలన్స్ఫుడ్' కంపెనీవారు తమ యాహారమునకు (?) దృష్టాంతముగఁ దీసికొనవచ్చును. శాస్త్రిగారు పగలుచూచిన రాత్రి కలలో వత్తురనుటకు సందేహములేదు. భీషణగర్జనము—భీకరరూపము. ఆపట్టణములోని బాలబాలికలకు ముఖ్యముగ సింహస్వ

ష్ణమై యుండెడిది. వీరు కొంచెము 'సనాతను' లలో లెక్కపెట్టఁబడఁ దగియున్నను, వీరిలో (Modern fashions) కొన్ని లేకపోలేదు. ఎందులకందురా? కొంచె మింగ్లీషు తెలియును; ఆవాసన యెక్కడికిఁ బోవును మఱి? కాని పాప! మా పిలకజుట్టుమీఁది మనస్సుమాత్రము తీరలేదు. స్నేహితులందఱు 'క్రాపు' చేయించుకొనుమని యెంత బ్రతిమాలినను, వెనుకడుగు వేసినారు. వీరిముఖముపై ముక్కున్నదా లేదాయని దూరముననుండి చూచు ప్రేక్షకులకు సందియము కలుగును. కాని శ్రమ చేసి పరీక్షించిన వారియందు నే నొకదానను. వీరు ధోవతి కట్టుకొను పద్ధతిఁజూడ నతివిచిత్రము. బొడ్డుక్రిందికి ధోవతికట్టు!—పైనఁ బట్టు శాలునకప్పు!— మఱి శాలువను గడియకొకమాఱు సవరించుకొనుచు, మంత్రబలము లేకున్నను దుంపురుల బల మెక్కువైనట్లు, రెండు పంచాఙ్గములను, ప్రాతనెలలవి, చేతఁబట్టుకొని, వీథులయందుఁ దిరుగుట వాడుకయని తలంచెదను. మొత్తముమీఁద వీరిని రూపమున హనుమంతునికి ఆకారమున విఘ్నేశ్వరునికిఁ బ్రజ్ఞాదురంధరత్వమున నుత్తరకుమారునికి— బోల్పవచ్చును.

వీరికి ముష్టియుద్ధమునఁ బ్రావీణ్యము కలదని మొదటనే విన్నవించుకొంటిని.

శ్రీ శాస్త్రిగారికిఁ బ్రొద్దుననే లేచి, యొక మైలుదూరములోనున్న యొక కొలనికిఁ బరువెత్తి కాలకృత్యములను దీర్చుకొని వచ్చుచుండుట యలవాటు. శ్రీవారు కొంచెము పూర్వపుఁ బద్ధతివారైనను, సరిగా నాలుగంటల 'కలారము' పెట్టుకొని యా వేళకే లేచి, పోయి కాలధర్మమునకు యథావిధిగఁ బరువెత్తెడివారు.

ఒకనాఁ డెవరో వారి గడియారమున 'కలారము' 11-30 గంటలకుఁ ద్రిప్పిపెట్టిరి. వారది చూడలేదు. గడియారము తనపని నది సరిగాఁ జేసినది. మన శాస్త్రిగారును దమపని కయి 'యలారము' వినుటతోడనే- పండ్లపొడి మొదలగువానితో- మామూలుగఁ గొలనికిఁ బరుగెత్తెను. దారిలో నొక్కరైనను గంటఁబడకుండుట వారికి సంతోషము, నాశ్చర్యమును గల్గఁజేసినది; సంతోషము మొదటనే వచ్చినందులకు సావకాశముగా ధోవతి యుదుకుకోవచ్చునని ఆశ్చర్య మాదినమునఁ బక్షులచప్పుడు వినఁబడ లేదేమో?యని. గోచిపెట్టుకొని ధోవతి నుదుకుకొనుచుండఁగా......గడియారము......గంటలు వినఁబడెను! లెక్కపెట్టఁగా......పం...డ్రెం...డు!!

శాస్త్రిగా రొంటరిగాఁ గొలనిగట్టున—నానిబిడాంధకారమునందుఁ—బండ్రెండు గంటలవేళ—నిలుచునియుండిరి!! అప్పుడే వారికి బ్రహ్మరాక్షసులో—దొంగలో — దూరమునుండి యే తెంచుచున్నట్లు తోఁచినది! పాపము! భయపడినారు. ఎందులకా! వ్రేళ్లపై బంగారపు టుంగరములు—మెడలో రుద్రాక్షలపేరు—దొంగలు! భయముకాదా మఱి? ఆ భయోద్వేగమువలన నోటవేసికొన్న పండ్లపొడిని మ్రింగి, ధోవతి విడిచిపెట్టి, 'కాపీనవంతఃఖలు భాగ్యవంతః' యన్నట్లు పరువెత్తి యూరునిమిషముల 2'25 సెకండ్లలోఁ బట్టణముఁ జేరఁగలిగెను.

త్రోవయందు రక్షకభటుఁ డొకఁడు దాపురమైనాఁడు; వాఁడు శ్రీ శాస్త్రిగారి యవతారమునుజూచి 'దొంగ' యని భ్రమించి వెన్నాడఁ జొచ్చెను.

రక్షకభటుఁడు దగ్గఱకువచ్చి తన్నుఁ బట్టుకొనఁబోవుచుండఁగా, మన శాస్త్రిగారు ముష్టియుద్ధప్రవీణులు, సహజ ధైర్యసంపన్ను

లు గాన—నతని ముక్కుపైఁ బిడికిట నొక్క గ్రుద్దు గుద్దెను! వాఁడు వెంటనే విలవిలఁ దన్నుకొనుచు నేలఁగూలెను. శాస్త్రిగారు వెనుకకైనఁ దిరిగిచూడకుండఁ గాలికిఁ బుద్ధిచెప్పి యిల్లుఁజేరి తలుపు వేసికొని పడుకొనిరి.

మఱునాఁడు రక్షకభటుఁ డొకఁ డాకస్మికముగఁ జనిపోయెనన్న వార్త పత్రికలోఁ బడినది. నిజమైనసంగతి యిప్పటిని- నెవ్వరికిని-దెలియదు! ఒక్క నాకు-శాస్త్రిగారికిఁదప్ప!

ఆ దినము శాస్త్రిగారివతలికైనను రాలేదు. స్నానముగూడఁ జేయలేదు. అందువలన మూఁడు పెండ్లిండ్లు, రెండు తద్దినములు మునిఁగి పోయినవి. కడుపునిండ భోజనము-చేతినిండ దక్షిణ-దొరకు నవకాశము పోయినది!!

ఏదియెట్లున్నను, నిట్టి శాస్త్రిగారు ముష్టియుద్ధములోఁ బ్రవీణులని తేలినదిగదా? ఒక్క దెబ్బకు రక్షకభటుఁడు—! అట్టి మా శాస్త్రిగారి శౌర్యము మెచ్చి, సికింద్రాబాదు టోర్నమెంటువారు శ్రీవారిని గౌరవించు నవకాశమును గల్పింతురుగాక!



# మఱి, విన్నారా నాకథ?

శ్రీమతి. బి. మణి, [ప్రిమెట్రిక్సు.]

నేను పంద్రెండేఁడ్ల ప్రాయములో నున్నప్పుడు, వరంగలుకుఁ బోవలయునని మానాయన చొక్కాజేబునుండి యేఁబదిరూపాయలను దీసికొని నాబట్టలపెట్టెతోఁగూడ మావాండ్ర కెవ్వరికిఁ దెలియకుండఁబోయి, టిక్కెట్టుతీసికొని రైలుబండిలోఁ గూర్చుని పోవుచుంటిని. అప్పుడెవరో ప్రక్కపెట్టెలో నొక స్త్రీ నగలపెట్టె నపహరించిరని యలజడి బయలుదేఱినది. ఆదొంగ యెవఁడో నా దురదృష్టవశమున నన్నే పోలియుండెనఁట. వాఁడు పారిపోయెను!! ఇంకేమున్నది? నన్నుఁబట్టుకున్నారు!! ముందుగ నే నావిషయ మెఱుఁగక యాశ్చర్యపడి, "ఇదేమి? నన్నెక్కడకుఁ దీసికొనిపోవుచున్నారు?" అని ప్రశ్నించితిని. కాని నామాట వినువారెవ్వరు? పోలీసులట్లు నన్ను లాగుకొనిపోయి కొట్టులోఁబెట్టిరి. కావలివారు నగలపెట్టె యెక్కడ దాచితివని యడుగుచు, నన్ను మాటమాటకుఁ గొట్టుచుండిరి. అప్పటివఱకు నా కసలువిషయము తెలియనే తెలియదు.

నాకేమి చెప్పుటకును దోఁపక నేనెఱుఁగనని చెప్ప మొదలుపెట్టితిని. అప్పుడు పోలీసువా రన్నారుకదా, 'నీ వీపని చేయనియెడల, మేము సలసల కాగు నూనెలో నొక యుంగరము వేయుదుము. దానిని నీచెయ్యి కాలకుండ దీయఁగల్గినచోఁ నిన్ను విడిచిపెట్టెద' మనిరి. నా యదృష్టమును నమ్ముకొని సరే కానిండని

యొప్పుకొంటిని. వారు నన్ను వదలిపెట్టినచో నీయుంగరము వారికిచ్చెదనని చెప్పితిని. వారు సరేయనిరి. నేను నామనస్సులో భగవంతునిఁ బ్రార్థించుచు నూనెలోఁ జేయిపెట్టితిని. ఆశ్చర్యము! చేయి కాలనే లేదు, ఉంగరము మెల్లఁగాఁ దీసి వారికిచ్చితిని. వారు నన్నుఁ బరిపరి విధములఁ బొగడిరి. నేనంతట విడువఁబడితిని.

తరువాత నాపెట్టెతో 'బ్రతుకు జీవుఁడా!' యని బయటఁబడి, యింక బొంబాయికిఁ బోవలయునని రైలులోఁ గూర్చొని పోవుచుంటిని. నిదురవచ్చినది. రైలులో నొకతీగ యుండును. ఆ తీగనుబట్టి లాగినయెడల రైలు నిలువఁబడును. పండ్రెండేండ్ల వాఁడను మాత్రమే యగుటచే నాకా సంగతి తెలియక, నాపెట్టెనాతీగకుఁ గట్టితిని. నేను గునికిపాట్లుపడుచు నొకప్పుడా పెట్టెపైఁబడితిని. అది చటుక్కునఁ గదలెను. తక్షణమే రైలునిలువఁబడినది. రైలు ద్యోగస్థులు మాపెట్టెయొద్దకువచ్చి నన్ను గమనించి, తలకొక దెబ్బ వేసిపోయిరి. ఎట్టులైన నేమి, బొంబాయిలో దిగితిని.

ఒక వీథిలోఁ బోవుచుంటిని. ఎవఁడో యొకఁడువచ్చి మాయమాటలు పాలుచెప్పి, యొక కాఫీహోటలులో నన్ను నీళ్ళుపోయించి, నాదగ్గఱనున్న పైకమంతయుఁ గాఁజేసి పారిపోయినాఁడు. ఎవ్వరితోఁ జెప్పుకొందును? నిజముగా నాకు వెఱ్ఱిబట్టినట్లయినది. అట్లే యేమియుఁ దోఁపక వీథులలోఁ దిరుగుచుండగా, నొకమహాత్ముఁడు నన్నుఁజూచి జాలిపడి, 'నీవు మాయింటికి వచ్చెదవా?' యని యడిగి,' తన యింటిలో నుంచుకొని చాలప్రేమతోఁ బోషించెను. కాని పెద్దమ్మ నాపైనాట్యమాఁడి, వారియింట నొక యేఁబదిరూపాయలను దొంగిలించి పారిపోయితిని. ఈ యకృత్యము నన్నిప్పటికిని మనశ్శల్యమై బాధించుచున్నది సుమండీ!

పిదప నొక 'ఫిలింకం పెనీలోఁ' జేరితిని. దానిలో నన్నొక సేవకునిగాఁ దీసికొనిరి. మెల్ల మెల్లఁగా నందులోని నటకులను జూచి వారి యాట పాటలను నేర్చుకొని, తుదకు వారివలె నే నొక నటకుఁడనైతిని. అంతటితోఁ బోవ లేదు. రాజువేషధారినైతిని. ఆ 'సినిమా' పెద్దలు నాయాటనుజూచి మెచ్చుకొని, నూరుపంద లరూపాయల చొప్పున నెలజీత మిచ్చి తమ యొద్దనే యట్టెపెట్టుకొనిరి. ఇట్లుండఁగా నేనొక యిల్లద్దెకుఁ దీసికొంటిని. నా తల్లి దండ్రులను బిలిపించుకొని సుఖముగాఁ గాలక్షేపము చేయుచుంటిమి. కొన్నాళ్ళకు నేను పెండ్లిచేసికొంటిని.

భార్యయుఁ గాపురమునకు వచ్చినది. కాని నాకొకప్పుడు ప్రారబ్ధవశమున జ్వరమువచ్చినది. విషజ్వరముగా మాఱినది. ఒకదినమున నాకుఁ గడు నాయాసమైనది. కన్నులు మూసికొన్నది మాత్రమే తెలియును. బ్రతికియుంటినో పరలోకప్రయాణము చేసియుంటినో యెఱుకలేదు. మావాండ్రందఱు నేడువ మొదలుపెట్టినారు. మఱలఁ గన్నులు తెఱచుసరికి, చుట్టును జేరి యందఱు నేడ్చుచుండిరి. మాయమ్మను బిలిచి, 'అమ్మా! ఎందులకే యేడ్చుచున్నా?'రని యడిగితిని. మాయమ్మ 'నాయనా! అంతయునయిపోయినదేమోనని యేడ్చుచున్నా'మని చెప్పినది. అప్పుడు నాకించుక నవ్వువచ్చినది. క్రమముగా వైద్యునియొద్ద మందు తినుచుండగా జబ్బు నివారణమైనది.

తర్వాతఁ గొలఁదిరోజులకు మాయమ్మ పరలోకము చేరినది. ఆమె పోయిన సంవత్సర ముతిరుగక పూర్వమే మా నాయనయుఁ జనిపోయెను. అప్పటినుండియు సుఖముగనో కష్టముగనో కాలమును గడుపుకొను చున్నాము. ఇప్పుడు నాకు ముగ్గురు పిల్లలు.

# గర్వభంగము.

శ్రీమతి. పి. సావిత్రి, [ప్రిమెట్రికు].

సీ॥ ఎవ్వాని పదసీమ, ♦ నెలమితోఁ బూజించి ముక్తికై భక్తులు, ♦ మొనయుచుండ్రు!
ఎవ్వాని మనమునం, ♦ దెల్లప్పుడు న్నిల్పి దేవతాజనులె స్తు, ♦ తించుచుండ్రు
ఎవ్వాని దర్శింప, ♦ నెంతయుఁదాపసు లడవుల జపతపా, ♦ లాచరింత్రు!
ఎవ్వాని "మముఁబ్రోవ ♦ నే! మాధవా!" యని, ప్రార్థింపఁగా మనో ♦ రథము లెసఁగు!

గీ॥ నట్టికృష్ణుండు విదురుని, ♦ యాలయమున, నర్హపీఠిక నాసీనుఁ, ♦ డయి స్వకీయ
భక్తులంగూర్చి భాషించు, ♦ పట్టునందు, నింతనవ్వుచు సతనితో ♦ నిట్టులనియె॥

గీ॥ వెడలుచున్నాఁడ నొకభక్తు, ♦ వేశ్మమునకు, వత్తుఁ ద్వరలోనె యాతుర ♦ పడకుమీవు;
అని చనుటయును "నాకంటె ♦ నధికభక్తు, లెవరుగల" రని మదిని గ ♦ ర్వించె నతఁడు॥

గీ॥ తా 'నిదే! వత్తు' ననియున్న, ♦ తరుణ మేగ, 'నాతఁడెక్కడి కేగినాఁ?' డని వెదకుచుఁ
నేగుచుండంగ నొక బీద ♦ యింటియొద్ద, నిల్చియుండె, నదే! మేఘ ♦ నీలమూర్తి!

గీ॥ మొండిగోడల నడుమ నొ ♦ క్కండు నిల్చి, యెగురుచుండంగ, నట్టె! వీ ♦ క్షించి మదిని
నధికగర్వముతో 'నేమి?' యనుచు నడుగ, నమ్మురారి యతని కిట్టు ♦ లనియె మెల్ల॥

గీ॥ "ఇదియె నాభక్తుసిల్లు; నా ♦ యెదుటనున్న, వాఁడె భక్తుఁడు; నీకంటెఁ ♦ బరమభక్తి
నెగడుచున్నవాఁ డీతఁ" డ ♦ నఁగనె, నంద, నందనున కంత విదురుండు ♦ నగుచుఁ బల్కె॥

గీ॥ "నందనందన! ఇదియేమి ♦ న్యాయమయ్య? ఈవునిలువంగ హాయిగ ♦ నెగురుచుండు
వాఁడు నీకెట్లు భక్తుఁడౌ? ♦ పలుకు" మనిన, నాతఁ డా మాటలాలించి ♦ యనియెనిట్లు॥

గీ॥ "కనులు మూయుము; నీకన్ని ♦ కరతలామ, లకమగు" ననంగ, నట్లచే ♦ సి కనుదెఱచి
తాఁ గనినదాని వర్ణింపఁ ♦ దలఁచి హరికి, నిట్టులనె "నేమనంచు వ ♦ ర్ణింతుఁ గృష్ణ!

సీ॥ విద్యాధరాంగన ♦ విధముగా నొకకన్య, స్వర్ణచామరము చే ♦ పట్టివీవఁ
బూర్ణిమాచంద్రునిఁ ♦ బోలు నెమ్మోముతో, నొకయింతి కడుభక్తి ♦ నొసరుపంగఁ
బసిడిపళ్ళెరమునఁ ♦ బలుభోజ్యములఁ బెట్టి, తినుమంచు భక్తుండు ♦ తీవరింప
భర్మపీఠమునందుఁ ♦ బత్నితోఁ గూర్చుండి, యరవిందనేత్ర! వీం ♦ దారగించు

గీ॥ నీవు- స్తోత్రపాఠములెల్ల ♦ నింగిముట్టు, చుండ, నంద ఆనందాబ్ధి ♦ నోలలాఁడు
చుండ—స్వర్గలోకమువ [illegible] ♦ [illegible] గవ్వడివయ్య! భవ్యచరిత!

గీ॥ ఓ కమలనాభ! ఓ చక్రి! ఓ ముకుంద!, ఓ పురాణపురుష! ఓ మ ♦ హోజ్జ్వలాంగ !
ఓ జగన్నాథ! నీ శక్తి ♦ యోజఁ దెలియ, కే నొనర్చు తప్పును క్షమి ♦ యింపుమయ్య!

గీ॥ నన్ను మించిన భక్తు లీ ♦ నాఁడెవ? రని, గర్వ మొందితిఁగాని, యీ ♦ కరణి సేవ
లెపుడు చేసియెఱుంగ, నీ ♦ కెల్లవిధుల, నేఁడు నా గర్వభంగము ♦ నివ్వటిల్లె !!"



# గోపాలుఁడు

శ్రీమతి, పి. స్నేహలత, [మొదటిఫారము.]

అది ఒక సాయంకాలము. సూర్యుడప్పుడే అస్తమించుచున్నాడు. పిచ్చుకలు తమ తమ పిల్లలకు నోటిలో ఆహారము పెట్టుచుండెను. ఆచిన్నపిల్లలు ఆకలిచే పీచ్ పీచ్ మనుచుండెను. పక్షులు పాడుచున్నవి. కోవెలలు కూయుచున్నవి. చల్లనిగాలి వీచుచున్నది. పూలపొదలు, పచ్చనిగడ్డి హాయిగాను, మనోహరముగాను, చూచుటకు అందముగాను ఉన్నవి. ఇట్టి ఒక అడవిలోనుండి గోపాలుడను బాలుడు గోవులను తోలుకొని పోవుచుండెను.

అట్లు వాడు తోలుకొని పోవుచుండగా మార్గమధ్యమున ఒక కొలను కనబడెను. అతడు పగలంతయు పనిచేసి యుండుటవలన, చాల అలసిపోయి యుండుటవలన, అతడా కొలనిలో స్నానముచేసి మరల గోవులను తోలుకొని పోయెను.

గోపాలుడు పదునైదేండ్ల ఈడు గలవాడు; మంచి గుణములు గలవాడు; చూచుటకు అందమును, తెల్లని వర్ణమును, ధైర్యసాహసములును గలవాడు. మంచి చురుకైనవాడు. బీదవాడైనను అందరిని వినయముతో చూచుచున్నవాడు.

అతడు మొదట ఒక బడిలో మొదటి తరగతి చదివెను. అది వీధిబడి. తరువాత మరొక పాఠశాలలో ప్రవేశించి మొదటిఫారము వరకు చదివెను. పదునైదేండ్లు రాగానే తన తండ్రికి సహాయము చేయుటకై — చదువుటకు వీలు లేనందున — బడి మానివేసెను. అతడు చదివిన తరగతు లన్నిటిలో 'ఫస్టు'గా నుండెను. అతని యెడల నందరు పంతుళ్లును ప్రేమతో నుండిరి. ఆమాట అట్లుంచుడు! అతడు రామాయణ-భారత కథల నప్పుడు చదువుచుండెను. అతడెల్లప్పుడు దేవునిమీద పాటలు పాడేవాడు.

ఇట్లుండగా ఒకరోజున ఒక ఆలోచన పుట్టెను. అదేమనగా దేవుని చూడవలెనని. కాని యతనికి తపస్సుచేయుట రాదు. మరేమి

చేయుటకు తోపలేదు. అప్పుడు తన తండ్రి నడిగి కనుక్కొందునని తలచి యతని దగ్గఱకు పోయెను. తండ్రి కొడుకుల కిట్లు సంవాదము జరిగెను.

గోపాలుడు:— నాయనా! నాకీరోజున ఒక యాలోచన కలిగినది.

తండ్రి:— ఏమిటిరా అది ?

గోపా:— నే నీరోజున ఆవులను మేపు చుండగా, నాలో నేను పాటలు పాడుకొంటిని. అప్పుడు నాకీ యాలోచన పుట్టినది. నేను తపస్సుచేసికొనుటకయి పోయినచో ఎంతో బాగుం డునని తోచినది. కాని తపస్సెట్లు చేయవల యునో నాకు తెలియదు. నీవు చెప్పెదవేమో యని వచ్చితిని. మరి చెప్పెదవా ?

తండ్రి:— నాయనా ! అదియా నీకోరిక ? నీవింకను చిన్నవాడవు. తపస్సుచేయ నక్కరలేదు. నీవెల్లప్పుడును భక్తితో భజనలు చేసినయెడల నీమీద దేవునికి దయగలిగి, నీవు కోరినవన్నియు నిచ్చును.

అప్పటినుండి గోపాలుడు చాలభక్తితో భగవంతుని ప్రార్థించుచుండెను. భజనలు చేయుచుండెను. ఆత డెంతయు సంతోషముగ నుండెను.

తరువాత నతనికి పెండ్లిచేసిరి.

అతని భార్యపేరు ?

పెండ్లిచేసిన ఆరేండ్లకు వారికొక కుమారి కలిగెను.

ఆ బాలిక చక్కగా ముద్దుగా పెరుగుచు వచ్చెను.

ఐదవయేట ఆబాలికను "బాలికలఉన్నతపాఠశాల"లో చదువవేసిరి.

పదియవయేడు వచ్చుసరి కామె మొదటిఫారములో చదువుచుండెను.

ఆమెయే తన తరగతిలో అన్నిటిలోను ప్రథమగా నుండెను.

---

# శారద, శ్యామ.

శ్రీమతి. ఆర్. లలిత, మరాటీబాలిక (మూడవఫారము.)

అది యొక సాయంకాలము. చల్లని గాలి వీచుచుండెను. సూర్యుఁడు బంగారమునుబోలి యున్న తన కిరణములతో అల్లఁబడిన వలను భూమిపైనుండి తిరిగి తీసికొనుచుండెను. పురుషులయొక్కయు, స్త్రీలయొక్కయు, గుంపులు విహారముకొఱకై, 'కమలాకా టేజ్' తట్టు పోవుచుండెను. చెట్ల ఆకులపై సూర్యుని కిరణములు ప్రసరించినప్పుడు, చూచువారికి ఆ ఆకులకు బంగారపు వన్నెవేసిన ట్లగపడుచుండెను. ఆ సమయమందున్న సూర్యుని యందమును జూచుటకుగాను, ప్రొద్దటినుండియు వికసింపనట్టి పూలు ఈసమయమునందు విచ్చి జనులకు పరిమళము నిచ్చి వారిని సంతోషపెట్టుచుండె ను. తుమ్మెదలు ఆహారము కొఱకై వెదకి వెదకి

చాల శ్రమపడినందువల్ల విశ్రాంతి పొందుటకై తమ గూళ్ళయొద్దకు పోవుచుండెను. పగలంతయు విశ్రాంతి పొందిన గుడ్లగూబ యిప్పుడు లేచి సంతోషముతో ఎగురుచుండెను.

ఇట్టి సమయమున పదునాల్గేండ్ల బాలిక ఒక కొండపై కూర్చుండి చుట్టుపట్ల శోభను చూచుచుండెను. అంతట మఱియొక బాలిక వచ్చి ఆమె కన్నులను మూసెను. అప్పుడామె చేతులనుదీసివైచి ఆమెతో 'ఎవరు? శ్యామా! కూర్చొనుము' అని యనెను.

శ్యామ:- శారదా! ఇంతవఱకు నిశ్శబ్దముగా కూర్చుండి ఏమిచేయుచుంటివి ?

శారద:- నేనా ? చుట్టుపట్ల శోభను చూచుచుంటిని. శ్యామా! మన మింతరమ్యముగా ఉండుస్థలమున ఉన్నయెడల, ఎంతహాయిగానుండును?

శ్యామ:- అవును. శారదా! అది నాకు గూడ ఇష్టమేగాని, మన మేమి చేయగలము ? ఆ అశుభ్రమైన యింటిలోనే కాలము గడపవలయును !

శారద.-శ్యామా ! అట్లేందు కనెదవు? దేవుని కృపయున్నయెడల మన మిట్టి రమ్యస్థలమున గూడ నివసింపగలము.

ఇట్లు వారు తమలో మాట్లాడుకొని, చీకటిపడినందువల్ల వారివారి యిండ్లకుపోయిరి.

శారద ఒక మధ్యమస్థితిలో నున్నవారి కూతురు. ఆమె అయిదవఫారములోనుండెను. ఆమె పరీక్షకు ఎనిమిదిరోజులు మాత్రముండెను. శ్యామ ఒక బీదగృహస్థు కూతురు. ఈమెయును శారద తరగతిలోనే చదువుచుండెను. శ్యామ యెల్లప్పుడును తన తరగతిలో 'ఫస్టు'గా ఉండునది.

పరీక్ష లయినవి. ఈదినము పరీక్షల ఫలితములను చెప్పుదినము. శ్యామ-శారద లిద్దరును బడికి ఉత్సాహముతో వచ్చియుండిరి. పైవారిలో కొందరి ముఖములు దుఃఖముతో నిండియుండెను. ఈపరీక్షలో శ్యామ మొదటిదిగను, శారద సెకండుగను వచ్చిరి.

* * * * * * * * *

సెలవు లయిపోయినవి. వీరిద్దరును మెట్రికు పరీక్షకు కూర్చొనియుండిరి. దీనిలో శారద గెల్చినది; శ్యామ వోడిపోయినది. ఎందుకనగా శ్యామ తలిదండ్రులు చనిపోయినందున చదువుటకు వీలుకల్గలేదు.

* * * * * * * * *

ఇప్పుడు శారద, శ్యామ యిద్దరును బి.ఎ. పరీక్షలో గెల్చిరి. శ్యామకు 'స్కాలరుషిప్పు' వారికినందున, ఆమె ఆపరీక్షవరకు చదువగల్గినది. మరియు వా రుద్యోగములుచేసి డబ్బు సంపాదించిరి. ఆ డబ్బును సత్కృత్యములకై వినియోగింపవలెనని నిశ్చయించుకొని రమ్యమైన స్థలమున ఒక ఆశ్రమమును గట్టించిరి. ఇందులో శారద 'సూపరింటెండెంటు' గను, శ్యామ 'మేట్రను' గను, మరికొంద ఱుపాధ్యాయినులు నుండిరి. ఇచ్చట అనేక బాలికలు విద్య నేర్చుకొనుచుండిరి.

ఆశ్రమమునకు సమీపమున నదియుండుటవల్ల బాలికలు ఈదుటగూడ నేర్చిరి. అచ్చట అనేకవిధములగు ఆవులుండెను; ఆవుల పాలను పిల్లలందరును త్రాగుచుండిరి. శారద, శ్యామ, పిల్లలను చాల దయగా చూచుచుండిరి. అందుచే ఆ బాలిక లందఱు వారికి మచ్చికపడియుండిరి. ఆశ్రమమునకు అంటి ఒక పెద్దతోట

యుండెను. అందులో నొక ఆటస్థలముగూడ నుండెను. దానిలో పిల్లలు సంతోషముతో ఆడుకొనువారు. అచ్చటి కార్యక్రమ మేమనగా,

౪ గంటలకు—కాలవిధులు తీర్చుట.
౫ ,, పాలు త్రాగుట.
౬ ,, ౧౧ వరకు బడి.
౩ ,, ౫ వరకు ఇష్టమున్న పనులు.
౫ ,, ౬ వరకు ఆట.
౬ ,, ౭ వరకు భోజనము.
౭ ,, ౮ వరకు ప్రార్థనము.
౮ ,, ౧౦ వరకు చదువు.
౧౦ ,, నుండి నిద్ర.

పాకలలో మేయుచున్న బలముగల ఆవులను, పాఠశాలలో చదువుచు, నదిలో ఈదుచు ఆడుచుండు బాలికలను, ఆశ్రమమును, తోటను అచ్చటి కార్యక్రమమును చూచినయెడల, ఒక ఉదాసీనుడైన మనుష్యుడుగూడ సంతోష పరవశుడు కాగలడు.

ఈ ఆశ్రమముపేరు శారదాశ్రమము. ఈవిధముగా శారదా శ్యామలు కాలము సుఖముగా గడుపుచుండిరి.





# ప్రబోధము.

శ్రీమతి. వ. ఇందిర, [యఫ్. వై. ఎ.]

గీ॥ న్యాయమా యింక నీవు ని ♦ ద్రా ప్తిగనుట? నడుముగట్టఁగవలె సుమ్ము ♦ నల్వురివలె
మాతృభారతి నుద్ధరిం ♦ పంగ నీవు, మేలుకొనుమమ్మ, చెల్లెలా! ♦ మేలుకొనుము ॥

గీ॥ అదిగో! వినఁబడఁగాలేదె ♦ ఆ ప్రబోధ, మొక్కప్రక్క భేరీనినా ♦ దోద్ధతంబు ;
మనలఁ గప్పిన చీఁకటి ♦ మాయమయ్యె, మేలుకొనుమమ్మ! చెల్లెలా ♦ మేలుకొనుము॥

గీ॥ విరివిగా విద్య మనము వ్యా ♦ పింపఁజేయ, సంఘసంస్కారమునకయి ♦ సాయపడఁగ
వనితలకునెల్ల బోధింప ♦ వలయుఁగాన, మేలుకొనుమమ్మ, చెల్లెలా! ♦ మేలుకొనుము॥

గీ॥ అకట! గుడ్డకుఁ గఱవయ్యె ♦ నన్నియును బ, రిశ్రమలువోయె; గతియించి ♦ రిసుమి చాల
నేరుపుంగలిగిన మన ♦ నేతగాండ్రు, మేలుకొనుమమ్మ, చెల్లెలా! ♦ మేలుకొనుము ॥

గీ॥ దేశదుస్థితి యిట్లుండె ♦ దీనముగను, సంఘమా యెంతయును నిరా ♦ శలకుఁగూలె
దేశసేవను జేసి కీ ♦ ర్తిని గడింప, మేలుకొనుమమ్మ, చెల్లెలా! ♦ మేలుకొనుము ॥

# రహస్యాపరాధపరిశోధకురాలు!!

శ్రీమతి. వ. ఇందిర, [యఫ్. వై. ఎ.]

౧

"ప్రభా! నాకేమియుఁ దోఁచుటలేదు."

"విశేషము లేమి?"

"ఈనాఁటి మధ్యాహ్నమొక స్త్రీవచ్చి తన భర్తయగు గంగూసింగు నెవరో హత్యగావించిరని తెల్పినది. వారి దీప్రక్కగ్రామమగు 'అమృతసర' మఁట. అందే యాతఁడు తపాలాఫీసు ఇన్స్పెక్టరుగాఁబనిచేసిన వాఁడట!"

"శవముదొరకిన దఁటనా?"

"ఎంతప్రయత్నించినను బయటఁబడలేదని తెలిసినది."

"శవమేమై యుండునో?"

"తమకుట్రలు బయటఁబడునని యెంచి శవమును దాఁచియుండవచ్చును."

"అతనిదేహమున నేమైన వస్తువు లుండెనా?"

"నాల్గువేలు ఖరీదుచేయు వజ్రపు టుంగర ముండినదఁట."

"అయిన దానియాశతో వారతనిఁజంపి యుండవచ్చును."

"ఉండవచ్చునేమోగాని, యిన్స్పెక్టరు కొంచెము ముసలివాఁడు; కాన రెండు దెబ్బలు వేసి తీసికొన్నను, దీసికొనవచ్చునుగదా! అందువలన—"

"అతని ఛాయాపటము గలదా?"

"నేనడిగితిని; గాని యామె తేలేదని చెప్పినది. మఱలఁబిలిపించి తీసికొనెదను."

"ఇఁకఁదాము దొంగనుబట్టి బంధించి ఘనతరయశమును గాంచవలయును."

"రాణిగారి సహాయము లేనిదేనా?"

అప్పటికే యెనిమిదిగంటల రాత్రియయినందున వారు భోజనమునకు వెళ్లిరి.

శచీంద్రుఁడు పత్తేదారుపనియందంతయనుభవశాలిగాఁడు. అయినను ప్రభావతి సహాయముతో నిదివఱకు రెండుమూఁడు దుర్ఘటమైన హత్యారహస్యములను గడుఁబూనికతోఁ గనిపెట్టి ప్రభుత్వమువారికి నివేదించియుండెను. ఇరువదెనిమిదేండ్ల యువకుఁడు గాన ధైర్యోత్సాహసాహసములతో — స్థిర శాంత స్వరముతో - బలిష్ఠమైన కాయముతో - గంభీరహృదయముతో నొప్పుచుండెను.

ప్రభావతియుఁ బతికిఁదగిన సతి. ఇరువదేండ్ల సుందరి. భారతనారీమణుల సాహసమంతయు నామెయందు మూర్తీభవించి యుండినందునఁ జోరశిఖామణులకుఁ బ్రక్కలోని బల్లెమై యుండెను. ఆమె రసపుత్రకులసంజాత. అశ్వారోహణము — అస్త్రశస్త్రాదిసంచాలనము — దేశాంతర పరిభ్రమణము — ఇవన్నియు నుగ్గుఁబాలతోఁ బెట్టఁబడిన విద్యలే. ప్రభ అర్ధాంగి యను నామమును సార్థకపఱచుకొని శచిబాబునకుఁ దోడునీడయై యుండెడిది.

౨

" నే నడిగినవాని కన్నిఁటికిని సరియైన సమాధానము లిమ్ము."

" సరియే."

" గంగూసింగుగారికిఁ దోఁబుట్టువు లెవ రైనఁ గలరా ?"

"కలరు. గోవింకసిం గనువాఁడు మాత్రి ము తమ్ముఁడు. కడమవా రప్పసెల్లెంద్రు. కాని వాఁ డపరియోజకుఁడని చెప్పవచ్చును. ఎల్లప్ప డింటిలోఁ గలహకారి."

"సింగుగా రెన్నఁడైన మందలించిరా?"

"మందలించిరి. కాని యతనికిఁ గోపము వచ్చి రెండుదినము లింటికి రాలేదు."

"అనఁగా నేమైన శత్రుత్వముగలదా?"

" ఉన్నదని చెప్పటకు వీలును లేదు. గాని తమ్ముని బనిచేయుమనుటయే కలహ కారణము."

అని యిట్లుచెప్పి యాస్త్రీ వెడలిపోయె ను. శచీందుని మూహారాజ్యమునందు సౌధ రాజముల నిర్మించుచు నట్లే నిదిరించెను.

3

"శవము దొరకినదా ?"

"ఆ. నాకు బహుమానముగ !"

"ఎట్లు ?"

"ఒక పెట్టెయందు; పల్లెవాండ్రదగ్గఱ."

"కుటిని బయటఁబడునని దాచుకొని యున్నవారు శవము నాపల్లెవారి కిచ్చుటెందు లకో?"

"వారిపై దోషము నారోపించుటకు. లేనిచోఁ దమకుఁ గష్టము రాదా?"

"పల్లెవాండ్రు మీకెట్లు కలిసిరి?"

"నే నొక సాధువేషముతో నాస్త్రీ యెచ్చట నివసించునో, యామెవృత్తాంతమే మో గూఢముగఁ గనిపెట్టు నుద్దేశముతోఁ బోయియుండఁ, బల్లెవాండ్రిరువురు సుందరమైన పెట్టెకొఱకుఁ బోట్లాడుచుండిరి. అనుమానా స్పదముగ నుండుటచే, శాణాయందుఁ బెట్టించి విప్పించి చూచితిని. ఆపెట్టెకుఁ గ్రిందుగ 'పత్తే దారులకు బహుమానము' అని వ్రాసియుండె ను. ఒక డాక్టరు కత్తితోఁ జంపఁబడిన శవమని నిర్దేశించెను.

"ఆయన యెవ్వఁడై యుండవచ్చును?"

"చూచినట్లేయున్నదిగాని, పేరు నాకుఁ జిరపరిచితముఁగాదు. ప్రభాకరుఁడఁట!"

"అక్కడి ప్ర భా క రుఁ డే యిక్కడి ప్ర భా వ తి !!"

"అయ్యో! నీవేనా? ప్రభా! నిన్నుఁ గొంచెమయిన గుర్తింపఁజాలకపోయితిని సుమా! ఈ హత్యారహస్యమును నీవే భేదింపుము. నే నూరక కావలసిన సాయము చేయుచుందును!"

"సరియే."

ఇంతలో 'తపాలజవా' నొకఁడు వచ్చి యొక యుత్తర మిచ్చెను. త్వరగాఁ జింపి ప్రభా వతి యిట్లు చదివెను.

"ప్రిభావతీ—శచీంద్రి పత్తేదారులకు. మేము పల్లెవారి కిచ్చినపెట్టె తమకు దొరకిన దని తెలిసి చాల సంతోషమైనది. మాయన్న గారు బ్రతికిన నేమి? చనిపోయిన నేమి? మీ కేమి చింత? ఆయనపై హత్యజరుగుట యెంతయవస రమై యుండవచ్చునో మీ కేమి తెలియును? మీ రనవసరముగా మా వ్యవహారమున జోక్య ము గలించుకొనుచున్నారని తెలిసికొనుఁడు !

జాగ్రత !! ఇఁక మీ రీపనినుండి విరమింపకున్న మీ కిద్దఱికిఁ జావు నిశ్చయము. మమ్ములను బట్టుకొనుటకుఁ బ్రయత్నములు, పిల్లితోడి యెలుకల చెలగాటములు—కొఱవితోఁ దలగోకికొనుటలు !

ఇట్లు,
"గోవిందసింగు"

శచీంద్రుఁడు విన్నపిమ్మట 'ఓహో! ఏమి వీని ప్రభావము ! తెమ్మను బట్టుకొనుట కొఱవితోఁ దలగోకికొనుటలా? చూతము, వీని దర్ప మెంతవఱకు సాగునో!''

ప్రభ :— దీనియందేమో రహస్యము గలదు. అయినను ముందుగ నే నీ గుంపెక్కడ నున్నదో పరీక్షింపవలయును.

శచీం:— మంచిది. పొమ్ము. నేనును వెళ్ళెదను.

ప్రభా శచీంద్రులారా ! మీ ప్రయత్నములు నిర్విఘ్నముగఁ గొనసాగుఁగాక !

అన్వర్థాభిధానయగు ప్రభావతి రాణి గల్లినుండి వెళ్ళఁగా వెళ్ళఁగా లోపల నొక్క చోట నొకమందిరము గనఁబడెను. దానికి మెట్లుండెను; వానినిఁ బట్టుకొని పోఁగాఁ దలుపొక్కటి—పైనఁ—దీసియుండెను. అక్కడ నేదో యొక్క తాళపుఁజెవిగుత్తి యొక్కచోఁ బడియుండెను. ప్రభావతి దేనికయినను మంచి దని యవి తీసికొనెను. ఆమె కొన్ని తాళములను దీయుచు లోపలికిఁ బోవుచుండెను. ఎంత లోపలికిఁ గడచినను, ఆమెకుఁ గావలసినవారు కనఁబడుట లేదు.

ఇంకను ముందునకు నడచుచునే యున్నది!

* * * * * * * * *

ఎందుల కామె యట్టు తటాలున నాగినది? ఎవ్వరో మాట్లాఁడుచున్నారు !!

* * * * * * * * *

ఇప్పటి కామె ప్రయత్నము సఫలమైనది! వారు మాట్లాఁడిన దంతయుఁ బ్రభావతి యివతలనుండి వ్రాసికొనుచుండెను.

అం దొకఁడు— విలాసవతీ! ఇఁక మన కడ్డెవ్వరు లేరు. గంగూసింగు ధనము మన యిష్టమువచ్చినట్లు వాడుకపఱుప వచ్చును.

విలాసవతి— అవునురా, అన్నయ్యా! పిశాచము వదలినది. నాకు వద్దువద్దనఁగా నీ ముసలి పెండ్లికొడుకున కిచ్చి వివాహముచేసిరి.

ఒకఁడు—నాభయమువలన—నీవు డబ్బు తెచ్చి యిచ్చినను నిన్నే మనకుండెడివాఁడు.

విలా— సరేకాని, ప్రస్తుతము బ్యాంకునకుఁ జీటివ్రాయు టంత సమంజసముకాదు. కాన నీ వీ వజ్రపుటుంగరమును రేపు పొద్దున రత్నాలవర్తకునివలె నమ్మి డబ్బుతీసికొనిరమ్ము.

ఒకఁడు— మంచిది.

విలా— ఒరే అన్నయ్యా! మనము వ్రాసిన యుత్తరము వారికిఁ జేరియుండ వచ్చును. వారు గోవిందసింగు వెంటఁబడెదరు.

ఒకఁడు—కాని నాపేరు గోవిందసింగని వారెఱుఁగరుగదా !

విలాస— ఔను.

ఒకఁడు— ఇఁక మన యింటికిఁ బోవుదమా? మఱి నేవచ్చునప్పుడు వీథితలుపు వేసితినో లేదోయని యిప్పుడనుమాన మగుచున్నది.

విలా— ఆఁ! ఈరాత్రివేళ నెవ్వరిచ్చటి కివత్తురు? అయినను బోవుచున్నాముగదా !

ప్రభావతి కది వారి యాలోచనమందిరమని తెలిసినది. ఆమె మెల్లఁగా వెనుకకుఁ దప్పుకొని వారిని వెంబడించెను. వారునుఁబోయి

పట్టణములో నొక గొప్పమందిరము చేరిరి.

౪

"ఈవస్తువులేమో యనుమానాస్పదం బుగ నున్నవి."

"పెద్దమనుష్యులతో నెట్లు మాట్లాడ వలయునో తమకుఁ దెలియదు కాఁబోలును!"

ఈ వాదన మా పట్టణమండలి ప్రసిద్ధ రత్నవర్తకుఁడగు హరబాబు కొట్టులో జరుగుచుండెను.

హరబా బొక యుంగరమును దీసికొని ప్రక్కనున్న తనస్నేహితుని కిచ్చెను. అతఁ డాయుంగరమును బరీక్షించి, క్రిందనున్న "స. గం." అను నక్షరములను గాంచి,

"ఎవరి దీయుంగరము?" అనియడిగెను.

అతఁడు— నాభార్యది. ప్రస్తుతము డబ్బవసరమయి దీని నిల్లమ్ముకొనుచుంటిమి. "స" మా యింటిపేరు. "గం" అనఁగా గంగాబాయి.

అతఁ డాలాగా? యని వానిఁ దేఱి పాఱఁ జూచి "ఆ! రంగగారు? ఎంత చతురత? సర్దారు గంగూసింగని యక్షరములుండ, నాభార్యయని చెప్పుదురా?" అనెను.

అతఁడు— అసందర్భప్రలాపము లింకఁ గట్టిపెట్టుము. మద్యపాన దేవతకు నమస్కరించి వచ్చితివా యేమి?

"ఆ! ఔను" అని తలపాగను గుంజివేయఁగా నల్లని కేశపాశము జాఱిపడెను.

హరబాబు విస్మితుఁడై, 'ప్రభా' యని యఱచెను. ప్రభావతి క్రిందఁజేరియున్న రక్షకభటులకు సంజ్ఞచేయఁగా వా రా రంగినిఁ బంధించిరి.

ప్రభ మేనమామ హరబాబు. అతఁ డామె బుద్ధిశౌర్యములకుఁ జాల సంతసిల్లెను. ఒకపని యయినదని ప్రభావతి యింటికి వెళ్ళఁగా శచీంద్రుఁడు నప్పుడే వచ్చియుండెను. ఆమె యతనితోఁ దానుజేసిన దంతయుఁ జెప్పివైచెను.

శచీంద్రుఁడు "సర్దారు గంగూసింగు తమ్ముఁడగు గోవిందసింగు జాడఁ గనిపెట్టితిని. అతఁడు తన యన్నగారి మరణమునకై చాల విచారపడియెను. వదినెగారు దేశములోని పొలమును జూచిరమ్మని పంపఁగాఁ బోయియుండెను. గంగూసింగాస్తి తనకే రావలయునని యతని తలంపు. కావున నేనాతఁడే హత్య గావించి యుండవచ్చునని తలంచితిని" అని చెప్పెను.

ప్రభా— కాని పేరునుజూచి యనుకొని యుండవచ్చును. అతని భార్యయగు విలాసవతి యన్నగారి పేరుగూడ గోవిందసింగే నఁట. వా రిరువురినిఁ బట్టినయెడల 215 నంబరు గృహమునందైనను, 15 నంబరు గృహమునందైనను బట్టవలయును. పోవుదమా మఱి?

ప్రభా శచీంద్రులు దుస్తులుమార్చి వెళ్లిరి.

౫

ఇరువురును ముందుగ 215 నంబరు గృహమున కరిగిరి; కాని వారు లేరని తెలిసికొని యంతకుముందే రక్షకభటులను గాపుంచిన 15 నంబ రింటికిఁ బోయిరి. ప్రభావతి మేడమెట్లెక్కి గొంతు మాఱుచుకొని "అమ్మగారు! తలుపు! తలుపు!" అని తట్టెను.

విలాసవతి రంగి (దాసి) యనుకొని త్వరగవచ్చి తలుపుఁ దీసెను, కాని—

ప్రభావతి! శచీంద్రుఁడు!! రక్షకభటులు!!!

ఆమె గుండె లవిసిపోయెను. ధైర్యము చిక్కఁబట్టుకొని, "ఏమి పనిమీఁద వచ్చినారు?" అని యడిగెను.

ప్రభ— మీరుచేసిన నేరములను మీచేతనే యొప్పించుట-కనుచుండఁగనే రక్షకభటు లామెను బంధించిరి.

విలాసవతి యన్న— గోవిందసింగు— పారిపోదమని కిటికీనుండి దుముకఁ బ్రయత్నింపఁగా, రక్షకభటులు పోయి యతనినిఁ గూడఁ బట్టుకొనిరి.

వారిద్దరినిఁ బ్రభావతీ శచీంద్రులు ఠానాకుఁ దీసికొనిపోయి యచ్చట నొప్పగించిరి. పిదప నేరమును విచారించు ప్రభుత్వమువారు విలాసవతి—గోవిందసింగులకు ద్వీపాంతరవాస శిక్ష విధించిరి.

ప్రభా శచీంద్రులు చక్కని బహుమతుల నందిరి.



# కృష్ణుఁడు, తృణావర్తుఁడు.

శ్రీమతి. వి. లక్ష్మీదేవి. (ప్రిమెట్రిక్.)

పూర్వ మొకరాక్షసుఁడు—తృణావర్తుఁ డనువాఁడు—వాయురూపమునఁ గంసప్రేరితుఁడై వచ్చి బాలకృష్ణు నెత్తుకొని పోవఁగా—

గీ॥ అఖిలదిశలకు వీచె మా ♦ యానిలంబు, ఊరి చెట్లుచేమలును వే ♦ ర్లూడిపడియె
సౌధసముదాయ మొక్కఁట ♦ జగతిఁగూలె, భూమియును గంపమును జెందె ♦ నేమిచెప్ప?
గీ॥ అంతట యశోద గుండియ ♦ లవసిపోవఁ, ద్వరగ సచ్చటికరుదెంచి ♦ బాలుఁగనఁగ
అచ్చటచ్చటి మూలల ♦ నరసిచూచెఁ, గాని, వాఁడేమియయ్యెనో ♦ కానదయ్యె॥
గీ॥ ఆ తృణావర్తుఁడు స్వరూప ♦ మవధరించి, అట్టె కృష్ణునితోఁగూడ ♦ నంబరమున
కెగసె గుట్టలు మిట్టల ♦ వెల్లదాటి, జివ్వమను ధ్వని జనుల మూ ♦ ర్ఛిల్లఁజేయ॥
గీ॥ బాలుఁ డాతని కుత్తుకఁ ♦ బట్టికొసియుఁ, జాల బరువయి యొకపెద్ద ♦ శైలమందుఁ
గూల్చి మఱి లేవనీయక ♦ క్రూరదనుజుఁ, గోరి బలమైన దెబ్బలు ♦ గొట్టసాగె॥
గీ॥ "ఓ!" యనుచువాఁడు వానికి ♦ నోర్వలేక, యెంతో యఱచుచు నటనుండి ♦ యెగిరిపోవఁ
బెనఁగులాడెను; కృష్ణుఁడు ♦ విడువకుండ, నొక్కిపట్టి తుదిఁజా వాని ♦ యుక్కడంచె॥
గీ॥ ఎదురువచ్చి యశోద చే ♦ యిచ్చి యెత్తి, చాలముద్దాడి గోపికా ♦ జనులకెల్ల
ప్రీతి నొసఁగూర్చఁ జూపింప ♦ వ్రేతలంత, బాలు నాశీర్వదించిరి ♦ లీల మెఱసి॥

# శకుంతలా ప్రయాణము.

శ్రీమతి. వి. లక్ష్మీదేవి, [ప్రిమెట్రిక్.]

[ప్రవేశము:— కణ్వుఁడు, శకుంతల, చెలికత్తెలు, ఋషికుమారులు.]

కణ్వుఁడు:– అమ్మా! శకుంతలా! పోయి రమ్ము నీభర్తయొద్దకు. ఎట్టివారికిఁగాని పుట్టిన యింటఁ జాలకాల ముండుట తగదు. అదియు నుగాక నీకొమరుఁడు రానురాను బ్రవర్ధమానుఁ డగుచున్నాఁడు. వానికి నేనేమి నేర్పవలెనో యది నేర్పితిని. ఇఁక రాజవిద్యలను నేర్చుటకు వాఁడు తగియున్నాఁడు. ఎవరైనఁగాని యత్తవారింటనుండి భర్తకు సేవచేయుచుఁ బతిభక్తిఁగల్గి 'పతివ్రత' యని యనిపించుకోవలయును. పుట్టినింటఁ జాలకాలముండిన నపకీర్తి వచ్చును.

గీ॥ అమ్మ! తనపుట్టినింట నే ♦ యతివకైనఁ
జాలకాలముగా నుంట ♦ చనదు గాన
నీ యనుఁగుభర్తయూరికిఁ ♦ బోయిరమ్మ
ఎట్టిచింతకు మదినిఁ దా ♦ వియ్యకుండ॥

అమ్మా! మంగళకరముగఁ బోయిరమ్ము.

శకుంతల:– (నమస్కరించును.)

కణ్వుఁడు:– ఇష్టకామ్యార్థసిద్ధిరస్తు. (ఆశీర్వదించును.)

చెలికత్తెలు:– అమ్మా! శకుంతలా! నీకు శుభమగుఁగాక.

ఋషికుమారులు:– అమ్మాయీ! మంగళప్రదముగా నీభర్తయిల్లు ప్రవేశింపుము.

శకుంతల:– (కన్నీటితో) ఆహా! ఇన్ని దినములనుండి యల్లారు ముద్దుగఁ బెంచుచున్న లేళ్ళను, వృక్షములను, నేఁడు విడిచిపోవలసిన విధివచ్చెఁగా!

(తండ్రివైపు తిరిగి) తండ్రీ! ఇన్నాళ్ళనుండి యెడఁబాసియున్న భర్తయొద్దకుఁ బోవలెనన్నఁ జాల సంతోషముగా నున్నదిగాని, మిమ్ములను, ఈ యాశ్రమమును, నా తీవెచెల్లెండ్రను విడిచిపోవుట మాత్రము చాల కష్టముగా నున్నది.

కణ్వుఁడు:– అమ్మా! ఏమియు భయపడకుము. నీవు పెంచుచున్న చెట్లకు నీళ్లుపోసి బాగుగాఁ బెంచెదను. లేళ్ళను గూడ మంచి యాహారముపెట్టి పోషించెదను. దిగులు పడకు మప్పుడప్పుడు వచ్చి చూచిపోవుదువుగాని.

శకుం:– (వృక్షముదగ్గఱకుఁబోయి) వృక్షరాజమా! నేను బోవుచున్నాను. మఱల నిన్ను జూచుభాగ్యము నాకెపుడు గల్గునోగదా!

గీ॥ వృక్షరాజమ! నిన్నిప్పు ♦ డేను విడిచి
కదలిపోవఁగ నింతయుఁ ♦ గాళ్ళురావు
నాదు మదికేమి తోఁచుట ♦ లేదునుమ్మ
ఇట్టివిధినిఁ దప్పింప నా ♦ కెట్టులగును?

ఓయీ! చింతింపకుము. నేఁ బోవుచుం

టినని వగపుతో మొగముఁ జిన్నబుచ్చుకొన్నట్లు తల వ్రేలవైచికొంటివా? కన్నీరు గార్చుచున్నట్లు ఆకులను జలజల రాల్చుచుంటివా? ఏమి చేయుదును? తప్పదు. ఇదిగో! నీకు నమస్కారము.

గీ॥ వృక్షరాజము! నా నమ ♦ స్కృతినిఁగొనుము
నీకుఁ గడసారిగా నిదే ♦ నీర; మింకఁ
జింతపడకుము; నాపయిఁ ♦ జేర్చియున్న
మమతమాని దీవించి పం ♦ పుముబిరాన॥

(నడచుచు) అయ్యో! చెలులారా! మిమ్ములను జూడక యెట్లుపోదు? తండ్రీ! మిమ్మును జూడక క్షణ మొక యుగము గాదా?

ఋషికు:- చెల్లెలా! శకుంతలా! ఏమిది? ఎవ్వరైన నిల్లువిడిచి యరణ్యమునకుఁ బోవలెనన్నఁ జింత యుండవలయును గాని, యడవిని విడిచి యింటికిఁబోవలెనన్నఁ జింతయా? ఇఁకఁ జాలు. రమ్ము పోవుదము. నీభర్త నిన్నుఁజూడఁగనే సంతోషించి భరతునికిఁ బట్టాభిషేక మొనర్చును. జాగుచేయకుము.

శకుం:- (ధైర్యము తెచ్చుకొని) ఆర్యా! పోయివచ్చెదను. లేళ్ళమందలారా! సెలవు. వృక్షరాజమా! నన్ను మఱవవుగదా! చెలులారా! మీరును నాతో రారుగదా!

(అందఱును 'పోయిర'మ్మనినట్లు కన్పట్టుదురు.)

కణ్వుఁడు:- అమ్మాయీ! శుభప్రదముగా నీభర్తయిల్లు ప్రవేశింపుము.

(అందఱు నిష్క్రమింతురు.)



# అశోక చక్రవర్తి.

శ్రీమతి. యన్. భారతీరత్నాకరాంబ, [ప్రిమెట్రిక్].

(ప్రవేశము:- సుదర్శనుఁడు, శశాంకుఁడు.)

సుద:- శశాంకా! ఈ నూతనప్రదేశమున, నాచారాదివిషయము లెఱుఁగని దేశమున నాపద్బాంధవునివలె నాకు లభించితివి; గాని లేకుండిన నిచ్చట నా పాట్లెట్లుండెడివోగదా!

శశాం:- సుదర్శనా! ఏల పొగడెదవు? ఈరాజు గుణగణము లెఱింగిన నట్లు వాపోవ నేర్తువా?

సుద:- మిత్రమా! ఏటిమాట లివి? నావంటి క్షుద్రుని రారాజగు మీరా జరయ నేర్చునా? పోనిమ్ము. ప్రాఁతవాఁడైన నేమోగాని క్రొత్తవాఁడనుగదా! ముసలివాఁడైన నేమోగాని, యతనిఁ గనికరింప వచ్చునుగాని నేను యువకుఁడను గదా! అందును బీదవాఁడను. ఇట్టి నన్నేమిచూచి మీరాజు రక్షించును? ఆయనయం దున్న యభిమానమే నిన్నిట్లనిపించినది.

శశాం:- కాదు. కాదు. నీవపోహపడుచున్నాఁడవు. మారాజు సుగుణము లేరాజునకైన నబ్బునే? అతఁడు కరుణానిధి; శౌర్యరాశి; గుణములపోగు; పేదలపాలిటి పెన్నిధి; వేయేల? ఆయన చరిత్రమును వర్ణింప నాదిశేషునికిఁ దరమగునా? అట్టివానినిఁ జుల్కచేసి నీవిట్లనుట లెస్సగాదు.

సుద:—క్షమింపుము. నాకుఁ దెలియకట్లంటిని. అతని విషయమై యించుక తెలుపుము.

శశాం:—వినుము. అతని పేరశోకుఁడు. రాజపుత్రులలో శిరోరత్నము వంటివాఁడు. అతని తండ్రి బిందుసారుఁడు; తాత చంద్రగుప్తుఁడు. ఈ మా సార్వభౌముఁ డన్నివిధములఁ దన పితామహునిఁ బోలియున్నాఁడు. చంద్రగుప్తుఁడు శౌర్యవంతులలో నగ్రగణ్యుఁడు. దిగ్విజయయాత్ర నొనర్చిన మేటిమగఁడు. బిందుసారుఁడును దండ్రికిఁ దీసిపోఁడు.

సుద:- మీ చక్రవర్తి యెన్ని రాజ్యములను జయించినాఁడు?

శశాం:— ఒక్కటేయైనను ఘనుఁడని పేరు వడసినవాఁడు సుమా!

సుద:—ఎందువలన నాఘనత? ఇంతకుమున్నాతఁ డత్యంతశౌర్యరాశియని పొగడఁబడినవాఁడే! అట్టివాఁ డిట్లు భీతిరాశియై యొక్కటే రాజ్యమును జయించి యూరకున్నాఁడేమి?

శశాం:— చాలుఁ జాలు నీ పరిహాసములు! ఆ సార్వభౌమశిఖామణియా భీరువు? పరమమిత్రుఁడ వగుటఁబట్టి బ్రతికితివి! లేకుండిన నేమయ్యెడివాఁడవో యెఱుఁగవుసుమా !

సుద:— మిత్రమా ! నాపై నంత యాగ్రహముబూనుటచనునా? ఇట్టిప్పి చుక్కపై బ్రహ్మాస్త్రముకాదా ? పోనిమ్ము. మీరాజు ప్రశంసనే తలఁపను.

శశాం:— సుదర్శనా! కోపగింపకుము. రాజభక్తియే నన్నిట్లనఁ బ్రేరేపించినది. మా రాజొక్క రాజ్యమును జయించినందులకుఁ గారణము లేకపోలేదు. అతఁడు కళింగదేశముపై దండయాత్ర వెడలి దానిని జయించెను. అప్పుడుభయపక్షములకు ఘోరసంగ్రామము జరిగినది. దానిలో లక్షమంది మృతులైరి. ఆ జనక్షయమునకును— ఆ రుధిరపాతమునకును — వగచి, రాజ్యకాంక్షయే దానికిఁ గారణమని కనుఁగొని. యప్పటినుఁడియు సంగమమానెను. అప్పుడే బౌద్ధమతస్థుఁ డైనాఁడు.

సుద:— అశోకుఁడు బౌద్ధుఁడా ! అట్లయిన నతని శాసనము లెయ్యవి ?

శశాం:—ఆతని ప్రథమశాసనము, "ప్రజలక్షేమమే నాక్షేమము; ప్రజల కానందము గల్పించుటయే నాముఖ్యవిధి." దీనినిఁబట్టి యాయనకుఁ బౌరులయందుగల యనురక్తియు, విశాలహృదయమును బోధపడుచున్నవిగదా ! రెండవది, "దయయు దానము, సత్యము, శౌచము, పరోపకారము ముఖ్యధర్మము"లని శాసించుచున్నది.

సుద:— మఱచితిని. అతని వంశమేది ?

శశాం:—మౌర్యవంశము. ఆమహాత్ముని గుణము లెంతని చెప్పఁగలను? మమ్మందఱ నాతఁ డపరిచితుల నాదరణచేయునిమిత్తము నియమించి యున్నవాఁడు. కనుకనే, నేను నిన్నాదరించుట తటస్థించినది. ఇదంతయు మహారాజు నాజ్ఞాప్రభావమే!

సుద:— అసత్యము! నీహృదయమునందీపవిత్రమైన గరుణ లేనియెడల నతనియాజ్ఞ

నెట్లు పాలింపఁగలవు? చాలుఁ జాలు. నావెను వెంటఁ దిరుగుచు, నాచర్యలను, నాహృదయ మునుగూడఁ గనిపెట్టుచున్నవాఁడ వని నేనెఱుఁగనా? కాని తనయాజ్ఞ నతిక్రమించినవారిని దయామయుఁడగు నతఁడు నిన్నే మొనర్చును?

శశాం:— మిత్రమా! అట్లుకాదు. ఆ చక్రవర్తి దయామయుఁడే గాని, యతని శాసన ప్రకారము చేయనివారిని శిక్షింపకమానఁడు. పరోపకారము మాని సోమరులవలె నామ మాత్రబాహ్యులయి యుండు టాతని యభిమత ముగాదు. బాధ్యులైనందులకు శాసనపరికారము నడచుకొనుటయే యతని యీప్సితము. అతని దయయే యీశిక్షల విధింపఁ జేయుచున్నది. పరదేశస్థులిట్లిడుమలఁబడుచుండఁ జూచి యోర్వలేక మమ్ము నియమించినాఁడు. అట్టి యాజ్ఞను మే మతిక్రమించిన మమ్ముల శిక్షింపక విడచునా? సుదర్శనా! మా సార్వభౌముని చర్యలను నానోట నాలకించుటకంటె స్వానుభవము నఁ దెలిసికొనుట లెస్స. ఏమనెదవు?

సుద:— అనుటకేమున్నది? నేనును నీవలె బ్రహ్మచర్య మవలంబించి, మీరాజుసేవఁ జేసి, నా జీవితశేషమును ధన్యత్వ మొందించి నేను తరింప నెంచుచున్నాను. ఇందుకుఁదోడు నీవును బ్రోత్సహించితివి. మన యభిప్రాయము లేకీభవించినప్పుడూరకుండు టెట్లు? జన రంజకుఁడగు చక్రవర్తియైన యశోధుని సర్వదా రక్షింపుమని యా సర్వాంతర్యామిని, నాదయామయుని, నా యీశ్వరుని వేఁడెదను.

కం॥ ఎల్లరు నెవ్వని కృపచేఁ
జల్లఁగ జీవింతు రట్టి ♦ సర్వేశ్వరు నా
యుల్లమున భక్తితోడుతఁ,
నెల్లపుడు శుభమ్ము లొసఁగ ♦ నే భజియింతున్॥

మిత్రమా! ఇంకఁబోవుదమా? మీయిల్లెక్కడ?



# ప్రతిఫలము.

శ్రీమతి. కోమలవల్లి, [ప్రిమెట్రిక్.]

గీ॥ ఒక్క నాఁటి మధ్యాహ్నమం ♦ దొక్క బాల, నీటికొఱకయి చిన్నబిం ♦ దెను ధరించి
బావికడకేగు చీరీతిఁ ♦ బల్కుచుండెఁ, గనులనుండి దుఃఖాశ్రువుల్ ♦ కాల్వగట్ట॥

గీ॥ "అబ్బ! ఇదియేమి యన్యాయ ♦ మగునుగాని, ఎల్లపుడు సుంత విశ్రాంతి ♦ నెఱుఁగకుండ
సవతి చెల్లెలు పెత్తనాల్ ♦ సలుపుచుండ, నింటిపనులెల్ల చేయుట ♦ యేనయయ్యో"

మ॥ అని యేమేమొ యనేకరీతులను చిం ♦ తాక్రాంతయై యేడ్చుచో
వినుచున్ సర్వజనావనుండయిన యా ♦ విష్ణుండు తా నామె నె

మ్మన మన్చోటఁ బరీక్షసేయుటకునై ♦ మార్వేసమ్ముఁ దాల్చి బా
లను నీరిమ్మని చీరె, నెంతయును మె ♦ ల్లన్; తృష్ణిపాసార్తితోన్ ।

మ॥ అరయన్, బాలిక జాలిఁబొంది, తన యా ♦ హారంబునం గొంచెమున్
మఱియుం గొంచెము త్రావ నీరిడియుఁ బ్రే ♦ మం జేయఁగాఁ గాంచి శ్రీ
హరి యాబాల దయార్ద్రచిత్తమున "క్షా ♦ రా!" యంచు లో మెచ్చుచున్
వరమిచ్చెన్ గడు నోటినుండియును ర ♦ త్నంబుల్ భువిన్ రాలఁగన్ ॥

కం॥ దానిఁగని సవతి తల్లియుఁ దానుం దనకూతు నావి ♦ ధంబెటేఁగి వడిన్
బూనిక బావికిఁ బంపెన్, దే సీటి, నలంకరించి ♦ స్థిరచిత్తముతోన్ ॥

కం॥ దానిఁ బరీక్షించుటకై, తానొక వేసమునుదాల్చి ♦ దైత్యాంతకుఁ డా
చానకడకుఁ జని "అమ్మా!, నే నార్తుఁడఁ, ద్రాగుటకును ♦ నీరి" మ్మనియెన్॥

గీ॥ అంత నామె నీరియ్యకుం ♦ టరసి, "నీకు, సర్పములు నోటఁబడు"నని ♦ శాపమొసఁగి
వెనుదిరుగకుండ విష్ణుండు ♦ వెడలిపోయె; నామెయును జేయునది లేక ♦ యరిగె నపుడు॥

గీ॥ అకట! ఇంటికి వెడలిన ♦ దాది, నోట, రాలుచుండిన క్రూర స ♦ ర్పములచేతఁ
గఱవఁబడి తల్లియును దాను ♦ బరమపదము, నొందుటయు; నామె సవతిస ♦ హోదరియును॥

గీ॥ క్రిందఁబడి వారికొఱకు దుః ♦ ఖించుచుండ, నొక్క రాజపుత్రుఁడువచ్చి ♦ యొక్కనాఁడు
ఆమె సుగుణంబులను గొని ♦ యాడి పెండ్లి, చేత నర్ధాంగిగా నంత ♦ స్వీకరించె ॥

—•• ••—

# రసపుత్ర శౌర్యము.

శ్రీమతి. యస్. భారతీరత్నాకరాంబ [ప్రిమెట్రిక్.]

[ప్రవేశము:- రాణా ప్రతాపసింగు, మానసింహుఁడు, నల్గురు రాజపుత్ర రాజులు.]

ప్రతాప:- మిత్రవర్యులారా! అక్బరు విషయ మేమైనఁ దెలియవచ్చినదా?

మాన:- ఆర్యా! ఆతఁడు మనతోఁ గయ్యమును మాని నెయ్యమును నెఱప సంసిద్ధుఁడై యున్నవాఁడు.

ఒక రాజపుత్రరాజు:- నెయ్య మొక్కటియేగాదు; సంబంధబాంధవ్యములను గూడ నెఱప నున్నాఁడు.

ప్రతాప:- మానసింహా! అక్బరు మన మనంబుల నెఱుఁగనేరక యిట్లాఁడి యుండవచ్చును.

మాన:- ఔను; అట్లే తోఁచుచున్న

ది. ఏలయన, ఆ రాజాధిరాజునకు—ఆ శాంత స్వరూపునకు—సేవచేయుటయే చాలునని మన మెంచుచున్న ట్లాతఁ డరయనేరఁడయ్యెను.

రెండవరాజు:- నే నీక్షణమున నాతని సన్నిధినిఁజేరి, "దేవా! నేను నీకింకఁ గింకరుఁడను. దేవరవారితో సంబంధబాంధవ్యములు కొనర్చుట కర్హుఁడను గానుగాని, మీ రత్యంతదయతో నాకొసఁగిన చనువున కెంతేయు సంతసించుచుంటి" నని చెప్పుటకు సంసిద్ధుఁడనై యున్నానని యెఱుఁగుఁడు.

మూఁడవరాజు:- నిజముగ నా రాజాధిరాజును బోలిన యాతఁ డీ భూవలయమునందుఁ గలఁడా?

ప్రతాప:- ఏమేమీ? మీరందఱు నాతనిసేవఁ జేయ నెంచుకొని యుంటిరా? నేను గలనయిన నిట్లగునని తలఁప లేదు.

నాల్గవరాజు:- మహారాజా! మేమింక నాతని సేవచేయ సంకల్పించుకొంటిమి. కాని, యక్బ రందులకు గౌరవింపఁడని యూరకుంటిమి. మన యదృష్టమున నా సార్వభౌముఁడే మనల నాహ్వానించి యున్నందున, మా మా యభిప్రాయములను దేటపఱచితిమి.

ప్రతాప:- మానసింహా! నీ యభిప్రాయమేమి?

మాన:- రాజా! నేను సహితము నా మిత్రులవలెనే యెంచుచుంటిని. దేవరవారి సమక్షమునఁ దెలుపఁజాలకుంటిని. "అక్బరు మన మనంబుల నెఱుంగనేరక యిట్లాడి" యున్నను, ధైర్యము వహించి యా "అక్బరు" నకు సేవచేయ సంసిద్ధుఁడను. ఇంతియేగాక, నా సో...ద...రి నా స...లీ...ము కుమారుని క...ర్థాం...గి...గా—

ప్రతాప:- ఆఁ! ఆఁ! మానసింహా! నీ సోదరినా? ఆ తురుష్కుని కొసంగ నెంచియుంటివి? ఎంతమాట! నేను శౌర్యరసపూరితంబులును, దేశభక్తియుతంబులును నగు "మన మనంబుల నెఱుఁగక యిట్లాడి యుండు" నని తలఁచితినేగాని, మీరందఱిట్లభిప్రాయపడుదురని యెఱుఁగను. ఆ తురుష్కునకుఁ బ్రిణమిల్లెదవా? (రోషముతో) ఛీ! ఛీ!! నీ వెంత నీచవాక్యము లాడుచుంటివి? సుక్షత్రియకులమున జన్మించి, నేర్పుతో దేశసేవచేసి, రాజభక్తకుండవై, మానసింహుఁడు సార్థకనామధేయుఁడని నేనెంచినట్లుగా వర్తించి, తుదకిట్లనుచుంటివేమి? మానసింహా! నీ దేశభక్తి యేమయ్యెను? నీ శౌర్య మేమయ్యెను? తురుష్కుని నామ మున్చరించినమాత్రానఁ గాలాగ్నిరుద్రునివలె మండిపడు నీ క్రోధ మేమయ్యెను? అన్నియు నశించినవా! ఇప్పుడైననేమి! మన వాక్యము లెవరును వినియుండలేదు. నీవు దుర్బోధలవలన మనము కలఁగి యిట్లాడితివేమో, మించినది లేదు నావాక్యము లాలించి, అక్బరుపై దాడివెడలుటకు సంసిద్ధుఁడవు కమ్ము.

రాజపుత్రసోదరులారా! మీరును యుద్ధమునకై త్వరపడుఁడు!

మాన:- ఆరాజును, ఏమీ! తుచ్ఛుఁడని యెంచుచుంటివా? నీ వెన్ని చెప్పినను నేను వినను. ప్రతాపసింహా! మే మందఱ మొక్కచోఁ జేరి నీపయి కయిననువచ్చెదము కాని నేనే నావినాశసూచనగా, అక్బరు సార్వభౌమునిపైకి దండెత్తెదనా? నీ వాతని క్షమింప వేడినయెడల, ఆ దయాపరుఁడు నిన్ను క్షమించును.

ప్రతా:- ఛీ! ఛీ!! దురాత్మా! నన్నా తురుష్కుని క్షమాపణము వేడుమనుచుంటివా?

మానసింహా!—కాదు. కాదు—మానహీనా! సుక్షత్రియవంశజుఁడ నగునేను— చిత్తూరు రాజ్యరమావల్లభుఁడనగు నేను— అక్బరునా ?— వేడుటయా?— కల్ల. కల్ల! నీవలె నేను పొట్టకూటికై అక్బరు నాశ్రయించి తాత తండ్రుల యశమును మంటఁగలిపెద ననుకొంటివా? చాలుఁ జాలు నీ వాక్యములు. చిరకాల మిత్రుఁడవనియు, స్వవంశసంజాతుఁడవనియు మన్నించితిని గాని. పరుఁడవైనచో శిరచ్ఛేదనము గావించియుండకుందునా? కృతఘ్నులారా! పొండు. నాకును అక్బరునకును కాఁగల సమరమునందుఁ బునర్దర్శన మగుఁగాక. ఇట్టి దేశద్రోహులను నాసమక్షమం దుంచుకొనఁజాలను. పొండు— పొండు—వేగమే లేచిపొండు.

మాన:- (లేచి) "వినాశకాలే విపరీత బుద్ధి" అను వాక్యము నీయందే సార్థకమైనది. నీకు వినాశకాలము సమీపించుటవలననే అక్బరుతో విరోధము పూనుచుంటివి. మేముకూడ నిట్టివాని సమక్షమున నిలువఁ జాలము.

(నిష్క్రమింతురు.)

—:o:—

(యుద్ధరంగము— ప్రతాపసింహుఁడు, సేనతో—అక్బరు, సేనతో.)

మాన:— (తనలో) ఆహా! ఏమి యీ ప్రతాపసింహుని ప్రతాపము! సర్వప్రదేశముల లోఁ దానయై, యశేషపరాక్రమముతోఁ దురుష్క సేనను జంచి చెండాఁడుచున్నాఁడు గదా! నిజముగ నతఁడే సార్థకనాముఁడు, దేశభక్తుఁడు. సేనయంతయు సురిగినను, బలమడఁగినను, గాయమునిండుగ గాయము లయినను, ఆ ధీరుఁడు—తన పూనికను మానక—యింకను సమరము సల్పుచున్నవాఁడు. అదిగో! అతని సేన యంతయు క్షీణించినది. సామంతరాజుల ప్రోత్సాహముచే యుద్ధరంగమును వీడి చనుచున్నాఁడు. ఏమో పలుకుచున్నాఁడు గూడను.

ప్రతా:- సైనికులారా! నేను యుద్ధరంగమును వీడి చనుచున్నాఁడను— భీరుత్వము వల్ల గాదు సుమండీ! నాశ్రేయోభిలాషుల యుపదేశానుసారముగా వెడలిపోయి తటి చూచి నాదేశభక్తిని వెల్లడించుటకే. మానసింహా! అక్బరుతో నావాక్యములుగా నిట్లు తెలుపుము. "తురుష్కుఁడా! నాదేహమునందు సుక్షత్రియోచితమగు నుష్ణరక్తము ప్రవహించుచున్నది. ఎప్పటికైనను, ఈ ప్రతాపసింహుఁడు నీ ప్రక్కలోని బల్లెముగ నెుఁగు" మని. (అందఱు నిష్క్రమింతురు.)



# కోడండ్రసభ.

శ్రీమతి. వై. అమృతమ్మ, [మూఁడవఫారము.]

ప్రమద, ఉమాబాల, శ్వేత, లీల, మలయవతి- వీరైదుగురును బంచపాండవులరీతి నొకదిన ముద్యానవనమునకు వెళ్లిరి. వీరందఱు పరస్పర విశ్వాసప్రీతిపాత్రలు.

ఆవన మెంతయు నానందదాయకమై యుండెను. తరువులు ఫలపుష్పభారముచే వంగి వారికి నీడఁ గల్పించినట్లుగా నుండెను. వాని నుండి రాలిన పుష్పములచేఁ గప్పఁబడి భూమి యంతయుఁ బూపాన్పు పఱచినట్లుండెను. సుగంధబంధురమగు చల్లగాలి వీచుచుండఁ దమలోఁ దాము వా రిట్లు మాట్లాడుకొనఁజొచ్చిరి.

ప్రమద:- చెలులారా! ఎన్నిదినముల కిట్టి సంతోష మనుభవింపఁగల్గెను?

శ్వేత:- చెలీ! నీమాటలలో దుఃఖహేతు వేదో పొడకట్టుచున్నది; కాని యర్థము కాలేదు.

ప్రమ:- శ్వేతా! ఆగోల యంతయు నిప్పు డెందులకు?

శ్వేత:- నీ శరీర మనారోగ్యముగ నుండెనా? లేక మీయింటివారు నిన్నుఁ బ్రేమింపరా? మఱేమయిన నితరకారణములు గలవా?

లీల:- చెలీ! ఇంతగ నడుగుచున్నప్పుడు చెప్పరాదఁటే!

ప్రమ:-ఏమున్నది? కోడఱికమునకు గుఱియైన నాజీవితమే దుర్భరమైనది. మా యత్తగారు ప్రతిదిన మొక స్వల్పవిషయమునుగూర్చి తప్పుఁబట్టుచు నన్ను సదా తిట్టుచుండును. ఎప్పుడు నాపైఁ దప్పు కనఁబడునా యని శ్రీహరి నామె పూజించుచుండును. పైఁగా నా కష్టసుఖములను మాయమ్మతో-నే నేపాపకర్మ మెఱుఁగకపోయినను- జెప్పివచ్చితినని నాతో రెండు మాసములనుండియు మాటాడుటలేదు. ఒకవేళ మాటాడినను గలహామే! ఆహా! పుట్టినిండ్లలోనుండఁగా నిట్టి కష్టములపాలగుదు మని యెన్నఁడైనఁ దలంతుమా? ఇంతకుఁ బూర్వజన్మములో నెట్టిపాపము చేసియుంటినో? నా కులీపాయలపప్పులు సనినఁ జాలప్రీతి. "నీవు బ్రాహ్మణులదానవు గావా? నీ కింతమాత్రము జ్ఞానములేదా? మడిలేదు; మైలలేదు; ఏదో కడుపుకింత తింటేసరి!" యని యనరాని మాటలనుచు, వంటయింటినుండి నన్నుఁ దఱిమివేసి, పొయ్యి మఱల నలికి మఱల నాచారమునకుఁ దగినట్టుగ బయలుదేఱును. కాని పైపని యంతయు నేనే చేయవలయును. పని చేసినచో నఱిగిపోవుదునని కాదు; కాని యడ్డమయిన మాటలో?—

ఉమాబాల:- ప్రమదా! మాయత్తగారి ముందఱ మీ యత్తగారు మహాసరళహృదయయే యగును. ఏమందువా? మాయత్తగారిని 'కలియుగరాక్షసి' యనియే చెప్పవచ్చును. నేను సబ్బురాచుకొని స్నానముచేసి తెల్లనిబట్టలు వేసికొనుట నాకభ్యాసము. ఆమె

యో, అస్తమానము నూతియొద్దఁ గూరుచుని స్నానము సేయుచుండును. పైఁగా నన్ను: "నీవు చాఁకలివాఁడు తెచ్చిన వస్త్రము లేల ధరించితివి? నీ వేమి దొరసానివా?" యని దూషించును. ఆమాటలన్నియుఁ జెప్పినఁ దొల్లి వాల్మీకి మహర్షి వ్రాసిన రామాయణము కాఁగలదు. మన పూర్వాచార మేల పోఁగొట్టవలెనని ముందుగఁ బసుపురాచుకొని, స్నానముచేసి పిదప 'పౌడరు' వేసికొనెదను. అప్పుడే యామెకుఁ గోపము. నా నాథుఁ డెపుడయిన నాకుఁ బది రూప్యములిచ్చిన నిల్లంతయు నల్లకల్లోలముఁ గావించును. నాపతి సంపాదించిన దానిలోఁ బది రూప్యములకయిన నోచుకొనఁగూడదా? యని నేనడుగ, "నాకెందులకు? నేఁబోయి నూతిలోఁ బడెద" నని బెదరించును.

ఒకరోజున నొక బిచ్చపువాఁడు వచ్చెను. ఆమె నాతోమాటలాడకుండుటవల్ల నేనేపోయి వానికి బిచ్చము వేసితిని. ఈ స్వల్పాపరాధమునకే 'నాపెత్తనము నంతయు నీవే తీసికొంటి' వని చెప్పరాని తిట్లు తిట్టెను. అంతటితో నాగినదా? తన కూతురుతో నున్నవి లేనివిగూడఁ జెప్పి, యామెచేఁగూడఁ దిట్టించినది. ఇంత దానికే నాస్థితి యిట్లున్నచో, సంకేమని చెప్పవలయునో యూహింపుఁడు.

లీల:- అయ్యో! బాల్యమునుండియు నొక్కచోఁ బెరిగి యొక్కచోటికే వచ్చితిమి గదా యని సంతోషింపవలసినదాని కిట్టు లందఱిని నొక్క యదృష్టమే పట్టుట కేమి యనవచ్చును? లేక యీస్థలమహత్త్వమే యట్టిదో? చూడుఁడు. నాభర్తకును నాకును విద్యయనిన నెంతో ప్రీతి. అందువలన గృహకృత్యములన్ని యు శీఘ్రముగా నెరవేర్చుకొనవలయునని నే నాతురతపడుచుండఁగా నేవో యడ్డదిడ్డములు చెప్పి విఘ్నములు కల్పించును. పోనీ, పడుకోఁబోవునప్పుడైనఁ జదువుకొందమనిన, దీపపుఁ జమురూరక కాలిపోవుచున్నదని మఱొక బాధ. చూడుఁ డెంతలోభత్వమో! మా పుట్టింట నుండినప్పుడు ప్రపంచములో నిట్టి విపరీతస్త్రీ లుందురనియు, నట్టియామె నా కత్తయగుననియుఁ దలఁచియుంటినా? మాఁవాం డ్రెవరైన వచ్చిన యెడల వారికంటె ముందుగ నన్ను భోజనమునకు లేపును. ఏమందురా? నన్నెప్పు డంత ప్రేమించునని వా రభిప్రాయ పడవలయుననియే కాని వేఱుగాదు. వాండ్రు గడప దాటినారో, యిఁకఁ దిట్టుట ప్రారంభించును. అప్పటినుండి మఱల నేనే యందఱికి వంటఁ జేయవలయును పోనీ! అత్తమామ లేగదా. పరిచర్య వారికిఁ జేయుట యుచితమేగదా, యనుకొన్నచో-అందులో నుప్పెక్కువ- యిందులోఁ బప్పుతక్కువ- యని యెప్పు డాక్షేపణమే. ఊరక జాతి రంపానఁ బెట్టుచున్నచో మనలఁ గాదని యెట్లూరకుండఁగలము? మనమేమి జాతిబొమ్మలమా?

శ్వేత:- అట్లయినచో నేనింకఁ బ్రదికి పోయెడిదానను సుమా! నాకష్టాలముందఱ నీవి దిగదుడుపు. మీరందఱు పడునవి నా కభ్యాసమైనవే! పైఁగాఁ బగలంతయు నన్నుఁ గావలసినన్ని తిట్టి, సాయంకాల మాయన 'ఆఫీసు' నుండి రాఁగనె, వట్టి యబద్ధాలు కల్పించి చెప్పును; ఆఁకలిమంట కీమంట తోడుకాఁగా గబగబమని వచ్చి, యాయన నన్నుఁ జావఁగొట్టును. పాపమని యాతల్లి యడ్డుపడనయినఁ బడదు. ఇంతలో నిరుగుపొరుగువారు గుమిఁగూడుట! అక్కలారా! నాస్థితి యీనాల్గురోజులకే నడి

వీథికెక్కినది! ఈ హేయమైన బ్రదుకుబ్రదుకుట కంటెఁ జావే మేలని తోఁచుచున్నది. ఉన్న చోఁ దిందుము; లేనియెడలఁ గడుపులోఁ గాళ్లు పెట్టుకొని పడియుందుము; గాని యీ రట్టుకాపురపుగోడు పడలేనమ్మా!

మలయవతి "నేను వచ్చితినేగాని యింటివద్ద నా కేమి మూఁడనున్నదో యని గుండె పీకుచునే యున్నది. చెలులారా! నేఁబోవలయును" అని లేచెను. అంతట నొకరి వెనుక నొకరు లేచి, యందఱుఁ దమ తమ యత్తల భయము కొలఁదిని విసవిసఁబోయిరి.





# కోరిక.

శ్రీమతి. వై. కౌసల్యాదేవి. (ప్రిమెట్రిక్.)

గీ॥ నేను నమ్మితి నీపాద ♦ నీరజముల, వేగ నీ ఘోరసంసార ♦ సాగరమున
నుండి కడతేర్చి సదయత ♦ యొప్పమీఱ, మోక్షమార్గముఁ జూపు మో ♦ ముద్దుకృష్ణ!

సీ॥ భక్తుఁడై దాస్యత ♦ త్పరత నొప్పినయట్టి, ప్రహ్లాదు నెట్లు గా ♦ పాఁడి తీవు?
ఎప్పుడు నీయందె ♦ యిద్ధభావుఁడగు గ, జేంద్రుని నెట్లు పా ♦ లించి తీవు?
దుర్బుద్ధియయ్యు ము ♦ క్తుండయి వఱలిన, క్రూరరావణు నెట్లు ♦ ద్రుంచి తీవు?
ఆఱునెలలవాఁడ ♦ వయ్యు, నీ శత్రువౌ, నల తృణావర్తు నె ♦ ట్లడఁచి తీవు?

గీ॥ ఎంతటి యసాధ్య కార్యంబు ♦ లేని, లీలఁ
జేసితివి; వాని సన్నిఁటిఁ ♦ జెలఁగి పొగడ
నెవరి తరమగు? నైన, న ♦ ట్లే దయార్ద్ర
చిత్తమున నన్నుఁ బ్రోవవా? ♦ శ్రీనివాస!!





# పూజ.

శ్రీమతి. వి. లక్ష్మీదేవి, [ప్రిమెట్రిక్.]

(ప్రవేశము:- నారాయణరావు, పద్మావతి.)

పద్మావతి:— ఏమండీ ! ఆరుగంటలు కావచ్చుచున్నదే! ఇంతవఱకు స్నానములేదు- సంధ్యలేదు. ఈనడుమ బొత్తుగా మీ రాచార మన్న మాటనే మఱచిపోయిన ట్లున్నదే! నిద్ర మంచాన లేచుట, ముఖమైన సరిగాఁ గడుగు కొనకముందే కాఫి త్రాగుట, బయటఁ బడుట యునా? పోనీ! ఏ పండ్రెండుగంటలకో వచ్చి స్నాన మొనరించి, పూజ—పురస్కారములు చేయుటయైన నున్నదా? ఏమియులేదు. ఇంకు కొఱకేగదా మనకీ దరిద్రత ? నారాయణుని పేరు పెట్టుకొన్నారే; దాని సార్థకతకయినను, నారాయణునిఁ బూజింపరాదా ?

నారాయణరావు:— సరి. సరి. ఇఁకను నిద్రలేవకముందే సింహమువలె రాకుము. ఇఁక మీఁద నీవు చెప్పినట్లే యొనర్చెదనెమ్మ.

పద్మా:— పూజ కంతయు సిద్ధముగా నుంచితిని. స్నానముచేసి త్వరగా రండు.

నారా:— ఆ. ఆలాగేలే.

* *  * *  * *
*  *  *

పూజ

నారా:— శ్రీరాఘవం దశర—పద్మావతీ! అదుగో! అదుగో! పాలు పొంగినవాసన ! రమ్మ, రమ్మ.

పద్మా:— నేనంతయుఁ జూచుకొందును. మీరూరక పూజ యొనరింపుఁడు.

నారా:- శ్రీరాఘవం దశరథాత్మజ— అయ్యో! పిల్లివచ్చి పాలు త్రాగి పోవుచున్నది. త్వరగారా వేమి ?

పద్మా:- మీకీపనియందు జోక్యమెందులకు ? దేవునిధ్యానమనినఁ బిల్లిసంగతి పాలసంగతి యెందులకు ? కానిండు మీపూజ !

నారా:- ఆలాగే ! శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం—పద్మా ! ఈవేళ మన శంకరానికిఁ బొద్దున బడియఁటగా ! పోఁడా మఱి ?

పద్మా:- వాఁడు పోతేనేమి ? పోకున్న నేమి ? ముందు మీపని కానిండు.

నారా:- పుత్రుని విషయమై యోచింపవలదనెదవా యేమి ?

పద్మా:- ఆ ! ఇపుడే యంతయుఁ బుత్రప్రేమ కొట్టుకొని పోవుచున్నది. పూజ చేయునపుడే యంతయు వచ్చెఁగాఁ బోలును ! ముందాపనినిఁ గానిండు, పుత్రమోహమట్లుండనిచ్చి! సుమారఱగంట కావచ్చినదే ! ఇంకను శ్లోకపాద మొక్కటిగూడఁ గాలేదు. ఇంత బాగున్నది మీభక్తి! మనస్సుండినచో మార్గముండు ననునది యెందులకు ? ఇందులకే కాదా మఱి ? కావున నెట్టి పనిచేసిన నన్నియు నెఱవేఱును ;

ఆ విధముగనే భక్తితోఁ బూజచేసిన నన్నియు నీడేఱును. ఇపుడయిననుగానిండు!

నారా:— ఆ, అలాగే చేసెదనుగాని, కోపపడకు; నీ పుణ్యమవును! ఎవరైనను విని నవ్విపోయెదరు.

పద్మా:- నవ్వెదరని భయ ముండినపుడు, నిష్ఠతోఁ బూజ చేయవలయును. అట్లు చేసిన నేల నవ్వెదరు? మీభక్తి నౌకరు నేర్చునట్లుండలెను గాని, వారిచే నవ్వించుకొనిన నెంత యవమానము!

నారా:- శ్రీరాఘవం, దశరథాత్మజమప్రమేయం, సీతాపతిం, రఘుకులాన్వయరత్నదీపం, ఆజానుబాహుం, మరవిందదళాయతాక్షం—పద్మా! కాఫీ తయారుగా నుంచుము. పూజ నైపోవచ్చినది.

పద్మా:-(మెల్లఁగ) అబ్బా! ఎక్కడి దిక్కుమాలిన కాఫియో!

నారా:- రామం నిశాచర వినాశకరం నమామి—అమ్మయ్య! పూజ ముగిసినది. ఇప్పుడేమో మెల్లఁగా నంటివి? మఱొక మాఱు చెప్పు. మొదలదియుండనిచ్చి కాఫితే!

పద్మా:- నే నీదినమునఁ గాఫిచేయలేదు. నా కదియనినఁ దలనొప్పి. దానిని మీ రీదినమునుండి మానివేయవలయును! ఏదీ, యొక్క సంవత్సరమునుండి యేగదా యీ యలవాటు. ఎక్కడ నేర్చుకొంటిరోగాని, యీ కాఫీలు, ఈ క్లబ్బులు, ఈ సిగరెట్లు!! రెండేండ్ల క్రిందట నెంత దేశభక్తి-ఎంత యాచారము-ఎంతనిష్ఠ! ఇప్పు డవన్నియుఁ బోయినవి; ఇవి వచ్చినవి. ఆహా! కాలమహిమ! ఒక్కమాఱుగ మనస్సు మాఱుట యనిన, గ్రహచార మనవలెనా, మఱే మనవలెను? అబ్బే! పూర్వాచారములేవియు బాగులేవని, నవనాగరకతా వ్యామోహమహాసముద్రమున మునుఁగుచుంటిరి కాఁబోలు! ఆకాఫీక్లబ్బునకుఁ బ్రతిదినము పోకపోయినచో, మించిన దేమున్నది? ఆ సిగరెట్లకు ఖర్చు పెట్టకపోయిన నేమి? ఈ యనవసరపు వానికి వ్యయపఱచకపోతే, నా డబ్బంతయుఁ జేర్చినఁ జక్కఁగా వారమున కొకసారి బీదసాదల కన్నము పెట్టింపవచ్చునే!!!





# పరీక్ష.

శ్రీమతి. ఇందిర. (ఎఫ్. వై. ఎ.)

కొందఱు,

గీ॥ "పాపపుఁ బరీక్ష శనివలెఁ ♦ బట్టుకొనియె", ననుచుఁ దమ యనిష్టముఁ బ్రద ♦ ర్శనముసేసి
నిందు నల్లని జెండాల ♦ నిచ్చు వెనుకఁ, దఱుముచున్నారు సుమ్ము, వి ♦ ద్యార్థులెల్ల॥

కాని,

గీ॥ అమ్మ! దండము లివిగో! నీ ♦ వాదరించు, దీవెనలనిచ్చి పంపుట ♦ తెఱఁగు నీకు
నీ చరణసేవ లభియించె ♦ నేఁటి, కెదురు, చూడఁ జూడఁగఁ బదినెలల్ ♦ చొఱవఁజేసి॥

# చెవిటివారి సంభాషణము

శ్రీమతి. యన్. భారతీరత్నాకరాంబ [ప్రిమెట్రిక్.]

[ రామమ్మ—నరసమ్మ. ]

రామమ్మ:- నరసమ్మగారూ! రండి. కనఁబడుట లేదే బొత్తిగా?

నరసమ్మ:- ఔనండీ! పెద్దవారగుచుండిరి గాన, వినఁబడుట లేదు.

రామ:- కూర్చోండీ! నిల్చునే మాట్లాడు చున్నారు?

నర:-అన్నము వార్చివత్తునను చున్నారా? సరే! తొందరేమి, వార్చండి.

రామ:- ఈసంవత్సరము మీతోఁటలో నేమి పండించినారండీ?

నర:- మా యింట్లో నేమి వండించినా రనుచున్నారా? వంకాయకూర—పెసరపప్పు వడియాలు.

రామ:- వంకాయ చెట్లు, పెసరమడి యునా? బాగున్నది. మీయబ్బాయి పెండ్లికై చాల ప్రయాసపడుచున్నారే?

నర:- ప్రియాణ మెక్కడికి, ఈ కోఁత గోజులలో?

రామ:- పాఁత గాజు లేమిటండీ! సంసారులకుఁ బ్రతివారి క్రొత్తగాజులు రమ్మంటే రాఁగలవా మఱి?

నర:-అన్నట్టు మఱచితినిఁ జెప్పుటకు—రేపువచ్చే మంగళవారము మా యమ్మాయినిఁ బాపుదురఁట.

రామ:- అయ్యో! ఇందుకోఁలు కింత చెప్పవలెనా? మాయింటికి రేపు మంగలివాఁడు వచ్చినయెడల, మీ యిష్టప్రకారమే మా అబ్బాయినిచ్చి పంపెదను లెండి తప్పకుండ!

నర:-అయ్యో! పాపము! ఇది మూఁడో యేఁడనుకొందును మెట్రికులోఁ బ్రవేశించి! ఈయేఁడు తప్పినాఁడా మీ యబ్బాయి?

(ప్రవేశము:- వెంకటేశము-విశ్వనాథశాస్త్రి.)

వేంక:- అమ్మా! ఈయనయే మొన్న పురాణము చెప్పినది పట్టణములో!

రామ:- కట్నములో నిచ్చిన పూనా కండువా సియ్యమనుచున్నావా? ఎందుకురా యిప్పుడు? మీనాన్న వచ్చినతర్వాతి ఇత్తును.

వేంక:- సరే. నాన్న వచ్చుదాక నీయన నుండుమనుచున్నావా? అట్లే చెప్పెదనులే!

రామ:- ఏమిటీ? "నీపని చెప్పెదనులే" అనుచున్నావా? ఏమి చెప్పెదవు? అడ్డగాడిద లాగు తిరుగుట మరిగి నన్నదిరించుచున్నావా?

వేంక:- నువ్వులసూనె మెంపులకే ముఖమునకు రాచుకోమనెదవు?

నర:-"తద్దినానికి దడి అడ్డముగాఁగట్టినఁగాని తిరుగుటకు వీలులే" దని మీ యమ్మ యనుచుండఁగా, నువ్వు ముఖ్యము తద్దినానికనెద వేమిటి?

విశ్వనాథశాస్త్రి :- ( ఆశ్చర్యముతో వేంకటేశముచు జూచి) వత్సా! మీ మువ్వురి

వాక్సరణి నన్నాశ్చర్యమగ్నునిఁ జేసినది మీ రిట్లు వాక్రుచ్చుటకుం గల ప్రబలనిమిత్తమేమి?

వేంక:-స్వామీ! వాక్కాయలు తెప్పించి పప్పులో వేయించుమనుచున్నారా? మీరేమి కోరినను, అది తెచ్చిపెట్టుదుము.

రామ:- సంతకువెళ్ళి వక్కలు తెచ్చెదననుచున్నావా? నీ యుద్యోగానికి వక్కలు కూడనఁటరా?

వేంక:-'ఈయన కుద్యోగమెక్కడ' అని యనుచున్నావా? ఆయన కుద్యోగమెందుకే? కాలిపైఁ గాలు వేసికొని మహారాజులాగు తినుటకు వీలున్నది. కావలసినంత చదువున్నవాండ్ర కుద్యోగాలెందుకు మనవంటివారికిగాని?

విశ్వ:- కుమారా! మీ రిత్తెఱంగున భాషించుచున్నారేల? ఇద్దాని సమాచారము సవిస్తరముగా వినవలతును.

వేంక:- స్వామీ! భాషికములు బజారులో దొరకఁగలవు. ఇప్పుడు కత్తెర యెందులకు?

నర:- రామమ్మగారు! పోయివచ్చెదను.

రామ:- పొయ్యి కావలెనా మీకు? తేపు మావానికిచ్చి పంపెదను లెండి.

(నరసమ్మ పోవును; రామమ్మ భర్త నారాయణరావు ప్రవేశించును.

వేంక:- నాన్నా! ఈయన గొప్ప పండితులుగారు. మన యింటికిరాక తప్పించుకొని పోవుచుండఁగా, నేను బట్టుకొని తీసుకొని వచ్చితిని.

నారా:- (దవడపై నొక్కటివేసి) వెధవా! ఇంకను సిగ్గులేక పరీక్ష తప్పితినని చెప్పుచున్నావా! బుద్ధిమంతుఁడవు!!

వేంక:- (ఏడ్చును).

విశ్వ:- అయ్యో! ఏమియు నెఱుఁగని కసుగాయను హింసించుట తగునా?

నారా:- స్వామీ! నమస్కారము.

విశ్వ:- ఈప్సితార్థసిద్ధిరస్తు.

నారా:- ఏమిటయ్యా! పిచ్చివాఁడవు కమ్మని దీవించుచున్నావా?

విశ్వ:- (స్వగతము) నా వాక్యము నీ మూఢుఁడెఱుంగలేఁడు. (ప్రకాశముగ) కళ్యాణమస్తు.

నారా:- ఓహో! మితిమీఱుచున్నదే నీపని! నేను కల్లుత్రాగుదునని యనెదవా?

విశ్వ:- అయ్యో! బధిరాగ్రేసరులారా! మీరు నా వాక్యముల నెఱుఁగలేరు. నేఁబోయెదను. (పోవును)

నారా:- ఇంటిలోఁ గూర్చొని మమ్మలనే తిట్టుచున్నావా? గౌరవముగా లేచిపో!

రామ:- కారములేని నిన్నటి గారెలు తెమ్మనుచున్నారా? ఇదిగో! వెళ్ళి తెచ్చెదను. (వెళ్ళును.)

నారా:- అబ్బాయీ! మన యింటిలో నెవ్వరికి లేని చెవుడు నీకు వచ్చినదేమిటి? ఆ విశ్వనాథశాస్త్రిగారి గాలి తగిలినదా యేమి కర్మము? రా. పోదము. (నిష్క్రమింతురు)



# భారతనాగరకతాదర్శము

శ్రీమతి. క. లక్ష్మీబాయి, (మెట్రిక్యు.)

సరళ:- ఏమే గిరిజా! మాటలాడిన నోటి ముత్యములు రాలునని కాఁబోలు! ఏమి పని మునిఁగిపోయినదని యంత విసవిస పోవుచున్నావే? ప్రాతస్నేహితురాలితో నొక పలుకైనఁ బలుకఁగూడదా? ఇంతకును నైజగుణం బెటువోవును? అన్వర్థాభిధేయ వైతివిగదే?

గిరిజ:- ఓహో! సరళా! నీవఁటే! బహుకాలదర్శనము! క్షమింపుము. నిన్నుఁ జూడలేదే నేను. అందువల్లనే సరాసరి వెడలిపోవుచుంటిని. నే నన్వర్థాభిధేయ నే కావచ్చునుగాని, సరళా! నీ సరళహృదయ మెందు డాఁగికొనినదే? మాపాఠశాలను వీడిననాఁటినుండియు నాఁటికి నేఁడుగదా దర్శనము లభించుట!

సర:- అబ్బే! ఏమిచేయుదునే? మీ పాఠశాలలోవలె మాకుఁ జీటికి మాటికి సెలవులు లేవు గానఁ దీఱిక గల్గుటలేదు.

గిరి:- అమ్మమ్మో! అంత తీఱికలేకే మంత వెలుగఁబెట్టుచుంటివే! ఇంతకును మీ విద్యాశాలలో నన్ని విషయములను జచ్చుతెలుఁగులో నేగదా బోధించుట? తక్కిన పాఠశాలలలో 'మాధ్యమిక తరగతి'కిఁ గూడఁ బనికిరానివారు మీ పాఠశాలలోఁ బ్రవేశపరీక్షకు, బ్రథమసంవత్సర పరీక్షకు సరిపోదురు, నీ హాడా విడియేగాని! మీ పాఠశాల యీ యూరియందలి యే పాఠశాలతో సరిపోలఁగలదు? ఆ మీ పూనా విశ్వవిద్యాలయ పరీక్షలను మఱియే విశ్వవిద్యాలయములును దమ పరీక్షలతోఁ బోల్చుకొనవుగదా? అక్కడఁ గడఁదేఱిన వారు గరిటె యాశ్రమమును బొందవలసినదే!

సర:- ఔనౌను. గిరిజా! నిజముఁ బలికితివి. జ్వరపడినవానికిఁ బంచదారయుఁ జేదనినట్లు, సర్వదా వందనీయయగు మన తల్లి బాస నీకుఁ జచ్చుతెలుఁగైనది! తల్లిపాలు ద్రావి రొమ్ముగుద్దిన ట్లున్నది నీతీరు. మా పాఠశాల యీ యూరియందలి యేపాఠశాలతో సరిపోలఁజాలదు నీవనినట్లు! ఏమందువా? దేశాభివృద్ధి కారకమగు విశాలదృష్టితో స్వదేశాభిమానులును, స్త్రీవిద్యాభిమానులును నగువారిచే స్థాపింపఁబడుటవలనను.— మహనీయులు సిద్ధసంకల్పులుగదా!— వారి యున్నతాశయముల బలముననో, భారతీదేవి యవ్యాజకరుణావిశేషమువలననో, విద్యార్థినుల యదృష్టవశముననో గాని. మా పాఠశాల అధ్యాపకులు ధనమునకాసించి విద్యనభ్యసింపఁ జేయువారుగాక, కేవల స్త్రీవిద్యాభిమానమువల్లనే విధివిరామములు లేక హృదయపూర్వకముగా బోధించువారగుటను; బరమపూజ్యమగు మాతృభారతి ద్వారా విషయము లెల్లను బోధింపఁబడుటవలనను, ఎట్టి శాశ్వతాదాయము లేకున్నను విద్యార్థినులయొద్ద వేతనములఁ గైకొనక యుచితముగా విద్యలఁ గఱపుటవలనను; మా

పాఠశాల మఱి యే పాఠశాలతో సరిరాదనుట సత్యమే! సత్యమును బలికినందులకు నీ నోటఁ బిడికెడు పంచదార బోయవలసినదే! ఇఁక నన్ని పాఠశాలలో 'మాధ్యమికతరగతి'కిఁగూడఁ జాలనివా రిచటఁ బ్రివేశపరీక్షలకుఁ బ్రథమ సంవత్సరపరీక్షలకుం దగుట, ఉగ్గుఁబాలతో నల వడిన—యఱగొఱలేని—మాతృభాషలో నన్ని విషయములును జక్కఁగా బోధింపఁబడుటవల ననే యని తెలిసికొనుము. మా పూఁటా విశ్వ విద్యాలయ పరీక్షల పాశ్చాత్త్య మింకఁగొన్నాళ్లు తాళిన నదియే వెల్లడి కాఁగలదు. ముంజేతి కంకణమున కద్దమెందులకు? ఆ పరీక్షల గడిఁదే ఱినవారికి గరిటయే శరణమా? నీకు గరిటెతో సంబంధము వలదుకాఁబోలును! గాని దాని సహవాసములేనిది మా కొక్క గడియయుఁ గడవఁబోదు. పిడికెఁ డన్నము వండి తానింత తిని పరుల కింతపెట్టి ప్రపంచసేవ—స్వార్థత్యా గరూపమైన పరమప్రేమబోధకమగు ప్రపంచ సేవ-సేయుచు బ్రహ్మానందపడని స్త్రీజన్మయేల? నీ వనినట్లు మాపాఠశాలలో గృహనిర్వాహక విద్యయే నేర్పఁబడుచున్నది. మే మంతకుఁజా లినఁ జాలు. వంట జేయుట నీచమని నీకుఁ దోఁ చుఁగాక. ఎందుచే భారతనారీమణులను "అన్న పూర్ణాదేవి" తుల్యలని యనిరో జ్ఞప్తి యున్న దా? సేవ—సేవ యని యూరక వాచాలత జూపు నీ రోజులలో, స్త్రీలు గృహనిర్వాహ కత్వ విద్యచే నెట్టి దేశసేవ చేయుచున్నారో కనుపిచ్చి చూచితివా? ఎంతమంది ప్రాణులను దమసేవచేఁ బ్రిదికించుచున్నారో చూచితివా? అతిథి—అభ్యాగతుల యభ్యర్చనముచే నెంత కృతార్థ లగుచుండిరో గమనించితివా? కావున నే భారతనాగరకతయందు గృహిణికి గృహ నిర్వాహకము ముఖ్యమైనది. మాది యాచరణ శూరతగాని, యాలాపశూరతగాదు. ఔను గాని, గిరిజా! నీవాలకముఁ జూడఁ బాశ్చాత్త్య నాగరకత రూపొందిన ట్లున్నదే! ఇప్పుడే విదే శములనుండి యూడిపడిన ట్లున్నావే!

గిరి:- ఆ! చాలు, కట్టిపెట్టుము. విద్యా నాగరకతల నత్యంతము గల్గిన పాశ్చాత్త్యుల పుణ్యమా యని వారుపెట్టిన భిక్షగా నునవా రింత చదువుసంధ్యలు నేర్చి, వారి రమణీయ నాగరకత నలవఱచుకొను భాగ్యము నేటికై నను గల్గుట యనునది మఱెంత గర్వింపవలసిన విషయమేగాని, గర్హింపఁదగినది గాదుసుమా!

సర:- ఔనే! గర్వింపఁదగినదే! "వెఱ్ఱి దీఱె, రోఁకటిం దలకుఁ జుట్టు" మన్నట్లు, జాతీ యతను మఱచిపోయి, వేషభాషల వెఱ్ఱిభ్రమ లచేఁ బరనాగరకతకుఁ బ్రాకులాఁడుచుఁ బర వస్తుదొంగిలిక్క నీకుఁ బవిత్ర భారతజాతీయ నాగ రకత యౌన్నత్య మెట్లు బోధపడఁగలదు? ఈ వేషభాషల వేలము వెఱ్ఱివలన నెన్ని పచ్చని కొంపలు పాడుగాలేదు?

ప్రపంచమునకే విద్యాభిక్ష నెవరుపెట్టి రో తెలిసికొనఁగల్గుటకు, నీవసిన చచ్చు తెనుఁ గునఁ జదివినట్లుగా నన్యభాషలలోఁ జదివిన దేశచరిత్రలు తలకెక్కినఁగదా? ఒకవేళ నెక్కి నను దద్వ్యామోహమున నిజము గుర్తింతువా?

సర్వవిషయములయం దనాదినుండియు సర్వతోముఖపాండిత్యమున కందెవేసిన చేయి మన భారతజాతియే! ఇతర ఖండములు విద్య యనఁగా నల్లనిదో తెల్లనిదో యెఱుఁగని కాల మునందే క్రీ.పూ. 2,000 వత్సరముల ముందే

మిక్కిలి యౌన్నత్యమునఁ దులఁదూగినది. మన భారతదేశమే గదా! అంతకుఁ బూర్వమే ఋగ్వేదము విరచింపఁబడి యార్యుల నాగరకతకుఁ బ్రశస్తి యబ్బినది! ఋగ్వేదకాల మిప్పటికి క్రీ.పూ. 8,000 మొదలు 6,000 వఱకని చరిత్రకారు లభిప్రాయపడుచున్నారు. మఱియొకరు 30,000 అని యన్నారు. ఏది యెట్లున్నను మన నాగరకత యతి ప్రాచీనముగదా! నీవు నిది ఇట్లని యింగ్లీషులోనే పఠించితివిగదా! ఋగ్వేదమునకంటెఁ బురాతన గ్రంథము ప్రపంచములోనే లేదన్నప్పుడు మఱేమి చెప్పవచ్చును? అప్పటి స్త్రీలు పురుషులవలెనే బ్రహ్మవిద్యను నేర్చి సభలలో శాస్త్రచర్చలలోఁ బాల్గొనుచుండిరి. ఉపనిషత్తులలోని యాధ్యాత్మిక విద్యను మాక్సుముల్లరు మొదలగు పాశ్చాత్య పండితులు వేనోళ్ళఁ బొగడియున్నారు. "ఆకాలపు భారతీయు లందఱును వేదాంతులే!" యని వారియభిప్రాయము.

శ్రౌత—గృహ్య—ధర్మసూత్రములు, వానిని బట్టి వ్రాయఁబడిన మనుధర్మశాస్త్రము ను వెలువడినవి. దానినిఁబట్టియే, నాగరకత యందగ్రగణ్యులని నీచేఁ దలంపఁబడునట్టి గ్రీకులు, రోమనులు, నాంగ్లేయులు మున్నగు పాశ్చాత్యులు తమ తమ ధర్మశాస్త్రములను నిర్ణయించుకొనిరి. అక్బరు కాలమున 'తోడగుమల్లు'ను దానినిఁ బట్టియే (ఖానూన్) న్యాయశాస్త్రమును నిర్ణయించెను. చాలవఱ కిప్పుడు మన రాజ్యమూ ధర్మశాస్త్రప్రకారమే పాలింపఁబడుచున్నది. ఏవి పాశ్చాత్యులచేఁ గనుగొనఁబడి మనకు మహోపకార మొనరించుచున్నవనుచుంటిమో యట్టి ఖగోళశాస్త్రము, భూగోళశాస్త్రము, భూగర్భశాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము, వృక్షశాస్త్రము, వైదశాస్త్రము గణితశాస్త్రము, చతుష్షష్టికళలు— ఇది యది యన నేల? అఖిల ప్రపంచ నిర్వహణమున కాధారభూతములగు—ముఖ్యములగు—సర్వవిద్యలను నీదృష్టిలో ననాగరకులగు మనవారి యశేష శేముషీజనితవిశేషములే సుమా!

పదునాఱవ శతాబ్దమువఱకును భూమి గుండ్రముగా నున్నదని యైరోపీయులకుఁ దెలియనే తెలియదు. ఆర్యభట్టు ఖగోళశాస్త్రమును రచించి, భూమి తనచుట్టు తాను దిరిగివచ్చు విధమును, సూర్య—చంద్రగ్రహణముల పద్ధతులను దెల్పియున్నాఁడు. వరాహమిహిరుఁడు బృహత్సంహితను రచించి, వర్షపాతము, భూకంపము, శిల్పవిద్య, రత్నశాస్త్రము, జంతుశాస్త్రము మొదలగు ననేకవిద్యలను వివరించెను. పండ్రెండవశతాబ్దమున భాస్కరాచార్యులు, 'సిద్ధాంతశిరోమణి' యను ఖగోళశాస్త్రమును రచించి భూమి కాకర్షణశక్తి గలదని నిరూపించెను.

దశాంశభిన్నపద్ధతిని మన హిందువులే కనిపెట్టిరి. మన యాయుర్వేదముకంటెఁ బురాతనమైన వైద్య శాస్త్రమే లేదు. కనిష్కుని యాస్థానవైద్యుఁడు చరకుఁడు రోగతత్వమును, వస్తుగుణమును జర్చించెను. నాల్గవ శతాబ్దమువాఁడగు సుశ్రుతుఁడు శస్త్రశాస్త్రమును రచించి, శస్త్రములఁ బేర్కొనెను. ఇప్పుడైనఁ దల కెక్కినదా, ప్రపంచమునకే విద్యాభిక్ష యెవ్వరు పెట్టిరో?

గిరి:— చెలీ! ఎంతగ మాటనేర్పరివైతివే? గుక్కఁ ద్రిప్పకుండ నీ విద్యామహత్త్వ

మును ప్రదర్శించితివి! హిందూ నాగరకతా సభ్యతను జర్చించితివి !

సర:- అబ్బే! అంతలో నణుమాత్రమైనను నేను జెప్పఁజాలలేదు. నీ యనక తవక వేషము, నీయన్యాయపువ్యామోహము నన్నింతవఱకుఁ బ్రోత్సహించినవి. ఇంతవఱ కోపికతో విన్నందులకు నా కృతజ్ఞతావందనములు. ఇంకఁ గొంచెము తాళుము.

గిరి:- మంచిది చెప్పుము !

సర:- గిరిజా! నీవు దృష్టిభేదమువలన నుక్కిరిబిక్కిరి యగుచుంటివి గాని, భావమును మార్చుకొని జాతీయ దృష్టితో యోజించిన నీకుమాత్రము తోఁపదా? Kippling చెప్పినట్లు "East is East, West is West," ఏ సుమీ! సఖీమణీ! ఏదీ వ్రిలుముడచి చెప్పుము? పాశ్చాత్య ఖండములలో నెక్కడనైన నుక్కుసెనగల నుడికించు మహిమాన్వితను; ప్రాణవిభు ప్రాణరక్షణార్థము భాస్కరు నుదయింపనీయని యమోఘవచనను; గార్చిచ్చును జప్పన చల్లార్చిన-చందన శీతలముగా నొనర్చిన-ధన్య చరిత్రను; గాలునిఁగూడ మెప్పించి, జీవితేశుని జీవితమును దిరుగఁ గైకొనఁజాలిన సాధ్వీమ తల్లిని; మాతృభారతిగాక మఱెవ్వారు కనఁగల్గిరో? శ్రీరామునిఁబోలిన పితృవాక్యపరిపాలకులు, హరిశ్చంద్రున కెనయగు సత్యవాక్యదీక్షాపరులు, శిబి—కర్ణాదులవంటి దానశూరులు, హనుమదాదులవంటి బ్రహ్మచర్య వ్రతస్థులు; మన దేశమునఁగాక మఱెక్కడ గలరు? మనవారి యాధ్యాత్మికవిద్యాభినివేశము నీవెందుఁ గనుఁగొనగలవు ?

అంతవఱ కెందులకు? నేఁడుమాత్రము మనమధ్య నెందఱు స్వార్థత్యాగులు, మహాత్ములు, దేశోద్ధారకులు. విశ్వదాతలు, దేశబంధువులు, మహర్షులు,— (మృతజీవులు గూడ) నెందఱు లేరు? ఈ లోకమాన్యుల చరిత్రము లెంత చదివినఁ దనివితీఱును?

మన భారతభూమి కర్మభూమి—యోగభూమి—జ్ఞానభూమి-పైఁబయి వన్నెలఁ జరించునది కాదు—పై చూపులకందరానిది. మన నాగరకతకును, పాశ్చాత్య నాగరకతకును బ్రివిమలపతివ్రత యకృత్రిమరూప వర్తనంబులకును బణ్యాంగన కృత్రిమ రూపవర్తనంబులకును నెంత వ్యత్యాసముగలదో యంత వ్యత్యాసమే కలదు. పాశ్చాత్యనాగరకత కింద్రియారామత ముఖ్యము. భారతనాగరకత కింద్రియ నిగ్రహము—ఆత్మారామత్వము—ముఖ్యము. మనకు మొదటినుండియు నాముష్మికదృష్టియే గమ్యస్థానము. తైత్తిరీయోపనిషత్తులో "ప్రాణారామం మన ఆనందం-శాంతి సమృద్ధ" మ్మని చెప్పఁబడినట్లు లోక నాగరకతాసభ్యతను వీనినిఁబట్టి చర్చింపవలయును. ఇవియే మన 'భారత నాగరకతాదర్శ' మని నొక్కి చెప్పవలయును.

అరిషడ్వర్గములను జయించి, యాత్మానాత్మ వివేకమువల్ల సాధించు నా బ్రహ్మసుఖస్థితియే దీనివల్ల నుద్ఘాటింపఁబడుచున్నది. కర్మాచరణమువ్వారా "ప్రాణారామ" త్వమును, దదీశ్వరసమర్పణము ద్వారా " మన ఆనంద " స్థితియును, దద్వారా "శాంతిసమృద్ధ" తయుఁ జేకూఱుచున్నవి. ఇంతకన్న శ్రేష్ఠతరమగు నాదర్శ మెద్దిగలదు? కావలసిన యాదర్శమిదియే యైనప్పుడు, నది భారతజాతికే చెందినప్పు, డిం

కే మనియెదవు? దానిని నేర్చి, యాచరించి, తదానంద మనుభవించి ధన్యులగుట భారతీయ ధర్మ మగునందువా?

గిరిజ:- ప్రాణసఖి! సరళా! నీ సరళ వాగమృతధారవలన నా హృదయమాలిన్యమం తయుఁ గడిగివేయఁబడినది. నేఁడు నాపుణ్యము ఫలించినది. ఇప్పుడే యీ వేషమును ద్యజించి, తేఁపటినుండి బాలికల ఉన్నతపాఠశాలను జేరి, యచ్చట మీతోఁబాటు భాషాసేవ సేతును.

సరళ:- గిరిజా! ధన్యోస్మి.—తథాస్తు.





# చలి! చలి!!

శ్రీమతి. క. లక్ష్మీబాయి, [మెట్రిక్.]

గీ॥ అబ్బ! చలి! నీవిధం బెంతొ ◆ యబ్బురమును, గొల్పెడింగద! పో! బెడఁ ◆ గుందనమున
నుబ్బి తబ్బిబ్బుబింకమ్ము ◆ నొంది పొరిఁబొ, రిఁగను గురియించెదో నేఁడు ◆ తేపు గరము॥

మ॥ చెలువొప్పన్ రవి యుప్పరంబునఁ బ్రకా ◆ శింపంగఁ, జీ! తస్కరుం
బలె నెట్లోచని, యాతఁ డపరది ◆ గ్భాగంబునుం జేర మ
మ్మలఁతింబెట్టఁగఁ జేరినావె యిటఁ? గ ◆ ట్టా! యింత సిగ్గేల లే
దిలపై నీకుఁ? జలీ! దురాత్ముఁడవటం ◆ చెన్నందగుంగా నిన్నున్!

గీ॥ ఏరయినఁ గాని విద్యార్థు ◆ లెరికైన, నఱఁగొఱలు లేని యాదర ◆ మతిశయింపఁ
గరము సాయము జేతురు ◆ గాని, నీవొ, గరువతన మూని చెనకెదు ◆ గాదె యిట్లు॥

గీ॥ పరగ మాపాలనా ◆ లోకబాంధవుండె, కలుగఁడేని యీ సరికొక ◆ గంతునఁ గబ
ళింప వే తొలిముద్దఁగా? ◆ నింపుమీఱు, మృదులగుణ మబ్బనె విభావ ◆ రీచరునకు?

గీ॥ చాలు; నీకేటి కింతటి ◆ జంకుఁ గొంకు, లరయ లేని యీ బీరంబు ◆ లవియు నిత్య
ములె, తలంపవుగా కయ్యొ! ◆ మూఁడునాళ్ళ, మురిపె మివియని యైశ్వర్య ◆ ముగ్ధపోల్కి॥

గీ॥ చలిగ! జాగ్రత్తగానుండఁ ◆ జనును నీకు, విమల జ్ఞానాగ్ని మాయొద్ద ◆ విలసితముగ
బొసఁగియుండు ఎఱుఁగవు గాఁ ◆ బోలు! నద్ది, మించు నీపొగరట్టె య ◆ డంచు; నిజము॥

గీ॥ ఆసురంబున నీవిట్టు ◆ ల సురుసురు మ, నంగఁ జేసిన. సురుచిర ◆ నవ్యకుసుమ
మృదులనితిమె యయ్యో! బొ ◆ మ్మింక మాకు, నమ్ము; నీపప్పు లుడుకవు ◆ సుమ్ము జగతి॥

# వియోగము.

శ్రీమతి. వి. లక్ష్మీదేవి, [పిరిమెట్రిక్.]

గీ॥ సీతఁ గానక రాముఁడు ♦ చింతతోడఁ
నడలుచుండంగ, లక్ష్మణుఁ ♦ డాత్మఁ గుంది
ఎన్నొవిధముల సోదార్చఁ ♦ బృథ్వీపతియు
వెడలె ననుజసమేతుఁడై ♦ వెలఁదికొఱకు ॥

గీ॥ అట్లు చనుచుండ మార్గమ ♦ ధ్యంబునందుఁ
గొండవోలె జటాయువు ♦ గోచరించి
అవనిసుత వార్తఁ దెలిసిన ♦ యంతవఱకుఁ
దెలుపుటయు, వారు ♦ దక్షిణ ♦ దిశనుబట్టి ॥

గీ॥ అరుగుచో, నొక్కయెడఁ గబం ♦ ధాసురుండు
అడ్డగించుటయును, వారు ♦ నట్టి యతని
పయికి లంఘించి తద్దీర్ఘ ♦ బాహువులను
నిమిషమాత్రాన ఖండించి ♦ నిలిచి రంత ॥

గీ॥ వేగ నా దనుజుండును ♦ వింతయఱపు
లఱచి, గంధర్వరూపము ♦ నవధరించి
"నాదు శాపంబు నెడఁబాపి ♦ నన్నుఁ బ్రోచి
నట్టి మీకు నమస్కృతు" ♦ లనుచుఁ జనియె ॥

గీ॥ వేడ్కమెయి వార లాతని ♦ వీడుకొలిపి
ఋష్యమూకాద్రినిం జేర ♦ నేగి రంత
ననిలపుత్రుఁడు చనుదెంచి ♦ యాదరించి
వారి సుగ్రీవుదాఁపున ♦ వదలివేసె ॥

గీ॥ అధిక ముదమున సుగ్రీవుఁ ♦ డాదరించి
సీతవృత్తాంత మదియెల్ల ♦ చెప్పఁబడియు
నామెఁ గనుఁగొనఁగపులకు ♦ నాజ్ఞ యిడఁగ
నెలమి హనుమన్న వారితో ♦ నిట్టు లనియె ॥

కం॥ "కాకుత్థ్సవంశరత్నమ! నీకడకును వేగఁదెత్తు ♦ నీసతి నిపుడే
నీ కేటి కింతశోకము? వీఁకఁగ దీవించిపంప ♦ వే! సుగుణనిధీ!

# భారతీయులపైఁ బాశ్చాత్య నాగరకతాప్రభావము.

శ్రీమతి. టి. ప్రేమలతాదేవి, (ఎఫ్. వై.ఎ.)

నాగరకత బలిమిమైగాని చూచి నేర్చినఁగాని యలవడునది గాదు. అట్లయినచో నది నాగరకత యని యనిపించుకొనదు. దేశకాలపాత్రములనుబట్టి నాగరకత యలవడును. దీనివల్ల నొకదేశపు నాగరకత మఱియొకదేశమునకు సరిపడదని చదువరులే గ్రహింపఁగలరు. నాగరకతయందు వేషభాషలేగాక, సామాజిక-మత రాజకీయశాఖలు గూడ నిందిమిడి యున్నవి.

కాని మనము ప్రస్తుతము పైఁజెప్పినట్లు గాక. యొకదేశపునాగరకత మఱియొకదేశపు నాగరకతతోఁ గలియుట గాంచుచున్నాము. కారణ మేమనఁగా, నాగరకత గల్గిన యొక బలమయిన దేశము తన చుట్టుప్రక్కలనున్న రాజ్యములయందుఁ దన నాగరకతను బ్రజ్వలింపఁజేయుట కర్తవ్యమును రాజనీతి ననుసరించి బలహీనములైన దేశములు తమ నాగరకతను మఱచి పైనాగరకతకు లోఁబడి. తమ స్వాతంత్ర్యమును గోల్పోవుట సంభవించును.

"విజయమాలాధారుల సంతసింపఁజేయుటకైనను వారి బలిమినైనను నోడిపోయిన దేశమువారు ప్రతివిషయమున ననుసరింతు" రను సామాజిక శాస్త్రనీతియు నీవిషయమునే బలపఱచుచున్నది. ఈ విషయమును మనపైఁ బ్రయోగించుకొని విచారింతము.

మన చరిత్రపుఁ బుట లొకమాఱు విప్పి చూచిన జహంగీరునాఁటినుండియే పాశ్చాత్యులరాక ప్రారంభమయ్యెనని తెలియును. మొదటినోజులలో వర్తకమే చాలునని యుండిన పాశ్చాత్యులు క్రమముగాఁ గేంద్రప్రభుత్వము చమురులేక మిణుకుమిణుకు మనుటఁగాంచి రాజ్యపాలనమునకయి ప్రయత్నించిరి. పరిస్థితులకుఁదోడు వారి చతురతయు, నదృష్టదేవతయుఁ గల్గి మనదేశప్రభువు లయిరి. అప్పటినుండియే మెల్లమెల్లఁగ వారి నాగరకత మనపయి వ్యాపింపఁ జొచ్చినది. దాని ప్రభావము చూపఁజొచ్చినది. నేఁడు భారతీయులు తమ్ము నాగరకులని యనిపించుకొనుటకైఁ బాశ్చాత్యుల నన్నివిధముల ననుకరించుచున్నారు.

దినమున కెన్నియోమాఱులు బ్రాందీ విస్కీలఁ బుచ్చుకొనుట, మాంసాహారము గావించుట, కొయ్యబల్లలపైఁ గూర్చొని కాచపాత్రలలో ముండ్లు, తెడ్లు వాడుట వారికి సహజము. ఒక్కొక పాత్రలోఁ బక్వాన్నముంచి యందఱును దానిలో భుజించుట వారికిఁదగినది. ఎల్లప్పుడు మంచుకురియుచు "ఓ చండాంశ! నీవేడిమిని మాకుఁ బ్రసాదింపవా?" యని ప్రార్థించువారు త్రైమాసికస్నానము చేసినను నిబ్బంది లేదు. కాని యీవిషయములలో మనము వారి ననుకరించుట తగనిపని. గంగాభాగీరథి పుట్టినది మనదేశము; మనకిఁక స్నానమున కేమి? ఉష్ణపానీయములు శీతలదేశీయులకుఁ జెల్లునుగాని మనకా? భోజనవేళయందు సనా

యాసముగాఁ గూర్చొని ప్రకృతి సిద్ధంబులగు పచ్చని పత్రములందు స్వహస్తములతో భుజించుట యెంత మేలు ? ఒకే కంచమునఁ బల్వురు తిన్నచో నంటువ్యాధులు వ్యాపించునని యిప్పుడిప్పుడే వారు గ్రహించిరి. పొగపీల్చుట వారి శీతలవాతావరణమునకుఁ జెల్లును, ఉష్ణప్రదేశీయుల మగు మన కదిచెల్లునా? అట్లు చేయుచున్నవారు గుండె జబ్బులకు లోనయి కడకు మృత్యువువాతఁబడుటయేగాక, యొకప్పుడు సువాసనల వెదజల్లఁగల్గిన సుక్షేత్రములు నేఁడు పొగాకు పంటలచే విషపుగాలి వెదఁజల్లుచున్నవి.

అంతేగాక వారును మాంసాహారము, విస్కీ, బ్రాందీలను వర్జింపవలయుననియు నట్లు చేయనివారిని దండింతుమనియుఁ బ్రకటించుచు దానివలని చెఱుగును స్పష్టపఱచు చున్నారు. "లోహపు ముండ్లు- తెడ్లు భుజించుటలో నుపయోగించిన యెడలఁ బ్రకృతి సిద్ధములును, నమూల్యమగు వజ్రముల కూడిక యనఁదగు పలువరుసను గుఱుచ గావించుచున్న" వని నేఁడుగదా పాశ్చాత్యభిషగ్వరులు నిరూపించుచున్నారు! అట్టిచో నాధునిక నాగరకులు పట్టి భ్రమలకుఁబోయి యట్టి రోగములకు దారి యియ్యకుందురుగాక.

మఱియు మనపై వారి వేషము ప్రభావమును జూపినది. మగవారి ట్వీడు సూట్లు, పూలు మేజోళ్ళ నటుండనిచ్చి మన విషయమై విచారించుకొందము.

తమ్ము నాగరకస్త్రీలని యనిపించుకొనుటకై కాఁబోలు, నగరవాసినులు కొందఱు మోకాళ్ళనఱకుండు 'గౌ'నులును, జేతులుండని 'జాకెట్ల'ను, తీవిగాఁ దొడిగి, పయటకొంగు నయితము భారమని హిందూధర్మాచారములకు విరుద్ధముగాఁ గనఁబడుట మనము గమనించుచున్నాము. ఇది యెంతయు శోచనీయము. ఇట్టి వేషముతో మన మాంగ్లేయుల మగుదుమా యనియైనఁ దలంపరు.

కచభారమును మోయలేక కాఁబోలు, స్త్రీకి సౌందర్య మొసఁగునవని గొప్ప కవులచే సహిత మనేకవిధముల వర్ణింపఁబడునట్టివియు, శరీరమునకు మూలాధారమగు తలను సూర్యునివేడిమివల్ల రక్షించునట్టివియుఁ, బ్రసవగుచ్ఛముల కాలవాలములు నగు నిడుపాటి కుంతలములను బదునైన మంగలి యస్త్రముల కెరగావించుచున్నారు. అదేటి సొగసో వారికే తెలియవలయును! సెంట్లు, పౌడరులు, సోపులు, టాయిలెట్లు, హేరాయిల్సు మున్నగు పాశ్చాత్యనాగరకతా ప్రతినిధులే మన సౌందర్యరాష్ట్రముపయి శాసించుచున్నవి !!

నా ప్రియసోదరీమణులారా! గమనింపుఁడు. పైవిలాసములు మనల సుందరులఁజేయునా, లేక మన రూకలసంచి నుత్తిగఁజేయునా ?

నలుఁడు, విక్రముఁడు, అర్జునుఁడు, ఏ 'పౌడరుల' వాడిరి? ఏ 'స్నో'లను రుద్దికొనిరి? దమయంతి, చంద్రమతి మున్నగువారే టాయిలెటు సబ్బులను వాడి తమ మేనికాంతిని స్వర్గపర్యంతము ప్రజ్వలింపఁజేసిరి ?

ఇఁక స్త్రీస్వాతంత్ర్యవిషయమై విచారింతము. పాశ్చాత్యస్త్రీలు నేఁడు సామాజికముగనేమి, రాజకీయముగనేమి, స్వాతంత్ర్యమును దిట్టముగాఁ బడసి పురుషులతో సమానముగా వాదప్రతివాదములను జరుపుచున్నారు. మనవారిలో నైతము నిట్టి స్వాతంత్ర్యము పూర్వభారతస్త్రీల కుండెడిది. ఈయాచారము కొన్నికారణములవలన నశించినప్పటికిని, నేఁడు మఱల దానినిఁ బునరుద్ధరించుచున్నాము గనుక చింతలేదు. దానిలోఁగూడఁ గొన్ని కూడనివి

లవు. అవిమాత్రము మనము నేర్చుకోరాదు. 'బాల్' లేక 'నృత్యగానసభ' యనుపేర స్త్రీ పురుషులుతప్పక రాగుచుఁ జేతికందిన స్త్రీపురుషులతో నృత్యముచేయుచు విలాసములయం దోలలాడుట యెంతయు నపహాస్యమైనది. భారతనారీమణుల రక్తము మన పవిత్రరక్తనాళమునందును బ్రవహించుచుండుటచే, మన మది వినుటకు సహితము సహింపఁగలమా? ఒకని వరియించి వానితోఁ గొన్నిదినములు సుఖయించి, యేదో గృహకృత్యములలో జగడమాడి "నేను విడాకులు గావింతు"నని పోయి మఱొకనినిఁ జేపట్టుటయేగాక, పవిత్రభుత్వసహాయమునఁ బ్రతివిడిచినవాని యొద్దనుండి వేతనములను బుచ్చుకొనుచుండుట కడుపిచార్యము. పాతివ్రత్య లక్షణముచేఁ బ్రతిభగాంచిన పతివ్రతల వంశములఁ బుట్టిన మనకది పరమాపహాస్యము కాదా ? మనకు శకుంతల—దమయంతి—రుక్మిణి—సీత—మున్నగువారుగదా యాదర్శప్రాయలు! వారేగాక శత్రువులచేఁ బడక తమ్ము నగ్నికాహుతిగ నర్పించుకొన్నట్టియు, నిశితకరవాలముల కెరగావించుకొన్నట్టియు, నిన్న మొన్నటి మన రాజపుత్రస్త్రీలును మన కాదర్శపాత్రియలు.

కాని కొన్ని విషయములయందు మనము వారికిఁ గృతజ్ఞత చూపవలసియున్నది. విజ్ఞాన విషయములలో వారు మన పెద్దలకుఁ బాత్రులు.

కాని యిప్పుడిప్పుడే పాశ్చాత్యనాగరకతావ్యామోహమునుండి వెలువడిన మనవారికిఁ గొంచెము వెనుకచూపు గల్గుట మఱెంత శుభావహము.

—•• ••—

# పాతివ్రత్యము.

శ్రీమతి. డి. కమలావతి, (మెట్రిక్.)

మన భరతఖండము మొదటినుండియును, విశేషవిద్యాబుద్ధులతో, ధనధాన్యములతో, సిరిసంపదలతోఁ దులఁదూగుచుండెడిది. ఇచ్చటనే యుక్కుసెనగ లుడికించుట, ప్రాణవిభుని పారిరక్షణార్థము భాస్కరు నుదయింపనీయకుండుట, కాలుని సహితము మెప్పించి జీవితేశుని జీవితమును దిరుగఁ గైకొనుట, మున్నగు నమోఘకార్యములుచేసిన—యత్యంత మహిమాన్వితలగు—నంగనామణులు పలువురు గలరు. అట్టి విజయముఁ బొందుటకుఁ గారణమేమైయుండవచ్చునో యూహింపుఁడు. పాతివ్రత్యమహిమవలన. పాతివ్రత్యముగల స్త్రీనే పతివ్రత యందురు; అనఁగాఁ బతిసేవ వ్రతముగాఁగలది.

రథము నడపుట కెద్దు లెట్లు సమముగా నుండవలయునో, యట్లే గృహమనురథము నడపుటకుఁ బతిపత్ను లిరువురును. అట్టివారభిప్రాయములందేమి, వ్యవహారములందేమి, యేకి

భవించి యుండవలయును. కావుననే మన హిందూదేశీయవివాహములందు వధూవరులపై 'కాడి' పెట్టెదరు. ఇట్టి వివాహ మతిపవిత్రమని మనవారి యభిప్రాయము. ఇతరదేశీయు లిట్లు గాదు. కాని హైందవులు కేవల ప్రేమకొఱకు (అనురాగమనిన బాగుండును!) సంఘము మాఱఁగూడదని తలఁచెదరు. ఈ పవిత్రవివాహ బంధమువలననే మనలో గొప్పగొప్ప పతివ్రతలు బయలుదేఱిరి. సీత, దమయంతి, సావిత్రి, అనసూయ, అరుంధతి, చంద్రమతి మున్నగు ఋషి-రాజపత్ను లెందఱో గలరు. స్త్రీలకుఁ బాతివ్రత్యమే పరమభూషణముగఁ బ్రకాశించు మనదేశమున వీరేగాక చాతుర్వర్ణ్యమందును, సాధ్వీమణు లెందఱెందఱో యుండియుండురని యూహించుట కెంతయేని వీలుగలదు.

పాతివ్రత్యముచే మన భారతస్త్రీలు గొప్పశక్తిని సంపాదింపఁగల్గిరి; కల్గుచున్నారు; కలరుగూడను. వారిది నిష్కామప్రేమ. ప్రేమ శక్తిని వర్ణింప నెవ్వరితరము? భగవంతునే ప్రేమ స్వరూపుఁ డందురుగదా! ప్రేమతత్త్వము నందలి పరమరహస్యమును గనిపెట్టినది మనవారు. అందుచేఁ బవిత్రతయం దన్యదేశీయులకంటె నొక మెట్టెక్కువగా నున్నారు.

ఇట్టి స్త్రీజన్మ మెంతయు నుత్తమమైనది. స్వార్థత్యాగిని యెవరు? స్త్రీ. నిజమైన జాతీయ సేవకురా లెవరు? స్త్రీ. ఒకదేశపు టౌన్నత్యమునకుఁ గారకురాలెవరు? స్త్రీ. పోషించుట యందు, దయఁజూపుటయందు, స్త్రీవంటి ప్రకృతి కోమల హృదయ మఱియొకటి గలదా? లేదు. స్త్రీ లోకమును భరించును, పురుషుఁ డామెకు సాయపడును; ఆమె తలఁచుకొన్నచో సర్వసంహారమునకుఁ దగును. అందుకనియే గాఁబోలు స్త్రీని శక్తిస్వరూపిణి యని యందురు. పురుషుఁ డొక గురువు నాశ్రయించి యతని ద్వారా తన జ్ఞానశక్తిని వృద్ధిచేసికొన్నట్లు, స్త్రీ పతినే గురు-దైవములుగా నెంచి పూజించి విజ్ఞానము పొందుటయేగాక, యట్టి యాత్మ నిగ్రహమువల్ల నమిత తేజస్విని యగుచున్నది. ఆ తేజస్సే — తేఱిచూడరాని యా తేజస్సే — నిర్మలప్రేమవల్ల నిర్గతమైన యా తేజస్సే — పాతివ్రత్యమనఁ బరగుచున్నది.

పాతివ్రత్యమే ప్రధానముగాఁ గల్గిన భారతాంగనకు సంఘమున నేమైనఁ గీర్తిగౌరవములు తగ్గినవా? పురుషుఁ డామె 'నర్ధాంగి' యని యాదరించెను. చతుష్షష్టి కళలయందు నామె యతనితో సమానభాగిని. నిరంతరము సహధర్మచారిణియై భర్తృసుఖసంపాదన విచారము తప్ప స్వసౌఖ్యమునుగూడ నెఱుఁగక ప్రవర్తించినను, ఋషిసమాన స్వాతంత్ర్యముతో సమ్మానింపఁబడినది.

నాఁటికిని నేఁటికినిఁ బరిస్థితులు మాఱినవి. నేఁ డెచ్చటవిన్నను స్త్రీలలో "సమాన స్వాతంత్ర్యము! విడాకులచట్టము!!" లే! అగ్ని సాక్షిగా వివాహమాఁడిన భర్తనువిడిచి, చట్టప్రకారముగ మఱొకనిఁ బెండ్లాఁడుటయే యిందుఁ దేలునది! ఇం కెక్కడి ప్రేమ? ఇం కెక్కడి పతిభక్తి? ఎక్కడి లోకము? భర్త విద్యావిహీనుఁడైన—రూపహీనుఁడైన—సంగహీనుఁడైనఁ—దారిద్ర్యపీడితుఁడైన— నతనినే దైవముగా నెంచును భారతాంగన. నర్మద కుష్ఠరోగియగు భర్తను మోసికొని తిరిగి తిరిగి, వ్యాధి నిర్మూలనము చేయించి సౌఖ్యమందలేదా? దురదృష్టవశమున భర్తృప్రేమను బొందలేకున్నను, మఱియొకని భారతాంగన వివా

హానూఁడదు. భర్తను దానేస్వయంవరముచేసి నను, దల్లితండ్రులు లేర్పఱచినను, సాధ్యమైనంతవఱకుఁ దగినవానినే భర్తగ స్వీకరించుచుండెడిది; కాని విదేశస్త్రీలు తాము స్వయముగ నేఁడెన్నుకొని వరించినను, రేపు భర్తలతో విడాకులఁ బుచ్చుకొన వెనుదీయకున్నారు. అట్టి హేయమైన విడాకుల చట్టము మనదేశమునఁ గూడఁ బ్రవేశింపఁ బ్రయత్నించుచున్నది! అయ్యో! పవిత్రమైన భారతనారీమణుల కీర్తి పోవునేమో కదా!

పాశ్చాత్యనాగరకతాసంపర్కము వలన గృహనిర్వాహకత్వము—పాతివ్రత్యాభిలాష—స్త్రీ జీవితమున నడుగంటుచున్నది. వంటయనిన హీనకృత్యముగఁ దలఁపఁబడుచున్నది. గృహనిర్వాహక స్థానమును, 'టెన్నిస్' 'బ్యాడ్మెంటను' మున్నగునవి యాక్రమించుచున్నవి. శిశుసంరక్షణాదులు కూలిదానిపై వేయఁబడుచున్నవి. ఇట్టి వెన్నియని చెప్పనచ్చును?

నాగరకతయందుఁ బాశ్చాత్యదేశముల తో భారతదేశము సరిరాదని చెప్పకొనుట మనకుఁ జాలఁ బరిపాటి యైనది. కాని యేదీ! ప్రపంచచరిత్రమునే పరిశీలించి చెప్పఁడు. చూతము! భర్తతోఁగూడఁ గలిసి యుద్ధముచేసి శత్రువును మడియించిన వీరాంగన—కాఱడవులయందుఁ బతితోఁ గష్టములఁబడి యోర్చిన పడఁతి—భర్తృగౌరవ సంపాదనార్థమై తాను విక్రయింపఁబడియుఁ బతిభక్తివిడువని వనిత—యేదేశమునఁగలదో? ఖండఖండముల కాదర్శప్రాయజీవిత మన భారతనారీమణి. కారణము? మన మాతృభారతి.

కావున సోదరీమణులారా! పాశ్చాత్యుల పైఁబయి మెఱుఁగులకు మోసపోక, మన భారతస్త్రీధర్మమును మఱవక, ఘనతవహించిన మన మాతృభారతి కీర్తి నిలువఁబెట్టుదుము గాక యని ప్రార్థించుచున్నాను.



# స్త్రీలు-దేశసేవ.

శ్రీమతి. వ. ఇందిర, [ఎఫ్. వై. ఏ.]

ప్రపంచమందలి జీవకోటియందు మానవజాతి ముఖ్యమైనది. తక్కిన వానివలె నీజాతియు స్త్రీపురుషాత్మకముగదా! అట్టిచోఁ స్త్రీపురుషులు కుటుంబముననే కాక, సంఘమున కంతటికినిఁ జక్రమువలె నగుచున్నారు. భగవంతుఁడు వీరికి సమానస్వాతంత్ర్యము నిచ్చియున్నాఁడు; కాని క్రమముగా, పురుషవ్యక్తి, స్త్రీవ్యక్తి (జాతి)ని జయించినది. అనఁగా స్త్రీలు తమ స్వాతంత్ర్యమును గోలుపోయి పురుషులను స్వార్థపరులకు బానిసలుగా నేర్పడిరి.

దేశసేవ యనఁగా దేశములోని జనులకు సేవచేయుట యని యర్థము. ఇట్టి సేవఁజే

యుట కందఱును స్త్రీపురుష భేదములేక యర్హులే. కాని గర్హలని నిరసింపఁబడుచున్న స్త్రీలీకార్యమునందు విశేషముగాఁ బాల్గొనిననేగాని వారి యోగ్యత నిరూపింపఁబడఁజాలదు. దేశాభివృద్ధి, సంఘక్షేమము లన్నియును వీరిపైనఁ గూడ నాధారపడియున్నవని చెప్పకతప్పదు.

కం॥ ఏరాజ్యంబునఁ దరుణులు
దారకళాకుశలసుస్వ ♦ తంత్రిలు గలరో
ఆరాజ్యంబునఁ బురుషులు
ధీరులు, నధికారులమల ♦ ధీసువిచారుల్॥

చూచితిరా! పురుషులకన్న స్త్రీలకెంత ప్రాముఖ్యమియ్యఁబడినదో! ఇదంతయు యథార్థమే కాకున్నఁ బూర్వచరిత్ర లన్నియుఁ గల్లలేగదా? పూర్వము మహాపరాక్రమవంతుఁడని ప్రసిద్ధిగాంచిన యర్జునునికి సుభద్ర సారథియయ్యెను. ఘోరరాక్షసుఁడును, లోకకంటకుఁడు నగు నరకాసురుని వధించిన స్త్రీరత్నము సత్యభామయేగదా! ఈపురాణగాథ లన్నియు పూర్వము స్త్రీలు దేశసేవ చేసిరనుటకు నిదర్శనములేగదా! ప్రస్తుతము దేశసేవ చేయువారిలో శ్రీమతి. సరోజినీదేవిగా రెన్నఁదగినవారు. సంసారేచ్ఛలేక తమ జీవితమునంతయు దేశముకొఱకే ధారపోయుచున్న యీ వనితామణి స్త్రీల కాదర్శప్రాయురాలు.

సేవచేసినయెడల నిష్కామసేవ చేయవలయును. హిందువులకుఁ బవిత్రపూజనీయగ్రంథమగు భగవద్గీత గూడ నిష్కామసేవనే నియమించుచున్నది.

స్వక్షేమ, స్వలాభాపేక్ష ప్రతివారి కుండు విషయము; కాని సంఘాభ్యుదయము, దేశక్షేమము కోరువారరుదు. ప్రతివ్యక్తియు స్వలాభమునకయి పాటుపడుటయందు శతాంశమైనను, దేశముకొఱకుఁ గృషిసల్పినచో దేశము బాగుపడును.

ప్రజాహిత సంస్థలు ప్రజల బాగునకయి యేర్పడినవి. ప్రజలకు మార్గదర్శులుగా నేర్పడు నాయకులు సక్రమపద్ధతిపైన సంస్థలను నడపినయెడల దేశోపకారులగుదురు. గుంటూరునందు "శారదానికేతనము"ను స్థాపించి స్త్రీజనమునకు సేవఁ జేయుచున్న ఉన్నవ లక్ష్మీనారాయణదంపతులు ప్రశంసనీయులు. మద్రాసునందు యామినీపూర్ణతిలక యను వేశ్య స్వజాతిబాలికలకొఱకొక పాఠశాలను స్థాపించి వారికి విద్యాబుద్ధులను గఱపి పెండ్లిండ్లుచేయించుచు స్వసంఘమున సేవఁ జేయుచున్నది.

కం॥ "చీమలు గుమిగూడినచోఁ
బాముచు బంధించి చంపఁ ♦ బరుగిడుకరణిన్॥
భామాజనైకమత్యము
కామితకార్యార్థసిద్ధి ♦ కలదా టరుదే"॥

ఇంక నెందఱో స్త్రీలు తమ త్యాగబుద్ధి నెన్నియోవిధములఁ బ్రకటించుచున్నారు. చాలమంది వనితలు శ్రీకృష్ణజన్మస్థానమునకుఁ బోయియుఁ దమ దేశసేవాసక్తిని వెల్లడించియున్నారు. సన్నని వస్త్రములను ధరించుట కలవాటుపడిన సుందరీమణు లెందఱో బీదలరక్షణమునకయి ముదుగువస్త్రములను ధరించుటకు వెనుదీయుటలేదు. విద్యావతులగు స్త్రీలు పురపాలకసంఘములందును, శాసనసభలయందును బాల్గొని స్త్రీల యభ్యుదయముకొఱకుఁ బాటుపడుచున్నారు. ధనాఢ్యులు తమ ధనము ప్రజాహితము నిమిత్తమై వెచ్చించియున్నారు. శ్రీమతి కీ॥ శే॥ రావిచెట్టు లక్ష్మీనరసమాంబగారు తమ యలంకారములను 'ఆంధ్రభాషా

నిలయము'న కర్పించి, స్త్రీలకేగాక పురుషుల కును, మార్గదర్శినినై యున్నారు. కావున స్త్రీలు జ్ఞానసంపదను, నైతికబలమును, శరీర దార్ఢ్యమును సంపాదించి దేశసేవాపరతంత్రు లయ్యెదరు గాక !

ఇట్టి ఫలసిద్ధికయి మన హైద్రాబాదు నం దున్నతవిద్య నుచితముగా మాతృభాష యగు నాంధ్రముద్వారా బాలికలకుఁ బ్రసా దించుచున్న మన పాఠశాల సాధనభూతమై తోడ్పడుఁ గాక !





# ఆంగ్లేయులనుండి మన మింకను నేర్చుకొనవలసిన విషయములు



శ్రీయుత. టి., ప్రేమలత, [యఫ్. వై. ఏ.]

చిక్కనిపాలలో నీరు కలిసినది. అంతటితోఁ బానీయము వెలతగ్గినదా ? అంతమాత్రమున, 'ఓ ! నీచసంపర్కమైనదిగా !' యని యా జల మిశ్రిదుగ్ధపాత్రిను గాలితోఁ దన్నుట యేనా ? "ఆపానీయమును నోటఁబెట్టకుఁడీ" యని బహి ష్కరించుట యేనా ?

రోజాపువ్వు ముండ్లతోఁ గూడినదని, దానినిఁ దిరస్కరించుట యేనా ? కూడనిందు; మనమురసికులమై పుష్పములనే గ్రహింపరాదా?

ఇట్లే పాశ్చాత్యు లేవో కొన్నిదురాచా రములు కలవారని, మ్లేచ్ఛులని, హూణులని, ముట్టరానివారని, వారిని బొత్తిగాఁ దీసివేయుట తగినపని యేనా ? వారి గుణదోషములు వారి లోనే యుండనిందు; మనము రాయంచలమై, జలమిశ్రిదుగ్ధపాత్రిలోని పాలనేగదా త్రాగు వారము !

ఇఁక మన మాంగ్లేయులనుండి గ్రహింప వలసిన విషయములేవో కొన్ని గమనింతము గాక !

సమయపాలన మను గొప్పవిషయము ముందు మనము వారినుండి నేర్చుకొనవలసి యున్నది. మనయం దది యింకను గొఱఁత యని యే నాభావము.

వారేదైన నొకపని యొక్క నియమితసమ యమునఁ గావలెనన్న, నట్లే యొనర్తురు. ఒక నిమిషమైన హెచ్చుతగ్గు లుండరాదు. ఏదైన నొకసభ యింతవేళకు జరుగవలెనని కాలనిర్ణ యము జరుపఁబడిన యెడల, నాసభకు రాను న్నవారందఱు సరిగా నప్పటికే వత్తురు. ఏయా టంకమువల్లనైన సమయమునకు వెళ్ళఁ దట స్థింపనియెడల, బొత్తిగా మానిమైన వేతురు గాని, సమయము మించి వెళ్ళరు. మన మన్న

నో! "ఆఁ! అప్పుడేగా సభ ప్రారంభమైనది. కొంచెముండి వెళ్ళవచ్చును. తొందరలే దేమియు"నని సభ కొంతవఱకు జరిగినపిదపనే వెళ్లుచుండుట సర్వసాధారణము. మన మింకను వారివలె కాలమువిలువను దెలిసికొనకున్నాము. ఫ్రెంచివారికి నాంగ్లేయులకు యుద్ధము జరిగెడు కాలమున, ఫ్రెంచిచక్రవర్తి యగు నెపోలియను తన సైన్యాధిపతిని డా నదివఱకే నియమించియున్న రహస్యమార్గమున సైన్యమును నడిపించి తాను నియమించిన కాలమున శత్రువుల నెదుర్కొని తనకుఁ దోడయి కార్యము నెఱవేర్చుమని చెప్పఁగా నతఁడు సరియని చెప్పియు, యుద్ధప్రారంభమైనపిదప సైన్యము నతఁడైదునిమిషము లాలస్యముగాఁ దీసికొని వచ్చుటచే, సమయమునకు సైన్యసహాయము లేక పోవుటచే నెపోలియను శత్రువులచేఁ జిక్కి యోడిపోవలసి వచ్చెను. చూచితిరా! సమయ మెంత విలువగలదో! ఐదునిమిషముల యాలస్యమాత్రమున యూరపు నంతయు గడగడ లాడించిన యా పురుషసింహుఁడు సైతము శత్రువులకు లోఁబడవలసి వచ్చినదిగదా!

సంఘీభావము రెండవ గొప్పవిషయము వారినుండి నేర్వఁబడవలసినవానిలో. ఇది మన యందు లేకపోవుటవలననేగదా వారు మనదేశమునఁ గాలుపెట్టి క్రమక్రమముగా మనదేశమంతయు నాక్రమించి చివరకు మనకుఁ జక్రవర్తులైనారు. తమలోఁ దమ కెన్ని మనస్పర్థలున్నను, శత్రువుల నెదుర్కొనుటలో నవన్నియుఁ గట్టిపెట్టి యందఱు నేకమై పోరి వారి నిర్జించి తమ బలమును నిల్పుకొందురు. ముఖ్యముగా భారతీయులమగు మన మీ విషయమును దప్పక నేర్వవలసియున్నది. హిందూదేశమున ముఖ్యము జనసంఖ్యలో మహమ్మదీయులు క్రైస్తవులు మొదలగు నితరులకన్న హిందువులయందే సంఘీభావము చాలఁ గొఱవడియున్నది. దీనికి స్వార్థపరత్వము, అనేకభిన్న మత జాతులుగ నేర్పడి యుండుటయు నే కారణములు.

మనవా రెందరిగుట్టుకు వారిసుఖములను జూచుకొని పరదేశీయుల పరిదర్శనములచేతను జిత్రవిచిత్ర వస్తువులచేతను సమాకర్షింపఁబడి మితిలేని డబ్బు ఖర్చుపెట్టుటయే మా చుకొందురుగాని, వారట్లు చేయుటవల్ల దేశమున కెంతటి విపద్దశ సంభవించుచున్నదో యిప్పటికినిఁ దలఁపఁజాలకున్నారు. ఆంగ్లేయులన్ననో, తమ దేశమునుండి యొక గడ్డిపోచ పోయినను, దమ స్వనష్టముగా భావించెదరు. వారియందును, క్యాథలిక్కులు, ప్రొటెస్టెంట్లు మున్నగు భిన్న మతస్థులున్నను, దేశమున కేదయిన నష్టము కలుగనున్నదన్నతోడనే మతభేదముల లెక్కింపక యందఱు నేకమై తమ దేశసంరక్షణకొఱకుఁ బ్రాణముల సహితము నిచ్చుటకు సిద్ధపడుదురు. ఇది యెంతయు మెచ్చుకొనఁ దగినది గదా!

విద్యాభివృద్ధికై వారుచేసినకృషి మనచే నింకను ననుకరింపబడఁ దగియున్నది! అందులకై వారెన్ని యవకాశములు గల్పించిరో చూచితిరా! కళాశాలలు, పాఠశాలలు నెలకొల్పుటయేగాక ప్రజాసామాన్యమునందు విజ్ఞానము వెదఁజల్లుటకయి, ప్రతిస్థలమునందును, గ్రంథాలయముల నెలకొల్పియున్నారు. వీనిని క్రమమార్గమున నడపుట యొక కళగా భావింతురు. వీని కర్చులన్నియుఁ బ్రభుత్వమే భరించును. ఇట్టి ప్రయత్నపు ఫలితముగఁ బ్రజలు

చాల విద్యావంతులయి మాతృభాషాభివృద్ధి కనేకవిధములఁ దోడ్పడియున్నారు. ఇట్టి సదుపాయములు మనదేశమున లేకుంటచేతనే, మన మాతృభాషలు వృద్ధిచెంది, దేశ మున్నతస్థితికి వచ్చుట కాటంకము గల్గుచున్నది. కాన మన మును వారివలె నీప్రయత్నమున గట్టికృషి సాగించి కృతకృత్యులము కావలయును. ఒకవేళ మనయం దెవరైనఁ బుణ్యాత్ము లట్టి యవకాశములు కల్గించినను మనము దానివైపు చూచుటకు సయితము వెనుదీయుదుము. దీనికి మనయందు వారికివలెఁ బట్టుదల, యుత్సాహము, లేకపోవుటయే కారణము. కనుక నేకదా మన మేకార్యమును సక్రమముగా నెరవేర్పఁజాలకున్నాము.

క్రమశిక్ష మఱియొకటి. భారతీయులారా! గమనింపుఁడు!!

వారిలో నేదయిన సభ జరుగునప్పు డెవ్వనికయినఁ గూర్చొనుటకు స్థలములేనట్లు తోఁచినయెడలఁ, దత్క్షణమే యా సభికులనుండి యొక్కరులేచి తమ కుర్చీ వారికిచ్చి తాము నిల్వఁబడుటకయిన వెనుదీయరు. మనమన్ననో! ఎవరేరానీ, యెవరేఁబోవనీ, మనము సుఖముగనున్నాముగదా, యని యూహించుటయో, నిండుసభలోఁ దా నిల్చియున్నట్లయిన నెవ్వరు నవ్విపోదురో యనియో, స్థలము లేనివారికి జోటు చూపుటకయి తా లేచినఁ దన స్థలమెవరైన నాక్రమింతురనియో. యిట్లు తటపటాయించుటయందే సరిపోవును గాని, యొకరిసుఖమునకయి యించుకయు శ్రమపడనొల్లమే! కాని యీ మేలవా టిప్పుడే మనలోనికిఁ బ్రవేశించుచున్న ట్లున్నను, మన మింకను బ్రయత్నింపక తప్పదు. వారి మఱియొక గొప్పగుణ మ మనఁగా, వారి కచ్చట జరుగు ప్రదర్శనములు గాని, యే యుపన్యాసములుగాని, నచ్చకపోయినను జివరవఱకుండిపోవుటయే తమ విధియనియు, గౌరవమనియు నెంచి, యది ముగియువఱకు నచ్చోటువిడిచి లేవరు సరిగదా, కూర్చున్నంతసేపు మాటాడను మాటాడరు సుమండీ! మనమో, ఉపన్యాసములు నచ్చని యెడలఁ దక్కినవారి మొగమునఁ గొట్టినట్లు నడుమ లేచిపోవుటయేగాక, యట్లు చేయుట మరియాద కాదని చెప్పుట సయితము మాని, యితరులును, వీరలనే యనుసరింతురు. అందువల్లఁ జెప్పువారికిని, వినువారికిని, శ్రద్ధతగ్గి ప్రోత్సాహ మనుమాట లేక క్రమముగాఁ సభ చప్పఁబడును. కాదా మఱి!

మన ముందఱమును భారతమాతకు బిడ్డలమయి, వరుస కన్నదమ్ములవలె వర్తింపవలసినవారమయ్యు, మనమే పరస్పరము కలహించుకొనుచు మన సోదర సోదరీమణులవల్ల నేదయినఁ బొరపాటున్నయెడల దానినే గోరంతలు కొండంతలు చేయుచు, వానిని మాత్రము దిద్దుటమాని, చూచినప్పుడొకరి నొకరు పరిహాసము చేసికొన్నచో, నితరులు, విదేశీయులు, మనలఁజూచి, నవ్వుదు రనుటలో నాశ్చర్యమేమున్నది? మనయం దీ కలిసికట్టుగుణము లేనందువల్లనే గదా మనము హాస్యాస్పదులము గావచ్చె! అదే యాంగ్లేయు లన్ననో తమలోఁ దాము దిద్దుకొనఁ బ్రయత్నించుచుఁ గేవలము వారి మంచిగుణములు మాత్రమే బయటికి గనఁబడుచుటవల్లనేగదా వా రీదినమున నంతటి పేరు ప్రతిష్ఠలు గాంచుటకుఁ గారణమైనది!

కావునఁ బయినఁ బేర్కొనఁబడిన యమూల్యములగు వానిలోఁ గొన్నింటిని మంచి

గుణములను, మన మాంగ్లేయులనుండి నేర్చుకొని, యితరులకు మనలను జూచి నవ్వుటకు సందియ్యక, యిదివరకు వచ్చిన యప్రతిష్ఠలను సవరించుకొని. మన సుగుణముల కింకను వన్నెపెట్టి, యితర దేశీయుల కాదర్శప్రాయుల ముగ నుండుటకయి ప్రయత్నించి మన మాతృదేశమునుద్ధరింపఁ బూనుకొందుముగాక! ఇంతకంటె మనకుఁ గోరఁదగిన దేమున్నది!



# * అంతఃపురోపన్యాసము.

బిదురు వేంకటశేషయ్యగారు.

—♦ లంబోదర శాస్త్రి యిట్లు చెప్పుచున్నాఁడు ♦—

ఇదిగో! ఏమండోయ్! మాట్లాడరూ! ఎక్కడికి కా విసవిసఁ బోవుట? నిద్రమంచాన నే లేచుట, మొగమైనఁ దిన్నఁగఁ గడుగుకొంటిరో లేదో యిప్పుడే దుస్తులు వేసికొనుట, యింటినుండి మెల్లమెల్లఁగఁ జాఱుటయునా? 'ఆఫీసు' పదిగంటలకే గదండీ? ఇంతలో మునిఁగిపోయిన దేమున్నది? ఆ తొందర యెందులకు? 'నీకుఁ దెలియదా' యనుచున్నారా? ఏల తెలియదు? పాపము! కన్నులుమూసికొని పాలు ద్రాగుచుఁ దన్నెవ్వరుఁ జూడలే దనుకొను పిల్లి సామెతగ మీవైఖరి యెవ్వరికిఁ దెలియ దనుకొన్నారు గాఁబోలు! నేను జెప్పనా యెక్కడికో? ఇంకెక్కడికి? కాఫిహోటలుకే గదా! అది కాదండీ! ఇన్నిచదువులు చదువుకొన్నాఁరే! ఇన్ని వార్తాపత్రికలు త్రిప్పుచున్నారే! ఇంత బుద్ధిమంతులే! నవనాగరకత యంతయు నాదే యన్నట్లున్నారే! ఇంత మాత్ర మాలోచించుకొన లేకపోయితిరేమి? ఆడుదాననగు నాకుఁ దోచినంతమాత్రమయిన మీకుఁ దోఁపలేదేమి కర్మమండీ? ఈ కాఫి హోటలు గమనము మీకు నిత్యకర్మయా? క్షురకర్మతోఁ బాటు? రామ రామా!! వారము, వర్జ్యము. మంచిచెడుగులు లేకుండ నీ క్షౌరము లిటు; మడి, మైల, వేళ, పాళ లేకుండఁ గాఫిహోటళ్ళ తిండ్లవలనఁ గల్గు డబ్బు క్షౌరము లటునా? కన్నులున్న గ్రుడ్డితనమన్న నింతకంటె వేఱున్నదా మఱి? కాఫీహోటళ్ళవల్ల నెన్ని పచ్చనికొంపలు పాడయినవో కాసంత గమనించితిరా? ఎందఱు కుబేరులు కుచేలురైరో, కొంచెమైన నాలోచించితిరా? అబ్బే! నవ

* బ్రహ్మశ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారిచే జాల ప్రశంసింపఁబడినది.

నాగరకతామహాసముద్రమునఁ బడి మునుఁగుచుఁ దేలుచు నుక్కిరి బిక్కిరియయి కొట్టుకొనిపోవువారి కాలోచన కెడ మేదీ? 'శతాంధాఃకూపం ప్రవిశంతి' యన్న ట్లున్నదేగాని, స్వయం వ్యక్తిత్వము, జాతీయభావపరవశత యేది?

"అబ్బ! ఎందుల కీయుపన్యాస?" మనుచున్నారా? ఎందులకేమి? మీకొఱకు. 'కరణేషుమంత్రీ' యని భారతస్త్రీరత్నముల ధర్మము ప్రతిధ్వనించుట లేదా? మగవారు పెడఁదోవఁ బట్టినప్పుడు వారిని మంచిత్రోవకుఁ ద్రిప్పవలసిన బాధ్యత మగువలపై లేదందురా? మీ స్వధర్మాచరణము మీరు మఱచి, చివరకుఁ బురుషుల మనుమాటయే మఱచి, మావలెఁ బెడసాపటలు, నిశ్శ్మశ్రుముఖత్వములు, రవికె-చొక్కాలు, నాజూకునడకలు, ముఖభస్మధారణములు, కోమలకంఠభాషణములు—ఏమని చెప్పుదును? సిగ్గగుచున్నది—ఎప్పుడు స్వీకరించితిరో, యప్పుడే!—

"ఓహో! శ్రుతిమించి రాగమునఁబడుచున్నదే!" యనుచున్నారా? నిజమాఁడిన నిష్ఠుర'మన్న దిందులకేసుమండీ. ఇంతకుఁ జెప్పవచ్చినదేమనఁగా, నింకముందుఁ గాఫిహోటళ్ళయు బలాటము మానివేయుఁడని. అంత యాకలిగా నుండినచో నింట నాచేతఁ జేయించుకొని కమ్మగ తిని గబ్బునఁ దేవపవచ్చునే! మీరుతిన్నతర్వాత నే మందఱమును గడుపార నోరూర మీ పేరు పెట్టుకొని తిందుమే! అక్కడ మీరొక్కరే విందులు గుడుచుచున్నచో నిక్కడ మాకర్మమేమికావలసినది? ఇంటఁ బుంటికూర పచ్చళ్లతోఁ బూటలు గడపవలసినదే నా? నాపై నెట్లున్నను బిడ్డలపయి నంత కూర్మిలేదా? చూచితిరా మీ కాఫిహోటళ్ళు పవిత్రకుటుంబప్రేమ నెంత కుంటుపరచుచున్నవో? కల్లునీళ్ళవారికినిఁ గాఫినీళ్లవారికిని నాకేమంతభేదము గోచరించుటలేదు. అవిలేక వారునిలువలేరు, ఇవిలేక వీరు బ్రతుకలేరు. అసలు ప్రొద్దు పొడువకముందే యాకలి యేమిటండీ? అది యెంత శరీరదోషముగాఁ బరిణమించునో యెఱుగుదురా? అయ్యయ్యో! మీ స్నానాలేమైనవి? మీసంధ్యలేమైనవి? మీపూజ లేమైనవి? మీ పురాణము లేమైనవి? మీ మతము లేమైనవి? మీమర్యాదలేమైనవి? 'నాన్సెన్సు! అవన్నియు వట్టిమూఢాచారములు, పనిలేనివారి పనులు! ఇంకఁ గూడ వానినిఁ బట్టుకొని వ్రేలాడుచున్నచో, విదేశీయు లెట్లు వికవిక నవ్విపోవుదురో యెఱుఁగుదువా?' అని యనుచున్నారా? చాలులెండి! మీకుఁగాఁగఁ దగిపోయినది!! విశ్వవ్యాపియగు భగవానునియెడ భయపడని మీరు విదేశీయుల భయమున వెట్టిపనులు సేయుటయా? మన యాచారములు మనము నిలువఁబెట్టుకొనుట, మన జాతీయతను మనము పోషించుకొనుట మన మతధర్మములను మన మవలంబించుట, మీ దృష్టిలో మూఢాచారములా? గ్రుడ్డినమ్మకములా? ఉబుసుపోక పనులా? మీరాఁడినదియాఁట—పాడినది పాట యని యొప్పుకొన్నచో, నదియంతయు నాగరకతయా? ఎందులకు? మీ నాగరకులలో—వ్రేలుమడచి చెప్పుఁడి!—ఒక్కరయిన—నొక్కరైన—మీ కాఫిహోటళ్ళేమో, మీమనస్తులేమో, మీ క్లబ్బులేమో, మీఆఫీసులేమో, మీపైస్లేమో గాని— కాసంతసేపు కన్నులుమూసి కూర్చుండి యంతర్దృష్టితో నాత్మపరీక్ష చేసికొనుచు, 'నేనెవఁడను? ఎందులకు జన్మించితిని? జన్మించి యేమిచేయుచుంటిని? అస లేమిచేయవలయును? చేయవలసినదానిలో నెంతచేసితిని? ఇంకెంత

చేయవలసియున్నది?' యని యొక్కనిమిషమై నను బ్రశాంతనిర్మలహృదయములో భావించు కొనువారున్నారా? పరలోక ప్రశంసలకెన్నఁడైన మీయాలోచనలు తావిచ్చినవా? అబ్బే! ఏదీ? 'చిన్న-నా-బొజ్జకు— శ్రీరామరక్ష' మంత్రోపాసకులకు మఱొకటి పట్టునా? పర వేషములకుఁ, బరభాషలకుఁ, బరదేశములకుఁ. బరధర్మములకుఁ బాఱిఁకులాడుచుఁ బరవశ్యుదాఱి కున్న మీకుఁ బరలోక చింతయనినఁ బసికిరాక పోయెఁగదా! ఇట్టి వెనుకచూపు—ముందుఁజూపులేని మిమ్ముల నేమనవలయును? చావుబ్రతుకుల సమస్యను సక్రమముగా, సమంజసముగఁ బరిష్కరించుకొనలేని మిమ్ముల నేమనవలయును? పూర్వోత్తరజన్మసిద్ధాంతము వేత్రోసిరా జన్నచో, మీ సైన్సు ప్రకారమే, "Life's eternity, continuity of consciousness, immortality of the soul" అను మీపలుకులు చిలుకపలుకులుగానామఱి? అట్టి పరిస్థితిని నమ్మి, దాని నాదర్శముగఁ గైకొని, దాని ననులుపఱచుట కీప్రస్తుతజీవితమును బ్రధానరంగముగఁ బరిగణించి తద్ధర్మములను బాగుగ నుద్ఘాటింపఁ గల్గిన మన భారతీయనాగరికత—పైపై చూపుల కందరాని మహత్త్వముగల మన భారతీయనాగరికత—వట్టిచెత్తగాఁ దోఁచెనా? తలతిక్క వ్యవహారమని తట్టెనా? జ్వరపడినవానికిఁ బంచదారయుఁ జేదయినట్లు, ఇదియంతయు మీ దృష్టిదోషము కాదా?

అంతదూర మెందుకండీ? మీ రే విదేశీయుల నవ్వులకు భయపడుచున్నారో, వారే మనిరో షష్టికిఁ దెత్తునా? ఇటు వినుఁడు;

Not enjoyment, not sorrow
Is the destined end or way;
But act, that each tomorrow
May find you farther than today.

*** *** ***

O Solitude! where are the charms
That sages have seen in thy face?

*** *** ***

Beauty is Truth and Truth Beauty.

*** *** ***

He prayeth best who loveth best
All things great and small.

*** *** ***

............more things are wrought
by prayer than the world dreams of.

*** *** ***

ఇవేనా? ఇట్టివెన్నియో కుప్పతిప్పలు గలేవా? ఈ వాఙ్మయమంతయు వారి నాగరకతలో నంతర్భూతముకాదా? నాగరికత-నాగరకత యని యూరక చంకలెగురవైచుటయే గాని, ప్రోసీ! దానిలోని యిట్టి పవిత్రభావస్ఫురణ మేమైన స్వీకరించితిరా? వేషభాషల వెఱ్ఱిభ్రమతో నంతయు నయినదనుకొన్నారుకాఁబోలును! ఇట్టి 'Poetry' నేదో చదివి కంఠస్థముచేసి విమర్శలువ్రాసి పరీక్షలుగెల్చి, 'ఆఫీసు'లకుఁ బరుగెత్తుట నేర్చితిరేగాని ఆ, poetry మానవజీవితములో సత్యసౌందర్యానందములు బహిర్గమనమై మాననీయస్థాన మాక్రమించియున్నదని తెలియఁజాలక పోయితిరే! మీకుఁ దెలియ్యదలఁచుకొనక తెలియని విషయములివేనా? దేశచరిత్ర యున్నదిగదా! దానినిఁ బట్టియైన మన భారతజాతీయత సర్వథావిలక్షణమైనదని గ్రహింపరయితిరే! మీఁదుమిక్కిలి దానినిఁ బరదేశవ్యామోహమువల్లఁ బాఱిణావ శిష్టనుగాఁ జేసితిరే! 'జాగ్రఫీ' పరిజ్ఞానము

వలన జాతీయత దేశ-కాల-పాత్రములఁ బట్టి మాఱుననియుఁ, ప్రపంచమున నేదేశీయులుగాని తమ కన్నివిధములఁ (దగిన) జాతీయత-నాగరకత-వదలి పరనాగరకతను స్వీకరించుట ప్రబలాపరాధమని తెలియుటలేదా ? అందులకే శ్రీకృష్ణభగవానుఁడు 'శ్రేయాన్ స్వధర్మో విగుణః, పరధర్మాత్స్వనుష్ఠితాత్ । స్వధర్మే నిధనం శ్రేయః, పరధర్మో భయావహః॥' అని ముక్తకంఠముగఁ జాటి చెప్పుచున్నాఁడే! ఇంకను మీసైన్సు చదువులవల్ల నిప్పటికినిఁ బురుషుల కెట్టి విద్యావిధాన మవసరమో. స్త్రీల కెట్టిది యవసరమో సమరసభావముతో నిశ్చయించి, నిర్ధారించి, పరస్పరోపకారకమైన యట్టి విద్యాపరిణాళికను దేశమునకుఁ బ్రదర్శించితిరా ? మీరు నేర్చిన-పొట్టకుఁ బట్టెడన్నము పెట్టఁజాలని—చదువునే మా మొగానఁ బాఱవైచి, మీతో బాటుగ మమ్ములను గూడ నిరుద్యోగసమస్యలో నిలువునఁ గూల్చుటకే గదా యీ యెత్తులన్నియును? మిమ్ముల నెప్పటికి నమ్మరాదని మాకుఁ దెలియదా ? స్త్రీలనుగూర్చిన సమస్యలను మహాశ్రద్ధతో నాలోచించుచున్నట్లుండుట; గోరంతవానినిఁ గొండంతలు సేయుట; మాలో లేనిపోని చిక్కులను దెచ్చిపెట్టుట, ఇంతకంటె నా కేమియుఁ గనఁబడుటలేదు సుమండీ !

మా 'కార్వే' పండితుఁడే పూనుకొననిచో, భారతమహిళామతల్లు లేమికావలసినది ? ఎచ్చటఁ దలఁదాఁచుకోవలసినది ? ఈపాటికి 'foreigners at home' కావలసినదేనా ? 'ఇంత చదువెక్కడ నేర్చితి?' వని నవ్వుకొనుచున్నారా ?

'దిక్కులేనివారికి దేవుఁడే తోడ'ని లేదా మా "బాలికల ఉన్నత పాఠశాల" హైదరాబాదులోని సుల్తాను బజారులో? మాతండ్రి మీవంటివాఁడుకాఁడు కాఁబట్టి నన్నా పాఠశాలలోఁ బ్రవేశపెట్టి భారతనాగరకతా ప్రబోధకమగు విద్యను జెప్పించినాఁడు; మూఁతకన్ను దెఱిపించినాఁడు; లేనిచో నా?— ఇంకేమున్నదీ ?

'సరే! నీమాట కెప్పుడు నడుగుదాటను; నీవు చెప్పినట్లే చేసెదను గాని మన యీసంభాషణ మెవ్వరితోడను జెప్పకుసుమా!' యని యనుచున్నారా ? అచ్చే! నాకు మాత్రము తెలియదండీ? అంతలపొంతలవారితోఁ బోయి చెప్పకొందునా ? కాని మా పాఠశాలలోఁ గ్రొత్తగా బ్రారంభింపఁబడిన మాతృభారతీ పత్రికకు మాత్రము దీనిని వ్రాసెదను. అందులకు మాత్రము మీరు నన్ను క్షమింపవలెను.



# సహజగుణము

శ్రీమతి. వై. అమృతమ్మ, (మూఁడవ ఫారము.)

గీ॥ "ఒక్కయజ్ఞంబు చేయఁగ ◆ నున్నవాఁడ. భూప! నిర్ణయమది తెల్పె ◆ మూర్తమునకు
యజ్ఞసన్నాహమంతయు ◆ నయ్యెఁగాని, ప్రొయ్యికిందికిఁ గట్టెలే ◆ పొసఁగదయ్యె॥
గీ॥ ఒవర మీపేరు దానదు ◆ ర్యోధనుఁడని, జనులుపిలువంగ నే విని ◆ చాల సంత
సమున నీయొద్ద కాశతోఁ ◆ జన్నవాఁడ, దేవ! కరుణించి కోరికఁ ◆ దీర్పవయ్య॥
గీ॥ అనెఁడి విప్రుని భూపతి ◆ యాగ్రహించి, "ఇటుల నెన్నోరోజులుగాఁగ ◆ నేర్చి వాన
కదుఁ గురియుటను గట్టెయుఁ ◆ దడిసియుండి, నెటులొసంగెదఁ? జాలుఁబొ ◆ మ్మి"వనుటయు॥
గీ॥ ఏగె నాతఁడు కర్ణుని ◆ గృహమునకును, నడిగెఁ దనవాంఛ దీర్పుమం ◆ చార్తిమెఱయ;
వానిఁగని కర్ణుఁ డెదనించు ◆ కైనఁ గాని, సంశయింపక సేవక ◆ జనుల కనియె॥
గీ॥ "పాప! మీబ్రాహ్మణుఁ డధిక ◆ వాంఛ మదినిఁ, గలిగియున్నాఁడు కాష్ఠసం ◆ కలనమునకు;
మీరు వెసఁబోయి నాల్గిండ్ల ◆ తీరడంచి, యిండు కట్టెల నితనికి ◆ నింపుమీఱ"॥
గీ॥ అపుడు సేవకులెల్లఱు ◆ నతనియాజ్ఞ, నరిగి యిండ్లను బడఁగొట్టి ◆ కరము మదిని
హర్షమెసఁగంగ గట్టె బ్రా ◆ హ్మణునికిచ్చి, మన్ననలఁ జేసి రెంతయు ◆ మాన్యుఁడగుట॥
గీ॥ అంత నా వేషధారియు ◆ సంతసించి, ప్రకటముగఁ గర్ణు సుగుణంబు ◆ లకును మెచ్చి
"నీవుచేసిన కార్యంబు ◆ నిక్కమముగఁ, జాల యానందమొసఁగె నా ◆ స్వాంతమునకు॥
గీ॥ మీకుఁ జీఁకటి లేకుండ ◆ మెఱయుచున్న, వాఁడ నగునట్టి నాపేరు ◆ భాస్కరుండు
దానదుర్యోధనునికీర్తి ◆ తెలుగుపఱప, వచ్చి యీలాగె 'ప్రాధేయు' ◆ పడితి నతని॥
గీ॥ కాని, యాతఁడు ననుఁ గడుఁ ◆ గానినుడులఁ, బలికి వెడలఁగొట్టెనుగాని ◆ పలువయగుచు;
దానకర్ణుఁడవను పేరు ◆ మానితముగ, సార్థకము చేసికొంటివి ◆ సవ్యవృత్తి॥"
గీ॥ అంత విప్రుఁడు దుర్యోధ ◆ నాదు లింటి, వాకిలి సమీపముననుండి ◆ పఱచుచుండ
నృపుడు దుర్యోధనుం 'డిది ◆ యే?' మటంచు, నచ్చెరువునొంది తనలోన ◆ నాఁడెనిట్లు॥
గీ॥ "కర్ణుఁడా వీనికీ వర్ష ◆ కాలమందు, నెందుకట్టెల నొసఁగుట! ◆ ఏమి చెప్ప !
పరమదాతృత్వమది యుగ్గుఁ ◆ బాలతోడ, రావలయుఁగాని, యత్నింప ◆ రా దెవరికి!!



# భారతీ లేఖలు ౧.

శ్రీమతి. పి. సావిత్రి, [ప్రిమెట్రిక్.]

నెచ్చెలీ! స్నేహలతా!

నిన్న నీవు వ్రాసిన యుత్తరమందినది, సంగతులు తెలిసినవి. భగవతి యనుగ్రహమున నింతవఱకు మే మందఱమును క్షేమముగ నున్నాము. నీ యుత్తరమువలన మీ క్షేమము లెఱిఁగి చాల సంతోషించితిని. నీ వొక పల్లెటూరిలో నున్నను విద్యావిషయమున నిట్టికృషి సలుపుచుండుట కడు మెచ్చుకొనఁదగినది. నీకోరికమీఁద నే నిట్లు వ్రాయఁదలచు నుత్తరములను "మాతృభారతి" లోఁ బ్రచురింప సంపాదకు లనుజ్ఞనిచ్చిరి. అందులకు వారికి నే నెంతయుఁ గృతజ్ఞురాలను.

నా కిప్పుడు మనస్సు మనస్సులో లేదు. ఏమంటివా? ఇప్పుడు మన దేశమునందు విడాకులచట్ట మేర్పడఁబోవుచున్నది. మన దేశమునకుఁ బాశ్చాత్యుల నాగరకత యబ్బినది. వారినిఁజూచి క్రాపింగులు దిద్దుట—ఆఁడువాండ్రు వెంట్రుకలను గత్తిరించుకొనుట మొదలగునవి యేర్పడినవి—మనపని చివఱకుఁ బులినిఁజూచి నక్క వాతఁబెట్టుకొనినట్లయినదే! యని నాకుఁ జాల విచారమగుచున్నది. మన స్త్రీలు సిగ్గుబిడియములు విడిచి, దేశభక్తిని విడిచి యితరదేశపద్ధతులకొఱకు కాంక్షపడుచున్నారని చెప్పుటకు నాకు సిగ్గగుచున్నది. మన స్త్రీలకుఁ దగిన విద్య చెప్పింపనందువలన నిట్లగుచుండిరని నా యభిప్రాయము. పూర్వకాలమునందు మన దేశస్త్రీ లెంత ఘనకార్యములు చేసిరో యిప్పుడంత తదితరములు చేయుచున్నారు. పూర్వపు ఔన్నత్యమే మనస్త్రీల కిప్పుడున్నయెడల మన పేరును గాపాడుకొనఁగలము.

పూర్వకాలమందు భర్తను దైవముగా మనోవాక్కాయకర్మలచేత భావించి పూజించెడివారు; ఈకాలమునన్నో యగ్నిసాక్షిగాఁ జేసికొనిన భర్త నేకారణమువల్లనైన విడిచి స్త్రీ లనేకభర్తలను జేసికొనుటకుఁ దగిన వీళ్ల నేర్పఱుపనెంచుచున్నారు. ఇది యంతయుఁ బాశ్చాత్యనాగరకత మీఁది వ్యామోహపు ఫలితము!! మన పవిత్రభారతస్త్రీజీవితము లెట్టి యన్యాయస్థితికి వచ్చినవో కాసంతయు యోచించితివా?

ఈకాలమున స్త్రీపురుషు లుద్యోగముల కొఱకే విద్యార్జనము చేయుచున్నారుగాని జ్ఞానముకొఱకుఁగాదు. ఇది యెంత శోచనీయము? స్త్రీలకుఁ బాతివ్రత్యము, గృహనిర్వాహకత్వము, దేశసేవ మున్నగువానినిఁ గూర్చిన గ్రంథములను బోధించుట మంచిది. మన పూర్వస్త్రీలు తమ భర్తలను నిర్మలమైన ప్రేమతోఁ బ్రేమించి ధన్యలయి, యాదర్శప్రాయమైన జీవితమును నడపి, భారత నారీమణులసి పేరుప్రతిష్ఠలను సంపాదించుసఁగల్గిరి; కాని

పాశ్చాత్యదేశ స్త్రీలవలె భర్తలకు మాటిమాటికి విడాకు లిచ్చుచుండినచో, వారి కట్టి నిర్మల కీర్తి వచ్చియుండెడిదా మఱి ?

మనపురుషులలోఁ గొందఱు పురుషులు భార్యచనిపోయిన మఱునాఁడు చీకుచింత మాని మఱల మఱలఁ బెండ్లిచేసికొనుచు, కేవల మైహికసౌఖ్యములకొఱకే దేవులాఁడు చుందురు. ఇట్టి పద్ధతి నణచుట కేదయిన నొకచట్టము వచ్చిన నే నెంతయో సంతోషించెదనుగాని విడాకులచట్టము నా కిష్టములేదు. ఈ చట్టము కొఱకు లేనిపోని కృషిచేయు కొందఱు స్త్రీలు కలరు; గాని మనము దగిన పట్టుదలనుజూపి విడాకులచట్టమును వెనుకకుఁ ద్రోయించి దేశమునకు మహోపకారముఁ జేయవలసిన సమయము వచ్చినది. కడమ విషయములను బిదప వ్రాసెదను.

ఇట్లు నీ నెచ్చెలి,

భారతి.



# నేనే యుపాధ్యాయిని యయినచో—

శ్రీమతి. వై. కౌసల్యాదేవి, [ప్రిమెట్రిక్.]

మా పాఠశాలను విశాలముగనుండ, గట్టించెదను. గదులు పెద్దవిగను, గాలి, వెలుతురు చక్కఁగఁ దెచ్చు గవాక్షములు, ద్వారములతోను నమర్పఁబడి యుండునట్లు చూచెదను. పాఠశాలచుట్టు తోఁటయు, బాలిక లాఁడుకొన మంచి విశాలప్రదేశమును, వసతిగృహమును బరిశుభ్రముగ నుండునట్లు వీలు కల్పించెదను. ప్రేక్షకుల కొకగదియు, బాలికల భోజనవసతి (మధ్యాహ్నమున) కొక గదియుఁ బ్రత్యేకముగ నుంచెదను. ఉపాధ్యాయినుల కొక గది ప్రత్యేకించెదనుగూడ.

బాలికలను దోడి తెచ్చుట కొఱకుమాత్రమేగాక, పాఠశాల పరిశుభ్రముగా నుంచుటకయి పనివాండ్రను గైకొనెదను. ప్రతిగదియు శుభ్రముగనుండిననే గాని నాకుఁదృప్తిగలుగదు. గదిగోడలపై విద్యార్థినుల కుత్సాహజనకములగు దేశపుఁజిత్రములు-దేశీయుల పటములు-దేవతాచిత్రములు—మున్నగునవి వ్రేలాఁడఁజేసెదను. పనివాండ్రకు నాయందు భయవినయములు గల్గునట్లును, వారిపైఁ బ్రేమతోను బనులను జెప్పి చేయించుచుందును.

పిల్లల క్రమశిక్షణము విషయమున నే

నెక్కడ లేని శ్రద్ధను గనంబఱతును. బాలికలు పరిశుభ్రములగు దుస్తులతో బడికి రావలసిన ట్లుగఁజేసెదను. నేను వారివారి తరగతులలో నికిఁ బోవఁగనే, నిలంబడి "నమస్కార" మని యేకస్వరమునఁ జెప్పునట్లుచేసెదను. వారినిఁ గూర్చోఁజెప్పి, పిదపఁ బాఠము బోధించుట కుపక్రమించెదను.

పాఠము చెప్పునప్పుడు వారికి దేనియందుఁగూడ మనస్సుపోవకుండునట్లు చూచెదను. పాఠ మాకర్షకముగ నుండుటకయి, నడుమనడుమఁ జిన్నచిన్న కథలు—హాస్యోక్తులు—చిత్రలేఖనాదులు—మున్నగువానితోఁ గల్పి బోధించెదను. కొందఱు బాలికలకు వినునప్పు డేమియుఁ దోఁచక నిదురవచ్చును; కొందఱు గోళ్ళను గొఱుకుచుందురు; కొందఱు పెన్సిళ్ళను కలములను బెదవులచేఁ బీడించుచుందురు. ఈయలవాట్లను క్రమశిక్షణముద్వారా మాన్పించెదను. అనఁగఁ గొట్టికాదు; తిట్టికాదు; మంచిమాటలచేతనే.

వారు నాయందు భయభక్తులు గలిగి యుండునట్లు ప్రవర్తించెదను. నేనే వెకిలిగా వర్తించినచో వారు లక్ష్యపెట్టరని నాకుఁ దెలియును. రాజ్యపాలనమున రాజుల కెట్లవసరమో, సామదానభేదదండోపాయములు నాకు నత్యంతావసరముగదా! ఏదయినను నేనుఁ బ్రశ్న వేసినప్పుడు వారు చెప్పగల్గినను జెప్ప లేక పోయినను, మర్యాదపద్ధతికి భంగము లేకుండ ముందుగఁ నిల్చబడవలయునని శాసించెదను. మర్యాద నేర్చుకొననిచో వారికేదియుఁ బ్రయోజనముండదని నచ్చఁజెప్పుదును. తరగతిలో గుసగుసలు—అర్థవంతమగు నవ్వులు—అట్టిచూపులు మున్నగువానికిఁ జోటులేకుండ, నన్నియు, నందఱును, నావైపే యాకర్షింపఁబడునట్లుగఁ బ్రవర్తించెదను.

ఉపాధ్యాయిని యెప్పుడును శాంతముగ నుండవలయునని నే నెఱుఁగుదును. వారికి భక్తి సంచకమును (మాతృ-పితృ-రాజ-దేశ-దైవ-భక్తులు) నేర్పి, యప్పుడీ పాఠములను బోధింపవలయునని గ్రహించితిని. నేను శాంతముగ నుండనిచో, బాలికలు కావలసినదానికిఁ గూడ నడుగ భయపడెదరు. అందుచే మొదటికే మోసము వాటిల్లునుగదా! అందుచే-భయముచేఁ-బాఠముగూడ రాకుండఁబోవును. అట్లుండరాదు. వారి కింటఁజేయఁదగు పని నిచ్చినచో, నెప్పటికప్పుడుగఁ జేయించెదనుగాని రేపులుమాపులు జరపను. ఇంత శాంతము గనఁబరచినను, వారు నాపద్ధతి—నా స్వభావము నర్థముచేసికొనక పెడత్రోవగఁ బ్రవర్తించిరేని తప్పకుండ—మోమోటమిలేకుండ-వారిని శిక్షించెదను; శిక్షలోఁగూడఁదప్పునకుఁ దగినట్లుంచెదను.

నా ప్రయత్నమంతయు వారికి విద్యాభిలాష గల్గుటకును, సత్ప్రవర్తన మలవడుటకును, నైహికాముష్మికములను సాధించుపద్ధతి నేర్పుటకును నైయున్నది. ఏది చెప్పుచున్నను, నింకముం దేమున్నదో? యనునట్లుగా బోధించుచు, నేను సక్రమముగఁ బ్రవర్తించి, బాలికల నట్లు ప్రవర్తింపఁజూచెదను. అట్టిచో, నేనెట్టి యుపాధ్యాయిని కాఁగలనో మీరే యోజించుకొనుఁడు.



# కవిత్వకళ: బాలికలు.

శ్రీమతి. పి. సావిత్రి, [ప్రిమెట్రిక్.]

సోదరీమణులారా!

నేనీసభకుఁ బెద్దలచే నాహ్వానింపఁబడి వచ్చితిని. ఈపవిత్రమైన సమయమున నాకుఁ గొంచెమవకాశము కల్పించినందులకు వారికి నా హృదయపూర్వక వందనము లర్పించుచున్నాను. ఈసమయమును మీకుఁ గవిత్వకళనుగూర్చి యుపన్యసించుటయందు సద్వినియోగ పఱుపఁ దలఁచియున్నాను.

కవిత్వమన్నగా నేమియో ముందుగఁ దెలిసికొందము. ఒక్కొక్క సమయమందు దేనినయినఁ జూచిన నొకవిధమైన భావము కలుగును. అట్టిభావమును నియమప్రకారముగా మృదుమధుర శైలిలో వ్రాయుటయే కవిత్వము. పద్యములు మున్నగునవి వ్రాయువారిని గవులు—కవయిత్రులందురు. కొందఱు వ్రాసిన గ్రంథము లెన్నిసారులు చదివినను విసుగుపుట్టదు. చెట్లుచేమలు మొదలగువానిని గూర్చి వ్రాయువారు కొందఱు; మనుష్యులను గూర్చి వ్రాయువారు కొందఱు; ఇట్లు కవులనేకవిధములుగా నుందురు.

పూర్వపుఁ గవులు వ్రాసిన గ్రంథములకును, నిప్పటివారు వ్రాసిన గ్రంథములకును, జాలభేదములున్నవి. ఇప్పటి కవులలోఁ జాలమంది భావకవులు. భావకవిత్వములో రసముండదు; పద్యపాదములకు నియమముండదు; మనోహరముగా నుండదు; రచనానంతరము చదువరులకేకాక వ్రాసినవారికిఁగూడ బాగుండదు; రచనానంతర మందఱిచేఁ గూడ నభావకవిత్వమనిపించుకొనుట కలదు. అందఱివ్రాఁత లట్టివని నేనన సాహసింపనుగాని, అదేమో నేఁ జదివినవారు మాత్ర మిట్టివారికిఁ జెందినవారని యన్నచోఁ క్షమింతురుగాక! కాని పోతన మొదలగువారి కవిత్వమే బాగుండెనని నాయభిప్రాయము. కవిత్వమనఁగా సామాన్యముకాదు. అది పూర్వపుణ్యఫలముచేతనే గల్గఁగలదనికొందఱి యభిప్రాయము అనఁగా నట్లుచేయని యెడ రాదని యర్థముకాదు. ప్రయత్నించినచో వచ్చును.

బాలికలమగు మనము కవిత్వము నేర్చినచో దేశమున కెంతయో మేలొనర్చినవారమగుదుము. కవులు నీతినిబోధించు విషయములను వ్రాసి ప్రజలకు శ్రేయస్సుఁ గల్పింతురు. పూర్వకవులు సావిత్రి, సీత మున్నగు కథలను వ్రాసి వారి పాతివ్రత్యమును వెల్లడించిరి; వానినిఁ జదివిన ప్రతిస్త్రీయును మన మట్లుండిన బాగుండునేయని యనుకొనకమానదు. సాధ్యమైనంతవఱకు వారివలెఁ బ్రయత్నించి కూడఁ జూడవచ్చును. ఇప్పుడు సరోజిని— ఈమె మన హైదరాబాదీయురాలు!— మొదలగు కవయిత్రులు దేశమునకై పాటుపడుచున్నారు.

అంతేగాక వారు భాషాసేవ చేయుచున్నారు గూడను. సంస్కృతభాష యిప్పుడు గాకున్న నొకప్పుడు చాలఁ బ్రసిద్ధిగాంచి యుండినది. ఆ భాషలోని గొప్పతనమును గవులెటింగించుట వల్లనే యది యంత ప్రసిద్ధిగాంచినది. కాళిదాసు రచించిన "అభిజ్ఞానశాకుంతల" మెంత యుఁ బ్రసిద్ధినొంది సంస్కృతభాషయొక్క యౌన్నత్యమును దెల్పి, యన్నిభాషలలోనికిఁ బరివర్తింపఁబడినది. ఎందులకు? చరకాదులు వ్రాసిన వైద్యగ్రంథములుసైతము కవిత్వరూపమైన భాషలో వ్రాయఁబడినవి. కావునఁ గవయిత్రు లన్నికాలములలో—నన్నిదేశములలోఁ గలరు. రామాయణమువ్రాసిన మొల్ల మున్నగువా రందఱు కవయిత్రులే! ఆంధ్రభాషాభివృద్ధికిఁ దోడ్పడిన కవయిత్రులు!!

ఓ యాంధ్రబాలికారత్నములారా! మే ల్కొనుఁడు. మీరెల్లఱును గవయిత్రీ రత్నములరయి మనదేశమునకు రత్నగర్భాఖ్య సార్థకపఱుపుఁడు! మీ తెలివితేటలన్నియు నడవిఁగాచిన వెన్నెలగాఁ జేయకుఁడు! దీనివల్ల మీకు నష్టమేమియు లేదు. కవిత్వకళాభ్యాసమువలన దేశమునకేగాక మీకెంత గౌరవమో యాలోచింపుఁడు! మన బాలికల ఉన్నతపాఠశాలలోఁ గొందఱు బాలికలు తమకుఁ జేతనైనంతవఱకే పద్యము లల్లఁ బ్రయత్నించుచున్నారు. ఇప్పటికిని మనము బాగుపడుటకుఁ గావలసినంత యవకాశముకలదు. సోదరీమణులారా! ఇప్పటికయినను బాలికలకుఁ గవిత్వకళాభ్యాస మత్యంతావశ్యకమని తెలిసికొందురుగాక!



# సమస్యాపూరణము.

౧. కం॥ ... ... ... ... ...
... ... ... ... ...
... ... ... ... ...
కరినింగని మేఁడ్చెఁదా మృగప్రభుండంతన్.
(మృగప్రభుఁడు-సింహము.)

౨. గీ॥ "సరిగరిగపాదపదసాసగరిసరిసధ।
సాసధపదాదగపధసాసధపగరిస!
... ... ... ... ...
... ... ... ... ...

3. గీ॥ జలధియదె! వారినిధియదె! సాగరమదె!
... ... ... ... ...
... ... ... ... ...
... ... ... ... ...

౪. కం॥ ... ... ... ... ...
... ... ... ... ...
... ... ... ... ...,
"అదిగో! పులి!" యన్నఁ "దోఁక యదిగో!" యనుటే?,

౫. "కని, చని, విని, మని"—వీనినొక కందపద్యములో మొదట నిమిడ్చి వ్రాయుట.

# పతివ్రత

శ్రీయుత బిదురు వేంకటశేషయ్యగారు, బి. ఏ.

గీ॥ అది నిశీథము; ప్రబల గా ♦ ఢాంధకార, బంధురము—ఆకసంబెల్ల ♦ బలిసి యలము
కోరు క్రొక్కారు మబ్బులఁ ♦ గూరి భీమ, దర్శనంబయి యొప్పె ని ♦ స్తారకముగ ॥

చ॥ ఎడ మొకయింత లేని క్రియ ♦ నేకముగాఁగఁ బెనంగు చెట్ల కా
రడవియుఁ, గ్రూరసత్వముల ♦ యశ్రుతపూర్వరవంబులున్, గనుల్
పొడిచినఁ గానరాని చెడు ♦ ముందుల త్రోవలు, మించువెంట నే
ర్పడు నురుముల్; మఱింతగ ద ♦ రప్రదమయ్యెడి నట్టివారికిన్ ॥

ఉ॥ ఆసమయంబునందుఁ గల ♦ హంసమనోహరయాన యొర్తు సా
యాసముగా నిజేశ్వరు భు ♦ జాగ్రతలంబున మోసికొంచు వి
శ్వాసపరీతచిత్తమున ♦ వచ్చుచునుండెఁ దనుచ్ఛవిచ్ఛటా
భాసితమార్గయై ప్రథిత ♦ పద్మజు సృష్టికి మేలుబంతినాన్ ॥

గీ॥ మూఁపుపైఁ గూరుచున్న యా ♦ ముగుదభర్త,—ఒడలి దుర్గంధమునుబట్టి ♦ యెడము లేని
బట్టపేలిక కట్లను ♦ బట్టి, చూడఁ—గుష్ఠరోగివలెం బ్రేక్షు ♦ కులకుఁ దోఁచు ॥

ఉ॥ అంతటి యర్ధరాత్రమున ♦ నట్టి పురంధ్రి నిజేశునాజ్ఞఁగా
కెంతయుఁ గానిక్రంతలఁ జ ♦ రింపఁగవచ్చునె? అట్లుసేయ న
క్కాంతయు నెంతగా సుమతి ♦ కావలెనో కనుఁ! దవ్విభూతియున్
శాంతదరస్మితేక్షణవ ♦ శంబయి చాటెడిఁ దత్సతీత్వమున్ ॥

గీ॥ "అకట! ఈపాటి కది నిద్ర ♦ నందుఁ; ద్వరగ, నడవవే?" యని గద్దింపు ♦ నుడుల మగఁడు
తఱుముచున్నను బదులాడఁ ♦ దలఁప కామె, నడవలేక నడవలేక ♦ నడచుచుండె ॥

ఉ॥ అప్పుడు చాలసేపటికి ♦ న య్యడవిన్ దరియించి, ప్రక్కఁగా
నెప్పుడు పాఱువంక సెల ♦ యేటిని మెల్లఁగ దాటిపోయి, తా
నుప్పరమంటు గోపురము ♦ లుండిన యొక్కపురమ్ము త్రోవగాఁ
జప్పుడుసేయకుండఁ జనెఁ ♦ జాన, యనూనయశఃప్రధానయై ॥

* * * * * * * * * * * *

శా॥ "ఓరీ! దుర్మతి! కొఱ్ఱుబాధ నిట నెం ♦ తో కుందుచున్నట్టి న
న్నేరా తన్నితి? నీ యఘంబురకపో ♦ నే? చూడు, సూర్యోదయ
ప్రారంభమున కీవు చచ్చెదవుగా! కస్మద్వచఃప్రౌఢి న
వ్వారుం ద్రిప్పఁగ నేర రీ జగములం ♦ బతివ్యాహభావోత్సుకుల్ ॥

గీ॥ అని పిడుగువోలెఁ జెవిఁబడ్డ ♦ యమ్మహాధ్వ, నికిఁగలఁగి వెన్కఁదిరిగి యా ♦ నెలఁత ప్రబల
రోషభావకషాయనే ♦ తుఁడగు నొక్క, ఋషినిఁగని, మెల్లదింపి పా ♦ దేశు నచట॥

గీ॥ అట్టె పరువునఁబోయి య ♦ య్యనఘు కాళ్ళ, వ్రేళ్ళఁబడియు శాపోపసం ♦ హృతిఁగోరి
వేడికొని తత్ప్రయత్నంబు ♦ విఫలమౌట, నిందునుదిఁజేసి యచ్చోట ♦ నిలిచి పలికె॥

కం॥ "నా దయితుఁ డీఘనుఁడు సూ, ర్యోదయకాలమున మరణ ♦ మొందవలసినన్
నాదు వచోనియతిని సూ, ర్యోదయమే యింక లేక ♦ యుండునుగాతన్ ॥

* * * * * * * * * * * *

గీ॥ "అమ్మ! నేననసూయఁ, ద్వ ♦ దాత్తశాప, మునకునై సూర్యుఁ డుదయింప ♦ కునికి జగము
లెల్ల తల్లడిల్లెడు, వాని ♦ నెట్లుపోఁతో? నీ పతిని నేన బ్రతికింతు ♦ నిక్కవముగ" ॥

గీ॥ అను చెదుటనున్న యనసూయ ♦ కనియె మ్రొక్కి, "అమ్మ! నీ విప్పుడన్నట్ల ♦ యగునుగాక,
ఏఁ బతివ్రతనే నైతి ♦ నేని చూడు, మింకమీఁద భాస్కరుఁ డుద ♦ యించుగాక!!"

* * * * * * * * * * * *

కం॥ అప్పటినుండియు నెప్పటి, కప్పుడుగాఁ బాతిమములను ♦ నఱచే నిడుకొం
చుప్పరమునఁ జరియించుచు, నొప్పుచునున్నాఁడు సూర్యుఁ ♦ డుదితభయుండై ॥



# -* తమాషాలు *-



**—♦ గుణము ♦—**

భర్త.— కోఁతిగుణా లన్నీ అబ్బుచున్నవిసుమా నీకు?

భార్య:— ఇంక మీ గుణాలన్నియు నాకబ్బలే దనా?

శ్రీమతి యస్ యశోదాదేవి పిప్రిమెట్రిక్.

**—♦ వెనుకఁబడుట ♦—**

సుబ్బయ్య:—కుమారా! ఎల్లప్పుడు నీపాఠములో వెనుకఁ బడెద వేమిరా?

బాలుఁడు:— ఎందుకా? తక్కువారిని వెంబడించుటకు.

శ్రీమతి డి. కమలావతి మెట్రిక్.

# మా తృ భా ర తి.

శ్రీయుత. విదుర వెంకటశేషయ్యగారు, బి. ఎ.

లంబోదరశాస్త్రి యిట్లు చెప్పుచున్నాఁడు.

"ఏది? ఉగ్గుఁబాలతోఁ బెట్టఁబడి మనతోఁబాటు పెద్దపెరిగిన దేది? చేఁటలోఁబడినది మొదలు చితిపై కెక్కువఱకును జీవితయాత్రలో మనము విడువఁజూచినను, మనలను విడనాఁడనిదేది? మనకు శల్యములో శల్యమై-యస్థిలో నస్థియై-రక్తములో రక్తమై-ప్రాణములోఁ బ్రాణమై-సత్త్వములోసత్త్వమై-మఱపులోఁ గూడ మఱవరానిదై- నామమాత్రావశిష్టుల మగు మనల నొక మనుష్యులనే యని యనిపించి, వ్యర్థముగాని వ్యక్తిత్వ మిప్పించి, ప్రపంచములో మనకన్ని పోసికొనఁ ద్రావ నీళ్లుగల్పించిన దేది? "జననిజన్మభూమిశ్చ, స్వర్గాదపిగరీయసీ" యను నార్యోక్తిఁ బ్రత్యక్షరసత్యమైన తార్కాణమైన దేది? తలఁచుకొన్న మాత్రాననే యొడలినిఁ బులకింపచేసి మనస్సును ద్రవింపఁ జేయునంతటి మాధుర్యము- ఆమాధుర్యములో నొక గాంభీర్యము-ఆగాంభీర్యములో నొక విధమైన పటుత్వము-అపటుత్వములో నొక విధమైన మహత్త్వము-గల్గి మహనీయ మర్యాదా మోహనమై, పరిభువు మొదలు బానిస వఱకును బరమానుష్ఠేయమైన దేది? సోదరీసుణులారా! ఏది? మాతృభాష, మాతృభారతి; కాదా? ఓ! ఎట్టి మాతృరభాతి? "దేశభాషలందుఁదెలుఁగులెస్స" యని యన్ని దేశముల యందును బేరుమోసిన మాతృభారతి— ఖండాంతరములయందును గమనీయ యశోవల్లికలెగఁబ్రాకఁగ, "The Italian of the East" అని యెన్నికఁగన్న మాతృభారతి! చూచుచున్నారా? ఆంధ్రభారతిని! అదిగో! అమ్మలారా! నమస్కరింపుఁడు!

తలపై ధగధగ మెఱయుచున్న రమణీయరత్నకిరీటముతో-వెన్నెల వెల్లువల నపహసించు తెలిపట్టుపుట్టముతోఁ— బ్రచురపవిత్రశృంగారాభంగురమైన సర్వాంగసౌష్ఠవములతోఁ—జూపులకు మిఱుమిట్లుగొల్పు సువర్ణాలంకార పూర్ణతతో—మధురమందహాస ప్రసన్నగంభీరవదనారవిందముతో— వరదాభయసూచకమగు కరాంబుజముతో—సనిర్వాచ్యానందమకరందబంధురమై యాశ్రితకల్పకమైన గోమలపాదపద్మయుగ్మముతో— నదిగో! సందర్శించుచున్నారా, మాయమ్మను?— ఆంధ్రదేశాధీశ్వరీత్వమును బ్రకటించుచు, సింహాసనాధిష్ఠితయయిన యాంధ్రభారతిని? ఓహో! ఏమో యనుచున్నదామె? వినుఁడు. వినుఁడు. ఏమి? "నమాతుః పరదేవతా" యనునది విస్మరింపకుఁడని హెచ్చరించుచున్నదా? 'మాతృదేవో భవ' యను వేదానుశాసనమును బ్రతిక్షణమును శిరసావహించి జీవితయాత్రను

సాగించి మనము మన మాతృభారతిని మఱచి యింకేమి చేయఁగలము ? గుఱ్ఱిగవ్వకయినఁ బనికివత్తుమా? మన యాంధ్రిత్వమునకంతయు నామెయే 'మూలవిరాట్టు' గదా? ఆమెచల్లని చూపులలో—నామె మెల్లనినవ్వులలో—మన మైక్యము కాఁగల్గినయెడల, నంతకంటె మహా భాగ్య మేమికలదు ?

ఆమె పాదపద్మములచెంతఁ బూజాధురంధరులయి వినమ్రిభావముతోఁ జుట్టును మూఁగి నిల్చున్నవా రెవరనుచున్నారా? వారే, మనకు, మనజాతికిఁ బ్రాణముపోసిన కవిబ్రహ్మలు ! వారే, మనకు, మనభాషకు బ్రదుకుఁదెరువుఁ గల్పించి పోషించిన కావ్యలక్ష్మీమనోహరులు ! వారే, మనయజ్ఞానసంహర్తలగు కవీశ్వరులు !! రససిద్ధులగు కవీశ్వరులు ! నన్నయభట్టారకాదులు ! వా రెల్లరు మనకుఁ బరమపూజ్యులు. వారికిఁ జేతులెత్తి యెన్నిమాఱులు నమస్కరించినను, వారికి ఋణపడినదానిలో నావగింజలో నరభాగమయినఁ దీర్చుకొనఁజాలము. ఉండుఁడుండుఁడు. వారేదో మాటాడుచున్నారు. విందము.

అందఱు:- జయ్ ! మాతృభారతి జయ్ !!

మాతృభారతి:- నాన్నా! నన్నయభట్టు! ఏదీ, నీవు ముందుగఁ జదువుము.

నన్న :- అమ్మా! అవధరింపుము. ద్రౌపదీవస్త్రాపహరణ సందర్భమిది.—

"ఉ॥ ఆ వనజాననం గురుకు ♦ లాపశదుండు
గడంగి రాజసూ
యావబృథంబునందు వసు ♦ ధామర
మంత్రిపవిత్రవారిధా
రావళిఁజేసి పావనము ♦ లైన శిరోజ
ములం జెమల్చి పావహుఁ డీడ్చి తెచ్చె, సభ ♦ కందఱు
సంభ్రిమమంది చూడఁగ్ ''॥

అందఱు:- (చప్పట్లు చఱచుచున్నారు)

మాతృ :- ఏమి యుదారధారాశుద్ధి ! గంగాతరంగిణీప్రివాహప్రతిమానముగదా! నాయన ! "ప్రిసన్నకథాకలితార్థయుక్తి" కిని, "అక్షరరమ్యత" కును నీవే పెట్టినపేరోయీ!

తిక్కన:- అమ్మా! నేను నందులకే యీయనకు "విద్యాదయితుఁ" డని బిరుద మిచ్చితిని.

మాతృ :- అబ్బాయీ ! సోమయాజీ నీవు ప్రారంభింపుము.

తిక్కన:- తల్లీ ! చిత్తగింపుము. శ్రీకృష్ణుని రాయబారము సందర్భమున—

కం॥ క్షీరోదకగతిఁ బాండవ
కౌరవలొడఁగూడి మనికి ♦ కార్యంబది నీ
వారసి నడపుము వారన
వీరనఁ గురుముఖ్య నీకు ♦ వేఱుంగలదే !

శా॥ ఈవంశంబునకెల్ల నీవ కుదురిం ♦ దెవ్వా
ని చందంబు లె
ట్లయివర్తిల్లినఁ గీడుమేలుఁ దుదినీ ♦ యం
దొందెడుం గాన స
ద్భావంబారసి లోనిపొత్తు వెలివ్రు ♦ త్తం
బుల్ జనస్తుత్యముల్
గావింపందగు నీక యెవ్విధమునం ♦ గౌర
వ్య వంశాగ్రిణీ !''

మాతృ:- ఓహో! భాషపై భావానురూపమైన కళాభినివేశముగల యాంధ్రితాముద్రినెంత చక్కఁగ వైచితివి? బిడ్డా ! ఏమందును? నన్ను నీలోనే యైక్యముచేసికొంటివి,

ఎఱ్ఱాప్రిగడ:- అమ్మా! నేనును జదువుదునా ?

మాతృ:- నాయనా! అట్లనుచున్నావేమి? భారతము కొలఁదిగనే వ్రాసితివనియా? దానికేమి? నీవు మాత్రము నృసింహపురాణము, హరివంశము, రామాయణములను రచించిన జగజ్జెట్టివి కావా మఱి? చదువుము

ఎఱ్ఱా:- అమ్మా! తీయఁగనే ధర్మవ్యాధుని చరిత్రము వచ్చినది.

మ॥ "హలికుండొంతయు నోజలోఁ దునఁగసీ♦
రాగ్రంబునం జోకి ప్రా
ణు లనేకంబులు సచ్చు; హింసయది యా
నోకాదా? వేయేల మ
ర్త్యులు నేలంజరియించుచోఁ బదము
లం♦ద్రొక్కంబడుం బెక్కు జం
తులు: హింసావిధిగాదనంగవశమే దోష
జ్ఞ! యూహింపుమా!

మాతృ:- బిడ్డా! శంభుదాసా! నీలో "వాగనుశాసనుఁడు" ను "కవిబ్రహ్మ" యును జతృముగఁ జేరిపోయిరిసుమా! అబ్బాయీ! పోతనా! భగవద్ధ్యానములో నున్నావేమి యింకను? ఏదీ నీ భాగవతము? చదువుము.

పోతన:- అమ్మా! అనుగ్రహింపుము.

ఆ॥వె॥ "హర్షదాయులైమ♦హారోషదాయులై
పఱచు ముద్దరాలి ♦ బాణవృష్టి
హరికి నరికిఁజూడ ♦ నందంద శృంగార
వీరరసము లోలి ♦ విస్తరిల్ల॥

కం॥ "లేమా! దనుజుల గెలువఁగ
లేమా! నీవేల గడఁగి ♦ లేచితి విటు రా
లే మాను మానవేనా
లే మావిల్లందికొనుము ♦ లీలం గేలన్॥

* * * * * *

ఆ॥ "బ్రతుకవచ్చుఁగాక♦ బహుబంధనములైన
వచ్చుఁగాక, లేమి ♦ వచ్చుఁగాక
జీవధనములైనఁ ♦ జెడుఁగాక, పడుఁగాక
మాటఁదిరుగలేరు ♦ మానధనులు॥

* * * * * *

మ॥ "సిరికిం జెప్పఁడు, శంఖచక్రయుగముం ♦
జేదోయిసంధింపఁ, డే
పరివారంబును జీరఁ, డభ్రగపతిం ♦ బ
న్నింపఁ, డాకర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు, వివా ♦
దప్రోత్థితశ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు, గజ ♦
ప్రాణావనోత్సాహియై॥"

మాతృ:- ఆహా! ఏమి రసోత్కర్ష! ఏమి చాతుర్యము! ఏమి భావగాంభీర్యము! "రసో వై సః" యన్నసూక్తిని జ్ఞప్తికిఁ దెచ్చితివే! ఇట్టి మాధుర్యము నాయనా. "పరమేశ్వర కరుణా కలిత కవితావిచిత్రుఁ" డవు, "సహజపాండిత్యుఁ"డవు నయిన నీకుఁగాఁ దగినది!

శ్రీనాథుఁడు:- అమ్మా! ఆ చివరపద్యమున్నదే!—"సిరికిం జెప్పఁడు!!— అది నాకుఁ గొంతపాఠమును గూడ నేర్పినది.

అందఱు:- (నవ్వుచున్నారు.)

మాతృ:- శ్రీనాథా! నీవును వినిపింపుము.

శ్రీనా:- అమ్మా! కాశీఖండ మిది. వ్యాసుని కాశీవినిర్గమన ఘట్టము—

ఉ॥ "ఎట్టు పురాణముల్ పదియు ♦
నెన్మిదిఁ జెప్పితి? వెట్టు వేదముల్
గట్టితి వేర్పఱించి నుడి ♦
కారము సొంపెసలార భారతం
బెట్టు రచించి? తీవు ఋషి ♦
వెట్టయి? తొక్కదినంబు మాత్రలోఁ
బొట్టకు లేక తిట్టెదవు ♦
పుణ్యగుణంబు రాశిఁ గాశికన్॥

మాతృ:- నాయనా! "దివిజకవివరు గుండియల్ దిగ్గురనంగ" వచ్చిన కవితాశ్రీనా థుఁడవుగావా నీవు?—పెద్దనకవీ! ఏదీ నీ 'యల్లి కజిగిబిగి ?'

పెద్దన:- తల్లీ' ధన్యుఁడనై తిని. ఇదిగో! మనుచరిత్రము—హిమవత్పర్వతవర్ణనము.

చ॥ "అటఁజని కాంచె భూమిసురుఁ ♦
డంబరచుంబిశిరస్సరర్ఝురీ
పటలముహుర్ముహుర్లుఠద ♦
భంగతరంగమృదంగ నిస్వన
స్ఫుటనటనానురూప పరి ♦
ఫుల్లకలాపకలాపి జాలమున్
గటకచరత్కరేణుచయ ♦
కంపితసాలము, శీతశైలమున్॥

మాతృ:- ఇట్టి కవితాసౌష్ఠవమున కే శ్రీకృష్ణదేవరాయల గండపెండేరమున కర్హుఁ డవై యాంధ్రిలోకమునఁ బూజ్యస్థానమలంక రించితివి. రామకృష్ణా!

తెనాలిరామ:-ఓయ్! ఇక్కడ నేయున్నాను

మాతృ:-(నవ్వి) లేవనలేదో యీ విన్ను ఏదీ! నీ మాహాత్మ్యము, చూపవేమి?

రామ:-నామహాత్మ్యమా? ఇదిగో చూ పెదను, అందఱును జూడుఁడు. ఇది నిగమశర్మో పాఖ్యానము—

శా॥ "ప్రారంభించిన వేదపారమునకుం ♦
బ్రత్యాహమానంచునో
యేరా తమ్ముఁడ! నన్నుఁజూడఁజనదే ♦
వెన్నాళ్ళనో యుండి చ
క్షూరాజీవయుగంబు వాచె నినుగ ♦
న్గోనక్క; మీ బావయున్
నీరాకల్ మదిఁగోరుఁ జంద్రుపాడువున్ ♦
నీరాకరంబుంబలెన్॥"

మాతృ:- కుమారా! కుమారా! ఎంత చక్కఁగ వ్రాసితివి! నిన్ను 'వికటకవి' వని వె ఱ్ఱివాండ్రనవలెఁగాని, నిజముగాఁ బాండురంగ విభునిలోని పరమపేశ్రిమరసమును వెల్లివిరిసి పా ఱింపఁజేసి, నీవు ధన్యుఁడవై, యాంధ్రుల నందఱిని,—

సోదరీమణులారా! వినుచున్నారా? వినుఁగుకొనలేదుగదా? ఆ తెనాలిరామకృ ష్ణుని ప్రక్కన నిలువఁబడి యున్నాఁడే యతఁడే రామరాజభూషణుఁడు—అతనికిఁ గుడిప్రక్కన రాజవేషధారియగు నతఁడే శ్రీకృష్ణదేవరా యలు— ఆయనతో గుసగుస లాడుచున్న వాఁడు ధూర్జటి— ధూర్జటి చుట్టుఁజేరిన గుం పులో నున్నా రెందరో మన మహాకవులు!! కాని, ఆహా! ఏమి యా పద్యరత్నములు!-మన మాతృభాషలో మహనీయస్థాన మాక్రమించిన పద్యరత్నములు: తాలుఁగరఁగునట్లు మోళ్ళు చిగిరించునట్లు, పువ్వులసోన గురిసినట్లు, వెన్నె లవెల్లువ లుప్పొంగినట్లు, హిమానీపూరములు, జిలికినట్లు నుండి రసికజనైకవేద్యమగు భావ ము—భావమునకుఁ దగిన భాష-భాషకుఁ దగిన ప్రతిభ-ప్రతిభకుఁదగిన నిర్వ్యాజత-యివన్నియు నెట్లు లెఱుఁగరాని రీతిగఁ బెనసికొని యేకా కారమై యఖండానందవర్ధనమగుచున్నదో, కా సంత నిలిచి గమనించితిరా? ఆగ్రంథకర్తలగు కవులే— "రవిగాననిచోఁ గవిగాంచునే దా!" యని యనిపించిన కవులే— కవిహృదయము ప్రత్యక్షమగునట్లుగ సేయుత, రసోత్కర్ష, చిత్ర ణచతురత, భావగాంభీర్యము-ఇవన్నియు నుట్టి పడునట్లుగఁ— గమ్మగాఁ—ప్రేమమయములగు హృదయములతోఁ బరమపేశ్రిమమయి యగు శ్రీమాతృభారతి యెదుటఁ బ్రతిపద్యమును

స్పష్టాక్షరముగఁ బాడుటవమనలెవ్విన్నవా రేమి కావలసినది? తదీయరసాంధిభోలోనికి జఱ్ఱున జాఱవలసిన దేనా? జాఱి తలమున్కలయి యూపిరిసల్పక మునుఁగుచుఁ దేలుచు, నట్టిట్టు కావలసిన దేనా? భౌతికసముద్రమునఁ బడిపోయిన వారికి బ్రదుకుఁజెరువునకయి పడవలు గిడవలు కావలయునుగాని, సంసారసముద్రమునఁ బడి గిలగిల గొట్టుకొనువారికిఁ బాగమోడకొఱకు దేవులాఁట యవసరముగాని, యీ కావ్యరసాబ్ధిమగ్నుల కేమియు నక్కఱలేదే! ఉప్పునీళ్ల యుద్వేలత యేమియు లేదే!! మనమును నాసముద్రములోఁ బూర్తిగఁ బడకున్నమానె, రెండుదోసిళ్ళయినను దావి హృదయమార్చుకొనుపోవు దప్పినిఁ దీర్చుకొనవలదా?

కావున మీరెల్లరును నేఁటినుండి మన మాతృభాషను సాధించుటకుఁ బ్రయత్నింపుఁడు. విద్యనంతయు మాతృభాషాద్వారానే నేర్వఁజూడుఁడు. దానిలోని రసపూర్ణతను,—జెఱకునకుఁ, బంచదారకు, ద్రాక్షకుఁ, బువ్వుదేనెకు, మఱిదేనికిలేని మాధుర్యధుర్యతను—జూఱఁగొనుఁడు. అది యొకసారిగఁ గుదురకపోయినను, మీశ్రద్ధకొలఁది దినక్రమమున రాకపోదు. త్రిమూర్తులకుఁ దిప్పలుదెచ్చిన—సూర్యుని గడగడలాఁడించిన—క్రీఁగంటిచూపుతో జగత్తులను క్రిందుమీఁదు సేయఁగల్గిన—ప్రతిభాశాలినుల యంశమున జన్మించిన మీకేదియు దుష్కరము గాదు. మాతృభాషలో సరిగఁ బరిచితిలేకుండుట మనుష్యధర్మవిరుద్ధమనుట మఱవకుఁడు. మాతృభారతీపాండిత్యనిత్యత నార్జించుచు, మన 'మాతృభారతి'నిఁ బోషింపుఁడు. ఇది విద్యార్థినులరగు మీవిధ్యుక్తధర్మ మనుమాటను విస్మరింపకుఁడు."



## వెనుకటి సమస్యాపూరణ—సమాధానము

శ్రీమతి. యన్. భారతీరత్నాకరాంబ, (ప్రిమెట్రిక్.)

కం॥ ఉరులనుజిక్కి యుపాయము, నరయఁగలేకమితదుః ♦ ఖమందుచు నెదుటన్
శరమునుగొని నిలిచిన శం, "కరినిం గనివేఁడ్చెఁ దా మృ ♦ గపతిభుఁ డంతన్"॥

కం॥ కని హరిరూపము కన్నుల, విని హరిసంకీర్తనంబు ♦ వేడుకమీఱన్
చని హరిసేవలుచేయుచు, మనియుండని వాని బ్రదుకు ♦ మహినిఁక నేలా?

కం॥ పదిలంబుగ విని, పిమ్మట, మదిఁ జర్చింపంగవలయు ♦ మనుజవరుండున్
పదపడి మూర్ఖునిపోలిక, "అదిగో! పులి! యన్నఁ దోఁక ♦ యదిగో! యనుటే"?

గీ॥ "సరిగరిగపాదపదసాస ♦ గరిసరిసధ, సాసధపదాధగపధసాసధపగరిస"
అనుచు రాగము తాళము ♦ నవధరించి, భజనచేయుచునుందురు ♦ భక్తిలేక॥

---

ఈ సమస్యాపూరణమునకై యీ బాలికకు బహుమతి యొసంగఁబడినది.



# "అగ్ని చందనశీతలుఁడయ్యె, నెట్లు?"



శ్రీమతి. వై. అమృతమ్మ, (మూఁడవ ఫారము)

గీ॥ ఉజ్జయిని పట్టణంబులో ♦ నుర్వినాథుఁ, డుండె, నిర్వక్ర విక్రమా ♦ ర్కుం డనంగ;
నతఁడు వాడుకచొప్పున ♦ నా పురమున, సంచరించెను, మాఱు వే ♦ సమున నొకట॥

సీ॥ ఆకాశవీథి ము ♦ ద్దాడు సౌధములతోఁ, దనరెడి యుద్యాన ♦ వనులదాటి
చెట్లబారుల చాటు ♦ జిలుగు దీపపువెల్గు, క్రమ్మిన రాజమా ♦ ర్గములదాటి,
నిశ్శబ్దదేవత ♦ నెఱి నాట్యమాడెడి, యిఱుకైన సందుల ♦ నెల్లదాటి,
కను లెంతపొడుచు కొ ♦ న్నను గానరాని చీఁ, కటిగల్గు చోటులఁ ♦ గడక దాటి,

గీ॥ క్షితిపతియుఁ దుట్టతుద కొక్క ♦ చిన్నిగల్లి. గడచి, యచ్చటి తాటాకు ♦ గుడిసెయందు
భార్య తొడమీఁదఁ దలపెట్టి ♦ పవ్వళించి, కడు సుఖముగ నిద్రించు నొ ♦ క్కరుని గాంచె॥

గీ॥ నిల్చి, యట్టి కష్టమెప్పైన ♦ వాల్పకుండఁ, జూచి భూనాథుఁ డాశ్చర్య ♦ మేచినట్లు
సరగఁ దత్కుటీరప్రదే ♦ శమును బాసి, యరుగుటకు మెల్ల సంసిద్ధుఁ ♦ డయ్యెఁ బ్రీతి॥

గీ॥ అంత నాతఁడు తిరిగి గృ ♦ హమునకేగి, యేదో యాలోచనముచేసి ♦ యెడదయందు
మంత్రితోఁ గొల్వుచేయింప ♦ మాటయిచ్చె; మఱుసటిదినంబె సభయును ♦ జరుగునట్లు॥

గీ॥ నెగడె సభయంత నిశ్శబ్ద ♦ ముగను, బుధుల, నేకులచ్చట గుమిఁగూడి ♦ నిల్చియుండ
వేడ్క, భూపుఁడొక సమస్య ♦ వేసెనిట్లు, "అగ్ని చందనశీతలుఁ ♦ డయ్యె, నెట్లు?"

గీ॥ ధన్యచరితుఁడు, పండితో ♦ త్తముఁడును నగు, కాళిదాసను కవి దానిఁ ♦ గడఁగి కొంత
తడవు తర్కించి చూచి య ♦ ర్థమ్ముఁ దెలిసి, 'నేనుజెప్పెద' నని యిట్లు ♦ పూనిపల్కె॥

గీ॥ ఒక్కయింటిలో సతిపతు ♦ లుండి, రధిప! ఒక్కదినమున నతఁడుండె ♦ నువిద యంక
భాగమునఁ దలపెట్టి ని ♦ ద్రాగతుఁడయి, కొడుకు కుంపటికడ ♦ నాఁడుకొనుచునుండె॥

గీ॥ అంత బాలుఁడు కుంపటి ♦ యందుఁ బడియె, పడఁతి యది చూచి పతి నిద్ర ♦ భంగమగు నె
ఱింగి, యగ్నిదేవుని యంత ♦ రంగమందుఁ, గొలువ, వాఁడును హాయిగా ♦ నిలువఁగల్గె॥

గీ॥ అట్టి యా పతివ్రత మహి ♦ మాస్తివల్ల, బాలుఁ డనపాయముగనుంట; ♦ భర్తనిద్ర
చెఱుప నవసరము లేమేక ♦ చిత్రముగను, "అగ్ని చందనశీతలు ♦ డయ్యె, నిట్లు?"



# విద్యార్థినీదశ.

శ్రీమతి. వి. లక్ష్మీదేవి, [ప్రిమెట్రికు.]

సోదరీమణులారా!

విద్యార్థినీదశ యెంత గొప్పదియో యొకింత గమనించితిరా? ఎంత గొప్పదియో యాలోచించుట యెందులకు? ప్రత్యక్షముగా నే గానవచ్చుచున్నది. ఎవ్వరివద్దకో యెందులకుఁ బోవలెను? మనమే చాలు. మనలోఁ గొందఱికి నింటియం దుండుటనఁగా నరకమం దుండునట్లే. పాఠశాలకువచ్చి తిరిగి యింటికిఁ బోవలెనన్న, నేదో యొక గొప్పయాపదలోనికిఁ బోవుచున్నట్లే! కొందఱికిఁ గాళ్ళేరా వింటికే గుటకు? కొందఱు, మఱికొంతసమయ మిచ్చటనే యుండిపోవచ్చును లెమ్మని యనుకొని, మఱల నింటియందుఁ దల్లిదండ్రు లేమనుకొన నందు రేమో! యను భయమునఁ గాళ్ళు రాక పోయినను దెచ్చుకొని పోవుచుందురు. దీని కంతటికిఁ గారణ మేమిటి? సోదరీప్రేమయే గదా! పాఠశాలకుఁ బోవుచున్న యన్నిదినములు నెంతో సంతోషముగా హాయిగా నుండును. పాఠశాలకుఁబోయి గురువులయొద్దనుండి యెన్నియో సంగతులను నేర్చికొందుము. నేర్చికొనుటయం దాయుత్సాహము— ఆ పట్టుదల—మఱెప్పుడు కల్గును? విద్యార్థినీదశయందే కదా!

పూర్వకాలమునం దెంతయో బాగుండెడిది. అప్పుడు గురుకులవాసమునందుండి పరిపూర్ణవికాసము నొందినవారినే చదువుమాన్పించువారు. తర్వాత యోగ్యతప్రకారము గురుదక్షిణ యిచ్చెడివారు. అప్పుడు నాల్గవతరగతి చదివినను, నిప్పటి మెట్రికుతో సమానము సామాన్యవిజ్ఞానవికాసములో! అప్పటికాల పురాణములు, శాస్త్రములు నేర్చిన ట్లిప్పటి కాలమున లేదు. వానిలో నెంతజ్ఞానభాండారమిమిడియున్నదో వేఱుగఁ జెప్పవలయునా? దానిని నేర్చుకొనుటకు విద్యార్థినీదశలోఁ గాక యింకెప్పుడు కుదురును? అయ్యో! మనల నిప్పుడు పాశ్చాత్యవ్యామోహమువచ్చి పైకొన్నది. జనులందఱు దానినే పట్టుకొని ప్రేలాడుచున్నారు; దానిప్రభావమువలననే మన పురాణము లన్నియు మాఱుమూలలఁబడినవి; ఆత్మజ్ఞాన మడుగంటినది. సంస్కృతభాష మృతభాషలలో నొక్కటిగఁ బరిగణింపఁబడినది. సంస్కృతభాషాభ్యాసమువలన నోరు తిరుగలి తిరుగునట్లు తిరుగునుగదా? అది మన బడియం దున్నదిలెండి!

మనము జీవితములోనికి దిగిన తర్వాత విద్యార్థినీదశను దిరిగి సంపాదింపఁగలమా? ఇప్పుడు మనము కవిత్వమల్లుట మొదలగునవి నేర్చుకొనుచున్నాము. అందుచే మన భావములను బద్యములద్వారా వెల్లడిపఱుప వచ్చును. అట్లుచేసినచోఁ గవయిత్రు లనిపించుకొనియెదము.

మన జీవితమంతయు నొక నాటకరంగముగా నేర్పఱచినయెడల, దానిని మూఁడుభాగములుగా నేర్పఱపవచ్చును. మొదటిది బాల్యము; రెండవది విద్యార్థినీదశ; మూఁడవది ముఖ్యజీవితము. మొదటి దశయం దజ్ఞానాంధపరివృతులమయి యుండుటచే నప్పుడు చాలవఱకు మనకేమియుఁ దెలియదనవచ్చును. మూఁడవది కష్టసుఖ పరంపరలతో, వివిధానుభవములతోఁ గానవచ్చుచుండును. కాని రెండవది—విద్యార్థినీదశయందే మన మెక్కువ నిర్మలమయినట్టి యుత్సాహముతో నుండునది! దీనియందే పవిత్రసోదరప్రేమకుఁ బాత్రులము కాఁగలము. తృతీయదశలో నత్యుపయోగకరములగు విద్యలను నేర్చికొని, యుద్ధమునకు యుద్ధభటునివలె సన్నద్ధులము కాఁగలము. కొందఱింటియం దూరక కూర్చొని యాఁడుకొనుట మఱఁగి పాఠశాలకు రావలెనన్న బద్ధకింతురు. తలిదండ్రులు బడికిఁ బొండని త్రోసినను గారు. కొందఱు పోయెదమని చెప్పి మఱియొకరి యింటికిఁబోయి యచ్చట నాటలతోఁ గాలక్షేపము చేసెదరు? విద్యార్థినీదశలోని విశ్వమోహనమైన పవిత్రత్వమును బాగుగా గమనింపకపోవుటవలననే గదా! ఈ సారాంశమును జక్కఁగా గ్రహించిరా, తిరిగి వారట్లు చేయుదురా మఱి? చేయుమన్నను జేయరు సుమండీ! కర్మముచాలక యెన్నఁడయినఁ దల్లిదండ్రు లింటియం దుండుఁడని నిర్బంధించినను, 'మేము బడికిఁ బోవలెను, మే ముండము' అని చెప్పి పరుగుపరుగున బయలుదేరి వచ్చుచుందురు. నిజము విచారించినచో, నీ దశయందు నొక విధమైన యాకర్షణశక్తి గలదు. క్రొత్తదినములలోఁ బాఠశాలకురాక కొంత కష్టముగ నున్నను, దాని ప్రభావము మనపై నినుమడించుకొనలేదని, మనము దానికి లొంగిపోయి, దాసోఽహమ్మని చేతులొగ్గుచుండుట మన యందఱి యనుభవములోని విషయమే గదా! ఈదశలో మన మనస్సులు విద్యార్జనమందు—నాట పాటలయందు— లీనములయి యుండును. గావునఁ, ప్రపంచ కష్టసుఖములంతగా మనలను బాధింపవు. అందుచేనవి నిర్మలములై నిత్యసుఖములై నెగడుచుండును.

విద్యార్థినీ దశనుదాటితిమేని, యది మఱొక జీవితమని చెప్పవచ్చును. అప్పటికది గొప్పది; ఇప్పటికిది గొప్పది. పై జీవితమునకుఁ బునాది యిచ్చటనే వేయఁబడుచున్నది. రామాయణము చదివినచో, సీత పతిభక్తి, లక్ష్మణుని భ్రాతృభక్తి, దశరథుని సత్యసంధత, మున్నగునవి మనకుఁ బులకలెత్తించి, మనల నట్లే ప్రవర్తింపఁదప్పక యుద్బోధించును. అందుచే భావిజీవిత మంతయు దాని పరముపైననే యాధారపడి, మనవి చిన్నచిన్న రామాయణము లగుటకు వీలున్నది; అంతేకాక యింకను బూర్వకాలపువారి ప్రవర్తనము, వారి శక్తి తెలిసికొందుము. ఇప్పుడు చాలవఱకు స్వేచ్ఛావాయువులు వీచుచున్నను, బూర్వభారత స్థితులింకను బాడుకొనియే యున్నవి. వానినిఁ బెంపొందించి యిప్పటి నూతనజీవితఘట్టములతో మేళవింపఁజేసి క్రొత్తమార్గము త్రొక్కుటకు వలయుసాధనసంపత్తి మన యీ విద్యార్థినీదశయందే సేకరింపవలసియున్నది.

కావున నింత పవిత్రమగు విద్యార్థినీ దశను నెంత జాగ్రత్తగ— నెంత సహృదయముగ— నలవఱచుకొని భారతనాగరకతను, నిలువబెట్టుటకయి ప్రయత్నింపఁగలమో, మన భావిజీవిత మంతజాతీయముగను, నంతసౌఖ్యా

వహాముగను నుండును. ఒక మెట్టును విడిచి మఱియొక మెట్టున కెట్టు లెగురఁగలము? ముందు దీనిని దాటియే ముందటిదానికిఁ బోవలసి యున్నది. కావలసిన యన్నివిషయము లిప్పుడే నేర్చుకొన్నఁగాని. ముందటి త్రోవ మనకుఁ దెలియదు. ఇప్పటి యీ యుత్సాహము—ఈ పట్టుదల — ఈపరుగులు — భావిజీవితమునఁ బ్రతిబింబింపవలసి యున్నది. అప్పుడే జీవిత మంతయు నేకరూపమయి హెచ్చుతగ్గులు లేక, పవిత్రప్రేమమునకుఁ బెట్టినపేర ఋ, మనకు సౌఖ్యదాయియగును.



# మా తృ భా ర తి.

శ్రీయుత కె. రామమూర్తి గారు.

సుగంధకుసుమ మెటనున్నను దాని తావి నలుదెసలఁ బర్వును. వైలెటుపువ్వు సుందరమయ్యు నడఁకుగలిగి పర్వతప్రాంతముల నడఁగి మడఁగి యుండును. అయ్యది యందమైన పొదరిండ్ల నలంకరింపఁగల సామర్థ్యముగలదే కాని తనతావునుండి యే సౌగంధము వెదఁజల్లుచు జనసామాన్యమున కడకువ బోధించుచున్నది. అటులనే వినయవిజ్ఞానముల కాదర్శప్రాయులు "మా తృ భా ర తి" సంపాదకులు.

మాతృభారతి సచిత్ర-లిఖిత-మాసపత్రిక యన్నమాట గోలకొండ పత్రికద్వారా పలువురకు విశదమే. దాని సంపాదకులు బిదురు వేంకటశేషయ్యగారు. వేంకటశేషయ్యగారు బాలికాపాఠశాలలో లేకపోయిన 'మాతృభారతి' ఉండెడిదికాదేమో? ఇప్పుడు నాకొక సందేహము. "మా తృ భా ర తి మూలముగా శేషయ్యగారికి పేరు ప్రతిష్ఠలు వచ్చినవా? శేషయ్యగారి మూలముగా మాతృభారతికి, బాలికాపాఠశాలకు నన్నువచ్చినదా?" అని.

బిదురు వేంకటశేషయ్యగారు నిరాడంబరజీవులు. జాతీయాదర్శములు గలవారు. కొంచెమెచ్చుతగ్గుగా సనాతనులేయని చెప్పవచ్చును భావములలో. వారి పరిచయము నాకు సుమారు పదినెలలే యయినను, వారికార్యదీక్ష ఉత్సాహము, పట్టుదల, బోధనా విషయమై నూతన పద్ధతు లన్వేషించుట, మన హిందూపాఠశాలలం దవి యెంతవర కాచరణీయములో గుర్తించుట మొదలగునవి వారి యుత్తమగుణముల

లోనివి. అధ్యాపకులు విషయసంగ్రహణమున నెక్కుడు శ్రద్ధవహింపవలెనన్న విషయము వీరిపట్ల చెల్లినదని చెప్పక తప్పదు.

సాధారణముగా మనదేశములో మాతృభాష సన్నగిల్లి పాశ్చాత్యవ్యామోహమువలన ఆంగ్లమునం దభిరుచి గలుగుట పలువురు పట్టభద్రుల కాచారము కాని మన శేషయ్యగారి పట్ల అది వమ్మైనది. వారి కాంగ్లమునఁ దభిరుచిగలిగియు, ఆంధ్రగీర్వాణములయం దధిక ప్రజ్ఞ-అభిమానములు గలవు. వారి కవిత్వము కొలఁదిగనో గొప్పగనో గోలకొండపత్రిక మొదలగువాని ద్వారా చవిజూచియే యున్నారు పలువురు.

ఇఁక ముఖ్యముగా నెన్నఁదగిన విషయమేమనఁగా, వారి యుత్సాహ-ఉద్బోధలవలననే పలువురు బాలికలు పద్యరచనమునకుఁ గడంగిరనియు, రానురాను చక్కఁగ వ్రాయ నేర్చిరనియు, ఒప్పుకొనవలెను,

శేషయ్యగారు కవులేగాక చిత్రకారులనికూడఁ జెప్పఁగలను. వారప్పుడప్పుడు "మాతృభారతి" యనుపేర వేయుచిత్రపటములు రంగవల్లులుంజూడ "కవిచిత్రకారుఁడే" యను మాట ప్రత్యక్షప్రమాణము. కాన వారు కవులు, చిత్రకారులు, అధ్యాపకులు, విద్యార్థులు. వేయేల? ఉత్తమ గుణముల సంపుటియే శేషయ్యగారనిన నతిశయోక్తి కాఁజాలదేమో!

పై విషయములఁబట్టి శేషయ్యగారెట నున్నను, వారి ప్రతిభకు లోటుండెడిదికాదనియు, నీ మాతృభారతి మూలమున కాకపోయినను తదితర పత్రికలమూలముననైనను వారిప్రజ్ఞ వెల్లడియయ్యెడిదే యనియు, అయినను వెనుకనెవ్వరో "తిరుపతిమూలమున వేంకటేశ్వర్లకు ఘనతవచ్చెనా? లేక వేంకటేశ్వర్లు మూలమున తిరుపతికి ప్రతిభకల్గెనా?" యన్నట్లున్నది మాతృభారతి-శేషయ్యగారి సంబంధము. మొదటివిషయమువలన రెంటికి నవినాభావసంబంధమున్నట్లే రెండవ విషయమున గూడ ఉన్నదని చెప్పవలెను.



# వీడ్కోలువు.

శ్రీయుత. బిదుర వేంకటశేషయ్యగారు, బి. ఎ.

సీ॥ కలముఁ బట్టఁగలేని ♦ కడుఁ జిన్నతనమునఁ, గథలఁ జక్కఁగఁ జెప్పఁ ♦ గల్గినారు
కన్నెపాఠంకము వీడ ♦ కయె కవిత్వమునేర్చి, కమనీయతరకీర్తిఁ ♦ గాంచినారు
విషమభావములేక ♦ విషయభేదముతోడి, వ్యాసరాజములను ♦ వ్రాసినారు
భావగర్భిత చిత్ర ♦ పటములఁ లిఖియించి, ప్రతిభానుభూతిఁ గ ♦ న్పఱచినారు

గీ॥ బాలికలు, చాల నీ పరి ♦ పాలనమున; సుప్రభుండవు; కడుఁ గృత ♦ జ్ఞులము నీకుఁ,
బోఁక తప్పనిసరియే, న్వ ♦ తాకుపడక, పోయిరమ్మ, భవాబ్దమా! ♦ పోయిరమ్మ!

# స్వా గ త ము.

సీ॥ ఒగరు లేమావిక్రొం ♦ జిగురాకు మేఁతరి, చెలఁగుచుఁ బాటక ♦ చ్చేరిసేయ
అఱవిచ్చుఁ బూ మొగ్గ ♦ చిఱుతనవ్వులఁ దేలి, సభ్యులై వృక్షరా ♦ జములునిలువ
రమణీయ పద్మప ♦ త్రములతో మెల్లఁగా, మలయానిలుండు చా ♦ మరము వేయ
భవ్యవాసంత సా ♦ భాగ్యభోగ్యతనొప్పి, ప్రకృతిలక్ష్మి సపర్య ♦ లం బొనర్ప
గీ॥ మధ్యభారత దేశ సిం ♦ హాసనమున, నిండుఁగొలువుండి, మమ్ముల ♦ నేర్పమీఱఁ
బాలనము సేయవచ్చిన ♦ భద్రమతివి, స్వాగతము! నీకు, యువరాజ! స్వాగతంబు॥

# ప్ర శం స.

మ॥ నవమాసంబులు దాటిపోయినవి జ ♦ న్మంబొంది నీ; వంతలో
నె వికాసోజ్జ్వలమూర్తి సౌభగము వ ♦ న్నెల్ దేఱ, లోలస్మితో
త్సవలీలామధురోక్తులం దనుపు చాం ♦ ధ్రిశ్రేణికిన్ మాన్య వై
తివి హో! నీ సుకృతంబు నేమనఁగ నౌ? ♦ దీవ్యన్మతీ! భారతీ!

# కృ త జ్ఞ త.

గీ॥ మాతృభారతీ పదపద్మ ♦ మధుకరులగు, బాలికల యాంధ్రిహృదయంబు ♦ ప్రతిఫలించు
మాతృభారతిఁ బ్రకటింప ♦ మాకుఁ దోడు, పడిన మహనీయులకుఁ గృత ♦ జ్ఞులము మిగుల॥



# శ్రీ రామ చరిత్రమ్.

శ్రీమతీ. జె. రాధాబాయి, (మెట్రిక.)

పురా అయోధ్యానగర్యాం దశరథో రాజా ఽవసత్. తస్య అభిరామగుణాకరా శ్చత్వారః పుత్రాః ప్రాదుర్బభూవుః. తే దినేదినే సర్వజనానాం సంతోషం జనయంతః వ్యవర్ధంత. దశరథస్తు తా నుపనయనానంతరం ఉపాధ్యాయైః యథాకాలంఅధీతనిఖిలవిద్యానకారయత్.

అథ కదాచి ద్విశ్వామిత్రః దశరథ ముపగమ్య యజ్ఞపరిత్రాణాయ రామలక్ష్మణా వయాచత. సోఽపి మునిసంత్రాసాత్ సుతౌ ప్రాహిణోత్. మార్గమధ్యే రామః తాటకాం నామరాక్షసీం సూదయామాస. అథ తే విశ్వామిత్రస్యాఽఽశ్రమం ప్రావిశన్. తదా సలక్ష్మణో రామః సుబాహుమారీచౌ మునియజ్ఞవిఘ్నం కుర్వంతౌ లీలయైవ వ్యాపాదయామాస.

విశ్వామిత్రస్తు జనకసందర్శనార్థం తాభ్యాం బాలకాభ్యాం సహాఽగచ్ఛత్, తత్ర జనకః సావేగగమనేనాఽఽగత్య, అతిథిపూజాం కృత్వా, కౌశికస్యాఽగమనకారణం బుద్ధ్వాచ, శ్రీరామం శివశరాసన మదర్శయత్. సోఽపి క్షణమాత్రేణైవ తద్బభంజ.

తదా జనకః సంతుష్టస్సన్ దశరథం దూతైః ఆహ్వాపయత్. ఉత్తమే ముహూర్తే స ధరణీసుతాం రామాయ దత్త్వా వివాహ మకరోత్; లక్ష్మణా యోర్మిళాంచ దదౌ.

అనంతరం తే సర్వే అయోధ్యానగరీం ప్రత్యగచ్ఛన్, యత్ర సుఖేన కాల మనయం శ్చ.

పురా దశరథః కైకేయ్యైద్వౌ వరౌ దాతు మంగీచకార. ఇదానీం శ్రీరామ పట్టాభిషేకావసరే మంధరాదుర్బోధితః కైకేయీ స్వాంతికముపాగతం రాజానం పూర్వోక్తౌ తావయాచత- ప్రథమే నహి రామస్య వనవాసః ద్వితీయేన చ నిజసుతస్య భరత స్యాఽభిషేచన మితి, తతః దశరథః "కథం బత! శ్రీరామం ప్రియతమం త్యక్త్వా క్షణమపి జీవేయ" మి త్యత్యంతం వ్యథితాత్మాఽభవత్. శ్రీరామస్తు సమాచార మిమం విదిత్వా, పరిహృష్ట హృదయః నిజజనకసమీప ముపాగత్య, సభక్తికం ప్రణమ్యోత్థాయచ, "భవద్వాక్యపరిపాలనార్థ మహం దండకారణ్యంప్రతి ముదాగచ్ఛామి. తస్మా ద్దేహి మేఽనుజ్ఞా" మితిప్రార్థయామాస.

మూర్ఛితోఽపి దశరథః ఉత్థాయ బాష్పపూర్ణలోచనః శ్రీరామ మాలింగ్యచ, స్వనిశ్చయాత్తం నివర్తయితు మాత్మాన మసమర్థం పశ్యన్, కథమపి "సమీచీన" మిత్యుక్తవాన్. తదా శ్రీరామః సీతాలక్ష్మణాభ్యాం సహ దండకాటవీం ప్రత్యభ్యగచ్ఛత్. అత్ర రాజా పుత్రశోకాతురః అచిరేణైవ పరలోకం ప్రాప్తః.

భరతః ఏతద్వృత్తాంత మాజ్ఞాయ మాతులస్య గృహా త్సశత్రుఘ్నః ఆగత్య, సపరివారః-జటావల్కలధారీ-వనవాసిన. సీతాలక్ష్మణ సహితం శ్రీరామ ముపగమ్య, తదాజ్ఞ్మైన తస్య పాదుకే గృహీత్వా చ పునర ప్యయోధ్యా మాగతః, యత్ర స భ్రాతృపునరాగమనకాంక్షయా కాలమనయత్.

తత్ర సీతారామలక్ష్మణాశ్చ పర్ణశాలాయామేకస్యా మవసన్. కదాచి చ్ఛూర్పణఖా రావణసోదరీ కథమపి శ్రీరామం దృష్టవతీ తస్మిన్ మోహార్తాఽభూత్. లక్ష్మణః భ్రాత్రాజ్ఞయా తస్యాః నాసికాం కర్ణేచ ఖరాసి చిచ్ఛేద. ఏవ మభిభూతయా శూర్పణఖయా ప్రచోదితః రావణః మారీచం హరిణరూపిణం పర్ణశాలాం ప్రతి ప్రేషయామాస. సీతా పరిసరవర్తినం హరిణ మవలోక్య తస్మిన్ స్నిగ్ధహృదయాసతీ, తదాహరణాయ భర్తారం యయాచే. రక్షసాంపతిః రావణః, రామలక్ష్మణ శూన్యాయాం పర్ణశాలాయాం, తదా భిక్షుకవేషేణాఽఽగత్య సీతా మపజహార. రామలక్ష్మణావపి హరిణాకృతిం మారీచం హత్వా స్వకుటీరం ప్రత్యభిజగ్మతుః. దృష్ట్వాతౌ సీతా విరహితా మత ఏవ కళావిహీనాం పర్ణశాలాం, భయభ్రాంతౌ బహువిధం రురుదతుః, పశ్చాత్తా మన్వేషితుం ప్రస్థితౌచ.

ఇత్థం శ్రీరామలక్ష్మణౌ సీతా మన్వేషయంతౌ మార్గమధ్యే జటాయుష మపశ్యతాం. క్షతగాత్రోఽపి స రామంప్రతి, రావణ ఏవ రాక్షసాధిపః భవదీయ జాయా-మపహరతిస్మేత్యవోచత్, తత్క్షణం స్వాన్ ప్రాణానత్యజచ్చ. తావపి భ్రాతరౌ సీతావృత్తాంత మేవ మాజ్ఞాయ, పశ్చాత్సుగ్రీవ ముపాగమ్య ఋశ్యమూకే పర్వతే, తేనసహ బద్ధ సఖ్యావభవతాం.

తదా సుగ్రీవః స్వవానరసైన్యం సీతాన్వేషణార్థం ప్రేషయామాస. అపిచ, హనుమానేవ లంకాయాం రావణగృహే తా మపశ్యజ్జానకీం సముద్రోల్లంఘనానంతరం.

శ్రీరామ స్తదా విజ్ఞాత సీతావృత్తాంతః ససుగ్రీవః సపరివారః సముద్రబంధనం కృత్వా లంకాపురీం ప్రతస్థే. తత్రాఽచిరాదేవ రావణం సపరివారం హత్వా, లక్ష్మణాగ్రజః సీతాం స్వగృహమనయత్. ఏతదేవ పవిత్రం శ్రీరామచరిత్రమ్.



౧౨౦ పుటలవరకు గోలకొండముద్రాక్షరశాలయందును, మిగిలిన సంచిక యంతయు, జి. సరసయ్య అండ్ సన్సువారి "క్షేమసాగర ముద్రాక్షరశాల" యందు ముద్రింపఁబడి, హైద్రాబాదు బాలికల ఉన్నతపాఠశాలా సహోపాధ్యాయులగు శ్రీయుత బిదురు వేంకటశేషయ్య, బి. ఏ. గారిచేఁ బ్రకటింపఁబడియె.

# మాతృభారతి

బాలికల ఉన్నత పాఠశాల యందలి

విద్యార్థినీ సంఘపక్షమున

౧౯౩౫-౩౬ లో వెలువడిన

సచిత్ర-లిఖిత-మాస పత్రికలలోని వ్యాసముల

## ద్వితీయ సంపుటము.



ప్రేమసాగర ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

గౌలిగూడ, హైద్రాబాదు-దక్కన్.

# మాతృభారతీ సంపాదక వర్గము.



శ్రీ బిదురు వేంకటశేషయ్య, బి. ఎ.
(ముఖ్య సంపాదకుఁడు)
,, సి. హెచ్. రంగాచార్యులుగారు.
(వ్యాకరణ శిరోమణి)
,, కె. రామమూర్తిగారు.

శ్రీమతి. వి. సుందరమ్మగారు.
(సంపాదకురాలు)
,, కె. లక్ష్మీబాయమ్మ.
,, కె. వేంకటరమణమ్మ.



# మాతృభారతీ లేఖకురాండ్రు.

| సంఖ్య | పేరు. | సంఖ్య | పేరు. |
|---|---|---|---|
| 1. | శ్రీమతి. వ. ఇందిర. | 16. | శ్రీమతి. ఆర్. లలిత. |
| 2. | ,, ఎ. ఆర్. లలిత. | 17. | ,, పి. స్నేహలత. |
| 3. | ,, నే. భారతీరత్నాకరాంబ. | 18. | ,, పుష్పవల్లి తాయారమ్మ. |
| 4. | ,, పి. సావిత్రీదేవి. | 19. | ,, కె. అనసూయ. |
| 5. | ,, వై. కౌసల్యాదేవి. | 20. | ,, టి. రాజామణి. |
| 6. | ,, జి. సీతారత్నము. | 21. | ,, కంటె. వేంకటరమణమ్మ. |
| 7. | ,, ఋ. దమయంతి. | 22. | ,, టి. ప్రేమలతాదేవి. |
| 8. | ,, కె. లక్ష్మీబాయి. | 23. | ,, ఇ. శ్యామలాదేవి. |
| 9. | ,, లక్ష్మీదేవి. | 24. | ,, యశోదాదేవి. |
| 10. | ,, ఆండాళమ్మ | 25. | ,, కె. విమల. |
| 11. | ,, కె. సుశీల. | 26. | ,, జయలక్ష్మి. |
| 12. | ,, వై. అమృతమ్మ. | 27. | ,, ఆర్. శకుంతల. |
| 13. | ,, పి. కమల. | 28. | ,, శారద. |
| 14. | ,, మరీస్. | 29. | ,, పి. సుగుణ. |
| 15. | ,, పద్మాబాయి. | | |




శ్రీరాజా బహద్దరు వేంకట రామా రెడ్డిగారు

ఒ. బి. ఇ.

( బాలికల ఉన్నత పాఠశాల కమిటీ అధ్యక్షులు. )



శ్రీయుత బిదురు వేంకట శేషయ్యగారు. బి, ఏ,
(మాతృభారతీ-ముఖ్యసంపాదకులు) ఆంధ్రజా
తీయపద రత్నాకర-మాతృభారతీ
వ్యాకరణాది గ్రంథకర్తలు, (బా, ఉ, పా,
ప్రథమ సహాయోపాధ్యాయులు)



శ్రీమతి వి. సుందరమ్మగారు
మాతృభారతీ సంపాదకురాలు, (వీణయందు
ఆనర్సు డిగ్రీని పొందినవారు)

# తొలిపలుకు.

"మాతృభారతి" లిఖిత మాస పత్రికలలోని కొన్ని వ్యాసములను, పద్యములను, కథలను ఏరికూర్చి సంవత్సరమున కొక సంపుటమైన యచ్చొత్తించి ప్రకటింపవలయునని సంకల్పించి గతసంవత్సర మొక సంపుటము ప్రకటింపబడెను. ఆ సంపుటమున కొసంగబడిన ప్రోత్సాహము మఱల మా బాలికలచే ఈరెండవ సంపుటమును ప్రకటించినది. ఇందులో ప్రకటింపబడిన గద్యపద్యాత్మకములగు వివిధ విషయములను (కొన్నిటినితప్ప) విద్యార్థినుల లేఖినుల వలన వెలువడినవని గమనించినచో సహృదయులగు పాఠకమహాశయులు తప్పక ప్రశంసాపాత్రములుగ భావించెదరని నమ్ముచున్నాను. మా కవయిత్రులు కూడ ఆశాజనకమును అభివృద్ధి సూచకమునగు ధారాశుద్ధిని చూపెట్టుచున్నారనుటకు ఈ సంపుటములోని పద్యములే తార్కాణము.

ఈ పాఠశాలయొక్క విద్యార్థినులు ఉపాధ్యాయ వర్గముయొక్క సహాయముతో ఈ లిఖిత మాసపత్రిక వెలయించి అందు తమ సారస్వతప్రయత్నముల ప్రకటింప దొడంగి రెండు సంవత్సరములైనది. ధనాభావమే 'మాతృభారతి'ని లిఖిత మాసపత్రికగా వెలువరించుటకు కారణముగాని, లేనిచో మా బాలికలు తమ యోగ్యతానుసారము వ్యాసములను, కథలను, పద్యములను వ్రాయుటకు వెనుదీయరని ఈరెండు సంవత్సరముల కొద్దికాలపు అనుభవమే దెలుపుచున్నది. విద్యార్థినుల యొక్క సారస్వతాభిరుచిని పెంపొందించి వారి ప్రయత్నములను ప్రోత్సహించుటయందు బ్ర॥ శ్రీ॥ బిదురు వేంకటశేషయ్యగారును, సంపాదకీయవర్గమును గావించుచున్న కృషి ముఖ్యముగా ప్రశంసింప దగియున్నది.

బాలికల ఉన్నత పాఠశాల నొక ఆదర్శప్రాయమగు సంస్థగా నొనరింపవలయునను అభిలాష కమిటీవారికి గలదు. అందుకువలయు సాధన సంపత్తి క్రమముగా సమకూరుచున్నది. కమిటీ అధ్యక్షులగు శ్రీయుత. రాజాబహదుర్ వేంకటరామారెడ్డి, ఓ. బి. ఇ. గారి ఆశీర్వాద బలమున మున్ముందు పాఠశాలాభివృద్ధికి సంపూర్ణములగు నవకాశములు లభించునని యాశించుచు 'మాతృభారతి' యొక్కయు, మా బాలికల యొక్కయు ఇతోధిక దినదినాభివృద్ధికై పరమాత్మని ప్రార్థించుచున్నాను.

బాలికల ఉన్నత పాఠశాల,
సుల్తాను బజారు, హైద్రాబాదు-దక్కన్.
౨౯—౮—౧౯౩౬.

ఇట్లు,
బూర్గుల రామకృష్ణరావు,
కార్యదర్శి.

# వి షయ సూ చి క.




| వ్యాసముల పేర్లు. | | రచయితల నామములు. | పుటసంఖ్య. |
|---|---|---|---|
| 1. స్వవిషయము | ... | ... ... ... | |
| 2. ఆంధ్రబాలిక | ... | శ్రీయుత. బిదురు వేంకటశేషయ్య, బి. ఏ.... | ౧ |
| 3. అష్టావధానము | ... | శ్రీమతి. వ. ఇందిర ... | ౩ |
| 4. గృహిణి | ... | శ్రీయుత. క. రామమూర్తిగారు ... | ౮ |
| 5. స్వార్థత్యాగము | ... | శ్రీమతి. నే. భారతీరత్నాకరాంబ ... | ౧౧ |
| 6. సత్యాద్రౌపదీ సంవాదము | ... | ,, లక్ష్మీదేవమ్మ ... | ౧౮ |
| 7. ధనుర్వేదము | ... | ,, ఇ. శ్యామలాదేవి ... | ౨౧ |
| 8. మడి | ... | ,, జి. సీతారత్నము ... | ౨౩ |
| 9. మాతృభారతి | ... | శ్రీయుత. శేషాద్రిరమణకవులు ... | ౨౫ |
| 10. దశరథుని శాపము | ... | శ్రీమతి. కం. వేంకటరమణమ్మ ... | ౨౭ |
| 11. శచి | ... | ,, వ. ఇందిర ... | ౩౧ |
| 12. ప్రభాతము | ... | ,, పి. సావిత్రీదేవి ... | ౩౮ |
| 13. ఆదర్శగృహిణి | ... | ,, టి. ప్రేమలత ... | ౩౯ |
| 14. కవి—కావ్యము | ... | శ్రీయుత. సి. హెచ్. రంగాచార్యులుగారు | ౪౨ |
| 15. కోవెల | ... | శ్రీమతి. నే. భారతీరత్నాకరాంబ ... | ౪౪ |
| 16. శ్రీరామజయంతి | ... | శ్రీయుత. పింగిలి కోదండరామరెడ్డిగారు ... | ౪౫ |
| 17. నాస్వప్నములో | ... | శ్రీమతి. పి. కమల ... | ౪౬ |
| 18. కిరాతార్జునీయము | ... | ,, నే. భారతీరత్నాకరాంబ ... | ౪౭ |
| 19. స్వాగతపత్రము | ... | ,, ,, ... | ౫౧ |
| 20. హెచ్చరిక | ... | ,, కం. వేంకటరమణమ్మ ... | ౫౨ |
| 21. బాలికల ఉన్నత పాఠశాల | ... | శ్రీయుత. సి. హెచ్. రంగాచార్యులుగారు... | ౫౪ |
| 22. సందేశము | ... | ,, ఆదిరాజు వీరభద్రరావుగారు ... | ౫౫ |
| 23. దైవకృప | ... | శ్రీమతి. వై. అమృతమ్మ ... | ౫౬ |
| 24. చిన్ననాఁటి చెలిమి | ... | ,, వై. కౌసల్యాదేవి ... | ౫౭ |
| 25. భారతీయ వధువు | ... | ,, క. లక్ష్మీబాయి ... | ౫౮ |
| 26. వేడుకోలు | ... | ,, పి. సావిత్రి ... | ౬౪ |
| 27. వీడ్కోలుపు | ... | శ్రీయుత. బిదురు వేంకట శేషయ్య, బి. ఏ.... | ౬౫ |
| 28. ఆశీర్వాదః | ... | ,, సి. హెచ్. రంగాచార్యులుగారు ... | ౬౯ |
| 29. పండితాభిప్రాయములు | ... | ... | ౭౦ |
| 30. సన్మాన పత్రము | ... | ప్రాచ్యవిద్యార్థినీ సంఘము ... | ౭౪ |
| 31. జటప్రోలు సంస్థానాధీశ్వరి | ... | శ్రీయుత. బిదురు వేంకట శేషయ్య బి.ఏ. ... | ౭౬ |
| 32. దోమకొండ సంస్థానాధీశులు | ... | శ్రీమతి. వ. ఇందిర | ౭౭ |
| 33. కలగూరగంప—తమాషాలు | ... | ... ... ... | ౭౫ |
| వార్తలు | ... | ... ... ... | ౭౮ |
| మాతృభారతి పోషకవర్గము | ... | ... ... ... | ౮౧ |

# పరిబోధము.

(శ్రీమతి. నే. భారతీరత్నాకరాంబ)



సీ॥ రుద్రమదేవి స ♦ శౌదరిమై శత్రులఁ
దెమలించి శౌర్యంబుఁ ♦ దెల్పిపోదె;
భారతీదేవి తాఁ ♦ బతి నని కంపి, స్వ
దేశాభిమానంబుఁ ♦ దెలియఁ బఱచె;
మొల్ల రామాయణ ♦ ముఖ్యగ్రంథము వ్రాసి
స్త్రీజ్ఞానశక్తినిఁ ♦ దేటపఱచె;
నాగమ్మ పల్నాఁటి ♦ నాయకుల జయించి
యింతి సామర్థ్యంబు ♦ నెఱుక పఱచె;

గీ॥ ఇన్ని సామర్థ్యములు మన ♦ కన్ని దెసలఁ
గానుపించుచు నుండంగ ♦ వాని మఱచి
పడఁతు లింకను నిటులుండఁ ♦ బాడి యగునె?
లెండు! కర్తవ్యములఁ దీర్ప ♦ లెండు, మీరు!!






"మాతృభారతి" రెండేండ్లు గడిపి మూఁడవ సంవత్సరమునఁ బ్రవేశించినది. కడచిన సంవత్సరపు సంచికలన్నియుఁ గలిపి, ద్వితీయ సంపుటముగాఁ బ్రచురించుచున్నాము. వ్యయభారమగునన్న భీతిచే వీనిలోనికొన్ని రచనలను వదలివేయ వలసివచ్చినందుకుఁ జింతిల్లుచున్నాము.

పత్రికాపాలనమున కేర్పడిన సంపాదకీయవర్గమువారు తమ కర్తవ్యమును జయప్రదముగా సాగించిరి. కడచిన సంవత్సరమున వెలువడిన సంచికలలో నొకటి సెప్టెంబరు నెలది స్థానిక పత్రికా కార్యాలయమునకు విమర్శనార్థము పంపఁబడియుండెను. పొరపాటువశమునఁ దిరిగిరాలేదు. కడమ వానినిఁబట్టి మాతృభారతీ లేఖకురాండ్ర సంఖ్య ౨౯. ఇంతవరకుఁ గవిత్వమభ్యసించుచున్నవారి సంఖ్య ౧౬.

ఈ పత్రిక వెలువడినది మొదలు బాలికలలో లేఖనాసక్తి చిగిర్చినది. కవితాలతకు దోహదము జరిగినది. బాలికలు గ్రంథరచనకుఁ గడంగుచున్నారు. కళారాధనము విద్యార్థినీదశకు వన్నెదేఁగలిగినది. అందువల్లనే వారు నాట్య, గానకళలయందుఁ జక్కనియభిరుచినిఁ గన్పఱచుచున్నారు వానినిఁ బురస్కరించుకొని కడచిన సంవత్సరము వారిచేఁ బ్రదర్శింపఁబడిన నాటకములు, ప్రేక్షకమహాశయుల మెప్పును బడసినవి. శ్రీరాజాబహద్దరు వేంకటరామారెడ్డిగారు నాట్యకళాభివృద్ధి యెడఁగనబరచిన ప్రత్యేకమైన ప్రోత్సాహము పేర్కొనఁదగియున్నది. చిత్రకళా సందర్భమున బాలికలుచేయు కృషి ప్రశంసనీయమైనది. మాతృభారతీ సంచికలకుఁ బటములను, ముగ్గుఁదీగెలను వ్రాసి యిచ్చుచున్నారు. వానినీ ద్వితీయ సంపుటమునఁ బొందుపఱుపఁజాలకపోయితిమి. శ్రీమతి బి. మణి యను బాలిక (రెండవ ఫారము) శ్రీరాజాబహద్దరువారి చిత్రమును పెన్సిలుతోఁ గీసి శ్రీవారి జన్మదినోత్సవ సందర్భమున సమర్పించి శ్రీవారి యామోదమును బడసినది. శ్రీయుత పింగిలి కోదండరామారెడ్డిగారి యాజమాన్యమున జరిగిన శ్రీరామజయంతీ సందర్భమునఁ గొందఱు బాలికలాశువుగఁ బద్యములనుఁ జెప్పి సభ్యులమెప్పునుఁ బడయఁగల్గిరి.

ఒక జీవిత చరిత్రఁగాక యింతవరకు శ్రీరాజాబహద్దరు వేంకటరామారెడ్డిగారి ద్రవ్య సహాయముతో మూఁడు రచనలు బాలికలవి వెలువడినవి. ఇంకఁ గొన్ని ముద్రితములుఁ గావలసియున్నవి. వీనిని ముద్రింపించుటకు శ్రీయుత. పింగిలి కోదండరామారెడ్డిగారు పూనియున్నారు.

పాఠశాల బాలికలయందు వివిధమగు సేవాసక్తి, భారత నారీమణుల సహజమైన ముఖ్య లక్షణమగు స్వధర్మాభిమానము వ్యక్తమగుచున్నది.

మా పత్రిక విషయమునఁ జాలమంది పెద్దలు-విద్యాధికులు సహృదయతఁ గనఁబఱచి యున్నారు. దురదృష్టవశమున ఆచార్య. సరిపల్లి విశ్వనాథశాస్త్రిగారి అమూల్యరచన యొకటి సెప్టెంబరు నెల సంచికలో నుండెను. అద్దానినిఁ బ్రచురింప వీలుగలుగలేదు. ఇతర విద్యాధికులు కొందరు విలువగల తమ వ్యాసములనిచ్చి ప్రోత్సహించియున్నారు. శ్రీమాన్ దూపాటి వేంకట రమణాచార్యులుగారు పాఠశాలకు దయచేసినప్పుడు ప్రతి సంచికయందలి శ్రేష్ఠమైన రచనకుఁ బుస్తకరూపముగను, అన్ని సంచికలమీద శ్రేష్ఠతమమైనదానికి రూ. ౫ లను బహుమానముగ నిత్తుమని వాగ్దానముచేసిరి. ఇట్లు ప్రోత్సహించిన వారికందఱకు మేము కృతజ్ఞతను సూచింప వలసియున్నది.

ప్రథమ సంపుటముద్రణమునకుఁ బెక్కండ్రు స్త్రీవిద్యాభిమానులు ధన సహాయము చేసి యున్నారు. పాఠశాల బాలికలుఁగూడ స్వయంసహాయ సూత్రమునాచరణయందుంచి ద్రవ్య రూపముననేగాక యితర విధములగూడఁ దోడ్పడియున్నారు. నగరములోను, జిల్లాలయందును దీనిని వ్యాపింపఁజేయుటయందు పలువురు సోదర సోదరీమణులు కృషిసలిపిరి, గ్రంథవిస్తరభీతి చేత వివరముగనందరి పేళ్లను బేర్కొనఁజాలనందుకు క్షంతవ్యులము.

ద్వితీయ సంపుటముయొక్క ముద్రణమునకు శ్రీ శ్రీ శ్రీ జటప్రోలు సంస్థానాధీశ్వరి సహజౌదార్యముతో పోషకభృతిని దయచేసి ప్రోత్సహించిరి. నిరుటివలెనే బాలికలుగూడ ముద్రణ యత్నమునకుఁ బూనుకొని పోషకవర్గమున జేరి తమ సహజోత్సాహమును వెలిబుచ్చియున్నారు.

మాతృభారతిని విమర్శించి ప్రోత్సహించిన గోలకొండ పత్రిక, హైదరాబాదు బుల్లెటిన్ గృహలక్ష్మి సంపాదకులకును, ద్వితీయ ముద్రణమును సకాలమునకు శ్రద్ధతో నచ్చొత్తియిచ్చిన ప్రేమసాగరు ప్రెసువారికిని, బాలికల రచనలగు పుస్తకములను ముద్రించిన గోలకొండ ముద్రాలయమువారికిని, మా పత్రికపైఁ దమ యభిప్రాయములనిచ్చి మన్నించిన పండిత శ్రేష్ఠులకును, ఇతర విధములఁ దోడ్పడిన శ్రీ శ్రేయోభిలాషులకందఱకు మేము నిరంతరము కృతజ్ఞులము.

ఈ విధముగనే ద్వితీయ సంపుటముగూడఁ బ్రజాదరణకుఁ బాత్రమగునని యాశించు చున్నాము.

“మాతృ భారతి” చిరకాలము వర్ధిల్లును గాక!






శ్రీయుత. బిదురు వేంకటశేషయ్య బి. ఏ.

సీ॥ తన శౌర్యచండాత ♦ పము నెట్టఁకొనికాసి
సిశలం బగళ్లుగా ♦ నిల్పివేయఁ
దమ యమేయధనాఢ్య ♦ తాభావుకతకుం. ధ
నేశ్వరునికినిఁ గ ♦ న్నెఱ్ఱగాఁగఁ
దమ దానశౌండిమ ♦ క్రమవిక్రమస్ఫూర్తి
శిబిచక్రవర్తికి ♦ సిగ్గుగొలుపఁ
దమ కీర్తిహంసిక ♦ త్రైలోక్యమును దాటి
నలువవాహనముతోఁ ♦ జెలిమిఁగోర

గీ॥ నన్నిఁటను నగ్రగణ్యులా ♦ నాంధ్రరాజు
లేలుబడిసేయఁగా వాసి ♦ కెక్కినట్టి
"ఆంధ్రదేశమె నాదేశ ♦ మై" రహించు
"ఆంధ్రబాలిక నేను" వె ♦ య్యార్లకేని ॥

సీ॥ గాంగతరంగమం ♦ గళవాహినిం బోలు
నన్నపార్యుని సుప్ర ♦ సన్నధార
పౌరుషాంతర్బహిః ♦ ప్రకృతి చిత్రణచణుం
డగు తిక్కయజ్వక ♦ ళాభిసంధి

కర్కశహృద్రివీ ♦ కరణపరివీణతా
రససిద్ధుఁడగు పోత ♦ రాజు ఫణితి
ఆలోలడోలికా ♦ లీలావిలాసముల్
పచరించు శ్రీనాథు ♦ భవ్యభంగి

గీ॥ మొనయు 'నల్లికజిగిబిగి' ♦ 'ముద్దుపలుకు'
సాధు 'పదగుంభనంబు' ను ♦ జాలువాఱు
"ఆంధ్రభాషమె నాభాష ♦ యై" రహించు
"ఆంధ్రబాలికనేను" వె ♦ య్యార్లకేని ॥

సీ॥ చక్కఁగా ముంగురుల్ ♦ సవరించుకొని దువ్వి
సరిపాపటకుఁ గల ♦ కురులఁ దార్చి
కనులఁగాటుక నీటు ♦ గా దిద్ది, భ్రూమధ్యఁ
బొలుపారఁ గుంకుమ ♦ బొట్టువెట్టి
వలసిన భూషణా ♦ వళిఁదాల్చి, కాలు – ము
క్కుల బోసితనమును ♦ గొఱంతపఱచి
తెలి దువ్వలువఁ గట్టి ♦ పలకలమెడ–బూబు
రవికల కెల్ల "రాం ♦ రాము" పలికి

గీ॥ ఒంటికిని నింటికిని హాయి ♦ యొసఁగు నట్టి
ఆంధ్రసుందరులకు సర్వ ♦ మైన–యిట్టి
"ఆంధ్రవేషమె నావేష ♦ మై" రహించు
"ఆంధ్రబాలికనేను" వె ♦ య్యార్లకేని ॥



# అష్టావధానము.

శ్రీమతి. వ. ఇందిర.

ఒకరు:- నారీమణులారా !

నేఁడు మన మండలి మీ మాతృభారతీ మందిరమున శ్రీమతి. శారదాదేవిగారి 'అష్టావధానము' విలోకింప సమావేశ మైతిమిగదా! శ్రీమతిగారిని గూర్చి మీకుఁ జిరపరిచిత లేగాన నేను ప్రత్యేకముగఁ జెప్ప నవసరము లేదు. కావున నేఁటి సమావేశమునకు సుప్రసిద్ధకవయిత్రియగు శ్రీమతి. భారతీదేవిగా రధ్యక్షపీఠము నలంకరింతురని ప్రార్థించు చున్నాను.

(కరతాళధ్వనులు సభనుండి)

ఇంకొకరు:- మా సోదరీమణి ప్రతిపాదనమును నేను బలపఱచు చున్నాను.

( చప్పటలు )

భారతీదేవిగారు:- సోదరీరత్నములారా! మీరు నన్నగ్రాసనాధిపతిగా నెన్నుకొన్నందుల కెంతయుఁ గృతజ్ఞురాలను. శ్రీమతి. శారదాదేవిగారు మీ యెదుట అష్టావధానమును జరిపెదరు. కాని యీ సందర్భమునఁ బృచ్ఛకురాండ్రొక్కమనవి. శ్రీమతిగా రన్నివిషయములను నన్నివృత్తములలోఁ జెప్పఁగల సామర్థ్యము గలవారైనను, సామాన్యముగా అష్టావధాను లందఱు నట్లేచేయుచుండుటచే మన మొక క్రొత్త మార్గము తొక్కవలయునని బుద్ధిపుట్టి, తమ యవధానము నంతయు గీతపద్యములలోఁ జెప్పవలయునని వేడుచున్నాను. [illegible] అవధానులకీ మార్గము సులభముగాఁ దోఁచి యష్టావధానపద్ధతి మన యాంధ్రులలో నతివ్యాప్తి నందఁగలదని నా యాశయము. అమ్మా! దయచేయుఁడు.

శారదాదేవి:- (నిలిచి, కనులుమూసికొని)

కమలగర్భుని సతివగు ♦ విమలచరిత!
పెక్కురిల బక్కదైవాలఁ ♦ బేర్మిఁజేసి
కొల్చెదరుగాని, లాభమ్ము ♦ గూడదమ్మ!
నిక్కువంబిది ముమ్మాటు ♦ నీరజాక్షి !
నీ పదాంభోజములు నెద ♦ నేధరించి
నేఁటి యష్టావధానమ్ము ♦ నెఱపఁ జూతు;
నా కురంగట నిల్చి పి ♦ న్నాణ మెసఁగ
నను జయశ్రీమతిగను బొ ♦ నర్పుమమ్మ!
ప్రీతి మెయి నాకుఁ గవితాను ♦ భూతి యొసఁగి
సిద్ధవిద్యను, సుమతిగాఁ ♦ జేసినట్టి
కవికవితామహిమచేత ♦ గణ్యులయిన
బిదురు వేంకటశేషయ్య ♦ గురువరులకుఁ
బ్రణతు లొనరింతు నేనిదే ♦ పరమభక్తి ॥

( కన్నులను దెఱచి )

దుష్టసంహారమును సల్పి ♦ శిష్టరక్ష
ణముకొఱకు సర్వదా కంక ♦ ణముధరించి
కుంతికొమరులఁ గాచిన ♦ దంతివరద !
ప్రోవు [illegible] ♦ బూర్ణదయను॥

ఒకరు:- ( పుష్పమాలిక వేయును; చప్పటలు )

శారదా:—

రామ! భక్తరక్షణ! దశ ♦ రథకుమార !
విమలచారిత్ర! శ్యామాంగ! కమలనాభ!
మైథిలీహృదయాబ్జ బం ♦ భరమ! ఈమె
శ్రీమతిని(జేసి యెపుడు పా ♦ లింపుమయ్య!॥

భారతీ:- మఱి పృచ్ఛకురాండ్రు సిద్ధముగా నున్నారా?

(సభలోనుండి,) ఆ!

భారతీ:- ఇంక నుపక్రమింప వచ్చును.

"ఈసభ భారతీదేవిగారి యధ్యక్షత క్రింద జరుగుచున్నదను భావము వచ్చునట్లు చెప్పుడు."

శారదా:- వ్రాసికొనండి—

"అమ్మా! మీరెక్కడ నున్నారండీ?"

భారతీ:- ఓహో ! మీది యప్రస్తుత ప్రశంసయా ?

శారదా:- అమ్మా! మీ ముందఱ.

"అదిగాదు; ఎక్కడ దిగినారని.

శారదా:- మూసీనది కవతలి గట్టున- అమ్మా! వ్రాసికొనుచున్నారా?

మాతృభారతీసుందర ♦ మందిరమున
భారతీదేవి యధ్యక్ష ♦ పదవియందు

"నా యేనుగు నిక్కడఁబెట్టితిని."

శారదా:- మీరు చదరంగపువారా? ఇదిగో నామంత్రి వచ్చుచున్నాఁడు.

( గ ం ట మో ్రగు ను. )

"అమ్మా! ఏడవ యక్షరము, క్తా"

శారదా:- మీది వ్యస్తాక్షరియా? ఇటు తెండు. మంచిది.

"అమ్మా! ఇది యొక సమస్య."

శారదా:- ఏది? చెప్పుఁడు.

"పిల్లి కుక్కను గోపాన ♦ వెడలఁదఱిమె"

"ఇదేమండీ! ఈ నవీన కాలములో పిల్లులే కుక్కలను దఱుమును గాఁబోలు!"

శారదా:- కాలమొకరీతిగా నుండదు గదా!

"అమ్మా ౬ అక్షరము, భ."

"సరేగాని శివుఁడును, శ్రీహరియు మంచుఁగొండకుఁ బాలసముద్రమునకుఁబోయి యుచటనుండుటకుఁ గారణమే మందురు?"

శార:- ఏమున్నది! అత్తవారిండ్లు మఱిగి.

"ఇదిగోనండీ! ౧౩ వది, స."

శార:- మఱి నిషేధాక్షరి వారెవరు ?

"నేను. నేను. చీపురుకట్టమీఁదఁ జెప్పుఁడొక పద్యము! పదము తరువాతి యక్షరమును నిషేధించుచుండును.

శార:- ఇది యొక క్రొత్తపద్ధతి చేసినారే! సరే! మీ యిష్టము. వ్రాయుఁడు. "ఇండ్లను."

( గంట మ్రోగును )

"3 వది, స."

"'వి' వలదండి!"

శార:- "బజారులను" ఏరీ? పిల్లివారు!-

"ఏమండోయి! ఈపేరే వారికి స్థిరమగునేమో!"

శార:- మఱి నాకు మీమీ పేర్లు తెలియవుగా?

( గంట మ్రోగును )

"౫ వది, త."

శార:—

వంటయింటిలో నుండిన ♦ వంటకములఁ
గుక్కయొక్కటి వానిని ♦ గూర్మిమెఱసి॥

"చూడండీ కొందఱు పాతివ్రత్యమక్కఱలేదు స్త్రీల కందు రే? మీ—"

శార:- గృహిణులు కానివారేమో!

"దీపావళిపై నొక పద్యము."

"అమ్మా! భావకవిత్వమును గూర్చి మీ యభిప్రాయమేమి?"

శార:- అదొకరకపుఁ గవిత్వము.

( గంట మ్రోగును )

వ్రాసికొనుఁడు.

"౧౦ వది, క్తా."

ఆర్యభారతదేశమం ♦ దధికకీర్తి
సంతరించిన యభిరామ ♦ సత్యభామ॥

"సరేగాని, కవిత్వధారకుఁ గళాయి గిన్నెలోసి మజ్జిగధారకు భేదమేమిటండీ?"

శార:- ఏమియు లేదు, కాని మజ్జిగధార కలవానికిఁ గవితాధారతోఁ బని లేదు.

"చ, వలదు."

శారదా:- "గూడ నింపుగాను" వ్రాసికొనుఁడు.

"పోతన యాంధ్రిభాషకుఁ జేసిన యపకారమేమో యొక పద్యమున స్పష్టముగాఁ జెప్పుఁడు."

శార:—

సుకవితావేశమున మాకుఁ ♦ జుట్టమయ్యె
భాగవతమును, గ్రాంథిక ♦ భాషలోన॥

( గంట మ్రోగును )

"౮ వది, యే."

"ఓ, వలదు."

శార:- "శుభ్రము సలుప" వ్రాయుడు.

"పె, వలదండీ!"

శార:— "సంతెట, శోభమిూటె." తరువాత?

"౧౬ వది, తే."

"వనము, ఘనము, తనము, మనము—" ఈ పదములు వేసి భారతకథాసందర్భము వచ్చునట్లు పద్యము కావలయును.

భారతీ:- మీరెవరు?

"నాది దత్తపది."

( గంట మ్రోగును )

"ఏమండీ పురాణము చదువుదునా?"

శార:- కానీయండీ!

"పురాణములో నొక యర్థము తెలియక నే యవస్థపడుచుండఁగా, రెండేసి, మూఁడేసి యర్థములు కల్పించి మనలను దుంపఁద్రెంపినారండీ, పూర్వకవులు!"

శార:- బహుశః అదేకారణమేమో భావకవిత్వానికి! చదువుఁడు.

"౭ వది, వం."

"ఇది భీమేశ్వర పురాణములోని యొక పట్టణ వర్ణనము."

"స, నిషేధము."

శార:- "దేశసేవను జక్కఁగా" సరిపడును లెండి!

"నిరంతర సంఫుల్లమల్లీ వల్లికా—"

శార:- ఆపట్టణము, ఎల్లప్పుడు వికసించిన—"

"నాగుఱ్ఱమిటు వచ్చినదండీ!"

శార:- సేనాధిపతి వెంటనున్నాఁడు లెండి!

"౧౧ వది, స్త్వం."

"మొన్నటి కవిసమ్మేళనమునకు మీరును వచ్చి పద్యములు చదివితిరిగదా! దానిలోని విశేషాలేమి?"

"స్త్రీలు బాల్కనినుండి 'లౌడర్ ప్లీజు' అని యనుట."

శార:- వ్రాసికొనుఁడు.

సర్వలక్షణసముపేత ♦ సాధుశీల
మైన కవితావధూటిని ♦ నలరుఁబూల॥

"మీరు హోటలులలో నేనా భోజనము?"

శార:- అవును.

"పప్పు మీవరంగలు వైపునకే పరు గెత్తుచుండునా?"

శార:- నాది అరవలహోటలు కాదండీ!

—ఏరీ? 'వనము' వారు?

"అమ్మా సిద్ధము."

శార:- వ్రాయుఁడు.

వనములకుఁ బోవలసివచ్చి ♦ పాండుసుతులు
ఘనము గాఁదమకీర్తి ముం ♦ దునకు నడవ॥

"౬ వది, యు."

"త. నిషేధము."

శార:- "చేతుమనుచు."

(గంట మోగును.)

అమ్మా! ఇదొక సమస్య—

"౧౨ వది, ప."

"గుడినిభ్రమింగెడి వానికదెంత ♦ గోపురంబు?"

"ఏమండీ, కవయిత్రిగారూ? ఈసమస్య యెట్లు పుట్టియుండ వచ్చునండీ?"

శార:- అట్టి వారున్నారు గనుకనే!

"౧ వది, ఏ."

"మా, వలదు."

శార:-"పొగడు చుండిరి." వ్రాయుఁడి.

సమస్యవారు—

"సమబలాఢ్యతనొప్పకీ ♦ చకసుయోధ
నులనడుమఁ, గీచకునిఁజంపు ♦ నలఘుబలుడు॥"

(గంట మోగును)

"౮ వది, త."

"అమ్మా! మనుష్యులూరుటకును, ఆవ కాయ యూరుటకును సంబంధమేమి?"

శార:- కొంచెమున్నది. ఆవ కాయ యూరినకొలఁదిని గఱకెక్కును; మనుష్యు లూరినకొలఁదిని వదవదలాడుదురు.

"హా, వలదు."

శార:- "వినుమదే, పాలఁతులెల్ల."

మీపద్యము పూర్తియైనట్లేనా?

"ఆహా!"

"౧౩ వది, ర్యు."

"అమ్మా! నా పురాణమండీ!"

శార:- ఔను. శ్రేష్ఠమగు మల్లెతీగల యందలి—

"తల్లజపుష్ప"

"అట్లుకాదండీ! మల్లీవల్లికాతల్లజ—"

శార:- తరువాత?

"౧౫ వది, స."

"పుష్ప నిష్యందమాన—"

శార:- పువ్వులనుండి కారుచున్న—

(గంట మోగును)

"౧౮ వది, పా."

శార:- మంచిది.

భారతీ:- అమ్మా! శారదాదేవిగారూ! ఇప్పటికే కాలాతీతమైనది. సభలోఁ జంటి పిల్లల యేడ్పులప్పుడే ప్రారంభమైనవి. భర్తలకు వంటచేయు వేళయగుచున్నదని కొందరు లేచుచున్నారు. ఇప్పటికి వ్యస్తాక్షరి నిషేధాక్షరి పూర్తి యైనవి గదా! తక్కిన పద్యపాదములను గల్పి చెప్పుచు నవధానమును బూర్తి చేయఁ బ్రార్థించుచున్నాను. సోదరీమణులారా! నావేఁడు కోలెట్లున్నది!

(మా యభిప్రాయమునే చక్కఁగాఁ దె ల్పితిరని సభలోఁ గేకలు.)

శార:- నాకెట్లయినను నభ్యంతరము లేదు. అమ్మలారా! చూచుకొనుఁడు.

మొదటివారిది—

మాతృభారతీ సుందర ♦ మందిరమున
భారతీదేవి యధ్యక్ష ♦ పదవియందు
శారదాదేవి యవధాన ♦ సరణి సల్పఁ
జూడఁగన్నుల పండువౌ ♦ చూపఱకును॥

ఇంక నిషేధాక్షరి—

ఇండ్లను బజారులనుగూడ ♦ నింపుగాను
శుభ్రముసలుప నంతట ♦ శోభమీఱి
దేశసేవను జక్కఁగాఁ ♦ జేతువనుచుఁ
బొగడుచుండిరి, వినుమదే ♦ పౌలతులెల్ల॥

మొదటి సమస్య—

పంటయింటిలోనుండిన ♦ వంటకములఁ
గుక్క యొక్కటి వానినిఁ ♦ గూర్మిమెఱసి
మెక్కుచుండగ, గృహిణితా ♦ మిక్కిలి గుర
'పిల్లి' కుక్కను గోపాన ♦ వెడలఁదఱిమె॥

దీపావళినిఁ గూర్చి— (చప్పటలు)

ఆర్యభారత దేశమం ♦ దధికకీర్తి
సంతరించిన యభిరామ ♦ సత్యభామ
తలఁపునన్నిల్చు దిన మది ♦ తరుణులకును
నామెవలె వీరపత్నులై ♦ యలరుఁ గోర్కె॥

పోతనచేసిన యుపకారము—

సుకవితావేశమున మాకుఁ ♦ జుట్టమయ్యె
భాగవతమును, గ్రాంథిక ♦ భాషలోన
వ్రాసియొనరించె గొప్పయు ♦ పకృతియంచు
నెదనుదలపోసె భావక ♦ వీంద్రుఁ డొకఁడు॥

కవిసమ్మేళనము—

సర్వలక్షణ సముపేత ♦ సాధుశీల
మైన కవితావధూటిని ♦ నలగుపూలఁ
బూజచేసిన మహితులు ♦ తేజమెసఁగ
నరుగుదెంచిరి, నిలయమం ♦ [illegible]॥

దత్తపది—

వనములకుఁ బోవలసివచ్చి ♦ పాండుసుతులు
ఘనముగాఁదమకీర్తి ముం ♦ దునకు నడవ
మనములం జింతగూఱఁగా ♦ మంచి దిట్ట
తనమునందాని బోఁద్రోఁచి ♦ చనిరిగాదె?

రెండవ సమస్య—

సమబలాఢ్యతనొప్పు కీ ♦ చకసుయోధ
నులనడుమఁ గీచకునిఁజంపు ♦ నలఘుబలుఁడు
భీమునికి సుయోధనుద్రుంచు ♦ టేమిలెక్క?
గుడిని మ్రింగువాని కదెంత ♦ గోపురంబు॥

వ్యస్తాక్షరి—"ఏవం సతత యుక్తాయే
భక్తా స్త్వాం పర్యుపాసతే॥"

"ఏమండోయి మా గంటలమాట?"

శార:- మీగంటలు తొమ్మిది.

ఇప్పటి కవధానము ముగిసినది.

నీకృపాలోకలోకముల్ ♦ నెగడుకతన
నావధానవిధానమ్ము ♦ లివిమీఱఁ
బూర్తికాఁగల్గె; నదియెకా ♦ పూవుఁబోణి!
వాణి! నిన్నుసేవించిన ♦ వఱలు ఫలము॥

( కరతాళధ్వనులు )

భారతీదేవి:- (లేచి)

సోదరీమణులారా!

శ్రీమతి. శారదాదేవిగారి యష్టావధానమును మీరందఱును నేత్రపర్వముగాఁ గాంచి యున్నారు ఇట్టిది యపూర్వము. శ్రీమతి గారికి నిందలి బాలికాసంఘపక్షమున నొక బంగారు పధకమును నియ్యఁదలఁచుచున్నాను. (ఇచ్చును) ఇంతటితో సభ ముగిసినది.

( చప్పట్లు )

ఒకరు:- అమ్మలారా. మీకును, నధ్యక్షురాలికిని, గవయిత్రిగారికిని, మాసంఘము పక్షమున వందనము లర్పించుచున్నాను.

# గృహిణి.

శ్రీయుత. కె. రామమూర్తి.

పంటలేని పొలమెట్లో, చందమామ లేని రాత్రిమెట్లో, పండ్లుపూవులు లేని చెట్లెట్లో, స్త్రీలు లేని గృహమట్లు. గృహిణి, గృహమునకు రాజ్ఞి, అలంకారము. మానవుని కష్టజీవితములో నమృతము గురిపించి సుఖప్రదముగఁ జేయునది స్త్రీ. ఆమె సంసారాంబుధిలో దిక్కుతెన్నుఁగానక కొట్టుకొను పురుషుని దాటింపఁగలనౌక. పగలంతయు నలసి, సొలసి గృహమునకుఁ జేర నమృతోపమానమగు వాక్కులచేఁ బ్రేమరసపూరితంబులగు చెయ్వులచే సేదదీర్చి సర్వమును మఱపించి యానందాబుధి నోలలాడఁజేయు దివ్యౌషధము. వేయేల? మానవుని ప్రవర్తనకుఁ బుణ్యాలోక ప్రాప్తికి మూలాధారము స్త్రీ.

జార్జి ప్రపంచ పరిస్థితుల బాగుగ నెఱిఁగినవాఁడు. భార్య సుఖమున కాటపట్టు, ఆనందమున కాలవాలము, కీర్తికి నిలయము అని పలువు రనుచుండుట వినినవాఁడు. వెస్లీ మిత్రుఁడు.

లెస్లీ యొక సంపన్నుఁడు, చదువరి. మేరీనిఁ బ్రేమించి పెండ్లిచేసికొనెను.

మేరీ చక్కనిచుక్క, విద్యావతి. నవనాగరకత యంతయు నామె వేషభాషలలోఁ బ్రతిబింబించుచున్నది. చిరునగ వామె మొగమున స్థిరనివాస మేర్పఱచుకొన్నది. చుఱుకుఁదన మామెసొమ్ము. సంఘమునకామె యలంకారము. నవనాగరకతాసామ్రాజ్యమునకు మేరీ రాణి యనిన సరిపోవునేమో.

ఆమె చిన్ననాఁటినుండియుఁ గడుగారాబముగా బెరిగినది. పనిపాటలు జేసి యెఱుఁగదు. తానేమో తన చదువేమో; తన వేషభాషలేమో; తన సంఘమేమో; తనక్లబ్బులేమో కాని బీదతనము, కష్టము, విచారము లెట్లుండునో యెఱుఁగదామె. వీనినిఁ జవిఁజూచుటకామె కవకాశముకూడ లేదు. ధనికుల యిండ్ల లోఁ బుట్టిపెరిగినది. కావున మేరీకూడ లెస్లీనిఁ బ్రేమించియే పెండ్లిఁజేసికొనినది.

లెస్లీ మేరీని మిగుల గారాబముగఁ జూచుచుండెను. ఆమె క్రిందనడచినఁ గందిపోవునేమోయనికూడఁ దలఁచుచుండెడివాఁడు. దంపతులిరువురును సంతోషముగాఁ గాలము బుచ్చుచుండిరి. వివాహమైన కొలఁదికాలమునకే పరిస్థితులుమాఱినవి. ధనమంతయుఁ గర్చైపోయినది. బీదస్థితి వచ్చినదని చెప్పవచ్చును.

తన స్థితికిఁ బతనమునకు విచారములేదు కాని మేరీ యీ దారిద్ర్య మెట్లనుభవింపఁగలదను విచారము లెస్లీని బాధించుచుండెను. మేరీతోఁ దనప్రస్తుతావస్థఁ జెప్పగా నామె యానందము భగ్నమై పోవునని లోలోన లెస్లీ బాధపడుచుండెను. ఆ మనోవేదన భగవానునకే యెఱుక. లోన బాధపడుచుఁ బయికి మేరీ ము

దానందము నటించుచుండెను. సూక్ష్మబుద్ధిగల మేరీ యతనిలోఁగల మార్పు గ్రహించినది. తెలిచి తెలిచి యడిగినది. భర్తకానందముఁ గలుగఁజేయవలెనని చాల ప్రయత్నించినది. కానియామె ప్రయత్నములన్నియు నతని సంతాపమును దగ్గించుటకుమాఱు వృద్ధి చేసినవి. సుకుమారియగు మేరీ దారిద్ర్య మెట్లనుభవింపఁగలదాయని లెస్లీ తలంచుటయే దీనికిఁగారణము.

లెస్లీ తన పరిస్థితులను మిత్రుఁడగు జార్జికిఁ దెలిపెను.

జార్జి:- ఈ పరిస్థితులు నీభార్యకుఁ దెలియునా?

లెస్లీ:- దయయుంచి యామె పేరు నుడువకుము. ఆమె పేరువినినంతనే నా దుఃఖము పొంగి పొరలుచున్నది. ఆమెను గుఱించి తలంచిన కొలఁదియు నాకు మతిపోవుచున్నది. ఆమెతోనేవిధముగఁ దనభర్త దరిద్రుఁడయ్యెనని చెప్పఁగలను? సంఘమం దామెకుఁగల గౌరవము నశించునే! ఆమె యానంద మంతరించునే! అట్టి సమయమున నామె యసువులఁగూడ గోల్పోవవచ్చును! (అని విచారించును.)

జార్జి:- నిజము నిలుకడమీఁద నైనఁ దెలియకపోదు. కాని ప్రేమపాత్రుఁడవగు నీవు దానినిఁ దీయనిమాటలలో మెల్లఁగఁ దెలుప వీలగును. హఠాత్తుగ నామెకీసంగతి యితరుల వలనఁ దెలిసిన గుండెపగిలి ప్రాణహాని గలుగ వచ్చును. అంతేగాక నీవామె సానుభూతినిఁ గోల్పోవుచున్నావు. అందువల్ల మీ హృదయము లొక్కటిగా నుండుట కంతరాయము కలుగుచున్నది దంపతుల ప్రేమబంధమునకు విఘాతము కలుగుచున్నది. నీవుకొన్ని విషయములు గుప్తపఱచు చున్నట్లామె త్వరలో గ్రహింపఁగలదు. నిశ్చలప్రేమ యద్దానిని సహింపలేదు. అది తన్నుప్రేమించువారి విచారముకూడ గుప్తపఱచుట కిష్టపడదు. కాన నీవు త్వరలో నిజస్థితి నామె కెఱిఁగింపుము. నీవీ బాహ్యాడంబరముల వదలవలెను. (అనుచుండఁగనే లెస్లీ ముఖలక్షణములు మాఱినవి. వెంటనే అది గ్రహించి) ఎట్టి పరిస్థితులలోనైన నిన్నుఁ బ్రేమించు స్నేహితులు లేకపోలేదు. ఇంతకును ప్రేమకును బాహ్యాడంబరములకును సంబంధము లేదని నాతలంపు. పెద్దభవనము దర్జాగా యుండినఁగాని మేరీనిన్ను ప్రేమింపదా?

లెస్లీ:- మేరీ? మేరీ? మేరీ? నన్నెచట యున్నను ప్రేమించును. మేరీకొఱకు నే నేగుహలలోనికైన వెళ్లుటకు సిద్ధముగ నున్నాను. నిశ్చలప్రేమ వేషభాషలఁ బాటింపదు. కాని యామెతో నాపతనమునుఁ గూర్చి యెట్లుజెప్పగలను? ఉన్నతపర్వతశిఖరములనుండి ఒక్కమారెట్టుల క్రిందఁ బడద్రోయను? సౌఖ్యమునకు, నానందమునకుఁ బ్రతిబంధకమగు దారిద్ర్యము నామె యెట్లనుభవింపఁగలదాయని విచారము.

జార్జి:- అదిగో నీవచటనే పొరఁబడుచున్నావు. స్త్రీల హృదయములలో నొకవింత జ్యోతి గలదు. అది సాధారణ పరిస్థితులలో, సుఖముగాఁ గాలము గడచిపోవునపుడు, నివురుగప్పిన నిప్పువలె నడఁగియుండును. పరిస్థితులు మాఱి కష్టము సంప్రాప్తించినపుడు, ఆజ్యోతి ద్విగుణీకృతజ్వాలతోఁ బ్రజ్వరిల్లి కష్టముల నెదుర్కొని మానవుని జీవితమును సమరసపఱచును. దానిసంగతి ప్రత్యక్షముగఁ బరిశీలించినఁగాని తెలిసికొనఁజాలరు మానవులు,

కావున నిది పరీక్షాసమయము. ఇఁక నాలసింపక నీస్థితి మెల్లఁగా నీభార్యకుఁ దెలుపుము.

లెస్లీ మెల్లఁగాఁ దలయూచెను. గృహమున కేగి తమ ప్రస్తుతావస్థ భార్యకెఱుకపఱచెను. పరిస్థితులు వినునపుడు మేరీలో నెంత మాత్రము మార్పుగలుగలేదు. భర్త విచారమునకు, నతనిలో గలిగిన మార్పునకు నదియే కారణమని తెలిసికొనెను. ఆనందముతో భర్త కంఠమును గవుఁగలించుకొనెను.

దారిద్ర్యము వలనఁగలుగు నానందము, సౌఖ్యము గూర్చి మేరీ యిదివఱలోఁ జదివియుండెను. దారిద్ర్యము ప్రేమ కంతరాయము కల్పింపకపోవుటయే గాక దానిని వృద్ధిపఱచునని కూడఁ జదివియుండెను.

లెస్లీబాధ కొంతవఱకుఁ దగ్గినది, కాది పూర్తిగఁబోలేదు. మేరీ దారిద్ర్యము వలనఁ గలుగు ఫలమునుఁ జదివినది కాని ప్రత్యక్షముగ ననుభవింపలేదు; కాన నతనికింకను మన స్స్వస్థతము లేదు. మఱునటిదిన ముదయమున నే మిత్రునిఁ గలిసికొనఁ బోయెను.

జార్జి స్నేహితునకు సలహా నిచ్చెనేగాని పర్యవసాన మెట్లుండునోయని మిగుల నాతురతతో నుండెను. ఉదయమున నే మిత్రుని కలిసికొనినపుడు, అడుగుటకు సాహసింపలేక పోయెను. లెస్లీ జరిగినదంతయుఁ దెలిపెను. కాని యింకను విచారమాతని మనోవీథిని విహరించుచునే యుండెను. జార్జి మిత్రునితోఁ గఠినతమమైన పని యయిపోయినదనియు, త్వరలోఁ దన జీవితములో మార్పురావలెననియు, బీదస్థితిలో గొప్పవారివలె నటించుట నాశనమునకు హేతువనియు, ధనము లేనివాఁ డాడంబరముగ నుండుటకుఁ బ్రయత్నించునపుడు వానిబాధ భగవానునికే తెలియుననియు దారిద్ర్యము నానందముతో నంగీకరించిన వాఁడెంతమాత్రము బాధ పడఁడనియు, విలువలేని మేరీ ప్రేమభాగ్యము గలతనకు నింక దారిద్ర్యమెక్కడిదనియు హెచ్చరించెను.

కొలఁది దినములలోనే లెస్లీ తన విలువమైన సామానుల నమ్మివేసెను. తానాగృహమును వదలి యూరిబైటఁ బొలములో నొక చక్కని పూరింటినద్దెకుఁ దీసికొనెను. ముఖ్యముగఁ గావలసిన సామాను లాకుటీరమునకుఁ బంపెను. మేరీ పగలంతయు సామానుల సర్దుచుండెను.

సాయంకాలమైనది. పనులన్నియు ముగించుకొని లెస్లీ తన మిత్రునిఁ గలిసికొనెను. ప్రస్తుతపరిస్థితులలో నీచిన్నిపూరింట మేరీ ప్రేమ దర్శనమెట్లు పరిణమించునోయని లెస్లీ విచారించుచుండెను. మిత్రులిరువురు పట్టణము వెలుపలకు వచ్చిరి.

ఎదురుగాఁ బచ్చికబయళ్లు. ఆ వెనుకఁ జెట్లు. నడుమనొక కుటీరము. కుటీరముచుట్టు పూలచెట్లు. పూలచెట్ల చుట్టును సీమరేగుచెట్ల కంచె. కంచె తలవాకిట గుమ్మము. గుమ్మము నుండి కుటీరమునకుఁ దీర్చిదిద్దిన సన్నని బాట. ఆ కనఁబడుకుటీరమే మన లెస్లీ నూతననివాసము.

జార్జి లెస్లీలు నెమ్మదిగా వచ్చుచుండిరి. నూతనగృహమునుండి శ్రావ్యమైన గానము వినవచ్చుచుండెను. లెస్లీ నెమ్మదిగా నిలిచి వినెను. అయ్యది తనకుఁ బ్రియమైన పాట. ఆవరణమం దలికిడి యగుటచే కిటికీలో నొక వ్యక్తి కనఁబడి యదృశ్యమైనది. ఆమెయే మన మేరీ!

మేరీ పల్లెటూరిపడుచువలెఁ దెల్లని సాధారణపు దుస్తులను ధరించెను. జుట్టు చక్కనిడై జీలతో నలంకరించుకొనెను. సామానంతేయు సర్ది భర్తకొఱ కెదురుజూచుచు, నతనికిఁ బ్రియమైన పాటఁబాడుచుండెను. అలికిడివిని కిటికీలోనుండి చూచి భర్త కెదురుగ వచ్చెను. చిఱునగవామె ముఖమునఁ జిందులాడుచుండెను. ఆమె ఎక్కువ యుత్సాహముగాను, జాలుకుగాఁ గనఁబడెను. జార్జినిఁ బలుకరించి భర్తను సమీపించి యతని చేయిపట్టుకొని తనకొఱ కెదురు చూచుచుంటిననియు, నింటివెనుకఁ జల్లని చెట్లనీడను గుర్చీలు వేసితిననియు, నతనికిఁ బ్రియమైన పండ్లు సిద్ధము జేసితిననియు, నేమేమో సంతోషముతోఁ బలికెను.

లెస్లీ యానందమున కంతులేదు. తన దారిద్ర్యము, దాని వలన రాఁబోవు కష్టములు, భార్యవలనఁ బొందిన యానందములో నైక్యమై పోయినవి.



# స్వార్థత్యాగము.

శ్రీమతి. నే. భారతీ రత్నాకరాంబ.

( అరణ్యము: కొందఱు పాంథులు )

బాలిక:- తండ్రీ! ఇంకను మన పురమెంతదూర మున్నది?

తండ్రి:- అమ్మా! అలసితివా! అయ్యో! ఈ ఘోరారణ్యమున, ఈ యంధకారమునఁ గనులు కానవచ్చుటలేదే! మనకుఁ ద్రోవఁ జూపిన యా తెరువరి మోసగాఁడు కాఁబోలు కాకున్న నిట్టి కాంతారమున కేల పంపును. అరుణాస్తమయము కాకముందే మీరు మీ కుంతల దేశము చేరఁగలరని గదా యతఁడు నుడివినది! అరుణాస్తమయము కాదుగదా. అర్ధరాత్రియైనది. ఇంకను నగరపు జాడలేవియుఁ గానరాకున్నది! ఏమిచేయుదును?

తల్లి:- ఇంతకు నా రాజాధిరాజు, కుంతలేశ్వరుఁడు, స్వర్గస్థుఁ డగుటఁ బట్టిగదా మనకీపాట్లు! ఆవృద్ధమహారాజ్ఞి యున్నది కాని, యామెకు గ్రహములవలె దుష్టమంత్రు లుండుటఁజేసి, యే మంచికార్యము నైనను జేయఁ జాలకున్నది. వారే మనపై లేనిపోనివి కల్పించి మనల నాస్థానభ్రష్టులను జేసినది! అయ్యో! కానికాలము గదా యని యేదో బంధుగృహమునఁ దల దాచుకొని వచ్చుచుండ, నిదియొక యాప

దయా? పరమేశ్వరా?

బాలిక:- అమ్మా! అధైర్యపడకుఁడు. ఊఱడిల్లుడు.

తల్లి:- అయ్యో! బిడ్డా! ఎట్లుధైర్యపడఁ గలమే! నీవంటి రూపరాశిఁ గని యే ముష్కరులైనను నిలువనిత్తురా? ఆమోసగాఁడు నిన్ను తేఱిపాఱఁ జూచు చుండఁగనే నేనను మానించితిని. ఓ యీశ్వరా! ఇంకను నేమిచేయఁ దలఁచితివి? ఈ బిడ్డనైన మాకు దక్కనియ్యవా దేవా?

బాలిక:- అమ్మా! నడువఁ జాలను. ఇచ్చటఁగొంత విశ్రమించి పోదము.

(అందఱును విశ్రమింతురు)

బాలిక:- అమ్మా! మన మహారాజు పోయిన పిదపఁ గుంతలమున నుండని కతమున నేను మన మహారాజ్ఞి నెఱుఁగను. ఆమె నామమేమి? ఆమెను గూర్చిన విషయమేమి?

తల్లి:- వెఱ్ఱితల్లీ! విను. ఆమహారాజ్ఞి నామము మహాసేన; పాలనము శాంతియుతమని యే వదంతి. ఏమయినను, ఈశ్వరానుగ్రహమున గృహము చేరితిమా, అన్నియు నెఱుకపడఁ గలవు.

బాలిక:- లెమ్ము; నేనింటికిఁ బోవఁగనే మహారాజ్ఞిని దర్శించెదను లెమ్ము.

తల్లి:- రజనీ! మన మిప్పుడామె సేవకులముగాము. రాజున్నకాలమున నెట్లుజేసినను జెల్లుచుండెడిది. ఇప్పుడన్ననో, యామె మనల నాదరింపదు. అందుచే నామెను దర్శింపరాదు.

రజని:- అయ్యో! అదేమి? ఏమిచేసినను, నెట్లయినను, నామెయే మనకు రాజ్ఞియగునుగాని, తదితరు లగుదురా? భర్తృవియోగమున నామె వగచుచుండ, దుష్టమంత్రులు మనలను బాఱఁదోలి యుండవచ్చును. అట్లయినచో, నిం దామె నేరమేమున్నది? మనబోటివా రామెకు నేరమెంచింగించి, ధర్మరక్షణము సేయకున్నచో, దేశమేమి కావలసినది? ప్రజయేమి కావలసినది? "అపకారికి నుపకారము నెపమెన్నక చేయువాఁడు, నేర్పరి" గదా! కావున నామెను దర్శింతముగాక. ఏమందువు?

తల్లి:- నీవు బాల్యమునుండియు నిట్టి వితండవాదనములే సల్పుచుంటివి. నీకు నేను సమాధానము చెప్పఁగలనా? ఒక్కటి మాత్రము చెప్పుదును. నీ వచ్చటికిఁ బోరాదని.

రజ:- అమ్మా! నేనీయాజ్ఞను దిరస్కరించెదను.

తండ్రి:- అబ్బా! ఏమి యీవాదనము? అచటికేగిన పిదప నాలోచింపవచ్చును. ఆలస్యమైనది. లేచిపోదము రండు.

తల్లి:-నడచిపోవుటకుఁ ద్రోవ నెఱుఁగముగదా! తెల్లవాఱు దనుక నిచ్చటనే యొకచ్చటఁ దలదాచుకొని పిమ్మట వెడలిపోదము. చాల చీఁకటిగా నున్నది.

తండ్రి:- నీ యాలోచన బాగుగనే యున్నది. ఎంతసేపని కూర్చుండఁ గలము? కొంచెముసేపు శయనింతము గాక!

(శయనింతురు, బాలిక యోజించు చుండును. కొందఱు దొంగలు వత్తురు.)

రజ:- (వారినిఁ జూచి). అమ్మా! దొంగలు! దొంగలు!! లెండు, లెండు!!

తల్లి, తండ్రి:— (త్రస్తులమున లేచి) ఎక్కడ? ఎక్కడ?

దొంగలనాయకుఁడు:- మాట్లాడ్తే సంపేత్రా, నోరుమూసుకో కూకోండి. ఓరి యెంకా! ఏదిరా ఆ సక్కని పడుసు?

వెంకడు:- ఇద్గో నండీ! నేను పట్టుకుంటే, ఏడుస్తోంది.

తండ్రి:- రజనీ! రజనీ! చోరుల పాలఁబడితివా తల్లీ! నాబిడ్డను, నా సర్వస్వమును రక్షించు దయామయు లెవ్వరును నిచ్చట లేరా? అయ్యో! ఆపదలో నున్నాము!

(అప్పు డిరువుర శ్వారోహకులయి వత్తురు; దొంగలు పాఱిపోదురు.)

ఒకఁడు:- పాంథులారా! భయము లేదు. దొంగలు పాఱిపోయిరి.

తండ్రి:- దయామయులారా! రక్షింపఁబడితిమి. తల్లీ! ఏదీ నారజని?

రజని:- తండ్రీ! నేనిచ్చట నున్నాను.

ఒకఁడు:- అయ్యా! మీ రెవ్వరు? ఎచ్చటినుండి వచ్చుచున్నారు? ఎచ్చటికేగెదరు?

తండ్రి:- అయ్యా! మేము కుంతలమున కేగుచున్నాము. ఆ పురము విడచి, పదునేను సంవత్సరము లయినది. తిరిగి జన్మస్థానమున కేగఁ దలఁచి వచ్చుచుండ, నొక్కఁడు మమ్ము ను మోసగించి యిటు రప్పించినాఁడు. మేము సుక్షత్రియులమే గాని, కారణాంతరమున మా స్థితి చితికినది. మా వంశమున నేనొక్కడనే మిగిలియున్నాఁడను. నా కడుపున నీకూన యొక్కతెయే బ్రదికినది.

ఒకఁడు:- అయ్యా! మీరు మార్గము తప్పినమాట వాస్తవమే. ఇచ్చటినుండి కూడఁ గుంతలమునకుఁ దగ్గరలోఁ బోవుమార్గమున్నది.

తండ్రి:- అనఘాత్మా! కృతజ్ఞులము, మా బిడ్డను రక్షించి, మా ప్రాణములను నిల్పిన మీ నామ-వాసముల మే మెఱుఁగవచ్చునా?

ఒకఁడు:- మదనా! చెప్పుము.

మదనుఁడు:- అయ్యా! ఇయ్యనఘుఁడు మాళవ దేశాధిపతి—ధనపాలుఁడు; నే నాయన సేనానిని, మదనసింగును.

తండ్రి:- మహారాజ! మీ స్వరూప మెఱుఁగక యొనరించిన నాయపరాధమును సైరింపుఁడు.

ధనపాలుఁడు:- పెద్దలు మీరు; ఇందప రాధ మేమున్నది? కాని, మేము కుంతలమున నిడియు మీ గృహమున కరుదెంచువారము. సమ్మతింతురా?

తండ్రి:- అనుగ్రహింపఁబడితిని. ధన్యులము. దేవా! మా పూర్వపుణ్యమున మీకు మాపై నిట్టి యకారణవాత్సల్యము కలిగినది.

ధనపా:- ఇఁక మేమేగెదము. మీరు దక్షిణముగాఁ బోయినచోఁ గుంతలమును జేరఁగలరు.

తండ్రి:- జయము. మహారాజ. (బయలు దేరుదురు.)

... ... ... ...

{ జనార్దనసింగు గృహము.
జనార్దనసింగు—శారదాదేవి. }

శారదా:- వాస్తవముగ మనమదృష్ట వంతులమే. లేనిచో మాళవ దేశాధిపతి ధనపాలుఁ డంతటివాఁడు మన పుత్రిక నపేక్షించి స్వయముగా నడుగునా? మన పుణ్యము పండినది.

జనా:- ఔను. మదనసింగు ధనపాలుని పంపున మహాసేనపై దాడి వెడలి యరుదెంచి

యున్నాఁడు. మహాసేన జడిసి సంధి యొనరించు కొనునేమో?

శార:- ఇంకను రాజమందిరమును వీడ లేదేమి మదనసింగు! వారెటు పోయిన మన కేమి? మన బిడ్డకు మంచి సంబంధము వచ్చి నది. అంతియేచాలు.

జనా:- రజని కావిషయ మెఱిఁగింపవల యును. రజని యేదీ?

శార:- రజనీ! రజనీ! —— (బిగ్గఱగా) రజనీ! ఏదీ? లేదే!

జనా:- ఎచటి కేగియుండును? బహుశః రాజ మందిరమున కేగి యుండును.

శార:- నిన్నను నిట్లే చేసినది. దాని కేమోగాని రాజ్ఞి యనినఁ బరమప్రేమ. నేను వలదన్నను, నిన్న నామె చెంతకేగి పరిచయ ము కల్గించు కొన్నది; నేఁ డింకను బరిచిత యగును.

జనా:- రజని యీ వివాహమును వాం ఛించునో లేదో?

శార:- ఏల? సిరిరా మోకా లడ్డువా రెవరు?

(ప్రవేశము: రజని)

ఎచటి కేగితివమ్మా రజనీ?

రజని:- రాజమందిరమునకు. మఱి——

జనా:- వలదన్నప్పు డచటి కేగదవే మమ్మా! వారికిని మనకును సంబంధము వీడినది.

రజని:- తండ్రీ! పాపము రాజ్ఞి యిప్పు డు విపత్సాగరమున మునిఁగి యున్నది. ఆమెను ప్రోత్సహించి సంతోషపఱచు వారైనను లేరు. నేఁ బోయినంతనే యమితగౌరవమున నన్నాద రించి సంభాషించినది. సంబంధము పోయినం

కొనినచో నది యెట్లుండును? ఆపత్కాలమున దోడ్పడువారే విశ్వసనీయులగు సేవకులు— కర్తవ్యాకర్తవ్యములను బోధించువారే నిజమగు సేవకులు - శ్రేయోభిలాషులయి కూర్చువారే సేవకులు. మఱి యాదేవి యట్లాపత్కాలమున నుండ సహాయము చేయనిచో నిక నెప్పుడు? ఆమె యాపద మనది కాదా? తల్లి క్షేమమే బిడ్డల క్షేమము గాదా? ఆమె యనిష్టమే ప్రజల యశ్రేయము కాదా?

జనా:- చాలుఁ జాలు నీ యుపన్యాసము. ఆమె మన రాజ్ఞికాదు. మన మామె సేవకుల ము గాని ప్రజలముగాని కాము. ఈనాటితో నీ గ్రామవాసము ముగిసినది.

రజని:- ఏమి, తండ్రీ! అట్లను చుంటివి?

శార:- ఏమియు లేదు గాని......నీ వదృష్టవంతు రాలవు సుమీ!

రజని:- ఎట్లు?

శార:-మహారాజ్ఞివి కాఁబోవుచున్నావు.

జనా:- రాజ్ఞివే కాదు; చక్రవర్తినివి కూడఁ గొలఁది దినములలో——

రజని:- మీ మాటలు నాకర్థముగుట లేదు.

శార:- తల్లీ! నీ వివాహము——

రజని:- (అదరిపడి) ఎప్పుడు?

జనా:- శీఘ్రకాలముననే.

రజని:- మఱి——

జనా:-వరుఁడు ధనవంతుఁడు — మాళవ దేశాధిపతి.

రజని:- మాళవము నుండి యెప్పుడు సమాచారము వచ్చినది? ఏమని?

శార:- (రజనినిఁ జేరఁ దీసికొని) అమ్మా! వినుము. మదనసింగు ధనపాలుని

సేనాధిపతి, మహారాజ్ఞిపై దాడివెడలి వచ్చి యున్నాఁడు. ముందుగ మన యింటికి వచ్చెను- కాని నీవప్పుడు రాజమందిరమున కేగి యుంటివి—వచ్చి మాతో నిట్లు నుడివెను. "ఆనాఁడు మిమ్ములను గాంతార మధ్యమునఁ జూచిన నాఁటినుండియు మా రాజు మానసము మీ పుత్రికయందు హత్తి యున్నది గాన, నామెను శ్రీవారికిచ్చి వివాహము సేయుఁ"డని. నీవదృష్టవతివి కాబఁట్టి నీకిట్టి సంబంధము లభించెను. ఏమందువు?

రజని:- (నిట్టూర్పు పుచ్చి) అమ్మా! ఎంత యవివేకము మీఁది? స్వపురమును, స్వప్రజను, స్వరాజ వంశమును. రూపుమాపఁ గంకణమును గట్టుకొన్న స్వనాశకుని, స్వశత్రువును, ద్రోహినా, అమ్మా! వివాహ మాఁడుట? తిన్న యింటివాసము లెక్కించిన శైట్టి పని కూహించితిరి? సుక్షత్రియులముకామా? క్షణ భంగురమగు నిహలోక వైభవమున కయి, మానావమానములను లెక్కింప కుంటయా? క్షత్రియ కులాలంకార మనఁదగు రాజభక్తిని- దేశభక్తిని-విడనాఁడుటయా?

జనా:- ఓహో! గుడ్డివచ్చి పిల్లను వెక్కిరించినట్లు నీవా మాకు నీతిని గఱపుదానవు? లోక వ్యవహార మెఱుఁగని పసిదానవు.

రజని:- జననీ జనకులారా! వెయ్యి చెప్పుడు లక్ష చెప్పుడు. నా కంఠమునఁ బ్రాణము లున్నంతవఱకు నే నీ దేశద్రోహకార్యమున కొడఁబడఁ జాలను—ఇదియే మీకడసారి దర్శనము—నేను మన సైనికులను బురికొల్పి యుద్ధ సన్నాహ మొనరింపఁ బోయెదను. నా కార్యమునందుఁ గృతకృత్యనగు నట్లు దీవింపుఁడు— ఓ భారతమాతా! నీ పుత్రిక సాధ్యమగు నంతవఱకు సేవఁ జేయ సిద్ధముగ నున్నది; నీ సేవకయి కనిపెంచిన జననీ జనకుల యాజ్ఞను గూడఁ దిరస్కరించు చున్నది; రాజ్ఞి స్థానమును వీడ నున్నది. ఎన్ని పోయినను సరే, నీ సేవాగ్ని యందు నా ప్రాణము లాహుతి సేయఁ గల్గితినా, యదియే నాకుఁ బదివేలు. తల్లీ! నీవు నా కీవిధమయిన తుచ్ఛ సౌఖ్యము లీయవలదు— ధనధాన్యములను, జీనిచీనాంబరము లొసఁగ వలదు; కాని నేఁ గోరునది, నేఁ గాంక్షించునది, నే యాచించునది, భవదీయ సేవా నిమగ్నత, ఉత్సాహము, పరాక్రమము, పట్టుఁదల,— ఇంతియే.—నేఁ బోయెదఁ గాక. తల్లిదండ్రులారా! సెలవు.

... ... ... ...

(ప్రవేశము:- మంత్రి శకుని, రాజ్ఞి మహాసేన)

శకుని:- మహారాజ్ఞి! ఏమని యెదవు?

మహా:- అనుట కేమున్నది? మదనసింగు నెదుర్కొనుటకు మనసేనల నాయత్తపఱచుము.

శకుని:- దేవీ! ఈసేవకుఁ డొక విన్నప మొనరింప వచ్చునా?

మ:- ఏమది?

శకుని:- మదనసింగు తోడి యుద్ధమనిన మాటలుగాదు. ఆతని సైనికులు సమరకుశలురు, అసంఖ్యాకులు, బలసమన్వితులు నగువారు. మనవా రెంతయు వారికిఁ దక్కువపడెదరు. ఇట్టివారిని నమ్మి, యీ సమరానంతరమున సార్వభౌముఁడు కాఁబోవు ధనపాలుని తో వైరమా? అదిగాక, యతనికి ముగలుల

ప్రిపు గూడఁగలదు. అట్టివాఁడేమి చేసినను జేయఁగలఁడు.

మహా:- అట్లయిన నీ వేమనియెదవు? ఇప్పుడేది కర్తవ్యము? నా కేమియుఁ బాలు పోవుట లేదు.

శకుని:- దేవీ! నాబుద్ధికిఁ బ్రస్తుతము యుద్ధము మంచిది కాదని తోఁచుచున్నది.

ఇంక సంధి—(రజని ప్రవేశము)

రజని:- సంధియా? సంధియా? ఎవరితో? ధనపాలునితోడనా? ఛీ! ఛీ!

మహా:- రజనీ! నీవు పసిబిడ్డవు. రాజకీయ విషయము లెఱుఁగవు. నీ వూరకుండుము. అమాత్యా' చెప్పునది చివరంటఁ జెప్పుము.

శకుని:- తల్లీ! ఈ వాచాలను వెడలనడపుము. కానిచో మన కార్యము లెల్లఁ జెడును.

మహా:- నీ కేమియు భయములేదు. పసితనముకతన నట్లు పల్కినది. ఆమె నాచెంతనే యుండ వలయును. ఈ బాలిక నాకత్యంత ప్రియురాలు. నీవు చెప్పునదేమో చెప్పుము.

శకుని:- ధనపాలుని కొకటి రెండూళ్లను, గోరిన ధనమును నొసఁగి సంధి యొనరించుటయే కర్తవ్యముగాఁ దోఁచుచున్నది. ఇంతకంటె మఱొకరీతిగాఁ బ్రవర్తించినచో, మనము విపత్సాగరమున మునిఁగెదము. జయాపజయములు దైవాధీనములు గదా!

రజని:- అయ్యా! జయాపజయములు దైవాధీనములు కావుననే నీకు జయమే కలుగఁ గూడదా? ప్రయత్నమున మనుజునికిఁ గానిదేమున్నది?

శకుని:- ఈ పరిస్థితులలో మనకు జయమనుట మన మందబుద్ధిని వెలిఁబుచ్చుటయే.— దేవీ! ఈ బాల మాట కేమిగాని, మీ య[...] మత మేమి?

మహా:- మనవా రపజయ మందిన[...] వచ్చునష్టమేమి? శౌర్యహీనమగు కార్య[...] నొనర్ప నామనం బొప్పకున్నది.

శకుని:- అమ్మా! అపజయము వల[...] కష్టమే మనియా? యుద్ధానంతరమున మిమ్ము[...] లను రాజ్యభ్రష్టగాఁ జేయుదురు. పై కష్ట[...] లను నేను ప్రత్యేకముగఁ జెప్పన వలయునా[...]

మహా:- అట్లయిన సంధియే యవశ్యా[...] చరణీయ మనియెదవా?

శకుని:- (త్వరతో) అట్లే, తల్లీ!

మహా:- ఇఁక నేమిచేయుదును? సరియే[...]

రజని:- ఏమేమి? రాజ్ఞీ! సంధికి నీ వొ[...] డఁబడితివా? హరిహరీ! ఎంతమాట? శత్రు[...] భయంకరుఁడై, తేజోరాశియై, దుర్నిరీక్ష్య[...] తాపుఁడయి యుండిన రాజమార్తాండశూ[...] సేన మహారాజ పత్నివయి, యెల్ల విధము[...] నాతని కనుకూలవని పేరు పడసిన దానవ[...] రిపుభయమున సంధి యొనరించుకొనుటయా[...] అందునను విదేశీయుల ప్రాపకమున జీవించు[...] వారి వలన 'సార్వభౌమ' బిరుదమును బొంద[...] బోవుచున్న ధనపాలునితోడనా మిత్రత్వమ[...] ను నెఱపుట? అయ్యో' భారత నారీమణులు[...] శూరవనితలనియు, శత్రుభయంకర లనియు[...] రాజకార్య నిపుణులనియు, మానధనలనియు[...] ప్రపంచప్రసిద్ధప్రతిష్ఠను రిత్త చేసెదవా? ము[...] న్న రుద్రమదేవి స్త్రీ యయ్యును, ఎట్లు రా[...] కార్యములను నిర్వహించి, యాచంద్రార్క[...] యశంబును గైకొనలేదు? నాగమ్మ—పల్నాటి[...] వీరుల నెదిరించి, తన సైనికులు భయమున[...] దిరుగఁబడుచున్నను, వెనుకంజ వేయక[...]

రణమొనర్ప లేదా? వారు మాత్రము జయము గలదని మున్ముం దెఱిఁగి యుండిరా? జయము చేకుఱక పోయిన, సమరమునఁ బ్రాణత్యాగ మొనరించి వీర స్వర్గము చూఱఁ గొననైన నచ్చుఁగాని, పందలవలె నింట నిల్చియుండిన నేమి లాభము? క్షత్రియులకు సమరమరణము కన్నఁ గోరఁదగిన దేమున్నది? కావునఁ దల్లీ! లెమ్ము, రణమున కాయత్తపడుము. సేనయధికముగ లేదని చింతిల్లకుము. ఈశ్వరానుగ్రహమున సఫలమనోరథుల మైతిమా, ధన్యులము; లేక వీరస్వర్గమునకుఁ బోయినఁ బుణ్యులము. అంతియే కాని, మఱొండు నష్టము వాటిల్లదు గదా? కావున లెమ్ము—లెమ్ము. త్వరపడుము—నడుము గట్టుము—నీ వెనువెంటనే నేనును యుద్ధమున కరుదెంచెదను. ఆలసింపకుము.

మహా:- రజనీ! రజనీ! నీవు బాలికవు గావు, సాక్షాచ్ఛౌర్య మూర్తివి. నీ యుపదేశమున ధన్యనైతిని. రణమునకే వెడలుదము. అమాత్యా! నీవును యుద్ధమునకు సన్నద్ధుఁడ వగుము.

శకుని:- (ఆశాభంగముతో రజనినిఁ జూచుచు) చి—త్త—ము.

(అందఱు వెళ్లుదురు.)

... ... ... ...

(ప్రవేశము: రజని)

రజని:- (యుద్ధభూమినిఁ గలయఁజూచి) సైనికులారా! వెనుకడుగు వేయకుఁడు. వేయకుఁడు. మీమీ శౌర్యధైర్యబలసామర్థ్యములను జూప నిదియే తఱి. మాతృభారతిని శృంఖలావిముక్తలను జేసి మీమీ విశ్వాసముల నెఱుకపఱుపుఁడు. మీ రాజ్ఞి నుద్ధరింపుఁడు. యశముగొనుఁడు........అయ్యో! అదేమి? మీరు వెనుకడుగు వేయుచున్న దేమి? అయ్యయ్యో! ఎంత యవమానకరము? మీరు క్షత్రియులు కారా? శౌర్యము లేదా? స్త్రీలకంటెను అబలలా? స్త్రీలే నిర్భయముగ—నిరాఘాటముగ యుద్ధముచేయఁ జొఱఁ బాఱియుండఁగా, పురుషులయిన మీరు కాలికి బుద్ధిచెప్పుటయా? సిగ్గుచేటుగదా! రాజభక్తిలేని—దేశభక్తిలేని—రణోత్సాహములేని—స్వార్థత్యాగములేని—మీజన్మ లెందులకు? సహస్రహస్తముల మమ్ములను గాపాడుచు, సర్వసదుపాయములను నొనరించుచున్న దేశమాత కన్నీరు గార్చుచు మీవైపు చూచుచున్నను, మీ హృదయములు కరఁగుట లేదా? మీకు మాతృభక్తి లేదా? ఓ! లేకేమి? ఉన్నది. అన్నియు నున్నవికాని, పొఱఁబడి వెనుకకు నడచుచున్నారు. మీమీ సామర్థ్యము లెఱుఁగఁజాలకున్నారు. సైనికులారా! మీరు విజృంభించిన జయము కరతలామలకము గాకపోదు. పోరుఁడు. పోరుఁడు. శత్రువుల నుఱుమాడుఁడు. 'రాజ్ఞి మహాసేనకు జే' యనుఁడు. (చూచి) ఆహా! భారతీయులే వీరులు! నా వాక్యముల విన్నంతనే యెట్లు విజృంభించి యుద్ధము నొనర్చుచున్నారో! (ఆనందముతో) శత్రుసేనలు వెనుకఁబడుచున్నవే! 'మహాసేన' సేన నిజముగా మహాసేనయయ్యె విజృంభించుచున్నది. (తనను జూచుకొని) ఇన్ని గాయములతో నింక నెక్కువసేపు జీవింపఁజాలను. (తెరలో 'మహాసేనకు జై' యని కేకలు.) ఈశ్వరా! ధన్యను—ధన్యను—సఫలమనోరథను. (పడిపోవును)

(ప్రవేశము: మహాసేన)

మహా:- (త్వరగావచ్చి రజనినిఁ బట్టుకొని) రజనీ! రజనీ! అయ్యో! అసువులను

వీడితివా? వీరస్వర్గ మలంకరించితివా? (కన్నీటితో) రజనీ! రజనీ! నా కొఱకెన్ని పాట్లు పడితివి! నా యిప్పటి జయమునకు నీవే కారణభూత వైతివే! అమ్మా! నీవంటి శూరస్త్రీలుద్భవించుట యరిది. భారతనారీమణులెల్లగును నీవంటి స్వార్థత్యాగశీలలేయయిన
డల, నీకఁ గావలసినదేమి? రజనీ! మన భా
తీయులా బాలగోపాలము నీవలె నుత్సాహ
తులయిన నింకఁ గోరఁదగిన దేమున్నది?

(తెరపడును.)



# సత్యాద్రౌపదీ సంవాదము.

శ్రీమతి. లక్ష్మీదేవమ్మ.

ఉ॥ శ్రీ లలనాంశ జాతయయి ♦ చెన్నలరాఁ రెఁడు రుక్మిణీసతిన్
బాళినిఁ గూడి ద్వారకను ♦ భద్రగతిన్ వసియించి సత్కృపా
పాలిత లోకుఁడైన యన ♦ పద్య చరిత్రుఁడు కృష్ణుఁ డెప్డు మా
పాల వసించి సౌఖ్యముల ♦ వర్ధిలఁజేయఁగ భక్తిగొల్చెదన్ ॥

ఉ॥ చక్కఁదనంబు సంపదయు ♦ సత్కులమున్ బుధజాల నుత్యమా
పెక్కు గుణంబులం గలిగి ♦ పెంపెసలారెఁడి సత్యభామ తా
నొక్క దినంబు నందు సుగు ♦ ణోజ్జ్వలయౌ ద్రుపదాత్మ జాతతో
మక్కువమీఱ నిట్టు లను ♦ మానములేక వచించెఁ జెచ్చెఱన్ ॥

మ॥ అతివా! న్నేటు భర్తలేవురును న ♦ త్యంతంబు ప్రేమించి నీ
మతి నొక్కింత యలంచకుండ వశులై ♦ మన్నింతురో చెప్పఁ; మీ
క్షితి నీవంటి చమత్క్రియాకలిత యా ♦ సీమంతినిం గాన, న
ద్భుతమౌ నీదు చరిత్రముల్ గనఁగ; మె ♦ త్తున్ నీదుచాతుర్యమున్ ॥

చ॥ అని మఱి యిట్లుపల్కె, నిది ♦ యంత్ర బలంబొకొ; లేక మంత్రపున్
ఘనతరసత్త్వమో, యటవిఁ ♦ గల్గిన యట్టి మహౌషధీలతా
జనితబలంబొ, తెల్పు; మెటు ♦ జాణతనంబున నిట్టివెల్ల నీ
వనయము నేర్చి చేసితివొ ♦ యంచిత రీతి, ననన్యచిత్తతన్

ఉ॥ భూనుతసర్వవైభవ వి ♦ భూషితనయ్యును, నేను గోపికా
మానవతీసుఖాభిరతి ♦ మాటికిఁ బాఱెఁడి కృష్ణు నొక్కనిన్
వేనకువేలు మంత్రములఁ ♦ బెక్కురొసంగిన మందుమ్రాఁకులన్
బూని యధీనుఁ జేసికొనఁ ♦ బోయిన వశ్యుఁడుగాఁడతండు మున్

కం॥ కలనైన నీదు మాటను
దొలఁగం ద్రోయంగ లేక ♦ తుల్యప్రియులై
వెలయుదురు నీదుభర్తలు
కలరూపెఱిఁగింపుమమ్మ! గ్రక్కున నాకున్ ॥

మ॥ అనఁగా రోషపరీతమానసయునై ♦ యా ద్రౌపదీసాధ్వి యి
ట్లనియెన్ సత్యనుగాంచి, యేమె కుటిలా! ఆమాట నింకొక్క మా
రనినన్ గౌరవముండఁ బోదు; బహునిం ♦ ద్యంబుల్ భవద్వాక్యముల్
ఘనుఁడౌ కృష్ణునికీవెటుల్ తగుదువో ♦ కాసంతమైనన్ గనన్ ॥

మ॥ వినుమా తెల్పెద నొక్కమాట; భువి నా ♦ విఖ్యాతయా సాధ్వికిన్
దనభర్తన్ వశుఁజేసికోఁ దగిన దాఁ ♦ దథ్యంబుగా నైజపా
వనమౌ వర్తనమే; విభుండనఁగఁ దై ♦ వంబౌను జర్చింప, నా
తని కారుణ్యమె సర్వసౌఖ్యముల కా ♦ ధారం బుదారంబుగన్ ॥

ఉ॥ మందులొ మ్రాఁకులో యనుచు ♦ మాటికిఁ బల్కెద, వట్టిమాటలన్
డెందమునం దెఱింగినఁ గ ♦ డింది విభుల్ ఘనసంశయాత్ములై
సుందరి పొత్తు ఘోరవిష ♦ శోభిఫణిప్రవరేణ్యు పొత్తుగా
నెందును నెంతు; రావిధిన ♦ యించుక లేదు సుఖంబు కాంతకున్ ॥

సీ॥ పతియె దైవంబుగా ♦ భావించి మదిలోనఁ
బూనికఁ బరిచర్య ♦ లేనచేతు
విభుని మాటలు వేద ♦ నిభములౌనని యెంచి
జవదాట కేప్రొద్దు ♦ జరుగు చుందు
అహరహంబును నేనె ♦ గృహకృత్యముల నెల్ల
సల్పివారలకు వి ♦ శ్రాంతిఁగూర్తు
మచ్చికవారెంత ♦ మన్ననఁ జేసిన
భయభక్తు లనయంబు ♦ బాయకుందు

గీ॥ త్రికరణంబులనేప్రొద్దు ♦ నొకవిధాన
నకలుషంబగు వర్తన ♦ ననుసరించి
నుంతసంబునవారిప్రే ♦ మంబు నెఱిఁగి
మెలఁగెదనుగాన, నీరీతి ♦ గలిగెనాకు॥

కం॥ తలిదండ్రు, లన్నదమ్ములు
చెలువుఁడు, మఱి యతనివారు ♦ చెప్పిన పనులన్
నలచనక తీర్పఁగీర్తులు
గలుగును; నటుగాక యున్నఁ ♦ గడుసడి యొదవున్॥

చ॥ అని బహు భంగులం దెలుప ♦ నప్పుడు సత్య మనంబు లోపలన్
వినయ వివేకముల్ గలిగి ♦ వే కరముల్ ముకుళించి పల్కె | "నో
యనఘగుణా! భవచ్చరిత ♦ మయ్యె ము దావహ; మీ వచోఽమృతం
బున మదిఁగ్గలె బోధ"మని ♦ భూరిగతిన్ నుతియించె నయ్యెడన్॥

కం॥ అనిమొదలుగ శ్రీకృష్ణుని
పదపద్మము లాత్మయందు ♦ భక్తిశ్రద్ధల్
పొదలఁగ దలఁచుచుఁ దత్కృప
నొదవిన బహుభోగ్యభాగ్య ♦ యుతయై గ్రాలెన్॥

ఉ॥ కావునఁ గామినీమణుల ♦ కల్మషవృత్తిఁ జరించికీర్తి సం
భావితలై జగంబునఁ బ్రి ♦ వర్తిలుచుందురు గాత; సాధ్వులై
ఏవిధమైనయట్టిసడి ♦ నింతయుగాంచక, సర్వవిద్యలన్
భావమునం గ్రహించి, పలు ♦ భంగుల సౌఖ్యముఁ గాంత్రు గావునన్॥

# ధనుర్వేదము.

శ్రీమతి. ఐ. శ్యామలాదేవి.

ధనుర్వేదము అనగా పలువిధములగు శస్త్రాస్త్ర ప్రయోగోప సంహారములను, యుద్ధ క్రమములను నేర్పునది. దానినే ధనుర్విద్య యని యందురు. ఈ విద్యను పూర్వకాలము నందు సర్వసాధారణముగా నెల్లరును అన్ని విద్యలతోఁ బాటు నేర్చుకొనుచుండిరి. బ్రాహ్మణులు మొదలుకొని, ఎఱుకులు, భిల్లులు, కోయలు మొదలగు నడవి జాతులవారు సహిత మభ్యసించుచుండిరి. అప్పటి కాలములో నీ విద్య నెఱుఁగనివారు లేనే లేరనవచ్చును. ధనుర్విద్యావిశారదులగు స్త్రీలు సహితము వేనవేలుండిరి. క్షత్రియుల కిది ముఖ్యవిద్యయై యుండెను. కృతయుగము మొదలుకొని ఆంగ్లేయ ప్రభుత్వ ప్రారంభము వఱకీ విద్య ప్రచారమున నున్నదన వచ్చును. ఈధనుర్విద్య నభ్యసించిన యెడల శరీర వ్యాయామము తగినంత గలిగి మానవులు మంచి బలవంతులగుట కవకాశము గలుగును. శైశవమునుండి యిట్టి సాధనముల నలవాటుఁ జేసికొనుట వలన నవయవములు చక్కగాఁ నెదుగును. అందువలననే పూర్వకాలమునందు సుప్రసిద్ధులును, అసాధారణకార్యనిర్వాహులును బెక్కు లుండిరి. ఈ కారణముననే కొండవంటి హరునివిల్లు విఱిచి శ్రీరాముఁడును—గోవర్ధనగిరి నెత్తి శ్రీకృష్ణుఁడును—రెండు చేతులతో యుద్ధముజేసి అర్జునుఁడును—అనేక రాక్షసులను క్రూరమృగములను, ముష్టిఘాతములచేతఁ జిలుకుమార్చిన భీముఁడును, ఒక్కగంతున సముద్రమును లంఘించిన హనుమానుఁడును, ఇట్టివారిం కెందరో మృతజీవులైరి. ఇంతియె కాదు దీర్ఘాయుష్మంతులుగూఁడ నై యుండిరి. ఈ విషయమును వర్ణింపఁదలఁచినచో నొక గ్రంథమగును గాన నీక ముఖ్యవిషయమునకు వత్తము.

ఇట్టి యాదర్శనీయమైన యుత్తమ విద్య నీ కాలము నం దభ్యసించువారు లేక యడుగంటుట మిగుల శోచనీయము. ఇప్పుడీ ధనుర్విద్య నెఱింగినవారు మందున కైనఁ గానఁబడరు. పోనీ; సామాన్యులమాట యటుండనీ; రాజులైనను దీని జోలికిఁబోయిన పాపమునఁ బోవుట లేదు. పూర్వమీవిద్య నభ్యసింపనివారు కడు వ్యర్థులుగఁ బరిగణింపఁ బడుచుండిరి. దీనిని నభ్యసింప వలసిన విధానములను నేనొక వ్యాసరూపముగ వ్రాయుచున్నాను.

ధనుర్విద్య! దురాప్యపారపరాయణులకును—మందబుద్ధులకును— కృతఘ్నులకును తగదని శ్రీకంఠుఁడు భార్గవునకుఁ దెలిపెను. ఇట్టివారీవిద్య కర్హులుగారని యాయన యభిప్రాయము. నీతియుతునకును, శౌర్యవంతునకును, సత్కర్మాభిలాషికిని నీవిద్యను బోధింప వలయును. ధనుర్విద్యాచార్యుఁడు ధనుస్సు—చక్ర

ము—కుంతము—ఖడ్గము—క్షురిక—గదా—బాహుసమర మున్నగు వానినిఁ బోధించుటయందు సమర్థుఁడై యుండవలయును. చతుర్విధ సంగ్రామనిపుణుఁడైన వానిఁ భార్గవుఁడందురు. వీనిలో నేరెంటియందైన నేర్పరియైన వానినిఁ యోధుఁడందురు. ఒక్క విధమైన యుద్ధము నందు మాత్రమే సమర్థుఁడైన వానిని గణకుఁ డందురు.

ధనుర్విద్య నభ్యసించుటకుఁ గొన్ని ప్రత్యేక నియమము లవసరము. తిథివార నక్షత్రములనుఁ జూచికొని గురుశిష్య గ్రహచార గతు లనుకూలముగా నుండునట్లు జాగ్రతపడి సుముహూర్తమున విద్యాభ్యసనము నారంభింప వలయును. ప్రథమ దినమున విద్యార్థి యుపవసించి, ఆచార్యుని నూతన వస్త్రాలంకారభూషితునిగ నొనర్చి, తగువిధంబున సత్కరించి, ఇష్టదేవతా పూజల నాచరించి, దానము మొదలగు సత్కర్మల నొనరింప వలయును. ఈ ధనుర్విద్య నభ్యసించునపుడు విద్యార్థి సూర్యోదయమైన పిమ్మట రెండు జాముల వఱకు పశ్చిమదిశ కభిముఖమును, దదుపరి ప్రాగ్దిశాభి ముఖముగను నిలిచి లక్ష్యస్థానమును జూచికోవలయును ఉత్తరదిశ కభిముఖముగ నిలిచి యభ్యసించుటకు కొలఁది కాలము మాత్రమే యుపయోగించు కోవలయును. దక్షిణ దిశవైపునకుఁ దిరిగి యెప్పుడును లక్ష్యముఁ జేయరాదు.

విద్యార్థి తనశక్తి కనుకూలమగు బరువు గల ధనుస్సునే సమకూర్చు కొనవలయును. తన శక్తికి మించిన ధనుస్సు నుపయోగించిన యెడల వక్షోభాగమునకు భారమై లక్ష్యమును సరిగా జూడఁ జాలకపోవును. మిగులఁ బుడాతనమైన దియును—సారము లేని భూమియం దుద్భవించినదియును—పగిలిపోయి నటువంటిదియును నగు వెదురును విల్లుగా నుపయోగించుకొనఁ గూడదు. వింటిని బాగుగా పరీక్షింపక యుపయోగించి నట్లైన, నది మంచిస్థితియం దుండని పక్షమున నది విఱిగి రణమునం దపజయము గలుగవచ్చును. వింటికి నారినిఁ గట్టునపుఁడు తగు మెలకువ సరిగఁజూచి కట్టవలయును. ధనుస్సును పట్టరానిచోటఁ బట్టినను అతిభారమై శక్తికి మించిన దానిని ధరించినను, ముంజేతికిఁ దెబ్బ తగులును. కనుక నట్టియపాయమునుండి తప్పించు కొనుటకు చర్మము నుపయోగించు కొనవలయును. బాణములు దృఢమైనవి, గుండ్రమైనవి, మిగుల లావుగా నుండనటువంటివి, రెండుమూరల నిడివి గలిగినవియును నగువానిని సంపాదింపవలయును. ధనుస్సులు మూడు విధములు. వానిని "స్త్రీ పురుష నపుంసకము" లందురు.

వింటి నారిగట్టిదై యుండవలయిను. ఆ నారి బాణముల కొలఁతకుఁ బిగికెడు మందము లోతుగ నుండునట్లు గట్టవలయును. అల్లెత్రాడు బాగుగాఁ బురిబెట్టఁబడిన స్వచ్ఛమైన పట్టు త్రాఁడునైనను—లేడియొక్క నరములైనను—గేదె నరములనైనను — లేక యప్పుడు మరణించిన గొఱ్ఱెనరములనైనను వాడుకోవచ్చును.

ధన్వి బాణమును బ్రయోగించునపుడు కనుబొమ్మలు ముడివేయుట – గుడ్లుమిటకరించుట–నోరుతెఱచుట–శ్వాసను ద్వరగా వదలుట మనస్సును వేరు విషయముల నాలోచించుట మొదలగు వికారచేష్టల నలవడ నీయరాదు. ఏకాగ్రచిత్తముతో లక్ష్యస్థానమునే గమనింపవలయును. యుద్ధసమయమునఁ గాని లేక ధనుర్వి

ద్య నభ్యసించునపుడుగాని గాయములు తగిలిన యెడల అవురుగడ్డి యొక్క లేపనమును మర్దించవలయును. ఈగడ్డి వాయువులేనపుడు గూడ కదలునది గావలయు, దీని నుపయోగించిన గాయములు మానఁగలవు. లేక పిప్పలి-కుష్టము-సైంధవలవణము యీ మూడింటి నొకటిగఁజేర్చి గోమూత్రముతో బాగుగా మర్దించి గాయములపైనఁ బెట్టవలయును.

చతురంగ బలములు పరుగెత్తునపుడును గుఱిదప్పకుండఁ గొట్టుసామర్థ్యము గలుగునట్లీ విద్య నభ్యసించుట యుక్తము. తన కెడమచేతి వైపునుండి కుడివైపు పరుగెత్తుచున్న యెడల నెడమచేతితో బాణమును సంధింపవలయును. కుడివైపునుండి యెడమ వైపునకుఁ బరుగెత్తుచున్న యెడల నాలీఢలక్షణముచేఁ గుడిచేతితో బాణమును విడువవలయును.

ధనుర్వేదమును నామూలాగ్రముగ నెఱింగిన వారికి యుద్ధమునందపజయ మసంభవము. పూర్వకాలమునందు రాజులీవిద్య నభ్యసించి యాత్మరక్షణ మొనర్చుకొనెడివారు. వారికి జయము కరతలామలకములై యుండెడిది. వారెన్నఁడును శత్రువునకు వెన్నిచ్చెడివారుగాదు. శారీరిక మానసికాభివృద్ధుల కాలవాలమైన యీవిద్యను బ్రతివారును నేర్చుకొని యుండుట యుక్తమని నాయభిప్రాయము.





# మ డి.

శ్రీమతి. సీతారత్నము.

"మడి!" అనునది దేహము—వస్త్రము—మనస్సు పరిశుభ్రముగా నుండుటయే! పరిశుభ్రమైన నీటిలో మునికి పోవునట్లుగాఁ దోమికొని స్నానముఁజేసిన దేహమునకు మడియగును. వస్త్రమును మునికి బోవునట్లు తెల్లగానుతికి పరిశుభ్రమైన నీటిలోఁబిండి యారవేసిన నది మడివస్త్రమగును. చాంచల్యములేక పవిత్రమైన యీశ్వరధ్యానమునందుఁ జిత్తము లగ్నము జేసినచో మనస్సునకు మడియగును.

ఇప్పుడీ యాచారము విపరీతముగా మారినది. ఎట్టి నీటిలో స్నానముఁజేసినను—ఎట్టి కుళ్లుగుడ్డఁ గట్టికొనినను—అన్యులను దాకకుండ నుండినంత మాత్రముననే యిప్పుడు మడియగును. రుద్రాక్షమాలనుఁ ద్రిప్పుచు

లోకవ్యవహారముల నాలోచించుకొనుచుండి నను నది జపమేయనఁబడును.

చెడ్డనీటిలో స్నానముఁ జేయుటవలనను–మురికి వస్త్రములను ధరించుటవలనను––ఈశ్వరునియందు మనస్సు నేకాగ్రముగా నుంపఁజాలని జపము వలనను లాభము లేదని గ్రహింపవలయును.

సాధారణముగా నిపుడు మడి యాచారమని పలువరించువారిలోఁ బలువురు చెంబులు–వంటపాత్రలు మొదలగు వానిని గూడ పరిశుభ్రముగా మురికి బోవునట్లు తోమికొనరు; కాని గ్రహచారము జాలక యితరులెవరైన వానిఁ డాకిరో, పేడనీళ్లు–మట్టి–చింతపండు–సింగినాదమెన్నిటితోనో తొలిచి తోలిచి సగమలుగఁ గొట్టెదరు. తమ బిడ్డలు మురికిగుడ్డలు వేసికొనినను, బురదలో నాడినను దప్పులేదుగాని కర్మముమూడి హరిజనుని నీడ బారినదో ఆపిల్లవానిమీద నాలుగు బిందెల చన్నీళ్లు గుమ్మరించి యా బాలునితల ప్రాణము తోకకుఁదెత్తురు. తమయింటి మగవారితో మాటలాడుట కితర పురుషు లెవరైనవచ్చి కూర్చుండి వెళ్లిరో ఆయింటి యవ్వగారు బిందెడు పేడనీళ్లు దెచ్చి కుమ్మరించును.

ఇఁక వారి వంటయిండ్లమాటఁ జెప్పనక్కరయేలేదు. ప్రతిగోడకు దినమునకెన్నో స్నానములు. అక్కడనే మడిబట్ట లారవేయుదురు. ఇల్లంతయు పొగమయమై యుండును. ఇదిగాక ఆరవేసిన వస్త్రముల నీళ్లోడియుటచేతను, దడి వస్త్రములు గట్టుకొని తిరుగుచుండుటచేతను, ప్రతివస్తువునకు జలాభిషేకములు జేయుచుండుటచేతను మిక్కిలి తేమగానుండి కాలుఁబెట్టిన జట్టున బారెడుదూరము తెగఁజారును. అట్టి వంటయిండ్లలోఁ బాపము, వారికి అన్న మెట్లు సహించునో నాకే జాలికలుగుచున్నది.

ఇఁక వంటబ్రాహ్మణుల సంగతి యన్నచో మఱియుఁ జిత్రము. మోకాళ్లపైకి జానెఁడు పైకుండునట్టి గావంచాలతో సిద్ధము. అయ్యో మఱచితిని. రొండిలో నశ్యముకాయగూడ నుండును. కర్మము జాలక నశ్యపుకాయ సంగతి మఱచిన యెడల నామీఁదనింత నిర్లక్ష్యమా యని యెంత కోపపడియుండునో పాపమా నశ్యపుకాయ! చేతిలో నొక చిన్నపంచె. పా మా కట్టుపంచెకును చేతిలోని పంచెకును ది మునకు మూడు నాలుగు తడవలెట్లో నీళ్లలో ముణుఁగుట తప్పనేతెప్పుడు గాని "పుట్టెడు మా వులలో దొర్లినాఅంటు నన్నేయంటు నన్నట్ల వి యెన్నిమాఱులు నీళ్లలో దొర్లినను, ఈమహా నీయుల యిండ్లలోఁ బాదమూనిన నాటినుం యు నంటినమసి, నూనె, నెయ్యి, వీనికి దోడు నశ్యము వదలక సన్నగా నరచేయి మందము బట్టియుండును. ఇవియే వారలమడి వస్త్రములు. ఇట్టివారి నెవరును దాకగూడదు. వంటకొఱకు కక్కడనుంచిన కొబ్బరి, నువ్వులు, బెల్లము, ఇట్టి వస్తువులు చీమలు, ఈగలు ముట్టకుండ జాగ్రత్తగా గర్భపేటికయందు దాచుటకై మధ్యమధ్య వారిదంతములకుఁ గూడ ప గల్పించుచుందురు అట్టి సమయముల యందా వంటకు వారినోటినుండి తెలపని తలంపుగా జారిపడిన యెంగిలి వస్తుసమ్మేళన భాగ్యము లభింపవచ్చును. అప్పుడది పవిత్రమై భగవన్నివేదనకుఁ దగియుండక పోవునా?

పెండ్లిండ్లు మొదలగు శుభప్రయోజనములయందు మడికిఁ బట్టువస్త్రములను వాడిన స్వరద్గాగా యుండునని వానినే యుపయోగించు

వాడుక. అవి పెట్టెలలోనుండి యిట్టి ప్రయోజనములందు మాత్రమే యివతలికివచ్చు భాగ్యమునకు నోచుకొనునుగాని జిమ్మట పురుగులు మొదలగు నల్పప్రాణుల కాశ్రయములై యుండును. ముక్కునాసనతో సుగంధముల సీను నిట్టి వస్త్రములే మడివసనములు వీనిని ధరింపనిదే పవిత్రత సిద్ధింపదు.

తల్లి మడికట్టుకున్నచో బిడ్డ యేడ్చి యేడ్చి నోరెండవలయును. ఆటలాడుచుం బిల్లలెవరైనం దాకిరా, వారిని నాలుగుబాదు తాను నీళ్లు పోసికొని వంటనంటవలయును. పరిశుభ్రత భూతదయలకు మించిన మడిలేదు. యాత్రకు పోయిన వారల కివి యన్నియు జరుగం గలవా?

మడియనగా నేమియో యీయాచార వ్యవహారము లెందు వచ్చినవో తెలియక చాద స్తపుటాచారములన వలంబించి, పరిశుద్ధతకు బదులపరిశుద్ధత కాటపట్టులగుచున్నారు. ఇందు మూలమున వ్యాధులు సంభవించుచున్నవి. కావునమడి నిజస్వరూపమును వదలివిపరీతమైనచోం గూడదు.



# మాతృ భారతి.

శ్రీయుత. శేషాద్రిరమణకవులు. (శతావధానులు.)

మ॥ పలుకుంబోందిక లుల్లసిల్ల రసన ♦ త్పద్యంబులన్ గూర్చి వా
గ్లలనా సేవయొనర్ప నేర్చిరి, రసా ♦ కల్పంబుగాం గల్పనా
కలిత గ్రంథము లల్లుచుండిరి, సభా ♦ కంపంబుం బోనాడి యాం
ధ్రుల కీర్తుల్ వెలయించి రిప్పటి పొలం ♦ తుల్ వాఙ్మయశ్రీలచేన్॥

సీ॥ ఆంధ్రసభా వేదికాం ♦ తరంబుననిల్చి
సాహిత్యగోష్ఠుల ♦ సలుపునపుడు
కఠిననిర్బంధముల్ ♦ గడచి, యాంగ్లేయ భా
షా పట్టములకుం జే ♦ సాచు నపుడు

మాతృభారతికి వా ♦ జ్మయలతాంతములచే
విమలహారములఁ గ ♦ ల్పించు నపుడు
వివిధకళారూప ♦ విశ్వవిజ్ఞానంబు
గురువుల సన్నిధిఁ ♦ గఱచు నపుడు
ఆంధ్రబాలిక ల ద్వితీ ♦ యప్రతిష్ఠఁ
గాంచు చున్నారలంచును ♦ గరువపడెద;
దేశకళ్యాణవిజ్ఞాన ♦ దీప్తి కతన
సతులుపోఁ దోల ♦ గల్గి రజ్ఞానతమము ॥

చ॥ నలుఁబదియేఁడు లాంధ్ర సర ♦ నాయకభారమునిర్వహించి యీ
తెలుఁగువసుంధరా మహిమ ♦ తెల్లమొనర్చనరాతిరాట్ఛర
స్థలములఁ బాదపీఠికడ ♦ నాగిలఁ జేసిన రుద్రమాంబికా
విలసిత వీర తేజ మొద ♦ వింపదె యాంధ్రసతీహితార్థముల్ ?

తే॥ గీ॥ తొలుతనుండియు విజ్ఞాన ♦ విలసితమయి
కవితయును రాజ్యపాలన ♦ కౌశలంబు
దేశహితముగ వెలయించి ♦ తెలుఁగుసతులు
పేరుగనిఁరదినేఁడు గ ♦ న్పించు టరుదె?

సీ॥ జిలిబిలిపలుకుల ♦ వెలయించిముద్దు ము
ద్దుగఁ బద్దెములఁగూర్చు ♦ తెగువతనము
వేల్పుబాసనుగూడ ♦ వివిధాంశములఁ గూర్చి
వ్యాసముల్ లిఖియించు ♦ పాటవంబు
విద్యావివేకధీ ♦ విభవంబుచే మాతృ ♦
భారతిఁ దనుపుని ♦ ర్భరసుదీక్ష
ఆంధ్రసభాపీఠ ♦ మందుసారస్వతో
దీప్తిఁజూపించు వ ♦ క్తృత్వకలన
బాలికాపాఠశాలలోఁ ♦ బ్రస్తుతమున
ఆంధ్రసోదరిజెందువి ♦ ద్యాభివృద్ధి
పత్రికలు సాటుచుండనె ♦ వ్వనికిని మేను
పులకరింపదు సంతోష ♦ పూర్ణమగుచు ?

కం॥ బౌనమ్మవంటి వీరస
తీనివహము మొల్లవంటి ♦ తేజస్వినులున్
మానవతులందుఁ బలువురు
కానంబడు సుకృతమింకఁ ♦ గలరనితోఁచున్ ॥

చ॥ లలితకవిత్వ తత్వసు క ♦ ళావిభవంబులయందు, వేషభా
షలను స్వభావమందు నని ♦ శంబును నాంధ్రి సమగ్రకీర్తిరా
జిలఁగనిరంతరాయముగఁ ♦ డెల్గుపొలంతులు మాతృభారతీ
నిలయ మలంకరించుటలు ♦ నిత్యము వృద్ధినిఁ గాంచుగావుతన్ ॥

గీ॥ ఆంధ్రిభూమిని సారస్వ ♦ తాదికమ్ముఁ
బురుషులకుఁదోడుసీడగా ♦ దరియవచ్చి
సతులునిలుచుట వాఙ్మయ ♦ చరితమందు
స్వర్ణవర్ణాభిరామమౌ ♦ ప్రకరణంబు ॥





# దశరథుని శాపము.

శ్రీమతి. కం. వేంకటరమణమ్మ.

(ప్రవేశము: శ్రవణుఁడు; అతని తలిదండ్రులు.)

తండ్రి:– కుమారా! శ్రవణా! ముదుసలులమై, భాగ్య విహీనులమై. యంధులమై శక్తివిహీనులమగు మమ్ము మా గర్భమున జన్మించిన పుత్రరత్నంబగు నీవొకఁడ వుండఁబట్టి యేకదా తండ్రీ! మమ్ములను రెప్పపాటైనను జాగుసేయక కాపాడుచున్నావు! ఎండయనక వానయనక యరణ్యముల కేగి కందమూలాదులఁ దెచ్చి మమ్ము పోషించుచున్నావు. దూరమెంతయైనను విసువక కావడిలో మమ్ముఁ గూర్చుండఁబెట్టికొని మోసికొనిపోదువు. ఇట్టి సద్గుణాలవాలుఁడగు తనయుని నొసఁగినందులకు భగవానునికి ధన్యవాదములు జేయుచున్నాను.

తల్లి:- పుత్రరత్నమా! మాబోటి దౌర్భాగ్యుల గర్భమునఁ జనియించి నీవేమి సుఖమనుభవించితివి తండ్రీ! నీవు కన్నుదెరచినది మొదలీ కష్టము లేకదా వయస్సునఁ బిన్నవాఁడవయ్యును ఓపికయందు నీతోఁబెద్దవారును సరిరాఁజాలరు. ప్రతిదినమును నీ వెన్నియో బాధలుపడి యాహారమునుగొని తెచ్చి మా కిడిసాకుచున్నావు. కుమారా! త్వరగా మా తనువులు వీడి నపుడైన నీవొకఁడవు సుఖముగానుందువేమో! ముసలితొక్కులమగు మే మింకెన్ని దినములిటు లీ జీవితయాత్రను సాగింపవలయునో!.

శ్రవ:- తలిదండ్రులారా! ఎంతమాటంటిరి? లోకమునఁ దనయుఁడగువాఁడు నిర్వర్తింపవలసినధర్మము నే నేనును నిర్వర్తింపుచుంటి. ఇంతమాత్రమున నన్నే మియో గొప్పజేసి పొగడుచుంటిరి. తమపుత్రులు గోరంతలు జేసినఁ గొండంతలు జేయుట మాతాపితల స్వభావము. పురుషునికిఁ దలిదండ్రి లేకదా ప్రత్యక్షదేవతలు! వారిసేవలననేకదా పుత్రులు మోక్షప్రాప్తిఁగనుట!

గీ॥ తల్లిదండ్రుల సేవను ♦ దనయుఁడెపుడు
భక్తితో నొనరింపఁగాఁ ♦ బరమునందు
ముక్తియొనగూడునంచును ♦ ముదముతోడఁ
దెలుపుచుందురు పెద్దలు ♦ తేటపడఁగ ॥

పూజ్యులగు తలిదండ్రులారా! అదియే నేఁజేయుచున్నాడను. ఇం దాశ్చర్యమేమున్నది? మీరు కడుడస్సిన ట్లగపడుచున్నారు. ఈ వృక్షచ్ఛాయను విశ్రమించి కొంత విశ్రాంతిఁ గైకొనుఁడు. వన్యమృగంబులు మనదరిఁజేరకుండఁ గాచుచుండెదను.

(తలిదండ్రు లిరువురుఁ జెట్టునీడఁ గొం… సేపు శయనింతురు. శ్రవణుండిటు ల నుపచార… సేయుచుండును.)

తల్లి:- నాయనా! శ్రవణా! నేటిమధ్యాహ్న మెండతీక్ష్ణముగా నుండినందున మీ తండ్రిగారికి దాహమగుచున్నదఁట. నాకును గొంతెండిపోవుచున్నది. ఇపుడు కొంచెము జలముఁ దెచ్చిననేగాని మా ప్రాణములు నిలు…పఁజాలము.

శ్రవ:- గీ॥ తల్లడింపకుడో తలి ♦ దండ్రులార!
అరయఁగను రెప్పపాటున ♦ ననిలవేగ
మున నరికిదెత్తు నుదకంబు ♦ ముదముమీ…
దమదు జీవములం గావ ♦ దవిలియిపుడు!

తల్లీ! ఇదేపోవుచున్నాను. జాగ్రత్తగా నుండుఁడు.

(ప్రదేశము: అరణ్యము. ఒకచోఁ గూర్చుండి దశరథుఁడు కనిపించును.)

దశ:- (తనలో) ఈ యరణ్యమున మ…గజంబు గలదనియు, నది యీ పరిసర ప్రా…ములందలి పొలములన్నియుఁ బాడుచేయుచున్నదనియుఁ గర్షకజనులందఱుఁజేరి నావ…మొఱపెట్టుకొనిరి. నాలుగైదు దినములనుండియుఁ దానికొఱకై వేఁయిటఁ గాచియుంటి… గాని యింతవరకును దానిజాడ పొడగట్టలే…దేలనోకదా! దానికై తిరిగి తిరిగి కడుబడలితి… కొంతకాల మీ తరుచ్ఛాయఁ గూర్చుండి విశ్రాంతిఁ గైకొనెదను. (అని కూర్చుండును.)

(శ్రవణుఁడు నదిలో కుండను ముంచుచుండ బుడబుడ శబ్దమగును.)

దశ:- అదిగో! మదగజ మేతెంచిన… నాశబ్దభేది బాణమును వదలుదునని బాణము…

ను వేయును. (అది శ్రవణకుమారునికిఁ దగుల హా తండ్రీ! హా తల్లీ!యని నేలఁగూలును.)

దశ:- (తనలో) ఏమిది ఈ ఘోరారణ్యమున మానవుని యార్తనాదము వినఁబడుచున్న దేమిచిత్రము! ఇదిగాక నేను బాణమును వేయఁగానె యార్తస్వరంబు వినవచ్చినది. కొంపదీసినది. ఎవరికైనఁ దాకియుండదుగదా! దైవమా! ఏమివిననున్నదోగాని నా దేహమున ముచ్చెమటలు గ్రమ్ముచున్నవి. ఒడలు జలదరించుచున్నది. (అని శబ్దమువినవచ్చిన దిశకుఁ బోయి శరపీడితుండగు శ్రవణునిఁ గాంచును.)

శ్రవ:- హా! వృద్ధజననీజనకులారా! మీ దాహమును దీర్చువా రెవరిప్పుడు? నాలుక తడియార దాహబాధచే నెంత తల్లడించుచుంటిరోకదా! నారాకకై నిరీక్షించి నిరీక్షించి నన్నెంతదూరుదురో! ఎంతవిలపింతురో! దైవమా! నీమాయ అతిచిత్రముగదా! ఒక్కక్షణములో నేనుఁగువంటివానింబీనుఁగుఁజేసితి వే!

దశ:-(కొంతతడ వేమియుఁదోఁచక నిశ్చేష్టుఁడై యుండి గడగడవడఁకుచుఁ గొంతతడవునకు గద్గదస్వరముతో ) (ప్రకాశముగా) ఆర్యా! మీ రెవరు! మీయాకారముఁగాంచిన ఋషిపుత్రునివలె నున్నది. మందమతినై పొరపాటున నెంతపనిఁ గావించితిని. హా! దైవమా! నన్నీబ్రహ్మహత్యాపాపమునకుఁ బాల్పడఁజేయుటకా నన్నీయరణ్యమున కీడ్చుకొని వచ్చితివి.

శ్రవ:- అయ్యా! నాసంగతి తరువాత విచారింతువుగాక. గడచినదానికై వగచిననేమి లాభముకలదు? పరిపక్వ ఫలంబులవలె కడువృద్ధులైన నామాతాపితలు కడుపిపాసార్తులై తల్లడిల్లుచున్నారు. వారిదాహమును దీర్చుటకై  జలమునకై యీ నదికివచ్చి నేనిట్లైతి. వారెంత యారాటపడుచుండిరో! ఏమొ! ముందువారికుదకమును దీసికొనిపొమ్ము.

గీ॥ కాళ్లుకన్నులు లేకనీ ♦ కాననమునఁ
గదల మెదల లేకున్నారు ♦ కన్నవారు
దిక్కు లేదు వారికిఁకనో ♦ దీననాథ
కావుమయ్యవారల నీవు ♦ కరుణతోఁడ ॥

జననీ జనకులారా! మీ ఋణము నాకిఁకఁ దీరినది. (అని ప్రాణముల విడుచును.)

దశ:- (జలమును దీసికొని శ్రవణుని పితరుల సమీపించును.) జననీజనకులారా! నీరుఁగొని తెచ్చితి. దాహమును దీర్చుకొనుఁడు.

తండ్రి:- కుమారా! శ్రవణా! ఏమది నీ గొంతుమారినట్లున్నది?

దశ:- అవును తండ్రీ!

తండ్రి:- కారణమేమి?

దశ:- దప్పిదీర్చుకొనుఁడు. తరువాత మనవి జేసెదను!

తండ్రి:- పుత్రికా! మొదట జరిగిన వృత్తాంతమేమియో తెలుపుము. ఈ జలము నాకగ్నివలెఁ దోఁచుచున్నది. హృదయము బద్దలగుచున్నది. త్వరగా నదియేమియో తేల్చి నాకు మనశ్శాంతిఁ గలిగింపుము.

దశ:- తండ్రీ! ప్రథమమున నీ నీరముఁ గ్రోలుడు. తదుపరి సమాచారమంతయును సవిస్తరముగా మనవిజేసికొందును.

తండ్రి:- లేదులేదు! నిజవృత్తాంతమేమియో తెలియువఱకు నేనానీరమును ముట్టను.

దశ:- మునివర్యా! నే నయోధ్యాపురాధీశుఁడను. నన్ను దశరథుఁడందురు. తమనందనుఁడు నదియం దుదకమును ముంచుచుండఁగా ... టినది.

గీ॥ మదగజంబని భ్రమియించి ♦ మదిని నేను
వేసితిన్ బాణ మురుగతి ♦ వేగనపుడు
తగిలె నదివడి నీకూర్మి ♦ తనయునకును
కట్టుకొంటినిఁ గడుపాత ♦ కంబు దేవ!

ఆ బాణము నీతనయుని హృదయమున నాటి యసువుల దోరఁగెను. అవసానసమయమున నా బాలునివలనఁ దమవృత్తాంతము నెఱిఁగి తమకడ కేతెంచితిని. అయ్యో! పొరపాటున నేను బ్రహ్మహత్యా పాపమునకుఁ బాల్పడితిని. కన్నవానిఁగడ తేర్చిన నీచుఁడనగు నన్ను మన్నించి నా పురికే తేర సమ్మతించినఁ గొనిపోయి తమను బువ్వులఁబెట్టి కన్నులకద్దుకొని సేవించెదను (ఈ మాటలు చెవులఁబడినదే తడవుగా "హా కుమారా!"యని నిట్టనిలువున నేలఁగూలిరి (కొంతతడవునకుఁ దెలిసి.)

తల్లి:- హా పుత్రరత్నమా! హా కులదీపకా! మాయట్టి నిర్భాగ్యులకు నీయట్టి సుగుణాలవాలుం డెట్లుదకఁగలఁడు. అయ్యో! పోఁగాలమునకు మా కప్పుడెక్కడిదాహాము దాపరమయ్యె! నాకేమి చేటుకాలముమూడి నిన్నట్టి యపరరాత్రియం దుదకము గొని తేరఁ బంపితిని? నాయనా! మిత్తివలె నిన్ను నాపొట్టను బెట్టికొంటినిగదా! ఇపుడేమిసేయుదు? ఎందేగుదు? ఎవ్వరి వేడుదును? నాకన్నయ్యాను, నా కల్పవృక్షమును నా కొసఁగువా రెవరు? మొదలే యంధులమగు మమ్ముఁ బుత్రవియోగమునఁ బూర్తిగ నంధులఁజేసితివా? హా తండ్రీ! నా గుండెయినుమా రాయియా వజ్రమా ఈ పిడుగువంటివార్తను వినియు నింకను శతసహస్ర
ఖండములుగా వ్రీలదేల? నా నాలుక పగిప
దేల? దైవమా! యెంత జేసితివి! ఇఁకనైన నీ
జల్లారినదా! తండ్రీ! నిన్నెడఁబాసి యి
నొకనిమిషమైన నీభూమిపై నిలువఁజాల. (మ
ర్ఛిల్లును) (శ్రవణునితండ్రి మూర్ఛనుండి తే
పొంది కుపితచేతస్కుఁడై దశరథునిఁ జూ
రాజా! దుష్టులనుండియుఁ, గ్రూరమృగబా
నుండియు మావంటివారిని విముక్తులఁ జేయుట
మాఱుగా నాకుమారుని పాటికి మారివై నీ
ట్టను బెట్టికొంటివా! పౌరుషహీనుఁడవై
ంభీతిచే నొక్క యిక్కను నక్కి మనుజుఁడై
యు మదగజంబైనదియు విమర్శఁజేయక
ముద్దులపట్టిని నొక్క పెట్టునఁగూలనేసితివ
రాజా! మేము జన్మవలన బ్రాహ్మణులము గా
పోయినను, తపస్సంపన్నతవలన నమోఘవ
నులమైతిమి. నేను వైశ్యుఁడను. శ్రవణునిత
శూద్రస్త్రీ మాకు మాతనయుఁడు లేనిది దే
ద్రవైభవమైనను వలదు.

గీ॥ పుత్రునివియోగమును మేము ♦ బూనలేక
ప్రాణములఁ బాయుచున్నాము ♦ పంతమున
మావలె నెనీవుఁగూడ కు ♦ మారునియెడ
బాటునను బాయుదువుగాక ♦ ప్రాణములను

దశ:- హా! దైవమా! తినికూర్పుఁ
లేక నేనెంతటి కార్యము జేసితిని! నేనీ శాపంబె
మరల్చుకొనఁగలను. ఈ ముగ్గురి ప్రాణము
నిష్కారణముగాఁ దీసితినిగదా! అది తప్పించ
వారెవరు? ఈ ముప్పురి దహనసంస్కారాదు
నొనరించి పురమున కేగెద.

(అందరు నిష్క్రమింతురు.)





# శ చి.

శ్రీమతి. వడ్లకొండ ఇందిర.

"శచీ! కాయా? పండా?"

"అమ్మా! నీవు పంపిన పిమ్మట—కాయ కాదు గాని"

"కాని ఏమి? సభలో నెరవేర్పలేదు?"

"సభలోనే"

"ఎట్లు?"

"సుధాకరుఁ డక్కడికిరాఁగా దూరము నుండియె గుండు విసరితిని."

"మఱియింకేమి? కాని యెందుకో?"

"సుధాకరుని పూర్వపుణ్యవిశేషము చేతనే నేను కొట్టిన గుండుదెబ్బ తగులలేదు. (కోపముతో)

ఎప్పుడిట్టి తెలివితక్కువ పనులే? బాగుగా గురిచూచి కొట్టవలదా? పోనీలెమ్ము మఱియొకసారియైనను బ్రయత్నించి బాగుగాఁ జేసికొని రావలయును."

"అమ్మా!—"

... ... ...

"అమ్మా! నేనొకటి యడిగెదను. కోపపడవుగదా?"

"ఏమదీ?"

"మఱి—సు-ధా-క-రుని-అనఁగా మన వ్యాపారములో భాగస్థుఁడుగా నుండిన సుధాకరునిఁ జంపిన నేమిలాభమో ఎన్నిమారు లడిగినను తరువాతఁ జెప్పెదనంటివి. కనుక నిప్పుడు—"

"ఇప్పుడు పని వెలుగఁబట్టితివని జెప్పవలయునా?"

"లేదమ్మా! నేనేమి చేయవలయును?

"ఏమిచేయుదువు? ఏమియు లేదు. అయితే నీకు లాభము జెప్పవలయును:"

... ... ...

"మూఢా గేసరచక్రవర్తి?"

"సుధాకరుఁడు దినదినము ప్రజానురాగము సంపాదించుచు వర్తకమును వృద్ధిపరచును—

"అయిన మంచిదేకదా!"

"(కోపముతో) అవునవును. మంచిదే కాని మనకు దానిలో సగమే వచ్చుచున్నది. అతనిఁ బూర్తిగా నంతమొనరించిన, అంతయు మన—"

"అమ్మా! అతనిని వెడలి పొమ్మనినఁ జాలదా?"

"వెళ్లిపొమ్మనిన, ఈ చిన్నగ్రామములో మఱియొక చోట స్వంతవర్తక మారంభించును. ప్రజానురాగము సంపాదించిన వాఁడు కనుక, నతని వద్దకే వెళ్ళ నిచ్చగింతురు."

(కొంచెముసేపు విచారించి.)

"అమ్మా! ఒక వేళ మనగుట్టు బయటఁ బడినచో—"

"ఎట్లు బయలుపడును? నేజెప్పినచొప్పున నాచరించితివా. ఒక్కసారి సునాయాసముగ, అవలీలగా నంతధనము సంపాదింప వచ్చును."

"భయపడుదువా?"

"అమ్మా! ఇప్పు—డున్న—ధ—న—ము చాలదా?"

"ఏమైన ఏడ్చుకొనుము. కాలు పట్టుకొని లాగుచున్న చూరుపట్టుకొని వ్రేలాడుచున్నట్లున్నది. నాపని."

"పొమ్మెక్కడకైనను" అనుచు కోపముతో వెడలిపోయినది సుమతి.

అబ్బా! ఇదియేమి తలనొప్పి! ఉన్నవానికిఁ దోడు ఊపిరికట్టున్నట్లు, ఈమెనన్ను బోరాఁడుచున్నది. ఈమెకుఁ గోపము వచ్చిన అసాధ్యము.

మనసు విరిగిన నన్ను శిక్షితునిగాఁ జేయఁగలదు.

సుధాకరుఁడు. సహజసౌందర్యవిలాసముతో, సువర్ణచ్ఛాయతో దేహమునందేగాక మానసవికాసమునందుఁ గూడ సుధాకరుఁడు. అతనినిఁ జంపవలయునఁట!

"భయంకరభీషణగర్జనములఁ గూడిన హితవాక్యములా?"

కావు-కావు— ఆమె మాటలు విసవలయును. ఇటు ఆస్తినిజూతునా? మిత్రప్రేమను జూతునా?

(కొంచెము సేపూరకుండి)

"అబ్బా! నాచేతగాదు-నేచేయలేను."

సుమతి మఱలఁ బ్రవేశించి:

"ఛీ గాడిదా! ఇంకను నాయింట నుండి వా; నేఁజెప్పినట్లు నడచుకొననివారు నాయింటఁ గాలుపెట్ట వీలులేదు. ఎంతప్రేమ జేసినను సవతిపిల్లలు సవతిపిల్లలే! పొమ్మునా యింటి నుండి!

"అమ్మా! అమ్మా! ఏలనమ్మా అంత కోపము? నాకనిష్టమయినను నీయాజ్ఞ నెరవేర్ప జూచితిని. దైవానుగ్రహ మట్లుండిన నేనేమి జేయగలను. వెడలిపోయినది. పీడ వదలినది. నాకును మనసు విరిగినది. పొడాస్తి లేకున్న మానె. వెడలి సుధాకరునితోఁ గలిసి యుందును."

## 2

"ఎవరునీవు?"

"అమ్మా! నేను నీ కుమారుని"

"ఏమి? నీవా? నా కుమారుఁడవా! అయ్యో! నా కుమారునితోడి సాంగత్యమా! భగవంతుఁడు దూరముచేసెను."

(కన్నీళ్లు ఒత్తుకొనుచు) 'హా దైవమా!'

"అమ్మా! నన్నొకమారు చూడుము ఆనాఁడు నేనాదొంగలచే నపహరింపఁ బడిన పిమ్మట, చోరీలందు ఖూనీలం దారితేరితిని. మొన్న నాసుధాకరుని యింట దొంగతన మొనర్ప నన్ను శిక్షించి ఈప్రభుత్వమువారు ఏడాది కఠిన శిక్షను విధించిరి. నేను జయిలునుండి తప్పించుకొని వచ్చితిని. ఇటీవలనే నేను దొంగలచే హరింపబడిన సంగతియు, నాకు నీవు తల్లివనియుఁ దెలిసి వచ్చితిని. మీవారి గుంపు పేరు దేవీగుంపు కాదా! నేను దీనిలోఁ జేరుదమని యనుకున్న అవకాశమప్పుడు చిక్కలేదు. ఇప్పుడు మాగుంపు వెడలిపోయినది."

"కుమారా! సుధాకరుని యింట చోరీ యొనర్చితిమి?"

"నాగుంపుకు నిన్నే యధికారిగా నుంతును. ఇఁక మనమా శచీ సుధాకరులఁ గడ తేర్చి వెళ్లిపోదము. సుధాకరునికిఁ గాని శచీంద్రునికిఁగాని తెలియదు."

"దేవీ గుంపునాదని"

"ఆలాగా!"

"దేవీ గుంపుకు ప్రస్తుత మధికారిగా నున్న యీతడు బడాచోర్ అని వ్యవహరింపబడుచుండెను. కాని సుమతి మాత్రము తనకు మారుని ముద్దుగా "చుక్క"యని పిలిచెడిది."

ఆనాడు అమావాస్య కటిక చీఁకటి. చలి కాలము. చుక్క—సుమతులు తమ రహస్యాలోచన మందిరమునుండి వెళ్లుచుండిరి. చుక్క చేతులు వణుకుచున్నవి. ఏదో బరువులెత్తుకొని పోవుచున్నాఁడు. సుమతి వెంబడించుచున్నది. ఆమె భయంకరాకారము ఎంతటి ధైర్యవంతుని గుండెలయినను అదిరిపోవునట్లుండెను.

నిబిడారణ్యములందిరువురు వెళ్లుచుండిరి. కాని వారికి వెనుక నెవరో వచ్చినట్లుగాఁగ వెనుక దిరిగిచూచిరి నిశ్శబ్దముకాగా మఱల వెళ్లుచుండిరి. మరల పాదముల చప్పుడు. వారాగఁగాఁ జప్పుడాగును వారు నడచినఁ జప్పుడు నడచును. సుమతి "చుక్కా! ఇదియేమి చిత్రము! ఎవరో మనలను వెంబడించుచున్నట్లున్నదే!"

"అమ్మా! ఈరాత్రి మనల నెవ్వరు వెంబడింతురు? వెంబడించినవారు ప్రాణంబులతోఁ దిరిగిపోదురా? మననీడయే కాబోలును! భయమక్కఱలేదు."

అట్లే వెళ్లుచున్నారు. కొంత దూరము వఱకు "ఒక్కపీడ వదలినది" అనెను.

"అమ్మా! మఱియొక దానిని వదలించుకొనుట యెంతపని?" అనుచు నిరువురు నరణ్యములోఁబడి వెళ్లుచుండిరి.

## 4

సుధాకరుఁ డింటికి వచ్చివేసెను.

"జ్ఞాపకమున్నది. ఎటునుండి యెట్లు వెళ్లవలయును?"

"వారిరువురు చుక్కా సుమతులేఁ పాపము నన్ను గుర్తింపలేదు."

"అబ్బా! సుమతివంటి యాడుదాని నెక్కడఁ జూడలేదు. ఆవులించినఁ బ్రేవులు లెక్కబెట్టునది. పిల్లివలె నడచితిని గనుక సరిపోయినది. ఈవేళ నామిత్రుఁడుశచి బాబేలనోకను పడలేదు"

కాని ఆబరువేమిటి? అంత కష్టపడి యరణ్యమునకుఁ దీసికొనివెళ్లుట కేమికారణమో! అంతవఱకు వెళ్లినవాఁడను వేచియుండి చూచిన బాగుండెడిది. కాని మాత నియోగ మచ్చట నుండనిచ్చినది కాదు.

"ఇంకను శచి రాలేదు."

"ఒక్క పీడేమిటి?"

"సరి. అక్కడికేవెళ్లి అదేమో చూచి వచ్చెదను."

అని యింటికి వచ్చిన యీతడు మరలనాయడవియం దాక స్థలమునకు వెళ్లుచుండెను.

(స్థలము సమీపించెను.)

కాని సుధాకరుని కాళ్లెందుకు వణుకుచున్నవి? అతనికిఁ దెలియకుండఁగనే వెళ్లుచుండ అశ్రుధారలేల కాలుచున్నవి? సుధాకరుని

కాళ్లకేదో మెత్తగఁ దగిలినది. కొంతసేపు విచారించిచూచెదను. ఇంకేమున్నది. సుధాకరుని గుండెలు అవిసిపోయినవి.

నోట మాటరాలేదు. పిమ్మట నాశచీ-శచీయని దుఃఖముతో నొక్కమా రెలుగెత్తి యఱచెను. అక్కడనుండి చెట్లు చేమలు సుధాకరునికి శచీంద్రునిఁ జూపినట్లుండెను. చెదరిన ముంగురులు గలిగియున్న యీశచిని లేవఁదీసి భుజమున మోసికొని యింటికి వచ్చెను. సుధాకరుఁడు పాపము ఒంటరి. అతని కేమియుఁ దోచుటలేదు. ప్రక్కపైన అతనిఁ బరుండఁబెట్టి శ్వాస తెప్పించుటకు ప్రయత్నించెను. డాక్టరును పిలువనంపుదమన్న అంతిరాత్రి డాక్టరు వచ్చునా? మొదటిమాట, శచిని వదలి వెళ్లుటకు ధైర్యములేదు. కాళ్లాఁడవు.

సుధాకరుఁడు విషాదముతో వివర్ణుఁడయి యుండినను ముఖమునందుఁ గొంత ఆశాసూచక చిహ్నము లేర్పడుచుండెను.

"సుధాకరా! నీమిత్రుని ప్రాణములఁ గాపాడుకొంటివా?" అని యీతని మనస్సతని నడుగుచుండెను. అంతలో శచీబాబు దీర్ఘ నిశ్వాసమొకటి వదలెను.

శచికి యథోపచారములు జరుగుచుండెను. మెల్లగ శచీంద్రుఁడుచ్ఛ్వాస నిశ్వాసములు గలిగి పొర్లుచుండెను. ఇఁక సుధాకరుని యానంద మేమని చెప్పవలయును.?

మెల్లగా శచీంద్రుఁడు దాహమని యడిగెను. సుధాకరుఁడు దాహమునిచ్చి యాతనిఁ గూరుచుండఁబెట్టి శచీ ఏమిది? అని యడిగెను.

శచీ! సుధా! ఈ వేళ నేను పొద్దున బచ్చికబయళ్లు చూడ బయలుదేరి యలసి యొకరాతి తిన్నెపై పరుంటిని. పిమ్మట నేమైనదో దెలియదు. సుధా! ఇంకను ఒడలంతయుఁ ద్రిప్పుచున్నది సుమా!

## 5

శచీంద్రుఁడిప్పు డెప్పటివలె నయ్యెను.

"అయిన నిన్నెవరందు పూడ్చిపెట్టి యుందురని యందువు.?"

"ఎవరేమి! నీసవతితల్లి సుమతి యక్కయును నేను జూచితిమి."

"సుధా! మీ యమ్మకు నామీఁదఁ గోపము వచ్చినది."

"శచీ! వచ్చిన రానిమ్ము. ఈదేవిగుంపు చాలా అనర్థములు జేయుచున్నది. వీరినిఁ బట్టుటకు యియ్యా బద్ధకంకణులమై యుండవలయును."

"అవును"

"సరేకాని నీవేనా ఒక్క పీడవు? మఱియొక టేదియో!"

"నీ వేమో!"

## 6

ఆయింటి వెలుపలిద్వారము చూడఁగా పాడుపడిన యిల్లు కనఁబడును. దానినుండి వెళ్లిన మఱియొక ద్వారము; దానిలోనుండి వెళ్లిన మఱియొక ద్వారము; దానిలోనుండి లోపలికి వెళ్లిన నొక పెద్దభవనము. ముందర నొక హాలుగలదు. హాలులోనుండి కుడిచేతివైపు దొంగలందరును, ఎడమచేతివైపు దొంగలరాణియగు సుమతియు నుండుట వాడుక. ఆమె యొక్కొక్కనిఁబిలిచి వాని కర్తవ్యమును బోధించుచుఁ జేయజాలనన్న వానినిఁ జెంపకాయలతో

నత్కరించు చుండెను. ఇంతలో నొకఁడువచ్చి మన గుంపునఁ జేరుట కొకడువచ్చి యున్నాఁడు అని చెప్పెను.

సుమతి:- వాడు శచీంద్ర సుధాకరుల లో నెకరుగాకున్న తీసికొనుఁడు.

"అమ్మా! అట్లులేదు."

"పరిశీలించి తీసికొనుఁడు."

"చిత్తము."

ఇదంతయు మారు వేషముతో వచ్చిన సుధాకరుఁడు వినుచుండెను. స్థలములన్నియు దినచర్య పుస్తకమునందు గుర్తించుకొని వెడలి పోయెను.

7

"శచీ! ఏమి చెప్పితివి."

"దొంగతనములలోఁ బ్రథమ తరగతి యందు తీరుఁడనై తినని చెప్పితిని."

"పిమ్మట"

"నీపేరేమని యడిగెను. శచీంద్రుఁడని నోటికి వచ్చినది."

"చెప్పితివా ఏమి?"

"లేదు గోపీనాథుఁడని జెప్పితిని?"

"నిన్నేమయిన పరీక్షించిరా?"

"పరీక్షయం దుత్తీర్ణుఁడనయిన నన్నేమి పరీక్షింతురు?"

"భవనమంతయుఁ జూచుకొంటివా?"

"ఇక్కడికేమని జెప్పివచ్చితివి?"

"ఈ వీధియందు చోరీ యానవి చెప్పితిని."

"పోలీసువారికి చెప్పిపెట్టుదునా?"

"ఊ! కాని తొందరపడవద్దు. నేనొ క్కొక్క గుంపును తీసికొనివచ్చి నెమ్మదిగ నొప్పజెప్ప వచ్చును."

"సరియే"

8

"ఒరే రామా! నేఁడెవ్వరింటికి బోవుద మురా?"

"అరే గోపీ! పోలీసువారు మిగుల జాగ రూకతతో నున్నట్లు వింటిని."

"గోపీ: తిరిగిన నాకేమి భయమురా."

"అవునులే. మొన్న మన రంగఁడు ఒక్క పోలీసువాడిని చంపినాడురా. పత్రిక లందు "హార్ట్సుఫెల్" అనుచు మనలను కను గొన "ఫైల్" అయినారురా వాళ్లు."

"అవునవును. మీరంత చాలా జాగ్రత గల వాళ్లురా."

"అయిన కోటీశ్వరుల బజాగునకు పో దము."

శచీంద్రుఁడు వాయువేగమున వెడలి పోలీసుఠాణాయందు పోలీసువారిని సిద్ధముగ నుండుమని తనతో నయిదుగురు వత్తురని చెప్పి వచ్చివేసెను

ఆనాఁడు రాత్రి వారందరును దొంగతన మునకు బయలుదేరిరి.

"అరే గోపీ! సుధాకరుఁడనే ధనవంతు నింట్లోపడి చాలారోజు లయిందిరా."

"పోదామా మరి"

"ఈరోజువద్దు. ఎందుకంటే సుధాకరుని కొకస్నేహితుఁ డున్నాడఁట! వానిపేరు—అ— మఱచిపోతిని—శచీంద్రుఁడట! మనల నందఱిని పట్టి యిత్తునని ప్రతిజ్ఞ పట్టినాడట!"

"అవునవునట"

పదుగురు ఒకయింట దూరిరి.

"శచీంద్రుడు:- అరే! నేనిక్కడనే యుందును."

"పోలీసువారిపై ఒక కన్నుంచి"

"సరే"

శచీంద్రుడు పోలీసు వారిని హెచ్చరించెను. వారందరు నింటిచుట్టు మూగిరి. పదుగురు నివతలికి రాగానే—సం—కె—ళ్లు—ప్రతివారికి !!!

"గోపీ! నవ్వుచున్నావేమిరా?"

"గోపీగాడి కింకెందుకు వేయలేదు?"

"వేస్తారులే!" అని మఱింతనవ్వెను.

"అరేగోపీ! నిన్ను నమ్మినామురా. నీవే యింతపని చేసినది."

"పో తుచ్ఛుడా! ఇటువంటివాడవని తెలియక పోయెను."

"సుమతికి తెలిసినచో చంపెడిది. వీడిని ముక్కలక్రింద నరికి వేయకపోవునా?"

"అవునురా! ఆనాడు నేను వాడువచ్చిన దినము చెప్పగా పదేపదే పరిశీలించి తీసుకొనుమనినది."

"మనరాణి దూరదృష్టిగలది."

మాట్లాడుకొనుచుండ పోలీసువారల్లరి జేయవలదని బెదరించిరి.

అర్ధరాత్రి—నిశ్శబ్దము.

ఇరువదిమంది పోలీసులు —

పదుగురు దొంగలు—

కొట్టునందు బంధింపబడిరి. ఈ విధముగా వారమునకై దారుగురు పట్టుబడు చుండిరి.

"ఇప్పుడు చుక్క ఎంతపని జేయువాడు శచీంద్రుడు!"

"ఒకనాడు చుక్క-"గోపీ! అందఱేది"యని యడిగెను.

"సర్కార్!... అందరును చుట్టుపక్కల యిండ్లను దోచుకొన వెళ్లిరి. ఈదేశము నుండి వెళ్లిపోవుదమని అనుకొని యున్నారు గాదు? అందుచేత ఉన్నప్పుడే చుట్టుపక్కల ఊళ్లను దోచుకొన యత్నించిరి."

"అటులనా"

"చుక్కా!గోపీ' నమ్మకమైన వాడేనా అని సుమతి యడిగెను."

9

ఇంక చివరకు మిగిలినది-ఒక్క సుమతి

"అమ్మా! మన దేవీగుంపంతయు చాకట్నములతో మిమ్ము సత్కరింప వచ్చియున్నారు. కాని మీరటు దయచేసినంక ద్వారము తలుపుతీయ ననుజ్ఞయిండు."

"అట్లే ఇదిగో తాళపు చెవులు"

"వెలుపల"

"దేవీగుంపుకు జయ్. దేవీగుంపుకు జయ్. సుమతిరాణికిజయ్." అఱవులు.

ఇట్లు జయజయధ్వనులు మిన్నుముట్టుచుండ చుక్క-సుమతులు మిగుల నుత్సాహముతో నున్నారు.

కాని ద్వారములు తెరువగనే రక్షకభటులు —

"సుధాకరుడు"

"శచీంద్రుడు"

వీరినందఱిని చూడఁగనే సుమతి చుక్క-కుఁ దలతిరిగినట్లయినది. ఆశ్చర్యముతో వారినిఁ జూచుచుండిరి.

"తమ రేనా? బడాచోర్ గారు? మంచి బిరుదమును సంపాదించితిరి. తమ రేనా రాణి గారు? పాపము! అవిచ్ఛిన్నముగ నిర్విఘ్నముగ నిరంకుశముగ దేవీగుంపు నేలుచు రెండు పీడలను వదిలించుకొనఁ దలంచి మూర్ఖము పట్టినది! పెద్దపీడ!"

"శచీంద్రునికిఁ జెడుపనిచేయఁ బ్రోత్సహించి యూతఁడు చేయుజాలననిన ఇంటినుండి తఱిమెదవా? ఎన్నటికైనను దోషులు శిక్షితులు గాకపోరు." అని సుధాకరుఁ డనుచుండ మాటలాడకుండ నిలుచుండి యుండిరి.

"నేయలేదేమి సంకెళ్లు? ఇంకను నాలోచన యేలా?

సుధాకరునియాజ్ఞ కాఁగానే సంకెళ్లు పడినవి.

పాపము! సుమతి చుక్కలోఁబడక ఇప్పుడేమి జేయఁగలదు.

సాగినన్నాళ్లు తమ దౌర్జన్యమును సాగించుకొనిరి.

ఇప్పుడు తాణాకు గాఁగానే తమ గుంపంతయు సజీవముగానుండ నాశ్చర్య సంతోషములు గలిగినవి.

"శచీంద్రుఁడానాఁడే మరణించెనని తలంచితినే.!"

మరునాఁడు విచారణకై తీసికొనివచ్చిరి. శచీంద్ర సుధాకరులు తాము చూచినది చేసినది పూసగ్రుచ్చినట్లు చెప్పిరి.

పిమ్మట వారికిఁ గఠినశిక్షలు వేసిరి. వీరికి బహుమానములు దొరకుట యాశ్చర్యము గాదుగదా?



# —* తమాషాలు *—



ఒకడు.— నాకాడుపిల్లలు లేరండీ!

రెండవవాడు:— అయ్యో! అబద్ధాలాడండీ.

---

ఒకడు:— వీరందఱు మన నాయకులు.

రెండవవాఁడు:— ఆ! వినాయకులే.

# ప్రభాతము.

శ్రీమతి. పి. సావిత్రిదేవి.

సీ॥ కిలకిలారావంబు ♦ కెలఁకులనిండఁగఁ
బర్వులు పెట్టెడి ♦ పక్షితతులు
పశువులఁ దోలుచు ♦ బయలుల కేగుచుఁ
గోలాహలముఁ జేయు ♦ గోపకులును
తల్లులు మేఁతకై ♦ తరలుటఁ జూచియు
దుఃఖానఁ బొగులు లే ♦ దూడతతులు
స్నానంబు జేసియు ♦ సద్భక్తితోడుత
దేవునిఁ బ్రార్థించు ♦ ద్విజులు మఱియు

గీ॥ హేమమునఁ బూఁతఁ బెట్టిరో ♦ యీగృహాల
ననఁగఁదరణికిరణము లం ♦ దధికరుచులఁ
జల్లుచును నాల్గు వంకలం ♦ జతువులకు
నింపుగూర్చుఁ బ్రభాతము ♦ సొంపుమిగిలి॥



# ఆదర్శ గృహిణి.

శ్రీమతి. టి. ప్రేమలత.

మన బడియొక్క యభిప్రాయ మీ బడిలోఁ జదువుకొను ప్రతి బాలికఁ గూడను ఆదర్శగృహిణిగాఁ జేయవలయు ననునదియై యుండుటచే, నేనా యాదర్శగృహిణి కుండవలసిన లక్షణములు, ఆమె యిప్పుడు నేర్చిన విద్య నిత్యజీవితమున నెట్లుపయోగించునను విషయమును నిరూపింప నెంచియున్నాను.

గృహస్థునికన్న గృహిణికే గృహవిషయములలో నెక్కుడు బాధ్యత యుండును. ఏదోయొక కొలువునందుఁ బ్రవేశించి దినమునందలి చాలభాగ. మిల్లువదలి బయటనుండి దేహపరిశ్రమ జేసి డబ్బు సంపాదించి దెచ్చి స్త్రీలచేతులలో నిచ్చుట పురుషుని పని. కాని దినమంతయు నింటనుండి పురుషుఁడు దెచ్చి యిచ్చిన డబ్బు నెక్కువ జాగ్రతగా ఖర్చుపెట్టి ముఖ్యముగా సంసారమునకుఁ గావలసిన పరికరములకు మాత్రము ధనమును వెచ్చించి కాపాడుట స్త్రీపని. సంసారమన్న పిమ్మట నింట నెవరోయొకరు రోగపీడితు లగుచుండుట సర్వసామాన్యమైన విషయము. అట్లు తటస్థించినపుడెల్ల డాక్టరు వద్దకు వెళ్లనలెనన్నఁ బురుషులు సంపాదించు డబ్బంతయు దీనికే వ్యయపఱుపఁబడును. మఱియు దినమంతయు దేహకష్టము జేసి బైటనుండుటచేఁ బురుషు లలసిపోయి యింటికిరాఁగా వారుతిరిగి యింటనుండు నిట్టి పరిస్థితుల సవరించవలెనన్నఁ జాల కష్టముగా నుండును. ఇంతియకాక యొక్కొక్క కుటుంబము పెద్దదిగ నుండవచ్చును; లేక చాల చిన్నదిగ నుండవచ్చును. పెద్ద కుటుంబీకులకు బట్టలు కావలసి వచ్చినపుడు దర్జీవానికిచ్చిన నెంత ఖర్చగునో మీరే యోచింపుఁడు. ఈ విషయము లన్నియు బాగుగా యోచించి స్త్రీకి నీపై నుదహరించిన పనులన్నియుఁ దెలిసియున్న యెడలఁ బురుషుఁడు దెచ్చు డబ్బును భద్రపఱచి సంసారమును సుఖముగా నిర్వహింపఁ గలదని యోచించి స్త్రీకిఁ గావలసిన కుట్టుపని, ఆరోగ్యమార్గము, క్లుప్తముగా ఖర్చుజేయు పద్ధతి, వంటచేయురీతి, ఇంటి లెక్కలు మొదలగునవి నేర్పి యాదర్శగృహిణులుగాఁ జేయుటకై వానికై ప్రత్యేకముగాఁ బాఠశాలలు స్థాపించుచున్నారు.

ఇంతియగాక దేశోద్ధారణయుఁ బ్రతి గృహిణిపై నాధారపడి యుండునని చెప్పవలసియుండును. అదియెట్లన శిశువు పుట్టినది మొదలు జ్ఞానము వచ్చువఱకును బిడ్డను పెంచు బాధ్యత తల్లిదై యుండును. శిశువు నెలల నుండియే తల్లి కండ్లయందు దృష్టినిలిపి తల్లి కంఠనుండి కొంతవిద్య నేర్చికొనుచున్నదని చెప్పవచ్చును. దీనిఁబట్టి మాతకెట్టి గుణములున్నవి పిల్లలకుఁ గొంతవఱ కలవడుట సహాజము.

తల్లి యొకవేళ బుద్ధిమంతురాలును, విద్యావతియునైన బిడ్డలకుఁ జిన్ననాటనుండియే విద్యాబుద్ధులఁ గఱపి, మంచినీతుల బోధించి దేశోద్ధారకులుగఁ జేసి దేశము నుద్ధరింపఁ గలదు. ఇట్లుగాక తల్లి దుర్మార్గురాలును, విద్యాహీనురాలునైనఁ బిడ్డల విషయమై తగుశ్రద్ధ వహింపమిఁజేసి యామెయొక్క చెడుబుద్ధులే యాబిడ్డలకు నలవడును. ఇట్లు తమ్ముఁదామే కాపాడుకొనలేనివారు దేశోద్ధారకురాండ్రు కాఁజాలరనుటలో వింతలేదు. ఇన్నింటికన్నను ముఖ్యమైనది స్త్రీకి వినయము. ఇట్లు విద్యాబుద్ధులును వినయముగల స్త్రీలు సుగంధముతోఁ గూడిన పుష్పమువలె, ని ప్రపంచమునఁ గీర్తిగాంచి సంఘమును, దేశము నుద్ధరించు నారీరత్నమగును.

వ్యక్తి సానపట్టని మాణిక్యము వంటిది. ఏవస్తువెంత విలువ గల్గినదియు దాని రాణింపును బట్టియుండును. ఇట్లే సమస్తమానవకోటియుఁ బుట్టుకయందు సమానమయ్యు జ్ఞానాద్యవస్థలచే భిన్నస్వరూప మగుచున్నది. అటువంటి వ్యక్తి గుణవంతురాలయ్యేనేని దానికిఁ దోడు విద్యయు నబ్బిన నెంతయు సానపెట్టిన మాణిక్యమువలె రాణింపఁగలదు. విద్యవలనను వినయము గలుగదేని యావిద్య రాణింపదు. వినయముననే వివేకమును గలుగును. వివేకమువలన దయాదాక్షిణ్యాదిసద్గుణము లతిశయిల్లును. ఇట్టి సజ్జనసాంగత్యమే మోక్షదాయకము. ఇదియే విద్యయొక్క సార్థకత — సాఫల్యము. కావున స్త్రీకి ముఖ్యముగా స్వభావసిద్ధాలంకారము లజ్జ. ఇట్టి సహజగుణము లేనియెడల విద్యావతియైనట్టి స్త్రీయు నెన్నికకు రానేరదు. స్త్రీలకుఁ దగిన విద్యలేక మంచి గుణగతములుగలఁ పుత్రులఁ బడయలేక యు న్నారు. ఇందున దేశము క్షీణించుచున్నది. ఇట్టి నష్టమును గమనించి కొందఱు పెద్దలు స్త్రీ విద్యను పూర్వమువలెనే మఱల నుద్ధరింప బూనుకొని స్త్రీకి విద్యగఱపినఁగాని దేశోద్ధారణ కాఁజాలదనియు, స్త్రీలకై ప్రత్యేకముగా పాఠశాలలను స్థాపించి ప్రతి బాలికకును జిన్న నాఁటినుండియు నా పాఠశాలల కనిపి వారి భవిష్యత్తునకును దమ నిత్యజీవితమునకు న యోగించెడి విద్యఁగరపించి యాదర్శగృహిణులుగఁ జేయుచున్నారు.

దురదృష్టమునఁ బెద్దలనుకొనురీతిఁ దా నొకటి దలఁచిన దైవమొకటి తలంచెనన్నట్లు స్త్రీ విద్య విపరీతముగ మాఱుచున్నది. రాను రాను స్త్రీలు తమ ధర్మములగు పనులనుమా పురుషులతో సమానముగాఁ బ్రతిపనియందు నుఁ బాల్గొని తమ ధర్మములను నీచముగా భావించుకొని పురుషులను మించిపోవలెనను గట్టియభిప్రాయమునఁబడి, విద్యనేర్చిన కొలఁది యు దానికిఁదోడు వినయమర్యాదల నభివృద్ధి చేసికొనుటకు బదులు, గర్వాహంభావములు మెండై పాండిత్యమునఁ దమకు సమానులు లే నిభావించి పురుషులను నిర్లక్ష్యముగాఁజూచు దుర్దినములువచ్చినవి. కొద్దిపాటివిద్యకే యి విఱ్ఱవీగు తఱిగొప్పవిద్యావతులై మహాసభ యందుఁ బాల్గొని గొప్పగొప్ప సాంఘిక కార్యనిర్వాహకురాండ్రైన స్త్రీరత్నములెట్లు ప్ర వర్తింపవలయునో! కాననట్లుగాక నెంతవిద్య యున్న నంతయణఁగియుండు సత్ప్రవర్తనము గల్గి నలుగురిపెద్దలలో మంచియనిపించుకొనుట యే శ్రేయస్కరము అట్టి స్త్రీయే యమూల్యర త్నమై వెలదారును. ఈ పైనుడివిన కారణము

బట్టియే పెక్కురు విదుషీమణులు హిందూ దేశమున వన్నెకెక్కుట కవకాశము కలిగియుండిరి. ఇందులకుఁ దార్కాణము పురాణములలో సుగుణవతులును ఖ్యాతిగాంచిన వారునగు నారీరత్నములు భారత దేశమునదక్క వేరెచ్చటను లేరని సర్వజనులకును దెలిసిన విషయమె. ఇందు స్త్రీకి స్వభావోక్తమైన దివ్యగాంభీర్య కౌశల్యములును నరకాసుర వధయందు జరిగిన యుద్ధసందర్భమున సత్యభామవిషయమున బాగుగ వర్ణింపఁబడి యున్నవి. ఇది "పరుఁజూచుఁ బరుఁజూచు" నను పద్యమునందు బాగుగ విశదపడి యున్నది. ఇట్లే మానసంరక్షణమందు ద్రౌపదియు స్త్రీభూషణమగు లజ్జనుబొంది స్త్రీస్వాభావికతను వెల్లడిజేసెను. ఇట్లే రుక్మిణియు శ్రీకృష్ణ తులాభార సమయమున నామెయొక్క పతివ్రతామాహాత్మ్యమన తులసిదళ ప్రయోగమాత్రమున శ్రీకృష్ణునిఁ దూకమునకు సరివుచ్చి సర్వలోకములలోఁ గీర్తిగాంచెను మఱియు భర్తను వశపఱచుకొనుకొఱకు తగిన మంత్రోపదేశము జేయుమని సత్యభామ యడుగ ద్రౌపది యామెకుచితరీతిని భక్తి శ్రద్ధలతోఁ బూజించిన సాటిలోకములో స్త్రీకి భర్త వశమగుటకు వేఱొక సాధనము లేదని బుద్ధిచెప్పి తనయొక్క సద్గుణసంపత్తిని వెల్లడిజేసికొనెను. ఇట్లామె నుడివిన పలుకులవలననే నెవరికిని దాటరానటువంటి అవమానమును బాసి యామె బుద్ధిగల్గి ప్రవర్తించెను. మఱియు నైదుగురు పుత్రుల హత్యజరిగి గుండె చెదరియున్న సమయమున అట్టిహత్యకు కారకుఁడైన అశ్వత్థామను జంపుదుమని బంధింప, అర్జునాదులుతన ముందునకు కొనిరాగా తనబిడ్డలుగతించి తానెట్లైతే పుత్రశోకమును భరింపజాలకున్నదో అట్లే అశ్వత్థామతల్లి యాతనికొఱకెంత విలపించునోగదా యనియు, మనహృదయమువంటిదే యామె హృదయమనియెంచి అశ్వత్థామకు కొన్ని నీతులను బోధించి కిరీటి మొదలగువారిని, ఆతని వధింపవలదని వాదించిన సుహృదయసంపత్తి నింతనివర్ణించుటకు వీలులేదు. ఇదియే భారతస్త్రీయొక్క సర్వదయాంతఃకరణమని వెయ్యినోళ్ల మహనీయులు నితర దేశములందు గూడ జాటి యున్నారు.

స్వాభావికకలహాభోజకుఁడగు నారదుఁడొక్కనాఁడు రాధయొద్దకుబోయి శ్రీకృష్ణునిపై నీర్ష్యజనింపఁ జేయవలెనను తలంపుచే నామెను బురిగొల్పుటకుగాను ఈ దినమున శ్రీకృష్ణుఁడు ఒకవిందును నెలగొలిపియున్నాఁడు దీనికై సమస్త బంధుమిత్రాదిజనులను నాహ్వానించి పత్రికల నంపియున్నాఁడు. నీకుమాత్రి మనుపలేదా! చూచితివా కృష్ణుని భేదబుద్ధి? యని నుడివెను. అందులకు రాధ శ్రీకృష్ణునకును దనకును భేదములేదనియు, ఎవరింటి కార్యములకు వారిని పిలుచుకొనరనియు, నిదియు తన యింటి కార్యమే గాన కృష్ణుడట్లు తన్నాహ్వానింపలేదనియు బదులుజెప్పెను. అందులకుఁ గృష్ణునియందు రాధకు భేదాభిప్రాయము కల్గజేసి కలహము గల్గజేయు తనకోర్కెదీరనందునను, పైగా అవమానము బొందినందులకై నారదుఁడెంతయు లజ్జగొని వెడలిపోయెను.

ఇంకొక ముఖ్యాంశమును జెప్పవలసియున్నది. ప్రస్తుతము నితర భాషలన్నియును రాజకీయమైన నాంగ్లభాషకు తర్జుమా చేయబడుచుండుటచేత నాంగ్లభాషయొక్కటి నేర్చికొనిన నితరభాషలయందున్న విషయములను

డెలిసికొని వానియందుగల మంచిచెడుగులను
గ్రహించి ప్రపంచజ్ఞానమును సంపాదింపవచ్చు
ను. ఈ కారణమునకే మన మాంగ్లభాష నే
ర్చికొనవలసి యున్నది కాని యాంగ్లము నవలం
బించినంత నే మన ధర్మములన్నియు నడఁగ
ద్రొక్కి మన వేషభాషలన్నియు నాంగ్లరీతిగా
మార్చుకొని మనకున్న గుణసంపత్తులను గో
ల్పోవుటకుగాదు. ప్రజల యభిప్రాయమేమన
రెండాంగ్లపుముక్కలు రాఁగానే స్వదేశమును
మాతృభాషను, స్త్రీ స్వభావమును అన్నిటిని
విడనాడి మహాగర్వముతోఁ జివరకు రెండిం
గ్లీషుమాటలైన లేకుండ మాతృభాషను మా
టలాడక కాలము బుచ్చుచున్నారు. భాష
వేషములు మార్చినంతమాత్రమున మనమాం
గ్లదేశస్థుల మగుటలేదను నంశము నిసుమంత
యేని గ్రహింపలేక యున్నారని. వారి భాషను
వేషములను మనము బొందుటేకాని మనలజూ
చి వారెంతవరకు నేర్చికొనిరి? గాన మనకెంత
గౌరవ మెచ్చుచున్నదను విషయ మింతయో
చించిన నిట్టి విపరీతము లుట్టిపడవు. అన్య
ములు కొన్నిచిన్నవయ్యును ఆదేశస్థుల మ
దలబట్టియు గౌరవముబట్టియు వారు పెద్ద
ములందఱి వారికన్న మిక్కిలిగా మన్నింపఁబ
చున్నారు. పైగా నితరులపై నధికారముకూ
జేయ సామర్థ్యము గల్గియున్నారు. కనుక ని
ట్టికైనను దీనిఁబట్టి నేర్చికొనిన బాగుండు
ప్రతిబాలికయు పిన్ననాఁటినుండి
నింటను బడియందును గూడ నీపై నుదహ
చినరీతిగ గృహిణికిఁ దగినంత విషయముల
జక్కగ నేర్పునటుల జూచుభారము తల్లిదం
లపై యున్నది. కాలము వ్యర్థబుచ్చక నిట్టివి
యములలో నారి దేరుట యే జీవితము
ముఖ్యము. ఇట్లు జేయుటచే నా వ్యక్తి తను
తా నుద్ధరించుకొనుటయేగాక సంఘము
దేశమునుగూడ నుద్ధరింపఁగలదనుటలో న
యోక్తి లేదు. ఇవియే నాదర్శగృహిణికిఁ గా
సిన ముఖ్యాంశములు.

—:(౦):—

# కవి-కావ్యము.

శ్రీయుత. సి. హెచ్. రంగాచార్యులు, (వ్యాకరణ శిరోమణి.)

కవి యనుటతోడనే కావ్యము, కావ్య
మని వినఁగానే కవియు జ్ఞప్తికి నచ్చుచుండుగు.
శబ్దసామ్యమేగాక వీ రిద్దఱికి, నవినాభావసంబం
ధముగూడ నున్నది. కవి ప్రపంచానుభూత
విషయములను మనఃఫలకమునఁ దీర్చి దిద్ది,
ఉల్లాసమున గానము చేయుచున్నాఁడు. ఆ గా
పద్ధతియే ఛందస్సు.

కవియగుట ప్రయత్నసాధ్యముకాద
యుఁ గొందఱిమతము. "కవితాకన్యాస్వయ
వృణుతే" అని వారందురు. ఇందు యథా

ములేకపోలేదు. అట్టి యపరియత్నలబ్ధమై, వలి మలనుండి పుడమిపై కురుకు భాగీరథియనర్గళ ధారఁబోలు కవిత్వమే యింపెసఁగును. అద్దానినే కావ్యజ్ఞులు "విశ్వశ్రేయఃకావ్యం" అనిరి

కాని యపరిత్నలబ్ధమైన యాకవితాఝరికి సాధనసంపత్తి యావశ్యకము. అప్పుడుగాని యది సహృదయాహ్లాదజనకము కానేరదు. చవిటిపఱ్ఱపైఁ బరివాహ ముప్పిలుట స్వభావముగదా! అట్టి సాధనసంపత్తియే భాషాజ్ఞానము. పూర్వాపరవిమర్శనాశక్తి. గుణదోషసంగ్రహణము, ప్రతిభ ఇవి గలవాఁడు సుకవి. అతఁడు పాడినదే కావ్యము. అద్దానలోకకల్యాణము.

కవి వాల్మీకి. నిజముగా నీతఁడు సుకవి, మహాతపస్వి. చక్కని లోకజ్ఞానము నలవఱచుకొన్నాఁడు. ఘంటము, తాటియాకులు పెట్టుకొని యెట్లు ప్రక్రమింతునా? యని బుఱ్ఱఁగోకికొనలేదు. మాధ్యాహ్నికానుష్ఠానమునకై నిర్మలతమసానది డాయఁబోయెను. ఫుల్లమనమునఁ బ్రకృతిసౌందర్యముఁ జూఱకొనుచు భగవంతుననంతశక్తింగొనియాడుచుఁడును. స్వచ్ఛమగు పరివాహము. వీచికల దోగురాయంచలు. పూచినచెట్లు, ఇరుకెలంకుల చెంగుచెంగున దుముకు హరిణపోతములు. ఆహా? ఆనందమయము!

రూపొందిన మృత్యువోయననొక కిరాతుఁడమ్మునొక యంచను గొట్టఁగా విలవిల గొట్టుకొనుచు నయ్యది యసువులఁబాసె. పెంటి యెలుగెత్తి దీనముగ వాపోవుచుండె. దయామయుఁడగు తపస్వి మనస్సు చివుక్కుమనియె. అనుకొనకుండఁగనే నోట నేమేమో మాటలు వెలువడెను. "మానిషాదప్రతిష్ఠాంత్వ మగమశ్శాశ్వతీఃసమాః" ఓపాపి! త్వరగా మడియుదువుగాక.

ఇభ్భంగి నచ్చటచ్చట విరళముగ పూర్వాలయం దప్రయత్న కవితాప్రవాహము పాఱినట్లు వినుచున్నాము. అవి నాఁడు నేఁడు ముందుఁగూడఁ జెక్కుచెదరక చవులూరుచునే యుండును. పైసందర్భమునఁ గవి సాధనసంపత్తి కలవాఁడని ప్రసిద్ధకమేదా! అతనికావ్యము. ఆదర్శవస్తుకమై విశ్వశ్రేయమొసఁగుచున్నదికదా!

నేఁటి కొందఱుకవులు పైవాదమునే యంగీకరించుచున్నారు. వారిభావము స్వచ్ఛమైనదియే. కాని విషమాలంకారమునకు లక్ష్యముగా నొకటియనుకొన వేఱొకటి జరుగుచున్నది. సాధనసంపత్తివిషయమున మనవారు చేసిన నియమముల సడలింపఁ జేయుచున్నారు. దానిచేఁగొందఱు పెద్దలను విడిచి, విచారించినచో అప్రయత్నకవితాధార పేర నసంగతములు వాఙ్మయమునఁ జేరుచున్నవి. తుమ్మపీకె యొంటిగా నున్నదని వాపోవు భావోద్రేకి కవిత్వము లోకకల్యాణమున కెట్లుపకరించును?

వాఙ్మయమంతయు లోకజ్ఞానప్రదాయియై, కేవల మిహసుఖములకే కాక పరసుఖంబులకుఁగూడ వినియోగపడవలెనని యార్యులగు మనమతము; అట్టిచోఁ గావ్యములెట్టి యాదర్శములఁ గలిగియుండవలెనో డెలియుట లేదా? కావ్యములారీతి నుండవలెనని కవులెట్టి సాధనసంపత్తి నలవరించుకొనవలెనో సుగమముకదా?

పూర్వమునను అసత్కావ్యములు లేకపోలేదు. కనుకనే "కావ్యాలాపాంశ్చవర్జయేత్" అను నిషేధముఁగూడ రావలసివచ్చినది. అయినను మొత్తముమీఁద నిప్పటివారివలె నప్పటి

వారు నియమోల్లంఘనము చేసినట్లు గనుపింపదు. కావుననే యనంతవాఙ్మయమునఁ జాల కొద్దిపాటి యసత్కావ్యములు బరిగణింపఁ బడినవి. నేఁడు వానిసంఖ్య దినదినాభివృద్ధి నందుచున్నది. వాని నుపేక్షింపరాదు. "తదల్పమపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కదంచన" యను సూక్తి కేవలఛందోవిషయమే కాదు. విశ్వశ్రేయమొసంగని కావ్యమే యనవసరము.

నిశితాసినిఁ జేబూని మనుజుల నఱకు హంతకునికంటె కుకవి వెయిమడుగుల దేశోపద్రవకారియని యొక విజ్ఞుఁడనినాఁడు. సత్యము హంతకుఁడొక తరమువారినే మడియఁజేయును. కుకవియో యసత్కావ్యఖడ్గమునఁ దరతరములవారికిఁ జేటువాటిల్లఁజేయును.

భారతమాత యుద్ధరింపఁబడ వలయు నన్న, ఆదర్శసంపదగల సుకవులు పుట్టవలెను; సత్కావ్యములు విరచింపఁబడ వలెను అసత్కావ్యములు రూపఱవలయును. అంధానుకరము పోవలయును. భాష మొదలుకొని రాజకీయములవఱకు భేదాభిప్రాయము తొలఁగవలెను. ప్రాచ్యభూమినే జ్ఞానతేజస్సుదయించును. ఎప్పటికైన విశ్వకళ్యాణ మద్దాననే చేకూరగలదు. "సహనావవతు, సహనౌభునక్తు, సహవీర్యంకరవావహై, తేజస్వినావధీతమస్తు, మావిద్విషావహై."

ఓంశాంతిః




శ్రీమతి. నే. భారతిరత్నాకరాంబ.

సీ॥ కోవెలా! కోవెలా ♦ కొమ్మలనుండి వ
సంతుని కిత్తువా ♦ స్వాగతంబు?
కోవెలా! కోవెలా ♦ క్రొమ్మావి చిగురుల
మెక్కుచు నుందువా ♦ మెల్ల మెల్ల?
కోవెలా! కోవెలా ♦ కొందలముడుపుచుఁ
బాడుచునుందువా ♦ భవ్యగీతి?
కోవెలా! కోవెలా ♦ కుతుకముమీరఁ గాఁ
బరుగెత్తుచుందువా ♦ బయలులందు?
గీ॥ కోవెలా! కంఠమది మేమి ♦ గోడునడిరు
తెలిసె; వర్షాగనుంబును ♦ తెలిసినావు
ఏగుచుంటివి కాఁబోలు ♦ నెచటికయిన
మమ్ము నెల్లర ముగ్గలో ♦ కమ్ముఁ జేసి!



శ్రీయుత. ఎ నారాయణరావుగారు
[ బా. ఉ. పా. ప్రధానోపాధ్యాయులు ]



శ్రీమతి. నే. భారతీరత్నాకరాంబగారు
మెట్రికులో రెండవతరగతిలో గెల్పొందినది
"భారతీనక్షత్రమాల, నిర్మల" గ్రంథకర్త్రి.



శ్రీమతి. వడ్లకొండ ఇందిరాదేవిగారు
బి. ఎ. విద్యార్థిని ["ఘోషయాత్ర" (గ్రంథకర్త్రి)]



శ్రీమతి. కంటె వేంకటరమణమ్మగారు
బా.ఉ.పా. ప్రాంత విద్యార్థినీ సంఘకార్యదర్శిని
[ ౧౯౩౫ - ౩౬ ]



విశ్వదాత, దేశోద్ధారక
శ్రీయుత కాశీనాధుని నాగేశ్వరరావుగారు



శ్రీయుత పింగిలి కోదండ రామారెడ్డిగారు దేశముఖు.

# శ్రీ రామజయంతి.

శ్రీయుత. పింగిలి కోదండరామారెడ్డి (హైకోర్టు ఆనరరీ జడ్జి) గారు.
(శ్రీరామజయంతి సందర్భమున అధ్యక్షోపన్యాసము)

నేఁడు ఆసేతుహిమాచల పర్యంతము హిందువుల కందరకును పవిత్రమైన దినము. శ్రీరామునివంటి ఆదర్శ పురుషుఁడు అవతరించిన సుదినము. శ్రీమద్రామాయణము పితృభక్తి పరాయణత్వమును, భ్రాతృవాత్సల్యమును, ఏకపత్నీ వ్రతమును, పతిభక్తి మున్నగు గొప్ప యంశములను మనకు బోధించుచున్నది.

శ్రీరాముఁడు దుష్టశిక్షణ, శిష్టపరిపాలనకే యవతరించెనని మనకు తెలియును. సీతాదేవియొక్క శీలము భారతదేశమునకు మకుట ప్రాయమైయున్నది. అట్టి సీతాదేవిఁ బోలు సాధ్వీశిరోమణులనే సిద్ధముఁజేయునట్టి యాదర్శముతో నిరంతరము కృషి సలుపుచున్న ఈ బాలికల ఉన్నత పాఠశాల పక్షమున నేఁడు శ్రీరామ జయంత్యుత్సవముఁ జరిపి ప్రాచ్యనాగరకతాసంప్రదాయమునకు నూతన జీవకళ నుద్దీపింపఁ జేయుట మిగుల సముంజసము; మోదావహము. ఈ పవిత్రోత్సవ సందర్భమున నన్నీసభకు అధ్యక్షునిగా నొనరించి గౌరవించినందులకు ఈ పాఠశాలా కార్యనిర్వాహకవర్గమునకు మిగుల కృతజ్ఞుఁడను. ఈసందర్భమున గత యెనిమిది సంవత్సరములనుండియు ఈ పాఠశాలఁ జేయుచున్న గొప్పసేవను స్మరించుట నా విధియైయున్నది. ఇది అత్యల్పకాలములో సంపూర్ణమైన ఉన్నతపాఠశాలగా మారుటయేఁ గాక కళాశాలతరగతులను స్థాపించుటకుఁ జేయఁబడిన కృషి సంపూర్ణముగా నెరవేరకున్నను ఫలోన్ముఖమునకు నచ్చుట మిగుల ప్రశంసాపాత్రము.

మాతృభాషద్వారానే విషయములన్నియు బోధించుటయు, విద్యావిధానము ప్రత్యేకముగా స్త్రీల కత్యంతోపయుక్తమై యుండుటయు ఈ పాఠశాలయొక్క ప్రత్యేకాదర్శమునకు ముఖ్యలక్షణములు. ఇందు కనుగుణ్యముగా భారతమహిళావిశ్వవిద్యాలయముతో దీనిని జత పరచుట మరియొకవిశేషము. ఈ విద్యాలయమునందు లలితకళలకుగూడ ముఖ్యస్థాన మియ్యబడినది. విద్యార్థినులచేతనే "మాతృభారతి" యనుపేర నొకలిఖితమాసపత్రిక వెలువరింపఁబడుటయు, గ్రంథరచనకుఁగూడ విద్యార్థినులు ప్రోత్సహింపఁబడుటయు, గానవిద్య, చిత్రకళలలో నైపుణ్యమును సంపాదించుటయందు కడుఆసక్తులై యుండుటయు. ముఖ్యముగాఁ జేర్కొనవలసిన యంశములై యున్నవి. అత్యుత్తమ పద్ధతులపై నడుపఁబడుచు, ఆంధ్రలోకమున కత్యంతోపకారకమై నిజాముదేశమున కంతటికేకైకసంస్థయనఁబరగు ఈ పాఠశాలను పోషింపవలసిన భారము దేశీయ సోదర సోదరీమణులు వహింపవలయునని మనవిచేయుచున్నాను. వయోవృద్ధులయ్యు, బహుళ

కార్యతత్పరులయ్యు, కార్యోత్సాహమునందు నవయువకులకు మించినప్రజాహిత కార్యతత్పరులగు రాజాబహద్దర్ వెంకటరామారెడ్డి ఓ. బి. ఇ. గారు దీనికధ్యక్షులుగానుండి సర్వవిధముల ప్రోత్సహించుటయేగాక మందిరనిర్మాణకార్యమునకుఁగూడ శ్రద్ధతోఁ బూనుకొని యున్నారు. కనుక దేశీయులందరును వీరి యుద్యమమునకుఁ దోడ్పడినచో నీ ఘనకార్యము సత్వరముగా నెరవేరునన్న దృఢవిశ్వాసముగలదు. స్వంతభవనమేర్పడి శాశ్వతనిధి ప్రోగుచేయఁబడినగాని యీ పాఠశాలకు స్థిరత్వమేర్పడఁజాలదు. దినదినాభివృద్ధి నొందుచున్న విద్యార్థినులసంఖ్య విశాలమైన భవనముయొక్క యావశ్యకతను నిరూపించుచున్నది. దైవప్రేరణ ఫలితముగా నయాచితముగనే భూదానము లభించినది. దీనిని చేయూతగాఁగొని విశాలమైన భవనము నిర్మింపఁబడి దేశీయభాషలద్వారా మనబాలికలయం దున్నతవిద్యాప్రసాదము గావింపఁబడి దేశాభ్యుదయమునకు నిరంతరము కృషిసలుపఁబడుగాక యని కోరుచు, ఆశ్రితరక్షణుఁడగు శ్రీరాముని శ్రద్ధాభక్తులతోఁ బ్రార్థించుచున్నాను.

# నా స్వప్నములో

శ్రీమతి. పి. కమల.

ఆరోజు స్వప్నమేమిటో ఒళ్లంతయు అలసినట్లుండెను. ఏమిచేయుటకు తోచలేదు. ఎక్కడ జూచినను గాఢాంధకారము. నిద్రింతమాయని పడకగదిలోనికి వెళ్లి పడుకున్నాను. గాఢనిద్రలోపడిపోయితిని. అప్పుడే ఒకవ్యక్తి నాకు అగపడినది.

చేతిలో జాతీయపతాకము, మెడలో ముత్యాలదండలు, ముద్దులుమూటకట్టుమోము, తుమ్మెదలవంటి శిరోజములు, విశాలమైన నేత్రము, బంగారుచాయ శరీరము చూచునరికి విస్మితురాలనైపోయితిని. ఎవరా ఈమె? అనుకొని మాటాడలేదు. అప్పుడామె నన్నుజేరబిలుచుకొని "అమ్మాయీ! నేనేమియు క్రొత్తదాననుగాను. నాపేరే భారతమాతయందురు." అని యనుచు కంటినుండినీరు రాల్చుచు నిలువబడెను. అప్పుడు నాకు ఎక్కడలేని ధైర్యము వచ్చినది. ఆమె వచ్చినసంగతి ఏమిటో తెలిసికొందమని "అమ్మా! ఎందుకు ఏడ్చుచున్నావు?" అన్నాను. అప్పుడామె దీనస్వరముతో "బిడ్డా! ఏమిచెప్పిన ఏమిప్రయోజనము? నా దుఃఖము దీర్చువారెవ్వరు నాకు గోచరింప"రని పలికెను. నేను "నాచేతనంతైనపని తప్పక జేసెదనమ్మా! నీవు ముమ్మాటికి చెప్పవలయు"నని అంటిని. అప్పుడామె చెప్పలేక చెప్పలేక, "బిడ్డా ఏమిచెప్పుదును? మీరు భారత నారీమణులయి మీభారతత్వము నేలపోగొట్టుకొనుచున్నారు? దేశభా

షల వదలిపెట్టి పరభాషలకు లొంగిపోవుచున్నారు! పూర్వమెంతటి ఉన్నతస్థితిలో నుంటిరో ఇప్పుడింతటి అధోగతిలో నుండుటేల? మీ ఐకమత్యమంతయు ఏ యేట గలుపుచున్నారు? పంచములను అంటగూఁడదనియు, వారిని గుడిలోనికి రానీయఁ గూడదనియు, ఇటువంటి లేనిపోని కలహములెందుకు? మన అయిదు వ్రేళ్లలోనుండి ఒక వ్రేలిని తెగగొట్టిన ఎంతబాధయో అటులనే వారిని అంటకుండ దూరముగా నుంచిన అంతబాధయే కదా! బిడ్డా? వారు నా బిడ్డలు-మీరు నా బిడ్డలు, నాకు అయిదుగురు బిడ్డలున్న ఒకబిడ్డను అంటకుండ వెలివేసిన నాకు దుఃఖముగాక మరేమికలదు? ఐదుగురు అయిదువైపుల జీలిపోయిన ఐకమత్యమెట్లుండును? ఈ దేశము మీది కాదా? ఐకమత్యమే లేకపోయిన మీరు ఈ భారతదేశమును ఎట్లుద్ధరింతురు? దేశస్థితిని జ్ఞప్తికి తెచ్చుకొన్న గుండె నీరై పోవుచున్నది!'' అని కంటినుండి నీరు రాల్చుచుండెను. అప్పుడెక్కడనుండియో ఒక బాలిక రోదనచేయుచు నాగదిదగ్గరకువచ్చి తనచేతిలోఉన్న పాలగిన్నెను క్రిందపడవేసెను. ఆగిన్నెచప్పుడుచే నేమో లేచితిని. తిరిగి చూచువరకు ఎదుట ఏమియు లేదు. అప్పుడదంతయు స్వప్నముకదాయని అనుకొంటిని.

# కిరాతార్జునీయము.

శ్రీమతి. నే. భారతీరత్నాకరాంబ.

(అరణ్యము: కాషాయాంబరధారియగు అర్జునుఁడు పూజార్థమయి పుష్పములఁగోయుచు)

అర్జు:- (స్వగతము) ఆహా! ఎక్కడిదీ ఘా భాన నాదము? ఈ పరిసర ప్రాంతమునఁగనుమేర దవ్వున నీరునుఁ గానవచ్చుట లేదే! ఈ యఱపులు శునకములవిగాక తదితరములు గావు...అదిగో ఆ దెసనుండియే వినవచ్చుచున్నవి. అచ్చట నీరయిన నుండియుండవలయు. ఔ! నా: నదిగో! ఒక బోయ కుక్కలదండు నొకటి వెంటనిడుకొని వచ్చుచున్నాఁడు. ఆతనిఁ గొలుచుచు నసంఖ్యాకులగు కిరాతులుఁ బ్రక్కన నొకచెంచెతయుఁగలరె! సదా జనసంచార శూన్యమగు నీకాననమున కింతమంది యరుదెంచుటకుఁ గతంబెద్దియో! తినఁబోవుచురుచులరయ నేల? వారునన్ను సమీపించుచునే యున్నారు. వారినడిగియే వృత్తాంత మరసెదఁగాక.

బోయ:- (అర్జునుని సమీపించి) ఏమయ్యా! నీవెవ్వరు? ఇచ్చట నీకేమిపని?

అర్జు:- నీవెవ్వరు?

బోయ:- నేనీ కాంతారమున కధిపతిని.

వీరు నా యనుచరులు- ఈమె నా కుటుంబిని. నీదేయూరు? నీపేరేమి?

అర్జు:- నాయూరు పేరులతో నీకేమి సంబంధము లేదు. నేఁజెప్పినను నీ వెఱుఁగఁజాలవు. నేనిటతపము—

బోయ:- అదిగో! అదిగో! పంది! పంది! అబ్బబ్బ! నడగొండవలె నెంతబలిసియున్నది! ఎంత పెద్దకోఱలు! ఓహో ఇటకు వచ్చుచున్నది దానిఁ గండడఁగింపవలయు. చెంచులారా! దానిఁ బోనీయకుఁడు, పోనీయకుఁడు. నేఁడు దానిం జంపినఁగాని నాప్రతిన నెఱవేరదు.

అర్జు:- ఇదేమి! ఈ సూకరము కోఱలు దెఱచుకొని నామీఁది కరుదెంచుచున్నదే! అది నాకు హానిఁగలిగించునట్లున్నది. చేయి కాలిన తరువాత నాకులకై వెదకిన లాభము లేదు. ముందే జాగ్రత్త పడవలయు.

(కిరాతార్జునులు పినాకశూల, గాండివములతో నాసూకరమును నిరువురేక కాలమున నేసెదరు. అది చచ్చి నేలఁగూలును.)

బోయ:- రోషకషాయితనేత్రుఁడై) ఓరీ! నేనేయనుంకించు జంతువును నీవేలయేసితివి?

అర్జు:- ఏసిన నేమి?

బోయ:- వేసిననేమియా? నేనెవ్వఁడనో యెఱింగియుండియు, "వేసిననేమి" యని యడుగుచుంటివా? ఔరా! యీ కాననంబున కెక్కిమీఁడనగు నాకనుల మెదుటనే నాయనుమతి లేక ఈ యరణ్యమందలి మృగము నేయ సాహసింతువా! అంతియేకాదు; మీఁదుమిక్కిలి నేనేయం గమకించుచుండ నన్నుఁగాదని ఎక్కడనుండియో యూడిపడి నీవు నా పంది నేసెదవా! తెగువరీ! ఎంతపనిఁ జేసితివిరా!

అర్జు:- నామీఁదికి వచ్చుచుండ నాకుఁ గీడుసేయునేమోయని వేసితిని.

బోయ:- నీవేమో తపసినని చెప్పుకొంటివే! తాపసులెందయిన జీవహింస కోర్తురంటరా?

అర్జు:- ఓహో! బాగున్నదే? తాపసులకుమాత్ర మాత్మరక్షణము కర్తవ్యముగాదా! హానిఁజేయ నెంచు క్రూరజంతువుఁ బొలియించుట నేరమా?

బోయ:- నేరమో కాదో! ఎవరెఱుంగుదురు? నీ నేరమటుంచి నాప్రతిజ్ఞాభంగమున కేమని యెదనో చెప్పుము, తుచ్ఛా!

అర్జు:- ప్రతిజ్ఞాభంగమా! నీప్రతినయేమి?

బోయ:- "ఈదినమున నీయడవినిఁగల ఘోరమృగముల నెల్లను నొక్కపెట్టునఁ జించి చెండాడుచుండ నీవరాహము నాకంటఁబడినది. అంతట దానినురుమాడ గమకింప నాకది చిక్కినదిగాదు." "అపుడు నేను రోషపరీత మానసుండనయి పోతరంబునం గండుమీఱియున్న దీనింజంపకయ వెనుదిరుగనని" ప్రతిన వట్టి దానిని వెంబడివచ్చితినిగాని మాచెంచు లలసిన నన్నునుసరింపఁజాలకుండుటచే నేనును వెనుఁబడవలసివచ్చినది. అందువలననే యాక్రోడము ననుఁదప్పించుకొని యింతవ్వ వచ్చినది. దాని జాడల నరయుచువచ్చి యెట్టెటో దానిఁగనుగొంటిఁ గాని, ఇంతలో పానకములోఁ బుల్లవలె నీవెక్కడినుండియో దాపురించి నాప్రతిజ్ఞాభంగ మొనరించితివి.

అర్జు:- శబరా! గడచినదానికై వగచి లాభమేమి? ఏవిధముగనైన నేమి? యీ మృగము మిత్తివాతి కప్పగింపఁబడినదిగదా? ఇంతకును నీకుఁగావలసిన దంతియేకాన ఈ కళేబరమును నీవ పరిగ్రహింపుము. నాకెందులకది? తెగ

వువలదిఁక శాంతింపుము-శాంతింపుము.

బోయ:- నాస్వహస్తములతో వానిఁ ద్రుంపఁ బ్రతినవట్టితినిగాని యీ మృక్కడి మృతకళేబరమునకుఁగాదు. నీవుజంపినదానిని నిది యేలాభమని మురియుచుఁగొనిపోవుటకు నేనేమంత భీరువునుగాను. తెలిసిదా?

అర్జు:-(కోపముతో)ఐనను నీవిపు డేమందువు?

బోయ:- ఏమందునా? నీతో యుద్ధమొనరించి నా యవమానమునకుఁ బ్రతీకారమొనరింతునందును.

అర్జు:- ( పరిహాసముగానవ్వి ) అమ్మయ్యో! నీ వేమో వీరాత్రివీరుండవగు రాజశేఖరుండవు. నేనేమో ఆకులలములఁదిను బీదమానిసిని. అట్టినేను నీతో యుద్ధమూడుటయా?

బోయ:-ఓహో చాలుచాలు నింక నీబీరముఁ గట్టిపెట్టి నాపోటు చవిజూతువుగానిరమ్ము.

అర్జు:- మూర్ఖా! నీ కేమి మతిబోయినదా? నాతో యుద్ధము జేయుట మృక్కడి మృగములతోఁ జెరలాడుటగాదు. నోరుమూయుము. పూజకుఁ బ్రొద్దుపోవుచున్నది. నినేఁకఁబోవలయు కయ్యమునకుఁ కాలుదువ్వకుము.

బోయ:- కయ్యముగాక వియ్యమనుకొనుచుంటివా! నను మోసముజేసి కనుమరగిపోయుదనను:కొంటివే మొకాని ననుఁ గనుమరఁగించి పోవుట నాముక్కంటిని గనుమరఁగించుటయే! రమ్మురమ్ము. తలక్రిందుగఁ దపస్సుజేసి నను మీయయ్య వచ్చినను నేఁడు నినువిడువను ఇప్పుడని ప్రాణములను బేలఁజేసి నాయాలి మన్ననలకుఁ బాల్పడి నీసడి యీగెదఁగాక.

అర్జు:- ఔరా! "వినాశకాలే విపరీతబుద్ధిః" అనునట్లుగా నీప్రారబ్ధకర్మ మిట్లాఁడించుచున్నది, నేనేమి జేయగలను? శాంభవా! తెలియక

రులుమాని కాలునిసదనంబునకుఁ బ్రాతకావవయ్యెదవుగాని.

(ఇరువురును ఒండొరులవైఁ బాణములఁబ్రయోగించుకొనెదరు.)

అర్జు:- (ఆశ్చర్యముతోఁ దనలో)

ఇదేమి కాలవైపరీత్యమో నేఁడిన్ని నారాచములఁ బ్రయోగించితిఁగాని నీ యెరుకురాయందు వీసమైనఁ గాసిబొందలేదు. కానీ చూతము. మంత్రపూర్వముగా నా దివ్యాస్త్రములఁ బ్రయోగించి చూచెదఁగాక. అయ్యో! అవియును రిత్తబోయెను.

(ఇరువురుఁ గొంతతడవు మల్ల యుద్ధముఁ జేసెదరు.)

బోయ:-అర్జునా!ఆగు మాగుము.నీశౌర్యమునకు మెచ్చితిని. నాస్వరూపముఁ గనుగొనుము.

బోయ శంకరుఁడగును. చెంచెత పార్వతిగను దదితరులు భూతములుగనుఁ బరివర్తనం బొందెదరు.

అర్జు:- (సాశ్చర్యముగా నా మహాదేవునిఁజూచుచు) దేవా! "ధన్యోస్మి-ధన్యోస్మి" యని కన్నులఁ దుడుచుకొను చీ విధముగా స్తవం బొనరించును.)

శ్లో॥ "వందేశంభుముమాపతిం
సురగురుం వందేజగత్కారణం
వందే పన్నగభూషణం
మృగధరం వందే పశూనాంపతిం
వందే సూర్యశశాంక వహ్నినయనం
వందే ముకుందప్రియం
వందే భక్తజనాశ్రయంచ
వరదం వందే శివశంకరం"

హేజగద్గురూ! తండ్రీ! నీవని యెఱుంగక మహాపరాధమొనర్చితిని. క్షమింపుఁడు.

నీవు సామాన్యకిరాతుఁడవనియెంచి నీకాయమును గాయమొనరించితిని. బాకులతోఁ గ్రుచ్చితిని, గాండీవముతో మోఁదితిని, పలువిధముల దూరితిని, పరుషభాషలనాఁడితిని. ఇది యది యననేల యెన్నివిధములనో గాసినొందించితిని, దేవా! నాయపరాధము సైపఁజాలినదిగాదు. ఘోరశిక్షకుఁ బాత్రుఁడను. ఇదిగో నీకు ద్రోహమొనరించిన దాసుఁడు నీపాదములపైఁ వ్రాలి నీవొసఁగు శిక్షకే వేచియున్నాఁడు. (ఈశ్వరుని పాదములపై వ్రాలుచు.

శంక:- వత్సా! లెమ్ము, లెమ్ము. నీభక్తి కపారానందము నొందితిని. నీకడిమి యీ జగజ్జననియగు నీమాతకుఁ జూపింపనెంచియే యీ రీతి నరుదెంచితిని. నేనని తెలియనేరక కిరాతరూపమున నున్నకారణమునఁ గయ్యమునకుఁ డీకొనిన నాతో యుద్ధమొనరించి నీక్షాత్రతేజమును మెఱయించుట యొప్పేయగును గాని తప్పుగాదు; గాన చింతిలకుము. ఫల్గునా! నీ యిచ్చవచ్చిన వరముం బేర్కొనుము.

అర్జు:- దేవా! పరమేశా! భవదీయ కరుణాకలితుండనగు నాకు కోరఁదగిన దొకటి వేరకలదా? ఐనను రాఁబోవు భారతయుద్ధమున నరాతివర్గములఁ దునుమాడ విజయమునొందుటకు దేవర పాశుపతాస్త్రమును బ్రసాదింపఁ బ్రార్థించుచున్నాను.

శంక:- విజయా! సంతోషము, సంతోషము! ఇదిగో గైకొమ్ము.

(పాశుపతాస్త్రమర్జునున కిచ్చును.)

అర్జు:- మహాప్రసాదము. (పాశుపతాస్త్రము వినయముతో నందుకొనును,)

పార్వ:- పార్థా! ఈమహాదేవునితో ముఖాముఖం బోరగల్గిన మహాధీరునెవ్వని నేయు గంబునను నెందునుఁగని వినియెఱుఁగ. వత్సా! జగజ్జేగీయమానమగు భవదద్భుత శక్తిసామర్థ్యంబుల కమందానందకందళిత హృదయారవిందనైతిఁ గాన నీవపేక్షింపకయే నీకొక వరమునీయ వేడుక బొడముచున్నది. సదా నీపు ణీరం బక్షయంబగుఁగాక.

అర్జు:- భగవతి! కాత్యాయినీ! ధన్యుఁడను-ధన్యుఁడను.

పార్వ:- స్వామీ! భవద్దర్శనార్థమై దిక్పాలకు లేతెంచుచున్నారు. చూడుఁడు.

దిక్పాలకులు.- గిరిజా సమేతుఁడవగు నో గంగాధరా! జయము-జయము.

(నమస్కరింతురు.)

శంక:- దిక్పాలకులారా! స్వాగతము.

అర్జు:-దిక్పాలకులారా! నమస్కారశతంబులు.

దిక్పాల:- ధనంజయా! విజయోఽస్తు.

ఇంద్రు:- కుమారా! జగన్నుతమగు నీయపారశౌర్యంబు హా కెంతయు నాశ్చర్యముఁ గొలిపినది. ఇదే వజ్రాయుధముఁ గొనుము.

అర్జు:- తండ్రీ! కృతార్థుఁడనైతి.

వరు:- వత్సా! నాపాశము! నీయనవధికమగు చెలిమిచే ధన్యమగుఁగాక.

అర్జు:- దేవా! అనుగ్రహింపఁ బడితిని.

యము:-వీరోత్తమా! పాండమధ్యమా! నా దండముఁగూడ నీనిరవధికసాన్నిధ్యంబున కువ్విళులూరుచున్నది.

అర్జు:-బృందారకవరేణ్యా! మహాప్రసాదము.

శంక:- విజయా! దేవదత్తమగు దివ్యాస్త్రసంచయమున నీకువిజయము సిద్ధము. మేమేగెదము. నీకు శుభమగుఁగాక.

(అందఱును అంతర్ధాన మొందిరి.)

తెర పడు ను.

ఆంధ్రసోదరీ సమాజమువారి సంక్రాంత్యుత్సవ సందర్భమున (౧౮—౧—౧౯౩౬)
శ్రీశ్రీశ్రీ గద్వాల మహారాజ్ఞియగు ఆదిలక్ష్మీదేవమ్మగారికి
హైద్రాబాదులోని బాలికల ఉన్నత పాఠశాలయందలి
బాలికాసంఘము సమర్పించుకొనిన

# స్వాగత పత్రము.

### స్వాగతము.

సీ॥ ఏయమ్మ సితకీర్తి * యెల్లదిక్కులయందు. మేలి ముత్తెపుఁ దోర * ణాలుగట్టు ;
నేయమ్మ యర్థుల * కిచ్చి పోషించుచో. మొరటుఁకల్పకలత * మూతిముడుచు ;
నేయమ్మ చరితమ్ము * నెలమి విద్వాంసులు. బట్టులై యోఁటోఁటఁ * బాడుచుందు ;
రేయమ్మ సత్కృపా * వీక్షాసరివంతిలో. శ్రీకాంత రాజహం * సయయి దేలు ;
గీ॥ నట్టి గద్వాల సింహాస * నాధిరూఢ, ఆదిలక్ష్మీమహారాజ్ఞి * యైన మీకు
మృదులహృదయాబ్జమకరంద * మధురమైన, స్వాగతంబిదె, మా పాఠ * శాలపేర ॥

### ఆశీస్సు.

సీ॥ గౌతమీ కృష్ణవే * ణీ తుంగభద్రల, పావనాంబువు లుగ్గుఁ * బాలు ద్రావి ;
అఖిల లక్షణయుక్త * యగు విశ్వభారతి, పురిటిపొత్తిళ్ళలోఁ * బొరలనేర్చి ;
ఇతరభాషలపేరి * చతురభాషిణులతోఁ, భవ్యరీతిగఁ జెట్ట * పట్టు పట్టి ;
శ్రీకృష్ణరాయ పృ * థ్వీకాంతు గళసీమ, రమణీయపుష్పహా * రమునువైచి ;
గీ॥ ఆంధ్రసామ్రాజ్య కమ్రసిం * హాసనమున, నధివసించెడి పూజ్యరా * లమ్మలందు
నగ్రతాంబూలమున కర్హ * యగు పురంధ్రి, మాతృభారతి మీకిచ్చు * మంగళములు!

### బాలికల ఉన్నత పాఠశాల.

సీ॥ ఆంధ్రదేశమున కే * కైకసంస్థయటన్న, పేరుప్రఖ్యాతులఁ * బెంపుమీరె ;
విధివిరామము లేక * విద్యార్థినుల కాంధ్ర, భాషాప్రసాదంబు * పంచిపెట్టె ;
నడుముల్ బిగించి ముం * దడుగిడన్, జాతీయ, ధీరభావస్ఫూర్తి * నూరిపోసె ;
నార్యభారతజీవి * తాదర్శములయందుఁ, బ్రియమారఁగా 'తరి * బియతు' చేసె ;
గీ॥ ఈగతి స్వధర్మమును నిర్వ * హించుచున్న, 'భాగ్యపుర' బాలికోన్నత * పాఠశాల
కకట! 'ఎంగిలీ లంఘనా' * లయ్యె! నమ్మ!! ఎట్టులింకనుం దానిఁ బా * లించుకొనెదొ!

### బాలికలు — మాతృభారతి.

మ॥ చదువన్ వ్రాయనెగాక, సాధుకవితా * సంపత్తి నేకాక, చ
క్కఁదనం బుట్టిపడుం–ఝరీ హరికథా * గానాప్తి నేగాక, మే
లొదవన్ నాట్యకళాభిలాషమునఁ గా * కో యమ్మ! అన్నింట నా
స్పదలై పొల్తురు—మాతృభారతియె సా * క్ష్యమ్మిందు—మా బాలికల్ ॥

### కృతజ్ఞత.

గీ॥ ఆంధ్రసోదరీమణులు * దేశాభిమాన, పూరలయి సల్పు నుత్సవ * మ్మునకు నేఁడు

మీర లధ్యక్షపీఠిపై * మెలఁగుటెల్ల, మా యదృష్టము పండిన * చాయగాదె !

# హెచ్చరిక.

శ్రీమతి. కంబె. వేంకటరమణమ్మ.

(ప్రాతవిద్యార్థినీ సంఘము తరఫునఁ జదువఁబడినది.)

సోదరీమణులారా!

మన పాఠశాల స్థాపితమై యెనిమిది వత్సరము లయినది. ముగ్గురు బాలికలచే స్థాపింపబడిన పాఠశాల నేడు దాదాపు రెండు వందల యేబది బాలికలచే శోభిల్లుచున్నది. ఇదియెంతో ఆనందదాయక విషయము. ప్రతి సంవత్సరము బాలికలు ప్రవేశపరీక్షలో పాల్గొనుచున్నారు. జాతి మత భేదంబులు లేక సర్వవర్ణములవారు ఈ పాఠశాలలో చేర్చుకొనబడి పరస్పర సోదరీప్రేమతో ప్రవర్తించుచున్నారు. బడిపాఠములే కాక ప్రథమ చికిత్స, ఇంటియందు రోగికిచేయు ఉపచరణ, చంధస్సు మొదలగు విషయములను గూడ మనకు బోధించు చున్నారు. బాల్యావస్థలోఉన్న మన పాఠశాల యింతటి వృద్ధిలోకి వచ్చినది. దేశనాయకులును, ఆంధ్ర పితామహులని బిరుదాంకితులును ప్రస్తుతము మన ఆంధ్రమహా సభాధ్యక్షులును, మన పాఠశాల స్థాపకులునుఅగు శ్రీయుత మా. హనుమంతరావుగారి యొక్కయు, సర్వభారము వహించి సర్వకాల సర్వావస్థలయందు మన పాఠశాల కార్యరంగమును ఏయడ్డులేక జయప్రదముగా నడుపుచున్నట్టి శ్రీయుత. వ. నరసింహారావుగారి యొక్కయు స్వార్థత్యాగకృషి సాఫల్యముదక్క మఱొండు కాదు. వీరు పడుశ్రమ వర్ణనాతీతము. స్వయముగా ద్రవ్యసహాయము చేయుటయే గాక గొప్పగొప్ప యుద్యోగస్థులను, సంస్థానాధిపతులను, ధనవంతులను తదితరులను ప్రోత్సహించి చందాలు వసూలుచేయుచు ప్రభుత్వమువారి సహాయము లేకయే ఇంతవఱకు వెనుబాటు లేకుండ నడుపుచున్నారు. వీరికి మనమెంతో కృతజ్ఞురాండ్రము. విద్యావతులైన ఉపాధ్యాయినులును,ప్రధానోపాధ్యాయులును, ఉపాధ్యాయులును స్వల్ప వేతనములనే గ్రహించుచు వారి యావచ్ఛక్తిని వ్యయపఱచి మనకు విద్యగరపుచున్నందులకు వారికి కూడ మనమెంతో కృతజ్ఞురాండ్రము.

ఇట్టి విశాలనగరమున స్త్రీలకు మాతృభాషద్వారా విద్యలేని కొరతదీర్చి వీరు సదా మనయొక్క ఔన్నత్యమును గూర్చియే పాటుపడుట మనయొక్క భాగ్యమే. బాలికలకు, గృహిణులకు విద్యగఱపుచు కల్పవృక్షమువలె మన పాఠశాల ఉన్నది. అత్తవారింటికి పంపిన బిడ్డల పుట్టింటికి పిలిచినట్లు మన పాఠశాల స్థాపకులు మిమ్ముల నందఱ విద్యాబుద్ధుల గలుగజేసినట్టి పుట్టినిల్లగు మన పాఠశాలకు రప్పించి నేడు సమావేశమగుట కవకాశము దయచేసినారు. మనము పాఠశాల వదలినను వారి బిడ్డలమైన

మనలను దృష్టియందుంచుకొని మనయొక్క ఉన్నతికై యెన్నో ప్రయత్నములు సల్పుచున్నారు. మనలను దేశాభ్యుదయమునకు దగిన యాదర్శగృహిణులుగను, ఆదర్శమాతలగనుం దయారు చేయవలయునని వారి యుద్దేశము. (ఆశయము.)

ముఖ్యముగా నేటిసమావేశము జరిపిన దెందుకనగా, మనపాఠశాలనుండి మాతృభారతి యను సచిత్ర మాసపత్రిక వెలువడుచున్నది. ఈవిషయము మీకందరికి తెలిసియేయుండును. దీనికి ప్రస్తుతము మనకు ఉపాధ్యాయులుగా నున్న శ్రీయుత. బిదురు వేంకటశేషయ్య బి. ఎ. గారు. సంపాదకులు. దీనికి ఎక్కువగా పాఠశాల విద్యార్థినులగు మనసోదరీమణులే గద్య, పద్యరూపకములుగా వ్యాసములను వ్రాయుచున్నారు. వారేకాకుండ పాఠశాలను వదలుకున్న విద్యార్థినులు కూడ తమ యొక్క భావాలు వెల్లడించుచు భవిష్య విద్యాభివృద్ధి నొందవలయునని మన శ్రేయోభిలాషుల యొక్క యుద్దేశము.

సోదరీమణులారా. ప్రతి పట్టణమందును పలుభాషలందు వార్తాపత్రికలు వెలువడుచున్నవి. మన పట్టణముననో ఆంధ్రులకొరకు ఒక గోలకొండ పత్రికతప్ప వేరులేదు. దీనికి వ్యాసకర్తలందరు ఎక్కువగా పురుషులేకదా! మన భారత దేశమున మొదట స్త్రీలకు విద్యయే యరుదు. అందులో వారిచే వ్రాయబడిన పత్రికలు అసలేలేవు. బ్రిటిషు యిండియాలో గృహలక్ష్మి, భారతి మొదలగు పత్రికలు స్త్రీల చేతనే వ్రాయబడుచున్నవి. మన రాష్ట్రమున కూడ ఈ మాతృభారతిని వెల్లడించి మన పాఠశాల సర్వాహకవర్గమువారు కొంత తీర్చినారు.

ఈ మాతృభారతికి మీరు కూడ (పాఠశాలను వదిలిన విద్యార్థినులు కూడ) వ్యాసములను వ్రాయుచుండ వలయును. మనపూర్వ భారత నారీమణులు ఎన్నెన్నో ఘనకార్యములు చేసినట్లు మనము చదువుచున్నాము. వినుచున్నాము. మనము కూడ వారి సంతతివారమే గదా! వారు గొప్పగొప్ప కార్యములుచేసి మనకు ఆదర్శప్రాయులుగా నున్నప్పుడు మనము స్వల్పమైనవి సుబోధకరముగానున్న ఒకటి రెండు కార్యములైనచేసి వారిధర్మము నిలబెట్టుట మన విధి. నెల 30 దినములకు ఒక వ్యాసము సిద్ధపరచుటంత కష్టదాయకము కాదుగదా! మన కాలమునంత వృథాపుచ్చక మనకు తెలిసిన మంచి విషయములను ఇతరులకు వెల్లడిచేయుచు అన్ని విధముల గూడ మనకు చేతనైనంతవరకు దేశాభ్యుదయమునకు తోడ్పడగల వారముగా సిద్ధపడుటకు ప్రయత్నించుచుండవలయును. మనమట్లు చేయగలిగిన వారమయినప్పుడే మన పాఠశాల పాలకులకు సంతోషదాయకముగానుండి వారి కోర్కెలు నెరవేరినవిగా నుండును. మన విద్యార్థినీ సంఘ పక్షమున వెలువడిన ఈ మాతృభారతి చిరస్థాయిగా నుండునట్లు మీరందరు ప్రయత్నపడవలయునని మిమ్మందరిని ప్రార్థించుచున్నాను.

ప్రతి స్కూలులో గూడ ప్రాత విద్యార్థుల సంఘ సమావేశము జరుగుచుండును. అదేరీతిగా మన పాఠశాలలో గూడ ప్రాత విద్యార్థినీ సంఘసమావేశము అప్పుడప్పుడు తరుచుగా చేయుచుండ వలయునని నామనవి.

# బాలికల ఉన్నతపాఠశాల.

శిరోమణి సి. హెచ్. రంగాచార్యులు [సంస్కృత పండితుఁడు] గారు
రాజాబహదూర్ వేంకటరామారెడ్డి, ఓ. బి. ఇ. గారి జన్మదినోత్సవ సందర్భమున ఉపాధ్యాయసంఘపక్షమున
చదువఁబడిన పద్యములు.

సీ॥ ఏమహనీయుని ♦ యెనలేని దయఁజేసి
పాఠశాలాకస్య ♦ ప్రీథితయయ్యె
ఏపూజ్యు చల్లని ♦ యీక్షణంబునఁజేసి
సిగపువ్వ వాడక ♦ చెలువుగులుకు
ఏధీరుపటుదీక్ష ♦ యిన్నాళ్ళకైనను
ఒకయింటి యిల్లాలి ♦ నొనరఁజేసె
నేకృపాకరుఁడింత ♦ కెక్కుడు శ్రద్ధమై
యీమె సాకెడుదీక్ష ♦ నెలమిఁగనెనొ

గీ॥ రాజబహదూరు వేంకట ♦ రామరెడ్డి
కాయురారోగ్య సంపద ♦ లందఁజేసి
యాంధ్రులందఱి మన్నన ♦ లందుమయ్య
సర్వలోకేశ! జగదీశ ♦ సారసాక్ష!

శ్లో॥ మాన్యోఽ సౌమహనీయకీర్తి సుషమావ్యాప్తా ఖిలాశాతటః
సౌజన్యం ప్రభుతాదయాది సుగుణై ర్భా స్వత్స్వరూపోజ్జ్వలః
అన్యూన ప్రభుదత్త రాజ బహదూర్ విఖ్యాత నామాంకితః
రాజా వేంకటరామ రెడ్డి జయతామాచంద్ర తారం భువి॥

శ్లో॥ స్థానేజన్మదినోత్సవం సుఃసుహతాం యత్కర్తుమద్యోద్యతాః
ధ్యాయంధ్యాయ మనిందితం ప్రవిమలంతత్కీర్తి గాథాశతం
తత్పంథాన మనువ్రజంత విమలాంకుర్వన్తి స్వాంపద్ధతిం
వర్షంవర్ష మతీవభద్రనివహై రస్యాస్తు జన్మోత్సవః

శ్లో॥ ఆయుర్భాగ్యం వితరతుసదా దేవదేవోమురారిః
నిత్యప్రత్యూహాంభవతు మహతామర్థసిద్ధిః పరేభ్యః
కర్పూరాభా కలయతు భువంనిస్తులా కీర్తికాన్తా
రాజాసోఽసౌజయతు బహదూర్ వేంకటోరామరెడ్డిః॥

# సందేశము.

శ్రీయుత. ఆదిరాజు వీరభద్రరావుగారు. [ఆంధ్రపండితులు, చాదర్ ఘాటు హైస్కూలు]

మనమే ప్రస్తుతపు టాంధ్రులము. మన కు గొడ్డు గోదలు కలవు; మనకుఁ బాడిపంటలు కలవు.

ఆంధ్రి భాషాప్రపంచము నుద్ధరించిన మహనీయులను గుఱించి మన మెఱుఁగుదుము. ఆంధ్ర పతాకములను బలుపరదేశములందు నెల కొల్పిన సామ్రాజ్యములను గూర్చి మనకుఁ దెలియును. తల్లికోటను గూర్చిన కథాంశము లు మన స్మృతి పథమునుండి జాఱిపోలేదు. ఆంధ్రనగరమని ప్రఖ్యాతిఁ జెందిన ఓరుగల్లు పట్టణమునెడ భక్తివిశ్వాసములు కలవు.

మన చుట్టును మహావిశాలమైన ప్రదేశ మున్నది; సారవంతమగు భూమి యున్నది. ఆనందదాయకములగు ఉద్యానవనము లున్నవి; పురాతన దేవాలయ గోపురములున్నవి; మహా నగరముల సందడి మన కర్ణతాడితమగు చు న్నది; పచ్చనిచేలు, చిగురుటాకులు, వివిధ వర్ణముల పుష్పములు, తమ మర్మరధ్వనిచే మ నలను జోకొట్టుచున్నది. మన యెదుట అద్భు తము, పరిశ్రమ, శృంగారము, శక్తి, తాండవ మాడుచున్నవి. ఇవన్నియు మనకుఁ జెంది నవే! ఇచ్చటనే మన గృహము కలదు.

ఏతద్విషయిక వర్ణనాంశములే ఆంధ్రి సాహిత్యము. భాషయో మన కర్మమగునది; ఆచారములో మన కలవాటయినవి; రంగమో స్వదేశము; విషయములో మనకు సంబంధించి నవి; కావున నాంధ్రులకు నాంధ్రి సాహిత్యమే పవిత్రమైనది.

విదేశ సాహిత్య పఠనము వలనఁగలుగు ఫలము విదేశ యాత్రవలనఁ గలుగు ఫలము వంటిది. అది బాల్యమునందు గొప్పవైనట్టివి యు, వింతవైనట్టివియు, నగు మహద్విషయము లను గూర్చి గాఢమగు చిత్త సంస్కారమును గావించును. కాని యిట్టిదానితోఁడనే మనకు మోక్షము లేదు. ఆ విషయములు మన కలవా టయిన జీవితమును బోలవు; అవి మనలను ప్రేమపాశములచే బంధింపవు; అవి విదేశజు లగు బాటసారులవలెనే చిత్ర విచిత్రముగనుండి మనదృష్టి నాకర్షించినను, అవి మన కుటుంబ ములకు సంబంధించినవి కావు; అవి మన విధి కృత్యములను గూర్చియు, మన యాత్మీయు లను గూర్చియు బోధింపవు; అవి మన యా త్మోత్తేజమును గల్గింపవు.

స్వదేశ సాహిత్యము నెఱుఁగక, విదేశ సాహిత్యము నెఱుఁగువారు తనదని చెప్పుకొ నుటకు దేశములేని దేశపు ద్రిమ్మరులవలెను, శతాధిక పరిచయస్థులనుగల్గి, మిత్రులులేని మానవులవలెను, నుందురు.

ఏసాహిత్యపఠనమైనను, మన జీవితమున కనుకూలముగనుండి, దానిఁ బ్రకాశవంతముగను, ఒకార్ణముగను, అభివృద్ధి కరముగను జేయు శేముషీ గుణమును మనకుఁ బ్రసాదింపవలయును. అదియే మనకు శాంతినిచ్చునది; అదియే మనకుఁ బ్రశాంత సమయములందనుభవమునకు వచ్చునది; అదియే సంకట సమయములందుఁ దోడ్పడునది.

ప్రాచీనమగు దానిని మనము భజించి భవిష్యత్తును గూర్చి మనమా శాదృక్కులతో వీక్షించు చుందుముగాక! మన గ్రంథములను మనము చదువుదుముగాక! మనలను మనము తెలిసికొందుము గాక!!



# దైవకృప.

శ్రీమతి. వై. అమృతమ్మ.

కామాక్షి:—

గీ॥ చిన్ని పుత్రులు తిండికై ♦ చేటుపడుచు
నుండి; రేమిసేయుదు? నయ్య ♦ యో! జపమ్ము
తపములం బ్రొద్దుపుచ్చెదఁ ♦ దనయుల గతి
దలఁప కుండిన, నేరీతిఁ ♦ దాళుకొందు?

గీ॥ ఎన్ని కష్టములకును స ♦ హించి సుతుల
బాధఁ దీర్పఁగ యత్నమ్ము ♦ పాడిగాదె?
అన్నమును బెట్టి బాలుర ♦ హర్షమొంద
జేయవలెఁగాన, భిక్షుకుఁ ♦ బోయిరందు॥

గీ॥ ఎపుడు భిక్షుకుఁజనుట య ♦ నిష్టమేని
హితుఁడయిన కృష్ణు దగ్గఱ ♦ కేగి, మనల
వేపుకొనితిను దారిద్ర్య ♦ పీడ మాన్పఁ
బ్రార్థనముసేయఁ గాఁదగుఁ ♦ బ్రాణనాథ!

కుచేలుఁడు:— గీ॥ సరియని కుచేలుఁ డంతట ♦ సఖునిఁ జూడఁ
బయనమాయెను దారిద్ర్య ♦ భయమెడల్ప
గోచి చెఱఁగున ముక్కిన ♦ కోరువోవు
నటుకులం గట్టుకొని, ముందు ♦ కడుగువెట్టె॥

శ్రీకృష్ణుఁడు:— సీ॥ ఆవచ్చు సఖునికి ♦ నర్ఘ్యపాద్యము లిచ్చి
సరగునఁ గొనిపోయి ♦ సత్కరించె
బీదవాఁడని మది ♦ భేదమొనర్పక
యధిక గౌరవమున ♦ నాదరించె
రుక్మిణీ సహితుఁడై ♦ రుక్మాంబరధరుండు
సేవలఁ గావించెఁ ♦ జెలువు మిగిలి
ముక్కిన యటుకులన్ ♦ మురిపెమ్ము తోడుత
భక్షించెఁ బిడికిటం బట్టికొన్ని
గీ॥ చిన్ననాఁటి ముచ్చటలెల్ల ♦ చెప్పుకొనుచు
మఱచిపోయిన సంగతుల్ ♦ మఱల మదికిఁ
దెచ్చుకొనుచుఁ బ్రమోదంబు ♦ హెచ్చ నెదను
గడపె సఖుతోడఁ గాలంబు ♦ గడియగాఁగ॥

కుచేలుఁడు:— గీ॥ అకట! జీవనాధారము ♦ నడుగ నటకుఁ
బోయి, తత్సేవలన్ మున్గి ♦ పోయి, యడుగ
నోరురాదయ్యె; బిల్లలన్ ♦ గూడి చెలియ
యెట్టులుండెనో? ఏమియు ♦ నెఱుక పడదు॥

వామాక్షి:— గీ॥ అటుల మదిలోని చింతతో ♦ నరుగుదెంచి
యొకటఁ గన్గొనె రమ్యమై ♦ యొప్పు మేడ
భర్త కెదురుగ వామాక్షి ♦ పఱచి, నవ్వు
మొగముతో వచ్చి యీరీతి ♦ మొనసి పల్కె॥
గీ॥ వింతనొక్కటి చెప్పెద ♦ విశదముగను
వినుఁడు చల్లని యుల్లంబు ♦ వేడ్కఁ గదుర
మీరు వెళ్లిన వెంట నీ ♦ మేడవచ్చె
నదియు నాశ్చర్యమును గొల్పు ♦ నట్టులయ్యె॥
గీ॥ కనులు మూఁతవడియె వచ్చు ♦ కాలమందు
జాలసేపుగ మదియందు ♦ జడుపు దోఁచెఁ
బోయె దారిద్ర్యదేవత ♦ పుడమి విడిచి
వచ్చె సిరి సంపదలును, దై ♦ వకృపఁ జేసి॥

# చిన్ననాఁటి చెలిమి

శ్రీమతి. వై. కౌసల్యాదేవి.

ద్రోణుఁడు:— సీ॥ ద్వారపాలక! నీవు ♦ దర్శింప రాజును
వచ్చితినని చెప్పఁ ♦ బొలుపడుము
'ఎవ్వరు వచ్చినా? ♦ రెక్కడి వా?'రన్నఁ
జిననాఁటి చెలిమికాఁ ♦ డనుచుఁ బల్కు
'మెక్కడి స్నేహితుం? ♦ డెద్ది పే'రని యన్న
నను ద్రోణాచార్యుఁ ♦ డనుచు నృపున
కింతకు జ్ఞప్తికి ♦ నరుదేరకున్న నే
నరుదెంచి చెప్పెద ♦ నంచుఁ బల్కు
గీ॥ మిప్పుడే పొమ్ము; చక్కఁగా ♦ నే నుడివిన
యన్ని వివరమ్ములను దెల్పు ♦ మాదరమున
ద్రుపదునిం జూచి కొన్నాళ్లు ♦ దొరలి పోయె
నతఁడు రాజయ్యె; నేనిట్టు ♦ లయితిఁ గంటె?

... ... ... ...

ద్రుపదుఁడు:—ఉ॥ ఎవ్వఁడొ నేనెఱుంగఁ జూఁడి! ♦ ఇచ్చటి కెందుల కేగుదెంచెనో?
త్రవ్వెదు నే మసత్యముల? ♦ రానని చెప్పుచుఁ బంపివేయుఁడీ!
క్రొవ్వునఁ బోవకున్నఁ బడ ♦ గుద్దుఁడు, తన్నుఁడు, వెంటఁదాకుఁడీ!
యవ్వసుధామరుంట! ఆ ♦ హా! చెలికాఁడఁట! నాకుఁ, జూతురే!

... ... ... ...

ద్రోణుడు:— గీ॥ అర్జునా! నాకు శిష్యుఁడ ♦ వైన నీవు
చని ద్రుపదుఁబట్టి నాసమ ♦ క్షమున నుంప
వలయు; నప్పుడుగాని కో ♦ పంబు విడదు
ఎఱుఁగ వతఁడెన్నిపాట్ల పా ♦ ల్పఱచె నన్ను?

... ... ... ...

కం॥ మీరెవరు? ద్రుపదనృపులా?
ఈరీతిగ బద్ధులగుట ♦ యెపుడో? మేమె
వ్వారమొ జ్ఞప్తికి వచ్చెనె?
అరయఁ జిననాఁటి చెలిమి ♦ [illegible]? అహాహా!

# భారతీయ వధువు.

శ్రీమతి. కె. లక్ష్మీబాయి.

వనజ:- అన్నయ్యా! వదినె వాలకముఁ జూచిన గుండె గుభేలుమనుచున్నది సుమా!

సుధాకరరావు:- అదేమి వనజా! అట్లనెదవు?

సురస:- అన్నయ్యా! అట్లనకున్న నింకేమనమందువు?

సుధా:- సురసా! కోపము వలదమ్మా! విషయముఁ దెలియక నాహృదయము నిలువునీరగుచున్నది.

సురస:- కోపము లేదు — తాపము లేదన్నయ్యా! "రోటిలోఁ దలదూర్చి రోకటి పోటునకు వెఱవనేల?" యనునట్లున్నది మన బ్రతుకు.

వనజ:- చేసికొనిన దనుభవింపక నంతల పొంతలఁ బోవునా?

సుధా:- విషయము దేల్చక సన్నిటుః లెంతకాల ముడికించెదవమ్మా!

వనజ:- ఇంత యుబలాటమేటి కన్నయ్యా! తినబోవుచు రుచులడుగనేల? విదియ నాఁడగపడని చంద్రుఁడు తదియనాఁ డగుపడకుండునా?

సుధా:- అబ్బ! తలప్రాణము తోకకు వచ్చుచున్నది. "పిల్లికి చెలగాటము ఎలుకకు ప్రాణసంకటము"ను నట్లున్నది. అదేమి బ్రహ్మ రహస్యమో చెప్పినఁ జప్పు[illegible] జనుఁడు. నన్ను మాత్రము విసికింప వలదు.

సురస:- అన్నయ్యా! నీవు తలఁచినపుడే తాతపెండ్లి యందువు. కొంచ మోర్చుకొనఁ జాలవు. ఐన విను. నీకేదో చిన్నప్పుడే యింత ముడిబెట్టి అమ్మ నాయన తమ విధిని నెరవేర్చుకొన్న వారమైతి మనిపించుకొని వారిత్రోవ వారు చూచుకొన్నారు కదా! ఇఁకనీవు చదువు ధోరణిలోఁబడి యత్తవారింటి మొగమే జూడవైతివి. సరి. ఆవిడగూడ యేదో చదువుచున్నది. ఆ పూనా విశ్వవిద్యాలయమునకుఁ జెందినదై యెట్లో గ్రాడ్యుయేటనిపించుకొన్నది గదా! సరేనను కొంటిమి.

వనజ:- అక్కయ్యా! అన్నయ్య మనకాదినము ఇప్పుడేదో శ్రావణ మాసము మంచి దినములని మీవదినె నిచట దిగవిడచి పోదుమని హైదరాబాదునుండి జాబు వచ్చినదని చెప్పినప్పుడు మనమెంత మురిసితిమే. అప్పటి మన సంతోషమునకు మేరయుండునా; ఆదినము నాకుఁ గన్నుపొడుచు కొన్నను నిద్రరాలేదు. ఆమె దేహవర్ణము. ఆలేత గులాబి కాంతుల నీను దేహముపైన నూడారంగు జపాను సిల్కుచీరె, అదేమాదిరి పొట్టిచేతుల జాకెట్టు, చెవులకు లోలకులు, చేతులకు సన్నని బంగారు గాజులు చక్కగా దువ్వి పొరవుగానల్లి [illegible] పైకి [illegible]ంచిన జడయు, సబ్బుతో

బాగుగా రుద్దుకొని పౌడరు వేసి ముసిముసి నగవులు తాండవమాడు మొగము, ఎఱ్ఱని పెదవులును, కన్నులకు కండ్లజోడును, చేతికి వాచియు నామె యెంతో అందముగా మోహనదేవతవలె నుండుననుకొంటిని.

సురస:- (కిలకిలనవ్వుచు) అంబుజా! దైవమునట్లే నీ యూహములోఁ బిడుగునై చెఁగదా!

సుధా:- అంబుజా! ముగిసినదా నీభారతము? పానములో పుడకలాగున మధ్య నీవూడి పడితి వేమి? నాగుండెలలో పాలో విషమోకాని-సురసా............

సురస:- సరే! ఆమె రేపోమాపో వచ్చుననఁగనే మదరాసునకు వెళ్లి తిరిగి యిప్పుడే కదా నీవింటి గడపఁద్రొక్కుట. అన్నయ్యా! ఇంతకును నీవామెనుఁ జూచినది జ్ఞాపకమున్నదా? ఆమెపేరుఁ దెలియునా?

సుధా:- ఎప్పుడును నేనామెనుఁ జూచినది... పెండ్లియప్పుడే కదా! అప్పుడైనను నేనామెను సరిగఁ జూడలేదు. పేరా......పేరు వసుమతి.

సురస:- ఔను! ఆమె రూపమేమో అందమైనదేగాని ఆవేషములు, వర్తన మాత్రము విపరీతము. పాపెట తలమధ్య, తల నున్నగా దువ్వుట. ఇక వస్త్రములు ఖాదీ కదా గోనె గుడ్డలవలె. ఇదిగాక ఆమె మైపూఁతలకు, పూజలకు నూనె పసుపు కుంకుమ సవాసేరు పట్టును. దొడ్డిలో బ్రహ్మాండముగా తులసికోట. దానిలో తులసి మొక్కయును, దానికిఁ బ్రతిదినము ధూప దీప నైవేద్యములు. ఇంకొకటి గౌరీవ్రతమట. పసుపు ముద్దనుఁబెట్టి ఉదయమెంత చలియున్నను జల్లనీళ్లతో స్నానముజేసి దానినిపూజించును. కాఫీత్రాగదు. పైగా బదునైదు దినముల కొకసారి ఏకాదశియని యుపవాసముఁ జేయును. అదెంత గట్టిశరీరమో మంచి నీరైనను నోటఁబోయదు. చదువుకొనినదై ఇంట దాసిదానివలె పనులెట్లుఁ జేతునా యని యెంతమాత్రము సిగ్గు బిడియములు లేవు కదా. పంటవాఁడు స్నానముఁజేయఁడట. శుభ్రముగా నుండఁడట. అందుచే దానే వండుకొనును. ఇవన్నియుఁ జూచిన నాకెట్లో యుండును. ఇఁక మధ్యాహ్నముఁ జూడబోతే జుంయిజుంయి మని రాట్నము. ఏకులబుట్ట దగ్గఱఁ బెట్టుకొని యో లేక రామాయణముతోనో లేక భగవద్గీతపారాయణము జేసికొనుచునో కూర్చుండును. ఇట్టివియెన్నో. తినబోవుచు రుచియడుగ నేల? నీకే బోధపడగలవు ఇవన్నియు, ఇది యొక్కటిమాత్రి మన్నయ్యా! ఎప్పుడు నేర్చికొన్నదోకాని వివిధ భోజ్యముల మిక్కిలి రుచికరముగాఁ జేయును. ఇంటిముందు పేడనీళ్లుఁ జల్లుట అసహ్య మనిపించునుగాని యిల్లు మాత్రము వారమున కొకసారి బూజు దులిపించి శుభ్రముగా నుంచుట మిక్కిలి యానంద మనిపించును. వచ్చిన వారము దినములకే పనివాండ్రందరామె స్వాధీనమై యామె నెంతో గౌరవించుచు నామె లక్ష్మీదేవి యపరావతారమని మురియుచుందురు. ఇరుగు పొరుగువారుఁ గూడ నట్లే గౌరవింతురు. అన్నయ్యా! నీవేమైననను. ఆమెకంటకసహితమైన గులాబి పుష్పమువలె దోచుచున్నది. ఇంత చక్కదనముండియు నింత విద్యావతియయ్యు నీమెకీ ఛాందసగుణములా! అందువలననే బ్రహ్మయందసమంజసబుద్ధి యనియు, నింత విశాలప్రపంచమున నాతనికిఁ జేనడు గుడియైన లేదనియు ముసలమ్మలందురు.

సురస:- అన్నయ్యా! వదిన వచ్చిన మేమెంతో యానందముగ నుందుమనుకొంటిమి. కాని "ప్రథమ కబళేమక్షికాపాతః" అనునట్లు మా కోరికలన్నియు వృధామైనవి. ఆమెకు మాకు పశ్చిమ పూర్వార్ధ గోళముల కున్నంత వ్యత్యాసమున్నది. ఒకనాఁడైనను క్లబ్బునకురాదు. పేకాట యాడదు. ఆమె గొడవ యామెది. మాగొడవ మాది.

సుధా:- అమ్మయ్య...బ్రతికితిని వనజా' వదినె వాలకముజూడ గుండె గుభేలుమనుచున్న దన్నయ్యా యని నీవు జెప్పినపుడు నా ప్రాణములు నిలువున నెగసి పోయినట్లైనవి. దీనికేమిలే! ఇది వైదిక ఛాందసము. క్రమముగా మాన్పవచ్చు. ఇంతకీ యామెకాంగ్లము రాదా? ఎప్పుడును దానింజదువదా?

సురస:- ఆమె బి. ఏ. ఆంగ్లమెందులకు రాదు? వచ్చును. బాగుగా వ్రాయునుఁ జదువును. అప్పుడప్పుడు న్యూస్ పేపర్సు తెప్పించి జదువును.

సుధా:- ఇప్పుడామె యెక్కడ నున్నది?

సురస:- వంటయింట్లో నుండవచ్చు. పిలుచుకొని వచ్చెదను.

(వసుమతి నగుమొగముతోఁ బ్రవేశించి వినయముతో భర్తకునమస్కరించును.)

సుధా:- మంచిది.

సురస:- (ఒక యాసనముఁ జూపుచు) వదినా! కూర్చుండుము.

వసుమతి:- ఎందుకులే,

సుధా:- వసుమతీ! నీవెంతవఱకుఁ జదివితివి?

వసు:- బి. ఏ. వఱకండీ!

సుధా:- ఏకాలేజీలో?

వసు:- హైద్రాబాద్ సుల్తాన్ బజారులోని బాలికల ఉన్నత పాఠశాలయందుఁ బ్రవేశ పరీక్షకుఁ జదివితిని. ఆ పాఠశాలయందే ప్రత్యేకముగ నేర్పాటుఁ జేసిన కళాశాల తరగతుల యందుఁ జదివితిని.

సుధా:- ఆపాఠశాల యేవిశ్వ విద్యాలయమునకు సంబంధించినది?

వసు:- కార్వేగారి పూనా విశ్వవిద్యాలయమునకు సంబంధించినది.

సుధా:- ఊహూ...అయితే, వసుమతీ! ఆంగ్లము మొదలగు విద్యలఁ జక్కఁగఁ జదివిన దానవుఁ గదా! విద్యావిహీనలగు పల్లెటూరి పడుచులవలె నీయీవేషమేమి, యీ పూజలేమి, యీ పసుపు పూఁతలేమి, యీముతుకవస్త్రములేమి?

వసు:- క్షమింపుఁడు. ఆంగ్లము జదివిననేమి? చదువకున్న నేమి? వాని సత్యసౌందర్యానందములఁ బరిగ్రహింపనిఁ జదువు లెల్లను "పేరుగొప్ప యూరుదిబ్బ" యనునట్లుండును, ఆంగ్లము 'జదువుకొనియునీ పూజలేల' యనుచుంటిరా? ఆంగ్లము జదువుకొని నందువలననే స్వమతాచారముల విడువక ఆంగ్లేయు లేటీరున వారి మతధర్మముల ననుసరించి ప్రతిఆదివారము చర్చికివెల్లి నిర్వహించుచున్నారో అట్లే నేనును మంచిపనినేఁ జేయుచున్నాను. వారు వృద్ధులు మొదలు బాలురుకూడ తప్పక గుడికి పోవుచుందురు. ఇది మన హిందూజాతికిఁ దక్కువ. పూర్వము నుండియునుండెడి యాచారములను "శ్రవణం-కీర్తనం-విష్ణోస్స్మరణం-పాదసేవనం-అర్చనం-వందనం-దాస్యం-సఖ్యం-ఆత్మనివేదనం" అనునవి వదలి ప్రవర్తించు టాకగొప్పయా! భక్తి యోగమునకివి యంగములు.

మనస్సు కరగిన భక్తి; లేకున్న జ్ఞానము. పరిపూర్ణముగానిది భక్తి; పరిపూర్ణమైనది జ్ఞానము. మొదట సాకారపూజఁ జేయనిది పరిపూర్ణత్వము లభింపదు. పరిపూర్ణత్వము లేనిది జ్ఞానము గాదు. గాన అథమమునం దక్షరాభ్యాసము మొదలుకొని క్రమముగా నభ్యసింపని విద్య యెట్లు పరిపూర్ణత్వము నందదో, నట్లే మానవ నామంబు సార్థకముఁ జేయనట్టి జ్ఞానము లేని యెడల జ్ఞానములేని వస్తువులకు మనకు భేదమేమి? ప్రకృతి యొక్క సత్యసౌందర్యానందంబుల నందు టే, వాని గ్రహించి ఆనందమును బొందుటయే భక్తి. పవిత్ర ప్రేమతత్వమే భక్తి. ఆదర్శ ప్రాయలును మృతజీవలునగు సావిత్రి, సీత మున్నగు సాధ్వీమణులు భక్తి చేతనేకదా ముక్తి వడసిరి! ఇప్పటి మన హిందువులు వారి వేషములనే ననుకరింపుచున్నారు గాని వారివలె నియమముతోఁ గూడిన భక్తి నవలంబింపలేక పోవుచున్నారు. ఇఁక పల్లెటూరి పడుచులవలె నీవేషమేమని యంటిరా? పట్టణములకు జన్మస్థానములే పల్లెటూళ్లు. పల్లెటూళ్లు కానిది పట్టణములయ్యెనా? ఆంగ్లభాష నభ్యసించినంత మాత్రమున స్వదేశమతాచారముల మంటఁద్రోయవలెనని లేదు. ఈ వెఱ్ఱి వేషములవల్ల నెందఱు పేదలై అవస్థపడుచుండుట లేదు? ఎందఱి యారోగ్యము పాడగుట లేదు? ఎవరి వేషభాషలకుఁ బ్రాకులాడి బరవళ్లు ద్రొక్కుచుంటిమో వారే మన కాదర్శ ప్రాయులు; వారే దేశముల కేగినను ఏవిద్యల నభ్యసించినను తమ వేషభాషలఁ దిరస్కరించుచుండిరా?

ఇఁక ముతుక వస్త్రమేల ధరించుచుంటి వంటిరా? సర్వదేశములకు నాయకమణియై రత్నగర్భమని పేరొంది, అన్ని శాస్త్రములకును, అన్ని కళలకును పుట్టినిల్లై మహదైశ్వర్యంబునం దులదూగుచున్న భారతదేశ మిప్పుడు విదేశీయవస్త్ర వస్తు వ్యామోహితంబై కోట్ల కొలఁది ద్రవ్యమును విదేశముల పాలొనరించుచు, పూచిక పుల్లయైననుఁ జేసికొనని సోమరితనమును వహించుచు, నొక చిన్న సూది మొదలు గొప్ప యంత్రముల వఱకన్నిటికిని విదేశములపై నాధారపడి కడుపున కన్నమును, కట్టు వస్త్రములు లేనంత గర్భదరిద్రావస్థ నందుచున్నట్టి సమయముననైనను దేశహితైషులగు నాయకుల సూచన ప్రకారము స్వదేశ వస్త్రముల ధరించు పాటి త్యాగమైనఁ జేయఁగూడదా? బట్ట ముతకగానున్నంత మాత్రమునఁ బరిత్యజింప వచ్చునా? బిడ్డ కురూపియైన తల్లి భరింపక విడనాడునా? లేక ఇతరుల బిడ్డలఁ జేరదీయునా? ఒక కారణాంతరమున విదేశ వస్త్రములు మన దేశము రాకున్న మన గతియేమి? పరదేశముల వస్త్రముల కుపయోగించు ద్రవ్యము స్వదేశీయ సోదరులకు జీవనోపాధి కుపయోగింప రాదా?

ఇఁకఁ బసుపు పూఁత లేమి యనియా? ఈ పసుపే లేకున్న సధవకును విధవకును భేదమేమి? పసుపే ముత్తైదువల కలంకారము. మఱియు నిది చర్మవ్యాధులకు మందు.

సురస:- వదినా! కాటుక నేల నుంచుకొన వలయును?

వసు:- కాటుక పురంధ్రుల కొక విధమైన యలంకారము. మఱియు కంటియందలి పొరలు మొదలుగాగల వ్యాధుల నివారించి చలువఁ జేయును.

అంబుజ:- వదినా! మరి పాపట వంక రగవేల యుండరాదు?

వసు:- అట్లుండుటలో నా కందము కన బడలేదు. ''లోకోభిన్నరుచిః'' అన్నట్లు అంద ము భగవానుఁ డుంచవలెగాని వీనితో వచ్చు నా? పోవునా? అన్ని అవయవములకన్న మెద డు మానవునకు ముఖ్యమైనది గదా! అట్టి కా రణభూతమై యాట పట్టగు మెదడు నభివృద్ధి జేసికొని దానిం జలువగ నుంచుకొనుటకు నియ మించిన తైలముల వదలి నానావిధముల నూ నెలఁ బూయుటెందులకు?

సురస:- వదినా! ఇంకొకమాట. ఇంద ఱు పనివాండ్రుండగ, నీవు చదివినదానవయ్యు ను, దాసి దానివలె ఇంటి పనులు వంటనేలఁ జేయవలెను?

వసు:- ఓహో! ఇంటిపనులుఁ జక్క పె ట్టుకొనినంత మాత్రమున నిల్లాలు దాసియగు నా? ముమ్మారు భుజించి కూర్చుండు టెటుగ వలయు! ఇట్టి భోజన మెట్లొంట బట్టవలయును? ఇంటి పనులు పనివాండ్రకొప్పఁజెప్పి డాక్టరుకు అమిత ధనమునుఁ బోయుటకన్నను, క్లబ్బులకు బరుగెత్తుటకన్ననుఁ జక్కగా గృహకృత్యముల నిర్వర్తించుకొనుట లక్షణముగను, ఉత్సాహ ముగను, ఆరోగ్య కరముగనుండును. చదువు కొనియు గృహకృత్యముల నిర్వర్తించు స్త్రీయే కదా లోకమున కాదర్శపాత్రియము. సతి యొకతరి సర్వ ప్రపంచమును దాని నియమము లను ఆజ్ఞయందుంచగల రాణి; ఒకపరి సర్వ ప్రపంచమును సేవించు సేవకురాలు.

ఇందులకు:—

శ్లో॥ ''కార్యేషుదాసీ కరణేషు మంత్రీ
రూపేచలక్ష్మీ, క్షమయా ధరిత్రీ
భోజ్యేషు మాతా శయనేచ రంభా
షట్కర్మ యుక్తా, కులధర్మ పత్నీ॥''

యను శ్లోకమే తార్కాణము. అన్న మెంత పవిత్రమైనది. పరబ్రహ్మ స్వరూపమగు అన్నము వలన నెందఱి యతిథులఁ బూజింప వచ్చు? నెందఱి యతిథులఁ దృప్తి నొందింప వచ్చును.

సురస:- రామాయణము, హిందువుల కాదర్శమగు గ్రంథరాజము. రాముని పితృ వాక్య పరిపాలనమును, ఏకపత్నీ వ్రతము ను, సత్యసంధత్వమును, శరణాగత రక్షణము, ధర్మ పరాయణత్వమును, లక్ష్మణుని సోదర భక్తియు, స్వార్థ త్యాగమును, సీతాదేవి పాతి వ్రత్యమును, నిశ్చల భక్తియు, ఓర్పును; హను మంతుని బ్రహ్మచర్యము స్వామిభక్తి, యంద ఱికిని అనుసరణీయములు. ఇంక గీత, అదియొక ముఖ్యమైన వేదాంత గ్రంథము. ఆధ్యాత్మిక తత్త్వము, జీవాత్మ పరమాత్మలయొక్క రహస్య తత్త్వములును, బోధించునది. సర్వ వేదములు ను, వేదాంతములును, ధర్మములన్నియును, అం దిమిడియున్నవి. ఐహికాముష్మిక ప్రదమగురమ రహస్య బోధకమైనది మన జీవిత సముద్రము నుండి తరింపఁ జేయునట్టినావ. ఆబాల గోపాల మునకుఁబఠనీయమగు గ్రంథ రాజము. స్త్రీలపా లిటి కల్పవృక్షము.

సుధా:- వసూ! సెభాష్. వేలకువేలు దిగమ్రింగి యన్యదేశములకేగి గొప్ప గొప్ప డిగ్రీలను సంపాదించిన బ్యారిష్టరు నామధేయు లను సహితము దివిటీముందఱ వెలుగు తిల్లికవలె గోచరింపఁజేయుచున్నట్లున్నదే నీసహేతుక వా దము. నేనేమో యనుకొంటిని. బాలికల ఉన్నత పాఠశాల యాంధ్రలోకమున కింతటి యాదర్శ

ప్రాయలగు విదుషీమణుల నొసగలదని తలంప లేదు.

వసు:- కాదు కాదు. అట్లనుకొనుట పొరఁబాటు. బాలికల ఉన్నత పాఠశాల నిజా మాంధ్రదేశంబున కంతకును ఏకైకసంస్థ. ఉచితముగ ఆదర్శప్రాయలగు విదుషీమణుల నాంధ్రలోకమున కొసంగుటయే సంస్థయొక్క ముఖ్యోద్దేశము.

సురస:- అంబుజ! వదినె! మాకు తెలియక నీయెడలఁ జెడ్డయభిప్రాయము కలిగి యుంటిమి. క్షమింపుము.

సుధా:- అంబుజ! సురసా! మీ వివాహాంతరము మీమీ యత్తవారిండ్లకు బోయి నపుడు మీ వదినెవలె మెలఁగ నేర్చుకొనుడు.

వసుమతీ! మీ పాఠశాల యింకను అభివృద్ధిబొంది నీయట్టి సాధ్వీమణుల నింకెందఱినో సిద్ధముఁజేయు గాక!





## వేడుకోలు.

శ్రీమతి. పా. సావిత్రి.

సీ॥ ప్రహ్లాదుఁ డాదిగాఁ ♦ బరగు భక్తుల నెల్ల
కరుణ యొప్పఁగ నెట్లు ♦ గాచితీవు?
అసురలఁగడఁ ద్రోంచి ♦ యానిర్జరుల నెల్ల
ప్రేమతో నెట్లు పా ♦ లించితీవు?
భక్తాగ్రగణ్యయై ♦ పరగుచు నుండెడి
సకుబాయి నెటు ప్రోవఁ ♦ జాలితీవు?
సాధ్వీలలామ యన్ ♦ సత్కీర్తిఁ గైకొన్న
సావిత్రి నెట్లేలి ♦ జరగితీవు?

గీ॥ అట్లె నన్నును గాపాఁడు ♦ మయ్య, నేఁడు
శరణుఁ జొచ్చినవారి ర ♦ క్షణము తగును;
నీదు భజనమె కోరుదు ♦ నిక్కవముగఁ
గాన దయఁజూడుమయ్య. యో ♦ కమలనయన!

గీ॥ అన్ని దిశలను వెలయుచు ♦ నున్నవాని
ఇందిరా సహితుండయి ♦ యెసఁగువాని
భక్తవత్సలుఁడయి యున్న ♦ వాని, నేను
భక్తితోమదిఁ దలఁతును ♦ రక్తిమెఱయ॥



# వీడ్కోలుపు.

శ్రీయుత. బిదురు వేంకట శేషయ్య బి.ఏ.

శా॥ శ్రీశుండెప్డుఁ దోడువేదమయి భా ♦ షింపం "తథాస్తంచుఁ" దా
రాశీభూతసమస్తసద్గుణ గణా ♦ లంకార లీలాస్పద
ప్రాశస్త్యంబున నొప్పు మీ కమల భా ♦ వస్ఫూర్తిమైనిచ్చునా
యాశీర్వాదబలంబునంగలుగుఁ గా ♦ కైశ్వర్య దీర్ఘాయువుల్॥

గీ॥ మూఁడు వత్సరములనుండి ♦ మొక్కవోని
భక్తిచేమమ్ము మెప్పించి ♦ బడికిఁ జాల
వాసివన్నెలఁ దెచ్చిన ♦ వారు మీరు
అనుఁగుఁజెల్లెండ్రు మీరంద ♦ అవనిమాకు॥

గీ॥ "దేశమే నేను, నేనె నా ♦ దేశమనుచు
గర్వపడఁ గల్గునట్టి నిష్క ♦ ల్మషులకు
సోదరీప్రేమ నెమ్మదిఁ ♦ బాదుకొనుట
చెడుగె? మా మొగమ్మునఁ బొ్రిద్దు ♦ పొడుచుటగునె?

చ॥ సకలగుణాబ్ధి కణ్వముని ♦ సత్తముఁ డాత్మజ వీడుకోల్పుచో
నకమకపోయి దుఃఖమున ♦ క్రమ్మన్పడి పంపఁగ లేకపంపెనే!
అకలుష మైన మర్త్యహృద ♦ యమ్ముగలట్టిరుఁ డెవ్వఁడో? యఁ బెం
పకపుటనుంగు కూర్ములకుఁ ♦ బద్ధుఁడుకాక మహీతలమ్మునన్॥

గు రు వు.

గీ॥ తనహృదయ మిచ్చి విద్యార్థి ♦ జనులహృదయ
మెఱిఁగి, యాదర్శచర్యఁ బో ♦ ధింపకున్న
గురువ నెడిపేరి యర్హత ♦ కుదురుకొనునె?
చదువుసంధ్యల దాపాఁడు ♦ జనుని కెపుడు?

ప్ర శం స.

మ॥ బడికెల్లేనభివృద్ధి గూర్ప నితరో ♦ పాధ్యాయులంగూడి యే
యడుగున్వైచిన నట్టి తాళమునె వే ♦ యంగల్గి యన్నింట నా
కెడమైపోవక ప్రక్కనిల్చితిరి; అ ♦ ట్లేకాక వ్యర్థైనచో
నడవింగాచిన వెన్నెలయ్యెడివి కా ♦ వానాప్రయత్నావళుల్?

కం॥ మిముఁజూచి తక్కు పిల్లలు
సమరసతను నేర్చి కీర్తి ♦ శాలినులై రు
ద్యమమున; వాంధ్రుడునుజేతో
విమలత మీ పేరునిల్పఁ ♦ బెట్టుదురిఁక పై॥

ఉ ద్బో ధ ము.

ఉ॥ ఇల్లలుకంగఁ బండువగు ♦ నే? చదువొక్కటి కొంతనేర్చి, ఓ!
గల్లునగంతు వెట్టుటకుఁ ♦ గాదుసుఁడీ! ఇట నేర్చుకొన్నవి
ద్యోల్లసనమ్ము జీవనపు ♦ టోలమునందుపయుక్తరీతిగా
వెళ్లఁగఁదీసి బాగుపడు ♦ వీల్గలిగించు కొనుండు, బాలికల్॥

సీ॥ మైత్రేయి-గార్గ్యాది ♦ మహిళామణుల బ్రహ్మ
వాదనార్భటి బీడు ♦ వాఱలేదు
పతిసేవకయి మహా ♦ పదలన్ వరించిన
సీతవృత్తము చెక్కు ♦ చెదరలేదు

సత్యవ్రతస్ఫూర్తి ♦ జయశీల యగుచంద్ర
మతి యశశ్చంద్రికల్ ♦ మాయలేదు
నరకునితోఁ బోరు ♦ సడపఁగల్గిన సత్య
భామ విక్రమకళ ♦ పాయలేదు

గీ॥ భారతస్త్రీలలో జ్వల ♦ త్ప్రాజ్యపూజ్య
దివ్యతేజస్సు కాసంత ♦ తీయలేదు
ప్రాంతమెఱుఁగుల వ్యామోహ ♦ ములకు లోఁగి
నివురుగప్పిన రీతిఁ గ ♦ న్పించుఁ గాక!

సీ॥ సకలసౌభాగ్య శ ♦ శ్వదోభాగ్యతకుఁ జను
స్థానమౌ "ఆంధ్ర ♦ దేశమ్ము" నాది;
అన్యదుర్లభమైన ♦ యాత్మ తేజఃపూత
సర్వాశగు "ఆంధ్ర ♦ జాతి" నాది;
కులుకుటొయ్యారి ట ♦ క్కుల నడల్ దులకించు
భావుకంబగు "ఆంధ్ర ♦ భాష" నాది;
వెలమీఱు నాదర్శముల ♦ నేర్పునీ "యాంధ్ర
బాలికాజన ♦ పాఠశాల" నాది;

గీ॥ వేషమునఁగూడఁ బ్రత్యేక ♦ విధినిఁ గల్గి
లీలమెఱసెడి "ఆంధ్ర బా ♦ లికను" నేను;
అనుచు గర్వముకాని గ ♦ ర్వాతిశయము
తోడ నుప్పొంగి పోవుట ♦ పాడిమీకుఁ॥

మ॥ చదువుల్ నేర్చిన యింతులెల్లరది హె ♦ చ్చై యేమి? స్వేచ్ఛాశయా
స్పదలై దేశకుటుంబరక్షణములం ♦ బ్రాల్మాలి, కట్టా! విచా
ర్యదశన్ మ్రిగ్గుట చూడఁబోమె? మఱిమీ ♦ ర ప్పొకిలుల్ పోకళ
ర్మదవృత్తమ్మున మాతృభారతి శిరో ♦ రత్నాభలై పొల్చుఁడీ!

గీ॥ ధన్యభారతజన ♦ సంప్రదాయములను
చెత్తగానెంచి దవులఁ ద్య ♦ జింపఁ బోక
వానితో నాధునిక శాస్త్ర ♦ వైఖరులను
గలిపి జీవితములకుఁ గ్రొం ♦ జెలువ మిండు!

సీ॥ మెడలోనఁ దాళి గ ♦ స్వడినదే తడవుగా
అచ్చుపచ్చలటంచు ♦ నాత్ర పడక
అత్తగారింటిలో ♦ నడుగుఁ బెట్టినదాదిఁ
గొంప గోడెలటంచు ♦ గోడు వడక
మోహాంబునిధిలోన ♦ ముంచి తేలఁగనీని
పిల్ల మేకలతోనె ♦ చెల్లిపోక
అంతియే పరమార్థ ♦ మనుచు గేవలమును
వంట పెట్టులమీఁద ♦ వ్రాలిపోక

గీ॥ మిమ్ములను మీ పవిత్ర ధ ♦ ర్మమ్ము నెఱిఁగి
మీ వెనుక దేశముండిన ♦ మేలు దెలిసి
బంధురోత్సాహమునఁ గుటుం ♦ బములదిద్దు
కొనుఁడు సేవానురక్తి మి ♦ క్కుటము గాఁగ॥

ఉ॥ ప్రార్థనశీలమొందఁడె మన ♦ భారత భూమికిఁ బ్రాణభూత; మే
ప్రార్థన జేసికొండనుచుఁ ♦ బల్కితినో యది వేళఁదప్పక
భ్యర్థనమీఱఁ జేసికొనుఁ ♦ డమ్మ! అదే పదివేలు మీకు; వి
ద్యార్థినులార! మిమ్ముఁగని ♦ యందఱమున్ మదిగర్వ మొందఁగన్॥

ఉపసంహారము.

మ॥ చెలులన్ జుట్టములన్ స్వకీయులను వా ♦ సిన్మీఱఁ గన్గొంచుఁ; బె
ద్దలమన్నించుచు; దైవభావమున నా ♦ త్మస్వామి సేవించుచున్
గలనేన్ మామకబోధలన్ మఱవ కే ♦ కష్టాదులం ధీరలై
తలపూవాడక యుండుఁడమ్మ! ఇదె యు ♦ ద్ఘాటింతు వేయార్లకున్॥

మ॥ చదువుల్ చెప్పెడి వేళలం దలుక పె ♦ ల్చన్ దోఁచి కోపించి మీ
యెద తచ్ఛ్రద్ధఘటించు పొంటె నపుడే ♦ మేమంటిమో? ఎంత మీ
హృదయంబుల్ వ్యథ జెందెనో యెఱుఁగ రా ♦ దిప్పట్లనేన్ మమ్ము స
మ్మదలీలన్ క్షమియింపుఁ డమ్మ! సదయా ♦ త్మల్ మీరు నైజమ్ముగన్॥



శ్రీమతి నడింపల్లి సుందరమ్మగారు



ప్రథమాంధ్రమహిళా సభాధ్యక్షురాలు.

శ్రీమతి టి. వరలక్ష్మమ్మగారు



ద్వితీయాంధ్ర మహిళా సభాధ్యక్షురాలు.

శ్రీమతి యల్లాప్రగడ సీతాకుమారిగారు



తృతీయాంధ్రమహిళా సభాధ్యక్షురాలు.

శ్రీమతి మాడపాటి మాణిక్యమ్మగారు



చతుర్థాంధ్ర మహిళా సభాధ్యక్షురాలు.

# ఆశీర్వాదః

శిరోమణి సి. హెచ్. రంగాచార్యులు [సంస్కృత పండితుఁడు] గారు

శ్లో॥ జీయాదియం సాక్షరముక్త వర్ణా
సంబోధయంతీ సుచరిత్ర మానాం
ఆకల్ప మేషోన్నత బాలికానాం
ప్రియం దధానా భువి మాతృభారతీ॥

శ్లో॥ పాశ్చాత్యానామనుకృతి గుణా ద్భగ్న సౌభాగ్య భాజాం
పౌరంధ్రీణాం పరమవిమలం పూర్వజానాం చరిత్రం
శిక్షత్యేషా పరిచితతయా స్వాంధ్రవాణ్యైవ నిత్యం
జీయా దస్మిన్ మహతి నగరే సాదరం వీక్ష్యమాణా॥

శ్లో॥ జాతే, జాతాభవసి భవనే భాగ్యనామ్ని ప్రసిద్ధే
తాతశ్చాసీద్గుణఖని రసౌ శేష యార్యోహి విద్వాన్
గద్వాల్రాజ్ఞాహిమసమ దృశా నారసింహాది భిశ్చ
స్వాప్తైర్యుక్తా జగతి బహు సమా ఏధతాం మంగళం తే॥

శ్లో॥ మాతర్భారతి! దేహ్యనూన విభవం తోష్టూయ్యమానా సదా
త్వత్ప్రేమ్ణా ప్రభవామ మంజుళతమే! త్వద్గీతగాథాశతైః
లభ్యం జ్ఞాన మనిందితే బహుల మిత్యాశుశ్రుమ వర్ణాధికే
త్వాంచైవం బహు భాషణైర్బహుమతే విద్యార్థి కన్యాజనైః॥



## మాతృభారతినిఁ గూర్చిన

# పండితాభిప్రాయములు.

౧

“మాతృభారతి”ని చదువుట కవకాశ మిచ్చినందులకు శ్రీమాన్ బిదురు వేంకటశేషయ్య బి. ఏ. గారికి గడుండడు కృతజ్ఞుఁడను. బాలికా పాఠశాల విద్యార్థినులు ఇంత చక్కని వ్యాసములు వ్రాయసమర్థులని నేనిదివఱకు కనుగొని యుండలేను. ఇందలి కొన్ని వ్యాసము లుపాధ్యాయులు మఱి యితరులచే వ్రాయబడియున్నను దాదాదునలువది వ్యాసములు బాలికా పాఠశాల విద్యార్థినులచే మత, సాంఘిక విషయములనే కాక పండిత పామరుల కనుకూలమగునటుల కల్పనాకథలు మొదలగు విషయములను గద్య పద్య రూపకముగా వ్రాయఁబడినవి.

నిజాంరాష్ట్ర ఆంధ్రబాలికలకు విద్యనేర్పుటకు సాధారణముగా దలితండ్రులు అంగీకరింపని కాలము దాటిపోవుచున్న సమయమెఱిఁగియే పాఠశాల పరిపాలక వర్గము శిక్షణక్రమమును ఆచార్య కర్వేగారి పద్ధతి ననుసరించి వారల మాతృభాషలో విద్యాభ్యాసమున కనుకూలములఁ గల్పించుట చాలా ప్రశంసనీయము.

విద్య యేభాషలోనయిన నేమి? అది బుద్ధివికాసమును కలిగించునదయినఁ జాలును. మాతృభాషను వీడి నితరభాషల నభ్యసించ వలయుననిన మయిమన్న తల్లి ప్రేమకు పాత్రులగుట యెంత కష్టమో అంతకష్టమున కోర్వవలసి వచ్చును.

మాతృభాగతిలోని వ్యాసములను జదివినకొలది ముందు జదువవలయునని ఉత్సాహమే జనించినదికాని వేసట కలుగలేదు. బాలికలయిననేమి? బాలురయిననేమి? నేర్పిన నేర్వనివారలెవరు! యీ పుస్తకము పైపుటయందు ముద్రించిన బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు రచించిన,

“చదువన్నేర్తురు పూరుషుల్ బలెనె శాస్త్రంబుల్ పఠింపించుచో” నను పద్యము యిందుకు నిదర్శనముగా నున్నది.

ఇప్పుడు బాలికలయినను ముందు భార్యలయి భర్తలకు సహాయులు, మాతలయి శిశువుల రక్షకురాండ్రయి శిక్షకులయి మెలంగువారలు విద్యావిహీనులయి వుండుట భారతదేశ భావిబాగ్యాభివృద్ధిని అధోగతి పాలుచేయు వారలగుటగాదా?

ఈచెడు తొలఁగవలయుననిన ప్రతిభార్య ప్రతిమాత విద్యావంతురాలయి వుండవల యును. హిందూదేశము ఇతర ప్రాంతముల స్త్రీవిద్య ప్రోత్సహింప బడుచున్నను నిజాము రాష్ట్రములోను అందు నిజాంరాష్ట్రాంధ్ర దేశములో కొంత కాలమునకు ముందు అట్టి ప్రోత్సాహము లేకుండ వుండెను. ఇప్పుడు పరిపాలక వర్గమువారు చేయుచున్న కృషి నిర్విఘ్నముగా సాగుచుండెనేని కొలది కాలములోనె ప్రతి కుటింబినియు విద్యావంతురాలయి యుండఁగలదని నమ్ముచున్నాను.

బాలికలువ్రాయు వ్యాసములకుఁదగు ప్రోత్సాహముండునేని ముందుముందు అభివృద్ధి పొంది హైదాబాదనుండి యీ బాలికలచే "భారతి" "గృహలక్ష్మి" అటువంటి మాస పత్రిక బయలు వెడలుట కాటంకముండదు. వీరు స్థాపించు మాస లేక పక్షపత్రిక యేరూప ములోను కూడ పైపత్రికలకు తీసిపోజాలదని నమ్ముచున్నాను.

పింగిలి వెంకటరామారెడ్డి

౯ మెహర్ ౧౩౪౫ ఫసలి.

---

౨

సుల్తాన్ బజాగులోని బాలికోన్నత పాఠశాలయే జాతీయతా చిహ్నముగా నున్నది. అది పూర్తిగా నిచ్చటి ప్రజల సమాదరణము మీదనే నడచు చున్నదనుట దాని జాతీయతకు మఱింత శోభదెచ్చు చున్నది. ఇంక ఈసంస్థ పేదదియనుటలో ఆశ్చర్యములేదు కదా! పేదతన ములోఁ గూడ పండుగజేసికొన్నట్లు, ఈసంస్థ తరఫున మాతృభారతి వెలువడు చున్నది. ఇది శ్రీ బిదురు వేంకటశేషయ్యగారి యుత్సాహము, భాషాభిమానమునకు చిహ్నము, ఇందు శ్రీ శేషాద్రి రమణకవులు, శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారు మొదలయిన పెద్దల రచనలు కూడ నుండుటచే దీని ప్రాశస్త్యము వేంకటశేషయ్యగారి యున్నతాశయములును చెప్పఁబడ కుండఁగనే విశదమగు చున్నది. దీని మొదటి సంచికయు, అచ్చగుచున్న రెండవ సంచికలోని కొన్ని వ్యాసములను నేను చూచితిని. ఈ ప్రయత్నము నాకు చాల యానందము కలిగించినది. ఈ పాఠశాలయు, ఈ పత్రికయు సర్వదా శారదా కటాక్షములకు పాత్రము లగుగాక!

విశ్వనాథ సత్యనారాయణ,

భాగ్యనగరము.

14—8—1936.

౩

"బాలికలు మాతృభాషలో నున్నత విద్యను బడయుట వలన విద్యా ప్రణాళిక సహజమగు సౌలభ్య మలవడునని విశ్వసింప నవకాశము గల్గుచున్నది. వాఙ్మయసేవా ఫలితముగా నిచటి బాలికలు వ్రాయు వ్యాసములు మాతృభారతియందుఁ జూచి మిగుల నానందించితిని; బాలికలయెడఁ గనవచ్చు రచనాకౌశలమును గూడ గుర్తింప గల్గితిని."

దూపాటి వేంకట రమణాచార్యులు.

15—2—1936.

---

౪

శ్రీ సుల్తానుబజారు నందలి బాలికల ఉన్నత పాఠశాలా పక్షమున వెల్వడుచున్న "మాతృభారతి" యను మాసపత్రికను నేను చాలాకాలమునుండి చూచుచున్నాను. ద్రవ్యాభావముచే ప్రతి మాసమును ముద్రింపించుటకు వీలులేక పోవుట కడుశోచనీయము. ఇప్పుడు తెనుగున వెలువడుచున్న యేయల్ప సంఖ్యాకులగు 'భారతి' 'గృహలక్ష్మి' మొదలగు పత్రికలు తప్ప తదితర పత్రికలకంటె నిది బాగుగ నున్నదని చెప్పుట సత్యదూరముకాదు. అందును విద్యార్థినులగు బాలికలు తమ వ్యాసములచే దీనిని వెలయించుచుండుట దీని విలువను హెచ్చించుచున్నది. కొన్నికొన్ని యిందలి వ్యాసము లతివిద్యావంతులకు కూడ సిగ్గు కలిగించు చున్నవని చెప్పుటకు సాహసించు చున్నాను. శ్రీ బిదురు వేంకటశేషయ్యగారు దీని నిర్వహణ కార్యమునందు చేయుశ్రిమకు వందనీయులు. ఆంధ్రలోక మిట్టి పత్రికను 'లిఖిత పత్రిక'గా నుంచుటకు లజ్జింపవలసి యున్నది. ఈ పత్రిక చిరాయురున్నతులతో వర్ధిల్లుగాత మని దేవుని ప్రార్థించు చున్నాను.

నైజాంకాలేజీ,
హైదారాబాదు (దక్కన్.)
15—3—35.

ఇట్లు,
కురుగంటి సీతారామయ్య.

---

౫

బాలికల ఉన్నత పాఠశాల యందలి విద్యార్థినీసంఘము పక్షమున వెలువడిన "మాతృభారతి'' సంపుటము జదివితిని. తాము స్వయముగ చక్కని పద్యములును, వ్యాసములను వ్రాయుటయేగాక, పాఠశాల విద్యార్థినులను ప్రోత్సహించి వివిధవిషయములపై మంచి మంచి గద్యపద్యవ్యాసములను వ్రాయించిన బిదురు వేంకట శేషయ్యగారు ప్రశంసనీయులు.

విషయబాహుళ్యమునందును, రచనాపద్ధతులందును, సంచిక కూర్పు తీర్పునందును, "మాతృభారతి'' ఇతర కళాశాలాపత్రికల కెందును దీసిపోకుండనున్నది. మీదు మిక్కిలి బాలికలచే నడపబడుచుండుటచే నిది మఱియు బ్రశంసాపాత్రము.

ఇల్లిందల సీతారామరావు,

బి. ఏ., ఎం. ఎస్సి.

లెక్చరరు, ఉస్మానియా విశ్వవిద్యాలయము.

---

౬

బాలికల ఉన్నత పాఠశాలలో బాలికలచే నిర్వహింపఁబడుచున్న మాతృభారతీ పత్రిక నిజాంరాష్ట్రమునందలి స్త్రీల విద్యావిజయమునకుఁ బతాక.

బీజమున మహావృక్షమువలె నిందలి గద్యపద్యవ్యాసముల మహావిషయము లిమిడి యున్నవి.

ఈ బాలికల కవితాలతలు బోధకుల దోహదమునఁ జక్కఁగా మొగ్గదొడిగి కనువిందు గొలుపుచున్నవి. అవి దండగా గ్రుచ్చఁబడుటచే నాంధ్రసరస్వతికిఁ జక్కని కంఠహారమబ్బెను.

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి,

SECUNDERABAD, (DN.) 18-8-1936.

Proficient in Oriental Learning,

TELUGU PANDIT. MAHBOOB COLLEGE.



# శ్రీరాజాబహదూర్ వేంకటరామారెడ్డి ఓ.బి.ఇ. గారికి సన్మాన పత్రము.

శ్రీవారి జన్మదినమహోత్సవ సందర్భమున (౨౦-౮-౧౯౩౬) బాలికల ఉన్నత పాఠశాల ప్రాఁతవిద్యార్థినీ సంఘము సమర్పించుకొనినది.

మహాశయా!

నేడు సుదినము. లోక కల్యాణార్థమై మహాత్ములుదయించుచుందురు. క్షణభంగురంబులగు జీవితములను కొందఱే యాదర్శవంతములుగఁ జేయుదురు. అట్టి యాదర్శజీవుల పుట్టినదినములుపండుగలు. నేఁడు మాకుపండుగ. మీ పుత్రికలు జేసికొను పండుగ కాతిథ్యము స్వీకరించినందుఃకు వందనములు.

ఉదార చరితా!

విద్యాహీనమై జడమైయున్న స్త్రీలోకముంజూచి కనికరించిన మహాయశోవిభాసితులచే స్థాపింపఁ బడినట్టియు, మాతృభాషా ద్వారా యున్నతవిద్య గఱపుటయం దఖిలాంధ్రదేశమునకు మార్గదర్శినియై యేటేట నెందఱనో యుత్తమగృహిణులఁజేసి దేశమున కర్పించుచున్న ఈ పాఠశాల కధ్యక్షత వహించి సర్వవిధముల స్త్రీవిద్యఁ బ్రోత్సహించు మీ యుదారచరిత మెంతయు శ్లాఘ్యము.

కార్యదీక్షాదక్షా!

నానాఁటికి మీ యవ్యాజదయవలననే పెరుగుచున్న పాఠశాల విద్యార్థినీసంఖ్యచే స్థలసంకోచ మనుభవించుట తప్పని సరియగుచుండగా సజ్జనులఁ బ్రోత్సహించి, పలుకుబడి నుపయోగించి పాఠశాలకు దివ్యభవననిర్మాణమునకై ౨౫,౦౦౦ రూ. వెలగల భూదానము జేయించి, మఱియంత ధనవ్యయమున దివ్యభవనము గట్టింప దీక్షవహించిన దక్షుఁడవు.

పరోపకార పారీణా!

నేఁడాంధ్రవనియందుఁ దలజూపు ప్రతిసత్కార్యము ప్రత్యక్షముననో, పరోక్షముననో మీ చేయూత నొందకుండనుండలేదనిన అతిశయోక్తి కానేరదు. పఠనాలయములు, పాఠనాలయములు, వసతి గృహములు, ప్రార్థనా మందిరము లన్నియు మీ సహాయ మపేక్షించుననియే. వెలిత్రి నేని యీవి, విసువులేని యుపకారము.

పరిపాలనాధురీణా!

నగరరక్షా ప్రధానపదవిఁ బోలు. ఉన్నతస్థానములంకరించి సమాజ కార్యనిర్వహణము జేసి ప్రభుత్వము నలంకరించి, పూజనీయమగు రాజాబహదూర్, ఓ. బి ఇ. బిరుదము నంది యాంధ్రుల కపారకీర్తి గడించి పెట్టిన ప్రధానాంధ్రుఁడవు. నిన్నుగన్న యాంధ్రావని వీరమాత, నీసోదరాంధ్రులు ధన్యులు.

మాన్యవరా!

గత ఎనిమిది సంవత్సరములనుండి ఉన్నత విద్యాలాభమును బడసిన విద్యార్థినులందఱు ఒకచోఁజేరి తను పాఠశాలకుఁ దగు సహాయము జేసి యద్దానందామింకను బడయుడగిన యుపకృతి బడయునుద్దేశముతో మా ప్రాతఃవిద్యార్థినీసంఘ మేర్పడినది. తమబోటి ధన్యజీవుల జన్మదినమహోత్సవము ప్రప్రథమమున జేయం జాలు భాగ్యమును మాసంఘమున కొనగూర్చిన భగవంతున కభివందనములు. తమ జీవిత చరిత్రను గూడ గ్రంథరూపమున వెలువరించి, యాంధ్రుల కర్పించి ధన్యము గావలెనని ఈ సంఘముద్దేశించి యున్నది. ఈపవిత్రోద్దేశము నెరవేర్ప సర్వేశుని వేడుచున్నారము.

స్త్రీ విద్యాభిమానీ!

పూర్వమువలెనే ముందును మీస్వర్ణహస్తచ్ఛాయలో మా పాఠశాలాకన్య సుపోషితమై, దివ్యభవనముఁ దన సహజకలకంఠమున మీ యశోగీతికలఁ బాడుగాత మనియు, స్త్రీ విద్యాభిమానులును, దేశహితైక పరులును ఉదారచరితులును అగు తమకు సంపూర్ణ పురుషాయుస్సు నొసంగి, ఇట్టి జన్మదినోత్సవముల నెన్నిటినో జేయగల భాగ్యము మాకొసంగ భగవంతుని వేడుచున్నారము.

| | |
|---|---|
| ప్రాతఃవిద్యార్థినీ సంఘము, బాలికల ఉన్నతపాఠశాల. ౨౦-3-3౬. | ఇట్లువిన్నవించు, ప్రాఁత విద్యార్థినీసంఘ సభ్యురాండ్రు. |



# త మా షా లు.

ప్రాణము.

"నాకు నాస్నేహితులఁ జూచినంతనే నా పంచప్రాణములు వచ్చినట్లుండును."

"నాకు రావు"

"ఎందుకు రావు?"

"నాప్రాణములు పోలేదుగనుక."

జాతకములు.

"అయ్యా! ఇంత అసహ్యముగా నున్నదేమండి మీవీథి?"

"మా మునిసిపాలిటీవారి జాతకములు మారినవి."

—ఇందిర.

"అరే రామా! నీకెందుకురా యింత గూని ఉన్నది?"

"గోపాల్:- ఎవరికండీ? నాకా? అబ్బే! మరెందుకు లేదు. నేను వంగి చాల చదువుట వల్ల అట్లయిందండీ."

—మరిసీ.

# శ్రీ శ్రీ శ్రీ జటప్రోలు సంస్థానాధీశ్వరి

శ్రీయుత. బిదురు వేంకట శేషయ్య బి.ఏ.

సీ॥ "ఈ నాపరిజల సౌఖ్య ♦ మే నాదు సౌఖ్యమాఁ
బెక్కోటి?'' కని పొంగు ♦ ప్రేమరేఖ
సన్మార్గమును దప్పి ♦ చరియించు వారన్న
మండిపాటొందు స ♦ మర్షరేఖ
"నామాతృదేశంబు ♦ నవసిపోయెడి!'' నంచుఁ
జాల తపించు వి ♦ చారరేఖ
"స్త్రీ సేవ సన్ను మిం ♦ చెడివార లుండరా
దిల''యుంచు యత్నించు ♦ నీర్ష్యరేఖ

గీ॥ పెనచి మొత్తముగా నిందరి ♦ ధనువు గట్టి
శ్రీ జటప్రోలుపై వింత ♦ చెలువు గొల్ప
నిమ్మహారాజ్ఞి పరిపాల ♦ నమ్మునందుఁ
బ్రజలు భజియింతురి సౌఖ్యాను ♦ భావగరిమ॥



# శ్రీ రాజా రాజేశ్వర రాయలు

(దోమకొండ సంస్థానాధీశులు)



శ్రీమతి. వ. ఇందిర.

సీ॥ ఎవ్వాని శుభకీర్తి • యెల్ల దేశమునందు
కొనియాడఁ బడుచుండుఁ • గూర్మి మీఱ
ఎవ్వాని ముఖసీమ • నెలమి సరస్వతి
కైవసమయి నృత్య • కలన నెఱపు
ఎవ్వాని కృపచేత • నెట్టి యర్థియుఁ గాని
వ్యర్థుఁడై పోవఁడే • భంగినైన
ఎవ్వాని పుట్టుక • నెలమి నాంధ్రజనాళి
అభ్యుదయంబున • కయి రహించు

గీ॥ పాత్రిజ్యరాజ్యాను పాలన • ప్రథితకీర్తి
రాజచంద్ర రాజేశ్వర • రాయ విభుఁడు
మఱవఁ దగనట్టి సేవమై • మహిత మగుట
మఱవ కుండును గాక! మా • పాఠశాల॥



# వా ర్తలు.

## ౧. బహుమతి ప్రదానోత్సవము.

౨౨-౬-౧౯౩౫ నాఁడు సాయంకాలము నాలుగు గంటలకు బాలికల ఉన్నత పాఠశాలకు సంబంధించిన బహుమతి ప్రదానోత్సవము రెడ్డి విద్యార్థి వసతి గృహమున జరుపఁబడినది. శ్రీశ్రీశ్రీ గద్వాల మహారాజ్ఞిగారి పెద్దకుమార్తెయగు శ్రీమతి. క. వరలక్ష్మమ్మగారు సభకు అధ్యక్షత వహించిరి. మనోహరమైన కార్యక్రమము జరుపఁబడిన తర్వాత, బాలికలకు బహుమతులతోఁబాటు మిఠాయి గూడఁ బంచిపెట్టఁ బడినది.

## ౨. మాతృభారతీ జయంత్యుత్సవము.

౧-౭-౧౯౩౫ నాఁడును, ఆమఱునాఁడును మాతృభారతి పేర జయంత్యుత్సవము జరుపఁ బడినది. సభకధ్యక్షులు శ్రీరాజాబహద్దరు వేంకటరామారెడ్డిగారు. వారి కార్యనిర్వాహణమున సభ చాల జయప్రదముగా జరిగినది. అప్పుడు రామదాసు నాటకము (కొన్ని రంగములు) ప్రదర్శింపఁ బడుటయేగాక, శ్రీమతి. నే. భారతీరత్నాకరాంబయను బాలికచే "సాత్రాజితీ విజయము" హరికథగా గానము చేయఁబడినది. ఇంత చిన్న బాలిక ఇంత ప్రజాకర్షముగా హరికథ చెప్పుట మన హైద్రాబాదు నగరమున ఇదియే మొదటిసారియని సభ్యులు హృదయ పూర్వకముగా హర్షించిరి. కొందఱు బాలికలకు శ్రీ అధ్యక్షులచేఁ గొన్ని బహుమతు లియ్యఁబడినవి.

## ౩. శ్రావణ పూర్ణిమా మహోత్సవము.

౧౪-౮-౧౯౩౫ నాడు సాయంకాలము శ్రీ రాజాబహద్దర్ వేంకటరామారెడ్డిగారి అధ్యక్షత క్రింద యీ మహోత్సవము జరిగినది. ప్రజామహనీయుల కోరిక పైని మరల రామదాసు నాటకము, సాత్రాజితీ విజయము హరికథయును ప్రదర్శింపఁ బడినవి. శ్రీయుత. బొజ్జం నరసింహులుగారు కబీరు పాత్రమును ధరించిన బాలికకు వెండి పతకము బహుమతి యిచ్చిరి.

## ౪. దాదాభాయి నౌరోజీ జయంతి,

౯-౯-౧౯౩౫ సాయంకాలము పాఠశాలలోనే శ్రీమతి. కుర్షీదుగారి అధ్యక్షత క్రింద పై యుత్సవము జరుపఁబడినది. శ్రీయుత. రాజాబహాదురు వేంకటరామరెడ్డి, బొజ్జా నరసింహులుగార్లచే పూర్వము వాగ్దానమొనర్పఁబడిన రజత పతకములు బాలికల కధ్యక్షురాలిచే అందఁజేయఁ బడెను. శ్రీమతి. కుర్షీదుగారు పాఠశాలా గ్రంథాలయమునకు గ్రంథదానమును గూడఁ జేసిరి.

## ౫. గీతాజయంత్యుత్సవము.

బాలికా సంఘపక్షమున మార్గశిర శు॥ ౧౩ నాడు గీతాజయంతి శ్రీయుత. జి. రామకృష్ణారెడ్డిగారి యాజమాన్యమునక్రింద రెండు దినములు జరిగినది. మొదటి దినము ఆటలును, రెండవ దినము సాయంత్రము జయంతియు నైనవి. అధ్యక్షులు పాఠశాల కొరకు ౧౦౦ రూపాయలు విరాళముగా నొసగుటకు వాగ్దానము చేసిరి. బాలికలు హృదయంగమముగా పాండవోద్యోగము నందలి కొన్ని రంగములను ప్రదర్శించిరి. గీతాపరీక్ష శ్రీయుత. కల. విశ్వనాథముగారిచేఁ గావింపఁజడినది. గీతా పరీక్షలో నుత్తీర్ణలయిన బాలికలకును, ఆటల పోటీలలో గెల్చిన బాలికలకును, శ్రీకృష్ణ పాత్రము ధరించిన బాలికకును బహుమతు లియ్యఁబడినవి.

## ౬. సంక్రాంత్యుత్సవము.

ఆంధ్ర సోదరీ సమాజము తరపున శ్రీ గద్వాల రాణీగారి అధ్యక్షత క్రింద పైయుత్సవము రెడ్డిబోర్డింగులో నిర్వహింపఁ బడినది. బాలికల ఉన్నత పాఠశాల బాలికలు అందు పాల్గొనిరి. మరల పెద్దల కోరికపై శ్రీమతి. భారతిచే సాత్రాజితీయను హరికథయు, శ్రీమతి. వ. ఇందిరాదేవిచే వినోదరూపముగ అష్టావధానమును జరుపఁబడినవి. మహారాజ్ఞి మహానందము నొంది కథకురాలికి రు|| ౨౫-౦-౦ లు బహుమతిగా నిచ్చిరి. అష్టావధానముచే వినోదింపఁజేసిన శ్రీమతి. వ. ఇందిరకు బంగారు పతకము నిత్తునని వాగ్దానము చేసిరి. పాఠశాలలోని విద్యార్థినీ సంఘమువారు శ్రీరాజ్ఞి గారికి స్వాగత పత్రిము సమర్పించుకొనిరి.

## ౭. ప్రాంతవిద్యార్థినీసంఘ ప్రథమ సమావేశము.

శ్రీమతి. విమలా మేల్కొటీగారి అధ్యక్షతక్రిఁద ౩౧-౧-౧౯౩౬ నాడు పాఠశాలలోఁ బ్రాంత విద్యార్థినులు ప్రథమముగ సమావేశపయి, తమ కర్తవ్యమును నిర్ణయించుకొనిరి. అప్పుడు శ్రీయుత. ఆదిరాజు వీరభద్రరావుగారు అమూల్యమగు ఉపదేశము చేసిరి, ఈ విషయమునఁ గార్యదర్శినియగు శ్రీమతి. కంటె వేంకట రమణమ్మ కృషి ప్రశంసనీయము.

## ౮. రా. బ. వేంకటరామారెడ్డిగారి జన్మదినోత్సవము.

౨౦-౩-౩౬ నాడు ప్రాంతఁ విద్యార్థినీ సంఘపక్షమున శ్రీయుత. వేంకటరామారెడ్డిగారి జన్మదినోత్సవము జరిగినది. పెద్దలు చాలమంది దయచేసియుండిరి. ఉపాధ్యాయ సంఘపక్షమున శ్రీయుతులపై శ్రీమాన్ రంగాచార్యులు (వ్యాకరణ శిరోమణి) గారు శ్లోకములను పఠించిరి. శ్రీమతి. కె. మణి అను బాలిక రాజాబహదురుగారి ఛాయాచిత్రమును గీసి వారికి సమర్పించినది. శ్రీవారి సేవ పెక్కువిధములఁ బ్రశంసింపఁ బడినది. శ్రీవారు భారతి వ్రాసిన భారతీ నక్షత్రమాల, నిర్మల యను చిన్న కావ్యములను, శ్రీమతి. ఇందిర వ్రాసిన ఘోషయాత్ర అచ్చొత్తించెదమనిరి.

## ౯. డాక్టరు ఇజ్రియలుగారికి వీడ్కోలుపు.

ప్రథమ చికిత్సా పాఠములను అతిశ్రద్ధతో బోధించి కృతకృత్యులగు డాక్టరు ఇజ్రియలుగారు పాఠశాలాపక్షమున కృతజ్ఞతా పూర్వకముగా వీడ్కోలుపు ౨౩-౩-౩౬ నాడు జరుపఁబడినది. ఆ సందర్భమున ఉపహారవిందు గూడ ఏర్పాటు చేయఁబడినది. డాక్టరుగారి కృషిని జాల ప్రశంసింపఁ బడినది.

## ౧౦. శ్రీరామ జయంత్యుత్సవము.

౩౧-౩-౧౯౩౬ నాడు శ్రీయుత. పింగిలి కోదండరామారెడ్డిగారి యాజమాన్యముక్రింద జరిగెను బాలికలు ఆహ్లాదకరమైన కార్యక్రమమును నడపిరి. వివిధవాద్య ప్రదర్శనము. ఆశుకవిత్వము, పాదుకాపట్టాభిషేక నాటకము—మున్నగునవి చాల సుఖకరముగాఁ బ్రదర్శింపఁ బడినవి. అధ్యక్షులు మహానందమునొంది బాలికలను బ్రశంసించి, వారు వ్రాయు మూడు గ్రంథములను ముద్రించు వ్యయము తామే భరింతుమని ప్రార్థితులయి మాట నిచ్చిరి. ఇట్లే పాఠశాలకుఁ గూడ సహజ ఔదార్యమును జూపి చాల సహాయమొనర్చిరి. డాక్టరు దామోదర నాయుడుగారు కొందరు బాలికలకు (నాటకము నందలి) రజత పతకముల నిత్తుమని పల్కిరి.

## ౧౧. కృతిసమర్పణోత్సవము.

౭-౪-౩౬ నాడు సాయంత్రము బాలికలు పాఠశాలను విడిచి పోవుచు బిదురు వేంకట శేషయ్యగారికి తాము వ్రాసిన కవిత్వమునకు బీజము వేసినందులకుగాను వారికి కృతజ్ఞతను తెలిపిరి. భారతి అను విద్యార్థిని వ్రాసినట్టి "నిర్మల" అను పుస్తకమును బిదురు వేంకట శేషయ్యగారికి అంకితమిచ్చెను. విద్యార్థినులే గాక అనేకులు ఉపాధ్యాయులునువచ్చి పాఠశాలను మఱవకుడు అని బాలికలను ప్రోత్సహించిరి. బాలిక లందఱును కలిసి గురువుగారికి ఒక వెండి పళ్లెమును ఇచ్చిరి. గురువుగారు బాలికలకు వీడ్కోలుపు సందేశమును నొసగిరి.

### ౧౨. కర్వేగారి జన్మదినోత్సవము.

౧౫-౪-౧౯౩౬ నాడు ఉదయము పాఠశాలావరణములో శ్రీయుత కర్వేగారి జన్మదిన మహోత్సవము బాలికాసంఘ పక్షమున జరుపఁబడినది. పాఠశాల ప్రధానోపాధ్యాయులగు శ్రీయుత నారాయణరావుగారు అధ్యక్షపీఠము నలంకరించి కార్యక్రమమును జయప్రదముగా జరిపిరి. పాఠశాల కార్యదర్శియగు శ్రీయుత మా. హనుమంతరావుగారు కర్వేగారి జీవితమును ప్రబోధరూపముగా నుపన్యసించిరి.

### ౧౩. ప్రాంతవిద్యార్థినీ ద్వితీయ సమావేశము.

౨౪-౪-౧౯౩౬ నాడు శ్రీమతి. నడింపల్లి సుందరమ్మగారి యాజమాన్యము క్రింద పైసమావేశము జరుపఁబడినది. చాల మంది విద్యార్థినులు వచ్చిరి. అప్పుడు వారు పాఠశాలా విషయమునను, మాతృభారతీ విషయమునను, విశేషశ్రద్ధ జూపవలెనని హెచ్చరింపఁ బడిరి. సభ జయప్రదముగా ముగిసెను.



## నిత్యకృత్యములు.

౧. ప్రొద్దు పొద్దుననే లేచి కాలకృత్యములఁ దీర్చికొని తప్పని సరిగా వేళదప్పక ౬ గంటలకే దైవప్రార్థనము చేసికొనుము.

౨. ఇంటియొద్దఁ జేయవలసిన పాఠశాల పనినిఁ బూర్తిగఁ దృప్తికరముగఁ జేసికొనుము.

౩. వేళకు బడికివచ్చి, తక్కిన బాలికలకు ఆదర్శప్రాయవుగాఁ బ్రవర్తించుము.

౪. సాయంకాల మింటికిఁ జేరిన తర్వాతఁ జక్కఁగ ఆటలాడి శరీరమును శుభ్రముగ నుంచుకొని, పిదపఁ బాఠములను జదువుకొనుము.

౫. సాయంకాలము గూడ సరిగా ౬ గంటలకే మరలఁ బ్రార్థనము చేసికొనుము.

౬. భోజనముచేసి పండుకొనఁ బోవునప్పుడు 'ఆత్మపరీక్ష' చేసికొని నిద్రించుము.

౭. నీవెల్లప్పుడు సామాన్య బాలికవు గాననియు, దేశముయొక్క పురోభివృద్ధి యంతయు నాచేత నున్నదనియు, నా సత్ప్రవర్తనమే సంఘమున కాధారమనియు, వేషభాషా భావములన్నింటను నా పూర్వస్త్రీలాచరించి నట్లాచరించి యందఱికి వన్నెదెత్తుననియు నిశ్చయించుకొనుము.

౮. నా భారతదేశ నాగరకతను నేను దప్పక నిలఁబెట్టఁ జూతునని ప్రతిజ్ఞఁ బూనుము.

౯. మా మాతృభారతిని విస్మరింపక దానిని సర్వవిధములఁ బోషింతును గాకయని పూఁచీపడుము.

౧౦. ఓ! ఇంకేమి! అప్పుడు నీవు ఆదర్శవిద్యార్థినివి అగుదువు.



# మాతృభారతీ పోషకవర్గము.

| సంఖ్య. | పేరు. | ప్రథమ సంపుటము. రూ. | అ. | పా. | ద్వితీయ సంపుటము. రూ. | అ. | పా. |
|---|---|---|---|---|---|---|---|
| 1. | శ్రీశ్రీశ్రీ గద్వాల మహారాజ్ఞిగారు | 50 | 0 | 0 | | | |
| 2. | శ్రీశ్రీశ్రీ జటప్రోలు మహారాజ్ఞిగారు | | | | 20 | 0 | 0 |
| 3. | శ్రీయుత కాశీనాధుని నాగేశ్వరరావుగారు | 58 | 5 | 4 | | | |
| 4. | ,, రాజాబహదూర్ వేంకటరామారెడ్డిగారు ఓ.బి ఇ. | 25 | 0 | 0 | | | |
| 5. | ,, వేలూరి రంగధామ నాయఁడుగారు | 20 | 0 | 0 | | | |
| 6. | ,, వేంకట నరసింహారావుగారు | 10 | 0 | 0 | | | |
| 7. | ,, క. రామచంద్రరావుగారు | 5 | 0 | 0 | | | |
| 8. | శ్రీమతి టి. వరలక్ష్మమ్మగారు | 5 | 0 | 0 | | | |
| 9. | శ్రీయుత తుంగా రామన్నగారు | 5 | 0 | 0 | | | |
| 10. | ,, బాపూరావుగారు | 2 | 0 | 0 | | | |
| 11. | ,, కె. లక్ష్మీనరసింహారావుగారు | 2 | 0 | 0 | | | |
| 12. | ,, వేంకటసుబ్బయ్యగారు | 2 | 0 | 0 | | | |
| 13. | ,, ఆ. శ్రీనివాసరెడ్డిగారు | 2 | 0 | 0 | | | |
| 14. | శ్రీమతి జి. పద్మాబాయి | 2 | 0 | 0 | 2 | 0 | 0 |
| 15. | ,, యశోదాదేవి | 2 | 0 | 0 | 2 | 0 | 0 |
| 16. | ,, లీల | 2 | 0 | 0 | 1 | 0 | 0 |
| 17. | ,, సుశీల | 2 | 0 | 0 | 2 | 0 | 0 |
| 18. | ,, భారతీరత్నాకరాంబ | 2 | 0 | 0 | 1 | 0 | 0 |
| 19. | ,, రా. లలిత | 2 | 0 | 0 | 1 | 0 | 0 |
| 20. | ,, లక్ష్మీదేవి | 2 | 0 | 0 | | | |
| 21. | ,, జి. సీతారత్నము | 2 | 0 | 0 | 2 | 0 | 0 |
| 22. | ,, పి. సావిత్రిదేవి | 2 | 0 | 0 | 2 | 0 | 0 |
| 23. | ,, విమలా మేలోట్కోటీ | 2 | 0 | 0 | 2 | 0 | 0 |
| 24. | ,, కె. లక్ష్మీబాయి | 2 | 0 | 0 | | | |
| 25. | ,, ఎం. మణి | 2 | 0 | 0 | 2 | 0 | 0 |
| 26. | ,, వై. కౌసల్యాదేవి | 2 | 0 | 0 | 2 | 0 | 0 |
| 27. | ,, వై. అమృతమ్మ | 2 | 0 | 0 | | | |
| 28. | ,, సం. యశోదాదేవి | 2 | 0 | 0 | | | |
| 29. | ,, జయలక్ష్మి | 2 | 0 | 0 | 1 | 0 | 0 |
| 30. | ,, వ. ఇందిర | 2 | 0 | 0 | 2 | 0 | 0 |
| 31. | ,, కె. అనసూయ | 2 | 0 | 0 | 1 | 0 | 0 |
| 32. | ,, కె. సుశీల | 2 | 0 | 0 | 1 | 0 | 0 |
| 33. | ,, జి. శారద | 2 | 0 | 0 | 2 | 0 | 0 |

# మాతృభారతి



## తృతీయ సంపుటము

ప్రేమసాగర ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

గౌలిగూడ, హైదరాబాదు—దక్కన్.

# విషయ సూచిక.


| | | | |
|---|---|---|---|
| ౧. | గురుశిష్యులు [ప] | శ్రీమాన్ సి. హెచ్. రంగాచార్యులు గారు | ... ౧ |
| ౨. | పరివర్తన | శ్రీమతి సే. భారతి | ... ౫ |
| ౩. | మీరాబాయి | ,, ఎ. సావిత్రి | ... ౧౬ |
| ౪. | లక్ష్మి | ,, స్నేహలత | ... ౧౮ |
| ౫. | ఎందరున్నారో? | శ్రీయుత కె. రామమూర్తిగారు | ... ౨౧ |
| ౬. | నిధినిక్షేపములు [ప] | శ్రీమతి రాఘవమ్మ | ... ౨౭ |
| ౭. | వ్రతమహిమ | ,, కె. లక్ష్మీదేవి | ... ౨౯ |
| ౮. | శ్రీనివృత్తుఁడు | ,, డి. కమలావతి | ... ౩౪ |
| ౯. | ఉగాది నివేదన | ఆచార్య రాయప్రోలు సుబ్బారావు గారు | ... ౩౬ |
| ౧౦. | సంయుక్త విద్యావిధానము | శ్రీమతి నం. ఇందిరాదేవి | ... ౩౮ |
| ౧౧. | బాలికల ఉన్నత పాఠశాల [ప] | శ్రీయుత బిరుసు వెంకటశేషయ్య | ... ౪౩ |
| ౧౨. | ఆదర్శ మిత్రద్వయము | శ్రీమతి రా. లలితాదేవి | ... ౪౫ |
| ౧౩. | విజ్ఞప్తి | | ... |
| ౧౪. | దేశభక్త, ధర్మవీర వామననాయకుగారి జీవితము | శ్రీమతి మ. దమయంతి | ... ౪౯ |
| ౧౫. | సాధు సుందర్ సింగ్ చరిత్ర | మెర్సీ | ... ౫౨ |
| ౧౬. | శుక్రవారము | జి. సీతారత్నము | ... ౫౪ |
| ౧౭. | శాపాగ్ని [ప] | జయలక్ష్మి | ... ౫౭ |
| ౧౮. | గ్రంథాలయ నిర్వహణము | ఆచార్య ఇ. సీతారామారావుగారు | ... ౫౯ |
| ౧౯. | పద్మ | శ్రీమతి జి. తయ్యు | ... ౬౬ |
| ౨౦. | బుద్ధులు [ప] | అమృతమ్మ | ... ౬౯ |
| ౨౧. | మధుర హృదయ | శ్రీమతి సే. భారతి | ... ౭౦ |
| ౨౨. | పాకకళ | | ... ౭౬ |
| ౨౩. | షడంగములు | శ్రీయుత కె. ఆర్. నటరాజశర్మ గారు | ... ౭౭ |
| ౨౪. | రజతోత్సవము | | ... ౮౧ |
| ౨౫. | ప్రస్తుత ప్రారంభ చికిత్స | ,, డా. ఇజ్రైలు గారు | ... ౮౪ |
| ౨౬. | సవతితల్లి ప్రేమ | శ్రీమతి యస్. లోపాముద్ర | ... ౮౫ |
| ౨౭. | గురుభక్తి [ప] | ,, అమృతమ్మ | ... ౮౭ |
| ౨౮. | సందేశము | అనువాదకులు-శ్రీయుత రావి నారాయణ రెడ్డిగారు | ౮౯ |


## సంస్కృతము.


| | | | |
|---|---|---|---|
| ౨౯. | ఆర్త రక్షణమ్ | శ్రీమతి మెర్సీ | ... ౯౨ |
| ౩౦. | దానవీరః | ,, జయలక్ష్మి | ... ౯౩ |
| ౩౧. | ప్రహ్లాద చరిత్రమ్ | ,, కె. రంగనాయకమ్మ | ... ౯౪ |




మా పాఠశాల బాలికలయందు లేఖనోత్సాహమును బెంపుచేయు సదుద్దేశముతో ంపఁబడి నిర్వహింపఁ బడుచున్న లిఖిత మాసపత్రికయగు మాతృభారతి, పాఠకలోకమునకుఁ పరిచితమయియే యున్నది. అందు బాలికల వ్యాసములు, వారి కోరవడిగ నుండుటకయి ద్దేశింపఁబడిన కొందఱు విద్యాధికుల వ్యాసములు పొందుపఱుపఁ బడుచున్నవి. బాలికలు తృభాషలోఁ గడచిన కొంతకాలమునఁ జేసిన కృషికి ఫలరూపమగు నీ సంపుటము ప్రజా మహా ముల హస్తములందుంచు చున్నాము. సహృదయులకిది తమ బిడ్డల జలిబిలి పలుకులవలె రుచిం పోదని నమ్మెదను. దీని కన్నివిధములఁ దోడ్పడిన మహాశయులు మా కృతజ్ఞతకుఁ బాత్రు ము యున్నారని విన్నవించుచు విరమించుచున్నాను.

బాలికల ఉన్నత పాఠశాల,
సుల్తాన్ బజారు,
హైద్రాబాదు-దక్కన్.
౧-౧౨-౧౯౩౭.

ఇట్లు,

మాడపాటి హనుమంతరావు,
గౌరవ కార్యదర్శి.



# నిత్యప్రార్థనము

అపరాధ సహస్రభాజనం
పతితం భీమభవార్ణవోదరే
అగతిం శరణాగతం, హరే!
కృపయా కేవల మాత్మసాత్కురు. (గీతపద్య ప్రకాశిక)

నధర్మనిష్ఠోఽస్మి, నచాఽఽత్మవేదీ
నభక్తిమాం స్త్వచ్చరణారవిందే,
అకించనోఽనన్య గతిశ్శరణ్య
స్త్వత్పాదమూలం, శరణం ప్రపద్యే. (గీతపద్య ప్రకాశిక)

వాయుర్యమోగ్నిర్వరుణ శ్శశాంకః
పితామహస్త్వం ప్రపితామహశ్చ
నమోనమస్తేఽస్తు సహస్రకృత్వః
పునశ్చభూయోఽపి నమోనమస్తే. (భగవద్గీతా)

శరదిందువికాస మందహాసాం
స్ఫురదిందీవర లోచనాభిరామాం
అరవిందసమాన సుందరాస్యాం
అరవిందాసన సుందరీముపాసే. (సరస్వతీ స్తోత్రం)

ఎవ్వనిచే జనించు జగ, ♦ మెవ్వనిలోపల నుండులీనమై,
యెవ్వనియందు డిందుఁ, బర ♦ మేశ్వరుఁ డెవ్వఁడు, మూలకారణం
బెవ్వఁ, డనాది మధ్యలయుఁ ♦ డెవ్వఁడు, సర్వముఁ దానయైన వాఁ
డెవ్వఁడు, వాని నాత్మభవు ♦ నీశ్వరునే శరణంబు వేడెదన్. (ఆంధ్ర భాగవతము)




వ్యాకరణ శిరోమణి, శ్రీమాన్. సి. హెచ్. రంగాచార్యులుగారు (సంపాదకులు)

సీ॥ ఉత్తమాంగము మీఁద ♦ నూనినజడముడి
కఠిన తపోనిష్ఠ ♦ గరిమఁ దెలుప
బ్రహ్మతేజములొల్కు ♦ ఫాలభాగమునుండి
స్వాతంత్ర్య కిరణముల్ ♦ చౌకళింప
నొరు కేల జపమాల ♦ పెర కేలదండంబు
శాంతిసత్యాగ్రహ ♦ సరణిఁజూప
మైనలందిన బూది ♦ మమత లేమినిజాటి
చూపులు డెందముల్ ♦ జూఱఁగొనఁగ

గీ॥ చంకజోలియ వ్రేలాడ ♦ సంయమీంద్రుఁ
డొక్కఁడా సితారాపురి ♦ నున్న రాజ
భవనముండాసి మెలుఁగెత్తి ♦ పలికె "జయము
మాన్యజయరఘువీర సమర్థ!" యనుచు.

పరిచితమైనపూజ్యగురు ♦ పాదుల యాధ్వని వీనులంబడన్
స్థిరతరకీర్తిరాజి శుభ ♦ చిహ్నవిరాజి శివాజిభక్తిమై
గరుపడుమేనితోఁగలఁగు ♦ కంఠముతోనొక కాగితంబుపైఁ
జెరచెరనేమొ వ్రాసి గురుఁ ♦ జేరఁగడాసి జోహారుసేయుచున్ ॥

వర్ధిల్లుగాత నీ ♦ వాడికటారి భా
రత దేశమునకు శ్రీ ♦ రామరక్ష
సుఖముండుగాత నీ ♦ శూరసైనిక వర్గ
మరిరాజు గుండెల ♦ యదరిపాటు

పెంపొందుఁగాత నీ ♦ పేరుప్రతిష్ఠలు
జాతీయభావ జీ ♦ వాతువులుగ
ఫలమిచ్చుగాత నీ ♦ భవ్యసంకల్పంబు
భారతదేశ సౌ ♦ భాగ్యశాఖ

నెగడుగావుత నీకీర్తి ♦ నిఖిలదిశల
శుభముగావుత సత్యసం ♦ శోభివగుట
జయముగావుత ధర్మసం ♦ చారివగుట
నీశ్వరార్పితభార! మో ♦ యీ కుమార!

అని దీవన లిచ్చినయా
మునివరుఁబూజించి పత్ర ♦ మును జోలెనిడన్
గనుగొని శివాజికిట్లను
"తనయా! హాస్యంబునీకుఁ ♦ దగవేమాతోన్.

కడుపుమంటను దీర్పంగ ♦ గంజిగాని
కాగితాలేల గాల్పనా ♦ కాటిలోన"
ననుచుఁజీటిని దీయ నం ♦ దక్కరములు
గానుపించిన నీరీతి ♦ గానుజదివె

ఏధాత్రీసురబోధనామృతముచే ♦ నీజాతి జీవించెనో
యేధన్యాత్ముని పాదధూళి మహిమ ♦ న్నీడేరు కోర్కెల్వెస
న్నాధీశాలి సమర్థు నంఘ్రిలకడ ♦ న్నత్యంత మోదంబుతో
నీధారుణ్యఖిలంబు నర్పణము గా ♦ వించెన్ శివాజీయిలన్ ॥

కమ్మజదువుడు మదినిమో
దమ్ము, మిగుల విస్మయమును ♦ దనరన్ "శిష్యా
యిమ్మహినా కిచ్చితివిఁక
నెమ్మెయిజీవిక గడుపుదు ♦ వీవన నతఁడున్ ॥

"స్వామీ! మీచరణారవిందమధుసంస్రావంబు లాభించుచో
భూమీపాలతగాదు శక్రపదమే ♦ పూర్ణింబలెందోఁచునా

కీ మేనెయ్యెయి యూడిగంబులకు గా ♦ నెబ్భంగి నేర్పర్తురో
యామాడ్కిం బరిచర్యసల్పి మనుదుర్ ♦ యాతాఖిలాశుండనై" ॥

అనిన శివాజిఁజూచి గురుఁ ♦ డాదర మొప్పఁగఁ గౌఁగలించి "యో
తనయ శుభంబు నీకగుతఁ ♦ దాపసియేడ నలౌకికుండు? నీ
ఘనతరప్రజ్ఞచే నడుపఁ ♦ గాఁదగురాజ్య మదేడ? పోలునే
మనమున సందియంపడక ♦ మామక మానతి ధాత్రినేలుమీ ॥

మునురాముండు వసిష్ఠు దేశికవరుం ♦ బూజించి సాఁబాలుగాఁ
దనరాజ్యంబును దారవోయ ఘనుఁడా ♦ తత్వజ్ఞుఁడే మెవ్విధిన్
వనవృత్తుల్ దగరిట్టి వానికనిగా ♦ వాదించి వారించెనో
యనఘా యేలుము రామరాజ్యముగ నీ ♦ వాశాంతకీర్తిం భువిన్ ॥

నావిని కేలుమోడ్చి గురు ♦ నానతి మీరఁగరానిదాటచే
భూవిభుఁడెట్టకేలకనె ♦ "పూజితపాదసరోజ వేడెదన్
దావక పాదుకాద్వయి ను ♦ దారతపీఠిక నుంచి మంత్రినై
సేవకవృత్తినుండిప్రజ ♦ సేమముగూర్తు ననుగ్రహింపవే ॥

నీయూహా సమయాన ♦ నెగడకే యున్నచో
జాతిరూపఱుటయే ♦ జరిగియుండు
నీగామదండులే ♦ నేఁడులేకుండుచో
సైనికశబ్దమే ♦ సమసియుండు
నీబోధనలె భువి ♦ నిరతంబు లేనిచో
నాత్మవిశ్వాసమే ♦ యణఁగియుండు
నీకృపావృష్టినన్ ♦ నింపకే యున్నచో
నీనేల నెవ్వఁడో ♦ యేలియుండు

నిజము, యతిమాత్రుఁడవె నీవు ♦ నిర్మలాత్మ!
దేశభాగ్యంబు చేఁబుట్టు ♦ దేశికుఁడవు
పిఱికి రోగంబు దూలించు ♦ వెజ్జవగుదు
నీదు పేరిట రాజ్యంబు ♦ నేనెసేతు" ॥

అనినగురుఁడల్లె గాక యం ♦ చనుమతింప
సింహాపీఠికఁ బాదుకల్ ♦ జేర్చితాను
రామదాసు ప్రతినిధియై ♦ రాజ్యమేల
శీతనగనిభకీర్తియా ♦ శ్రీశివాజి ॥

పరరాజు గుండియల్ ♦ వడవడణఁవకెనాఁ
జిరుగాలిఁదూగుచుఁ ♦ జిందులాడు
ననురాగ మీరీతి ♦ యావరించనేఁడునా
నీరెండ చాయల ♦ నీనుచుండు
భారతజాతి యీ ♦ పగిది భాసిల్లునా
నున్నతోన్నత మాచు నూగులాడు
ప్రాక్సభ్యతమె లోక ♦ పావనంబనెడునా
మువ్వల గలగల ♦ మురియుచుండు ॥

దుష్టజనుల పాలికిమేటి ♦ తోకచుక్క
భారతీయుల పాలిటి ♦ భాగ్యరేఖ
శ్రీశివాజి ప్రతిష్ఠచే ♦ ఁజెన్ను మిగులు
రామదాసునికాపాయ ♦ రా గ[illegible]డము ॥






శ్రీమతి. నే. భారతి (ప్రాఁతవిద్యార్థిని)

దేవరపల్లి గ్రామములో విశ్వనాథశాస్త్రి గారు పేరువడ్డ పండితుఁడు. వారు సంస్కృతాంధ్రములలో వ్రాసిన గ్రంథములను జూచి పెద్దలందఱు తలలూఁపుచుందురు. గీర్వాణమునందు కమ్మని శైలిలో వీరితో సమముగా నుపన్యసింపఁగలవాఁడెవ్వఁడు లేఁడు. వారు పుట్టుకచేత వైదికులు. అందువల్ల శాస్త్రిగారా గ్రామమునకుఁ బురోహితులుగానుండి కళ్యాణాది శుభకార్యములను జరుపుచుండిరి. వీరికి స్వార్జితమే యాధారముకాదు. పిత్రార్జితమైన నాలుగెకరముల భూమి, ఒక మండువాయిల్లు, ఉన్నవి. వానివల్ల వచ్చెడి శిస్తువల్లఁ దన సంపాదనవల్లఁ బరువుమర్యాదలతో సంసారమును జరుపుచుండిరి.

శాస్త్రిగారికి నలుగురు కూతులును, ఒక కొడుకును, గలరు. పెద్ద పిల్లకు రెండేండ్లక్రిందట సారె చీరె పెట్టి, యత్తవారింటికి సాగనంపెను. రెండవ కుమార్తెకుఁ గొడుకునకుఁగూడ (మేనఱికము) నతి వైభవముగాఁ బాణిగ్రహణము చేసినారు (వృద్ధజనని మనసు). ఈ శుభకార్యములన్నిటి కొఱకు, నొక యెకరము భూమినమ్మక తప్పినదికాదు.

మురళీధరుఁడు శాస్త్రిగారి యేకైక పుత్రుఁడు తెలివైన ఘటము. చూచినఁబట్టుకొను రకము వాఁడు. పదునాలుగేండ్ల వయస్సు. మురళీధరునకు విద్యాబుద్ధు లీడునకు మించినవి అబ్బుటకు. అతని నిశితబుద్ధియే కాక తండ్రియొక్క భయభక్తులు కొడుకునుగూడఁ దనంతటి వానిని జేయవలయునను దృఢమైన యిచ్ఛయే కారణము. శాస్త్రిగారివద్ద కా యూరిలోని వారు చుట్టుప్రక్కలనుండెడి గ్రామములవారుకూడఁ జదువుకొనుటకు వచ్చుచుండిరి. ఉదయము ఏడు మొదలుకొని పది పదకొండు వఱకు శాస్త్రిగారు శిష్యకోటి తోడనే కాలక్షేపముచేసి, యటు పైనఁ దమ దేవతార్చన మొదలగు ననుష్ఠానములను జూచుకొందురు.

బాలురందఱు గొల్లుమని శాస్త్రిగారి తోటలోనికిఁ బ్రవేశించిరి. తరణీ తన కిరణ వారము చేత వారి కందఱకు బంగారపుఁ బూతపెట్టుచున్నాఁడు. అక్కడక్కడ చెట్లపైని పక్షులు ఇంకను కిచకిచమనుచున్నవి. పాకలోనున్న ఆవులేచి ఆవులించి ఒడలు విఱుచుకొని ఈ బాలురు చేయుచున్న కోలాహలము చూచుచు నిలుచున్నది. పిల్లలందఱు పంచలను మోకాటి మీఁదకు ఎగఁగట్టి మొక్కలను మళ్లను సరిచేయుచు మోటబావిలోని నీరుతోడి మొక్కలకుఁ బోయుచు సమీపమున ఉన్నత స్థలము మీఁద కూర్చుండి మురళి క్రిందటి నాఁటి శ్లోకములను జెప్పుచుండఁగా దాము వల్లె వేయుచుండిరి. మురళి ఆ కొం

చెము నేపయినను ఉపాధ్యాయుఁడుగా నుండి తన యాధిక్యమును దలఁచుకొని బ్రహ్మానంద పడుచుండెను. ఆ శిష్యవర్గములోఁ జాలమంది మురళికంటె వయసున పెద్దఅయినను, మురళియొక్క నిశితబుద్ధియే వారంతటిని అతనికి లోఁబరచినది. ఇంతలో శాస్త్రిగారు వేదము చదువుచు వచ్చుటజూచి శిష్యులందరు చప్పుచప్పున కాళ్లు చేతులు కడిగికొని పుస్తకములు తీసికొని అరుగుమీద వేసియుండిన తాటి యాకుల చాపమీఁద వరుసలు తీర్చి కూర్చుండిరి. శాస్త్రిగారు దర్భాసనము పరచుకొని వారికభిముఖముగాఁ గూర్చుండి వేదపాఠమును జెప్పుచుండిరి. శిష్యులందఱు శాస్త్రిగారన్న ముక్కను వెంటనే అందుకొని ఏకకంఠముతో తిరిగి యనుచుండిరి. ఇట్లు కొంత కాలము గడచినది. శాస్త్రిగారు పాఠము అంతలో ఆపివేసిరి.

"పిల్లలూ, ఈవేళకు ఇంతటితో చాలు. ఈ రోజునకే కాదూ ఇక్కడ దేవుడి పెండ్లి. ఈవేళ ఇక్కడనే భోజనం చేసెదమని మీ ఇంటివద్ద చెప్పివచ్చినారా?'' అని ఇతర గ్రామములనుండి వచ్చినవారిని బ్రశ్నించెను.

"ఆ, చెప్పినామండి. సరేనన్నారు" అని అత్యుత్సాహముతో అన్నారందఱు.

"సరే సాయంకాలము మంచిదికనుక కుమారసంభవము మొదలుపెట్టఁదలఁచుచున్నాను. మీరందరు పది గంటలకు గుడిదగ్గర హాజరవవలయును సుమా! పొండు" అని శాస్త్రిగారు వెడలిపోయిరి.

పాఠముబాధ వదలి స్వేచ్ఛ దొరకినందుకు పిల్లలకు ఇంతయంత సంతోషముకాదు. అందఱు పొగడచెట్టు క్రిందఁ గూర్చుండి బాతాఖాని మొదలిడిరి.

"ఏమిరా మురళీ అంత నిశ్శబ్దముగా నున్నావు అసలు నీనోరెప్పుడును ఊరుకొని యుండదే" అనిఅడిగినాఁడు శంభుశాస్త్రి పొగడ చెట్టును ఆనుకొని ఆకసమువంక చూచుచు ఏదో దీర్ఘముగా ఆలోచించుచున్న మురళినిజూచి.

"అబ్బే ఏమిలేదు. ఆ అబ్బాయిలు జ్ఞాపకం వచ్చినారు.

"ఏఅబ్బాయిలు"అన్నాఁడు జగన్నాథము

"కరణంగారి బావమఱది కొడుకులు."

"కరణంగారింట్లో ఎవరూలేరే" అన్నాఁడు యోచించుచు జగన్నాథము.

"అవును వాళ్ల వేషము లెట్లాగో ఉన్నవి" అన్నాఁడు రామావధాని.

"ఓహో! వాళ్లా. కాళ్లకు జోళ్లు మొలనపటకాలు తొడలాగులు ఎల్లప్పుడు వేసుకొని ఉందురుకాదూ. నెత్తిమీద కాపింగు ఆ ఆడపిల్లకూడ మనవూరి పిల్లలవలె ఉండదు మోకాళ్లపైకి బైరేగి దానిలాగ ఒకటి ఉంటుంది. వాళ్లేనా మురళి! మొన్నచేల గట్లమీద వారు ముగ్గురుపచారు చేయుచుండగా చూచితిని." అని అన్నాఁడు జగన్నాథము.

''ఔనువాళ్లే'' అని అతిక్లుప్తముగ జవాబిచ్చెను మురళి.

''ఇదుగో వాళ్లువొట్టి మాలవెధవలర్రా. మొన్న నేను కరివేపాకునకు వెళ్లినప్పుడు ఆ గుడ్డలతోడనే భోజనము కానిచ్చి వాండ్లుపాలేరుదించిన నీళ్లతో చేతులు కడుగుకొనుచుండగా చూచితిని. ఆ దృశ్యముతోటి నాశరీరము ఝల్లుమన్నదిరా బాబూ'' అని అంతటి యమాంగల్యమును దలఁచుకొన్నందులకు పాపపరిహారార్థమై పుండరీకాక్ష పుండరీకాక్ష అనుకొనినాఁడు శంభు

శాస్త్రి "అబ్బ! చెప్పకురా వింటేనే డోకువచ్చు
చున్నది" అని ప్రక్కన ఉమ్మివేసినాఁడు
జగన్నాథము.

"దానికేమి వారి వేషములెంతో బాగు
న్నవికాదూ" అనెను వారి వేషభాషలలోఁ దన
కున్న అభిరుచిని కనబఱుచుచు మురళి.

"ఆ ఏమి బాగున్నవి? పిట్టలుపీకిన తాటి
టెంకలలాగు తలలూ వాండ్లూను." అని అతని
వాదనను ఖండించినాఁడు శంభుశాస్త్రి.

"ఏమో నీకు బాగలేవేమో కాని నాకు
చూడ ముచ్చటగానున్నవి సుమా. ఆలాగు చొ
క్కాలు ఆపటకాలు కాళ్లకుజోళ్లు చక్కగాను"
అని తన నిశ్చితాభిప్రాయమును దెలియబఱచి
నాఁడు మురళి.

"పోనిద్దురూ వాళ్లవేషము బాగున్న
మనకేమి, లేకపోయిన మనకేమి. మనము దేవుని
పెండ్లికి వెళ్లవలెను. పది దాటుచున్నట్లున్నది.
లెండి ఈపాటికి" అని తానులేచి తక్కినవారిని
హెచ్చరించినాడు రామావధాని; ఔనౌనను
చు నందఱులేచి పరుగు సాగించినారు.

జయస్తంభమువద్దనున్న పచ్చగడ్డిమీఁద
కూర్చుండి యున్నారు శాస్త్రిగారు తమ శిష్య
బృందముతో రాత్రి తొమ్మిది ఘంటలకు. ఊరి
వారిలో కొందరు పెద్దలు రానందున అర్చకుఁ
డింక కళ్యాణము మొదలిడలేదు. అందుచేత
శాస్త్రిగారు శిష్యులను శ్రీసూక్తం, భూసూక్తం
పురుషసూక్తం వల్లించుడనినారు. వెన్నెల పుచ్చ
పువ్వువలె నున్నది. శిష్యులందరు అత్యుత్సాహ
ముతో గొంతులు సవరించుకొని ఏక కంఠములో
ఒక్క మారుగా మొదలిడిరి. భస్మధారులయి
సాక్షాత్తు సాంబశివునివలె నున్న శాస్త్రిగారు
అంగవస్త్రముమీఁద ఆసీనులయి నిమీలిత నేత్రు
లై తమ శిష్యుల శ్రావ్యస్వరములను వినుచు
నేఁటికి నాజన్మతరించినది. నిజముగా నేను ధన్యుఁ
డనే అని తమలోతాము ఆబాలకుల నేర్పుజూచి
అమందానందమును బొందుచుండిరి. ఇంతలో కర
ణముగారు మేనల్లుళ్లతోఁ గూడ వేంచేసిరి శిష్య
బృందము అప్పటికి శ్రీసూక్తము భూసూక్తము
ముగించినారు. పురుషసూక్తము సగమైనది. ఆ
నూతన వ్యక్తుల ఆగమనమువలన మన మురళి
ధాటికి అకస్మాత్తుగా విఘ్నము కలిగినది. చటు
క్కున చదువుటమాని వారివంక చూచుచు
కూర్చుండెను మురళి. ప్రక్కననున్న రామావ
ధాని హెచ్చరింపు పోటువలన మరల లందుకొని
ఎట్లో దిక్కులేని శవమును ఈడ్చినట్లు ఈడ్చి
పారవేసినాఁడు.

అర్చకుఁడు గ్రామస్థులందఱు వచ్చుటజూచి
పూజ ప్రారంభించినాఁడు. యథావిధిగ వివాహ
కర్మయంతయు కావించినాఁడు. ఆకర్మకాండ నం
తటిని అచ్చట మూగిన ఆబాల గోపాలము అతి
శ్రద్ధతోచూచి ఆనందించుచుండిరి. కాని మన ము
రళిదృష్టిమాత్రము దూరముగా వెన్నెలలో తిరు
గుచు నడుమనడుమ ఇంగ్లీషు ముక్కలు పార
వేసి మాట్లాడుకొనుచు ఒకేపెట్టున పెద్ద పెద్ద
వెడనవ్వులు నవ్వుచు ఉన్న ఆ ముగ్గురిమీఁద
లగ్నమైపోయినది. వారు నవ్వినప్పుడెల్ల ఇతని
హృదయము పొంగిపోయెడిది. మన కటువంటి
యవకాశము లేదుకదా అని అనుకొనినాఁడు. ఆ
యాలోచనలలో ఎంత సేపుఉండెనో అతనికే తెలి
యదు. అర్చకుఁడు మంత్రపుష్పమునకని పుష్పము
లందఱి దోసిళ్లలోను పోయుచు మురళినికూడ
నిద్రలేపినాఁడు. మురళి అదరిపడి పుష్పములందు
కొని లేచి-నిలుచుండెను. ఆ ముగ్గురు వ్యక్తులు,
వీరందఱు ఒక్కమారుగ లేచుట పుష్పము లందు

కొనుట మొదలగు హడావిడిచూచి తాముకూడ అక్కడికిఁ జేరుకొని వారితోఁబాటు పుష్పములు పుచ్చుకొని నిలుచుండిరి. "ఓం ధాతాపురస్తాత్" అనుచు అందఱు ఒక్కమాఱుగా కంఠములెత్తి మంత్రపుష్పము చదువుట కారంభించిరి. అచ్చట నున్నవారందఱు, పెద్దలు భక్తితోతన్మయులయి, చిన్నలు తాము చదువుచున్న మంత్రపుష్పము నందు స్వరము సరిగా నున్నదాలేదా యన్న విషయములోను పూర్తిగా నైక్యమై పోయిరి. మన మురళితోఁ గూడ నలుగురు తప్ప ఆఅమ్మాయి మురళి సరసనే నిలుచున్నది. ఆమె తరువాత ఆమె యన్నలు నిలుచున్నారు.

"అన్నయ్యా చూడు, ఆ అబ్బాయి పిలక ఎట్లా ఎగురుతున్నాదో." అని శంభుశాస్త్రిని చూపించి పక్కున నవ్వినది.

"మరి యేమనికొనినావు ఆపల్లెటూరి పశువుల సంగతి?" అన్నాఁడు అన్న.

మురళి చేతితో మెల్లగా దన జుట్టుముడిని దడవిచూచుకొనెను. అతఁడునిలువున చచ్చిపోయినాఁడు ఆ అమ్మాయి హేళనతో. తనకే కనుక గారడివిద్యచేతనయి యున్నచో నిమిషములోవేషమంతటిని పూర్తిగా మార్చివేసియుండును గదా అనుకొనినాఁడు మురళి. ఈ యోచనలలో ఇష్టము వచ్చినన్ని తప్పులు చదివెను కాని శాస్త్రి గారుగుర్రుగా ఉరిమిచూచుటవల్ల మఱల సర్దుకొనెను. ఈ విధముగ ఎట్లో మంత్రపుష్పమును అయినదనిపించి ఒక పెద్ద నిట్టూర్పు పుచ్చెను, ఒక పెద్దబాధనుండి విడివడిన వానివలె.

అర్చకుఁడు ఒక పళ్లెరములో దేవునిపెండ్లి గాారెలు తీసుకొనివచ్చి అందఱికిచ్చెను. అందఱు ఆప్రసాదమును అందుకొని కండ్లకద్దుకొనిరి. కాని మన నవనాగరిక వ్యక్తులు ముగ్గురు "మాకవి నహించవండీ" అని నిరాకరించిరి. కరణముగారి మేనల్లుళ్లగుట వలన వారిని ఎవరు ఏమనలేక పోయిరి. తరువాత అందఱు ఎవరి యిండ్లకు వారు పోయిరి.

"అదేమిరా మురళీ ఈవేళ అన్ని తప్పులు చదివితివి, నీకేమైన పిశాచము పట్టినదా" అని శంభుశాస్త్రి ఆశ్చర్యమును వెలువఱచెను.

"నిజమేసుమా మురళి, స్వరము తప్పులు చూచి నేనెంతో ఆశ్చర్యపోయినాను. ఎవరికయిన పొరబాటు ఉండవచ్చును కాని మురళికి ఎందులోను ఇదివరకెప్పుడును, పొరబాటు రాలేదు సుమా!" అన్నాఁడు జగన్నాధము మురళి ఏమి మాట్లాడలేదు. "పోని చదివితే చదివానులే ఆ మంత్రపుష్పమునకది చాలదా" అనుకొని వారి మాటలను లక్ష్యపెట్టలేదు,

"చాలు ఈపాటికి ఆ విమర్శనలు" రేపు చూచుకొనవచ్చును. పదండి ఇంటికి" అని రామావధానులు వారి వివాదము మాన్పెను.

* * * *

"మురళి స్నానంచేసి జావపట్టుకు వెళ్లు నాన్న పాపం నీకొరకు ఎదురుచూచు చుండును." అని కేకవేసినది, మురళితల్లి కామేశ్వరమ్మ వంట ఇంటినుండి.

"అబ్బ! నేనుచదువుకొనవలెను, నీవు తీసుకొనివెళ్లుము."

"ఏమి చదువురా నాయనా!"

నిన్నటి దగ్గరనుండి నీకు చదువు పోయినది. మీనాన్న ఆసుపత్రిలో నున్నాడుకదా నీకు పాఠము ఎవరు చెప్పుతున్నారు. చదువుకొనుటకు!

"అమ్మా అన్నయ్య చదువుచున్నది అదికాదే! కరణంగారి అబ్బాయిల దగ్గర తెచ్చు

కొనిన క్రొత్త పుస్తకమే'' అన్నదిబాల. ''ఏపుస్తకమయిన నాకెందులకు? ఈవేళ చిన్న చెల్లెలికి జ్వరముగా నున్నది. చెయ్యి దిగుటలేదు. అందువల్లనా నిన్ను బ్రతిమాలుట, లే బాబూ'' అని బ్రతిమాలినది కామేశ్వరమ్మ.

"ఇదిగోనమ్మా వెళ్లుచున్నాను స్నానమునకు. గిన్నెలో జావపోసియుంచు. వచ్చుచున్నాను." అని మురళి స్నానమునకు లేచెను.

స్నానముచేసి చిన్న తడి యంగవస్త్రము కట్టుకొని, తడి యంగవస్త్రము గిన్నె మీఁదఁ గప్పుకొని రెండు మూఁడు ఫర్లాంగుల దూరమున నున్న ఆసుపత్రికిఁ జేరుకొనెను.

"నాన్నా! ఇదిగో జావ తెచ్చితిని లే." మంచము మీఁదనున్న శాస్త్రి యేమియు మాట్లాడలేదు. ప్రతి దినము మురళివచ్చి రావడముతోడనే "వచ్చితివా అబ్బీ!" అని అతి వాత్సల్యముతోఁ బల్కరించేవారు. కాని యీరోజు మురళివంక చూచుచునే మాట్లాడలేదు. తండ్రి వెఱ్ఱిచూపు, బట్టలు అవి లాగుకొనుట, చూచి మురళి యడలిపోయెను.

"ఏమి నాన్నా లేవలేవా! పోసీ నేను పట్టనా?"

"ఏయ్ అబ్బాయి! ఆయనను పల్కరించకు" అన్నది ఒక నర్సు.

"ఏమి?"

"తెలియుట లేదా? సంధి యెత్తినది" అన్నది ఆమె.

మురళి యదివిని తండ్రిస్థితి తలఁచుకొని యొక్కుమ్మడిగా బావురు మనెను. ఆనర్సుకు జాలికలిగి మురళిని పెద్ద డాక్టరువద్దకుఁ దీసికొని వెళ్లెను.

"అబ్బాయీ! ఇంటికివెళ్లి యెవరినైనను పెద్దవారిని దీసికొనివచ్చి మీ తండ్రిని ఇంటికి తీసికొని వెళ్లుము" అన్నాఁడు పెద్ద డాక్టరు.

"ఎందులకండీ?"

"అవి యన్నియు నీతోఁ జెప్పకూడదు. త్వరగా ఎవరినైనను పిలుచుకొని రమ్ము. అసలు ఈవరకే యింటికి పంపియుందుము కాని, మీ ఇల్లు తెలియలేదు. వెళ్లి త్వరగా రమ్ము."

మురళి యొక్క పరుగునవచ్చి అమ్మతో నన్నియుఁ జెప్పెను. కామేశ్వరమ్మ పిల్లలుకూడ ఒక్క మాటుగా గొల్లుమన్నారు. ఇంటియాయనవచ్చి వారి యసహాయ స్థితినిఁజూచి గుండె కరిగి మురళిని చిక్కనిని దీసికొని ఆసుపత్రికివెళ్లి శాస్త్రిగారిని బండిమీఁద నింటికిఁ దీసికొని వచ్చెను. శాస్త్రిగారికి ఒంటిమీఁద స్పృహ లేదు మధ్యాహ్నము రెండు గంటలకుఁ జావు తెలివి వచ్చినది. ఒకమారు కండ్లు విప్పి పిల్లలను ఆశీర్వదించినారు. భార్యవంక నొకమాఱు మాత్రము తన దృష్టిని సారించి మఱలఁ గండ్లు మూసికొనెను. అంతే, అంతటిలో శాస్త్రి తమ యిహలోకయాత్రి కాకినాడ మహాపట్టణమునందలి అద్దె కొంపలోఁ జాలించినారు. ఉభయ భాషా ప్రవీణుఁడయి యందఱి మెప్పువడసిన శాస్త్రిగారికి కాలకర్మను దరించుటకు శక్యము కాలేదు.

మురళి, కర్మ యథావిధిగ నాయింటివారి సహాయముతో ముగించెను. తండ్రి పోయినాడని విని శాస్త్రిగారి పెద్దకుమార్తె మాత్రమువచ్చినది. వియ్యంకుని జీడి అంటుకొనఁ గలదని వియ్యంకుఁడు కామేశ్వరమ్మన్న రాలేదు. కామేశ్వరమ్మ పని ముగియఁగనే వెడలిపోవ నెంచినది. కానియే డాదినుండి యుండిన యూరిని, అంత హఠాత్తుగా

విడుచుటకు వీలుకాలేదు. అందుచేత నొక నెల వఱకు నక్కడ నాగిపోయినది. మురళికి మాత్రము కాకినాడ విడువవలెనన్న మనస్సొప్పలేదు. అతనికి ఇంగ్లీషు చదువవలెనని గట్టికోరిక గలిగినది. కరణముగారి యల్లుళ్లున్నన్ని రోజులు వారి వద్దకువెళ్లి యింగ్లీషు అక్షరములే కాక రెండు మూఁడు పుస్తకములనుకూడ ముగించెను. ఇంక కాకినాడ వచ్చినప్పటినుండియు ఆయింటి యాయన వద్దకువెళ్లి తన చదువును సాగించుచునే యుండెను. అప్పటికి మురళికి రెండవ ఫారమునకుఁ దగిన జ్ఞానము కలిగినది. అతనిని శితబుద్ధి యందులోను నింగ్లీషు భాషయందలి అభిలాష, వానికి దోహదమయినవి. అందువల్ల నెక్కడ నింగ్లీషు కాగితము కనఁబడినను అత్యాతురతతో దానిని తంటాలు పడియయినను జదువు చుండెడివాఁడు. ఈ విధముగాఁ దన విద్య నెన్నో మార్గముల ద్వారా యభివృద్ధికిఁ దెచ్చుకొనుచుండెను: అతని శ్రద్ధచూచి యింటియాయన యింకొక్క సంవత్సరము చదివిన నైదవ ఫారములోఁ జేరఁగలవని చెప్పెను. అందువల్ల మురళి కాకినాడలోనే యుండిపోయి చదువుకొనెదనని తన నిశ్చితాభిప్రాయము తల్లి కెఱుకపఱచెను. ఆమెయొప్పుకొనలేదు. కాని మురళి దేవరపల్లి రానని పట్టుబట్టెను. స్వతఃగా కామేశ్వరమ్మ యమాయకురాలు; అందులో మురళియన్న యామె ప్రాణము విడచును ఇంటివారు, అబ్బాయి యంత సరదా పడుచున్నప్పుడు, ఉండుటే మంచిదని సలహానిచ్చుటచేత, ఆమె కాకినాడలోనె యుండుటకు నిశ్చయించుకొన్నది. ఇంకేమి మురళి నిరాఘాటముగాఁ దన కోరిక సిద్ధింపఁజేసికొనవచ్చును. ఇంటియాయనకే మైదు రూపాయలిచ్చి విడిగా నొక సంవత్సరము చదువు సాగించి పాఠశాలలోఁ బ్రవేశించెను. తుదకు మన పల్లెటూరి మురళీధరశర్మ కాకినాడ యందలి కాలేజి విద్యార్థి యయినాఁడు. మురళీధరుఁడు ఇప్పుడు బి. ఏ. అయినాఁడు. ఎంతటి శ్రద్ధ, ఉత్సాహము కలిగియున్నను మురళికి స్కూల్ ఫైనలులో రెండేండ్లుండక తప్పినదికాదు. తరువాత మాత్రము క్రమముగా నుత్తీర్ణుఁడైనాఁడు. పాఠశాలలోఁ బ్రవేశించిన రోజులలో మురళికొక గట్టిచిక్కు వచ్చినది. తరగతి పిల్లలందఱు "నేను ఇది చదివినాను, అవి చదివినాను, అది చాలా బాగుండును ఇది మిక్కిలి బాగుండును" అని ఒకరితో నొకరనుకొనెడివారు. పంచకావ్యములను, మనుచరిత్ర మొదలగు ప్రబంధములను అనేకములను చదివియున్నాఁడు మురళి; కాని అవి "నేను చదివితిని" అని చెప్పుకొనుటకంటె వేఱుతలవంపు కూడ నుండియుండదని యతని దృఢాభిప్రాయము. అందువల్ల అట్టి ప్రసంగములు వచ్చినప్పుడు మెల్లగా జారెడివాఁడు. ఎట్లో దైవానుగ్రహమువల్ల నా యిబ్బంది పోయినది. తాను బి. ఏ. చదివిన తరువాత కూడ నొకటి మాత్రము చాల బాధకముగా నుండెడిది. ఎవరయినను దగు మనుష్యులు మాత్ర మేమిపని చేసినారని యడిగినప్పుడు మురళికిఁ జచ్చినచావయ్యెడిది. "మా నాన్న స్వగ్రామములో నుండి తన జీవితమును స్వేచ్ఛగా వెళ్లఁబుచ్చినారని చెప్పుటకు నూరింకొకటి వచ్చెడిదికాదు." ఇటువంటి సమయములలోఁ దన తండ్రియంత యవివేకముగను దూరదృష్టి లేకుండఁగను బ్రవర్తించినందులకుఁ జచ్చిన తండ్రిని గసిదీరఁ దిట్టుకొనెడివాఁడు.

మురళీధరుని విద్యార్థిజీవితమునకై రెండెకరముల భూమి బలియయిపోయినది. బడిలోఁ

ప్రవేశించి ప్రవేశించుటతోనే పట్టెడు జుట్టు ముడికి స్థానభ్రష్టత్వము కలిగి దాని స్థానమున క్రాఫింగుంచఁబడినది. లాగులు స్లిప్పర్లు బెల్టులు, ఇవియవియన వీలులేదు. మురళి నవనాగరికుల కొఱకై యేర్పడిన రూల్సన్నింటిని దననిత్య జీవితములోనికిఁ దీసికొనివచ్చెను.

మురళి గ్రాజ్యువేటు అయిన తరువాత సూట్లు వేసికొని యుద్యోగపు వేటకయి బయలు దేరెడివాఁడు. దర్జా కొరకు టీ పార్టీలు జోరుగా జరిపించినాఁడు. ఇప్పటికి బి. ఏ. ప్యాసయి మూఁడేండ్లయినది కాని యుద్యోగము కనఁబడలేదు. మురళిచేసెడి ప్రయత్నములు, ఖర్చులు అన్నియుఁ గూడ గోదావరిలోని కాకిరెట్టలయి పోయినవి. మురళిభార్య, మురళీ యఫ్. ఏ. మొదటి సంవత్సరములో నుండగనే కాపురమునకు వచ్చినది. ఇప్పటికిద్దరు పిల్లలు. తల్లి, యిద్దఱు చెల్లెండ్రు, భార్య, యిద్దఱు పిల్లలు, తాను, ఉన్న ఆ కుటుంబభారము నిర్వహించుట కొక యెత్తుని యేగాని యయినను తాను సంపాదించుటలేదు. ఒక్క ఎకరముభూమి మాత్రమున్నది. వేనకు వేలు కొడుకు సంపాదించునను నాశతో కామేశ్వరమ్మ మురళి పరివర్తనమున కిసుమంతయైనను ప్రతిబంధకముగ నుండెడిదికాదు.

మధ్యాహ్నము మూఁడయినది. మురళి దుస్తులు వేసికొనుటలోనతలకుతలమయి పోవు చున్నాఁడు. ఎట్లో పావుతక్కువ నాలుగు గంటలకు కంఠపాశాదులతో డ్రెస్సు పూర్తి చేసి కాఫీ చుక్కలు గొంతులోఁ బోసికొని సైకిలెక్కి వేగముతో బయలుదేరినాఁడు, ఇదివర కుద్యోగము కొఱకయి రెండు మార్లు దర్శించిన ప్రిన్సిపాలు గృహమునకు.

ఒక పెద్దభవనము ముందు నిలుచుండి తన విజిటింగు కార్డును సేవకునిచే లోపలికిఁ బంపెను. సేవకుఁడు తిరిగివచ్చి మురళిని లోపలికిఁ దీసికొని వెళ్లెను. పరస్పరాభినందనము లయినవి.

"ఎవరు మీరు? ఎందుకు వచ్చినట్లు?"

"నేనిదివరలో తమ దర్శనము రెండు సార్లు చేసికొనినాను."

"నాకు మీరే జ్ఞాపకమాయేమి? ఎందులకు వచ్చినారో త్వరగా తెల్పుడు."

"చిత్తము. ఏమున్నది ఉద్యోగము కొఱకు."

"నాకిప్పుడు తీరికలేదు. రేపుదయము దయచేయుడు."

"తీరికకేమున్నది. సరే వెళ్లెదను."

"ఇప్పుడేవియును ఖాళీలేవు."

"బి. ఏ. ప్యాసయినాను" అన్నాఁడు మురళి సగర్వముగాను.

"ఇప్పుడేవియు లేవు."

"పిల్లలుగలవాఁడను, కరుణించవలెను."

"గొప్పపనే! నన్నేమి చేయుమనెదవయ్యా పనులు లేనప్పుడు."

"నేను అల్పసంతోషిని. రు. ౨౦ అయినను సంతృప్తి పొందగలను."

"౨౦ కాదుకదా పావలాకయినను ఖాళీ లేదు."

తెల్లవారినది మొదలు నిద్రించే వఱకు కూడా ఉద్యోగమే యనుచు దేవిరించు ముఖాల దర్శనమే మాకగుచుండును. తిన్న తిండి యొంటఁబట్టుటలేదు ఈ సంతతోటి. ఉద్యోగముల పాత్ర ఉన్నదనుకొనుచున్నారా ఏమి మా

దగ్గర! అబ్బబ్బా! ఏమి చంపుచున్నారు. పోవచ్చు ఈపాటికి. ఇంకను నాయెదుట ఎందులకు?''

మురళికి ఆశనిపాతము పడినట్లైనది. మెల్ల మెల్లగా బయటకువచ్చి సైకిలు నధిష్ఠించి సావకాశముగా నింటికి, ఏడు, ఎనిమిది గంటలకుఁ జేరుకొనెను.

రాత్రి మురళికి నిద్రలేదు. ఒకవేళ పట్టినను, ఉద్యోగపుకలలే. హఠాత్తుగా మురళికిఁ దండ్రి జ్ఞాపకమునచ్చెను. తన జీవితమును దండ్రి జీవితముతో పోల్చి చూచినాఁడు. ఆ రెంటికిని హస్తిమశకాంతర మున్నట్లు గ్రహించినాఁడు. తన తండ్రి ఒక్కనాఁడయినను ఒకరిచేత వ్రేలు వంపించుకొనలేదు. పరువు మర్యాదలతో స్వేచ్ఛగా నిర్విచారముగా, అతని జీవితము జరిగినది. తనకో, లేచినది మొదలుకొని యెక్కెగుమ్మము దిగే గుమ్మము; ఇప్పుడు తానుద్యోగార్థ మెందఱి నాశయించెనో, యెందఱివల్ల తిట్లుతినెనో లెక్కలేదు. అటువంటి తనకును దండ్రికిని పోలిక యెక్కడ? ఆ దినము ప్రిన్సిపాల్ అన్నమాటలు మఱపునకురాక బాధించుచుండెను. ఇంకెన్నఁడు నుద్యోగ ప్రయత్నము చేయనని గట్టియొట్టు పెట్టుకొనెను. కాని ఉద్యోగములేకున్న జీవితయాత్రకు దారిలేదా?

ఈ యోజనలతోనే తెల్లవాఱినది. మురళి యేమియుఁ దోఁపక మతిపోయిన వానివలె కుర్చీలోఁ గూర్చుండి యున్నాఁడు.

''పోస్టుమ్యాన్, సర్!''

''ఎక్కడనుండి రా అబ్బాయీ''

''మామయ్య వ్రాసినాఁడు.''

''లలితా! లలితా మీనాన్న యిద్దనుండి ఉత్తరము వచ్చినది ఇటురా! ఏమని వ్రాసినాఁడురా?''

''ఏమున్నది? మామూలే. దేవీ నవరాత్రులు చేయునట. ఆహ్వానము.''

''నేను పిల్లలు అక్కడికివెళ్లి నమా నాగరికత అంతయు నట్టేటఁ గలియునని మీరు భయపడుదురని మానాన్న యెరుగఁడు'?అని లలిత యెత్తిపొడుపుగ మాట్లాడెను.

''అబ్బాయీ! నీకెందుకురా అంత పట్టుదల? ఈమారు నేనే దానిని పిల్లలను తీసికొని వెళ్లెదను.''

''ఎందులకమ్మా మన మందరమును వారికి ఖర్చు కలిగించుట తప్ప మరేమిలేదు.''

* * * *

కామేశ్వరమ్మ వంటలో నిమగ్నయయినది. ఇంక లలితమాట చెప్పవలెనా? వచ్చినది పుట్టినింటికి, అందులో బహుకాలమునకు; అంతేకాక అటువంటి శుభ సమయములందు నక్షత్రహారతి మొదలగు హారతులను పూజ కవసరమగు పళ్లెరములను తోమి తుడిచి యెక్కడి వక్కడ నమర్చి యువతీమండలి యందైక్య మయినది. మురళి చెల్లెండ్రు బిడ్డలుకూడ దేవీ పూజకై పుష్పములు తెచ్చుటలో, చద్ది అన్నము మాట మఱచి పోయిరి.

సాయంకాల మారయినది. మందిరపు గది ముందర హాలులో పఱవఁ బడిన తాటి యాకుల చాపమీఁద భక్తులెల్లరు నాసీనులయిరి. ఇంటిలోనివారు కూడ నెవరి పనులను వారు చక్కఁజేసికొని వచ్చి పూజచూచుటకుఁ గుతూహల పడుచుండిరి. వేంకటావధానులు స్నాతులయి యారవేసిన మడి పట్టుపీతాంబరమును గట్టి యుత్తరీయ

ము నోంటినిండఁ గప్పుకొని విభూతి ధరించి జార చెంబు చేతబట్టి దేవీ మందిరము ముందటి పీట పైన దర్భాసనము పఱచుకొని దానిపై నధిష్ఠించి సంధ్యావందనాది కృత్యములను నిర్వర్తించి పూజకు మొదలిడిరి. అపరపార్వతియో యనునట్లున్న సుబ్బలక్ష్మి మగని సరసను కూర్చున్నది. కొంతసేపటికి సహస్రనామ పూజా సమయము వచ్చెను. వేంకటావధానిగారు దేవీనామములు చెప్పుచుండఁగా వారి ధర్మపత్ని కుంకుమను పుష్పములను బిల్వదళములను దేవీ పాదపద్మములపయి నతిభక్తితో నమ్రతతో నుంచుచున్నది.

సహస్రనామ పూజ యగుటతోనే పిల్లలలోఁ బెద్ద కోలాహలము జనించినది. పిల్లలందఱు గుమిగూడి జయగంటల కొఱకు, శంఖము కొఱకు హోరాహోరిని యుద్ధము చేయుచుండిరి. ఇంతలో నెవరో మహాత్ములువచ్చి వారిలో వారికి సంధికుదిర్చి ఘుణ్యాము కట్టుకొనిరి. జయఘంట శంఖము మొదలగు జయజయ ధ్వానములు మ్రోగుచుండఁగా వేంకటావధానిగారు క్రమముగా నక్షత్రహారతి నఱకు హారతులు వెలిగించిరి. తదనంతరము నైవేద్యాది విధులు సక్రమముగా జరిగినవి.

మురళి, బావమఱది కలిసి సభవారందఱకు మంత్రపుష్పములను బంచిరి. అక్కడనున్న వారిలో నూటికిఁ దొంబది తొమ్మిదిమంది పండితులగుటచేత నందఱు నొక్కమాఱుగా మంత్రపుష్పమును సాగించిరి. మురళి యొక్కమాఱు కండ్లు మూసి యామంత్రపుష్పమును వినినాఁడు. "ఎన్నినాళ్లకు వింటి నీమంత్రపుష్పమును!" అనుకొనినాఁడు. హృదయము పొంగిపోయినది. సర్వాంతర్యామియైన భగవంతుని దలఁచుకొని సర్వమును మఱచెను. తానుకూడ, మనసుదీర, కఱవుదీరఁ, గంఠమెత్తి యందఱితో సమానముగా మంత్ర పుష్పమును జదివెను. తరువాత దేవీ ప్రసాద మందఱకుఁ బంచిరి. సభవారు దేవికొక నమస్కార మర్పించి నిజనివాసములకుఁ జనిరి.

ఏడవనాఁటి యుదయము వేంకటావధానిగారెవరితోనో మాట్లాడుచు, మందిరమునఁ గూర్చుండి పూజకై తెచ్చిన పుష్పముల యందలి తుక్కునేరుచున్న మురళిని బిలిచెను.

"వీడేనండీ మాచెల్లెలి కొడుకు; పెద్దపిల్లనిచ్చినాము. బి. ఏ. చదివినాఁడు."

"ఆలాగా! వీరు మంత్ర పుష్పము చదువుటచూచి, ఇంగ్లీషు చదివినవారు కారనుకొంటిని. ఏమి కంఠము! ఎంత శ్రావ్యముగా నున్నది! ఏమిపని స్వామి?"

"పనిలేదు, పాటలేదు. అయితే మీ దేవీ నవరాత్రములు నిర్విఘ్నముగా జరుగుచున్నవా?"

"ఏమిసాగుట యేదో ఆచిల్లర అర్చకుల చేతనే చేయించుచున్నాము."

"ఏమి, రామయ్యగా రేమయినారు."

"అయ్యో తండ్రీ ఎఱుగరా. రామయ్యగారు స్వర్గస్థులయినారు. వారి స్థానము నాక్రమింపఁదగిన వారెవ్వరును నాకుఁ గనుపడలేదు. మీయింటి కిప్పుడెందఱో పండితులు వత్తురని విని వారెవరయినను మాపై ననుగ్రహముంచూపి మమ్ముల కృతార్థులఁ జేయుదురేమో యను నాశతో వచ్చితిని ఇక్కడకు"

"అర్చకున కేమిచ్చెదరు.?"

"పూర్వము ౩౦ రూ. బస్తా బియ్యము ఇచ్చినవారము. ఇప్పుడు ౫ రూ. ఎక్కింపఁ దలఁచు చున్నాము అసలు మంచివాఁడెవరయిన దొరికేపక్షమున."

అబ్బ! అర్చకుని కంతజీతమా" అని మురళి సాశ్చర్యముగాఁ బ్రశ్నించెను.

"మేమిచ్చెడి జీతమేకాదు, భక్తులు సమర్పించుకొనెడి కానుకలు కూడ ఎన్నియో ఉంటవి."

"నీకేమైన ఆశగా నున్నదా చెప్పు!"

"అబ్బో బి. ఏ. చదివిన ప్రభువులు వారికీ యర్చకత్వమెందులకు బాబూ. వేనకువేలు సంపాదింతురు."

"ఆ, సంపాదించినట్లే యున్నది. నూఁడేండ్లయినది, ఎట్టిని పగానిమైనను ఆర్జించలేదే" అని మురళినిస్పృహచెందెను.

"మురళీ ఊరకుండుటకంటె ఈపని చూచుకొన కూడదూ? .అర్చకత్వమన్న సర్వేశ్వరుని సేవగాని మఱొకటికాదు. అందునకు సుబ్బయ్యశెట్టిగారు కడుఉత్తములు. వారింతగా ప్రాధేయపడుచున్నప్పుడు తప్పక వెడలవలసినదె! శెట్టిగారు! మాబావ అంతటి ఘనుడు ఈ లోకమున నుండడు వారు ముందురాగల వన్నియు తెలిసినవారు కనుకనే వానికి మా వైదిక విధులన్నియు చిన్న తనముననే నేర్పి పంచకావ్యములు, వేదములు కూడ నేర్పించినారు. కొనకు వారిచ్చిన భిక్షయే పనికివచ్చినది కాని వాడు స్వతంత్రించి చదివిన బి. ఏ. ఎందులకు కూడా కొరగాలేదు. మా మురళిని మీరు తీసికొని వెళ్లుడు."

"ఆహా నాజన్మ ఈనాటికి సార్థకమయినది. మీరి మంత్రి ప్రశ్నము విన్నప్పటినుండియు మా భీమేశ్వరుని సేవ కిటువంటి వాడుండిన బాగుండుననుకొంటిని. తుదకు మా భీమేశ్వర స్వామి రత్నమునే ఏరుకొనినాడు." అని మహానందమును వెలిఁబుచ్చెను.

"శెట్టిగారు నేనెప్పుడు రావచ్చును."

"అయ్యో మేము నిన్నాజ్ఞాపించెడివారమా స్వామి? మీ చిత్తము వచ్చినప్పుడే దయచేయుడు." అని యతివినయముతో నుత్తరమిచ్చెను.

"అట్లయిన మా మామ నవరాత్రములయిన తరువాత వచ్చెదను"

"చిత్తము ప్రభూ! బాబూ ఇంకొక్క మనవి. ప్రతి దినము మీరు పూజచేయ నవసరములేదు. ఇటువంటి పర్వదినములలో మాత్రము తమ స్వహస్తములతో ఆ పురాణదంపతులకు పూజచేసిన జాలును."

"ఎంతమాట దేవుని పూజ రోజు చేసిన పాపమా! ఇంక మీరేమియు చెప్పవద్దు నేనన్నిటికిని అంగీకరించితిని."

"అమ్మా! అమ్మా! పెద్దక్కయ్యవాండ్లు వచ్చినారే"యనుచు, ఆసంగతి చెప్పుటకు భవాని పరుగెత్తుకొనుచు నింటిలోనికిఁ బోయినది.

"వచ్చినారా వదినె? ఎన్నాళ్లకు చూచుకొంటి మమ్మా మనము! లలితా! కులాసాగా నున్నావా? పిల్లలేరీ? అబ్బో ఎంతవాళ్లయినారురా తండ్రీ! నాయనా ఈనాటికయినను మా మీఁద నీకనుగ్రహము కలుగుట కొంతవఱకు మా అదృష్టమే." అని సుబ్బలక్ష్మి అందఱి

నన్ని విధములఁ బలుకరించి లోపలికిఁ దీసికొని వెళ్లెను.

వేంకటావధాని గారిది నరేంద్రపుర గ్రామము. అవధానిగారు కొంచెమున్న వారనియే చెప్పవచ్చును. వారి కా గ్రామమునందెంతో పలుకుబడి, పేరు ప్రఖ్యాతులున్నవి. వీరు వేదపారంగతులు, వీరుచేయు దేవీ నవరాత్రులు చూచినవారికి ధర్మరాజు రాజసూయము జ్ఞాపకము వచ్చును. ఈ దేవీ నవరాత్రములకు గ్రామస్థులందఱు నేకమై చందాలు వేసికొని యీ నవరాత్రులకు కావలసిన ఖర్చులను భరించెదరు. అవధానిగారి గృహము ముందఱ నొక పెద్దపందిరి వేసెదరు. దొడ్డిలోఁ గూడ వంటకు భోజనములకు నొక పందిరి వేసెదరు. వీధిలోని పందిరికి ప్రతిదినము మామిడాకుల తోరణముల తోడను, రంగురంగుల కాగితపు బుట్టలతోడను నూతన శోభను గల్పింతురు. ప్రతిదినము తెల్లవారు నప్పటికొక ఫర్లాంగు దూరము వఱకు ముగ్గులు పెట్టియుంచెదరు. ఇంక లోపల మందిరమునకుఁ గూడఁ దోరణములు కట్టెదరు. దేవీ మందిరమునకు రకరకముగల పూసలతోను పాదరసపు బుడ్లను, పూవులను ఇంకెన్నో యలంకరణముల నలంకరించెదరు.

మురళి కివన్నియు నాశ్చర్యముగఁ గనిపించినవి. అతఁడిదివఱ కెప్పుడో యొకమారో రెండుమార్లో చూచుటచేత నంతగా నివన్నియు కనిపెట్టలేదు. మురళి కా గృహమున వెదకుదమన్నను, నిరుత్సాహము, చింతచే ముకుళింపఁబడిన ముఖమును గనబడలేదు. ఎచ్చట చూచినను, నానందము, నిశ్చింత, శాంతి, ఉత్సాహము తాండవించు చున్నవి. వారందఱిని జూచుసరికి మురళి చింతలు పటాపంచలైనవి. తనస్థితిని బొత్తిగా మఱచిపోయి యతిశ్రద్ధతో దేవతార్చనకయి సామగ్రిని సమకూర్చుటలోఁ బాటుపడు చున్న యువకబృందములలోఁ జేరి యానందించెను.

బి. ఏ. గారయిన మురళీధర శర్మగారికి దాక్షారామ భీమేశ్వరస్వామి పాదముల సమీపమునఁదప్ప స్థలములేక పోయినది!



# వీరాబాయి

శ్రీమతి. ఎ. సావిత్రి.

చిత్తూరు

ప్రవేశము: సైనికులు విచారముతో వారు వచ్చునప్పటికిఁ దలుపులు మూయఁబడి యుండును.

సై:— తలుపూ! తలుపూ! (తలుపు తట్టును) (తలుపు తీయకుండనే)

వీ:-మీారేనా రణమునందు మొగలుల చే ఓడిపోయి ప్రాణములు దక్కించుకొనివచ్చినది? శూరాగ్రేసరులారా? జనకసమానుఁడగు రాజును జెరలో బెట్టించి ఏ మొగముతో మరల రాఁగలిగితిరి. మీారు రాజపుత్రులుకారా! మావలెగాజులు వేసికొని ఇంటిలో వంటపని చేయుటకు వచ్చితిరా! చాలు. చాలు. ఇఁకనైనను బుద్ధి తెచ్చుకొని రణభూమి కేగి జయముగాంచుడు. లేదా వీరస్వర్గమునైన పొందుడు.

(ఒక స్త్రీయును పురుషుఁడును ప్రవేశింతురు.)

స్త్రీ:— ఏమంటిరి? అపజయము గాంచితిమంటిరా! సరియే ఇఁక మాకు మీాకు భేదమేమి? ఇదిగో యీా చీరకట్టుకొని ఇంటిలో కూర్చుండుఁడు లేదా మీారు నిజముగ రసపుత్రులేని యుద్ధము చేసి వీరస్వర్గము గాంచుడు. శత్రువులచే జంపబడుటలేదా జయముగాంచుట వీరధర్మము. గావున రణమునకు సంసిద్ధులై ఇతరులను పురికొల్పుఁడు.

పురుషుఁడు:— కాంతా! నాకు జ్ఞానోపదేశము చేసితివి. ఇదే నేను వెళ్లుచున్నాను (ఆయుధములను దీసికొని పోవును).

అంతఃపురము

(వీరాబాయి ప్రవేశించును)

వీరాబాయి (స్వగతమున):—నాభర్తను మ్లేచ్ఛులు ఖైదీచేసిరి. రాజపుత్రులోడిపోయిరి. చిత్తూరింక తురకలయాధీన మగును. ఇప్పుడింకఁ గర్తవ్యమేమి? ఏమి నా పిచ్చి! ఊరక యిట్లాలోచించుట తగదు. నేను ఉత్తమక్షత్రియ సంజాతను. నా స్వదేశమగు చిత్తూరును రక్షించుట నావిధి. నే జీవించి యుండగ నీ చిత్తూరును అన్యరధీనము కానీయను. ఇప్పుడు నేను పురుష వేషముతో బోయి సైనికులను బురికొల్పి నాభర్తను విడిపించెదను. లేదా రణమునఁ జచ్చి వీరస్వర్గము బొందెదను.

(ఆలోచనామందిరము)

(సైనికులాలోచనా నిమగ్నులై యుందురు)

ప్రవేశము:

(వీరాబాయి పురుష వేషముతో)

వీ:- రాజపుత్రులాలా! ఏమాలోచించుచుంటిరి?

(అందఱామె నాశ్చర్యముతోఁ జూతురు.

వీ:- ఏమి? అట్లు చూచెద రేమి? సమయము వచ్చినప్పుడు మేమిట్లు మాఱవలసి యున్నది. మా విధ్యుక్తధర్మమిది. మీరు నెరవేర్పుఁడు. రాజపుత్రులారా! మీరిట్లు చింతించుచు ఎవరికొఱ కెదురుచూచుచున్నారు? మీ శౌర్యధైర్యాది క్షత్రియగుణము లెక్కడికి పోయినవి? మీయందు క్షత్రియరక్తము ప్రవహించుటలేదా! చిత్తూరప్పుడే పౌరుషహీనమయ్యెనా? భారతదేశ మప్పుడే నిస్తేజమై పోయెనా? క్షత్రియులమని చెప్పుటకు మీనోరెట్లాడుచున్నది.? క్షత్రియకులమునఁ బుట్టి, ఆకులమున కప్రతిష్ఠ తెత్తురా? చేతులకు గాజులు వేసికొని యింటఁగూర్చుండుట కేల సిగ్గుపడకున్నారు? మీకాంతల యుపదేశమువల్ల నైనను సిగ్గురాలేదా? ఒక స్త్రీచే నిట్టిమాటలు పడుటకంటెఁ జచ్చిన మేలుగదా! శూరాగ్రేసరులారా! ఇఁకనైనను బుద్ధి తెచ్చుకొనుఁడు. మీకుఁ గలిగిన పౌరుషహీనతయను కళంకమును ధైర్యమను నీళ్లచేఁ గడిగి వేయుఁడు. మీ యొఱల నున్న కత్తులఁదీసి జయఘోషలు సలుపుచు యుద్ధభూమికి నడువుఁడు. నేనిదే పోవుచున్నాను.

(గుఱ్ఱము నెక్కి- నిష్క్రమించును)

సైనికులు:- జయ్! ఉదయపుర రాణాకి జయ్! జయ్! వీరాబాయికిజయ్!

(వీరాబాయి ననుసరింతురు)

(ప్రవేశము ఇరువురు పురుషులు)

౧ పు:- సహోదరా? యుద్ధపుసంగతులేమైనఁ దెలియవచ్చెనా!

౨ పు:- నీ దేశపు సంగతులు నీకే తెలియకున్న నింకేమి తెలియును?

౧ పు:- సైనికులను పురికొల్పినది మన రాణీగారేనఁట. మేకలుగానున్న వారిని శార్దూలములుగా మార్చినదఁట!

౨ పు:- అట్లు ప్రోత్సహించుటేకాదు ఆమె జయముకూడఁ బొందినది.

మన రాణి స్వయముగా యుద్ధముచేసి ఎందఱినో స్వర్గమున కంపెను. శత్రుసేనలఁజించి చెండాడినదఁట. రాణిగారి పరాక్రమమునకు అక్బరాశ్చర్యపడి యట్లే నిలువమని రాజపుత్రులు రెట్టింపు టుత్సాహముతో శత్రువుల ననేకవిధముల బాధింప, అక్బరు సంధిచేసికొనెను. అక్బరు సంధిపతాకము నెత్తువఱకు నేనక్కడనే యుంటిని.

౧ పు:- అంతటివాని నట్లొనర్చిన మన రాణి శౌర్యధైర్య గుణములు వర్ణింప నాదిశేషునకైనఁ దరమౌనా?

౨ పు:-అక్కడ దేమి? ఉత్సవము జరుగుచున్నది. చూతమురా. (నిష్క్రమింతురు)

స్వదేశీయుఁడు.

వి:- అయ్యా ఈ ఉత్సవము లేమిటి?

స్వ:- అయ్యా! నాకామాత్రము తెలియదా! మారాణి వీరాబాయి విజయలక్ష్మి చేకొని రాజుతోఁ గూడ ఈ దినము పురప్రవేశము చేయును. అందులకే ఈ ఉత్సవములు జరుగుచున్నవి. ఎక్కడఁ జూచినను సంతోష స్వరములే వినఁబడుచున్నవి. మనముఁ గూడఁ జూచి యానందింతమురమ్ము. (నిష్క్రమింతురు)





# లక్ష్మి

శ్రీమతి. స్నేహలత (నాల్గవఫారము)

అది ఒక పల్లెటూరు. ఊరిమధ్య ఒక పూరిల్లు. భార్య, భర్త ఆరు సంవత్సరముల బాలిక, నివసించుచుండిరి. తండ్రియగు రమణయ్యకు ౫౦ రూపాయల జీతము. తల్లియగు సీతమ్మకు కాపురమునకు వచ్చిన ౧౦ సం॥ లకు లక్ష్మి జనించెను. రమణయ్యకు బిడ్డ పుట్టకముందే పెండ్లి ప్రయత్నము. ఉద్యోగము దొరకినప్పటి నుండి ౨౦ లూ॥లతో సంసారముచేయుచు ౩౦ రూపాయలు దాచిపెట్టుచుండెను. లక్ష్మికి ప్రతి దినము ఇంగ్లీషు, తెలుగు, సంస్కృతము తాను చెప్పుచుండెను. లక్ష్మి ఇప్పుడు రెండవ తరగతి చదువుచున్నది.

లక్ష్మి చురుకైనబిడ్డ. అమాయకురాలు. పూర్వకాలపు బిడ్డ; పచ్చని మొగము, నల్లని కురులు, ఉంగరాలు తిరిగి నడిమి పాపట కిరుప్రక్కల చక్కగా కదలుచుండును. తెల్లని పరికిణీ, జాకెట్టు దమ్మిడీలోసగము బొట్టు పెట్టును. దానిక్రింద చిన్న పసుపుబొట్టు పెట్టును. పద్మాలవలెనుండు కండ్లనిండ కాటుక దిద్దుకొనెడిది. సన్నని నడుమునకు బంగారు ఒడ్డాణము, కాళ్లకు గొలుసులు, చెవులకు కమ్మలు, లోలకులు నగలు. నడుచుచుండ [illegible]

ఆమెను చూచిన భారత దేశమును ఉద్ధరించుట[illegible] పుట్టినదనిపించును. ఆమె నిష్కల్మష హృదయ[illegible] ఎన్నడును అసత్యమాడి యెఱుగదు. రమణయ్య[illegible] తన కూతురు బుద్ధిచూచి సంతోషించు చుండె[illegible]వాడు.

* * * *

ఇప్పుడు లక్ష్మికి పదియవయేడు. ఆ[illegible] తరగతి చదువుచున్నది. సీతమ్మకు క్షయవ[illegible] కొన్నాళ్లు మంచాన తీసికొని చనిపోయెను. కా[illegible] రమణయ్య ఒక్కగా నొక్కతె పిల్లఅని, భా[illegible] పోయిన దుఃఖముండియు, లక్ష్మికి ఒ[illegible] మంచి సంబంధము చూచి వైభవముగా పెం[illegible] చేసెను. పిల్లవానికి ౧౫ సం॥లు స్కూలు ఫై[illegible]లు ప్యాసయినాడు. రమణయ్య లక్ష్మిని ఒక[illegible] కుమార్తెయని గారాబముతో పెంచలేదు[illegible] మంచి నడవడిలో నడపెను లక్ష్మి ౮ గం॥ల[illegible] లేచి దంతధావనాదులుచేసి బడికివెళ్లి ఉపాధ్యా[illegible]యినికి పాఠము లొప్పచెప్పి, ఒంటి గంట[illegible] ఫలాహారముచేసి తిరిగి ౮ గం॥లకు వచ్చి [illegible] గం॥ల వరకు ఆడుకొని స్నానముచేసి దేవు[illegible] ధ్యానించుచుండును. లక్ష్మి భుజించి ౧౦ గం[illegible] [illegible] ఆమె వీలున్నప్పుడు కొ[illegible]

వలె గానము చేయును. ఇవి ఆమె చేయు నిత్య కృత్యములు.

లక్ష్మి కిప్పుడు ౧౪ సం॥లు. రమణయ్య రోగముచే చనిపోయెను. లక్ష్మి స్కూలు పైనల్ ప్యాసాయెను. మాధవరావు (లక్ష్మిభర్త) డాక్టరీ ప్యాసాయెను. మాధవరావును పల్లెటూరిలో వేసిరి. లక్ష్మికి అక్కడ ఉండుట ఇష్టమే.

అక్కడ పెద్దవారు చిన్నవారు ఎప్పుడు ఉబుసుపోకకు కబుర్లు చెప్పుకొనుచుండిరి. చిన్నవాండ్లెవరికి చదువన్న మాట రాకుండెను. ఆ ఊరిలోనికంత లక్ష్మియిల్లే పెద్దది. లక్ష్మి వాండ్ల యింటిలోనున్న పెద్దవసారా ఖాళీ చేసినది, ముందు తన ఈడు పిల్లలను, తక్కిన చిన్నపిల్లలను ఒకచోట చేర్చి చదువు నేర్పించుటకు మొదలుపెట్టినది. ఒక చదువేగాక అన్ని కుట్లు, కట్టెపని, డ్రాయింగు నేర్పించెడిది. కొన్ని రోజులకే పుస్తకము చదువునంత నేర్పు సంపాదించినారు అందఱును.

అందుచేత చరిత్ర చదివి వినిపించెడిది. జాగ్రఫీ గ్లోబుతోను చదువు నేర్పించెడిది. ఇది విని ప్రక్క ప్రక్కనున్న వాళ్లందరు చదువుకొరకు లక్ష్మి దగ్గరకు వచ్చువారు. లక్ష్మి విసుగుకొనక అందరికి చెప్పుచుండెడిది. ఇంక ముసలివాళ్లు ఎప్పుడు కబుర్లు చెప్పుకొనేవారు. పెండ్లను కూడ సరియైన దారికి తేవలెనని వాళ్లను గూడ పిలిచినది. వాండ్లు రామన్నారు, పైగా లక్ష్మి అందరికి చదువుచెప్పి పాడుచేసినదని తిట్లు తిట్టడము మొదలు పెట్టినారు. ఆమె ఆతిట్లకు లెక్కచేయక వారిని రమ్మని బ్రతిమాలినది. భారతము, భాగవతము చెప్పెదనన్నది. వారు "ఎండలో మేము రాలేమన్నారు. తన టాంగా ప్రతి ఇంటికి పంపినది. విధిలేక వెళ్లవలసి వచ్చినది వారికి.

౧౦ గంటలు మొదలు ౧౨ గంటలవరకు పిల్లలకు చదువుచెప్పు చుండెడిది. ౧౨ మొదలు ౨ వరకు అందరికి రామాయణమో, భారతమో, భాగవతమో చదివి వినిపించెడిది. ఒకసారి రాట్నము వడకినది. అందరు వడుకుట నేర్పుమన్నారు. సరే అని అందరికి నేర్పినది ఆపనిని. ఒక సంవత్సరముదాటి మరుసటి సంవత్సరము లక్ష్మినిచూచి అందరు ఖద్దరు బట్టలు కట్టుటకు ప్రారంభించిరి. ఇంక లక్ష్మికి ఇంటిలో పిల్లలు కూర్చొనుటకు స్థలమే లేకపోయినది. అప్పుడు ఊరిలో బడి స్థాపింపవలెనని యనుకొన్నది. అది విని ఊరిలో వారందఱును చందాలు ప్రోగుచేసి వెయ్యి రూప్యములతో భూమికొని ౫ వేలతో ఒక్క సం॥లో బాలికా పాఠశాల భవనము నిర్మించిరి. అచ్చట పిల్లలు ఈత చాపలపై కూర్చుండుట కేర్పాటుచేసిరి. దానికి "శ్రీలక్ష్మి బాలికా పాఠశాల" అని పేరుపెట్టిరి. ప్రధానోపాధ్యాయిని లక్ష్మి. లక్ష్మి స్నేహితురాండ్రుఉపాధ్యాయినులు. ఇట్లు రెండవయేడు కొంత యభివృద్ధి జరిగెను. లక్ష్మి కింకను తృప్తిలేదు.

ఈ చిన్న పిల్లలందరికిని ఈతనేర్ప వలెనని యనుకొన్నది. ఆ ఊరిలో ఒక చిన్న యుపనది యుండెను. దానిలో నేర్చుకొనుటకు మొదలు ఎవ్వరును ఒప్పుకొనలేదు. లక్ష్మి చిన్నపిల్లలకు నేర్పుచుండ దానిని చూచి అందఱు నేర్చుకోవలెనని యనుకొనిరి. అక్కడితో అందఱు నేర్చుకొనుటకు మొదలుపెట్టిరి. ఒక్క నెలలో అందఱు ఈత నేర్చుకొన్నారు. ఇట్లు లక్ష్మి ఆ గ్రామమేగాక ప్రక్కనున్న చిన్న చిన్న గ్రామములను గూడ ఉద్ధరించెను. ఇన్ని నేర్పిం

చెను. ఆమె స్నేహితు లామెయొక్క- ధైర్యమున కాశ్చర్యపడుచుండిరి. ఒకనాఁడు వీరందరు బడిలో పిల్లలకొరకు ఒక పత్రిక ఏర్పరుపవలెనని సభచేసిరి. చివరకు వారు లక్ష్మి అను యొక పత్రిక పెట్టుటకు స్థిరపరచిరి. దాని విద్యార్థినులు, పద్యములు, కథలు, వ్యాసములు, తమాషాలు, ముగ్గులు, బొమ్మలు మొదలగు వానిని వ్రాయుచుండిరి. ఇట్లు 3 సంIIలు జరిగెను.

హఠాత్తుగా బదలీ అయినదని మాధవరావుకు వార్త వచ్చినది. ఇఁక లక్ష్మి స్నేహితులకు మితిలేని దుఃఖము కలిగెను. అప్పుడు లక్ష్మి "మీరెందుకు విచారపడెదరు?" నేను తిరిగి ఆ పల్లెటూరిలో గూడ ఈవిధముగనే సేవచేసెదను. నేను చేసిన సేవ మీరు నిల్పినచో దేశసేవ చేసినవారగుదురు. కాబట్టి మన పాఠశాలను జాగరూకతతో చూచుచుండుఁడు.

స్నే:- (లక్ష్మి చేతిలో చేయివైచి) తప్పక ఈ పాఠశాలను జాగరూకతతో చూచెదము. భయపడవలదు. నీవు నేర్పిన విద్యలన్నియు పిల్లలకు నేర్పెదము.

లక్ష్మి ప్రయాణము దగ్గరకు వచ్చెను. సామానంతయు సర్దుల యాయెను. లక్ష్మి వెళ్లుటకు ముందు ఒక పెద్ద విందుజరిగెను. మరునాఁడు లక్ష్మి మాధవరావులను బ్యాండుతో, వైభవముతో స్టేషనుకు పంపిరి. ఆదినము బడికి సెలవిచ్చిరి. తిరిగి మరుసటి దినమునుండి యథాప్రకారము బడి జరుగుచుండెను. లక్ష్మి వెళ్లిన తరువాత ఊరంతయు చిన్నబోయెను.

లక్ష్మి ఆ ఊరిలో గూడ సేవచేయుచుండెను. కొన్ని దినముల తరువాత లక్ష్మికి కుమారుఁడు జనించెను. దానితో లక్ష్మి దేశసేవ కొంచము తగ్గిపోయెను. ఇందుకొరకే లక్ష్మికి పల్లెవాసము బాగనిపించెను గాఁబోలు. తరువాత లక్ష్మి మాధవులు తమ జీవితమంతయు సంతోష సౌభాగ్యములతో కాలము గడిపిరి. అప్పుడు స్త్రీ వలననే దేశోద్ధరణము కాగలదనియు, పురుషులెన్ని ఉపన్యాసము లిచ్చినను కాఁజాలదనియు అందఱకు స్పష్టమయ్యెను. లక్ష్మి వెళ్లిన మరునాఁడు వార్తా పత్రికలో "దేశోద్ధరణ స్త్రీలవల్లనే జరుగవలెనుగాని మరొక విధముగ కాదు. మా గ్రామములోనున్న లక్ష్మి అను నామె అయిదు గ్రామముల నొక్క-సారిగా నాగరికతా పరిపూర్ణము చేసివైచినది" అని పడినది.



# ఎందరున్నారో?

శ్రీయుత. కె. రామమూర్తి పంతులుగారు.

హేమలత చక్కని చుక్క. వయస్సు సుమారు పందొమ్మిది వత్సరములకు మించదు. కలకత్తా విశ్వవిద్యాలయ కళాశాలలో బి. ఏ. రెండవ క్లాసులోఁ జదువు చున్నది. పాశ్చాత్య నాగరికత విద్యతోఁ గూడ కొంత అలవడినను దానియం దంత వ్యామోహములేదు. వేషభాషలలో నిరాడంబరము పొడకట్టును, క్రొత్త వారికి ఆమె అంత విద్యావతియా? అనికూడ అనిపించుచున్నది. నిగర్వి కాఁబట్టి. జాతీయాదర్శములకుఁ జిన్నతనమందే ఆమెలో పునాది ఏర్పడినది. క్రమముగా విద్యతోఁబాటు ఆ భావసౌధముకూడ గట్టి పునాది మీఁద పెరుగుచున్నది. ఎక్కువగా వ్రాయుటకంటే ఆమె ఆదర్శ భారతనారీయొక్క మూర్తి అనిన అంత అందులోనే ఉందనుకొందును.

అదే కళాశాలలోఁ జదువుచున్నాఁడు ప్రసాదు. వయస్సు సుమారు ఇరువదిరెండు సంవత్సరములు. పరిశ్రమఁజేసిన యంగసౌష్ఠవము గల శరీరము. చామనచాయ అయినను, అందానికి లోటులేదు. భావములలోను, ఆదర్శములలోను హేమప్రసాదు లొక్కటే; క్లాసుకూడ చదివే దొక్కటే. అతఁడు మంచి వక్త. గంభీరముగా నుపన్యాసము ఇచ్చుచున్నపుడు విన ఇంపుగా నుండెడిది. క్లాసులో మొదటి రకమువారిలోకె రాఁగలఁడతఁడు.

సామాన్యముగా ఒకే భావాల వాళ్ళకి స్నేహము చప్పునఁగుదురును. ఆలాగే మన హేమప్రసాదులకు స్నేహము కుదిరినది. కాలక్రమాన అది ప్రేమగా పరిణమించినది. పరీక్షలింక మూఁడు నెలలు మాత్రమే ఉన్నవి. తరగతిలోని వారంత హేమప్రసాదులు మొదటి తరగతిలో ఉత్తీర్ణులవుదు రనుకొనుచున్నారు.

హేమతండ్రి ఒక సంపన్నుఁడు. ఆమెను విశ్వవిద్యాలయపు చదువు పూర్తి అయిన తరువాత పాశ్చాత్య దేశములకుఁబంప నుద్దేశ్యము. హేమప్రసాదుల స్నేహమీతనికి తెలియును పలుమారు ప్రసాదింటికి వచ్చుచుండుటచేత, వారిరువురు కలిసి చదువుకొను చుండుటచేత ప్రసాదనిన చాల ఇష్టము. అప్పుడప్పుడాతనికి, వారిరువురకువివాహము అయిన చాల బాగుండునను తలఁపు కలుగక పోలేదు.

ప్రేమ చాల చెడ్డది. ఎంతటి వ్యక్తియైన క్రిందఁదీయు శక్తి దానికిఁ గలదు. దాని పాశమునఁ గట్టుపడని వారరుదు. అట్టివారున్న వారు కలియుగ 'శుకులే' ప్రత్యక్ష 'ప్రవరాఖ్యు'లే. కాని ప్రసాదంతటి వాఁడు కాఁడు. సామా

న్య మానవుఁడే ప్రకృతిలో హేమమీఁది ప్రేమ అతని చదువున కంతరాయము గలిగించెను. చదువుటకుఁ దోఁచదు. ఎంతసేపు హేమతలంపు తక్కవేఱు తలంపులేదు. చదువు సన్నగిలినది. పరీక్షలు సమీపించుచున్నవి. చదువు లేకపోయినను రాత్రులందు నిద్రలేదు. కుశాగ్రబుద్ధిగల హేమ యాతనిలోఁ గలిగిన మార్పు గుర్తించలేక పోలేదు. గుర్తించుటేకాదు పలుమారాతని హెచ్చరించినది. వేరు తలంపుల వీడి దృష్టిచదువుపై కేంద్రీకరించుమని చెప్పెను అవి యేవియు పనిచేయలేదు ప్రసాదుపట్లు.

పరీక్షలు వచ్చినవి ఏదో వ్రాసినాఁడు ప్రసాదు. ఎంతమంచి లోహమయినను మెరుగు పెట్టక ప్రకాశింపదు. ఆలాగు అంత్యదినములలో పాఠ్య గ్రంథముల పరిచయము లేమిచేఁ బ్రసాదు బాగుగా వ్రాయలేదు. హేమచాల జాగ్రత్త కలది గాన, కష్టపడి చదివినది. చాల బాగుగా వ్రాసినది పేపర్లన్ని; మొదటితరగతిలో రావచ్చు.

పరీక్షలయిన నెల పదునైదు దినములకు ఫలితములు వచ్చినవి వార్తా పత్రికలలో. హేమ మొదటి తరగతితో ఉత్తీర్ణురాలయినది. పాపము ప్రసాదు పరీక్ష పోయినది. కాలేజి విద్యార్థులందఱితోఁబాటు ప్రసాదుకూడ హేమకు కలిగిన అఖండ విజయమునకు చాల సంతోషించి ఆమెను ప్రశంసించుటకు వెళ్లినాఁడు. హేమకు మాత్రము తన విజయమునకు కలిగిన సంతోషముకంటె ప్రసాదుకుఁ గలిగిన అపజయమునకు కలిగిన విచారము ఎక్కువ. దానికిఁ గారణము తానేయనికూడ గ్రహించినది. కొంతవఱకుకాని పాపము ఏమిచేయగలదు.

పరీక్ష ఫలితాలు వచ్చిన తరువాత హేమ[illegible] తండ్రి ఆమెను ఇంగ్లండు పంపుటకు నిశ్చయించి[illegible] నాఁడు. ఉన్నత విద్యకొఱకై. ఆమెతో ఆమె[illegible] ట్యూటరయిన వెంకట్రావునుగూడ పంపవలెన[illegible] నిశ్చయించినాఁడు. పరీక్ష పోవుటచే ప్రసాదుమీ[illegible] యభిమానము తగ్గినది. తన ఇంటికికూడ రావ[illegible] న్నాఁడు కఠినముగా. పాపము! ప్రసాదు కు[illegible] పోయినాడు అధఃపాతాళానికి. అతని భావ[illegible] ర్మ్యాల పునాది కదలిపోయినది. హేమ పా[illegible] త్య దేశములలో నున్నత విద్యనభ్యసించి త్వరలో కలకత్తా రానున్నదను వార్త పత్రికలలోఁ [illegible] నది. ప్రసాదా విషయము చూచినాఁడు. కా[illegible] హేమను కలిసికొనుట యెట్లు? అసంభవము.

ప్రసాదు స్నేహితుఁడు వేణునాథము వారి మైత్రి ప్రస్తుత కాఫీహోటలు, సినిమా మైత్రివంటిదికాదు. అతిగాఢమయినది. పవిత్రమ[illegible] యినది. నిష్కళంకమయినది. మైత్రి నిజస్వరూప[illegible] ము వారిలో మూర్తీభవించినదన్న నతిశయో క్తికాదు. వేణునాథము ఒక పత్రికానిర్వహణ కార్యాలయములో సహాయసంపాదకుఁడు. ప్రసాదాతనితో హేమను కలిసికొను టెట్ల[illegible] యాలోచించెను. వేణున కొక మంచి యాలో చన తట్టినది. ప్రసాదును మారువేషమున పత్రి కా విలేఖరివలె సర్వాధికారముతో నామెను కలసికొనుమని సలహా నిచ్చెను. అది చాల బా గున్నదని ప్రసాదు సంతసించెను.

హేమ వచ్చు నిర్ణీతదినము వచ్చినది. తండ్రి పుర ప్రముఖులలో కొందఱు ఆమె నా హ్వానించుటకు స్టేషనుకు వెళ్లిరి. మన ప్రసాద[illegible] కూడ ఆ సమయమునకే వేషముమార్చి పత్రికా విలేఖరివలె కాగితములు కలము తీసుకొని [illegible]

టింగు కార్డు జేబులో పెట్టుకొని స్టేషనుకు వెళ్లెను. బండి వచ్చుచున్నది. హేమ కిటికీనుండి పైకి చూచుచున్నది. ప్రసాదునకు సంభ్రమవిచారములు ఒక్కసారి పెనగొనినవి.

రైలు ప్లాటుఫారము మీదికి రాగానే తండ్రికి, పురప్రముఖులకు వందనము చేసినది. హేమ సంతోషముగా ఆమెను పూలమాలలతో అలంకరించి గౌరవించిరి. పురప్రముఖులు హేమ కారులో ఎక్కబోవుచుండగా పత్రికా విలేఖరి యని తెలుపు కార్డు ఇచ్చి పాశ్చాత్య దేశాల గురించి ఆమె యభిప్రాయాలు కావలెనని కోరినాడు ప్రసాదు. తొందర ఉన్నదనియు మరునాడు ఎనిమిది గంటలకు రమ్మనియు చెప్పి కారులో ఎక్కి వెళ్లిపోయినది హేమ.

సంగతియంత మిత్రునితో చెప్పినాడు ప్రసాదు. ఆరోజంత బహు ప్రయాసమీద గడిపినాడు. గడియ ఒక యుగముగా తోచినది. ఆరోజతనికి తెల్లవారినది. సరిగా ఎనిమిది గంటలకు హేమ ఇంటివద్ద హాజరయినాడు ప్రసాదు. వెంటనే విజిటింగు కార్డు పంపినాడు లోపలికి. లోపలికి రమ్మని ఆహ్వానము వచ్చినది. హేమ అతనికొక కుర్చీ యిచ్చి కూర్చోమనినది మర్యాదగా. తానుకూడ ప్రక్క కుర్చీలో కూర్చున్నది.

ప్రసాదు:- పాశ్చాత్య నాగరికత విషయములో మీ అభిప్రాయమేమి?

హేమ:- వారి నాగరికతను నేను విమర్శింపనుగాని, మన నాగరికత వారిదానికన్న ప్రాచీనమైనది.

ప్రసాదు:- వారి జాతీయత విషయమయిన మీ యుద్దేశ్యమేమి?

హేమ:- వారి జాతీయాదర్శములు శ్లాఘాపాత్రములు. ఆ విషయమున మనవారు వారినుండి నేర్చుకొనవలసినది. చాల ఉన్నది. వారి దేశాభిమానము నిరుపమానము. వారెన్నడును దేశహితమే కోరుచుందురు. దాని కొఱకే పాటుపడుచుందురు. స్వదేశీయ వస్తువులను తప్ప ఉన్నంత వఱకు విదేశి వాడరు. అంత ఎందుకు? చూడండి ఇచ్చటికి వచ్చిన ఆంగ్లదేశస్థుడు తన దేశములో తయారైన వస్తువును తప్ప వేరు కొనడు, వాడడు అది ఎంత చౌకయైనను. కృషియొక్క విలువ గౌరవము బాగుగ గుర్తించినారు పాశ్చాత్యులు, సోమరులుకారు, కష్టపడి పనిచేయువారు.

ప్రసాదు:- ఇక వారి విజ్ఞానముల గురించి మీరేమనెదరు?

హేమ:- విద్య అచట చాల యెక్కువ అందును. స్త్రీవిద్య మన దేశమునకన్న ఎన్నియోరెట్లెక్కువ. విద్యావ్యాప్తి వారి దేశ సౌభాగ్యమునకు కారణముకాని విజ్ఞాన విషయమున హైందవులు పాశ్చాత్యులకు తీసి పోరని నేను గట్టిగ చెప్పగలను.

ప్రసాదు.- వారి ఆచార వ్యవహారముల గూర్చి మీకెట్టి అభిప్రాయము కలదు?

హేమ:- వారి ఆచార వ్యవహారములంతగా నచ్చలేదు నాకు వారి నిత్యజీవనము చాల వ్యయముతోఁ గూడినది. ఆడంబరమైనది. పరి

శుభ్రతకు వారిని మొదట చెప్పవలసినదే కాని అది పై మెఱుగులకే. వారి స్వేచ్ఛా విహారము భారతీయ నా రీ మ ణు ల కు రోత పుట్టించును. స్వేచ్ఛ అవసరమే అట్లని స్త్రీ పురుషునితో చేయిచేయి కలిపి తిరుగుటంత బాగుగలేదు. స్త్రీ పురుషులతో చదువ నచ్చును, వారితో తిరుగవచ్చును, అన్ని విషయములలో వారిలో పాల్గొన వచ్చును. కాని స్త్రీ పురుషులు చెట్టా పట్టా వేసికొని తిరుగు ఆచారము నాకు చాల అసహ్యముగా తోచుచున్నది. అటులనే స్త్రీ పురుషులు కలసి నృత్యముచేయుట మొదలగు కొన్ని ఆచారములు నాకు బొత్తుగా బాగులేవు.

ప్రసాదు:- ఇక వారి వివాహ విషయమున మీ భావమేమి?

హేమ:- అచట ప్రౌఢా వివాహములు గాని బాల్యవివాహములులేవు. ఆ పద్ధతి బాగుగానున్నది. స్త్రీ పురుషులు ఒండొరుల బాగుగ నెఱిగి అర్థము చేసికొనిన పిమ్మట వివాహము చేసికొనుట ప్రశంసనీయమే. అచట విధవాపునర్వివాహముల పద్ధతికూడ బాగుగనే యున్నది. కాని అ చ టి విడాకుల పద్ధతి మా త్ర ము నచ్చ లేదు నాకు.

ఇట్లు సంభాషణ జరుగుచుండగా ట్యూటరగు రావుగారు, అప్పుడే లండను నుండి దిగిన ఆంగ్లేయునివలె సూటు, బూటు హాటులతో ప్రత్యక్షమయినాడు. నోటిలో "గోల్డుఫ్లేకు" సిగరేటు ఒక చెయి ఫాంటుజేబులో పెట్టినాడు ఫాషన్‌బుల్‌గా. ప్రసాదుపైపు తిరిగి "మీరువచ్చి చాలసేపయినది. మీకుకావలసిన విషయాలేవో నన్నడిగి తెలిసి కొనుడి. అక్కడి పెళ్లి గొడవలు, అవి మీకెందుకు? అల్లాటివి మీరాడువారిని అడుగకూడదు. ఇంక విషయాలేమైన ఉంటే నన్నడగండి" అని తీక్షణముగా చూచినాడు. ఇంతలో హేమ అడ్డువచ్చి "దయచేసి మీరావలికి వెళ్లవచ్చు. మీ ప్రసక్తి యిక్కడ ఏమిలేదు." అన్నది. కొంకొంచుచూచుచు "ఆల్‌రైట్" అని రెండుచేతులు ఫాంటు జేబులలో పెట్టుకొని చరచర బైటికి పోయెను. పిమ్మట ప్రసాదు ఆమెతో ప్ర సం గిం చు ట మొదలు పెట్టాడు

ప్రసాదు:- మీరిక ముందు చేయబోవు పని. వివాహ విషయమై మీ అభిప్రాయము తెలిసికొన వచ్చునా?

హేమ:- తప్పక తెలిసికొన వచ్చును. హిందూదేశమున ప్రజాసేవ చేయుట నాయుద్దేశ్యము. అందు ప్రజలలో జాతీయభావము నభివృద్ధిచేసి దేశ క్షేమమునకు పాటుబడ వలెనని తలంపు. నా వివాహ విషయములో నిశ్చితాభిప్రాయము లిదివరకే కలవు. అవి ప్రస్తుతము వెల్లడింపఁ జాలను.

ప్రసాదు:- సరే సెలవు. శ్రమకు క్షమార్పణ. చాలు ప్రొద్దయినది. మ రి యొ క ప్పు డు మిమ్ముల మరల కలిసికొందును. తదితర విషయముల కొఱకు. అని సెలవు తీసికొని వెడలలేక

పోవుచు, మెట్లమీఁద దొర్లిపడి స్పృహతప్పి పడిపోయెను. చప్పుడువిని హేమవచ్చి అతని అవస్థచూచి పరిచారిక సహాయమున లోనికి తీసికొనివచ్చి, పరుండబెట్టి శైత్యోపచారములు చేయుచుండెను. దొర్లిపడుటలో వేషముకొఱకు అంటించుకొన్న మీసము లూడిపోయినవి.

హేమ ప్రసాదును గుర్తించినది. అతని రాకకు కారణము తెలిసికొనినది. అతని ప్రస్తుత దీనావస్థకు చాల విచారించినది. ప్రసాదుకు శైత్యోపచారములు చేయుచున్నది. ఇంతలో తండ్రి వద్దనుండి కబురు, రమ్మనమని. ప్రసాదును అతిస్థితిలో విడిచి వెళ్లలేదు. వెళ్లకతప్పదు. ఆలసించిన తండ్రి స్వయముగ వచ్చిన ముప్పువాటిల్లును. పరిచారిక నచట జాగరూకతతో నాతనికి ఉపచారములు చేయ నియోగించి తొందరగా తిరిగి రా వెడలినది.

హేమ వెడలిన కొలఁది సేపటికే ప్రసాదుకు తెలివి వచ్చినది, తాను హేమ మందిరమున నుంటినని పరిచారిక వలన తెలిసికొనెను. వెంటనే లేచి వలదనుచున్నను వెడలిపోయెను.

హేమ తండ్రి ఆమెను పిలిచినది పెండ్లి విషయమై మాట్లాడుటకు. ఇప్పుడాతని దృష్టిపథమున నున్నవాఁడు ట్యూటరు రావు. ఆ సంగతియే ఆమెతోఁ జెప్పి త్వరలో వివాహము చేయఁ దలఁచి తన అభిప్రాయము హేమకుఁ దెలియఁ జేసెను. రావునడత హేమకు నచ్చలేదు. అతనికి జాత్యభిమానము శూన్యము. పాశ్చాత్య నాగరకతను పొగడుటలో బట్టురాజు. స్వదేశము అతని తలఁపునకేరాదు ఎప్పుడును. ఆమె కాతని యందు ప్రేమలేదు సరికదా, గౌరవముకూడఁ చాల తక్కువ.

హేమ హృదయమున తావులేదెవ్వరికి ప్రసాదుకుతప్ప. ఆమె ఉత్తమ భారతనారి ఒక్కమారొకని కామె హృదయమున తావు దొరకెనా దానికి తిరుగలేదు. వేషభాషలకు మోసపోయి అభిప్రాయముల మార్చుకొనినది కాదు. స్థిరచిత్తము. ఎన్ని అంతరాయములు వచ్చినను మనోనిశ్చయమునకుఁ దిరుగలేదు. ఎట్టి కష్టములనైన నెదుర్కొన సిద్ధపడు సాహసురాలు. ఆమె చాల కాలము క్రిందటనే ప్రసాదును ప్రేమించి యుంటిననియు అతనిని తప్ప నన్యుల వివాహ మాడననియు తన నిశ్చితాభిప్రాయమును వెల్లడిచేసినది తండ్రికి. పట్టలేని యాగ్రహము వచ్చినది పాపమాతనికి. తన అభిప్రాయమునకు భిన్నముగ నడచిన తన యాస్తియందు చిల్లిగవ్వయైనఁ దన కీయననెను. ప్రసాదు దీనస్థితి నెఱుకపరిచెను. రావుగుణములను పొగడెను. ఎదుర్కొనఁబోవు కష్టముల నుగ్గడించెను. బాగుగ యోచించుకొనుమని హెచ్చరించెను.

చాల హీనస్థితిలో నున్నాఁడు ప్రసాదు. సామాన్య గృహమున ఒకగది. పత్రికలకు వ్యాసములను, కథలనువ్రాసి జీవించుచున్నాఁడు. అట్లు వచ్చురాఁబడి కూడ చాలకొద్ది. ఈ రోజులలో వ్యాసకర్తలకు తగిన ప్రోత్సాహ మొసగు పత్రికా నిర్వాహకులు చాల తక్కువ.

హేమకు ప్రసాదు పరిస్థితులు తెలియక పోలేదు. ముందుతాను ప్రసాదుతో గడుపఁబో

వు జీవనము కష్టతరమైనదని కూడ గ్రహింపక పోలేదు. కాని ఆమె మనోనిశ్చయమునకు తిరుగులేదు. కావుననే తండ్రితో ప్రసాదును తప్ప వేఱొకరిని వివాహ మాడనని సాహసముగఁ బలికెను. అందులకై కుపితుఁడై ఆమెను యిల్లు వెడల నడిపినాఁడు తండ్రి.

హేమ నిర్విచారముగ ప్రసాదున్న గృహమునకేగెను. ప్రసాదు గదియందే ఉన్నాఁడు. హేమను చూచి నిశ్చేష్టుఁడయినాఁడు. ఆతనికి మతి చలించినట్లైనది. ఆమె రాఁకకు కారణ మరయలేకుండెను. నోటిమాట కూడలేదు. ఆ స్థితిలోనున్న ప్రసాదును జూచి హేమ సంభ్రమముతో సమీపించి తాను చేసినదంతయు నెఱుక పరిచెను. ప్రసాదు సంతోషమునకు మేరలేదు.

హేమకు వంటరాదు. పాపము పుస్తకము చూచి స్వయముగానే వంటచేయ మొదలిడెను. ఆ చిన్న గదినే శుభ్రముచేసి అందముగా నలంకరించెను. ఉన్నంతలో వారిరువురు సుఖముగఁ గాలము గడుపుచుండిరి. వారి ఆనందమునకు మేరలేదు. సౌఖ్యమన అట్టిదియేకదా! పవిత్రప్రేమయు నట్టిదేకదా! అది తుచ్ఛసుఖములను గోరదు. ఆనందమే దాని పరమావధి. వారనుభవించునది స్వర్గసుఖము.

కొలఁది దినములకే ప్రసాదునకు నూఱు రూప్యముల మీఁద పత్రికా కార్యాలయమున సహాయ సంపాదకత్వము లభించినది. ఆవార్త పత్రికలో పడినది. హేమ తండ్రి కూడ ఆసంగతి చూచెను. వెంటనే ఆతనికి పట్టలేని ఆనందము గలిగినది. హేమ ప్రసాదుల కడకేగి వారిని తీసికొనివచ్చి శాస్త్రోక్తముగ వివాహము చేసెను. తండ్రి ఆస్తి అంతయు వచ్చినను, పాశ్చాత్య దేశముల నున్నతవిద్య నభ్యసించినను హేమ నిరాడంబర జీవినియే.

హిందూ దేశమునఁ బ్రజలకు జాతీయ భావము బోధించుటయే ఆమెపని. "ఎందఱున్నారో యిట్టి పూర్ణేందు ముఖులు?"



# నిధి నిక్షేపములు

శ్రీమతి. రాఘవమ్మ.

గీ॥ చిమ్మచీఁకటి దిశలందుఁ ♦ జెలఁగి యుండెఁ,
గమలములు నీటిపై వ్రాలి ♦ కదలుచుండె;
గూబలొండొంటితోఁ జాల ♦ కులుకుచుండె
నిద్ర జనులకు శాంతిని ♦ నేర్పుచుండె.

శయ్యపై మేను వాల్చిన ♦ సారసాక్షి
కనులనిద్దుర యేలకో ♦ గానరామి
దిగులు మనసున నేదియో ♦ తెరలుచుండఁ
బొరలుచుండెను బాన్పుపైఁ ♦ బ్రొద్దుపోక.

"అమ్మ నీవేలయీరీతి ♦ నడల; నకట!
యఖిలరాజ్యంబు లేలువాఁ ♦ డాత్మ విభుఁడు
తక్కువేమమ్మనీకు? నో ♦ తలిరుఁబోఁడి!"
యనుచు నోదార్చి వెళ్లిరి ♦ యామె చెలులు.

"కలదు సంపద కలవారి ♦ కన్నుగుట్ట;
మాటచెల్లించు పెనిమిటి ♦ మక్కువగును
కాని సంతతిలేకుండు ♦ కతన మనసు
పొగులుచుండెడు నాకెట్లు ♦ పొద్దుపోవు?"

పడఁతి యారీతిఁ గొందల ♦ పడుచునుండ
వీనులకుగాన మొక్కటి వినఁగనయ్యె;

మగువ పాడెను గీతిక ♦ మనసు నీడ్వఁ
జూడఁబోయెను వెంటనే ♦ చోద్యపడుచు.

పోవఁబోవఁగ ముందొక్క ♦ పూరిగుడిసె
యందుఁబాడుచు ముదమందు ♦ నతివమిన్న,
కష్టదశయందె యానంద ♦ గరిమగాంచు
పుణ్యురాలిని నొకసేద ♦ పొలఁతిఁగాంచె.

ఆమె యానందమును గాంచి ♦ యాత్మలోన
సంతసించినదై రాణి ♦ శాంతితోఁడ
బ్రశ్న వేసెను "అతివరో ♦ ప్రణుతి సేతుఁ;
దెల్పు నీసంతసమునకుఁ ♦ దెరువదెద్ది?"

"నిధియు నిక్షేపముల్ నాకు ♦ నిజము—కలవు
అవియె నాకింత సంతస ♦ మారఁజేయు"
ననఁగ ననుమాన మొదవఁగ ♦ ననియె రాణి,
"ఏవి చూతము చూపింపు ♦ మెందుగలవో?"

"ఇదిగొ నానిధి, నిక్షేప ♦ మిదిగొనమ్మ!
చూడు" మంచును దోడ్తెచ్చె ♦ సుతుని, సుతను!
గాంచి మనసున నేదియో ♦ కలువరించి
రాణి నిజవాసమున కేగె ♦ రయముతోడ.





శ్రీమతి. ఎ. సావిత్రి, శ్రీమతి. కొ. జానకీదేవి.



కీ. శే. లక్ష్మీబాయి.

రాజా బహద్దరు వేంకటరామారెడ్డిగారి జీవితము రచించిన (గ్రంథకర్త్రి)

# వ్రతమహిమ

శ్రీమతి. కే. లక్ష్మిదేవి.

కిరకిర తెల్లవారుచుండెను. ముత్యముల వలె మెఱయుచుండు మంచుబిందువుల మయమై వెలయు చల్లని చిగురుటాకులపైఁ దన బంగరు కిరణములను బ్రసరింపఁ జేయవలయు ననెడి య భిలాష యతిశయింపఁగాఁ గమలమిత్రుఁడు దొరవలె భూలోకమునకు నడచుచుండెను.

అప్పుడే కొందఱు విప్రులు చేరువనున్న నదియందు స్నానమాచరించి కొంతవడి జపి యించి రాచనగరిని గూర్చి వెళ్లుచుండిరి.

. రాజభవమున నందఱు నానందసముద్రమున నోలలాడుచుండిరి. ఎందులకో గుఱుతించితిరా? అదిగో! అప్పుడే మఱచిపోయితిరే? మన హిందూదేశస్థులకు మతిమఱపు ఎక్కువ. లేకున్న మన భారతమాత యిట్లు కృశించినను మఱచు వారుందురా.

మన రాజగు చిత్రవర్మకు లేక లేక కలిగిన కుమార్తె యొక్క నామకరణోత్సవము కాదా నేఁడు? ఆ విప్రులు తిన్నఁగా రాచనగరులోఁ బ్రవేశించి, యుచితాసనములపై ఆసీనులయి ఆ బిడ్డయొక్క జాతకలక్షణములన్నియుఁ జక్కఁగ బరిశీలించి మనంబున నెంతయు హర్షమంది రాజున కిట్లని విన్నవించిరి. "భూపాలా! నీకీ కూతురు లభించుట నీపుణ్యము పండినట్లే. ఈమెకు సీమంతిని యను నామ మొప్పుచున్నది. ఈమె సకలసద్గుణములనుబట్టి, పతిభక్తి మెండుగాఁ గల దు. కాని యొక్క దుఃఖవిషయ మున్నది. ఈ మెకుఁ బదునాల్గవ యేట భర్తృవియోగము కలుగును. ఇది తప్పదు. కడమ విషయములకు హర్షమందితిమి కాని యా దుఃఖప్రాప్తి కలుగు నేయని దుఃఖితులమగుచున్నారము అమ్మహీ పాలున కీసమయమునందు హర్షమును దుఃఖమును మిళితమై ముఖమునఁ దాండవమాడు చుండెను రాజు కొంతకాలము చింతించి చేయున దేమియులేక యా భూసురులను దగునట్లు బహూకరించి పంపివేసెను.

* * * *

(పూఁదోటలో ఇరువురు చెలికత్తెలును సీమంతినియుఁ బ్రవేశింతురు)

మాధవి:- మాలతీ ఇఁక మన సీమంతినీ దేవి పెండ్లిచేసికొని మనల నిద్దఱిని విడచిపెట్టి అత్తవారింటికి పోవునుగదఁటే?

సీమంతిని:- మాధవీ! ఏమందువు? (ముఖము వీక్షించి)అదేమి? మాలతీ! అట్లుంటివి? నీకేమి మనమునకు నొప్పికలెగెనమ్మా? అదేమి కంట తడిపెట్టుచుంటివి చెప్పవమ్మా?

మాల:- ఏమియులేదు! నీనామకరణము నాఁడు భూసురులెల్ల నీకు పదునారవయేట విధవ ఱికము తప్పదని చెప్పియున్నారు.

సీ:- ఎవరు చెప్పిరి నీకు?

మాల:- ఎవరోచెప్పిరి! తప్పదఁట

సీమంతిని చేతనున్న పూలు దిగువఁబాఱ వైచి తన గదిలోనికేగి యేమో తలపోయుచుండెను. అన్నమయిన నొల్లకుండెను. ఆ రేయెల్ల సీమంతినీదేవి ఆలోచన అనెడి మహాబ్ధియందు మునిఁగితేలి యాడుచుండెను. కంటికిఁగూరుకు లేదు. తుదకామె ప్రక్కనుండిలేచి ద్వారములు గడచి తిన్నఁగా యాజ్ఞవల్క్యుని వీటికి దారితీసెను. అప్పుడాతఁడింటలేకుండెను, తద్భార్యయగు మైత్రేయిమాత్ర మింటనుండెను. సీమంతినీదేవి యామె యొద్దకువెళ్లి దండప్రణామ మాచరించెను. వారికీ క్రింది విధముగ సంభాషణ జరిగెను.

మై:- కుమారీ! నాకీ విషయము ముందే దెలియును. విద్యాభ్యాసకాలమునఁ జెప్పిన నీ విద్య చెడునని చెప్పనైతిని. తెరువేదైన కలదా యంటివి. లేకేమి? ఉన్నది.

సీ:- మాతా! ఆవిధమానతిమ్ము. శిరసా వహించెదను.

మై:- బిడ్డా! ఉత్తమ స్త్రీలకు పతివియోగముకంటె దుస్సహంబొండు కలదా? చెప్పెద వినుము. ప్రతిస్త్రీయును ఈవ్రతమును కష్టమైనను ఓర్చి యాచరించిన యెడల, ఎట్టి సంకటములును రానేరవు వినుము. ప్రతి సోమవారమందును ఉదయమునందే మేల్కాని కాలోచిత కృత్యంబులఁదీర్చి స్నాన మొనరించి శుచిగా నాఁడెల్ల నుపవసింపవలెను. ఆరాత్రి శ్రీ పార్వతీశ్వరులను ప్రతిష్ఠ గావింపవలెను. సంకల్ప పూర్వకముగా షోడశోపచార పూజలను గావింపవలయును బ్రాహ్మణ ముత్తైదువులకుఁ బసుపు, కుంకుమ దక్షిణ తాంబూలంబులును, వస్త్రాభరణాదులను భక్తిపూర్వకముగా నొసఁగి వారల వీడ్కొలిపి పిదప నీవు భుజించునది. ఈ వ్రతము నీవు నీజీవితాంతము వఱకు జరిపితివేని సకలసంపదలు కలిగి సకలభోగముల ననుభవింపఁ గలవు.

అప్పుడు సీమంతినీదేవికి వామలోచన భుజంబులదరఁజొచ్చెను. ముఖమునఁ జిరునగవు మొలకలెత్త నొక్క పరుగున నింటికరుదెంచి మెప్పటియట్లు హాయిగా నిదురచెందెను. నాఁడు మొదలామె ప్రతిసోమవారమునందును ఈ వ్రతమాచరించుచు సకల సంపదలఁ దులఁదూగుచుండెను.

* * * *

సీమంతినీదేవికి యౌవన మరుదెంచినది. తండ్రియగు చిత్రవర్మ అనేక రాజకుమారుల చిత్రపటములఁ దెప్పించెను. తుదకామె

దొకనిని వరించెను. నిషధ దేశమునకు రాజైన ఇంద్రసేనుని కుమారుండును, నలదమయంతుల మనుమండును అగు చంద్రాంగదనామము గల వాఁడాతఁడు.

తన ముద్దులపట్టి తగిన వరునిఁ గోరినందులకా భూమీశుఁ డపరితానంద భరితుఁడయి యింద్రభవనమువలెఁ బురమెల్ల నలంకరించి తూర్యఘోషములు మిన్నుముట్ట సీమంతినీ చంద్రాగదులకు మహావైభవముతో వివాహము గావించెను. వివాహానంతరము అల్లుని కొన్ని దినములు తనయింట నిలుపుకొనెను. సీమంతినియు నాఁడు మొదలు పతికి మహాభక్తితోఁ బూజలు సలుపుచుండఁగాఁ జంద్రాగదుండు తనకు వేటయందాసక్తి జనించుచున్నదని చెప్పి కొంద అనుచరులను వెంటనిడుకొని పోయెను. చేరువనున్న యమునానదిని దాటిన యెడల వేటాడుటకు బాగుండునని తెలిసికొని వారందఱును పడవనెక్కి నదిని గడచుచుండిరి. దైవయోగమున నాపడవ మునిఁగిపోయెను. కొందఱు మాత్రము గట్టునకుఁ దేలిరి. వారు చంద్రాగదునికై యెంతయో వెదకిరి. కాని వారికెక్కడను గన్పట్టలేదు. హతశేషులు పోయి వార్తను రాజునకెఱింగించిరి. ఈ భయంకరవార్త వినఁగానే చిత్రవర్మ గుండె నీరయ్యెను. సీమంతిని పెద్దపెట్టున రోదనము చేయుచు నేలఁగూలెను. త్వరలోనే యావార్త పురమంతటను వ్యాపించెను.

సీమంతినియే తమ కన్నబిడ్డయని తలఁచుచున్న జనులెల్లరును తమ యల్లుఁడు మరణించినట్లుగా తలఁచి కార్యములందు దృష్టినిగుడింపక రోదనము చేయుచుండిరి. గోవులు సయితము మేయుటమాని దీనముగఁజూచుచుఁ గంటనీరు కార్చుచుండెను. ఇట్లాపురమంతయు గడిలేని రోదనము పాలయ్యెను. కొందరు వృద్ధులు రాజనగరములోని వారి నూరడించుచుండిరి. ఏసమయమునఁ జంద్రాంగదుఁడు మరణించెనో ఆ సమయముననే పుత్రమరణమువలన శోకించుచున్న ఇంద్రసేనుని రాజ్యముపై శత్రులు పైఁబడి భార్యా సహితముగా నాతనినిఁ జెఱఁబట్టి రాజ్య మాక్రమించిరి.

* * * *

యమునానదియందు మునిఁగిన చంద్రాంగదుఁడు దైవవశమున నొక తీరమును జేరెను. ఆతఁడచ్చటికెట్లు వచ్చెనో యతనికే తెలియదు. దాపున నొక సరోవరమునఁ గొందఱు నాగకన్యలు జలకమాడి పుట్టముల గట్టుచుండిరి. ఈతనికేమియుఁ దోఁపక వారియొద్దకేగి నమస్కరించెను. వారాతని రూపలావణ్యాతిశయములకెంతయు డెందంబున నానందమంది మర్త్యుఁడీ లోకమునకెట్లు వచ్చెనాయని తలపోసి వారాతనినిఁ గరుణించి తమ రాజగు నాదిశేషుని యొద్దకుఁ గొంపోయి యిట్టులనిరి. "దేవా! ఇతఁడెవరో నరుఁడు. దారితప్పి యిటు వచ్చెను" అని నుడివి తమ నివాసములకుఁ జనిరి.

నూరు పడగలచే నొప్పువాఁడును, దివ్యాంబరధరుండును, నానావిధమణి ఖచితమయిన

భూషణంబులను దాల్చినవాఁడును, పెక్కండ్రు నాగకన్యలు పరిచర్య లొనర్పఁగా నొప్పువాఁడును, అగు ఆ ఫణిరాజును చంద్రాంగదుఁడు జూడజాలక కన్నులు మూసికొనెను. ఎట్టకేలకు ధైర్యమవలంబించి యాతనికి సాష్టాంగ దండ ప్రణామ మాచరించెను. తక్షక రాజాతనిని జేరఁదీసి. "బాలకా? నీవెవ్వఁడవు? ఎందుండిటు వచ్చితివి?" అని అడిగెను. "నేను క్షత్రియ వంశ సంజాతుండను. నా పేరు చంద్రాంగదుఁడు. నాతండ్రి యింద్రసేన బిరుదాంకితుఁడు. "నీవు నలదమయంతుల మనుమనివా" "అవును" అందులకు ఫణిరాజు ఆతనిఁ జేరదీసి "నాయనా! భయ పడకుము. నిన్ను సురక్షితంబుగా నీ దేశము చేర్పఁగలను. కాని నీవేల యిటువచ్చితివి?" అని నందులకా బాలకుడిట్లనియెను.

"ఓ ఫణిరాజా! చిత్రపురమునకు రాజైన చిత్రవర్మ కూతురగు సీమంతినిని బరిణయమైతిని. ఒకనాఁడు వేట నిమిత్తమై వచ్చి యమునను దాటుచుండ పడవ నీట మునిఁగెను. నా యనుచరు లేమయిరో యెఱుఁగను. నేనుమాత్రమిటు వచ్చితిని." ఫణిరాజు దివ్యదృష్టితోఁ జూచి యా బాలకునితో నిట్లులనియె "కుమారా! నీవు నీట మునిఁగినంతనే నీ తలిదండ్రులను బంధించి శత్రువులు రాజ్యమాక్రమించిరి" అని నుడివెను. తన తండ్రికిఁ గలిగిన యాపదకు నీతఁడెంతయో విచారపడెను. తక్షక రాజుయొక్క మాటచొప్పునఁ జంద్రాంగదుఁడు వ్యాఖ్యానములఁ జేయుచుఁ బురాణముఁ బఠించుచుఁ గొంతకాలమచ్చట నేయుండెను. ఇట్లుండఁ జంద్రాంగదుఁ డొక్కనాఁడు తనవారిని దలంచుకొని చింతాక్రాంతుఁడై యతిదీనుఁడై తన దేశమునకుఁ దన్నుబంపుమని ఫణిరాజును బ్రార్థించెను. ఆతండందులకియ్యకొని యాతనికనేక కానుకల నొసఁగి, వాయువేగంబునఁ బోవు నొక హయము నొసఁగి, తన పుత్రుఁడైన యశ్వసేనుని వెంటనిడి సాగనంపెను. కన్నుమూసి తెఱచునంతలో వారు యమునదాటి చిత్రపుర రాజోద్యానవనముచెంత కరుదెంచిరి. వారటఁ జల్లని చెట్టునీడను విశ్రమించిరి. చింతలేమియులేని యశ్వసేనుఁడు నిదురించెను చంద్రాంగదునకు నిద్రపట్టునా! అతఁడటు నిటుతిరుగఁ జొచ్చెను. అచ్చట నొక యువతి చెలులఁగూడి పోవుచుండెను. ఈతఁడు వారిని సమీపించి యిట్లనియెను.

చం:- కాంతా! ఎవ్వతెవు నీవు? ఇటకేల వచ్చితివి? పతిలేనిదానివలెఁ గన్పట్టుచున్నావు. నీకేల ఈ యవస్థకలిగెను?

అందులకు సీమంతిని ఏమియు మాటాడలేదు. ఆమె చెలికత్తె యిట్టులనియెను.

చె:- అయ్యా! ఈ దేశపురాజు కూతురీమె. నేడు సోమవార మగుటచే వ్రతమాచరించు నిమిత్తమిట కరుదెంచి స్నానమొనరించి పోవుచున్నాము. ఈమెను నిషధ దేశాధీశ్వరుఁడగు ఇంద్రసేనుని కుమారుఁడగు చంద్రాంగదునికిచ్చిరి. దైవయోగమున నాతఁడు యమునానది

లో మునిఁగి పోయెను. (అని ఊరకుండెను) అతడా సీమంతిని నింకను సమీపించెను ఆమె కేమె తోచెనో గాని నేలఁగూలెను. అతఁడామెను లేవనెత్తి" అమ్మాయీ! నీపతి త్వరలోనే వచ్చును లెమ్మ అని వెనుకఁజూచు సరికిఁ దక్షక పుత్త్రుండీటు వచ్చుచుండుటఁగాంచి రాజకుమారుఁ డామెను వీడి తక్షక పుత్త్రునివెంట నశ్వారోహణంబొనర్చి నిషధపురినిగూర్చి వెళ్లిరి.

"సీమంతినీ! ఈ తఁడెవఁడై యుండవచ్చును. నీభర్త యేయయియుండవచ్చునా" "ఛీ! నా భర్త యెట్లువచ్చును. ఎవరో పరపురుషుఁడు నన్నంటెను. నేనీ దేహ మొల్లను." అని నదియందు దుముకబోవుచున్న సీమంతినీదేవి మనస్సు మరల్చి యింటికి గొంపోయిరి.

* * * *

తక్షక పుత్త్రుండును జంద్రాంగదుఁడును నిషధపురి రాజోద్యానము చెంత విడచిరి. తక్షక పుత్త్రుండు బయలుదేరిపోయి యప్పుడు రాజ్యమును బాలించుచున్న సింహబలుని యొద్దకేగి "రాజా నేను తక్షక పుత్త్రుండను. నా నామధేయము అశ్వసేనుఁడు. ఇంద్రసేనుని కుమారుఁడు చంద్రాంగదుఁడు వచ్చియున్నాఁడు. అతఁడు మా లోకమునకు వచ్చి మాతండ్రిచే సన్మానితుండై యనేక బలమును గొనితెచ్చి యున్నాఁడు. నీవు బ్రతుక దలచితి వేని రాజ్యమును విడిచి యింద్రసేనుని విడుదలచేయుము. లేనిచోఁ జంద్రాంగదుఁడు మిమ్మును రూపుమాపును. ఏమందువు?" ధీరముగాఁ బలికెను. ఆమాటలకు సింహబలుఁడు భయకంపితుఁడై భార్యాసహితునిగా నింద్రసేనుని బంధవిముక్తునిచేసి రాజ్యమును విడచి పారిపోయెను. ఇంద్రసేనుఁడతని భార్యయు సంతోష సముద్రమున నోలలాడిరి. పురజనులు సంతోషమును పట్టలేక కెవ్వున కేకవేసిరి. తదుపరి వారమును దోడ్కొనిపోయి చంద్రాంగదునిఁ బురప్రవేశము గావించిరి. తల్లిదండ్రులాతని గాంగలించుకొని యానందాశ్రువులు దాల్చిరి. అప్పుడా పురమంతయు నానందభరితమై యుండెను.

* * * *

చిత్రవర్మ కొలువుదీరి యుండెను. అప్పుడే నిషధదేశమునుండి దూత యొకఁడటకేగుదెంచి "మీ అల్లుఁడు మరలివచ్చెను." అను వార్త యెఱింగించెను. రాజామాట చెవిని సోకఁగనే సంతసముతో నంతఃపురమునకేగి యచటివారికీ సంగతి తెలిపెను. తానా దినమచటఁ జూచినది తనభర్తయేయని సీమంతినిదేవి తెలిసికొనెను. అంతఃపుర కాంతలెల్లరుఁ గడుహర్షమందిరి.

చిత్రవర్మ అల్లుఁడైన చంద్రాంగదుని బిలిపించి సీమంతినీదేవిని వస్త్రయుగళ భూషితం గావించి సీమంతినీ చంద్రాంగదులకు మహావైభవముతోఁ బునరుద్వాహము గావించిరి.

ఆనాఁడు మొదలా దంపతులు లిరువురును మితిలేని సంపదలతోఁ దులఁదూగుచు నన్యోన్యానురాగము కలిగియుండిరి. సతీపతు లిరువురును. దండ్రియింట కొంత కాలము న్న తరువాతఁ జిత్రవర్మచేఁదగు సన్మానములఁ బడసి నిషధపురిని జేరుకొనిరి. తక్షక పుత్త్రుండును నిషధపురి చేరిన పిదప వారియనుమతిఁ బడసి నిజపురమునుగూర్చి వెళ్లెను.

చూచితిరా వ్రతమహిమ!

# శ్రీ నివృత్తుఁడు

శ్రీమతి. డి. కమలావతి (ప్రాఁతవిద్యార్థిని).

గురు నాశ్రమమందు విద్యనభ్యసించుట ముగియగానే విఠ్ఠలుఁడు తీర్థయాత్ర చేయుచు నలంద చేరెను. అచ్చట నతని తల్లిదండ్రులు పుత్రునిఁజూచి, యానందభరితులై యిఁక వివాహము చేయవలెనని ప్రయత్నించుచుండిరి. కాని విఠ్ఠలుఁడు విరక్తిభావము చూపెట్టెను. అంతటితోఁ దల్లిదండ్రులూరుకొనక కులకర్ణి పుత్రిక యగు రుక్మిణీబాయి నిచ్చి పరిణయము సేయ నిశ్చయించిరి. తానొకటిఁ దలఁచినచో దైవమొకటి చేసినట్లు విఠ్ఠలునకు దైవేచ్ఛ ప్రకారము జరిగినది. వివాహమయిన పిదపఁ గొన్ని దినములవఱకు విఠ్ఠలుఁడు సుఖముగా నుండెను. ఒకదిన మాతఁడు వైరాగ్యమూని కాశి చేరెను. అచ్చట మిక్కిలి ప్రసిద్ధి చెందిన సన్న్యాసియగు శ్రీపాద రామనందుఁడను వానివద్ద చేరి తనకెవఁడు లేరని మోసపుచ్చి యతనిచే సన్న్యాసాశ్రమము యొక్క దీక్షగైకొనెను. శ్రీవారి యాశ్రమమున విఠ్ఠలుఁడు పండ్రెండు వత్సరములు గడిపెను, అంతట రామానందుఁడు రామేశ్వరము పోవఁదలంచి మఠాధిపత్యము విఠ్ఠలుని కప్పగించెను.

నలందలో రుక్మిణీబాయి తనపతి సన్న్యాసము స్వీకరించినదివిని, తానుగూడ తపస్సు చేయ నారంభించెను. ఇట్లు తపస్సుచేయుచుండ నొకదిన మొక సన్న్యాసి యామె దృష్టిఁబడెను. అతఁడెవరనఁగా శ్రీపాదుఁడే. నూటయేబది శిష్యులతో రామేశ్వరము పోవుచుండఁగా మార్గమధ్యములో నీ సౌభాగ్యవతినిఁ జూచెను. రుక్మిణీబాయి యాతని దరిఁజేరి, నమస్కరింపఁగా నతఁడామెను "అష్టపుత్ర సౌభాగ్యవతీభవ" యని యాశీర్వదించెను. అందులకామె నవ్వి యూరకుండెను. కాని ఆ సన్న్యాసి విస్మయమొంది కారణమరయఁగా నతండు తనచే దీక్షనొందిన విఠ్ఠలుఁడీమె పతియేయని తెలిసికొనెను. రామానందుఁడు తాఁజేసిన పనికై గురుశిష్యులగు వారిద్దఱును దోషులని విచారించి, వచ్చినదారిని బట్టి కాశిఁజేరెను. స్వాములవారు శాస్త్రమనుసరించుటకంటె, పత్ని నెడఁబాసిన విఠ్ఠలుని సమాధానపఱుప నిశ్చయించెను. తాఁజేసిన నేరమును శ్రీవారొప్పుకొనిరి. శాస్త్రవిరుద్ధముగాఁ జేసిన పనికై విఠ్ఠలునకుఁ దిరిగి పత్నిని స్వీకరించుటయే ప్రాయశ్చిత్తమనిరి. కాశిలోని పండితులెవరు శ్రీపాదుఁడు జేసినపని తప్పనలేదు కాని యేకనాథుఁడు భాగవతము రచించినప్పుడు, అధర్మమని శిక్షించిరి. విఠ్ఠలుఁడు వేదశాస్త్ర పారంగతుఁడు, గురునాజ్ఞను

శిరసావహించి గ్రహస్థాశ్రమమును స్వీకరించెను. కాని యచ్చటి బ్రాహ్మణులెవరును అతనిని దరిఁ జేరనియ్యలేదు. చేయునదిలేక విఠ్ఠలుఁడూరి వెలుపల నొక కుటీరమేర్పర్చుకొని కాలము గడపుచుండెను. విఠ్ఠలుఁడు దేవాలయము లోనికిఁ గూడఁ బోవ నిషేధింపఁబడుటచే, అర్ధరాత్రమం దెవరికిఁ దెలియకుండఁగా భగవంతునిఁ బూజించుచుండెను, కొంతకాలమున కితడు సంతానవంతుఁడాయెను. పెద్దవాఁడగు నివృత్తున కుపనయనకాలము సమీపించెను. కనుక నతఁడు పుత్రున కుపనయనము చేయ బ్రాహ్మణులఁ గోరెను. కాని వారందుల కంగీకరింపలేదు. విఠ్ఠలుఁడు జేసిన నేరమునకుఁ దగిన ప్రాయశ్చిత్తము చేసి తన కుమారున కుపనయనము చేయుఁడని వేడెను. అందులకు వారొప్పుకొనలేదు. రుక్మిణీబాయి "ఇట్టి సంకట సమయములో, ఆ దయామయుఁడైన యా పరమేశ్వరుని చరణములు దక్క వేఱాధారములేదు గాన తమరాతని పాదములఁ బట్టుకొనుఁడ"ని తన పతితో విన్నవించెను.

ఒక దినము ఆతఁడు యథాప్రకారముగా దన కుటుంబముతో అర్ధరాత్రమందు దేవాలయమునకుఁ బోవుచుండ ఒక బెబ్బులి కానవచ్చుటచే, రుక్మిణీబాయి, పిల్లలు, విఠ్ఠలుఁడు చెదిరి పోయిరి. పెద్దవాఁడు, అడవిలోఁ బడిపోవుచుండ నొక గుహ కానవచ్చుటచేఁ దలఁదాచుకొన నందుఁ బ్రవేశించెను. అందులో గైనినాథుడను ఋషియుండెను. అతఁడా బాలకుని జూచి జాలినొంది చేరఁదీసి శిష్యునిగాఁ జేసికొనెను. కొన్ని దినముల తరువాత, శ్రీనివృత్తునకు యోగపరిచయము చేసెను. అటుపిమ్మట బ్రహ్మసాక్షాత్కారము, శ్రీకృష్ణుని యుపాసనముం జెప్పి, జ్ఞాన భాండార మతని స్వాధీనముచేసి, గురు పాదారాధునిగాఁ జేయ యోగ్యునిగాఁ జేసెను. గైనినాథుఁడు "ఇక మీఁదట నీవు కలిచేఁ బీడింపఁబడిన వారిని రక్షింపుము" యని యనెను నివృత్తుఁడిప్పుడు ఆధ్యాత్మకర్మవలన ధర్మమును స్థాపింప సమర్థుఁడాయెను. జ్ఞానోపదేశము చేయు శక్తిగలవాఁడై, గైనినాథుని సెలవందుకొని యిల్లు చేరెను. నివృత్తుఁడు దొలుతొలుతఁ దన సోదరుఁడగు జ్ఞానేశ్వరున కుపదేశ మిచ్చెను. జ్ఞానేశ్వరుఁడు, సోపాన, ముక్తాబాయి, ప్రపంచమంతట వెల్లడించిరి. నివృత్తునకు చివరవఱకు ఉపనయనముగూడ జరుగలేదు.



# ఉగాదినివేదన

కవిభూషణ, ఆచార్య, రాయప్రోలు సుబ్బారావుగారు.

౧

చిగురుల పూవులఁ దరహసింతువు, దీర్ఘదినాతపాయతిఁ
సొగసెదు, నీరువోయుదు వసుంధరపచ్చల కాన్కవేళలఁ
గగనసమాంసమీన పిమురఁ దెలివెన్నెలజున్ను పంతు వీ
జగతికి, పచ్చిముత్తెముల జంపులుగూర్తు వుషఃకుమారికిఁ,
మొగములు మోటువాఱు చలిపొద్దులనేలెదు కొమ్మలాడి; నో
భగవతి! ఈశ్వరాదినిను ప్రస్తుతియింతుము. కాలరూపిణీ!

౨

నీవారాగ్రిముమాద్రి సూక్ష్మమయి హృన్నీలాభ్రమధ్యస్థలీ
లావిద్యుచ్ఛిఖఁబోనిజీవుని మొదల్ దర్శించి సూక్తించె, ధ్యా
నావిష్కారవిభూతి నేఋషి తదీయజ్ఞాన ముక్తాఫలం
బై వేదోపనిషత్ప్రసన్నమగు బ్రహ్మానంద మూహించెదఁ.

౩

ఉత్సాహ ప్రభుమంత్రశక్తుల నొకండొక్కండెచాలుఁ గ్రియా
సత్సంసిద్ధికి, మంత్రమేగెను తపోజ్వాలాస్త్ర మానావధిఁ,
ఉత్పన్నప్రభుశక్తి క్రమ్మఱదు క్షాత్రోపాస్తి లేమిఁగలిఁ
ఉత్సాహంబొకఁడే శరణ్యమిఁక నాత్మోత్థాపన ప్రాప్తికిఁ.

౪

ధనధాన్యస్థితి సన్నగిల్లినను, విద్యాజ్ఞాన దీపంబు లా
ఱిన, మర్యాదలు మాసినఁ బ్రబలదారిద్ర్యంబు పోసెత్తినఁ

జనసమ్మేళన సభ్యులన్, పగలుచంప్రుల్ విప్పినన్ గాని, యెం
దు నిరుత్సాహవశుండు గానినరుఁ డందుణ్ దత్పునరోభ్యగముల్.

౫

ముగిరినచెట్లు కన్నె గిలి మొక్కలుగా, వలిజీర్ణ వస్త్రముల్
అదికినవిల్వనేరవు, పయస్సులుపిండవు గొడ్డుటాలు, గ్రి
క్కదలిన భూతనై భవమ్ముకై యిటులేమిటకె కంగలార్చు, నె
క్కుదమిటు ముక్కుసూటిగ నిగూఢమనోబల శైలశృంగమున్.

౬

ప్రాణి యనంతజన్మ పరిపాకమహోన్నతి చేత నాత్మమై
మానవహృద్విద్యత్పథమునన్ ప్రతిభాసితమాట, సర్వసం
ధానసమర్థుఁడై ప్రకృతికై వవిచక్షణ సల్పె, నట్టి యీ
మానవుడేల నేడు తనమాంసబలంబునె విశ్వసించెడిన్.

౭

భూమి ఫలించుచున్నది, సముజ్జ్వలధాతు సమృద్ధమై గిరి
స్తోమము నల్లెయున్నది, నదుల్ సుఖజీవన నిర్భరంబు, లా
రామములోషధీ సురుచిరంబు, లుదాత్తము వాఙ్మయమ్ము, నే
కామితమీయదీ భరతఖండము మానవ జీవయాత్రకున్.

౮

రసవదతీతకల్పనల రాగిలు సత్కవి! యీయనంత సృ
ష్టిసరణినాకళించెడు ఋషిప్రవరుం డసమాన ధైర్య సా
హసమున భూనభోంతరము లల్లల నాడఁగఁ జేయుచీరుఁడున్,
మసలి మహోత్సుక వ్రతసమర్పనయే యొనరించి రెప్పుడున్.



# సంయుక్త విద్యావిధానము

శ్రీమతి. సం. ఇందిరాదేవి (బి. ఎ. విద్యార్థిని)

ప్రపంచములోని ప్రతిజాతియుఁ బ్రతి దేశము పరిస్థితుల ననుసరించి యభివృద్ధి పొందుచుండుట సహజమే. అన్ని విధములైన యభివృద్ధి జాతికి సంభవించి యున్నత్యమునకుఁ దోడ్పడి ననే నాగరకత పెంపొందినదన్నమాట. నూతనాభిలాషలు జనించి క్రొత్త పోకడలు పోబుద్ధి పుట్టుట నాగరకతయొక్క లక్షణము. విద్యావిధానమునం దెన్నియో మార్పులు జరిగినవి; ఇంకను జరుగనున్నవి. మార్పులు జరుగుటకుఁ గొన్నిసారు లితర దేశములయొక్క యభివృద్ధి, వారి నాగరకతా ప్రభావము మనమీఁద ప్రసరింపక పోదు.

మన దేశమందు విద్య నేర్చుకొన్నవారి సంఖ్య 8% నకు తక్కువ యుండుటవలన అందులకుఁ దగిన ప్రయత్నములు జరుగుచున్నవి. స్త్రీలకుగూడ విద్య యవసరమని పాఠశాలలు వారికిఁ బ్రత్యేకముగా నేర్పఱుపఁ బడినవి. కాని యిటీవలఁ బాశ్చాత్య విద్యావిధానము ననుసరించి స్త్రీలకుఁ బురుషులకు నొకే విధమైన విద్య యొకే స్థలమున నిచ్చిన బాగుండునని యభిప్రాయ పడుచున్నారు. సంయుక్త విద్యావిధానము హిందూదేశములోఁ గూడ బ్రవేశపెట్టి తక్కిన దేశములవలె నభివృద్ధికివచ్చి వానితో సమాన స్థలము నాక్రమించు గొప్ప యాదర్శమే వారి యభిప్రాయమును బురికొల్పినది. విద్యావిధానము స్త్రీలకుఁ బురుషులకు నొక స్థలమునందుఁ గాకపోయినను, ప్రణాళిక యొకే విధముగా నున్నది గనుక ఒకేచోటనే చెప్పించిన నష్టమేమియు నుండదన్న ఉద్దేశముతో సంయుక్త విద్యావిధాన సమస్య బయలుదేఱినది.

సంయుక్త విద్యావిధానమువలన స్త్రీలు పురుషులు నొకరి నొకరు సక్రమముగా నిష్కపటముగా నర్థము చేసికొనుట కవకాశ మెక్కువ యేర్పడుననియు, అందువలన భావిజీవితము నొడుదొడుకులు లేకుండ సుఖముగఁ గడపఁగలరనియు విశ్వాసము. సాధారణముగాఁ బురుషులు జూనిన స్త్రీలు జంకుచుండుటయు, వారికి వీరు బానిసలమని తలంచుటయుఁ గలదు. పాశ్చాత్య దేశములవలెగాక స్త్రీలు వెనుకఁ బడుచుండుట వలన దేశాభివృద్ధికి నష్టమగుచుండును. అట్టి అభిప్రాయములను దొలఁగించుటకు సాధనమగుచున్నది సంయుక్త విద్యావిధానము. భిన్న విద్యా ప్రణా

ళిక ఉద్యోగావసరమును దీర్పలేక పోవుచున్నది గనుక సంయుక్త విద్యావిధానము నాగరకతాభి వృద్ధినొందిన పట్టణములన్నింటి యందును నవ లంబింపఁ బడుచున్నది. నైతికముగా స్త్రీ పురుషు లిరువురు నేకస్థలమునందుఁ జదువుటవలనఁ జెడి పోవుదురన్న మాట నమ్మఁదగినదికాదు. విదేశ ములనటు కెందుకు? మద్రాసు, బొంబాయి, కల కత్తాలందు నష్టము కలుగుచున్నట్లయిన అట్టి విద్యాలయములు నెలకొల్పుట కవకాశ ముండక పోయెడిది. పాఠశాలలు కళాశాలల వ్యయము రెట్టింపుగాక యార్థికముగా లాభము కలుగుట కవకాశము గలదు. కనుక సంయుక్త విద్యావిధా నము వలన దేశాభివృద్ధికి క్షేమకరమై పాశ్చా త్య దేశములతో పోటీ సలుపుట కవకాశము గలుగును. అని సంయుక్త విద్యావిధానము గా యునను వారి యభిప్రాయము.

కాని, నైతికముగా నష్టము గలుగదని నుడువ సాహసించుట కధికారములేదు. పరిస్థితు లిట్లు సృష్టింపఁబడిన పిమ్మట కాదని నిర్ధారణచేసి చెప్పలేము. పరస్పరాకర్షణకు లోఁబడుదురేమో యన్న జంకుకవకాశము గలుగకుండఁ బ్రత్యేక పాఠశాలలు నెలకొల్పఁబడినవి. "Prevention is better thancure" అన్నట్లు మొదలే జా గ్రతపడుట మంచిది. ఇఁక సంయుక్త విద్యాప్రణా ళిక వలన స్త్రీలకు లాభము కలుగుట తక్కువ. విద్యార్జనవలనఁ గుటుంబమును జక్కగా దిద్దు కొని సుపుత్రులను పుత్రికలను తయారు జేయవ లసి యున్నది. జరుగుబాటులేనివా రుద్యోగము లు చేసినను, ఈబాధ్యత వారిపై నుంచుట వలన రెండు విధముల కష్టముల కోర్వవలసి యున్నది. అట్టిదానిని మనఃపూర్తిగా స్త్రీ లొప్పుకొందు రనుటకల్ల. అదిగాక దేశాభ్యుదయము స్త్రీలపై ననే ఆధారపడి యున్నదని గమనించిన యెడలఁ బురుషునికన్న స్త్రీ బాధ్యత మిక్కిలిగానున్నదని బోధపడక మానదు. అట్టి దేశ క్షేమకరమగు బాధ్యతా నిర్వహణము సామాన్యముగాదు. గనుక, ఆదర్శపూరితమైన యీ జాతీయోద్దేశ ము నెరవేర్చు నిమిత్తము భిన్న విద్యాప్రణాళిక యుండక తప్పదు. జాతీయోద్దేశమునకు విరుద్ధ ముగా నడచుకొనువా రెవ్వరుండరు గదా! కనుక విద్యాభ్యాసమైన పిమ్మట భావిగృహిణీ జీవితమునం దడుగిడిన పిమ్మట ఫిజిక్సు, కెమిట్రి పరిశోధనలు సహాయపడనేరవు. గృహిణి జీవిత మును నిపుణత్వముతో నిర్వహించుకొనుట కవ కాశము లేకపోవును. ఉద్యోగములు జేయుటకు సంయుక్త విద్యాప్రణాళిక వలన లాభముపొంది యెంతమందియని యుద్యోగములు చేయుదురు? పురుషులే ఉద్యోగములులేక యవస్థలు పడుచుం డ, వీరికిగూడఁ బనులు దొరకునన్న ఆశ యెక్క డిది? అంగర మందలమెక్కినచో మోయువా రెవ్వ రన్నట్లు స్త్రీపురుషు లిరువు రుద్యోగములు చే యుట కారంభించిన సేవకుల చేతికి సంసారము లప్పగింపవలసి యుండును. కనుక భిన్నవిద్యా ప్రణాళిక యుంచి దేశాభ్యుదయమునకుఁ దో డ్పడవలయునని సంయుక్త విద్య అనవసరమను వారి వాదము.

ఈ రెండు వాదముల సమంజసత్వము ను బరిశీలింతము. సంయుక్త విద్యావిధానమ మలు జరిపిన బాలబాలికలకు నైతికముగా నష్ట ము కలుగునని గాని, కలుగదనుకొని వాదించుట గాని సమంజసముగా నుండదు. ఉభయ పక్షముల వారికిని ఆధారములు సరిగా లేనందున ఎవరిపక్ష మును బలవత్తరముగా గ్రహించుటకు వీలు లేదు. అంతేగాక మన బాలబాలికలు చెడిపోవు దురన్న భావమే యనాహ్లాదకరమైనది, అనర్థదా యకమైనది. తమ పిల్లలను దామే సంశయించుట కోరఁదగిన పనిగాదు. కాని యట్లనుటవలన జా గ్రత పడవలదన్న యభిప్రాయమును గాదు. నై తికముగా నష్టము కలుగుననిగాని కలుగదనికాని పరిస్థితులను బట్టి ఘంటాపథముగాఁ జెప్పుట కవకాశములేదు గనుక ఆవాదమును భయపక్ష ములవా రుపసంహరించుకోవలసి వచ్చును.

ఉభయవాదములుగూడ విద్యాసమస్య ను చెరియొక వైపునుండి యాశ్రయించి సంఘ ర్షించుచున్నవి. ప్రశాంతశీతలచిత్తముతోఁ బరి శీలించినఁ గాని, యుభయవాదముల యొక్క సత్యమును స్పష్టముగాఁ దేలపడునట్లు కనఁబడదు. సంయుక్త విద్యావిధానముకాయునను స్త్రీలుఁ బురుషులు పొందు లాభము లే పొందఁ దలఁచినవారు గనుక వారికి గలుగుచున్న లాభ నష్టములను విచారించుట సాహసము కాకపోదు. ప్రస్తుత విద్యావిధానము వలన విద్యార్థులకుఁ గలుగవలసినంత లాభము కలుగుట లేదని విశ్వ విద్యాలయములు ప్రతి సం॥ రము నూతన ప్రణా ళిక లేర్పఱచి పరిశోధనలు జేసి నానావస్థలు పడుచున్నవి. ఇప్పటికిని ఏదిస్థిరమైన ప్రణాళిక యో నిర్ధారణము జేయలేకపోవుటయే యందు లకు నిదర్శనము. నేటినాయకులేమి, రాజకీయ వేత్తలేమి, ఆర్థికశాస్త్రజ్ఞులేమి. తత్వవేత్తలేమి, యందఱు నేకగ్రీవముగా నేటి విద్యావిధానమును సక్రమముగా సంస్కరించి భారతజాతీయాదర్శ ములతో మేళవింపుజేసి దేశాభ్యుదయమునకు మార్గదర్శకముగఁ జేయుట విద్యాధికుల విధి యని వేనోళ్లఁజాటుచుండుట గమనింపఁదగిన విషయము. అంతటివార లట్లభిప్రాయ పడుటకుఁ బ్రబలకారణములు లేక పోలేదు.

మొదటిది ఈ విద్య అమిత వ్యయము తోఁ గూడిన విధానము. పర భాష ద్వారా నిర్బంధబోధనము జరుగుచుండుట. తన సంతాన మును జదివింపఁ దలఁచినచోఁ గొన్ని వేలు కర్చు పెట్టుటకు సిద్ధపడి యుండవలెను. పాఠశాలా వేతన ములు, ఉపహారపు విందుల చందాలు బాలభట వేషపు వ్యయములు వాచానాలయముల కర్చులు మొదలయినవానితో నిండి యున్నది నేటి చదువు.

ఇన్ని ఖర్చుల నెదురుకొనుటకు మాన్య ములనమ్మి, నగలనమ్మి చదివింపఁబడిన యువకుఁ డు నిరుద్యోగ సమస్య నెదురుకొన వలసి వచ్చు చున్నది. భావి జీవితమందుఉ ద్యోగములు దొర కక పోయినంత మాత్రమున విద్య వలదనుట కాదు కాని, విద్యావిధానమునం దెట్టి లాభ

మాశింపఁ బడుచున్నదో అదిగూడ మన దురదృష్ట వశమునఁ గొఱఁతపడు చున్నదని దేశనాయకులే భావించుచుండుట వలన, నేఁటి విద్యావిధానములోని లోపములు సుస్పష్టములగుచున్నవి. ఆధ్యాత్మిక దృష్టిని దూరము చేసికొని విశాలహృదయతకు, శారీరకముగను వికాసముపేక్షింపఁబడి మానసికాభివృద్ధికి మాత్రమే తోడ్పడుచున్నవి. అలహాబాదు విశ్వవిద్యాలయము వైసుఛాన్సలరుగారగు పండిత ఇక్బాల్ నారాయన్ గుర్తూగారు తమ అధ్యక్షోపన్యాసము సందర్భమున: Education is not looked upon as being merely a preperation for adult life but is being more and moble made to minister to the child's growth-Physical, mental emotional and spiritual" ఇంతలోపభూయిష్ఠమగు విద్యావిధానమువలన నసంఖ్యాకములగు కష్టనష్టములు కలుగుచుండుటను కనులార జూచుచుండియు మన సోదరీమణులు సంయుక్త విద్యావిధానము గావలయునని దూరమాలోచింపక పట్టుపట్టుటసమంజసమని తోపకమానదు. ఇతర దేశములతోఁదులఁదూగవలయునని మాత్రమేకాక సంగతి సందర్భముల నాలోచింపక సంయుక్త విద్యావిధానము ప్రవేశపెట్టుటకంటె, దాని నాచరణలోఁ దెచ్చుటకుఁ బూర్వము దేశమునం దనుకూల పరిస్థితులు సృష్టింపఁవలసి యున్నది. ఇట్లనుటవలన సంయుక్త విద్యావిధానమునకు గేవలఁము నేను విముఖురాలనని తలంపఁదగదు.

ఇఁక భిన్న విద్యాప్రణాళిక అవసరము లేదనువారికిగూడ సమాధానము గలదు. ఉద్యోగావసరమును దీర్చలేక పోవుచున్నది గనుక భిన్న విద్యాప్రణాళిక ఆచరణయందుంచిన లాభము లేదని కొందఱి యభిప్రాయము. సాధారణముగా నుద్యోగ మనుపదమున కర్థము గల్పింపఁబడు చున్నందువలన ఆ యభిప్రాయమునకుఁ దావేర్పడుచున్నది. ప్రభుత్వోద్యోగమే ఉద్యోగమని యర్థముచెప్పక స్త్రీగాని పురుషుఁడుగాని వ్యర్థముగాఁ గాలము గడపక కుటుంబ సంరక్షణార్థమును స్వాభివృద్ధికొఱకును జేయునెట్టి కృషియైనను ఉద్యోగమనిపించు కొనును. అందువలననే "ఉద్యోగః పురుషలక్షణ" మ్మనినారు పెద్దలు. ఈ యుద్యోగ సమస్య 19వ శతాబ్దమున గొప్ప ప్రవక్తగాఁబరిగణింపఁ బడిన కార్లైల్ మహాశయుని dignity of labour సిద్ధాంతప్రకారము సమన్వయించినచో సులభముగాఁ బరిష్కరింపఁ బడగలదు. ఈతత్వమునే పాటించుచు భాగవత గ్రంథకర్తయగు "సత్కవిశ్రేష్ఠుడునగు పోతనామాత్యుఁడు "సత్కవుల్"

హాలికులైననేమి, గహనాంతర సీమల
కందమూల కౌద్దాలికులైననేమి నిజదారసుతో
దర పోషణార్థమై.

అనియొత్తి చెప్పినాఁడు.

ఉద్యోగ సందర్భమున విద్యావిధానము వృత్తి విద్యగాఁ బరిగణింపఁ బడునుగదా! అది పారిశ్రామికముగా వ్యావసాయికముగా విభజిం

చుకొన వచ్చును. ఈ రెండు తానే వానికి దగిన
పరిశ్రమలను లెక్క మీఱునట్లు వృద్ధిజేసి సంఘ
ముయొక్క అభివృద్ధికిఁ దోడ్పడుట కవకాశములు
గలవు. వృత్తివిద్య పరస్పరనిర్మాణభేదమును
బట్టి యభిరుచినిబట్టి భిన్న విద్యా ప్రణాళికయం
దుచేర్చుకొనినట్లయిన విద్యావిషయములోనేగాక
ఆర్థిక విషయములోఁగూడ నెక్కువ బాగుపడు
ననుటలో సంశయముండఁగూడదు. కనుక స్త్రీ
గృహ నిర్వాహకురాలుగా నుండి తాను నేర్చి
నట్టి వృత్తివిద్యనాచరణయందుంచి సంఘము
నకుఁ దోడ్పడినప్పు డామెను వృత్తిహీనురాలుగా
అర్థము చేసికొనుట అసంగతము, శోచనీయము.
ఇట్టి పరిస్థితులకు భిన్నవిద్యాప్రణాళిక సహా
యపడుననుట సత్యదూరముకాదు. వృత్తివిద్య
లేర్పరుచు కొనుటలో స్వాతంత్ర్యములేకను పో
లేదు. దానివలన గృహనిర్వాకమునకు దూ
రమగుటయులేదు. ఈ పరిస్థితినే "Unity in
Diversity and Diversity in Unity"
అను న్యాయముగా సమర్థించుకొని సరిపెట్టు
కొనుటలో దోషమేమియులేదు. ఇట్టి విష
యమును గమనించియే కార్వే పండితుఁడు ఇరు
వది సంవత్సరములనుండి భిన్న విద్యా ప్రణాళిక
తోఁ గూడిన భారతమహిళా విశ్వవిద్యాలయము
ద్వారా మహిళాభ్యునయమునకు నిరంతర కృషి
చేయుచుఁ దోడ్పడుచున్నాఁడు. శ్రీ కార్వే
పండితుని, ఈకారణము వలన విస్మరించుట
తగనిపని.

పాఠశాలల కుపాధ్యాయుల నిమిత్తము
కొందఱికిని గల్పించు నవకాశముగూడ గలదు.
భిన్నవిద్యాప్రణాళిక లేకున్న ప్రభుత్వము
వారికి కడుతగ్గుచున్నదని అభిప్రాయ పడుచు
న్నారు కొందరు, కాని యెంత వృత్తికల్పనము
జరుగుచున్నదో యోచింపరు. ఆర్థికముగాఁ
గూడ భిన్న విద్యాప్రణాళిక సంఘమునకు సహా
యముజేసి నిరుద్యోగ సమస్యను కొంతవఱకు
సమసిపోవునట్లొనరించు చున్నదని యభిప్రాయ
పడక తప్పదు. కాని యా యుద్దేశమేయయిన
యెడల విద్యాప్రణాళికయందు మార్పులెట్టి వుం
డవలయునని సందేహము గలుగుట సహజము.
స్త్రీ పురుషుల యభిరుచులు వేఱుగనుక నే
ప్రణాళికవలనఁ బరస్పర సహాయము లభించుట
కవకాశ ముండునో, ఏదియెవరికి దగియుండునో,
విచారించుటయే భిన్నవిద్యా ప్రణాళిక యొక్క
ముఖ్యోద్దేశము. కనుక నట్టి ప్రణాళికను సవిమ
ర్శముగ నాలోచింప కుండుట వలననే దానిపై
మంచి యభిప్రాయము లుండక లోపము లగ
పడుచుండుట సామాన్యము.

సంయుక్త విద్యావిధానమును గూర్చి కొంద
ఱు చూపునైతిక వాదమునందు కొంత సత్యము
లేకపోలేదు. అట్టిదానిని కేవల మూహాజన్యమని
విపరీతానుమానమని నిరసించుటకంటె
దాని సత్యమును సహృదయముతో నరసి
విద్యాప్రణాళికను చతుర్విధముగా విశాల
ము జేసినప్పుడు సంయుక్త విద్యావిధా

నము వలని లాభమునను జూఱఁగొనుట యెం తయునభిలషింపఁదగినది. కనుక విద్యావిధానము మనుష్యుని సహజ వికాసమునకుఁ దోడ్పడి జాతీయ నిర్మాణమునకుఁ గుదురునట్లు లాధ్యాత్మికాది చతుర్విధముగా నభివృద్ధికిఁ దేఁ బడిన చో సంయుక్త విద్యావిధానమున కెట్టి యభ్యంతర ముండకూడదు. కాని యిట్లనుట సంయుక్త విద్యావిధానము జాతీయాభివృద్ధికిఁ దగునాతగదా యను ప్రశ్నకు ఒక రీతిగ సమాధాన మిచ్చుటయేగాని భిన్న విద్యా ప్రణాళిక ద్వారా దీనికంటె నెక్కుడు లాభములు పొందుటకు వీలునప్పుడు దీని మాట తలంపునకుఁ గూడ రాదనియే తలంచెదను.



# బాలికల ఉన్నత పాఠశాల

శ్రీయుత బిదుదు వేంకటశేషయ్య, బి. ఏ.

సీ॥ "ఏ నాఁడు మనయాంధ్రు । లెఱిఁగి కర్తవ్యమ్ము  
మొగ్గి వత్తురో!" యన్న । ముఖ్యదినము  
"ఏ నాఁడు మన స్త్రీలు । పూని విద్దెలనేర్చి  
పూజ్య లౌదురో!" యన్న । పుణ్య దినము  
"ఏ నాఁడు స్వాతంత్ర్య । భానుండు తెరఁదీసి  
భాసిల్లునో" యన్న । పర్వ దినము  
"ఏ నాఁడు "ఇతఁడాంధ్రుఁడే! యను వ్యక్తిత్వ  
మెసఁగునో!" యన్న యదృష్టదినము

గీ॥ "ఇన్ని నాళ్లకు సెలవుగా । నెళ్లరమును
నోచునోములు ఫలియించె । నా !" యన, నేను
భవ్యత ఘటిల్లె, నహహా ! మా పాఠశాల
రమ్య భవన నిర్మాణ సం। రంభ వేళ ॥

సీ॥ "ఒక యొఱ్ఱదీనిఁ జేర్పకవీడ" ననెడి వేం
కటరామరెడ్డిశు కార్యదీక్ష
"మాలవ్య" వలెబడిం । బ్రిదికించు కొనివచ్చు
హనుమంత రాయునే । వానరక్తి
గొడుగు పట్టినయట్లు బడినిఁ గాపాడెఁడి
రామకృష్ణార్యు ని । ర్మల మనీష
తనకును బడికిభే । దము సేయుటెఱుఁగని
నరసింహరాయు ప్రి । జ్ఞావిశేష

గీ॥ మాంధ్రి సోదర జనుల స । హానుభూతి
కలసి మూర్తీభవించి న । ట్లైలమినించి
ఇంక మా పాఠశాల శో । భించు నిచట
బాలవిద్యార్థినీ జయ । ధ్వజమయగుచు ॥

మ॥ తన పేరం బురమొండు గట్టుకొనియు
ద్యత్కీర్తి భాసిల్లు శ్రీ
ఘనుఁదండ్రిన్ మఱపించి పావనకృపా
గంభీరుఁడై బాలికా
జన విద్యాలయ నిర్మితి ప్రచురదీ
క్షుం గ్రాలి యానంద వ
ర్ధనుఁడై యొప్పెడి పన్నలాలమృతహా
స్తస్పర్శ శస్తంబగున్ ॥

(ఈ పద్యములు నూతన గృహ నిర్మాపణ సందర్భమున 20-11-1936 నాడు జరుపబడినది.)

# ఆదర్శ మిత్రద్వయము

శ్రీమతి. ఆర్. లలితాదేవి, నాల్గవ ఫారము

సుధీరుఁడు ౧౦ ఏండ్ల వాఁడు. అందము గలవాఁడు. బుద్ధిమంతుఁడు. వినయము గల వాఁడు. శ్రీమంతుడయినను గర్వములేని వాఁడు. మొత్తము మీఁద సుగుణి. కాని అతని తలిదండ్రుల వలన అతని నిజమయిన స్వభావమునకు చలనము లేకపోయినది. తలిదండ్రుల కొకడే కుమారుఁడుగాన ఎక్కువ ప్రేమతో పెంచుచుండిరి. తల్లి సుధీరుని వదలి ఎన్నడును ఉండెడిది కాదు. ఆ ప్రేమ ఏమోకాని సుధీరునికి ౧౧ ఏండ్లు వచ్చినను అక్షరాభ్యాసమయినను చేయించ లేదు. అయినను సుధీరుఁడు స్వభావతః ధీమంతుడుగాన తన ఇంటికి వచ్చు నొక మిత్రునియొద్ద అక్షరములు నేర్చుకొని యుండెను. సుధీరుని తల్లి పేరు లక్ష్మమ్మ. ఆమెకున్న గర్వమింతంత యని చెప్పరాదు. ఎల్లప్పుడును గర్వముతో ఊగులాడుచుండెడిది. తండ్రి రామారావు. ఆయన పింఛనువేతనము తీసికొనుచున్నాఁడు. జమీందారులు, ఏమికొదవ? సుధీరునికి తల్లిగుణ మెంత మాత్రమును నచ్చదు. ఆమె సుధీరుని కుసుమమువలె పెంచుచుండెను. అతనికి కోపము. లక్ష్మమ్మకు తన కుమారుఁడు ఎప్పుడు గొప్పగా నుండవలయునని ఇష్టము. సుధీరునికి మాత్రము అది అసహ్యము. రామారావుగారు బి. ఏ. ప్యాసయినవాడే కాని పుత్రునకు విద్యాభ్యాసము చేయింపవలెనని అనుకొనలేదు. ఆయన ఈ చదువువలన ఏమి ప్రయోజనము? అని అనుకొనెడివాఁడు అయితే సుధీరుఁడు మాత్రము తెలివిలేనివాడా?

"ఎవ్వరదీ? అడుగకుండ మేడమెట్లు ఎక్కుచున్నావేమి?" అని లక్ష్మమ్మ గద్దించి అడిగినది.

"అమ్మా! సుధీరుఁడు నన్ను పిలిపించుటచే వచ్చితిని. ఉన్నాఁడా? సుధీరుఁడు? అని యా బాలకుఁడు నమ్రముగా ప్రశ్నించెను. అతని పేరు శేఖరుఁడు. అతడు ఒక కాపువాని కుమారుఁడు. అయినను సుధీరునికి మిక్కిలి ప్రియుడు. శేఖర్ గూడా పదిఏండ్లవాఁడే. అయినను ౬వ తరగతి యందుండెను. ఈతఁడే సుధీరునకు అక్షరములు నేర్పెను. శేఖరునకు ఈ దినము బడి లేనందున

సుధీరునకు చదువు చెప్పుటకు వచ్చి మేటమెట్లె క్కుచుండఁగా లక్ష్మమ్మ పై విధముగా బెదరించెను. అయినను అతఁడు భయపడక బదులు చెప్పి సుధీరుఁడున్నాఁడా లేడా యని యడిగెను.

"ఉన్నాడు కాని నిన్నెవ్వరు రమ్మని నారు? ఇంట్లో పనిపాటలు లేక ఊరక వచ్చెదవేమి?" అని తిరిగి అన్నది లక్ష్మమ్మ. 'అమ్మా' పనిపాటలులేక కాదు నేను వచ్చినది, సుధీరుఁడే నన్ను పిలిపించెను. కావున వచ్చితిని." "సిగ్గు లేదు. నా బంగారు కొడుకేమి? నిన్ను పిలుచుట యేమి? వచ్చునప్పుడు మంచి బట్టలు వేసికొనియైనను రాఁగూడదా? చింపిరి గుడ్డలతో వచ్చితివేల? నీవునా సుధీరునియొద్ద కూర్చొనుటకు గూడ తగవు. ఏమి? ఇంకను మెట్లు దిగవేమి?" అని లక్ష్మమ్మ కొట్టి తరుమఁబోయెను. అంతలో సుధీరునికి ఈ శబ్దము వినఁబడినది. శేఖరుని లక్ష్మమ్మ కోపపడుచున్నదని విని పరుగిడి వచ్చి శేఖరుని చేతులుబట్టి పైకి తీసికొనిపోయెను. లక్ష్మమ్మ కుమారునివంక చూచి "సుధీరా! నీకింతకంటె వేరేమిత్రులు లేరా? జగన్నాథరావు గారు జహాగీరుదారులు వారి కుమారుఁడున్నాఁడు అతని నైనను పిలిపింప గూడదా? ఈపాడు కాపు వాని కుమారునితో నీకు స్నేహమేల?"

"అమ్మా! జగన్నాథరావుగారి కుమారుఁడు వలదు, మరి ఎవరు వలదు. శేఖరుఁడు నాకు చదువు చెప్పును. జగన్నాధరావు కుమారుఁడు ఒకవేళ వచ్చిన నాకేమి లాభము లేదు. శేఖరుఁడు కాపువాని కుమారుఁడైన నేమి? ఎందుకింత గర్వము. ఈ గొప్పవారి బిడ్డలంటె కాపు వారి పుత్రులే సుపుత్రులు. వారే దేశమున కుపకరించెదరు." అని సుధీర శేఖరులు పైగదిలో నికి వెళ్లిరి. సుధీరుని వెనుక శేఖరుఁడుకూడ వెళ్లెను. శేఖరుఁడు క్రింద కూర్చొనుటకు వెళ్లు చుండగా సుధీరుఁడు అతనిని పైన కూర్చుండ బెట్టెను. కాని శేఖరుఁడు వినలేదు. చివరకు వారిరువురునుక్రింద కూర్చొనిరి. రామారావుగారు అంతలో అచ్చటికి వెళ్లి "సుధీర్! క్రింద కూర్చొనవేల? పైని కూర్చుండుము" అని చెప్పిరి. అన్నగారు బాగున్నది." అని సుధీరుఁడు చెప్ప గా, "నీ ఇష్టము. నీవు ఈ మధ్యమేము చెప్పినది బొత్తిగా వినవు. ఐశ్వర్యమున్నప్పు డెందుకు అనుభవింపఁగూడదు?" అని యనుచు వెళ్లిపో యిరి. శేఖరుఁడు ఈ దినము సుధీరునకు మొదటి వాచకము మొదలుపెట్టెను. సుధీరుఁడు చెప్పిన దంతయు శీఘ్రకాలములోనే నేర్చుకొను చుం డెను. ఇట్లు కొలది దినములు గడచెను. తలిదం డ్రులు బడికి పంపకపోయినను సుధీరుఁడు ౧౧ ఏడు వచ్చునప్పటికి శేఖరుని చేతిక్రింద ౪వ వా చకము చదువుటకును, లెక్కలు, చరిత్ర, భూ గోళము అన్నియును బడిలోవలె నేర్చుకొను ఇట్లే కాలము గడచుచుండెను.

* * * *

సుధీరుఁడు ఇప్పుడు ౧౪ ఏండ్లవాఁడు. తలి దండ్రులను ఎంతో బాధపెట్టి బడికి వెళ్లుటకు అనుమతి పొందెను. శేఖరుఁడు వెళ్లు బడికే వెళ్లు చుండెను. ఇప్పుడు సుధీర్ శేఖరు లిరువురును

రవ ఫారములో నుండిరి. సుధీరునికి శేఖరుఁడే తనతో సరిసమానముగా నేర్చెను. సుధీరుఁడు ౧వ ఫారములో ఉండు ఫలము శేఖరుని ఉపకారమే. సుధీరుఁడు ప్రతిదినము సాయంకాలమును బీద లుండు గుడిసెలకు వెళ్లి వారి కష్టములను కనుగొని వానినుండి తప్పించుటకై ప్రయత్నించుచుండెను. లక్ష్మమ్మకు సుధీరునికి ఇచ్చటనే ఎప్పుడును తగాదా. అయినను సుధీరుఁడు లక్ష్మమ్మ మాటలను లక్ష్యపెట్టక తన కర్తవ్యమును నిర్వహించువాఁడు. సుధీరుఁడు ఒకేవిధమయిన స్థితిలో మనస్సును సిద్ధపర్చియుండెను. దైవభక్తి, దేశభక్తి, ఈ రెంటి మూలముననే మానవుఁడు కృతార్థుఁడు కాఁగలఁడని అతని నమ్మకము అతఁడు ౧౪ ఏండ్లవాఁడే అయినను బుద్ధి చాల గొప్పది. నిష్కల్మషమయిన మనస్సు తలిదండ్రుల గుణము లేమాత్రమును రాలేదు. సుధీరుని చూచిన వారెల్లరును, "నిజముగా బొగ్గుగని లోనుండి రత్నము బయలుదేరినదమ్మా" అనెడి వారు శేఖరునితల్లికి సుధీరుడన్న ఎంతో యిష్టము రానురాను లక్ష్మమ్మ రామారావులకు కుమారుని గుణములమీఁద రోఁతపుట్టినది. సుధీరుఁడు దీనిని గమనించి తలిదండ్రులను మంచి మార్గమునకు త్రిప్పవలయునని తీర్మానించుకొనెను.

* * * *

౬ ఏండ్లు గడచినవి పరిస్థితులలో ఎన్నో మార్పులు గల్గినవి సుధీరుడు బి. ఏ. ప్యాసయినాఁడు. ౨౦ ఏండ్ల యువకుఁడును దృఢశరీరముగల వాఁడును ఆరోగ్యసంపన్నుఁడు. శేఖరుఁడుగూడ అచ్చటనే యుండెను. లక్ష్మమ్మ రామారావు లింకను తమ అభిప్రాయములను మార్చుకొనలేదు. కాని ఒక్కొక్కప్పుడు మాత్రము సుధీరునిచేతలు మంచివని వారి ఆత్మ చెప్పుచుండెను.

ఆరోజులు స్వాతంత్ర్యాభిలాష కల్గించునవి. ప్రతివారును స్వాతంత్ర్యము కొఱకే పోరాడుచుండిరి బీదలయందు సహానుభూతి గలవారు లేనేలేరు. ఎచ్చటచూచినను సంసారము నిస్సారమయినదని దుఃఖించువారలే యుండిరి. గాని సంతోష హృదయులు మందుకయినను లేరు. పొలము కాపువారలందరును. పన్నులీయఁజాలక యుండిరి. ఇట్టిపరిస్థితియందు సుధీరుఁ డూరనుండఁజాలక ఏదో ఒక మేలుగావింప వలయునని తలంచి శేఖరునితో గూడ నిశ్చయించి తలిదండ్రుల నడుగుటకు వెళ్లెను. అదేమన :- ఇరువురు ఇండ్లు వదలి జనులందరును ఎట్లున్నారో కనుగొని వారికి మేలు గావించి రావలయునని నిశ్చయించిరి. లక్ష్మమ్మ రామారావులు మండిపడిరి. "నాన్నగారు! మీరు ఇంత చదివితిరికదా? నేను మీకు చెప్ప నవసరము లేదు. మన జహగీరులోని జనులకే మనము మేలు చేయఁజాలకున్న మనము బ్రతికియుండి లాభము? ఎందరో ఎన్నెన్ని తెంగులలో బీదతనము ననుభవించుచుండ మన యింట మనము సుఖముగా ఉండుటనా న్యాయమా? ఇట్లు చేయుట భగవంతుని కెంత మాత్రమును ఇష్టము లేదు. భగవంతునికి ఇట్లు చేసిన కోపము

వచ్చును. కావున వెళ్లుటకు అనుజ్ఞయిండు. వెళ్లి వారికి సుఖమును నెలకొల్పి వచ్చెదను. లేదా భగవంతుని ఇష్టము లేకున్న శత్రువుల మధ్య న్యాయము కొఱకై పోరాడుచు మృతి నొందెదను. అమ్మా! నీకు వందనములు, నాకిక అనుమతి నిమ్ము వెళ్లెదను." అని సుధీరుఁడు తలి దండ్రులతో ననెను. అది ఏమి ఆశ్చర్యమో గాని ఇంతవరకు మండిపడుచున్న ఆ దంపతులు ఒకే పర్యాయము తలలూపి "నాయనా! జయమును పొందుదువుగాక. నీవంటి కుమారులుండుట మా బోటివారల భాగ్యమే. నిజముగా శేఖర్! ఇది నీవు చేసిన బోధయేయని తలంచెదము. ఆ దినము సుధీరునకు చదువు చెప్పుటకు వచ్చిన నిన్ను నేను తోసివేసితిని. నాకు బుద్ధి లేకపోయినది. నా గర్వమున నేనట్లు చేసితిని. శేఖర్! నన్ను క్షమింపుము. నీ సహవాసమువనే సుధీరుఁడు ఇట్లు దేశభక్తుఁడయినాఁడు. దీనికి నీవేకారణము. వెళ్లుఁడు మీరు జయమును పొంది తిరిగి రాకయే చనిపోయినను మేము దుఃఖపడము. అది మా భాగ్యమేయని తలంచెదము." సుధీరుఁడు ధన్యుడయినట్టుగా భావించెను. వారిరువురును భగవంతుని ప్రార్థించిరి. "దయార్ద్రహృదయా! మాధవా! మాకుమృత్యువు నిచ్చుచో ఈ క్రింది విధముగా నిమ్ము. మాకు సముద్రములో చావున్న యెడల రిపుసైన్యముల రక్తప్రవాహ మందు తేలుచున్నప్పుడు మృత్యు విమ్ము. పర్వత శిఖరములనుండి క్రింద పడినపుడు మృత్యు విచ్చుచో భవదీయ మనము నందున్న స్వాతంత్ర్యము కొఱకు కోటలను జయించు నపుడు క్రింద పడవేసి చంపుము. ఎట్లైనను సరే కాని నా దేశము కొఱకే నా ప్రాణములను గోల్పోవుట నా కిష్టము. కాన మధుసూదనా! అట్లే చేయుము మాకార్యమున మాకు జయము కలుగుఁగాక!" తరువాత సుధీర శేఖరులు బయలు దేరిరి.

* * * *

"అమ్మా! మీ పేరేమి?" అని అడుగగా ఆ బాలిక "నాపేరు శాంత" అని క్షీణ స్వరముతో చెప్పినది. "నీ వీ ఘోర కాంతారమునకీ వేళ ఏల వచ్చితివి?" "అయ్యా! ఏమని చెప్పుదును నాకరుణ కథ!" అని భయభ్రాంతయై వెనుకకు చూచెను. చూచుటయే తడవుగా "ఆయే! వారే! వారే వచ్చుచున్నారు." అని పరుగిడ సాగెను. సుధీర శేఖరులు విస్మయముఁజెంది దూరమునుండి వచ్చుచున్న ఆ అఫ్గలను చూచుచుండిరి. సుధీరుఁడు శేఖరునితో "శేఖర్! నీవు శాంత యొద్దకు వెళ్లి కారణమేమో కనుగొనుము. నేను వీరితో పోట్లాడెదను ఏదీ! ఆ కత్తి నిమ్ము" అనెను. శేఖరుఁడు వెళ్లెను. సుధీరుఁ డచ్చటనే ఒక్క అడుగును కదలక నిలుచుండెను. సుధీరుఁడు కత్తి మొదలగునవి త్రిప్ప నేర్చెను. కావున అచ్చట భయము లేకుండెను. ఇంతట వారు సమీపించి "ఆ పిల్ల ఎక్కడ" అని గర్జించిరి. "నీకెందుకు!" అని సుధీరుఁడు వారి మధ్య కత్తి త్రిప్పెను. వారెందరో యుండిరి సుధీరుఁడు యొక్కఁడే అయినను అట్లే పోట్లాడుచుండెను. శేఖరుఁడు అంతలోవచ్చి సుధీరునికి సహాయము చేసెను. అఫ్గనుపఠానులు

ధైర్యముతోఁ బోరాడిరి. సుధీరుఁడు మూర్ఛనొందెను. పఠానులు పారిపోవు నంతవరకు శేఖరుఁడు వారిని తరిమివేసెను. శేఖరుఁడు గాయములతో బాధపడుచు సుధీరుని వద్దకు వచ్చెను. సుధీరుఁడు అప్పుడే కొంచెము స్మృతి వచ్చి "శేఖర్. ఏది శాంత?" యని అడిగెను.

శేఖరుఁడు :- శాంత ఒక బీద వృద్ధురాలి కొమార్తె, పన్నులీయ కున్నందున ఈ క్రూరులు ఆమె ఇంటిలో పడి బాధ పెట్టిరఁట. చివరకు ముసలమ్మను ఒక చోట దాచి వెంటఁబడి వచ్చు వారినుండి రక్షించుకొనుటకు ప్రయత్నించుచు ఇచ్చటికి వచ్చినదట. నేను ఆమెను ఆమె తల్లి వద్ద వదలిపెట్టి వచ్చునప్పుడు తెచ్చిన ౧౧ రూపాయిలు ఇచ్చితిని. ఇఁకేమియు భయము లేదు." ఈ మాటలు ఎంతో కష్టముతో చెప్పి శేఖరుఁడుగూడ క్రింద పడెను సుధీరుఁడు ఆ మాటలు విని సంతసించి "మన ఒక సోదరి మంచి స్థితికి వచ్చినదిగదా? ఇక శేఖర్! సెలవు" అని సుధీర్ ఈ లోకమును వదలెను. శేఖరుడు భగవంతుని "దేవా! ఇఁక నేను ఈ దేశమును ప్రపంచమును వదలుచున్నాను. తల్లీ! నీకు నా వందనములు. రాఁబోవు జన్మలగూడ ఇంతకంటె ఉత్కృష్టమయిన కార్యము మా చేత కల్గుగాక! దేశమాత! నీకు వందనములు అని సుధీరుని చూచి "సుధీర్! మన కర్తవ్యము కొంతవఱకు నిర్వహించితిమి. నేనుగూడ నీతో వచ్చెదను." అని కండ్లు మూసెను. ఆ అరణ్యములోని పక్షులన్ని అప్పుడే ఏడ్పు ధ్వనులు చేసినవి. పాపము! వానికిగూడ సుధీర శేఖరుల మృత్యువు దుఃఖమును గల్గించినది. అప్పుడే సూర్యుడుకూడ నస్తమించెను. అంధకారమయినది. చెట్లన్నియు దుఃఖముతోఁ దలలు వంచినవి.



# బాలికల ఉన్నత పాఠశాల.

సుల్తాన్‌బజారు, హైదరాబాదు (దక్షిణ.)

# విజ్ఞప్తి.

ఈపాఠశాల హైదరాబాదు నగరమందలి కొందరు ప్రజాహిత కార్యతత్పరులచే వ్రేళ్ల మీద లెక్కపెట్టునంత మంది విద్యార్థినులతో 1928వ సంవత్సరములో ప్రారంభింపబడినది. ఇందు ప్రారంభ తరగతినుండి మెట్రికు (ప్రవేశ) పరీక్షవరకు మాతృభాషద్వారా యీ పది సంవత్సరములనుండి, యుచితముగా విద్య గరపఁబడుచున్నది. ఇచ్చట గృహిణులకును వితంతువులకును, జాతి, తెగ మతవిచక్షణలేక విద్యాసౌకర్య మేర్పడుచున్నది.

ఈ ఉన్నత పాఠశాల బొంబాయిలోని అఖిలభారతమహిళావిశ్వవిద్యాలయముతోఁ జతపర్పఁబడియున్నది. ఇందలి పాఠ్యప్రణాళిక ముఖ్యముగా స్త్రీలకు తగియున్నది. గృహనిర్వాహకత్వము, శరీరారోగ్య శాస్త్రములు, ప్రథమచికిత్స, రోగపరిచర్య, చిత్రలేఖనము, కుట్టు, సంస్కృతము, టైపురైటింగు సంక్షిప్తలేఖనము, గర్ల్సుగైడు శిక్షణము, వీనితోఁబాటు ఆంగ్లభాష నిర్బంధముగ నేర్పఁబడుచున్నవి.

బాలికలు విశ్వవిద్యాలయ పరీక్షలన్నింటిలోనుకొందరు అత్యుత్తముగా కడతేఱుచున్నారు. తగిన అవకాశముల నిచ్చినచో బాలికలుగూడ బాలుర కెంతమాత్రము విద్యావిషయమున తీసిపోరను విషయము రూఢిపరచుచున్నారు. కళాశాల తరగతులకు ప్రత్యేక సౌకర్యములు చేయఁబడి తృప్తికరముగ నిర్వహింపఁబడుచున్నవి. ఈ సంవత్సరము ఇరువురు బాలికలు జీ. ఏ. (Graduate in arts) పరీక్షలో నుత్తీర్ణలై పట్టభద్రలైరి.

ప్రస్తుతము పాఠశాలలో చదువుచున్న బాలికల సంఖ్య 300లకు మించినది. జిల్లాల నుండి వచ్చు విద్యార్థినుల సౌకర్యార్థము పాఠశాలకు సమీపమున నొక వసతిగృహము గలదు; మరియొకదానిని స్థాపించు విషయ మాలోచనలో నున్నది.

పాఠశాల సమర్థమైన ఉపాధ్యాయవర్గముచే నిర్వహింపఁబడుచున్నది. బాలికాసంఘ పక్షమున ప్రతినెల వెలువడు "మాతృభారతి" అను లిఖితమాసపత్రిక మూలమున బాలికలలో వ్యాసరచనశక్తి, వక్తృత్వపటిమ వృద్ధిపొందు నవకాశములు కల్పింపఁబడినవి. తద్వారా బాలికలకు సాంఘిక విద్యావిషయములో పరిచయము కలిగి సంఘమునకు, దేశమునకు సేవజేయు నవకాశము లేర్పడుచున్నవి. ఆదర్శ గృహిణులను, మాతలను సిద్ధముచేసి సంఘమున కుపకరించునట్లు చేయుటయే యీ పాఠశాలోద్దేశము.

పాఠ్యవిషయములు మాతృభాషద్వార నేర్పుటయేగాక సారస్వతమున నొక భాగమగు "పద్యరచన" గూడ నేర్పబడుచున్నదను విషయము సహృదయమహాశయులకు తెలియపోదు. బాలికలు లలిత కళల నభ్యసించుట యవసరమను విషయము గ్రహించియే, గానము, చిత్రలేఖనము మొదలగు కళలతోఁబాటు కవిత్వముకూడ నేర్పఁబడుచున్నది. తత్ఫలితముగా కొన్ని చిన్న పొత్తములుగూడ బాలికలచే రచియింపఁబడినవి. భౌతికాధ్యాత్మిక, మానసిక వికాసమున కవకాశములు గల్పించినఁగాని విద్యావిధానము పూర్తిగాదను విషయము గుర్తించియే వీలున్నంతవరకు దేహపరిశ్రమకు గూడ తగిన యవకాశము కల్పింపఁబడినది. క్రొత్తభవనము పూర్తియయి సహృదయుల సహాయమున ఆర్థికస్థితి చక్కఁబడిన పిమ్మట ఆటలకు తగిన సదుపాయములన్నియు చేయ వీలగునని తలఁచుచున్నాము. నేడు భారతదేశమున కావశ్యకమని అందరు గుర్తించిన ఆధ్యాత్మిక విషయమందు శ్రద్ధతీసికొని ప్రత్యేకముగ భగవద్గీతనే బోధించుచు, గీతాజయంతికి పూర్వము పరీక్షచేసి విద్యార్థినులను ప్రోత్సహించుటకు ప్రథమము నచ్చినవారికి యేటేట బహుమానములిచ్చుచున్నాము. అంతియకాక అప్పటప్పటి యాధ్యాత్మిక సమావేశములు, పాఠశాలలో బాలికల సమిష్టి ప్రార్థనతోఁబాటు ఇండ్లదగ్గర నిత్యప్రార్థనలను ప్రోత్సహించుచున్నాము.

విద్యావిధానము యొక్క యాధునిక దృక్పథము ననుసరించి, పారిశ్రామికవిద్య గూడ బాలికాపాఠశాలలలోని విద్యావిధానముతోఁ జేర్చి బోధించుట యత్యవసరమనియు, నందువలన బాలికలు ముందు గృహిణులు, తల్లులు, నయినప్పుడు తమ విశ్రాంతిసమయము వ్యర్థపుచ్చక గృహోచిత పరికరములను వీలైనంతవరకు స్వయముగా చేసికొని కుటుంబము యొక్క ఆర్థికస్థితి నభివృద్ధి పరుప గల్గుదురనియు గుర్తించి, అట్టి పారిశ్రామికవిద్యను ఈ పాఠశాలలో ప్రవేశపెట్టుటకు సంకల్పించితిమి. కాని ప్రస్తుతము మాయార్థికస్థితి యింకను తృప్తికరము గాకపోవుటచే నీ సంకల్ప మాచరణయోగ్యముగాక యున్నది. ఉదారులగు ప్రజామహాశ

యు లీ యవసరమును గుర్తించి పూనుకొని తగినట్లు ధనసహాయము చేయుచో, దప్పక కొలదికాలములో, పారిశ్రామిక విద్యను గూడ ప్రవేశపెట్టఁ గల్గుదుము.

పాఠశాలా భవనమునకు గాను స్థలము కొనుటయేగాక భవన నిర్మాణముగూడ చురుకుగా సాగుచున్నది. దానికి సుమారు 35000 రూపాయిలగునని అంచనా వేయఁబడినది.

ఈ సంస్థ కేవలము ప్రజలిచ్చు చందాల పైననే యాధార పడియున్నది. కనుక దేశీయులందరును — ముఖ్యముగా ఆంధ్ర సోదర సోదరీమణుల ద్రవ్య సహాయ మెంతయో యవసరమైయున్నది. కావున నీ క్రింద చూపఁబడిన విధములలో నేదేని యొక విధమున ద్రవ్య సహాయమొసగ ప్రార్థన.

౧. నెల చందా.
౨. వార్షిక విరాళము.
౩. భూరి విరాళము.
౪. శాశ్వత నిధి.
౫. మందిర నిర్మాణ నిధి,
౬. మందిర నిర్మాణమునకయి ఒక రూపాయి చొప్పునచేయు వసూళ్లు.
౭. బీద విద్యార్థినుల సహాయ నిధి.
౮. బాలికలు వ్రాయు పుస్తకములు కరపత్రములు, అచ్చొత్తించుటకు ముద్రాపణనిధి.
౯. పాఠశాలకు వలయు వస్తుసామగ్రి, బోధనాపరికరములు మొ॥ వాని పెంపుదలకు.
౧౦. పాఠశాల గ్రంథాలయాభివృద్ధి.

ఇట్లు,

రాజాబహద్దరు వేంకటరామారెడ్డి,
ఒ. బి. ఇ.

అధ్యక్షులు.

బి. రామకృష్ణారావు,
బి. ఏ. ఎల్.ఎల్. బి

మా. హనుమంతరావు,
గౌరవ కార్యదర్శులు.

# దేశభక్త ధర్మవీర వామన. నాయిక్ గారి జీవితము

శ్రీమతి. దమయంతి (మెట్రిక్)

కీ. శే. వామననాయక్ గారు నిజాంరాష్ట్రములోని ముఖ్యాంధ్రస్థానమగు వనపర్తిలో ౨వ ఏప్రిల్ నెల ౧౮౭౮ లో జన్మించిరి. వీరు ఆ సంస్థానమున జాగీరుదారుగానుండి ఆ సంస్థానమునకు ఎక్కువ సేవలొనర్చిరి. వీరి చదువు కూడ అచటి తెలుఁగు వీధిబడిలో జరిగెను. కాని వీరు తెలుఁగు భాషయేగాక యింకను ఇతర భాషలయందు ప్రవీణులయిరి. మహారాష్ట్రము వీరి మాతృభాష, కన్నడము, ఉర్దూ, ఇంగ్లీషు భాషల నభ్యసించిరి. తరువాత వీరు హైద్రాబాదులోని నిజాం కాలేజిలో క్రమముగా ప్రవేశించి బి. ఏ. పరీక్షవఱకు చదివిరి. కాని కొన్ని ఇబ్బందులవల్ల వారు కళాశాల వదలుకొనిన తరువాత కొంతకాలమునకు ద్రవ్యసంబంధమైన యిక్కట్లచే వీరు బెంగుళూరుకు బోయి చాల వరకు శ్రమబడి, పి. డబ్లు. డి. కంట్రాక్టు పనులను చేసి విశేషధనమును సంపాదించిరి. అటు తరువాత వారు గౌళీగూడమున స్థిరనివాస మేర్పరచుకొనిరి. వీరు కొన్ని దినములకు ఆబ్కారి కంట్రాక్టుదారు పనిచేసిరి. ఇదంతయు వారి ద్రవ్యస్థితికి విశేషకారణమయినది. మఱియు వీరి కార్ఖానాలు నిజాం రాష్ట్రములో కామారెడ్డి, పర్భణి మొదలగు స్థలములందు ఏర్పడినవి. వీరు వర్తక వ్యాపారములతో సంబంధము ఏర్పరుచుకొనిరి. వీరి కీర్తి మన రాష్ట్రములోనే గాక హిందూదేశమునందు ప్రతిచోట వ్యాపించినది. వీరియందు ప్రోత్సాహక స్వభావము, దేశాభిమానము, మూర్తీభవించినవి.

వారికి విద్యావిషయములందున్న ఆసక్తికి ఎన్నియో నిదర్శనములు గలవు. కొన్ని సంవత్సరముల క్రిందట వీరిచే నెలకొల్పబడి ౨ లక్షల విలువగల గృహమును, ౧౦౦౦ విద్యార్థులు, విద్యార్థినులుగల వివేకవర్ధనీ పాఠశాల ప్రబల నిదర్శనములు. ఎవరికి ధనసహాయము కావలయునో వారికందరికి విద్యావిషయముల కొఱకు ధనము ధారపోయుచుండిరి. మన బాలికల ఉన్నత పాఠశాలకు వారు స్థాపకులు. నేటికిని పోషకులు. మన పాఠశాల మందిర నిర్మాణమునకై తమ ధర్మపత్ని శ్రీమతి ముక్తాబాయిగారి పేర నొక గది కట్టించుటకై వేయి రూప్యముల

నిచ్చిరి. వారికి ౭౦ ఏండ్లు పూర్తి అయినపుడు వివిధ ధర్మములకు ౭౦ వేల రూపాయలు దాన మిచ్చిరి. హిందూ సాంఘిక నిర్మాణమునకు వారు విరాళముల నిచ్చుచుండిరి. ప్రజా విద్యా మహాసభను స్థాపించి సమావేశపరచి, రెండవ ఆహ్వానసంఘాధ్యక్షులుగా ఉండి యెక్కువ శ్రమబడి దాని విజయమునకు కారకులైరి.

నిజాంరాష్ట్రి సంఘ సంస్కారము మొదలుబెట్టి నేటికి ౨౩ సంవత్సరములకు ముందే స్థాపించియుండిరి. సంఘ సంస్కారసభకు వీరిని అధ్యక్షులుగా నియమించిరి. ఈసభ పర్భనిలో కూడ సమావేశమై యున్నది. ఇంక నిమ్నజాతుల పాఠశాలకు తోడ్పడుటయే గాక వారి నాయకుడుగ గూడ శ్రమబడుచుండెను. సనాతన ధర్మసభకు అధ్యక్షులుగానుండినను నిమ్నజాతులకు ధనముతో సహాయముచేసెను. కొన్ని దినముల తరువాత వీరు చేసినటువంటి కార్యములను నిర్వహించుటకు ఒక స్కీము వారి దృష్టియందుండెను.

వీరు కాంగ్రెసునకు అధ్యక్షులుగా ఎన్నియో సంవత్సరములనుండి యుండిరి. వీరు కాంగ్రెసు సంఘమున సభ్యులుగా ఎన్నుకొనబడిపని జేసిరి. వీరు స్టేటురిఫారమునకు కూడ అధ్యక్షులుగా నుండిరి. వీరు ఎన్నికష్టము లుండినప్పటికి ప్రతి సంవత్సరము అఖిలభారత కాంగ్రెసు మహాసభకు వెళ్లుచుండిరి. అకోలా రాజకీయసభకు పనిచేయలేదు గాని, వీరప్పుడప్పుడు సహాయపడుచుండిరి. సర్వెంటు ఆఫ్ ఇండియా సొసైటీవంటి సంఘమును ఇచ్చట స్థాపించవలయునని వారు కోరుచుండిరి. మన దేశమున వెనకబడియున్న రాజకీయ పరిజ్ఞానము హెచ్చుచేయ వలయునని వారి యభిప్రాయము.

కడచిన సంవత్సరమే వారికి ఈ శాసనసభాసభ్యత్వము లభించినది. ఈ పురపాలక సంఘములోనుగూడ వీరు చాల కాలమునుండి సభ్యులుగానుండి సంఘమునకు కావలసిన సేవ యొనర్చుచుండిరి. కొన్ని దినముల క్రిందట వీరు ఉపాధ్యక్షులుగా ఈ పై సంఘమునకు గావింపబడిరి. వీరు ప్రజలయందు అమిత ప్రేమ జూపు ఇదినిదర్శనము.

వీరు మాతృభాషనుబట్టి మహారాష్ట్రులయినను వీరికి ప్రజలందరియందును సమానమైన ప్రేమయుండెను. ప్రజలు ఇతర దేశములనుండి గాని కాంగ్రెసునుండి వచ్చినగాని, బ్రిటిషు వారి పక్షమునుండి విద్యార్థులు వచ్చినను వీరి "ముక్తాశ్రమము" వారికి నిరభ్యంతరముగా ఉండుటకు ఇచ్చుచుండిరి. సహధర్మచారిణి నామమును సార్థకపరచుకొను ముక్తాబాయిగారు స్వయముగా వడ్డనలో పాల్గొనెను. వీరిఎడల గర్వమనుమాటయేలేదు. పేదలందరికిని వీరుదయమునుండి సాయంకాలము వఱకు ఎన్నియో మార్గములలో సహాయము చేయుచుండిరి.

నగరములో అంధ్రిభాషానిలయమను గ్రంథాలయమునకు వీరు రాజపోషకులు. ఆ మందిరమునకు కొంత ద్రవ్యము నిచ్చిరి. సమయము వచ్చినప్పుడెల్ల వీరు ఆ మందిరమునకు ధనము నిచ్చుచుండిరి. ఈ నిలయమున వారి పటము గూడ చాల కాలము క్రిందటినుండి స్థాపింపబడి యున్నది. వీరు ఆంధ్ర గ్రంథాలయో

త్సవము సూర్యాపేటలో జరిగిన దానికి బొంబాయి సమీపమున నగరమార్గమున మోటారులో వెళ్లి అధ్యక్షత వహించిరి. ౨౦ సంవత్సరపు ఉత్సవ సందర్భమున ధనమిచ్చిన దానిలో ఆంధ్ర సంస్థలు పెక్కుగలవు. వీరు వీధిబడుల నెక్కువ ప్రోత్సహించి క్రమపద్ధతిలో నుంచుటకై ౨౦౦ రూప్యములు గ్రాంటు చేయించిరి. ఇట్లు ఈబడి క్రమపద్ధతిలో వచ్చినందువలన విద్యార్థులకు విద్య బాగుగా నలవడినది. వీరికి ఆంధ్ర నిలయములపై చాలప్రీతి. ఆంధ్ర భాషయందు గూడ మిక్కిలి ప్రీతి. వీరు ప్రతి దినము పండితులను ఇంటబెట్టుకొని ఆంధ్రభాషలో మాట్లాడుచుండెడివారు. ఆంధ్ర మహాసభకు దేవరకొండ, జోగీపేట మొదలగు దూర ప్రదేశములకు గూడ వెళ్లి సభలో పాల్గొనినారు. ఆంధ్రులకందరికిని వీరిపై ఎక్కువప్రీతి. వీరు ఆంధ్ర దేశమునందు భేదములేక సేవయొనర్చి కీర్తిగడించిరి. అట్టి ఉదాత్త ప్రోత్సాహకుని గోల్పోవుట దేశమునకు దుఃఖదాయకమగు విషయము. వారు శరీరమునందు బాగులేక పోవుటముచేత బేగంపేటలో నుండుట తటస్థించినది. వారిని చూచుటకు పోయిన, వారికి తొందర కలుగునని డాక్టర్లు నిషేధించుటచేత చిరకాల ప్రియమిత్రులను చూచుటకు అవకాశము దొరకలేదు. అది విచారకరమైన సంగతి. ౧౯౩౬ నవంబరు సోమవారమునాడు ఆకస్మికముగ ౯ గంటలకు వా రసువులఁ బాసిరి. ఇట్టి మహానుభావులు మృతజీవులు—చచ్చినను బ్రతికినవారు. వీరు ఆంధ్ర దేశమునకును, ఆంధ్ర భాషకు చేసిన సేవ కొనియాడదగినది. ఈ ధన్య జీవుని యాత్మకు శాంతి నొసంగుచు, నాంధ్రమాత యిట్టి పుత్రరత్నముల పలువురఁగాంచఁ గల్గునటులఁ జేయుఁగాతయని సర్వేశ్వరునిఁ బ్రార్థించుచున్నాను.



# సాధుసుందర్ సింగ్ చరిత్ర

శ్రీమతి. యం. మెర్సి, ఐదవ ఫారము

సాధుసుందర్ సింగ్ పంజాబు దేశమున జన్మించెను. ఇతని జన్మభూమి హిమాలయ పర్వతములకు, మిక్కిలి సమీపమున నున్నది. ఇతని తలి దండ్రులు గొప్ప ఆస్తిపరులు. ఇతని తల్లి ఇతనిని చిన్నప్పటినుండియు దైవభక్తితో పెంచుచుండెను. ఇతడు సిక్ వంశస్థుడు. క్రైస్తవ బడియందు సాధుసుందర్ సింగ్ విద్య నభ్యసించెను. ఇతడు క్రైస్తవ బడియందు విద్య నభ్యసించుకాలమున, తన మతమే అన్ని మతములకంటె శ్రేష్ఠమైనదని వాదించు చుండెడివాడు. ఆ కాలమున ఇతడు క్రైస్తవులజూచి మండిపడెడివాడు. కొంత కాలమునకు తల్లి చనిపోయెను. తల్లి మరణానంతరము, ఇతడు నిజమైన దేవుని కనుగొన వలెనని నిశ్చయించుకొనెను. ఈ విధముగా నిశ్చయించుకొని అన్ని మత గ్రంథములను పఠించుటకు ఆరంభించెను.

ప్రతి రోజు అన్ని గ్రంథములను చదువుచు తన కాలము గడపుచుండెను.

ఇటుల కొంత కాలము జరిగిన పిదప ఒక రోజున తనకు నిజమైన దేవుడు తెలియకున్నచో తనకు తాను హత్యచేసికొనియెదనని నిశ్చయించుకొనెను. ఇట్లు మిక్కిలి దుఃఖముతో ప్రార్థన చేయుచుండగా ఆ గదిలో ఒక వెలుగును గాంచెను. కొంతసేపైన పిమ్మట వెలుగులో బాటు ఒక ధ్వని వినవచ్చెను. అది ఏమనగా "నేనే నిజమగు దేవుడనగు ఏసుక్రీస్తును. నీ వెంత కాలమిట్లుండెదవు?" అని వినంబడెను. తక్షణమే తన తండ్రి యొద్దకరిగి, తాను నిజమైన దేవుని కనుగొనెదననియు, తాను క్రైస్తవమత మవలంబించెదననియు, పలికెను. ఇతని తండ్రి ఇతని మాటలు నమ్మలేదు. తుట్టతుదకు ఇతని మాటల బట్టియు, చేష్టలబట్టియు, అతని కుమారుడు క్రైస్తవ మతమును స్వీకరించుననియు నమ్మెను.

సాధుసుందర్ సింగ్ కడుదుఃఖముతో ఈ వృత్తాంతము చెప్పెను. ఇతని పినతండ్రి తన యింటికి తీసికొనిపోయి, నీవు క్రైస్తవుడవు కాకున్నచో ఈ ధన మంతయు నీకిచ్చివేసెదను, అని పలికెను. సాధుసుందర్ సింగ్ ఒప్పుకొనలేదు. అటుపిమ్మట అతని తండ్రి అతనికి అన్నములో విషము పెట్టెను. అయినను సుందర్ సింగ్ వినలేదు. ఇంటినుండి వెళ్లఁగొట్టెను. అనేక బాధలు పెట్టెను. అయినను ఇతడు తన పట్టు విడువలేదు. ఇతడు కేవలము దైవభక్తుడు.

ఒకప్పు డితడు టిబెట్ కు వెళ్లి క్రైస్తవ మతము బోధచేయుచుండగా అక్కడివారు అతనిని పెక్కు విధముల హింసించిరి. బహు క్రూర

మృగ బాధలు పెట్టిరి. చివరకు ఇతనిని ఒక పెద్ద రాయిమీద పడద్రోసిరి. ఆ పెద్ద రాతి క్రింద ఒక పెద్ద పాముండెను. ఇతను అక్కడ పడినను నెఱవలేదు. ఇతడు ఆ పామును అవలీలగా చంపి వేసెను. అపుడు ప్రజలందరు దీనిని జూచి ఆశ్చర్య పడి ఇతనిని క్షమార్పణ వేడిరి. ఇతని కాళ్లపై బడి ఇతడవలంబించిన మతమునే వారుకూడ నవలంబించిరి.

ఒకప్పు డీతడు ఒక గ్రామమునకు పోవు చుండగా, మార్గమధ్యమున కొంతమంది దొంగ లు పట్టుకొని ఇతని శాలువ తీసికొనిరి. అప్పుడు సుందర్ సింగ్ తన యొద్ద శ్రేష్ఠమయిన శాలువ ఉన్నదనియు, వారు తీసికొనినది మిగుల అల్ప మయినదనియు చెప్పెను. వారు తిరిగి సమీ పించి నీయొద్ద ఏమున్నదో చూపుమనిరి. అప్పు డీతడు బైబిల్ గ్రంథము చూపించెను. ఈ దొం గలు మిగుల భయపడి, ఇతని మతమవలంబించి, వారి దొంగవృత్తిని విడిచిరి. ఈ రోజులలో మిక్కిలి భక్తుడీతడు. ఇతడు మిగుల ధనవంతుడై నను సామాన్యములగు దుస్తుల ధరించుచుండెను. అతిశీతల దేశమునకు పోయినప్పటికిని, కాళ్లకు చెప్పులువేక, తన స్వదేశి దుస్తులను ధరించుచుం డెను. మరియొకప్పుడు టిబెట్ రాజు ఇతనిపై ఆగ్రహముచెంది, ఇతనిని ఒక గోతిలో వేయించి మూడు రాత్రిలు మూడు పగలు ఆ గోతియం దుంచెను. ఆ గోతియందుంచినను మృతినొందక దేవుని ధ్యానించుచుండెను. అప్పు డీతడు దేవుని దయవల్ల బయటికి వచ్చెను. అప్పు డందరు ఆశ్చ ర్యపడిరి. అచ్చటి వారందరు క్రైస్తవ మత మవ లంబించిరి.

ఒక ఊరిలో ఇద్దరు అన్నదమ్ములుండిరి. వీరిద్దరు బిచ్చగాండ్రు. తమ్ముడు, అన్నను చని పోయినవానివలె పరుండబెట్టి దారిలో పోవు వారికి, చనిపోయెనని, శవము ఎత్తుటకు పైకము లేదని అందరిని భిక్షమడుగు చుండెను. ఒక దిన ము సాధు సుందర్ సింగ్ ఆ త్రోవ పోవుచుండ గా ఆ భిక్షుగాడు యథాప్రకారముగ ఇతనిని గూడ భిక్ష మడిగెను. ఇతడు తనవద్ద ఏమియు లేదని పలికెను. అయినను అతడు, తనవద్ద నున్న శాలువ ఈయమని అడిగెను. అంతట ఇతడు తన శాలువ ఇచ్చెను. అంతట అతడు ఆ శాలువను తీసికొని అన్నకు చూపుటకు పోవునంతలో అత డు నిజముగానే చనిపోయియుండెను. తిరిగి ఇతడు సాధుసుందర్ సింగ్ వద్దకు వచ్చి తాను అబద్ధము పలికెననియు తన అన్నకు ప్రాణ మిమ్మనియు అడిగెను.

అపుడు సాధుసుందర్ సింగ్ మఱల అత నిని, తన ఇంటికి వెళ్లుమని చెప్పెను. అతడు వెళ్లునంతలో అన్న మఱల జీవించి యుండెను. అన్ని విధముల ఇన్ని కష్టము లనుభవించినను తన భక్తిని మఱవక తన మతము నుద్ధరించెను. ఇతని వలెనే మనముకూడ దైవ భక్తి నేర్చు కొని ప్రఖ్యాతి గాంచవలెను. సాధుసుందర్ సింగ్ చాల మహనీయుడు.



# శుక్రవారము

శ్రీమతి జి. సీతారత్నము (మెట్రికు)

అన్న:- ఉషా! రేపు సెలవుకదా?

ఉషా:- అవును శుక్రవారముకూడ కలసి వచ్చినది. అక్క శుక్రవారము మాఊళ్లో పెద్ద పండుగవలె నుండునని చెప్పెడిది.

అన్న:- అలాగైన వచ్చెదవా?

ఉషా:- వచ్చెదను గాని అమ్మ వద్దన టుందేమొ మాటిమాటి కెందుకని?

అన్న:- చెప్పు. "మామాస్టరుగారు కవిత్వము చెప్పుచున్నారు. మనకు ఇక్కడ పచ్చికబయల్లు ఏమిలేవు, అక్కడయినను బాగుగా చూడవచ్చు" నని ఎందుకు వద్దనును?

ఉష:- సరే! ఆలాగైతే అమ్మనడిగి వచ్చెదను. (ఉష అమ్మదగ్గరకు పరుగెత్తును)

అమ్మా! రేపు సెలవు అక్కదగ్గరకు వెళ్లెదను.

అమ్మ:- సరే!

అది యంతపల్లెటూరుగాదు. పట్టణము కాదు. చుట్టుపట్లను పచ్చని పైరులతోను పచ్చని కొలనుతోను నాలుగైదిండ్లు శుభముగ కళకళ లాడు చున్నవి.

ఉష, ఆమె అన్న జనార్దనము, కలసి అక్కగారింటికి వెళ్లిరి. ఒకరి నొకరు క్షేమసమాచారములు మాట్లాడుకొని సంతోషించిరి. మధ్యాహ్నము భోజనములైన తరువాత ఉష, ఆమె అక్క వసంత, ఇట్లు సంభాషించుకొనిరి.

వసంత:- ఉషా! మొన్న మీబడిలో ఏమొ నాటకము వేసితిరట. ఏమి నాటకము?

ఉష:- నీ కదృష్టములేదు చూచుటకు, ప్రహ్లాద నాటకము వేసినాము.

వసంత:- బాగున్నదా?

ఉష:- చాల బాగున్నది. మాకందరికి బహుమతులుకూడ నిచ్చినారు; కాని మరచి పోయినాను! ఎన్నడో తిన్నని పాపటలోనికి దిగినావు?

వసంత:- ఏమిచేయను? చిన్నదానవు నీవు తిన్నపాపట తీయుచుండ పెద్దదానను నేను ప్రక్కగ తీసిన నవ్వుదురని తిన్నగానే తీయుచున్నాను.

(సంధ్యపని చేయునది వచ్చెనని వసంత వెడలి పోయినది)

ఇంతలో సాయంకాలమైనది. ఉష తాను సరిగా ఆరు గంటలకు ప్రార్థన చేసికొనుసని వసంత తెలిసికొని ఆమెకు తగిన స్థలము చూపెను. ఉష సరిగా అరగంటసేపు ప్రార్థన చేసికొని భోజనము చేసి పండుకొను సమయమం దు ఆత్మపరీక్ష చేసికొని భగవద్గీత శ్లోకములను పారాయణ చేయుచు నిద్రించినది.

మరునాడు, అనఁగా శుక్రవారమునాఁడు ఉష యథాప్రకారముగానే నాలుగున్నర గంట లకు లేచి బయటకు రాగా వసంత అంతకు పూర్వమే లేచి వాకిలి శుభ్రముచేసి ముగ్గులు పెట్టుచుండెను.

ఉష:- అక్కా! ఇంతపెందల కడలేచితి వెందులకు ?

వసంత.- ఉషా! నేఁడు శుక్రవారముకదా! లక్ష్మిపూజ చేయు సమయమున కంతపని తీర్చు కొననలయును. పట్టణవాసులైకూడ నింతమా త్రము తెలియదా!

ఉష:- నేనెప్పుడు చూడలేదు, ఏమి చేయుదురో ఈవేళ చూచెదగాక (అని ప్రార్థన చేసికొనుటకు సమయమైనదని వెడలి స్నానము చేసి ప్రార్థనకై వెళ్లెను.)

ఏడు గంటలకు బయటవచ్చి చూడఁగా అందటి యిండ్లు వాకిళ్లును రంగవల్లీశృంగారము తో నింపియుంచిరి. ఉష ప్రక్కయింటిలోనివా రేమి చేయుచున్నారో యని తొంగిచూడఁగా నచ్చట నలుగురైదుగురు ముత్తైదువులు తలంటి నీళ్లు పోసికొని చేతులలో నేదో పట్టుకొని ఏదో వినువారివలె కూర్చునియుండుటఁ గాంచి ఉష వారిదగ్గరకు పరుగెత్తుకొనిపోయి వారి చేతులలో నుండునవి అక్షతలని కనుగొని వారేమి చెయు దురో చూతమని యుండెను. అంత నొక పెద్ద ముత్తైదువు ఇట్లని ఒక కథ మొదలుపెట్టెను.

సోదరీమణులారా! స్త్రీయయి జన్మించిన తరువాత తన జన్మమును సార్థక పరచుకొనవల యును. అందులకు భక్తి యొకటి యుండవలయును మన హిందూ స్త్రీలకు లక్ష్మిపూజ చాల పూజ నీయమైనది. మనము ప్రతి శుక్రవారము మన యిండ్లను వాకిళ్లను శుభ్రపరచుకొని, ఆ నాఁడు భక్తిపూర్వకముగ లక్ష్మిదేవిని పూజించితిమేని మనకు ముక్తి లభించును. పూర్వము మనవలెనే గాక ఇంక భక్తితో లక్ష్మి పూజ సలిపిన ఒక ఆమెకు లక్ష్మిదేవి ప్రత్యక్ష మయ్యెనఁట! ఆ కథ మీకు చెప్పెదను. శ్రద్ధతో ఆలకింపుడు.

పూర్వ మొక్కనాఁడు లక్ష్మి దేవి ఏ యూరు ఎటులున్నదో, ఏ పల్లె ఎటులున్నదో యని చూచుటకై శుక్రవారము బయలు దేరిన దఁట ఒక యింటికి రాఁగా ఆ యింటి భాగ్య శాలిని ప్రొద్దెక్కువచ్చియిండ్లు వాకిండ్లు అటులనే పెట్టు కొని ప్రాతబట్టలు కట్టుకొను చుండెనఁట.

ఆ లక్ష్మిదేవి చూచి విచారపడి రెండవ యింటికి పోగా రెండవ యింటి ఇల్లాలు కూడ అటులనే ప్రొద్దెక్కించి పోకిరి చలిది అన్నము తిను చుండెనట. ఇట్లు వరుసగా చాలమంది ఇండ్లకు పోగా వారును అట్లే యుండిరఁట. చివరకు ఒక పేదరాలి యింటికిపోగా ఆమె ప్రొద్దునలేచి ఇం

ళ్లు వాకిళ్లు శుభ్రి పఱచుకొని, తలంటి నీళ్లు పోసికొని భర్త, కొడుకు, యీయ వారమునకు పోయివచ్చువరకు వండుటకు గిద్దెడు గింజలు లేవు కదా లక్ష్మిపూజ చేసికొనుటకు అని కూర్చుండి ప్రత్తి విప్పుకొనుచుండెను. అంతట లక్ష్మిదేవి రెండు ద్వారములు పట్టుకొని చూడఁగా ఆపేద రాలు ఇంటిలోనికి పిలిచి ఆమెకు ఒక పీటవేసి కూర్చుండఁబెట్టి ఆమాట యీమాట మాట్లాడిన తరువాత లక్ష్మి దేవి. "అమ్మా నేను వెళ్లెద ననఁగా "అయ్యో! ఏమమ్మా! ఈ దినము నకుండి మాయింట భోజనముచేసి పొమ్మనఁగా ఆమె సరేనని యుండెను. ఆమె ప్రొద్దుపోయి: పొంగడములు భోజనము చేయుదుననగా సరే గాని, అమ్మా ఇంటనేమియు లేవు. ఏమి చేయు మందువు అని పేదరాలు అడుగ, లక్ష్మి దేవి బజారునకు పోయి మా యింటికి లక్ష్మి వచ్చిన దని చెప్పుమనగా పేదరాలు సరేయని బజారు నకు పోయి అన్ని వస్తువులు తెచ్చి వంటచేసి ఆమెకు పెట్టి కొడుకు భర్త వచ్చువరకు నుండి వారు వచ్చిన తరువాత వారికిఁ బెట్టి తాను భుజించెను.

రాత్రి యాయెను. ఆమెకు ప్రక్కవేసి పండుకొనఁబెట్టి కాళ్లొత్తుచు కూర్చొనఁగా, లక్ష్మిదేవి తెల్లవారు సమయమునకు అంతర్ధానమయ్యెను. తెల్లవారి చూచునరికి గుడిసె బ పెద్ద బంగళాగాను ఏమూల చూచినను ఆమూల నవరత్నపు రాసులుగ నుండెనఁట. అప్పటి నుండియు ఆమె పూర్వముకన్న ఎక్కుడు భక్తితో లక్ష్మిపూజ చేయుచుండెనట, అని ఆమె చెప్పి ఆ యక్షతలు వేసికొని యిండ్లకు పోయి.

ఉష. ఈ కథను జ్ఞాపకమునందుంచుకొని యింటికి వచ్చి తన స్నేహితులందఱికి తెలియ జేయుటకు మాతృభారతికి ఇచ్చెను. సోదరీమణు లారా! చూచితిరిగదా లక్ష్మిపూజా మాహాత్మ్యము."





# శాపాగ్ని

శ్రీమతి. వ. జయలక్ష్మి (నాల్గవఫారము)

గీ॥ తొల్లిగౌరవనీయమై । యెల్లదేశ
ములఁ బతివ్రతకును మరి । మునిజనాళి
కెల్లరకు ననుకూలమై । యెసఁగుచుండు
శాపమేయతితీక్ష్ణమై సాగుచుండె ॥

గీ॥ భూపతులదండనంబుల । పొలియజేయు
భరత ఖండంబు నందున । ప్రథిత కీర్తి
గాంచి భారత భూమిని । కాంతలెల్ల
శాప సత్త్వలు నైరిగా । సాధ్వు లగుచు ॥

గీ॥ పూర్వకాలమునందు న । పూతమైన
గ్రామ మందున నొక తన్వి । కాలినైన
ఎత్తి ఇడుట యెరుంగని । యింతి మగుల
గత హృదయ యనఁ బయనంబు । గడుపు చుండె ॥

ఆ॥ వె॥ అట్టి గ్రామమందు నర్ధరాత్రింబున
శిరమునందు భర్తఁ । జేర్చికొనియు
వెడలు చుండ నతని వ్రేలు తాఁకిన యంత
నొక మహర్షి క్రోధి యోర్వలేమి ॥

గీ॥ బాల భాస్కరుఁడుదయింప । బలములేక
బుట్టలో నుండు నీ భర్త పొక్కిపోవు
గాక యని తూలనాడగా । కాంత యంత
కోప ముజ్జగింపు మనుచు । కోరుకొనియె ॥

గీ॥ ఆగ్రహావేశ మంతట । నరిది గాక
యుండి నంతనే తన్వంగి । యోర్చు కొనక
" భాస్కరుండుదయింపక । పఱగుగాత "
యనుచు శపియించె నంతఁ దా । నాగ్రహించి ॥

గీ॥ ప్రక్కగా నుండు గ్రామపు । ప్రజలు నృపతి
తోడ మొరపెట్టుకొనుచుండ । తొందరగను
బ్రాహ్మణుల గూడి తెలిసి తా । వారిగూడి
గ్రామ మందున కరుదెంచెఁ । గనుగొనగను ॥

ఆ॥ వె॥ సాధ్విసుమతి-గాంచి, స్వాగతంబిచ్చియా ।
భూరమణుఁడు మిగుల బుద్ధి గలిగి
మాని క్రోధ మడచి మాయించె శాపంబు
నంత సుమతి యాగ్రహంబు వదలి ॥

గీ॥ సూర్యుఁ బ్రార్థింప నతడును । శుద్ధమైన
శీల మొప్పెడి యాతన్వి । జేరి యనిమె
" మీర లిరువురు ధారుణి । మిగుల ప్రేమ
గల్గి వర్ధిల్ల యశమును । గాంతు గ్రాత ॥

కం॥ సురులును మునులును బొగడగ ।
సురుచిర వాద్యములు మ్రోయ సొంపుగ సుమతిన్ ।
సరసముగఁ గౌశికుని గొని ।
పురమును జేర్పంగ జనెను భూపాలుఁడు దాన్ ॥

గీ॥ భాస్కరానుగ్రహంబున । ప్రథిత కీర్తి
గాంచి ప్రేమానురాగముల్ । కాంతి మీర
పొంగి పొరలుచునుండ ప్రఫుల్లమై ప్ర
హృష్టి సాగరంబున నతి । హృష్టులగుచు ॥

ఆ॥ గీ॥ సుమతి కౌశికులను సొంపుగ నాదర్శ
ప్రాయులు గను జేసి । పరగు చుండ్రి
గాత భరత భూమి కాంత లెల్లరు గూడ
వినయ భూషలగుచు వేడ్కమీర ॥





శ్రీ రాజా తడకమళ్ల సీతారామచంద్రరావుగారు

(బేతవోలు సంస్థానాధీశులు.)



శ్రీయుత అంత్రు రామచంద్రరావుగారు



శ్రీమతి. రూపాబాయిగారు.



శ్రీ. ఆచార్య ఇల్లిందల సీతారామరావుగారు.

ఎం. ఎస్సీ.

(ఉస్మానియా కళాశాల).

# గ్రంథాలయ నిర్వహణము

శ్రీయుత. ఇ. సీతారామరావుగారు (బి. ఏ, ఎం, ఎస్సి.)

గ్రంథాలయముల యభివృద్ధి, వాని సక్రమ నిర్వహణముపైననే, యాధారపడి యున్నది. పాశ్చాత్య దేశములలో, గ్రంథాలయనిర్వహణ మొక ప్రత్యేక విద్యగాఁ బరిగణింపఁబడుచున్నది. ఈ విద్యయందు బరిశ్రమ మొనర్చి యారితేరిన వారుతప్ప నితరులు గ్రంథాలయాధికారులుగ నియమింపఁబడరు. ఏలయన, గ్రంథాలయములను జనోపయోగకరములుగ నొనర్చుటయు, ప్రజల దృష్టిని వానివైపున కెక్కువగ మఱల్చుటయు, వాని నిర్వాహకుల కర్తవ్యము.

మన దేశమున గ్రంథాలయములు చాల చిన్నవి. వానిలోని గ్రంథముల సంఖ్యయుఁ దక్కువ. ఆయున్నవాని యుపయోగమైనను, ప్రజలు సరిగా నెఱుంగకున్నారు. వానికి ప్రభుత్వమువారి వలనఁగాని సంస్థలవలనఁగాని, ప్రజల వలననైనఁగాని, సరియైన పోషణము లభింపకున్నవి. ఈ కారణములవలన, గ్రంథాలయోద్దేశ్యములలో ముఖ్యములగు విద్యావ్యాపనము, విజ్ఞానిక ప్రచారము, సారస్వత జీవితాభిలాష సామాజికార్థిక నైతిక సంస్కరణములు దగినంత గలుగకున్నవి.

గ్రంథాలయ నిర్వాహకులును, పాఠకులును, గమనింపవలసిన కొన్ని ముఖ్య సూత్రముల నీ వ్యాసమున వివరించుచున్నాను. ఈ సూత్రములు స్థూలదృష్టికి సాధారణములని తోచినను, గ్రంథాలయ నిర్వహణమున కవసరములగు విషయములన్నియు వీని యందంతర్భూతములై యున్నవని సూక్ష్మముగ నాలోచించినచోఁ దెలియకపోదు.

### 1. పుస్తకము లుపయోగముకొఱకే.
### (Books are for use)

గ్రంథములను భద్రపరచి యుంచుట వాని నుపయోగించుటకొఱకే. పూర్వకాలమున ముద్రణాలయములు లేనందున, నొక్కొక పుస్తకము స్థిరమగుటకు మిక్కిలి వ్యయప్రయాసలు గలుగుచుండెడివి. అందువలన, వానిని భద్రపరచు విషయమున నెక్కువ శ్రద్ధవహింపఁబడుచుండెడిది. "పుస్తకం వనితా విత్తం పరహస్తం గతంగత" మ్మను సామెత యట్టి పరిస్థితులలోనే యేర్పడియుండును. కొన్ని దేశములలో, పుస్తకముల నినుప సంకెళ్లతో బంధించియుంచి, ఆ బంధించిన చోటున మాత్రము వానిఁ జదువనిచ్చు

నాచారముండెను. ఇపుడన్ననో ముద్రాలయ సౌకర్యముల వలన నట్టి భీతిలేదు. గ్రంథములను జాగ్రతగ భద్రపఱచి యుంచుటకన్న వాని యుపయోగ మితరులకుఁ గలిగించు విషయ మత్యవసరమైనది. ఆధునిక గ్రంథాలయ నిర్వాహకునకు, పొత్తముల బీరువాలు వట్టిపోయి యుండినపుడే నిజమగు సంతసము గలుగును, కాని పేటికలయందు గ్రంథతతులు మూల్గుచుండుట వలనఁ గాదు.

పుస్తకముల వలనఁ బ్రజలకు సంపూర్ణ ప్రయోజన ముండవలయుననిన-చో పుస్తకాలయము లందఱకు నందుబాటగు స్థలములందుండవలయును. ప్రజలుగుంపులుగుంపులుగా గుమికూడుచుండు స్థలములగు నుద్యానవనములు, కార్యస్థానములు వ్యాపార కేంద్రములు, నిందులకు దగినవి. పాఠశాలలందును, కళాశాలలందును, వానిలోని యత్యుత్తమ భవనభాగము లందుకొఱకై ప్రత్యేకింపఁ బడవలయును.

గ్రంథాలయములను తెఱచియుంచు కాలములు సర్వజనులకు (విచ్ఛిన్న వృత్తులు గలవారికి) సరిపోవునట్టుగ నుండుట యవసరము. శుక్రవారము లాదివారములనక పౌర్ణమాస్యమావాస్యలను లెక్కగొనక ప్రతిదినమును,— ముఖ్యముగ సెలవు దినములందును — ఎల్లసమయములందును గ్రంథాలయము తెఱచియుండునట్లు చూడవలయును; ఇది యాదర్శమగు పద్ధతి, పాశ్చాత్య గ్రంథాలయాధిపతు లీ సూత్రము ననుసరించుటకై తమ పుస్తకముల, నుదయమునుండి రాత్రి పదిజలు విశ్రమించు వఱకును తెఱచి యుంచెదరు. కొన్నిటియందు విద్యార్థులకుఁ బ్రత్యేకపు తాళపుచెవు లొసగబడి యిష్టము వచ్చినవుడు వారు పుస్తక నిలయములకు వెళ్ళజాలుట కవకాశములున్నవి. మదరాసు విశ్వకళా పరిషద్గ్రంథాలయముగూడ సంవత్సరమునందలి మున్నూట యరువదియైదు దినములు నుదయ మేడుగంటలనుండి రాత్రి ఎనిమిది గంటలవఱకును అవిచ్ఛిన్నముగాఁ దెఱచి యుంచబడుచున్నది.

ఈ సూత్రమునకు వ్యతిరేకముగ మన దేశమునందలి గ్రంథాలయము లనేకములు సాయంతనమే యొకటి రెండు గంటల కాలమువఱకో తెఱచి యుండును. సెలవులై పాఠకులకుఁ దీరిక కలుగు దినములలో నవియు మూయఁబడుచున్నవి.

గ్రంథాలయములం దుపయోగింపఁబడు బీరువాలు మనుష్యుని యెత్తును మించినవిగ నుండరాదు. కానిచోఁ, బాఠకులు పుస్తకములను స్వయముగఁ బరిశీలించుట కవకాశముండదు. బాలుర ప్రత్యేకోపయోగమునకై నెలకొల్పఁబడు గ్రంథనిలయోపకరణములందుకుఁ దగినవిగానే యుండవలయును. కుర్చీలు బల్లలు మున్నగునవి, పాఠకులకుఁ గష్టము గలిగించునవిగనో, వారికి నిద్రదెచ్చునవిగనో యుండక తగుపాటి సౌకర్యములను గలిగియుండ వలెను.

గ్రంథపాలకులు, విద్వాంసులును, సర్వవిషయముల నెఱిగిన వారుగను, సత్స్వభావులుగను,

పుణులుగ నుండవలయును. వారు పాఠకుల జంకను బోగొట్టి, వారికవసరమగు పుస్తక విషయక పరిజ్ఞానమును దెలుపఁ జాలినవారుగా నుండ వలయును.

2. పుస్తకములు సర్వజనోపయుక్తములు.

Books for all

పూర్వకాలమున బుస్తకములేకొందఱికే యందుబాటున నుండెను. ఇప్పుడవి ప్రతివానికిని లభించునటు లుండవలెను; వారివారి యభిరుచుల నవసరముల ననుసరించిన పుస్తకములన్నియు గ్రంథాలయములందు లభింపవలయును; పాఠకుల వృత్తులును, వారి మనోవృత్తులును గ్రంథాలయాధికారి దృష్టిపథమునం దుండవలయును. విజ్ఞానమునకును భాషాపరిజ్ఞానమునకును విషయమును బోధించుటకును వినోదము నొసంగుటకును, సాహాయ్యకరములగు గ్రంథజాలమును సమకూర్పవలయును. ధనవంతులకును, నిరుపేదలకును గ్రంథము లందుబాటులో నుండవలయును.

పురుషులకు వలెనే స్త్రీలును, విద్యనేర్చుటకును, బుస్తకములను బఠించుటకు నర్హులు. సారస్వత, వైజ్ఞానిక, పారిశ్రామిక జీవితపు ప్రణాళికలలో దేనినైనను, తమ తమ యిష్టమున కనుగుణముగా స్త్రీలు గ్రహింపవచ్చును. ఇంతియకాక, గృహనిర్మాణ మొక కళయు విజ్ఞానమునైయున్నది. శిశు పోషణము, ప్రాథమిక చికిత్స, కుట్టుపని, ఆరోగ్య శాస్త్రము గృహాలంకరణము, తత్సంస్కరణము మున్నగువానికొరకు వైదుష్య మవసరము. కాఁబట్టి స్త్రీల యభిరుచికి కోర్కెలకును దగినట్టి గ్రంథములను సేకరించి, వారికిఁగూడ పుస్తకములను జదువుటకు నిరాఘాటముగ నవకాశమియ్యవలెను.

పట్టణ వాసులకు వలెనే, పల్లెలయందు నివసించువారికిని గ్రంథభాండాగారము లుపయోగపడ వలయును. వ్యవసాయ మభినవయంత్రసామగ్రి, వైజ్ఞానికనైపుణ్యముతో విరాజిల్లుచుండ వలయుననిన, ప్రతి కాపువాని చేతియందును, తీరుబడి కాలమున, పుస్తకము గనబడవలెను. సినెమాలు, యక్షిణీదీపములు, నాటకరంగములు, ఉపన్యాస సభలు వీని మూలమున, మొదట, కొంత ప్రబోధమును గలిగించి క్రమముగా వారిలో విద్యను వ్యాపింపజేయుట లెస్స. అటుపైన, వివిధవిషయములకు సంబంధించినవియును, సులభ శైలిలో వ్రాయఁబడినట్టివియునగు గ్రంథములను వారికందజేయవలయును.

గ్రంథ భాండారమునందు, సాధారణాసాధారణములైన విషయములపై వ్రాయఁబడిన పుస్తకము లుండవలయును; నానావిధ పరిస్థితులకనుకూలించు నట్లుగ, సర్వకళోద్బోధములుగ, సర్వరస ప్రధానములుగ పుస్తకములుండు టత్యవసరము.

వికలాంగులకును, ముఖ్యముగ నంధులకు గ్రంథాలయము లీకాలమున నుపకరించు చున్నవి. గ్రంథాలయమునకు రాఁవీలులేని, రాదరిక లేని, వారలకు గ్రంథము లిండ్లకు బంపబడుచున్నవి. అంధులు విద్యావంతులగుటకై వారికుపయోగించు పుస్తకములు ప్రత్యేక పద్ధతులపై సిద్ధము చేయఁబడుచున్నవి. "బ్రేయిలు, మూన్" (Braille, Moon) పద్ధతులపై వ్రాయఁబడిన పుస్తకము లెక్కువగాఁ బాశ్చాత్య దేశమున వ్యాప్తి నొందుచున్నవి.

విద్యావంతులకనుసగు నుద్గ్రంథములను నితరులకు బనికివచ్చు సామాన్య గ్రంథములను-స్త్రీలకును, బురుషులకును,—వేయేల. బాలురకు సయితముపకరించు పుస్తకములను సమకూర్చుట గ్రంథపాలకుల కర్తవ్యము. పాశ్చాత్య దేశములలో బాలురకై ప్రత్యేక గ్రంథాలయములు విరివిగా వృద్ధి యగుచున్నవి.

మన దేశమునందుఁ గన్పట్టుచున్న యొండు రెండుదాహరణము లిచ్చి యీ విషయమును ముగించెదను. పాఠశాలా, కళాశాలా గ్రంథాలయములలో, విద్యార్థుల యవసరములను గుఱుతింపకయే, తమ కనుకూలములగు పుస్తకములను, పాఠ్యపుస్తకములను మాత్రమే తెప్పించు నుపాధ్యాయులున్నారు. గ్రంథపాలకుఁడు పూర్వపక్ష మనుసరించువాఁడైనచో, కన్యాశుల్కము మొదలు నేటి కాలపు గ్రంథములన్నియు బహి వెట్టుటయు గలదు; లేక యువకుఁడైనచో, పూర్వ గ్రంథములన్నియు ద్రోసి రాజనిమెంకిపాటలు, ఏలపాటలు, నవలలు మాత్రమే తెప్పించుటయు గలుగవచ్చును. గ్రంథపాలకుఁడు, విశాల దృష్టి గలవాఁడుగ నుండవలయును తన యభిరుచులను స్వాభిప్రాయములను మాత్రమే మనమునందుంచుకొనక, పాఠకుల యభిరుచులను, వారి యుపయోగములను గ్రహింపవలెను. కొన్ని సమయములలో నవసరమని తోఁచినచోఁ బాఠకుల కుపయోగకరములగు వానిని తానయై తెప్పించవచ్చును. తెలియని వారికి, వాని యుపయోగములను దెలుపవచ్చును. ఏదియైనను, గ్రంథముల నేరుట యందు, బాఠకుల సదభిప్రాయమును బొందవలెను. బలవంతపు బ్రాహ్మణార్థము పనికిరాదు.

అందరకును నందుబాటులోనుండు గ్రంథములను సమకూర్చి యుంచుట గ్రంథాలయముల విధియని మనము గ్రహించి యున్నాము. ఈ సూత్రమును పాశ్చాత్య దేశములు చాల వరకు మన స్ఫూర్తిగా నవలంబించినవి. అమెరికా దేశమున నిప్పుడు 6500 ఉచిత గ్రంథాలయములు పనిచేయుచున్నవి. మెక్సికో దేశమున 1,500 ఉచిత గ్రంథాలయములు, 1,000 పాఠశాలానుబంధ గ్రంథాలయములు, 800 వృత్తి గ్రంథాలయములు, 500 గ్రామ గ్రంథాలయములు నున్నవి. పెక్కు దేశములలో ప్రభుత్వము గ్రంథాలయముల విషయమై ప్రత్యేక శ్రద్ధ దీసికొనుచున్నది. రెవిన్యూ, మునిసిపలు పన్నులకు వలెనే గ్రంథాలయముల కొఱకై పన్ను వేయబడుచున్నది. గ్రంథాలయ సౌకర్యములేని గ్రామముగాని, స్థలముగాని, వ్యక్తిగాని యుండకూడ దనుదృఢాభిప్రాయము ప్రబలినది. గ్రంథాలయాభివృద్ధికై కృషిచేసి యపారమైన ధనసాహాయ్యము చేసిన వారిలో ముఖ్యుఁడు ఏండ్రూ కార్నెజీ.

ప్రతి మనుజుఁడును గ్రంథ పఠనముచే లాభమును బొందవలయునిన, ప్రభుత్వ మీ విషయమై యెక్కువ శ్రద్ధ తీసికొనవలయును. ప్రజలును, సంస్థలును ధనసాహాయ్యము చేయవలయును. పుస్తకాలయములను పాలించుటకై తగువారు నియమింపఁబడవలయును.

3. గ్రంథములకు దగిన పాఠకులను సమకూర్చుము.

(Every book its reader.)

రెండవ సూత్రము, పాఠకులను దృష్టిపథము నందుంచుకొని, నిర్వచింపఁబడినది. ఈ

మూడవ సూత్రము పుస్తకములతో నెక్కువ సంబంధము గలది. దీని బాధ్యత చాలవరకు గ్రంథభాండాగారికుల పైననే యుండును ప్రతి గ్రంథమును తగిన పాఠకునిఁ జేరుటకు కావలసిన సదుపాయములన్నియుఁ గలిగింప వలయును.

గ్రంథాలయమునం దేయే పుస్తకము లున్నవియు ప్రతి పాఠకునికి దెలియజాలు నొక ప్రత్యేకమగు పద్ధతిపై నవి యమర్చబడవలయును. కాలహరణము జరుగకుండ పుస్తకములు పాఠకుల కందించుట, పాఠకుల సౌకర్యార్థము (కొందరు ప్రత్యేకోద్యోగులు వారికి గ్రంథ పరిచయముగలిగించుటకై నియమింపబడుట, జనాకర్షకములగు ప్రత్యేక విషయములకు గ్రంథాలయమున తావొసంగుట.—ఇవి యన్నియు నాధునిక గ్రంథాలయములలో సర్వ సాధారణ మైపోయినవి.

పరిచారక సంఘములు, కరపత్రములు, వార్తా పత్రికల యందును, మాస పత్రికలలోను వ్యాసములు, ఉపన్యాసములు, ప్రదర్శనములు, రేడియో ప్రచారము, ఆకర్షణీయములగు ప్రకటనాఫలకములు (Sign boards) లఘు పుస్తకములు—మున్న నవి ప్రజల దృష్టిని గ్రంథాలయమువైపు మరల్చును.

గ్రంథాలయాభివృద్ధికి సహాయభూతములగు విషయము లెన్నియో యాధునిక గ్రంథాలయములచే నవలంబింపఁ బడుచున్నవి:- పురాణపఠనము, భాషాంతరీకరణము (అనగా నితర భాషలలోని విజ్ఞానమును దేశ భాషలలోనికిఁ బరివర్తనము సేసి ప్రజలలో వ్యాపింపఁ జేయుట), పాఠక సమూహములను ప్రోత్సహించుట, గ్రంథాలయములతో నేరుగా సంబంధములేని యితర విద్యా విషయములకు తావొసంగుట, కథల నేర్పాటు గావించుట; నాటక ప్రదర్శనములను, ఉపన్యాసములను, పండుగులను, వర్ధంతులను బ్రత్యేక సమావేశములను జరుపుట, మొదలగునవి యీ శ్రేణియందు జేరును.

స్థానికావసరములను దీర్పజాలు గ్రంథములను సంగ్రహించుట యీ మూడవ సూత్రానుసరణమునకు ముఖ్య సాధనము. వ్యాపారాభివృద్ధికి వర్తకుల వలన నవలంబింపబడు సాధనము లన్నియు, విజ్ఞానాభివృద్ధికి గ్రంథాలయములనుష్ఠించవలయును,

**4. పాఠకుల సమయమును వృథా పఱుపకుము.**

**Save the time of the reader.**

ఈ సూత్రము ననుసరించి గ్రంథాలయమున పాఠకునకు నిరభ్యంతర ప్రవేశ ముండవలయును అనగా, పుస్తకములను తలుపులులేని బీరువాలలోనుంచి, వానిని స్వయముగానే తీసికొనుటకు పాఠకుల కవకాశ మీయవలయును. వేనవేలు గ్రంథములుండు గ్రంథాలయములందు పుస్తకముల పట్టీలో వెదకికొనుటకు చాలాకాలము పట్టును. నిరభ్యంతర ప్రవేశమువలన పాఠకుల కుత్సాహమును, గ్రంథములందభిరుచియు, ననేక గ్రంథ పరిచయమును గలుగును.

బీరువాల యేర్పాట్లు:—

నిరభ్యంతర ప్రవేశపు పద్ధతి సక్రమముగ బనిచేయ వలయునన్నచో, పుస్తకముల నొక ప్రత్యేకమగు పద్ధతిపై బిరువాలయందుంచుట వసరము. పుస్తకముల పేరులనుబట్టి యకారాదిగ నుంచుటకాని, వాని కర్తల పేరులనుబట్టి కాని యుంచక, గ్రంథ విషయమునుబట్టి విభాగమును గూర్చిన ప్రత్యేక పద్ధతు లెన్నియో ప్రచారము నందున్నవి. అందు ముఖ్యమైనది "డూయి." (Dewey.) గారి డెసిమల్ పద్ధతి. ఇటీవలనే మదరాసు విశ్వ విద్యాలయ గ్రంథ భాండాగారికులగు ఎస్. ఆర్. రంగనాథనుగారు "కోలను" విభజన పద్ధతిని గనిపెట్టియున్నారు. విషయవిభాగమొనర్చు నపుడు, ఒకదానితో నొకటి సంబంధించు విషయములుగల గ్రంథములను దగ్గఱ దగ్గఱగా నుంచవలయును.

ఎక్కువగఁ జదువఁబడు గ్రంథములు చాల దగ్గఱగా నుండు బీరువాలయందుంచఁబడ వలయును. ఎప్పుడో యేకొందఱో చదువుచుండు భూగర్భ శాస్త్రాదులకు సంబంధించిన వానిని దూరముగా నుంచిన నభ్యంతరము లేదు. నూత్న ప్రచురణములును దగ్గరనుండు బీరువాలయందే యుండవలయును.

గ్రంథ సంగ్రహాలయమును విశదముగాఁ గనఁబఱచు పటములును దానియందే యే భాగమునందే యే విధముల గ్రంథములున్నవియో తెలుపు పట్టికలు నుండవలయును. ఆ యాలయాంతర్భాగము లందుండు బీరువాలలో నెక్కడెక్కడనే యే విషయములకు సంబంధించిన గ్రంథములున్నవియు సూచించుట కాబీరువాలపై వ్రాసియుంచవలెయును. ఆధునిక మార్గములపై నేర్పఱచిన గ్రంథముల యొక్క సంఖ్యను, దాని వెనుక భాగమున క్రిందినుండి యొక అంగుళము స్థలమును వదలి వేయవలెను.

గ్రంథస్థ విషయముల ననుసరించి, విపుల విభాగముల గావించి, వాని ప్రకారము గ్రంథముల పట్టికలను సిద్ధపరుపవలెను.

గ్రంథ పట్టికను సిద్ధపరచునప్పుడీ క్రింది విషయములను దృష్టియందుంచవలయును.

1. గ్రంథము పేరునుపట్టి వెదకుట కనుకూలముగా నుండుట.

2. గ్రంథస్థ విషయమునుబట్టి గ్రంథ పరిచయము కలుగుట.

3. గ్రంథకర్తనుబట్టి గ్రంథమును, గ్రంథస్థవిషయమును బోధపడునట్లు లుండుట.

పై మూడు విషయములును సంకలనమగుటకు సంపుటరూపమున నున్న పట్టికలకన్న కార్డులరూపమున అకారాదిగ నేర్పఱచుట మంచిది. ఇది క్రింది యుదాహరణము వలనఁ దెలియఁ గలదు:—

కే. వి. లక్ష్మణరావుగారిచే రచింపఁబడిన "హిందూ మహాయుగము"అను పుస్తకమును పై కార్డుల రూపమగు పట్టికలోఁ జేర్చవలయుననిన:

1. హకారమునాదిగాగల నామములను గలిగిన గ్రంథము నందిట్లు కార్డు నుంచవలెను.

హిందూ మహాయుగము.

గ్రంథకర్త:

కే. వి లక్ష్మణరావుగారు.

2. రెండవ కార్డును "ల" ఆదిగాగల కార్డునందు నీ క్రింది విధముగా నుంచవలయును,

లక్ష్మణరావు (కే. వి.)

హిందూ మహాయుగము.

లక్ష్మణరాయ వ్యాసావళి.
మహమ్మదీయ మహాయుగము.
ఆయన వ్రాసిన యితర పుస్తకముల పేర్లు.

3. "చ" మొదటవచ్చు పేరుల కార్డు లందు చరిత్ర గ్రంథముల నడుమ, హిందూదేశ విభాగములో నీ పుస్తకపు కార్డుండవలెను.

గ్రంథాలయోద్యోగులు పాఠకులకు గ్రంథకర్తల విషయముననను, గ్రంథస్థ విషయములను గురించియు, ప్రచురణాది విషయముల గురించియు, వివరముల నుచితముగా నొసఁగుటకు సంసిద్ధులై యుండవలయును.

పుస్తకముల నిచ్చి పుచ్చుకొనునప్పు డిప్పటి పద్ధతులపై వ్రాయుచుండుట వలన, పాఠకులకాలము వృథావ్యయపఱుపఁబడి వారి కిబ్బంది కలుగుచుండును. కాఁబట్టి "నిరభ్యంతర ప్రవేశము" మూలమున పాఠకులే తమకుఁ గావలసిన పుస్తకములను దీసికొని, యిందుకొఱకు ప్రత్యేకముగ నియమింపఁబడిన కార్డులపై పుస్తకము పేరును. సంఖ్యను, వ్రాసి యీ కార్డుల వెంబడి పాఠకుల కొఱకు ప్రత్యేకింపఁ బడియుండి వారి పేరు, చందా సంఖ్య, వేయఁబడియున్న టికెటును కలిపి గ్రంథాలయాధికారి కీయవలయును. అతఁడు వానిపై తేదీముద్రను వైచి, పుస్తకముల నొసగును. ఈ పద్ధతి పాఠకులకును, గ్రంథాలయాధికారులకును సుకరమైనది.

5. గ్రంథాలయము దినదినాభివృద్ధి
నొందు సంస్థ.

గ్రంథాలము దినదినాభివృద్ధి నొందఁగల దలు విషయమును తదధికారులు మఱవఁగూడదు. కావున గ్రంథాలయభవనమును, గ్రంథ విషయ విభాగమును, గ్రంథముల పట్టికయు, గ్రంథాలయోపకరణములును నీ మొదవ సూత్రమును లక్షించియే ప్రారంభింపఁ బడవలయును. లేనిచో ననవసరవ్యయప్రయాసములకు లోనుగావలసి యుండును.

ఈ గ్రంథాలయ నిర్వహణము పై సంపూర్ణాంశముల క్లుప్తముగనైనను దెలుపవలయు ననిన నొక సంపుటము కాఁగలదు. కావున నీ విషయమును ప్రస్తుత మింతటితో విరమించుచున్నాను. మదరాసు యూనివర్సిటి లైబ్రేరి యనులగు ఎస్. ఆర్. రంగానాథనుగారి గ్రంథములోను ఉపన్యాసమును నా కీ వ్యాసమును వ్రాయుట కెక్కువ దోడ్పడినవి. వారికి కృతజ్ఞుడను.



# పద్మ

శ్రీమతి. తయ్యూ.

పద్మ పది ఏండ్లది. ఐదవ తరగతియందు చదువుచున్నది. ఆమె ఇంటియందు ఆమె యొక్క అన్న, వదినె, అన్న కుమారుడు (రామ చంద్రుడు) వీరు తప్ప ఇంకెవ్వరునులేరు. పద్మ, అన్నకు, వదినకు చాల భయపడుచుండె డిది. వారి యింటికి రెండు ఇండ్లు దాటిన తరువాత ఆమె స్నేహితురాలు అంబుజ ఇల్లున్నది.

ఒకదినము సాయంకాలము పద్మ అంబుజ యింటికి వెళ్లుటకై బయటికి వచ్చెను.

రా. చ:- (ఆమెను చూచి) నేనుగూడ వచ్చెదను.

పద్మ:- నీవు రావద్దు.

రా. చ:- నీవు నన్ను తీసికొని పోకపోయిన నేను అమ్మకు చెప్పెదను.

బూచిగాడువచ్చి పట్టుకొనునని చెప్పి ఆతని భయపెట్టి లోపలికి పంపి, పద్మ అంబుజ ఇంటికి వెళ్లిపోయెను. అప్పుడే అంబుజ జడ వేసికొని, పూలు పెట్టుకొని, శుక్రవారము గనుక లక్ష్మికొఱకు ఒక పూల హారమును గ్రుచ్చుచుండెను. శ్యామచంద్రుడు (అంబుజ అన్న) చప్పుడు చేయక వచ్చి అంబుజ కండ్లను మూసెను. అంబుజ ఎంత పెద్దది యైనను చిన్న పిల్లవలె దండను క్రిందఃబెట్టి ఏడ్వసాగెను. అదిచూచి వెంటనే శ్యామసుందరు డామె నోదార్చి వెళ్లిపోయెను. అప్పుడు రుక్మిణమ్మగారు (అంబుజ తల్లి) వచ్చి "దీపముపెట్టే సమయ మైనది. దండ గ్రుచ్చినంత నేచాలును. లక్ష్మిదగ్గరకు వచ్చి రెండుపాటలు పాడమ్మా" అని ప్రేమతో పిలిచెను.

అం:- నేనురాను, ఆడుకొందును.

రుక్మి:- ఛీ! అట్లు చెప్పగూడదు. శుక్రవారము గనుక రెండు పాటలు పాడి హారతి చేయవలెను.

తరువాత వీరిద్దరును పోయి కూర్చుండి అంబుజ పద్మను పాడుమని పద్మ అంబుజను పాడుమని యనుకొను చుండిరి.

రుక్మి:- పాడండమ్మా ఎవరో ఒకరు! ఈ తగవులతోనే ప్రొద్దుపోవుచున్నది. ఆమె వదినె కోపము చేయునేమో ఇద్దరు చప్పచప్పన రెండు పాటలుపాడి హారతి చెయ్య వలయును.

పద్మ:- అంబుజా! మీ ఇంటిలో లక్ష్మిని పెట్టినారు గనుక నీవు మొదట పాడుము. తరువాత నేను పాడెదను, హారతి చేయునపుడిద్దరము చేరి పాడుదము.

ఇద్దరు ఒక్కొక్క పాట పాడి హారతి చేసిన తరువాత పద్మ తన ప్రసాదమును తీసికొని వెళ్లెను. ఇంటికి వచ్చుసరికి రామచంద్రుడు పద్మ పుస్తకము తీసికొని పెన్సిలుతో పుస్తకమంతయు గీయుచుండెను.

పద్మ:- నీకు ప్రసాద మిచ్చెదను. పుస్తకమిచ్చివేయుము.

రా. చ:- నే పిచ్చెదను.

పద్మ:- నేనిప్పుడు చదువవలయును. రామచంద్రుడు పుస్తకమును రెండుగ చింపి ఇదిగో! అని పారవేసెను. అప్పుడు పద్మ తనకు తెలియకుండగనే అయ్యో యని యరచెను ఇది యంతయు వినిన శారదమ్మ (పద్మ వదినె) "ఇంతసేపు దుముటకు వెళ్లినావు. వాడుకాసేపు పుస్తకము పట్టుకొనగానే నీ చదువంతయు పాడయిపోయినదా! అని పెద్దగ గర్జించెను.

పద్మ:- పుస్తకము చింపి దానిమీద పెన్సిలుతో గీచినాడు.

శార:- దానికేమి? వాటిని రబ్బరుతో తుడిచి కుట్టుకొన వచ్చును. చాలించు ఇక నీ మాటలు. భోజనమునకురా.

పద్మ భోజనమునకు కూర్చుండి అక్కడ గూడ నాలుగు తిట్లు తిని తిరిగివచ్చి కూర్చుని ఆ పుస్తకమును తీసి పెన్సిల్ గీతలను తుడిచి కుట్టుకొని పండుకొనెను. ఆమె కంటినుండి అశ్రుబిందువులు రాలదొడగెను. తనకు తల్లి లేదు కాబట్టి ఈ దుస్థితి కలిగినదని విచారించుచుండెను. నే నెట్లైనను దురదృష్టవంతురాలను. అంబుజ అదృష్టవంతురాలు కాబట్టి సౌఖ్యము ననుభవించుచున్నది. అని దుఃఖించుచు నిద్రించెను.

మరునాటి ప్రొద్దున పద్మ వదినె రామచంద్రునికి ఇచ్చుటకొరకు ఆముదపు నూనెను ఎత్తిపెట్టి యుంచెను. శారదమ్మగారు రామచంద్రుని ఆముదము త్రాగుటకు పిలువ అతడేడువ మొదలుపెట్టెను. పద్మ ఈ ఏడుపును విని లేచి ముఖము కడుగుకొనుటకు వెళ్లుచుండగా ఒక కప్పవచ్చి పద్మ మీద దుమికెను. పద్మ కెంకను నిద్రకండ్లు గనుక నూనెగిన్నెను చూడక దాని మీద దుమికి పరికిణీమీద నూనె పోసికొనెను. ఆ చప్పుడు విని నరసింహారావు, శారదమ్మ వచ్చిరి.

శార:- అబ్బ ఏమికండ్లో ఏమో; వాడేడ్చుటకు, నీవుపారబోయుటకు, సరిపోయినది. పరికిణీ మీదంతయు నూనెయే! దీనికి ఎన్ని పరికిణీలు కుట్టించేది. "అయ్యగారి సంపాదన అమ్మగారి గాజులకు సరిపోయె" నన్నట్లు ఉన్న డబ్బంతయు దీని తిండికి, చదువుకు బట్టలకే అగుచున్నది. ఒక కానికూడ మిగులదు.

నర:- ఏమో పాపం పసిపిల్ల అని ఊరుకొనిన కొలది రోగము తిరిగిపోవుచున్నది.

నరసింహారావు పద్మను కొట్టబోవు చుండగా శారదమ్మగారు రామచంద్రుని ఒక దెబ్బ కొట్టెను. పద్మ తన గదిలోనికి వెళ్లి వ్యసనముతో గూర్చుండెను. అప్పుడు రామచంద్రుడు పోయి ఆమె ఒడిలో పండుకొని నేనిక ఆముదము త్రాగను అని చెప్పెను. అది విని శారదమ్మగారు వచ్చి "ఇంకేమి సంతోషమైనదిగా నీ మనస్సు చొప్పున జరిగినది" అని చెప్పి పండ్లు కొరకుచు వెళ్లిపోయెను. ఆ దినము రాత్రి అందరు నిద్రపోయిన తరువాత పద్మ మెల్లగలేచి ఆమె బడి పంతులమ్మయగు సరస్వతమ్మగారింటికి వెళ్లెను.

సరస్వతమ్మగారు ఆమెనుజూచి ఇంత రాత్రియందు ఎందులకు వచ్చితివని యడుగగా పద్మ తన కష్టములను చెప్పుకొని ఏడ్వసాగెను. పద్మ క్లాసులో బాగుగా చదువు పిల్ల గనుక పంతులమ్మకు ఆమెమీద ఎక్కువ ప్రేమ.

సర:- నీకు నేనే ఫీసుకట్టి చదివించెదను. నీ బట్టలు తిండి అంతయు నేనే భరించెదను. నా దగ్గరనే యుండుము.

పద్మ:- మీరే దిక్కు అని వచ్చియున్నాను. గనుక మీరు చెప్పినట్లే చేసెదను.

పద్మ సరస్వతమ్మగారింటియందు గారాబముతో పెరుగుచు వచ్చెను. ఇది విని శారదమ్మగారు నరసింహరావుగారితో చెప్పెను.

నర:- పోనీ మనమేమి ఆమెను ఉండవద్దని చెప్పినామా? ఆమెకు ఇష్టము గనుక వెళ్లినది.

శార;- అది సరే లెండి, కాని ఊరిలో వారంద రేమైన ననుకోరా? పోనీ వెళ్లి పిలుచుకొని వచ్చెదరా?

నర,- నీకు ఎంత చెప్పినను బుద్ధిలేదు. నీకిష్టమయిన నీవుకూడ ఆమెతో వెళ్లియుండు.

శార:- పాడుపిల్ల! ఇంటిలో లేకపోయినను ఈ పిల్ల వలన తిట్లు తినవలసిన దే.

* * * *

అది ఒక సాయంసమయము. సూర్యు[illegible] అస్తాచలమున కరుగుచుండెను. పక్షులు గూ[illegible]డ్లకు వెడలుచుండెను. భక్తులు రామదేవాల[illegible]మునకు గుంపులుగా పోవుచుండిరి. కొంద[illegible] దేవుని దర్శించి వచ్చి చెరువుగట్టుపై కూర్చుం[illegible] మాట్లాడుచుండిరి. హఠాత్తుగా చెరువులో ఒ[illegible] శబ్దము వినబడెను. ఒక బాలిక తక్షణమే చె[illegible]వులో దుమికినది. జనులు దిగ్భ్రమచెంది చూ[illegible]చుండ ఆబాలిక శ్వాసను వదలుటకుగూడ క[illegible]ముగా నున్న బాలుని ఒక కరమునను. రెండ[illegible] కరముతో నీటిని కొట్టుచు పైకివచ్చినది. చూ[illegible] ముద్దుపెట్టుకొనినది. వానివంక చూచినది. అ[illegible] కొడుకు రామచంద్రుడని తెలిసినది. ఆ సమ[illegible]ముననే శారదమ్మగారు నరసింహరావుగా[illegible] ఇద్దరు వచ్చిరి. అప్పుడు పద్మ శారదమ్మగా[illegible] చూచి, వదినా! ఏడువవలదు. రామచంద్రు[illegible] ఉన్నాడు. పద్మ వదినె ఆమె నెంత కష్టపెట్[illegible] పద్మ ఉదారస్వభావము చూచి సరస్వతమ్మగా[illegible] సంతసించిరి. అప్పుడు శారదమ్మగారును నర[illegible]హరావుగారును పద్మను కష్టపెట్టినందుల[illegible] పశ్చాత్తాపపడి సరస్వతమ్మగారిని క్షమాప[illegible] కోరి పద్మను తమ ఇంటికి తీసికొనిపోయి బా[illegible]గా చూచుకొనుచుండిరి.

గమనించితిరా మన పద్మ సరళత!






శ్రీమతి, అమృతమ్మ (ప్రాంత విద్యార్థిని)

గీ॥ అమ్మ! నీ యత్తమామల ♦ కణగి యుండు
మరదు లందఱి యందున ♦ మఱువగను
ఆడుపడుచుల యందున ♦ సాదరముగ
నెంతయో ప్రేమతో నుండు ♦ మెరుగుమమ్మ॥

గీ॥ భర్త యాజ్ఞకు శిరమొగ్గి ♦ భక్తితోడ
తోడునీడవై యుండుమో ♦ తోయజాక్షి
ఎవరు కోపించిన ప్పటి ♦ కెడదయుందు
ఇంచుకంతైన కోపంబు ♦ గాంచకమ్మ॥

గీ॥ వేకువను ప్రార్థనము చేయు ♦ వేళలందు
సక్రమంబుగ జరుపుచు ♦ సాధ్వి వనెడి
పేరు పొందుము, నా తల్లి ♦ పెంపుమీర
అన్ని పనులను శ్రద్ధతో ♦ నరసి కొనుచు॥



# మధుర హృదయ.

శ్రీమతి. సే. భారతీరత్నాకరాంబ, (ప్రాంత విద్యార్థిని)

(ఒక గదిలో బల్లమీద బొమ్మలు పేర్చుచు సుమ, ఆమె అమ్మ వరలక్ష్మమ్మ ప్రక్కన యుండినది. ఒక కుర్చీలో కూర్చొని వారు చేయుచున్న పనిని చూచుచు నుండును భవానీ ప్రసాదు.)

సుమ:- అమ్మా! ఆ చెట్లు మధ్యనున్న కృష్ణుడు మన బావవలెనే ఉన్నాడు, చక్కగా.

"అయితే ఆయన ప్రక్కను ఉన్న రాధ నీవలెనే ఉన్నదన్నమాట." అన్నది నవ్వుచు వరలక్ష్మమ్మ.

సుమ, ముఖము చేటంత అయినది. ఆమె ఆ మాట అనగానే కోరకంటితో బావ వంక చూచినది. ప్రసాదం పరధ్యానముగా ఉండుటచే ఏమి అనలేదు.

"పిల్లా! ఎవరో తలుపు తట్టుచున్నారు. చూడమ్మా."

"బొమ్మలు పెట్టుకొనినాము. పసుపు కుంకుమకు రండి మా యింటికి." అన్నది, పదునాల్గేండ్ల బాలిక కారునుండి దిగుచు. ఆమె దాసి కుంకుమ బరిణె వరలక్ష్మమ్మకు ఇచ్చినది. ప్రసాదరావు కిటికీలోనుండి ఆ అమ్మాయి వంక చూచినాడు. ఆమె కట్టుకొన్న రోజారంగు బనారను చీర; తళతళలాడుచు భుజముల వఱకు వ్రేలాడు లోలకులు. రెండు గజముల రిబ్బను చివరగల పెద్ద వాలుజడ, అన్నిటికంటె చక్కదనము చూచుసరికి కండ్లు జిగ్గు మనిపించినవి. ఇంతలో బుర్, మనుచు కారు ముందుకు సాగి పోయినది.

"బావా! ఇక్కడనే కూర్చొనినావే? ఇటువచ్చి నా బొమ్మలను చూడుము."

"సుమా! ఎవరే ఆ బాలిక? నీకు తెలియునా? "ఏదో చిన్నతనములో నేను, ఆ అమ్మాయి ఒకే క్లాసు చదువుచుండెడి వారము సెకండు ఫారములోనికి వచ్చువఱకు పంకజము బడి మానివేసినది. తరువాత ఒక ఏడాది చదివి తర్డు ఫారం ప్యాసయి నేనుగూడ మానివేసితిని.

"ఓహో పత్రికలలో, పంకజం వెంకీ పాటలు పాడుటలో అద్వితీయురాలని వేయుదురు. ఈమెయేనా?

"అవును, కాని బావా! ఆ గొడవ అట్లా ఉంచు. నా బొమ్మలు ఎట్లా ఉన్నవి?

"ఇంతే? బాగుగా నున్నవి సుమా! ఇంకొకటి అడిగెదను. విసుకుకొనక చెప్పు. పంకజమునకు యింకను పెండ్లి కానట్లున్నదే?

"అవును. కాలేదు."

" ఎందువల్ల ? "

"అబ్బ ! ఏమో నాకు తెలియదు."

"చెప్పవు కాదు? నీతో మాట్లాడను."

"ఆ! చెప్పెదను. బి. ఏ. చదువుకొనిన వాడు, ఇల్లరికము ఉండేవాడు, చిన్న వాడు. చక్కని వాడు, మొదలగు నవన్నియు ఉన్న గాని పిల్ల నివ్వరట. అటువంటి వారెవరు దొరక లేదట."

" ఆలాగా ఇల్లరికము? ఒప్పుకొనిన ఆ లక్షణము లన్నియు నాకున్నట్లేగా సుమ? " అనినాడు ఎటో చూచుచు ప్రసాదము.

" ఛీ! అట్లా మాట్లాడకు. " అన్నది సుమ గుడ్లనీరు గ్రుక్కుకొనుచు.

"ఊరికే అంటిని తమాషాకు" అని నాడు ప్రసాదము, "నల్ల పిల్లా నీకెంత మత్స రము?" అనునట్లు చూచుచు.

"సుమా! సుమా? అనుకొనుటకే వచ్చు టలేదు, మీ బావను విడచి రాజాలకున్నావు. పెండ్లి అయిన మొదల మా ముఖమే చూడ వులే!" యని యనుచు నలుగు రైదుగురు బాలి కలు ప్రవేశించిరి. సుమ సిగ్గుతో కూడిన నవ్వు తో వారి వంకకే వచ్చినది.

* * * *

"వరలక్ష్మమ్మా! వరలక్ష్మమ్మా!"

"ఎవరు? వచ్చుచున్నా నుండండి." అమ్మాయి

"మీరా? రండు. పిన్నిగారు? త్రోవ తప్పి ఇట్లా వచ్చినట్లున్నదే లేకున్న ౧౫ దిన ములనుండి ఒక్కసారైనను కానుపించుటయే లేదు."

"అయ్యో! తల్లి! ఎంతమాట? ఈ మధ్యఒంట్లో బాగు లేకపోవుట, కోడలు ఇంట్లో నికి రావలను గాకుండుట, మనమనికి విరోచన ములు. ఒకటేమిటి! దానా, దీనా ఇల్లు కదలు టకే శక్యము కాకపోయినది. అందువల్లనే రాలే దమ్మా లేకున్న నిన్ను ఇన్నాళ్లు చూడకుం దునా?"

"నామీద అంత ప్రేమ. ఇప్పుడు ఒం ట్లో కులాసాగా నున్నదా ?

"ఏమి కులాసా? అదే. అయితే అమ్మా యి పెండ్లి ఎప్పుడు !

"కుదిరి నట్లయిన మాఘ మాసమున చెయ్యవలెనని యున్నది మరి."

"కుదురుట కేమున్నది. మేనరిక మున్నదిగా? చిన్ననాటినుండి అనుకొనుచున్నదే. అమ్మాయికికూడ వాళ్ల బావయన్న ఎంతో ప్రేమ"

"ఆ సంబంధము చూచుకొనియే పెం డ్లికి బెంగపెట్టుకొనలేదు. లేకున్న పిన్నిగారు! మనమంత స్థితిపరులముకాము కదా? ఏదో ఆ యన తెచ్చు 50 రూ. మాముగ్గురికి స్వేచ్ఛగా సరిపోవు చున్నవి. అటువంటి పరిస్థితులలో పెద్ద కట్నములిచ్చి మంచి సంబంధము తీసికొని రా గలమా? పోనీ. ఏ ముదుసలికో ముడిపెట్టుద మన్న ఒక్క సుమే బిడ్డ అన్ని విధముల దేవు డు మమ్ము పరీక్షించినాడు.

"జానకమ్మా! సంబంధము మాత్రము చాలమంచిది. పిల్లవాడా B. A. చదివినాడు. అందగాడు. సుమకు అతనికి ఈడుకూడ బాగున్నది. చిలుక గోరువం కలాగున ఉందురమ్మా వారిద్దరు"

సుమ సిగ్గుతో వెళ్లినది.

"తలుపు! తలుపు"

"ఇంక నేను వెళ్లెదనమ్మా"

"మంచిదమ్మా."

ఉస్సు అనుచు వాసుదేవరావు వచ్చి కుర్చీలో కూలబడినాడు; వరలక్ష్మమ్మ విసరుచు ప్రక్కన నిలువబడినది. సుమ తండ్రి వెనుక కుర్చీ ఆని నిలిచింది.

"ప్రసాదం పరీక్ష ఏమయినది?"

"ప్యాసు అయినాడు."

"ముహూర్తము పెట్టుకొనియే వచ్చినారా?"

"ఎవరికి? దేనికి?"

"సుమ పెండ్లికి?"

"వరుడో?"

"ఏమిటి ఆమాటలు? అన్నది, నిర్ఘాంత పోయి.

"ఈ నల్లపిల్లను, బీద పిల్లను ఆనవమన్మధుడు చేసికొనడట."

* * * *

"అంత నిర్ఘాంత పోయెదవెందుకు? మన పిల్ల వారికి నచ్చలేదు. వేరే సంబంధం చూచుకొనినారు. ముహూర్తముగూడ పెట్టుకొనినారు

* * * *

"ఏడుపెందులకే వెఱ్ఱిదానా? వాడేకాని మనపిల్లకు గతిలేదా?"

"అంతమంచి వరుడు దొరకునా? పోనీ మరొకనూరు కట్నము ఇచ్చెదననుడు."

"ఎక్కడినుండి తెచ్చెదవు!"

"ఇల్లు అమ్మక తప్పనామరి?"

"ఇల్లు నదివఱకే తనకాలో నున్నది.

"పోనీ అప్పుతెచ్చి"

"ఛీ! నోరు మూయుము వానికి నల్లదైనను నాకు రత్నమే. నా పిల్ల బుద్ధి లెవరికి నచ్చును? ఎలుపు కోరుకొ్కని తిననిమ్ము. బి. ఏ. చదివినాడట. వీని చదువు తగలబెట్ట చిన్ననాటినుండియు చేసికొనుదమని నమ్మించి మోసపుచ్చినవాని గడప ఇక నేను త్రొక్కను. నా పిల్లపెండ్లి కాకున్నను సిద్ధమే."

"ఎవరిపిల్ల నిచ్చెదరు?"

"వీనినే పంచముఖుల వామనరావుగారి కూతురగు పంకజను ఇచ్చెదరు. ఇల్లరిక మేస్సును.

"సుమా! ఏదీ?"

"లోనికి పోయినదేమో"

వరలక్ష్మమ్మ సుమ గదిలోనికి వెళ్లినది. సుమ ఏమి చేయుచున్నది? తన బావ ఫోటోను చేతిలో బట్టుకొని చూచుచున్నది. ఆ నవ్వుముఖములో మోసమున్నదా?, యని యనుకొనుచున్నది. రెండు కన్నీటి బిందువులు పటముపై కార్చినది. వరలక్ష్మమ్మగుండె నీరయినది. ఆమె గుప్పున కూలబడినది.

గిఱ్ఱున రెండేండ్లు తిరిగినవి. ప్రసాదమునకు పంకజముతో వివాహమయినది. తల్లి మొదలే లేదుకదా? తండ్రి కొడుకునకు పెండ్లిచేసి

కాశికి పోయినాడు. ఇల్లు అమ్మి, డబ్బు తీసికొన్నందువలన ప్రసాదమునకు రెండు ఎకరముల భూమి యున్నది. తన డబ్బును అత్తవారింటికి సాలునకు ఒక పర్యాయము తీసికొని పోయే వాడు. పెండ్లయిన ఏడాదికి తండ్రి రయిలుక్రింద పడి కాశిలోనే గతించినట్లు వార్త వచ్చినది. "పోయినవాడెట్లో పోయినాడు. లేచివచ్చునా? పెట్టునా? చచ్చినవాడు డబ్బు తగలబెట్టి అక్కడకు వెళ్లుటకు ఎందుకు!" అని అత్తమామలు, పంకజము ప్రసాదము, అంత్య కర్మల కైన కాశికి పోలేదు.

సుమకింకను పెండ్లికాలేదు. కూతునకు మంచి సంబంధము తేవలయునని ఆకాశ హర్మ్యముల నిర్మించుచునే వాసుదేవరావుగారు కలరావల్ల హఠాత్తుగా స్వర్గస్థులైరి. పోయి నెలయినది. అప్పులవాడు ఇంటినుండి పొమ్మని పోరు సాగించినాడు. వరలక్ష్మమ్మ కంటికి మంటికి ఏక ధారగా ఏడ్చుచున్నది. సుమ ధైర్యముతో తల్లిని ఓదార్చుచు, గిన్నె చెంబులమ్మి ఆ నెల తల్లిని పోషించినది. ఇంక అమ్ముటకు అన్ని అయిపోయినవి. వరలక్ష్మమ్మ తన అన్న ఇంటికి పోద మన్నది. రైలు ఖర్చునకు డబ్బేది?

"అమ్మా! నేనొకమారు బావదగ్గరవెళ్లి వస్తానమ్మా."

"ఏ బావ?"

"ప్రసాదం బావ."

"ఎందులకు?"

"మన కేమైన స హా య ము చేయునేమో."

"ఆ! చేసినట్లే వున్నది. వెళ్లవద్దు!"

"పోనీ రైలు ఖర్చునకైన అడిగి తెచ్చెదను."

"వారందరు ని న్నే మ యి నా అందు రేమో."

"మనబావ ఉన్నాడుకాదుటే."

"బండికి డబ్బులున్నవా?"

"ఒక పావలా ఉన్నది."

బండి అతిత్వరితముగా నడచుచున్నది సుమ హృదయవీథిలోకూడ అట్లే ఆలోచనలు పరుగిడుచున్నవి. "నేను వెళ్లెదను. బావ, నేను వచ్చినాననగానే నా ఎదుట వచ్చి "ఏమిసుమా" అనును. నేను చెప్పెదను. "ఎక్కడకో ఎందుల కో నాదగ్గరనే ఉండుము" యని యనును" అని ఇంకను ఏమో ఆలోచించుచుండగనే బండివాడు దిగుమనినాడు. సుమ బండిలోనుండి తొంగి చూచినది. ప్రసాదము వచ్చిన రూపాయలను లెక్కపెట్టుకొనుచు మేడమెట్ల నెక్కుచున్నాడు. సుమ హృదయము ఆనందముతో పొంగిపోయినది. "బావా!" యని నోరార పిలువవలయునని యనుకొన్నది. ఇంతలో ప్రసాదము లోపలికి పోయినాడు

తల యెత్తి చూచినది సుమ. ఎదురుగా పంకజము. ఆమెను చూడగనే శరీరము ఝల్లు మన్నది. ఎందులకో?

"మా బావకొఱకు వచ్చితిని."

"మీ బావ ఎవరు?"

"ప్రసాదము."

"చాలు చాలుపెద్దమనుష్యులున్న, చూచిన అసహ్యముగా ఉండు ఈ రూపమున ఆయ

నను బావ. అని ఎట్లనుచుంటివి? అక్కడనే ఉండు. ఎందులకు వచ్చినావు?''

"మా బావను ఒకమారు పిలువుము.''

"ఆయన వచ్చుటకు వీలులేదు. ఈపాటికి దయచేయి." అని మేడతలుపు వేసికొనినది. సుమకు ఆ ప్రదేశమంత తిరుగుచున్నట్లయినది. గిరుక్కున వెనుకకు వెళ్లి బండి ఎక్కినది. ఆమె హృదయములో తుపాను మొదలయినది.

"అమ్మా తలుపు.''

"ఏమనినాడే ప్రసాదం.?''

* * * *

"అయినదా? తెలిసినదా? నీబావసంగతి. ఆ వెండి డబ్బులను అమ్మిన డబ్బుతే పోదాము.

* * * *

ఇప్పుడు సుమ ఏకాకిని. ఒక పెద్ద ఇల్లు ౫ఎకరముల భూమి ఆమె అధీనములోనున్నది. సుమ మేనమామ ఒక ౫౦ ఏండ్ల వరునిచే కట్నములేకుండ ముడిపెట్టించి కృతార్థుడయినాడు. పెండ్లి అయిన నాటినుండియు సుమ, తల్లి, గూడ వరుని ఊరిలోనే ఉండిరి. వరునికి పెండ్లినాటికి ఉన్న క్షయ పెండ్లి అయిన ౨ నెలలకు ఎక్కువయినది. తన కెవరును వారసులు లేరని ౫ ఎకరముల భూమి, ఇల్లు సుమకే వ్రాసియిచ్చి అవతారమును చాలించినాడు బ్రాహ్మణుడు. అతడు పోయిన కొద్దిరోజులకే సుమ రజస్వల అయినది. తనయొక్క కూతురుగతి ఇట్లయ్యెనా యని అహర్నిశాదులు కుల్లి పోమెడిది వరలక్ష్మమ్మ. కాని సుమకు విచారములేదు. సంతోషములేదు. అంత మామూలుగనే ఉన్నది. మార్పేమియు తోచలేదు. అల్లుడుపోయిన మూడేండ్లకు చిక్కి శల్యమయి, కూతును దిక్కులేని పక్షిగాచేసి, స్వర్గమును అలంకరించినది వరలక్ష్మమ్మ. సుమ ఒక పాఠశాల స్థాపించి దానికగు ఖర్చంతయు భరించుచున్నది. సహాయార్థము ఒక వంటలక్కను ఉంచుకొన్నది.

సుమ ఏకాంతజీవితమందు పండ్రెండేండ్లు గడిపినది. ఈదిన మామె ఇంటికి ఒక అతిథి వచ్చినాడు. వంటామె వడ్డించుచున్నది. ఈయన భుజించుచున్నాడు.

"అయ్యా మన ఊరిలో మీరు చాల కాలముబట్టి ఉన్నారేమో?"

"ఔను తల్లి!''

"పంచముఖులవారి అల్లుడు ప్రసాదరావు గారిని ఎరుగుదురా?''

"వారిస్థితి ఇప్పుడ తిశోచనీయముగానున్నది.''

"ఏమి?'' అన్నది ఆతురతతో

"ఆయన మామగారు చాల రోజుల క్రిందటనే గతించినారుగదా. ఇంక మొన్న మొన్ననే పురుడువచ్చి భార్య చనిపోయినది. పుట్టిన పిల్లకూడ పోయినది. కూతురు పోయినవెనుక తల్లికూడ పోయినది, బావమరిది పెండ్లియై, భార్య కాపురానికి వచ్చినది. బావమరిది ఇతగాడిని ఇద్దరు పిల్లలను ఇంటినుండి గెంటినాడు. ప్రసాదము పక్షవాతముతో బాధపడుచు హాస్పిటలులోనే ఉన్నాడు. పిల్లలుగూడ వాని యధీనములోనే ఉన్నారు.''

సుమ గుండె నీరయినది.

బ్రాహ్మణుడు ఆమె అవస్థను చూడలేదు.

"ఇంక ఎక్కువ రోజులు ఉండనీయదు

అక్కడైనను వెడలగొట్టుదురు ముగ్గురిని పాపము! ఆయనగతి ఏమగునో?'' అని లేచెను. సుమ వంటఆమెను తినమన్నది. తాను భోజనము చేయ లేదు. వెంటనే ప్రయాణమయినది ప్రసాదము దగ్గఱకు, వంటామెకు ఇల్లొప్పచెప్పి.

రైలుదిగి, తెలిసిన ఊరు గాన త్వరగా హాస్పిటలునకు వెళ్ళి ప్రసాదము ఉన్న వార్డునకు వెళ్లి మంచముమీద ప్రసాదము ప్రక్కన కూర్చున్నది. గడ్డము, తల పెరిగి నల్లబారినముఖము, చిక్కి, శల్యమయిన శరీరమును చూచుసరికి పట్ట రాని దుఃఖము వచ్చినది. "బావా" అని పిల్చి నది. ప్రసాదము కండ్లువిప్పి చూచినాడు. కాని తనకండ్లను తానే నమ్మలేదు. ఇంతలో వైద్యుడు వచ్చెను. సుమ పిల్లలను భరించినందుకు అతడు కోరిన ధనమును ఇచ్చి అతని ఉదారతకు ధన్య వాదముల నర్పించుచు, బావను, పిల్లలను తీసి కొని రైలు ఎక్కినది.

* * * *

సుమ చేయుచున్న పరిచర్యలవల్ల మంచి మందు పుచ్చుకొనుటవల్ల ప్రసాదమునకు తనంతటతాను తిరుగగల శక్తి చేరినది. అతడిప్పుడు సుమ బడిలో పని చేయుచు తన పొట్టకు సరిపడు వేతనమును తెచ్చుకొనుచు సుమ వద్దనే యున్నాడు. బావ కొంతవఱకు ఆరోగ్యమును పొంద గల్గినందులకు సుమ ఎంతయో సంతసించినది. ప్రసాదము పెద్ద పిల్లవానిని బడిలో చేర్పించి, చిన్నపిల్ల తల్లిలేదని బెంగపెట్టుకొనకుండ లాలించినది సుమ.

ఆ దినము బడికి సెలవున్నందున ప్రసాదము చిన్న పిల్లను ఒడిలో పడుకొనబెట్టి జోకొట్టుచు కూర్చొని యున్నాడు. "సుమా నావంటి బుద్ధిహీనుఁడు ఈ లోకములో ఉండడు. నాకొఱకు నేనే గొయ్యి త్రవ్వుకున్నాను. నా అక్రమ వర్తనమునకు భగవంతుఁడు సరియైనశిక్షనిచ్చినాడు."

* * * *

"మాబావమరిది పెండ్లికిగాను పంకజము నారెండు ఎకరముల భూమి అమ్మించినది. అప్పటివారి తియ్యని మాటలు విన్న, నాగతి ఇట్లగునని కనుగొనలేదు. సుమా! నీవు లేకున్న నేను, ఈ పసికూనలు ఏమయ్యెడివారము. నేను నీకుచేసిన ద్రోహమునకు నీవు నా ముఖము చూడుమని యున్నదా?'' అని నిట్టూర్పు విడిచి నాడు ప్రసాదము.

"బావా! జరిగిపోయిన దానికయి విచారమెందులకు? అంతయు కర్మ. మీ అందరకు నన్ను చూచిన జాలికాని నాకు నామీద జాలి లేదు. ఎందులకుజాలి? అప్పుడు నామెడ జాలిపడెడివాడవా? అప్పటి సుమనే ఇప్పటి సుమను ఇప్పుడు బాల విధవను. అప్పుడు కన్యను. అంతే భేదము." ప్రసాదము సుమవంక చూచినాడు. ఆమె ముఖము అతి ప్రశాంతముగా నున్నది. ఇరువురు ఆకాశమువంక చూచిరి. సోదర సోదరీ ప్రేమలోనిండిన హృదయములు గలవారిని మేఘములలోనుండి చంద్రుడు బయటికి వచ్చి ఆశీర్వదించును.

ద్రోహులపై ద్వేషభావమును ఉంచిన దేవుడు సంతసింపడుగదా?



# పాక కళ

శ్రీమతి. పి. అంబుబాయి. శ్రీమతి. రా. లలిత

## శ్రీఖండము.

కావలసిన సామగ్రి:- ఒక సేరు పాలు 2 చటాకుల పెరుగు, చక్కెర, జాజికాయ, బాదాము పలుకులు, కుంకుమపువ్వు ఏలకులు కొంచము ఉప్పు.

శ్రీఖండము చేయువిధము:- మొదలు ఒక సేరు మంచిపాలను తీసికొని, రాత్రి తోడు వేసి మూతవేసి పెట్టవలయును. మరునాడు ఉదయమున బాగుగా తోడిన యా పెరుగును ఒక శుభ్రమైన తెల్లని గుడ్డలో వేసికట్టి ఒక కొయ్యమీద దానిపై వేయవలయును. తరువాత సుమారు 4 గంటలయిన పిదప కొయ్యనుండి గుడ్డలోని పెరుగును తీసికొనవలయును. అట్లు కొయ్యకు ఆ పెరుగు మూట కట్టినప్పుడు దాని క్రింద ఒక పాత్ర యుంచవలయును. అట్లు చేసిన పెరుగులోని నీరు పాత్రలోపడును. తరువాత పాత్రలోని నీటిని పడవేయవచ్చును. అట్లు ౪ గంటలు ఉంచిన పెరుగును తీసుకొని ఒక పిండిజల్లెడయు .ఒక గిన్నెయును తీసికొని, జల్లెడలో ఒక గరిటె పెరుగును, సగము గరిటె చక్కెరయు వేసి కలపిన అది ఏకమై గిన్నెలో పడును. ఆ ఏకమైన పెరుగు, చక్కెరను తీసుకొని ఒక కోప్పులో కుంకుమపువ్వునువేసి బాగుగా కలిపి ఆ పెరుగులో వేసిన దానికి ఆ రంగు పట్టును. దానిలో అప్పుడు బాదాముపలుకులు, ఏలకులు, మొదలగు రుచిగల్గించు వస్తువులను వేసిన చాల రుచిగా యుండును. ఇష్టమున్నచో కొద్దిగా ఉప్పువేసికొనవచ్చును. దీనినే శ్రీఖండమందురు. ఇదిపూరీలతో అద్దుకొని తిందురు. చాల రుచిగానుండును.

## సిరా.

కావలసిన సామగ్రి:- గోధుమరవ, పంచదార, నెయ్యి, పాలు లేక నీళ్లు, బాదాము పలుకులు, వేలకులు, కిస్‌మిస్ మొదలగునవి.

చేయుటకు పరిణామము:- ఒక సేరు రవ ఉంటె దానికి సగం పంచదార, ఒక పావుసేరు నెయ్యి, మొదలగునవి.

చేయువిధము:- మొదలు ఒక పాత్రను పొయ్యిమీద ఉంచి అది వేడిఅయిన పిదప నెయ్యివేసి దానిలోరవ్వను వేసివేయించవలయును. ఆ రవ్వ గోధుమ వర్ణమును దాల్చినప్పుడు నీరు లేక పాలు వేయవలయును, అది ఎక్కువగా పోసినయడల పల్చనగును. కావునతగినట్టుగా వేయవలయును. నిప్పులమీదనే పాత్రను ఉంచవలయును. అప్పుడు ఆ రవ్వ మెత్తనగును. అప్పుడు దానిలో పంచదార వేయవలయును. అట్లు వేసినప్పుడు బాగుగా కలుపవలయును. రవ్వతో గూడ పంచదార వేయవచ్చును. తరువాత ఆవిరి వచ్చినప్పుడు దానిని తీసి, బాదాము పప్పు మొదలగునవి రుచికరములగు వాటిని వేయవలయును. కొద్దిగా పాలలో కుంకుమ పువ్వును నానబెట్టి ఆ తయారయిన రవ్వలో వేసిన బాగుండును. దీనినే సిర యందురు. ఇది చాల రుచిగానుండును. దీనిలో అరటిపండ్లుగూడ ముక్కలుగ కోసి వేసెదరు.

# షడంగములు.

శ్రీయుత శిరోమణి, కే. ఆర్. నటరాజశర్మ, (ఆస్థానపండితుఁడు, సింహపురపీఠము.)

వేద పురుషునకు నేత్రము, శ్రోత్రము పాణి, పాదములు, నాసిక, వదనమనెడి యారంగములు. ముఖము వ్యాకరణము, జ్యోతిషము నేత్రము, శిక్ష నాసిక, కల్పము హస్తము, నిరుక్తము శ్రోత్రము, ఛందస్సు పాదము. కారణము నడుగకయే, ధర్మములను, వేదమును, షడంగముల నభ్యసింపవలయునని శ్రుతి వక్కాణించుచున్నది. ప్రాచీనులకు షడంగ వేత్తలని బిరుదులుండినవి. అనగా, నారంగముల నెరిగినవారని యర్థము. తమిళభాషలో "శడంగు" అని వైదిక కర్మల కుపయోగింపఁబడు శబ్దము షడంగ శబ్ద వికృతియని యూహింపవచ్చును.

ఒకరి హృదయములోని భావమును మఱియొకరికిఁ దెలియఁజేయుటకుగాను వివిధ భాష లేర్పడినవి. భాషను జక్కఁగా వాడుటకు వ్యాకరణ జ్ఞాన మత్యావశ్యకము. వ్యాకరణ జ్ఞానము లేనివారు విశృంఖలముగ వ్యవహరింతురు. భాషా సౌష్ఠవ మించుక లోపించుటయేగాక, విద్వాంసుల దృష్టిలో వారుచ్చరించు నవన్నియుఁ బ్రలాపములుగాఁ గానిపించును. వ్యాకరణముచే వాక్శుద్ధిని సంపాదింపగలము. ముఖ్యముగ వేదమంత్రముల నుచ్చరించు నపుడు స్వరముల యందు జాగరూకుడై యుండవలెను. స్వరములు తప్పిన యెడల అర్థమును మారుచుండును. త్వష్ట అను నతడు వృత్రుని జన్మము కొఱకై హోమము ననుష్ఠించి స్వరము తప్పినందున క్లేశ పడినట్లు మహా భాష్యమువలన తెలియుచున్నది.

"మంత్రో హీనః స్వరతో వర్ణతో వా మిథ్యాప్రయుక్తః నతదర్థమాహ। సవాగ్వజ్రో యజమానం హినస్తి యథేంద్రశత్రుః। స్వరతోఽపరాధాత్ ॥" అని పతంజలి మహర్షి.

సంస్కృతములో నిపుడు ప్రచారములో నున్నది పాణినీయము. "యో బ్రహ్మాణం విదధాతి పూర్వంయో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" యను తొలిపలుకుల రీతిగ శాస్త్రములు, స్మృతులు, శ్రుతులు భగవత్ప్రసాదితములని విద్వదభిప్రాయముగాన పాణినీయ వ్యాకరణమును ఇంచుక ముచ్చటింతము.

పరమశివుడు తాండవ మాడునపుడు నటరాజమూర్తి యనఁబడును. ఇతని తాండవమును సనకాదులు దర్శింపఁగలిగిరి. అతని విగ్రహమును చూచిన వారికిది స్పష్టమగును ఛాయా చిత్రములలో Snapshort అనునది యొకటి. ఒక వస్తువతి వేగముగ చరించునప్పుడు తీసెడి ఫొటోను స్నేప్‌షాట్ అని వాడెదరు. నటరాజమూర్తి తాండవావసానమును శిల్పి తన

మనసులో దీసిన స్నేప్‌షాటే ఆ విగ్రహము, సనకాదులు మహాతపస్వులు గనుక పరమశివుని తాండవమును దర్శించగల్గిరి. నటరాజు కరమున డమరుకము గలదు. నాట్యమును ముగించున ప్పుడు డమరుకమునుండి యుద్భవించిన నాదము లనే పాణిని మహర్షి సూత్రములుగా నేర్పఱచి అష్టాధ్యాయి యనెడి గ్రంథమును రచించెను. నందికేశ్వరుడు వానినే శివ సూత్ర ములు గాం గైకొని వేదాంతార్థములను వివరించెను.

పాణిని ప్రణీతంబగు సూత్రములకు వర రుచివార్తికములను పతంజలి భాష్యమును రచించిరి. వ్యాకరణ భాష్యమునకు "మహా భాష్యము" లని పేరు ఆ నామమే భాష్యమునకుగల మహిమను చెప్పకయే చెప్పు చున్నది.

ఇట్టి మహనీయులచే అనుగ్రహీతమగు వ్యాకరణ శాస్త్రము సంస్కృతభాషకు మహో పకారము చేయుచుండుట క్రొత్తగాదు భాషను చక్కగ నుచ్చరించి యథ్యాయర్థములను సమ యోచితముగ వాడుట కుపయుక్తమైనందున వ్యాకరణ మావశ్యకమై యున్నది. మఱియు వైదిక కర్మలయందు కతిపయ క్రియల ననుష్ఠించు నపుడు మంత్రములను మార్చవలసి యుండును. అట్లు మార్చుటకే మీమాంసా శాస్త్రమందు "ఊహ" యని వాడుదురు ఈ సమయమున వ్యాకరణముపకరించుచున్నది. గాన వైదిక కర్మల ననుష్ఠించుటకును వ్యాకరణము ముఖ్యము గనుక వేదాంగమైనది.

శిక్ష "ఇది వేదమునకు మఱియొక యంగము. ప్రకృతము ప్రచారములో నుండు నది పాణినీయ శిక్ష. వేదమంత్రములలో నక్షర ములకును స్వరమునకును ప్రాధాన్యమధికము. తేలు మంత్రమునకు అర్థము చెప్పుట లేదు. ఇట ఆ శబ్దములకే యట్టి యోగ్యత యున్నది. బల్లిశూన్యమంత్రమని యొకటి గలదు. ఈ మం త్రోపాసకుల దంతములను భగ్నపరచినచో వా రుచ్చరించు మంత్రములు సారహీనములగును. శాస్త్రమంత్రములను ఇంగ్లీషులోనో తెలుగులో నో యను వదించవచ్చునుగాని సంస్కృత శబ్దము లకే యచ్చట ఫలప్రదత్వము గానిపించు చున్నది. అట్టి యుచ్చారణమును నిర్ధరించునది శిక్ష.

ఒకటే మంత్రమును వివిధ దేశస్థులు వివిధముగ నుచ్చరింతురు. వీనిలోనే యుచ్చారణ గ్రాహ్యమనెడి సందియము గలుగవచ్చునుగదా! అందులకై శిక్ష కావలసియున్నది.

అక్షరముల యుత్పత్తిని, ఉత్పత్తి స్థాన మును, స్వరములను సరిదిద్ది బోధించునది శిక్ష. పై జెప్పిన రీతిని వేదములో నక్షరములకు ను స్వరములకున్ను ప్రాధాన్యమున్నది. గాన శిక్ష వేదాంగమగుచున్నది.

ఛందస్సు:- వేదమునం బలువిధములైన ఛందస్సులు గలవు. వాని లక్షణము నీ శాస్త్ర మెఱిగించును. గాయత్రి అను ష్టుప్, మొదలగు ఛందస్సులు వైదికములు.

లౌకిక భాషయందును పద్యములలో పలువిధములగు వృత్తములు గలవు వృత్త లక్ష ణములను జెప్పునదే ఛందస్సు.

అక్షరములకు రక్షగా నుండునది శిక్ష శబ్దములన్నిటికి రక్షగా నుండునది ఛందస్సు. ఐచ్ఛికముగ నక్షరములను హెచ్చించుటకాని,

తగ్గించుగాటని యుక్తముకాదు. ఏలయన వేద మాహాత్మ్యార్థమైనది.

ఒక్కొక్క మంత్రమునకును ఛందస్సు దేవత, ఋషియనునవి కానిపించుచున్నవి. ఋషులు మంత్రద్రష్టలనియు మంత్ర ప్రచార కులనియు నార్యుల సిద్ధాంతము. గావున వార నుగ్రహించిన మంత్రముల నుచ్చరించు నప్పుడు శిరస్సును తాకుట, వారి పాదములను శిరసా వహించుటయని భావింప వలయును. మంత్రము లకు ఊపిరినట్టిది ఛందస్సు.

"ఛంద: పాదో వేదస్య" అని యున్నది. పాదములులేక నిలుచుట దుర్లభముగదా?

నిరుక్తము:- వేదశబ్దమునకు నిరుక్తము కోశమువంటిది. పదముల ప్రయోజనములను వాని అర్థమును దెల్పును. పాశ్చాత్యులు వ్యాకరణ శాస్త్రమును నిరుక్తమును జక్కగ పరిశీలించి భాషాశాస్త్రమును నిర్మించిరి. వేదార్థము నెరుంగుటకు నిరుక్త ముపయుక్త మగుటచే వేదాంగ మయినది.

జ్యోతిషము:- జ్యోతిషములో మూడు స్కంధములు గలవు. సిద్ధాంత స్కంధము, హోరా స్కంధము, సంహితా స్కంధమని మున్నగు, పలువిధములగు గణితములుగా సిద్ధాంత స్కంధములో ఇమిడియున్నవి.

సంఖ్యలను స్పష్టపరచి ఫలముల జెప్పునది వ్యక్తగణితము. అవ్యక్తమనునది సంఖ్యను నిర్దేశించక A. X. ఇత్యాదులను నుపయోగించునది. సమీకరణ మనునదియు ఒక విభాగము దీనినే equation అనెదరు.

కల్పసూత్రములకు సిద్ధాంత స్కంధ సహాయము మిక్కిలి కావలయును. శుల్బసూత్రములయందు మానవుడనుష్ఠించ వలసిన కర్మలును, తత్విధానములును నిరూపింపబడి యున్నవి. యజ్ఞములను గురించి చెప్పునపుడు గరుడాకృతిగ చయనమును కుదిర్చి యజ్ఞము చేయవలయునని యున్నది. ఇటికల నాము వేయు పద్ధతి వాని కొలతలు మొదలగు విషయములే సూత్రములయందుగాని పించును. ఆపస్తంబ శుల్బ సూత్రముల యందొక విధమైన equation యున్నది. దానిని విశద పరచుటకు యత్నించుచున్నారు.

నక్షత్రములు, గ్రహములు, వీని గతులను స్థితులను నిరూపించునది గణిత శాస్త్రము. నక్షత్రములు చలనముతో ప్రకాశించును. గ్రహములు చలనములేక నిలచియుండును.

ఒక కార్యమును ప్రారంభించినప్పటి గ్రహకాలరీతులను గ్రహించి రాబోవు ఫలముల నెఱింగించునది హోరా స్కంధము. నీరెట్టి భూములలో సమృద్ధిగా నుండును? ఎట్టి భూములలో నది ప్రవహించగలదు? లోపల నీరున్నచో పైభాగమందలి చిహ్నములెట్టివి? మున్నగు విషయములను నిర్ధరించునది సంహితా స్కంధము. గణితమును గ్రహ గతులను చెప్పునది సిద్ధాంతము. మనుష్యుల సుఖ దుఃఖములను జెప్పునది హోర, ఇతర విషయములను విశదీకరించునది సంహిత.

నిరాలంబమగు నాకాశములో గ్రహములు కదలక నిలబడి యుండుటకు కారణమును Newton అనునతడే కనిపెట్టెనని కొందరు భావించవచ్చును; గాని యతిప్రాచీనమగు

సూర్య సిద్ధాంతాది గ్రంథములయందు భూమికి ఆకర్షణశక్తి యున్నట్లు తెలిపియే యున్నారు. ఒక వస్తువు నాకసముపై కెగురవేసిన ఆ వస్తువు మరల భూమియందే పడుచున్నది. ఇది భూమికి గల యాకర్షణ శక్తియగునుగాని వస్తువుయొక్క గుణము కాజాలదు. కర్మానుష్ఠాన పరాయణులు చెప్పుకొను సంకల్పము లన్నియు జ్యోతి శ్శాస్త్ర మునకు సంబంధించినవే.

ఒక ఇంటియొక్క పైకప్పులోని రంధ్రము నుండి సూర్య కిరణము ఇంటియందు బడిన మరు సంవత్సర మదే కిరణ మిచ్చోట పడగల దనిన సమాధానమునకు జ్యోతి శ్శాస్త్రమే శరణము. ఇతర శాస్త్రములందు వాక్యార్థములను చేసి సంభావనలు పొందుట సులభముగాని జ్యోతిశ్శాస్త్రములో ప్రత్యక్షముగా ఫలములను చూపి గౌరవములను పొందవలసి యున్నది. "ప్రత్యక్షం జ్యోతిషం శాస్త్రం." వైదిక కర్మల నుష్ఠించువారికి తిథికాలము దేశము, తిథులు మున్నగు ముఖ్యాంశములను బోధించుటచే జ్యోతిషము వేదాంత మయినది.

కల్పము:- కార్యములను చేయునది కరము. జ్యోతిషము మున్నగువాని నెరింగి వేదాధ్యయనము చేసిన తరువాత మనము చేయవలసిన దేమి? ఏదో యొక పనిని చేసి తీర వలయును. మనకిచ్చ వచ్చినట్లు చేసి సంపాదించిన పాపములను పోగొట్టుకొనుటకు కొన్నికర్మల ననుష్ఠించవలయును. ఆ కర్మల ననుష్ఠించుటకు మంత్రములు ద్రవ్యము, గృహము దానికి వాస్తు లక్షణము కావలసియున్నవి. వీనిని బోధించునది కల్పము. కల్పోక్త రీత్యా కర్మలనుచేసి ఈశ్వరార్పణము చేయవలయును. బాలబ్రాహ్మణుడు వేదముల నధ్యయనముచేసి తత్ఫలమును భగవంతుని కర్పించవలయును. శిల్పితన విద్యను భగవంతుని బింబముల నమర్చి ఈశ్వరుని కర్పించును. ఇది మన దేశసంప్రదాయము. అన్యదేశములలో నిట్టివి కాన్పించవు. కోరికలు నమర్చుటకును వనము లేర్పర్చుకొనుటకును మిక్కిలి భేదమున్నది. మొదటిది నేత్రములకు ఆనందము నిచ్చును. రెండవది పుష్పములు ఈశ్వరున కుపయుక్తమగుటచే చెందును.

కర్మలకు సంబంధించిన మంత్రములను దేవతను ద్రవ్యమును ఋత్విక్కుల సంఖ్యను పాత్ర విశేషములను ఆశ్రమోచిత కర్మలను తెల్పునది కల్పము. భగవదనుగ్రహీతంబగు వేదములను అధ్యయనము చేయుటకును తద్గర్భ జ్ఞానమునకును, కర్మానుష్ఠానమునకు తద్వారా చిత్తశుద్ధి పొందుటకును పిమ్మట జ్ఞానమును సంపాదించుటకు నీ షడంగములుపయుక్తములై యుండుటచే ఆత్మశ్రేయస్సును కోరువాడు షడంగముల నభ్యసింతురుగాక.






సీ॥ ఏవ్వాని పేరిమచే నెల్లజనులహృద
 య్జంబుల పరిభుభక్తి నాలనిండె
ఎవ్వాని యశముల నెల్ల దేశములందు
 నాటెనో యేల్బడి నాఁటి నుండి
ఎవ్వాని ముఖ పద్మ మెలమి సరస్వతీ
 దేవికి సదనమై శివిమీరు
ఎవ్వాని దేశ సేనెల్లప్పుడునుఁ బ్రజా
 మోదంబునందుచు మురువుసూపు

గీ॥ అవని స్త్రీవిద్య కొఱకుఁ దానతి ప్రియత్న ।
సంచయ మొనర్చు మ. ఘ. వ. నైజాము ప్రభువు ।
మాతృభాషాభివృద్ధికై ప్రీతినెఱపు ।
చున్న మా బడిని మరునకుండు గాక ॥

వం. జయలక్ష్మీదేవి,
(నాల్గవ ఫారము)



సీ॥ తలపైఁ గిరీటంబు । ధరియించుటాదిగాఁ
 బ్రజకు నీకునభేద । పరత నెఱపి
మతరాజకీయ ప । ద్ధతులకుం బొందించి
 రెండింటననమకీ । ర్తిని గడించి
దేశ భాషలకు సు । స్థిరత సంపాదింప
 మొగ్గి యద్భుత కార్య । ముల నొనర్చి

భువి ధనాఢ్యుల నొక్క । ముఖ్యుండనయ్యును
సరళజీవనమె శ । స్తముగఁ జూపి

గీ॥ భాగ్యనగరాన నేఁడు మా । భాగ్యకలనఁ ।
దలచు బీరారు వలకుఁ జం । ద్రిధ్వజ ప్ర ।
భలు నెఱయఁ బర్వ, రజతోత్సవమ్ము జరపు ।
కొనుట కనులకుంబండువై । గోరెమాకుఁ ।
జిరతరాయుఃప్రపూర్ణతఁ । జెలగుమయ్య !
మ. ఘ. వ. ఉస్మానలీ నిజా । మ్ప్రిభువరేణ్య !!

మ॥ నిజసామంత మహీప మంజుమకుటో । న్నిద్రప్రభానూత్నర ।
త్నజ విద్యుత్తులు, మోహనైక భవదు । ద్యత్కీర్తి రోచుల్,శశి ।
ధ్వజచంచత్సుషమానుభావములు వి । శ్వవ్యాప్తిఁగై సేయఁగా ।
భజితంబై రజతోత్సవంబెపుడు మీపాలన్ విడంబించుతన్ ॥

సీ॥ న్యాయనిర్భరదీక్ష । వేయునోళ్లఁబొడు
నుద్గత ప్రజలబా । హోద్గమములు
తనురుజాసంవిము । క్తతఁ బూర్ణశక్తుల
లోలసుస్మితభరా । లోకనములు
భద్రసాగరముల । పసిడికారుంబంట
మెలపు వడ్లవెలంది । మిసమిసలును
విశ్వకళాభిని । వేశభాసురములౌ
విద్యార్థి జనమనో । వికసనములు ॥

గీ॥ సవతి పోరంచులేక రా । జ్యరమతోడఁ ।
గులుకు జయలక్ష్మి మురిపెంపు । విలసనములు ।
క్రమసుమమాలయయి, యింద్రకార్ముకమయి ।
మించి మీకెల్లరకు నివా । ళించుఁగాక ॥

బి. వి. శేషయ్య బి. ఏ.
(ముఖ్య సంపాదకులు)

౧॥ నైదుష్యం ప్రకటీ కరోతినృపతే తే విశ్వవిద్యాలయః
న్యాయాసక్తిమిహావ్యనక్తిమహతీంసాన్యాయశాలాపరా ।
కారుణ్యం కథయత్యనన్యసులభం వైద్యాలయస్త్రావకః ।
బోద్ధా న్యాయకరశ్ఛికత్సకమణిస్త్వం రాజకంఠీరవ ॥

౨॥ గాంభీర్యేణ జితోర్ణవోత్రిభజతే స్వాపాంతటాకాత్మతాం ।
లోకానందకృతౌ వినిర్జితవిధుర్థత్తేతనుం వైద్యుతాం ।
ధౌరం ధర్యగుణేః సమాచధరణీరత్నానియచ్ఛత్యసౌ ।
నైజాంరాజ్యరమాకటాక్షవసతే కారుణ్యపాథోనిధే ॥

౩॥ ఏషా పూరమరావతీ విమలవాః పూరా చమందాకినీ ।
పౌరా దేవగణా విశేషధిషణః కృష్ణప్రసాదో గురుః ।
లోకాతీత మహాగుణోజ్వల తను స్త్వంవాసవోనిశ్చయం ।
చిత్రించైతదిహాస్తి తత్రిభవతో గోత్రానురాగఃకథం ॥

౪॥ పంచానాం శరదాంచపంచకమిదం త్వద్రాజకీయంవయః ।
వాల్లభ్యాయతనం విలోక్య ముదితా బీరారసీమంతినీ ।
ఆమోదోల్లసదుత్పరాగసు మనోగ్రైవేయకంన్యస్యతి ।
భూయాస్త్వం రసధామదక్షిణగుణ శ్రీరాజదుస్మానలీ ॥

౫॥ భూయాత్తే రజతోత్సవస్సుమనసాముల్లాసిభానూదయః ।
సౌవర్ణోత్సవమాతనోతు భగవాన్ రత్నోత్సవం చోత్తమం ।
త్వం లోకశ్చ పరస్పరం వినమయశ్రీక్రాభజేతంసుఖం ।
పుత్రైఃపౌత్రగణైర్యుతాయ భవతే స్వస్త్యస్తు లోకాధిప ॥

వ్యాకరణ శిరోమణి
సి. హెచ్. రంగాచార్యులు
(సంపాదకులు.)



# ప్రస్తుత ప్రారంభ చికిత్స

శ్రీయుత. ఇజైరిలున్నగారు. (డాక్టరుగారు.)

ప్రస్తుత ప్రారంభ చికిత్సయనగా గాయములు పొందిన వారలకును, అపాయములో నున్న వారలకును జేయఁదగు ప్రారంభ సహాయము. ఇది మానవులెల్లరు నేర్చుకొనఁదగు ప్రత్యేక వైద్య విద్య! ఈ విద్య నభ్యసించిన వారు లోకమునకుఁ జెప్పనలవిగాని యుపకారముఁ జేయగలవారై యుందురు. ప్రాణాపాయములో నున్న వారిని, బరుదాంకితుఁడైన డాక్టరు లేక వైద్యుఁడు వచ్చువరకు కాపాడి యొకా నొకప్పుడు ప్రాణ భంగము నుండియునుఁ దప్పింపఁగలరు. "ఇట్టి లోకోపకారమైన జ్ఞానమును మానవు లెల్లరును స్త్రీ పురుష భేదములేక నభ్యసింపవలయునని, సెంటిజాన్సు అంబులెన్సు సొసైటీవారు 1877 సంవత్సరమున నొక సంఘమును స్థాపించి, ప్రపంచ మంతటను ఈవిద్యను వ్యాపింపఁజేయ నారంభించిరి. ప్రస్తుత మీవిద్య లోకమంతయు వ్యాపించి యుండుటవలన, నపాయమును, ప్రాణహానిలో నున్న వారలను రక్షించు చున్నారనుటకే సందియము లేదు.

ప్రతిగురువు తమ విద్యార్థులకును, తల్లిదండ్రులు తమ బిడ్డలకును ఈ ప్రస్తుత ప్రారంభ చికిత్సను, నేర్పుటత్యావశ్యకము. ఈ విద్య నభ్యసించుటవలన, నపాయములో నున్న వారికి ప్రథమ చికిత్సలు జేయుటయేగాక ప్రపంచ జ్ఞానమునకు సహాయ పడును. ఇదియేగాక నీ చికిత్స నెరింగిన వారెల్లరును తమ దేహ సౌఖ్యమునకుఁడు జాగరూకతతోఁ గాపాడుకోఁ గలిగియుందురు. తమ నిజ గృహముల యందున్న శిశువులకును ఇరుగున నున్న వారలకును సహాయకులుగా నుందురు.

ఈ ప్రస్తుత ప్రారంభ చికిత్స నభ్యసించినవారు అపాయములో నున్న వారికి, డాక్టరు వచ్చువరకుఁ జేయవలసిన చికిత్సలఁ జేయుచు కాపాడగలరు. ఇట్టి అపాయమునకు కారణముల గుర్తెరిఁగి దానికిఁ దగు నుపాయములను జేయగలరు అట్టి సహాయమును జేయుట కెవరికిని దెలిసియుండని యెడల డాక్టరు వచ్చువరకు రోగికి ప్రాణహాని సంభవించుట అసంభవముగాదు.

ఏ విధముగనైనను, ఎవ్వరికైనను గాయములై రక్తము ప్రవహించుచున్న యెడల, ముందు ఆ రక్తమును నిలుపుటకు ప్రయత్నము జేసెదరు. దెబ్బ తగిలిన భాగమున కట్టు మొదలైన చికిత్సలఁజేసి దిండు మొదలైనవాని సహాయమున నాభాగము నేస్థితిలోనుంచుటకు వీలగునో, నా విధమున నుంచగలుగుదురు. రోగిని పరిశుభ్ర

మైన వాయువుగలచోట నుంచి, బాధితుల నధైర్య పడకుండ మంచిమాటలతో హెచ్చరించి వారి బాధలను మఱచునట్లుజేసి కాపాడుదురు. ఇట్లు చేయుటవలన, నీప్రస్తుత ప్రారంభ చికిత్స నేర్చినవారులోకోపకారపరులగుదురు. ఇది దేశసేవలో నొక భాగము, మానవ సేవ యందు ముఖ్యమైనది, మానవుని యావశ్యక కర్తవ్యములలో ప్రధానమైనది. విశ్వ మానవ ప్రేమకు కేంద్రీభూతము, విశ్వసోదర ప్రేమకుం బుట్టినిల్లు, భూతదయకాటపట్టు, అభేదభావమును, సమబుద్ధినిం గలుగజేసి సర్వమానవైక్యతను సమకూర్పగల సాధన మిది యొక్కటియే. ఈ ప్రథమ చికిత్సకులు జనుల ప్రేమను సులభముగాం బొందగలుగుదురు. ఏలయన అపాయ స్థితిలో నున్నవారు తమ ప్రాణము రక్షించువారికొరకై మిగుల ఆవేశముతో వెదుకుట సహజము. తగు చికిత్సవలన తమ ప్రాణ రక్షణమొనర్పం జాలినవారు లభింప వారెట్టి యానందమును బొందుదురో యది యూహాతీతము. అనుభవజ్ఞులకుదప్ప తదితరుల కెరుంగనలవిగాదు. పిమ్మట వారు వీరియెడల కృతజ్ఞులై యుందురని వేరే చెప్పవలసియే లేదు. సర్వసాధారణముగా మానవులందరు డాక్టరులై యుండుట దుర్లభము. గాన నీసెంటుజాన్సు అంబులెన్సు సొసైటీ వారేర్పరచిన యీప్రస్తుత ప్రారంభ చికిత్సను, నేర్చుకొని, కొలదిగనో, గొప్పగనో లోకోపకారులమై బ్రదుకుట యుక్తము.





# సవతితల్లి ప్రేమ

శ్రీమతి యస్. లోపాముద్ర [నాల్గవ ఫారము].

ఒక ఊరిలో గోపాలరావుఅనే ఒక బ్రాహ్మణుడుండెను. అతడు లక్షాధికారి, జిల్లా కోర్టు ప్లీడరు. గోపాలరావు మొదటి భార్యకు ఇద్దరు కొడుకులు ఇద్దరు కుమార్తెలుండిరి. రెండవ భార్య వచ్చిన తరువాతకూడ పిల్లలు సవతి తల్లియందు అతిప్రేమగా నుండిరి. వారియందు ఈమె అతిగారాబముగా చూచుచు నుండెను. ఆమె సవతి పిల్లల పేర్లు రాముడు, కృష్ణుడు, ప్రమీల శ్యామల. ప్రమీలకు చిన్న తనమునందే పెండ్లిచేసి అత్తవారింటికి పంపిరి. ప్రమీల చిన్న తనములో చదువు లేకుండెను. కాన ఆమె చదువుకొనలేదు. శ్యామల పెద్దదైనప్పటికి ఆ యూరిలో చదువుచుండుటచే ఆమె చదువుకొనెను. అప్పటికి ఆమె సవతితల్లికి పిల్లలు లేకుండిరి.

రామ కృష్ణు లిరువురును మెట్రిక్యులేషన్ చదువుచుండిరి. అప్పుడు శ్యామల ఫిప్తుఫారము చదువుచుండెను, అప్పుడు శాంతమ్మగారు (వారి సవతితల్లి)కి ఆడుపిల్ల జనించినది. అప్పటినుండియు శాంతమ్మగారు "ఆడుపిల్లలకు చదు వెందుకని వాదించు చుండెడిది. శ్యామల పాఠము రాత్రి ౧౦ గంటలు మొదలుకొని ౧౨ గంటలు వఱకు చదువుకొనుచు పగలంతయు పనిచేయు చుండెడిది. తండ్రితో చెప్పిన శాంతమ్మగారు కోప పడుదు రేమోఅని భయముచే ఏమియు చెప్ప చుండెడిదికాదు. అటులనే ఎంతో కష్టముచే మెట్రిక్ లో ఉత్తీర్ణురాలయినది.

ఒకనాడు గోపాలరావుగారు భోజనము చేయుచు నిట్లనిరి, "శ్యామలా నిన్ను మెడ్రాసు లోనుంచి, చదువు చెప్పించవలెనని యున్నది." "నాన్న గారు! నాకు చ దు వ వ లె న ని కోరిక యున్నది. పిన్నమ్మగారు చదువనీయరు" అని శ్యామల బదులు చెప్పినది! "నీకు చదున వలెనని యున్నచో మీ పిన్నమ్మగారి లెక్క ఏమి" అనిరి.

* * * *

శ్యామల మెడ్రాసు వెళ్లినది. అప్పటికి కృష్ణారావు, రాముడువెళ్లి నాలుగేండ్లయినది. శ్యామల మెడ్రాసులో ఉండి బి. ఏ. వరకు తప్పకుండ ఉత్తీర్ణురాలై డాక్టరు చదువుటకు నిశ్చయించెను. మెడ్రాసులో ఉన్నప్పుడు ఆ విడకు చాలకులాసాగా ఉండెడిది. డాక్టరు పరీక్షయందు ఐదు సంవత్సరములు తప్పకుండ ఉత్తీర్ణురాలైనది. తరువాత ఆబిడ అన్నలు కూడ పరీక్షలలో ఉత్తీర్ణులైరి. రాముడు ఇంజనీరు కాలేజిలోను, కృష్ణుడు డాకరును చదివిరి. ముగ్గురును మెడ్రాసులోనే పెద్దబంగళాతీసికొని యున్నారు. కృష్ణుడు శ్యామల ఇద్దరుఒకే ఆసుపత్రిలో పనిచేయుచుండిరి. వారు అన్నమాటకు జవదాటుచుండెడివారుకారు. వారు ఉద్యోగమైనప్పటినుండియు వారిఅక్కయగు ప్రమీలను తీసికొనివచ్చి అమెయాజ్ఞలోనుండిరి.

ప్రమీల అత్తవారింటనుండి వచ్చుటకు అదే మొదటిసారి. కాన ఆసంగతి గోపాలరావునకు తెలిసి భార్యకు చెప్పకుండనే కూతురును వచ్చిచూచివెళ్లెను. సవతితల్లికి ప్రేమ లేకపోయినచో తండ్రికి ఉండి ఏమిలాభము.?

అప్పటికి శాంతమ్మగారికి ఒక్కకూతురు, ఒక్క కొడుకు. కూతురు మీర. సవతి అన్నలమీద చాలప్రేమగలది. కొడుకు ధ్రువుడు. చాల తెలివిగలవాడు. ఆమె అప్పుడప్పుడు మెడ్రాసువెళ్లి సవతి అన్నలను చూచివచ్చుచుండెడిది.

ఒకసారి మీర తనసవతితల్లికూతురగు ప్రమీల అత్తవారింటినుండి వచ్చినదని తెలిసినతోడనే తమ్ముని, తండ్రిని ప్రయాణముగావించి ఆమెను తమఊరికి రప్పించుకొనెను. కానిసవతితల్లిమాత్రము ప్రమీలపై నెక్కువ కోపముతో ఇంటిలోని పనియంతయు ఆమెచేతనే చేయించుచుండెను. ఒకనాడు మీర తన అక్కచేయుచున్నపనిని తాను చేయుదుననియు తన అక్క అత్తవారింట చాలకష్టపడి పనిచేసివచ్చినదనియు తనతల్లికేమియు తెలియదని తానాపనిచేయుచుండెను. ఇంతలో మరల ప్రమీల చిన్నదిచేయుచున్నది అని చాలకనికరముతో చెల్లెలా! ఎవరుచేసిననేమి. పనిపూర్తి అయినదిలెక్క. స్త్రీ అయి జన్మించిన తరువాత పనిచేయుటతప్ప!

నేనేచేయుదును. అమ్మమాత్రము చేయవల సినదేకదాయని అనగా మీర ఊరుకొనక చేయ మొదలుపుట్టెను. ఇంతలోనే తల్లివచ్చి ఆమె ఆపనిముగించుకొనిపోయెను.

ఇట్లు కొన్నిదినములు గడచినతరువాత ధుప్రుడు, మీర ఇద్దరును మెడ్రాసునకేపోయి చదువుచుండిరి. తనబిడ్డలిద్దరిని సవతిబిడ్డలదగ్గర ఉంచుటకు శాంతమ్మగారు సమ్మతింపలేదు.

గోపాలరావు ఒకనాడు శాంతమ్మగారి తో తన పెద్దపిల్లలయొక్క వివాహమువిషయము ప్రసంగించగా శాంతమ్మకు కోపమువచ్చి అట నుండిలేచిపోయినది. అప్పటినుండియు గోపాల రావు వారివిషయమేదియు ఆమెదగ్గర యెత్త కుండిరి.

ఇట్లు కొన్నిదినములైనతరువాత శాంత మ్మకు గొప్ప జబ్బుచేసినది. పిల్లలను పిలిపించ మని కోరగా గోపాలరావు అందరిని రమ్మని ఉత్తరము వ్రాసినాడు. పిల్లలందరును బయలు దేరివచ్చినారు. శ్యామల డాక్టరేగావున తల్లికి తగిన ఉపచర్యచేయుచు తగిన పథ్యముపెట్టుచు నిరాశగాచేసిన జబ్బును కుదిర్చెను. అప్పటినుండి యు శాంతమ్మగారు సవతిబిడ్డలపై ఈర్ష్యచూపక ప్రేమతో చూచుచుండెను.

తరువాత అందరికి గోపాలరావు వివా హముచేసెను. కోడండ్రను, కొడుకులను, ప్రి మాలనుచూచి శాంతమ్మ, గోపాలరావు చాల సంతసించి ప్రమీలనుకూడ అప్పుడప్పుడు పిలు చుచుండిరి.

## గురుభక్తి

- శ్రీమతి వై. అనృతమ్మ.

సీ॥ విలు విద్యయందును విమలకీర్తినిగన్న ।
దోణుఁ డందటికన్న దొడ్డవాఁడు ।
లోక విఖ్యాతుఁడు లోకపావనుఁడైన ।
భీష్మునిచేతను పేరువడసి ।
కౌరవ పాండవుల్ కడుహర్షమొందఁగ ।
విలువిద్య నేర్పుచు వేడ్కనుండ ।
నేకలవ్యుండను నెఱుకలవాఁడొండు ।
విలువిద్య నేర్చఁగెడు తలపుతోడ ।
దోణుసన్నిధి కేగికేల్ దోయిలించి ।
యడిగెతన వాంఛఁ దీర్పు మంచార్తిమెరయ ।
జాతి భేదంబునెంచియు చాలుచాలు ।
వెడలుమని తూలనాడె నావైదికుండు ॥

ఉ॥ చింతనుబొంది యామెఱుక సిగ్గున నా నిలయంబువీడియుర్ |
సుంతయు నాలసింపకయ శూన్య మనంబున మెల్లమెల్లగా |
చెంతనెయున్న యాయడవిచేరియుఁ గొండకుచెట్టు క్రిందదాఁ |
జింతిలుచో హఠాత్తుగను జిత్తమునందొక యూహదోపగ |

గీ॥ అధిక వేగముతో నాతఁ డరిగి యరిగి |
శ్రేష్ఠమా మట్టితెచ్చియు చెన్నుమీర |
ప్రతిమ నొకదానిచేసియు భక్తితోడ |
దాని తనగురువంచును దలచె నెఱుక ॥

గీ॥ గురుని ప్రతిమకు ముంగల గూరుచుండి |
విద్య నభ్యసింపఁ గడంగె వేడ్కతోడ |
నట్లు మొదలిడి విద్యల| నన్ని నేర్చె |
కొంత యింతయులేకుండ గుణమయుండు |

సీ॥ పాండవుల్ కౌరవుల్ పదిమందితోగూడి |
ద్రోణునిఁ దోడ్కొని తోఁటకేగి |
వేటకై యట్టిట్టు వెదకిరికాని వా |
రచ్చోట కానరైరడవిమృగము |
చెట్టుచివరకొక్క | చిన్నపక్షిని జూచి |
గురుడు పల్కెను తన కూర్మి శిష్యు |
తోడ, "ఫల్గున ! నీవు| దూరంబునందునఁ |
గన్పట్టునది తెల్పు కల్ల లేక" |

గీ॥ అనగనే పార్థుఁడది గని| యాత్మలోన |
సంతసించుచుఁ బల్కెను| "సచ్చరిత్ర |
చెట్టుపై నున్నదదియొక్క| చిన్నిపిట్ట !
దానివేయంగ నామది| తత్తరిల్లు" ॥

[సశేషము]





# సందేశము.

శ్రీయుత. జవాహర్ లాలు నెహ్రూ పండితులు.

అనువాదకులు : శ్రీయుత రావి నారాయణరెడ్డిగారు

(ఇది ప్రయాగ మహిళా విద్యాపీఠమున నియ్యఁబడినది)

శ్రీయుత సంఘంలాల్ గారువచ్చి, విద్యాపీఠ పట్టప్రదానోత్సవసందర్భమున ఉపన్యసింపుమని నన్ను కోరినప్పుడు, ఆయన విజ్ఞప్తిని'' నిరాకరింపఁజాలక పోయితిని. కాని నేను (కార్యాంతరమువల్ల) విద్యాపీఠపు కన్వొకేషనుకు రాజాలనేమోయని సందేహించుచున్నాను. ఇదినాకు చాల విచారముగాను ఇప్పటికి, అసాధ్యముకావున ఈ క్రింది సందేశమునిచ్చి వెళ్లుచున్నాను.

అర్థభాగమగు స్త్రీలందరును వెనుకబడియుండి విద్యావిహీనలయి, అజ్ఞానులయి యున్నప్పుడు, మనజాతి యభివృద్ధిగాంచలేదు. తల్లులయందు ధైర్యనిపుణతలు లేనిదే ఆ గుణములు సంతానమున కలవడఁజాలవు. మనచరిత్ర, ఎందరో సుగుణవంతులయి, సత్యవంతులయి, మరణమునకుఁగూడ జంకని ధైర్యవతులగు నారీమణుల కథలనుగూర్చి మనకుఁ జెప్పుచున్నది. వారి ఉదాహరణములచే మనకు నూతన ధైర్యోత్సాహములు కలుగుచున్నప్పటికి భారత దేశమునందేమి, ఇతర దేశములందేమి, మొత్తముమీద మానవ సమాజమునందు స్త్రీలు దుస్థితికి పాలయియుండిరని మన నాగరకత, ఆచారములు, చట్టములన్నియును పురుషునిచేతనే నిర్మాణింపఁబడినవి. అతఁడు సంఘమునం దున్నతస్థానము నాక్రమించుకొని, స్త్రీని ఒక వినోదవస్తువుగ పరిగణించి, తన బాధ సంతోషములకొరకయి వినియోగించుకొనియున్నాడు. పురుషుని అధికారమునకులోబడి యుండుటచేతను, సంఘమునందలి అవకాశములు పురుషునితో సమానముగా ఆమెకు లభింపక పోవుటచేతను, ప్రకృతి సిద్ధములగు ఆమె శక్తులను సంపూర్ణముగా వికసింపఁజాలక పోయినందున, ఆమె వెనుకఁబడియున్నదను నేరము మోపెను.

కొన్ని పాశ్చాత్య దేశములలో స్త్రీలు మెల్లమెల్లగా కొంత స్వాతంత్ర్యము పొందుటయందు విజయవతులైరి. భారత నారీమణులయందు, ప్రస్తుతము అభివృద్ధివాంఛగలిగి యున్నప్పటికిని, వారింకను వెనుకబడియున్నారు. మనల నాక్రమించుకొని క్రిందికి లాగుచున్నట్టి ఎన్నియో

యో దురాచారములను, వంశపరంపరగా వచ్చు ఎన్నియో మూర్ఖపు నమ్మకములను మన మేది రింపవలసియున్నది.

ప్రస్తుతమున మన కర్తవ్యము జనసామాన్యముపైనుండు భారములను తీసివేయుటయై యున్నది. భారతనారీమణులను పురుషునిచే విధింపబడిన ఆచారచట్టముల బంధనమునుండి విముక్తి చెందుటయు నొక కర్తవ్యము, వారి ద్వితీయయుద్ధము స్వయముగా జరుపవలసియుండును. పురుష సహాయము వారికి లభింపదు.

కాన్వొకేషనునందు పాల్గొను ఎందరో కన్యకలు, యువతులు, తమతమవిద్యాభ్యాసము ముగించి, డిగ్రీలనుబొంది విశాలతరమగు గోళమునందు కార్యసాధనమునకై ప్రవేశింప సిద్ధముగా నుందురు. వారిలో నెందరో ఆదర్శరహితముగా సంసారపు గందరగోళమునందలి నిత్యకృత్యముల లో నిమగ్నులగుదురని నాకు సంకోచము గలదు. పెక్కండ్రు జీవనోపాధికి మాత్రమే తమ కాలమునంతయు వినియోగించెదరు. విద్యాపీఠము వారికిని మాత్రమే బోధించిన తన కర్తవ్య ముల నెరవేర్పజాలదనియే నేను తలచెదను. మీలో కొందరు అనారోగ్యకరమై, అంధకారబం ధురమగు కనుమలలో నుండనొల్లక కష్టసాధ్యములగు పర్వతారోహణమొనర్ప సమకట్టెదరని నేనెరుంగుదును.

స్త్రీల విద్యావిధానము పురుషులకంటె వేరుగా నుండవలయుననియు, పురుషులు అభ్య సించు విద్యకంటె స్త్రీలభ్యసించు విద్య భేదముగా నుండవలయుననియు కొందరి అభిప్రాయమై యున్నది. మీ విద్యాపీఠముగూడ నిట్టి ఆదర్శమునే బలపరచుననని దలచెదను. ఆమె విద్యా విధానము, ఆమెను గృహకృత్యములకును, స్త్రీలందరిచేతను అచరణయందుంచ బడుచున్న వివాహ మను వృత్తికిని సిద్ధము గావింపవలయును. స్త్రీవిద్యయొక్క ఇట్టి సంకుచితమైన, పక్షపాతదృష్టి తో నేనేకీభవింపజాలును. స్త్రీలకు, సంసారమునందలి అన్ని శాఖలయందును అత్యున్నతమైన విద్య నభ్యసింపజేయుటయేగాక, సర్వవృత్తులయందును, సర్వావస్థలయందును, తమ పాత్రలను జయప్రదముగా, నొనర్చునందులకు శిక్షణయొసంగబడవలయును. ముఖ్యముగా స్త్రీలకు వైవా చును. స్వాతంత్ర్యము, రాజకీయ పరిస్థితులకంటె నెక్కువ ఆర్థిక పరిస్థితులపై నాధారపడియుం హిక, సొంతమగు ఆర్జనలేక, ఆర్థికముగ స్వతంత్రురాలుగాని స్త్రీ ఆమె భర్తపైననో లేక మరొ కరిపైననో ఆధారపడవలసివచ్చును. ఆర్థికముగా నొకరిపై ఆధారపడువారు స్వతంత్రులుగారు. స్త్రీ పురుషులకుండు సంబంధము, ఒకరిపైనొకరు ఆధారపడని సంపూర్ణ స్వాతంత్ర్య స్నేహముల తో గూడుకొని యుండవలయును.

విద్యాపీఠమునందు, విద్యాభ్యాసము ముగించిన పట్టభద్రులును ఇతరులైనమీరు వెలు పల నేమెజేయ సమకట్టినారు? పరిస్థితులెంత హీనముగా నున్నప్పటికిని, కాలప్రవాహమునందుబడి,

వాని నంగీకరించెదరా? వాక్ శూరత్వములో సంతృప్తి జెంది, కార్యసాధనమునకు సమకట్టరా? లేక మిమ్ముల నావరించుకొనియున్న దురాచారములను వీరాంగనలవలె నెదిరించి, మీరభ్యసించిన విద్యను సార్థకపరచుకొనెదరా? మన సోదరీమణుల శారీరక మానసిక బంధనములకు కారణమగు పర్దాను మీరు చించి తుత్తునియలుగావించి, ముక్కలను దగ్ధము జేసివేయరా? మానవ సమాజమును నీచదశకు ద్రోయుచు, ఒకవర్ణమునకు ఇంకొక వర్ణము వారిని, దోచుకో సహాయము గావించునట్టి, ''అస్పృశ్యత'' ''కుల భేదముల''ను ప్రాతికూల్యముచేత నంతమొందించి, సంఘమునందు కొంతవరకు సమానత చేకూర్ప ప్రయత్నింపరా? మీరు మీశక్తి సామర్థ్యములతో ప్రయత్నించి స్త్రీల శారీరకాభివృద్ధికిగాను, వారు పరిశుభ్రమైన గాలియందు వ్యాయామము గావింప నవకాశ మొసంగి వారి జీవిత పద్ధతులను పరిశుభ్రపరచి, భారతదేశము ఆరోగ్యవతులగు సుందర స్త్రీలచేతను సౌఖ్యవంతులగు బిడ్డలచేతను నిండియుండు పనులయొనర్పరా? అన్నిటికంటెను ముఖ్యములై, నేను మన దేశమునకు, చలనము గలుగచేయుచున్నట్టి రాజకీయ, స్వాతంత్ర్యోద్యమములయందు ధైర్యోత్సాహములతో పాల్గొనరా రా?

నేను మీకీ ప్రశ్నలను వేసితినిగాని, వీటికి ప్రత్యుత్తరములు గత నాలుగు వత్సరముల నుండి, భారత స్వాతంత్ర్య సమరమునందు, ముఖ్యమగు పాత్రగైకొన్న వేలకొలది బాలికలు వీరాంగనలు, ఇదివరకే యొసంగియున్నారు. ప్రజాహిత కార్యములతో పరిచయము లేనప్పటికిని వారికుటుంబముల భద్రతను వదలి, భారత స్వాతంత్ర్య సమరమునందు, తమ సోదరులతో సరిసమానముగా భాగము గైకొన్న సోదరీమణుల గాంచిన, ఏవాని శరీరము పులకితము గాకయుండును? పురుషులను పేరుగల ఎందరికో వారు తలవంపులు గలుగజేయుటయేగాక, భారత నారీమణులు నిద్రావస్థలనుండి మేల్కాంచి, తమ హక్కులను గాపాడుకొనుటకు సిద్ధముగా నున్నారని ప్రపంచమునకు ప్రకటించిరి.

విద్యాపీఠములకు జెందిన మీరు, ఈ స్వాతంత్ర్య జ్యోతిని, సనాతనమై, మన కత్యంత ప్రేమపాత్రమగు భారత భూమి యంతయును, ప్రకాశవంతయగునటుల వెలిగించెదరని నమ్ముచున్నాను.

అలహాబాదు.

జనవరి ౧-౨-౧౯౩౪.

# సంస్కృతము

## ఆర్తరక్షణమ్

మెర్సీ [౮-వ ఫారం].

పూర్వం ఏకస్మిన్ దినే శ్రీకృష్ణః బంధుసమేతః బృందావనమగచ్ఛత్। తత్ర యమునా నద్యాం భగవతే సూర్యాయ అర్ఘ్యం దాతుమైచ్ఛత్। తదా "గయో" నామ గంధర్వ రాజః ఆకాశేవిహారం కరోతిస్మ। మధ్యేమార్గంసః నిష్ఠీవనం చకార। తత్ దురదృష్టవశాత్ శ్రీ కృష్ణస్యహస్తే అపతత్। తదా శ్రీకృష్ణః కుపితోభూత్వా గంధర్వరాజంహంతుం శపథం చకార। తతః తాంప్రతిజ్ఞాం శ్రుత్వాగంధర్వరాజః విధాతుర్గృహమగచ్ఛత్। తంశరణ మగమత్। కింతు ధాతా తత్ప్రతిజ్ఞాం శ్రుత్వా "అహం నశరణం భవామి" ఇతిప్రాహ। తతః గంధర్వరాజః గిరీశస్య గృహమగచ్ఛత్। గిరీశో పితత్ శ్రుత్వా "అహం శరణం నభవామి" ఇతిఆహ। తతః గంధర్వ రాజః నారదస్య ఉపదేశం శ్రుత్వా ఫల్గునస్య సమీప మగచ్ఛత్. వీరః దయాళుశ్చ అర్జునః శరణం దదౌ। తతః శ్రీకృష్ణస్య, అర్జునస్య చ యుద్ధం అభూత్। తదాఅర్జునః శ్రీ కృష్ణస్యసమానోభూత్। శ్రీకృష్ణఃదయయా గయస్య అభయందదౌ।





# దానవీరః

వం॥ జయలక్ష్మి [నాల్గవ ఫారము].

కర్ణః దానవీరేషు శ్రేష్ఠః। భారతయుద్ధాత్ పూర్వం భగవాన్ భాస్కరః కర్ణస్య సమీపమాగత్య తమేవం బభాషే। "పుత్ర! అహం భాస్కరః। తవ పితా। కుంత్యాం మయా త్వముత్పాదితః పుత్రవాత్సల్యాత్ తవ కల్యాణం చికీర్షుః అత్రాగచ్ఛమ్ సావధానేన మద్వచనాని శృణు। భావిని భారత సంగ్రామే ఇంద్రః అర్జునక్షేమాయ త్వాం కవచంకుణ్డలే యాచిష్యతే। తదా త్వం తాని న దేహి। యేన తే శుభమ్ భవేత్" ఇతి। ఏవముక్త్వా సూర్యః అంతరధాత్। గతే కాలే కురుపాణ్డవయోః మహత్ యుద్ధం సమజని। తదానీం వాసవః బ్రాహ్మణరూపేణ కర్ణం ప్రత్యయయాచే కవచకుణ్డలాదీని।

కర్ణః సంస్మరన్నపి, పితుర్వాక్యం జానన్నపి, ప్రాణహానిం, దానపరతయా తస్మై తాని దదౌ। కించాస్య మాతా కుంతీ ఆత్మనో జననరహస్యమ్ అన్యేభ్యో మా వేదయ ఇతి వరం వవ్రే। తత్ స్మరన్ యుధిష్ఠిరస్యాపి అగ్రజత్వేన ఆత్మనో లభ్యాం భారతరాజ్యశ్రియం న చకాంక్షే। ప్రత్యుత స్వామిభక్తి పరాయణః దుర్యోధన పక్షమవలంబ్య దైవదుర్విలసితాత్ యుద్ధే వీరస్వర్గమవాప।

పశ్యత! అసౌ యాచకమనస్తుష్ట్యై స్వప్రాణనిదానాని కవచకుణ్డలాని దదౌ। మాతుర్వచసే చక్రవర్తిత్వం తత్యాజ। అతఏవ యశశ్శరీరీ కర్ణః దాతృషు ప్రథమం గణ్యతే॥



# ప్రహ్లాదచరిత్రం.

క. రంగనాయకమ్మ [ పి. మెట్రిక్ ].

పురా ఏకస్యాం నగర్యాం హిరణ్యకశిపుర్నామరాజా బభూన తస్య ఏకఃపుత్త్రః సంభూతః। తస్యనామప్రహ్లాదః సఃహరింసదాపూజయతి తస్యమాతుః నామ లీలావతీ. హిరణ్యకశిపుః స్వంకుమారం హరిభక్తం వీక్ష్య అత్యంతం చుకోప। అతఃహిరణ్యకశిపుః తంబహుధా బబాధే తస్య కుమారస్య బాధాంవీక్ష్య లీలావతీ విచారమగమత్।

హిరణ్యకశిపుః అపృచ్ఛత్ :—కుమార। భగవాన్ కుత్రఅస్తి?

ప్రహ్లాదః :—సర్వత్ర అస్తి.

హిరణ్య :—భగవాన్ అత్రసింహాసనే, ఖడ్గే, స్తంభే అస్తి?

ప్రహ్లాదః :—భగవాన్ సింహాసనే, ఖడ్గే, స్తంభే, అస్తి.

కిం బహునా సర్వత్ర సః అస్తి- తదా హిరణ్యకశిపుః తస్య గదయా స్తంభం అతాడయత్ స్తంభే తదా నరసింహమూర్తిః ప్రత్యక్షీభూయ హిరణ్యకశిపుం అహనత్। నరసింహమూర్తిః ప్రహ్లాదాయ వరం దదౌ.

అత ఏవ "న మే భక్తః ప్రణశ్యతి" ఇతి భగవాన్ గీతాయాం అవదత్॥



# మా తృ భా ర తి



చ తు ర్థ సం పు ట ము



ప్రేమసాగర ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

గౌలీగూడ, హైదరాబాదు - దక్కన్.

# విషయసూచిక.


| | | | | |
|---|---|---|---|---|
| ౧. | సందేశము. | శ్రీయుత బిసురు వేంకటశేషయ్యగారు బి. ఏ. | ... | ౧ |
| ౨. | వెంకన్న | శ్రీమతి నేమాని భారతి. | ... | ౫ |
| ౩. | విద్యాపిపాస | ,, నం. రమాబాయి. నాల్గవ ఫారము | ... | ౯ |
| ౪. | ఆంధ్రభాషాభివృద్ధి కొఱకు | ,, నందగిరి ఇందిరాదేవిగారు, బి. ఎ., | ... | ౧౩ |
| ౫. | ఆదర్శమాత | ,, యం. సి. సత్యమ్మ ఏడవ తరగతి | ... | ౧౬ |
| ౬. | పతిభక్తి | ,, వి. జయలక్ష్మి. మెట్రిక్ | ... | ౧౮ |
| ౭ | నిరాశ | ,, పి. ప్రభావతి. ఆరవ ఫారము | ... | ౨౦ |
| ౮. | బాలికల ఉన్నత పాఠశాల | ,, జి. జయ. ఆరవ తరగతి | ... | ౨౩ |
| ౯. | చింతామణి | ,, వం. రాజేశ్వరీ. నాల్గవ ఫారము | ... | ౨౬ |
| ౧౦. | భక్తి | ,, మ. సావిత్రి. మూడవ ఫారము | ... | ౩౦ |
| ౧౧. | ప్రాచీన హిందూనాగరికత | ,, ఆర్. లలితాదేవి మెట్రిక్ | ... | ౩౪ |
| ౧౨. | కొన్ని వింత ప్రశ్నలు | ,, టి. అంబూతాయి. మెట్రిక్ | ... | ౪౨ |
| ౧౩. | కొన్ని ప్రశ్నలు | ,, ఎ. సావిత్రి. | ... | ౪౫ |
| ౧౪. | కాల ప్రవాహము | ,, ఎ. సావిత్రి. | ... | ౪౮ |
| ౧౫. | దురదృష్టము | ,, క. అనసూయాదేవి. ఐదవ ఫారము | ... | ౫౪ |
| ౧౬ | కృతకృత్యుడు | ,, నే. భారతి | ... | ౫౮ |
| ౧౭. | నా జీవితము | ,, జి. ఆండాళు. ఆరవ తరగతి | ... | ౬౧ |
| ౧౮. | నిర్భాగ్యురాలు | ,, జి. తయ్యు. ఆరవ ఫారము | ... | ౬౩ |
| ౧౯. | మద్యపానము | ,, యం. సి. సత్యమ్మ. మూడవ ఫారము | ... | ౬౫ |
| ౨౦. | ఒక అంకెను కోరుదు ! | ,, జి. తయ్యు. మెట్రిక్ | ... | ౬౮ |
| ౨౧. | సరి పోయినదా ? | ,, సీతారత్నము ప్రాత విద్యార్థిని | ... | ౬౯ |
| ౨౨. | ఓదార్పు | ,, ఎ. సావిత్రి. | ... | ౭౩ |
| ౨౩. | ప్రార్థన | ,, నేమాని భారతీరత్నాకరాంబ. | ... | ౭౪ |
| ౨౪. | చమత్కారము | ,, వి. రాజేశ్వరీ. | ... | ౭౫ |
| ౨౫. | స్నేహితము | ,, యస్. లోపాముద్ర. మెట్రిక్ | ... | ౭౭ |
| ౨౬. | బాల గీతికలు | మాతృభారతి | ... | ౮౦ |
| ౨౭. | వినరూ నా కథ | శ్రీమతి మెర్సి. ఐదవ ఫారము | ... | ౮౧ |






బాలికల ఉన్నతపాఠశాల, పాలకవర్గము, ఉపాధ్యాయులు, ఉపాధ్యాయినులు, విద్యార్థినులు.



ద్వితీ మహాగృభారతీ జయంత్యుత్సవ సందర్భమున కధ్యక్షతవహించిన

శ్రీమతి నందగిరి ఇందిరాదేవి, జి.ఏ. గారు



శ్రీమతి నే. భారతి

(ప్రాతవిద్యార్థిని)

# తొలిపలుకు.

పాఠశాలయందు నడుపబడుచున్న మాతృభారతీలిఖితమాసపత్రికలో వెలువడిన కొన్ని వ్యాసములను పద్యములను నాల్గవ సంపుటము రూపమున పాఠక ప్రపంచమున కర్పించుచున్నాము.

దీని ప్రచురణమున కన్ని విధముల దోడ్పడిన మహాశయులు మా కృతజ్ఞతకు పాత్రులు.

విధేయులు.

బాలికల ఉన్నత పాఠశాల,
నారాయణగూడ,
హైద్రాబాదు-దక్కన్.
౨౧-౪-౧౯౩౯.

బూర్గుల రామకృష్ణారావు బి. ఏ., ఎల్. ఎల్. బి.
మాడపాటి హనుమంతరావు,
కార్యదర్శులు.




బ్రహ్మశ్రీ బిదురు వేంకటశేషయ్యగారు, బి. ఏ.

---

## షట్పదగీతము.

గాలిపాళైన యుద్రేక । కలనవలని
తఱుగువిఱుగులచేఁ జెన్ను । దఱుగకుండఁ ।
గావలయునని కన్నుల । గప్పుకొనెడు ।
పిన్న పెద్దల మన్ననల్ । పెరుగుచుండ ।
నేఁడు నవ్వుచు నాల్గవ । యేఁడువచ్చె ।
పెద్దవయి పేరుమోసి జీ । వింపుమమ్మ ॥






శ్రీయుత బిమరు వేంకటశేషయ్యగారు బి. ఏ.

మ॥ తతచైతన్య కళాపరిఫుల్లముకవీం ।
దరిధ్యానరేఖన్రసా ।
కృతిమై సత్యశివపరిధామ హితమై ।
శ్రీమించుసౌందర్యదే ।
నతమీ పైఁ దనమాతృముదరినిడివి ।
శ్వపేరిమ పాలిచ్చియం ।
చితశ్రీలైక విభూషతాపగిదివా ।
సింబెంచు కొన్గావుతర్ ॥ ౧ ॥

మ॥ ఒక దేశాంచిక కన్నకానుపయి, మెం ।
తో యుగ్గులోఁ బెట్టిన ।
ట్లోక బాసంబలుకాడనేర్చి హృదయ ।
మ్మొక్కండుగా మాతృసే ।
వకునై పావనదీక్షఁ గైకొనిన శో ।
భాభావుకల్ మీరుమా ।
కిఁకఁ జెల్లెండరినుమేలి చుట్టతిక మీ ।
దే మోదసౌభాగ్యముల్ ॥ ౨ ॥

మ॥ అనుకొన్నంత భరమ్ముగాక మఱియు ।
య్యబ్దంబెటోదార్లిపో ।
యెను, మీరిండ్లకుఁబోవు వేళదరియ ।
య్యెన్ రెండు మూన్నాళ్లుగా ।
నానరంగ్రిమ్మఱఁజూడఁగల్గుదుమెలే ।
దోముందు ? పూలట్లు పెం ।
చిన మీకున్ దుదిపల్కుగా నొకటి భా ।
పింతుంబ్రిబోధ క్రియన్ ॥ ౩ ॥

మ॥ సరసాంధ్రావనిఁబుట్టు వుంగనుట ద్రా ।
క్షామాధురీ ధుర్యవై ।
ఖరియాంధ్రోక్తినిఁబల్కరించుకొను టో ।
కక్కండొక్కఁడే పుణ్యా ని ।
ర్భరతంగాక లభింపవండ్రెవరుఁ బె ।
ల్చెన్ రెండు మీసొమ్ముగా ।
న్మఱి మీరెట్టి తపమ్ముఁజేసితిరొసా ।
మాన్యంబె వర్ణింపగన్ ॥ ౪ ॥

సీ॥ ఒకనాఁడు గౌతమీ ♦ ప్రికటోర్మిసంఫుల్ల
ఫేనదీధితులతోఁ బేరటించి
ఒకనాఁడు కాకతీ ♦ యుల భుజాకౌక్షేయ
కాగ్రజాగ్రత్ప్రతా ♦ పాగ్నినమిసి
ఒకనాఁడు కృష్ణరా ♦ యుని యశఃకుసుమైక
సుషమాను భావముల్ ♦ చూఱలాడి
ఒకనాఁడు తంజాపు ♦ రోల్లాస లక్ష్మితో
లీలమైఁజెట్టప ♦ ట్టాలు నెఱపి

ఆంధ్రి తేజస్సు దిక్కుల ♦ కగ్గలమయి
మింటఁబెట్టిన దీపమై ♦ మెఱసిపోయె
అమ్మ హా జ్యోతి మీ హృద ♦ యమ్ములందు
ప్రజ్వరిలుగాక మఱల శుం ♦ భత్ప్రదీప్తి ॥ ౫ ॥

గీ॥ విశ్వభారతిలోకైక ♦ వీరమాత
ఆమెకడుపు ఫలింప సొం ♦ పాఱుమీఱు
వీరసతులు, వీరసుతులై ♦ వెలయుటరుదె ?
పులికిఁగాన్పయిచలిచీమ ♦ పుట్టునెట్లు ? ॥ ౬ ॥

చం॥ చదువులు నేర్చి, పెందెరల ।
చాటున గోళ్ళుల గిల్లుకొంచు జీ ।
ర్ణదశకు మ్రగ్గుకంటెఁ, గడు ।
ప్రాణకళారుచిరైకవృత్తితోఁ ।
జెదరక తెన్గువారి గుణ ।
శీలకథాకుసుమైక మంజరీ ।
ప్రథిత పరీమళమ్ము దెస ।
లంబ్రసరింపఁగఁజేయు టొప్పదే ? ॥ ౭ ॥

సీ॥ తెలుగునాఁడెల్లచె ♦ క్కలుగాఁగయొకటియై
ప్రాగబ్దినయ్యాల ♦ లూఁగునప్పుడు
తెనుఁగువానికిఁబోసి ♦ కొనఁద్రాగనీళ్లుండి
రాచతీవులకుఁజే ♦ సాచునప్పుడు
తెనుఁగు బాసకు సము ♦ ద్దీప్తియేర్పడి, భూరి
సారస్వత శ్రీల ♦ దేరునప్పుడు
తెనుఁగు సంస్కృతి గొప్ప ♦ దనమాశలకు బ్రాఁక
" అద్దిరా " యనుమెప్పు ♦ లందునప్పుడు

గీ॥ గాని, గుండెపైఁ జెయివైచి ♦ గాఢనిద్ర
జెందరాదని మీబంధు ♦ బృందమునకు
నయగతులనూటి పోయుచు ♦ నా ప్రబోధ
గీతికనుఁదీగె సాగింపఁ ♦ జూతురుగద ॥ ౭ ॥

ఉ॥ పుట్టుకతోడఁబుట్టినదె ।
పొందు పవిత్రిత భారతావనిం ।
బుట్టినవారి, కేనదియ ।
పూర్వముగాఁ దడవంగ నేల ? మీ ।
రెట్టును రెండు ప్రొద్దులన ।
హీనమతింబచరించి ప్రార్థనల్ ।
పుట్టువుధన్యతంబొరయు ।
పోలికవర్తిలుఁడమ్మ యింకపై ॥ ౮ ॥



# వెంకన్న.

శ్రీమతి. నేమాని భారతి.

సలిలకు ఆరోజుననే స్నానము చేయించినారు. ఆనందము చేతనో లేక మరియే కారణముచేతనో తనచేతులు వడకుచుండ ముసలి వెంకడు సలిల శుష్క శరీరమున కంతటికి సాంబ్రాణి ధూపము వేయుచున్నాడు వారము దినములనుండియు సుప్రసిద్ధ న్యాయాధికారియయిన నారాయణరావుగారి యింటిలోని ఆబాల గోపాలము పడుచుండిన కళవళము ఆ రోజుననే కొంత ఉపశమించినది. నారాయణ రావుగారి భార్య కనకమ్మ ముఖము వికాసవంతముగనున్నది. నారాయణరావుగారు మొనిమిని దినముల కానాడు ముస్తాబుచేసికొని కోర్టునకేగి అప్పుడేవచ్చినారు కనకమ్మగారు ఒక మేకపిల్లను నాలుగు అరటి గెలలను గ్రామదేవతయైన మాకాలమ్మ గుడికి అప్పనిచేత పంపించినారు. వంటలక్క అమ్మవారికి చలవ నైవేద్యమున కవరసమయిన పరికరముల్నంటిని సిద్ధపరచుచున్నది.

ఇంతలో గృహ ప్రాంగణమున కారు నిలిచిన శబ్దము వినవచ్చినంతనే ఇంటిలోని వారందరును డాక్టరుగారు డాక్టరుగారనుచు హడావుడిగా వీధిలోనికి పరుగెత్తిరి నారాయణ రావుగారు మార్గదర్శిగా ముందుపోవుచుండ డాక్టరుగారి ముఖము మీది స్వేదబిందువులను చేరుమాలుతో తుడుచుకొనుచు సలిల శయ్యా పార్శ్వమునకు వచ్చిచేరిరి. తక్కిన వారందరు ఆయన వెనువెంటనే వచ్చి యేమి చెప్పునోయని దేహమంతయు చెవుచేసికొని నిరీక్షించుచుండిరి.

డాక్టరుగారు సలిలను ఆంగ్లేయ వైద్య పద్ధతిని పరీక్షించి "మరేమియును భయము లేదు పథ్యము మాత్రము అతి జాగరూకతతో చేయించుచుండుడు." అనెను.

"మా చిట్టితల్లి చాల బుద్ధిమంతురాలు పథ్యము చక్కగాచేయును. కాదా అమ్మా" యని వెంకడు సలిలతలను వాత్సల్య పూర్వకముగ నిమిరెను.

"డాక్టరుగారు మేమేమిచ్చి మీ ఋణము తీర్చుకొనగలము. మా సలిలకు మీ మూలముననే పునర్జన్మ కలిగినది" అని నారాయణ రావుగారు కృతజ్ఞతాసూచకమయిన దృక్కులను డాక్టరుగారిపైన పరవుచు "నా ఋణ మా

ఏమిచ్చినను తీరగలదు అది డబ్బుతో సంబంధించినది. కాని మీ వెంకనిఋణము మనుష్యమాత్రులెవరును తీర్పతగినది కాదు. నేను వారము రోజులనుండియు చూచుచుంటిని కదా: ఎప్పుడు వచ్చినను ఆపిల్ల మంచమువద్ద ఆమె వంక అదుర్దాగ చూచుచు నిలబడును. ఇంతటి విశ్వాసముగల సేవకుని నేనెచ్చటను చూచి యెరుగనండీ. ఏదీ వెంకన్నా ఆరు దినములయినను నీ విచారము తగ్గినదా? వెంకన్నా అట్లా వడకుచుంటివేమిటి ఇటురా—అబ్బా యెంత జ్వరమండీ. అదిగో ముఖము మీద పొక్కులు కూడ కనబడుచున్నవే. ఇక నేమీ, దీనికికూడ మశూచికమే" అన్నారు డాక్టరుగారు.

"అయ్యయ్యో ఇది చూచినంత మాత్రమునకే సంక్రమించునంతటి పాపిష్టి వ్యాధి. ఎట్లాగో ఒకలాగున తగ్గినది చల్లనితల్లి కాపాడినదని సంతసించుచుండ మరల నీయవాంతరమూ పిల్లమేక ఉన్న ఇల్లు. అందుచేతను మా యింటి ఆమెకు వ్యాధియన్నవల్లమాలిన భీతి. ఈ భయమువలననే ఈ వారమురోజులనుండియు, నేనయినను దగ్గరికి పోతినికాని, అమె బిడ్డ ముఖము చూచియెరుగదు." అని నారాయణ రావుగారు తమ విషణ్ణతను వ్యక్తీకరించిరి.

"అయ్యో నేనిక వెడలెదను. ఇటుపైని అమ్మాయిని నేను చూడనక్కరలేదు ఎవరయినను వచ్చి మందు తీసికొని పోవుచుండినచాలు" అని డాక్టరుగారు కారెక్కి వెడలిపోయిరి.

* * * *

ఆ దినము సంక్రాంతి భోగిపండుగ. వకీలుగారి ఇల్లు క్రొత్తగావచ్చిన అల్లుండ్లు కూతుర్లుమనుమలు మొదలయిన వారిస్వనముచే కిటకిటలాడుచున్నది. ఉదయము ఎనిమిది ఘంటలయినది. పిల్లలు పెద్దలు అందరును వంటలక్కచే తయారు చేయబడి సక్రమముగ వసారాయందు అమర్చబడిన ఫలాహార పళ్లెముల ముంగిట ఒక్కొక్కరుగ నుపవిశించి, నవ్వుచు కేరుచు ఆరగించుచుండిరి. పెద్దవారు గృహపరిస్థితులను తరుణులు సినిమాలు నవలలు మొదలుగాగల వానిని గూర్చియు, పిన్నవారు బడి ఆటలు మున్నగు వానిని ఎవరికి తోచినది వారు గుక్కతిప్పుకొండ ఉత్సాహముతో పట్టుదలతో, ఇంటికప్పెగిరి పోవునట్లు చర్చించుకొనుచుండిరి. ఇంతలో తలుపువద్ద "అమ్మా అమ్మా అనెడి సన్ననియెలుగు రెండు మూడు మార్లు వినవచ్చినది. వంటలక్క ఎవరు వారు అనుచు తలుపు తెరచుటకై వెడలినది. తమ ఆరగింపులు అంత ముగియుటవలన ఆగంతుకుని చూచుటకయి పిల్లలందరును ఆమె వెనుకనే బయలుదేరిరి. ఆ వచ్చిన వారెవరయియుందురాయని పెద్దలందరు ద్వారము వంకకే దృష్టులను పరపి నిరీక్షించుచుండిరి. ఇంతలో దొడ్డిలోనుండి వెంకడు వెంకడు అనే పిల్లల ఉత్సాహ మిళితమయిన కేకలు చప్పటులతో కూడ కలిసి వినబడినవి. ఆ ఉత్తరక్షణమునందే శుష్క దేహుడయిన వెంకన్న వసారాయందలి వారి దృష్టిపథమునకు వచ్చెను.

"వెంకన్నా బహుకాలమునకు వచ్చితివి ఇంతకాల మెచ్చటనుంటివి? నింపాదిగానున్నావా అని కనకమ్మగారు కుశల ప్రశ్న వేసిరి.

"తల్లీ మీ దయవలన ఇప్పటికి జీవము లతోనున్నాను. చావుతప్పి కన్నులొట్టపోయిన దన్న సామెత నాయందు సార్థకమయినది."

"అదేమి అట్లనుచున్నావు ?

ఇంకేమి కావలెతల్లీ, ఆ పాపిష్టి మసూచికము నా కండ్లు తీసుకొన్నది.

"ఇట్లయిన యిప్పుడు చూడలేవా"

"లేను తల్లి చూడలేను"

"అయ్యో ఎంతపని జరిగినది. అయిన నీ విన్ని దినములనుండి యెచ్చటనుంటివి ?"

"చెప్పుదానమ్మా నా కథయంతయు నాకు తెలివివచ్చి కండ్లువిచ్చి చూచునప్పటికి క్రొత్త స్థలమునందున్నట్లు గ్రహించగలిగితిని. అచ్చట నున్న వారివలన అది మశూచికము వచ్చి దిక్కుమాలిన వారిని ఉంచెడి తావుగాను, నన్ను బాబుగారే ఇచ్చటికి పంపినట్లును తెలిసికొంటిని, తల్లినామాట నమ్మెదరోలేదో కాని యమలోక మన్నదానికంటె వేరేయుండదని నాకప్పటి నుండియు తోచుచున్నది. అచ్చట దినమున కెన్ని శవములు సిద్ధపరుపబడెనో లెక్కలేదు. సరియయిన శ్రద్ధలేక అనేకులు నావలెనె జీవచ్ఛవములయిరి. నాకు ఎన్ని దినములకోకాని వ్యాధితగ్గలేదు. ఒక పదిహేను రోజుల క్రిందటనే నన్ను వారు వెడలిపొమ్మనిరి, అచ్చటనేయున్న మా కులస్థుల సహాయమువలన నాకొడుకువద్దకు పోయినాను. తల్లి అచ్చటికేగిన వారము దినములకే నా ముప్పదియేండ్ల కొడుకుని అమ్మతల్లి యెత్తుక పోయినది, వెన్న పారవేసి వేలునాకిన రీతి, చెట్టంత కొడుకునునట్టేట కాల్చి యీ దిక్కుమాలిన పెద్ద మనుమని వెంటబెట్టుకొని తిరుగుచున్నాను. వారిని వీరిని విచారించి మనయిల్లు కనుగొని యిచ్చటికి వచ్చిపడితిని. తల్లి ఇక నాకు మీకంటె యెవరును దిక్కులేరు. నేను, యీ దిక్కుమాలిన వెఱ్ఱిపక్షి మీ పాలబడినాము. అని ఆ గుడ్డికండ్లనుండి నీరు సంతతధారగా కపోలముల మీదికి కారుచుండ సాష్టాంగ దండ ప్రణామము చేసినాడు వెంకన్న.

"సరే వెంకడూ యీ దినమునకిట నుండుము. రేపు నీ దారి నీవు చూచుకొందువు గాని" అని అన్నారు వకీలుగారు.

"ఇకనాకు వేరుదారేమున్నది బాబు. యేదియు లేకుండుట వలననే యిటు వచ్చితిని !!

"ఇచ్చట మాత్రమేమి చేయగలవు ? కండ్లు కనుపించవు గదా"

"ఏదో నాచేతనైనది, కండ్లులేని నాకు జీతమిచ్చునంతటి ఉదారహృదయులెవరు స్వామి నాకు బుద్ధి వచ్చినది మొదలు మీ యింటియందే యుంటిని. ఈ నాచివరరోజులు కూడా మీ సేవయందే గడిపి వేసెదను. నన్నుఇప్పుడు పొమ్మనిన యెటకేగగలను ?.

"అట్లనిననెట్లు. ఈ సమయమున నీవ యితివి రేపు మరొకరగుదురు. ఆ విధమున యెందరను పోషింపగలము. అందువలన వెంకడూ

యెందులకన్ని వాద ప్రతివాదములు. యెల్లకాల మిట నుండుటకు వీలుపడదు. ఏదో వచ్చినావు గనుక యీ రోజున కిచ్చట నుండుము.''

''అక్కరలేదు బాబూ. నారుపోసిన దేవుడు నీరు పోయక మానడు. నేను ఇప్పుడే పోగలను.'' అని వెంకడు కర్రకొట్టుకొనుచు వెడలిపోయెను

మధ్యాహ్నము పండ్రెండు ఘంటలయినది. దినకరుడు దుర్నిరీక్ష్యుడై పథికులను వేచుచుండెను. వకీలుగారి మేడముందు వెంకన్న మనుమని చేయిపట్టుకొని శూన్యదృష్టితో ఆమేడను తిలకించుచు నిలబడెను. ఆ బాలకుడు తాతను దీపపు స్తంభము వద్ద కూరుచుండజేసి తాను గేటువద్ద ''కే'' అనుచు అరచుచుండెను. వెంకన్న రూపు పూర్తిగా మారిపోయినది. చిరుగుల పంచపోయి చిరుగుల గోచివచ్చినది. తక్కిన శరీరమంతయు సంస్కారహీనమై ఎండకు యెండి వానకు తడిసి చలికి వడకి చీటులువారి యున్నది ఆ గుడ్డి కండ్లు లోతునకు దించుకొని పోయినవి తాతకంటె చిక్కిచిక్కి శల్యమయి యున్నాడు మనుమడు. ఆ డొక్కలకు అంటుకొని పోయిన పేద కడుపు చూచిన మూడు నాల్గు రోజుల నుండియు మెతుకన్న వస్తువు కండ్లచూచి యెరుగడని స్పష్టమగుచున్నది. తాత, ''ఇంకరా బాబూ '' అని అనుచున్ననూ వినక ఆ రోజు నయిననూ అన్న దర్శనము చేయుదమనెడి ఆశతో లేని శక్తిని తెచ్చుకొని, ''కే'' అని అరచుచునే యుండెను.

ఇంతలో వకీలుగారి నాల్గవకొడుకు వాయు వేగముతో సైకలులో ఎక్కుకొనుచూ వచ్చి వాకిట నిలచినాడు. ''పో వెధవా నీ కెప్పుడును ముష్టియే. వేళలేదు పాళలేదు,'' అని కసరి కొట్టెను. ఆ కసరుట వినబడకనో లేక మనిషి కండ్లబడినాడుకదా యిక ఫరవా లేదనియో, లేక భరింపరాని క్షుద్బాధ వలననో ఆ మూగి వాడు ద్విగుణీకృత స్వరముతోన ఎప్పుడు లేని ధ్వనిని సాగించినాడు.

''వెధవా నీకు చెప్పిన వినబడుటలేదా! యేమి పొగరు. ఈ మారు బాగుగా వినబడునట్లు చేసెద నుండుము'' అని కాలి బూడ్సు తోడలాగి శక్తికొలది ఆ అనాధబాలకుని కణతపైన ఈడ్చికొట్టినాడు ఆ. బి. ఎ. గారు. దానితో కెవ్వున అరచి దభాలుమని భూపతితుడయినాడా నిర్భాగ్యుడు.

ఏమి నాయనా ఏమి నాయనా అనుచు తడుముకొనుచు కర్ర ఊతగాకొని వెంకడు బాలుని సమీపించినాడు. ఆ కేక విని చుట్టు ప్రక్కల వారందరును చేరుకొనిరి. కొందరు పిల్లవానిని పరీక్షించి ప్రాణము పోయినదని నిశ్చయించినారు. ఎందు చేతనో ఎందుచేతనో అని వారిలో వారే గుసగుస లాడసాగిరి. కారణ మెవరికిని తెలియదు. ఒకవేళ స్థితిగతులను బట్టి తెలిసికొన్నను వేలువంచ సాహసింపగలవారెవరు? మరికొంతకాలమున జనసమూహము జల్లజల్లగా జేరిపోయినది.

అయ్యో నాబిడ్డా నీకిప్పుడె నూరేండ్లు నిండినవా తండ్రీ మూడు రోజులనుండియు తిండి లేకున్నను బ్రతికితివి. నీకిప్పుడు చావెట్లు సంభవించినది తండ్రీ. చెట్టంతకొడుకును పొట్ట బెట్టుకొంటిని. నీవయినను నా ముప్పుగడిపెదవని గంపెడాశతోనున్న వాడనే నాకేది దిక్కు చూపవు బాబూ అనుచు వెంకడు మాత్రము ఆ శవము మీదపడి గోలపెట్టుచున్నాడు.

# విద్యాపిపాస

శ్రీమతి నం. రమాబాయి. నాల్గవ ఫారము.

"అమ్మా కాఫీయివ్వవే త్వరగా, ప్రయివేటు మాస్టరువచ్చెదరు "అన్నది శ్యామ" పనిచేతకాదు కాని కాఫీకి భోజనమునకు తయారయ్యెదవు. చేతిక్రింద కొంచెము సహాయము చేసెదవేమో యనిన నెప్పుడును చదువు చదువనితప్పించు కొనెదవు" అన్నది కోపముతో తల్లి వసుంధర.

శ్యామ:—చదువుకొనిన తరువాత సైం వుంటే సహాయముచేసేదాన్ని, కాని నా చదువ నకే కాలము చాలనప్పుడు నీకుసహాయ మెప్పుడు చేయను ?

వసుం:- చాలులే నీ చదువు. చదివి యుద్యోగము చేసెదవా? వంటపనియైనను నేర్చుకొనిన భవిష్యత్తున కుపయోగించును. ఈ మాయదారి చదువులు వచ్చి హిందువులను పాడుచేయుచున్నవి.

శ్యామ:- అమ్మా! చదువుకొనిన నెన్నియో లాభములుకలవు. నీకుకూడ చదువువచ్చి యుండిన నీవును విద్యనాదరించుదానవు. కాని నీకు చిన్నతనమందు నీతల్లిదండ్రులు విద్య చెప్పించక నిన్నీ పాడుద్దేశ్యమందు దించినారు.

వసుం:- చాలు. నీవుచదువుకొనుచున్నావు కదా నాకుకూడా ఎందుకు ? ఇట్లు బ్రతికి యున్న విద్యనేర్చుకొనినంత ఫలము. ఈ యుపన్యాసమంతయు నెందుకు నామాటవినకపోయినపుడు ? కాఫీ తీసికొని వెళ్లుము.

వెంటనే శ్యామ కాఫీతీసికొని చదువుకొనుటకు వెళ్లినది.

ఉపేందర్ రావుగారు సామాన్యకుటుంబీకులు. ఆయనకొక కుమార్తెయు కుమారుడు నుండిరి. శ్యామ వారి కుమార్తెయే. వసుంధర యామెతల్లి. ఆమెకు విద్యయనిన గిట్టదనియామె కూతురి విద్యయెడచూపిన పై మాటలే చెప్పుచున్నవి కదా ! ఉపేందర్ రావుగారికి విద్యయన గౌరవముకలదు. కావుననే వారికుమార్తెను చదివించవలయునని యొకమంచి పాఠశాలలో చేర్పించిరి. శ్యామయు విద్యాభిమాని కావున శ్రద్ధ వహించుచుండెను, కాని మధ్య మధ్య వసుంధరపోరు అడ్డంకుల గలిగించు చుండెను శ్యామ వానిని లక్ష్యముసేయక తనపని తాను నెరవేర్చుచుండెను.

కొంతకాలమున కుపేందర్ రావుగారు కూడ భార్య మాటలను వినియమ్మాయికి

వివాహముచేయవలయునని తలంచుచుండిరి. కాని శ్యామమాత్రమంగీకరించుట లేదు. తాను వివాహమాడనను పట్టుదలను వీడలేదు. ఏవిషయము నందును జవదాటి యెరుఁగనిది యీ విషయము నందు మాత్రము తల్లిదండ్రుల యాజ్ఞను దాటితానే గెల్వొందుటకు ప్రయత్నించు చుండెను. కాని మధ్య మధ్య తన ప్రయత్నములు విఫలములగునేమో యని భయపడుచు సాధ్యమయినంతవఱకు వారిని తన మార్గమునందు ప్రవేశపెట్టుటకు ప్రయత్నించుచు వారిని మరల్పఁజూచెను. కాని యవియన్నియు నిష్ప్రయోజనములయినవి.

ఆదివారమున నందఱికి విశ్రాంతిదినమగుటచే నందఱు నింటియందే యుండిరి. ఆరోజు కూఁతురి మనస్సు మరల్పనుద్దేశ్యముతో నామె పఠనమందిరములోనికి ఉపేందర్ రావుగారు వెళ్లిరి. అదెగది మిక్కిలియందముగ నుండెను. గోడలకు దేవుని పటములు తగిలించియుండెను. శుభ్రముగా నుండ వలయుననిన నామెదగ్గర నుండిన చాలును. తండ్రిరాగానే లేచి నిలువబడినది.

తండ్రి:- అమ్మాయీ! భోజనమైనదా ?

శ్యామ:- లేదు. ఇప్పుడే Home Work అంతయు నైనది వెళ్లెదను.

తండ్రి:- ఇంత యాలస్యముగా భుజించిన నారోగ్యముచెడదా ?

శ్యామ:- ఈ రోజాదివార మగుటచేత Home Work ఎక్కువగా నున్నది. అదియంత యునగుసరి కింతయాలస్యమైనది. రోజు పొద్దుననే భోజనము చేయుదును.

తండ్రి:- త్వరగా వెళ్లి భుజించిరా. నీతో కొన్ని మాటలు చెప్పవలెను.

శ్యామ:- సరే త్వరగావచ్చెదను. (వెళ్లును)

" ఈబాలిక పట్టినపట్టు విడుచునో లేదో సందేహముగా నున్నది. పిల్లవానినికూడ చూచి వచ్చితిని. మాటయిచ్చితిని. ఇప్పుడామె యొప్పుకొనకపోయిన నాకు వారితో మాటవచ్చును ఇప్పుడేమి యాటంకములు చెప్పనోయనికూర్చునియాలోచింపఁదొడగెను ఉపేందర్ రావు.

ఇంతలో శ్యామ వచ్చి కూర్చుండెను, తండ్రి యేమిచెప్పనోయని యాతురతతో వేచి యుండెను. తండ్రి దానిని కనిపెట్టి మెల్లగా విషయమును బయలుపరుప మొదలిడెను.

తండ్రి:- అమ్మాయీ! మన ఆంధ్రులలో త్వరగా వివాహము చేయుదురనియు నీకు తెలియునా ?

శ్యామ:- పూర్వము చేయువారు కాని ఈ కాలములో నంత తొందరపడ నవసరముండదు తొందర యెందుకు ?.

తండ్రి:- ఈ కాలములో నైనను తొందర పడకుండువా రెవరోకాని యాలస్యముచేసిన తోడివారు పరిహసింతురు కదా ?

శ్యామ;- తోడివారు పరిహసించు టెందులకు ? కష్టసుఖముల నాలోచించవలయును కదా !

వారితో మనకేమి? మనవిషయము మన మాలో చింపవలయును

తండ్రి:- నీ వివాహము వేసంగికాలపు సెలవులలో చేయదలచితిమి. నీ యభిప్రాయ మేమి? మునుపటి యుద్దేశ్యము మార్చుకొనక తప్పదు.

శ్యామ.- సరే! ఇన్నిరోజులు నన్ను క్షమించినా రిప్పుడుకూడ నా యుద్దేశ్య పరిహారము పోనివ్వరాదా?

తండ్రి:- ఇప్పటికే యెందరో యెన్నిమో విధముల ననుకొనుచున్నారు. ఇప్పటివరకు నీ కోరిక నెరవేర్చితిమి. ఇప్పుడు నీవెన్ని చెప్పినను వృథాయగును. కాన నిన్ను బలవంత పెట్టుటకంటె నీవే నీయుద్దేశ్యమును మార్చుకొని మాకనుగుణముగా నుండరాదా?

శ్యామ:- నన్నేల బలవంతపెట్టెదరు? నాపై నాకధికారము లేదా? నాకీబలవంతపు బ్రహ్మణార్థమేల?

తండ్రి:- నీవు మా వద్ద నుండునంత కాలము నీయాధిక్యత సాగదు మాదగ్గరనుండి వెళ్లిన తరువాత నీయిష్టము.

శ్యామ:- నా కోరిక నెరవేరుట దుర్లభము. మీ యిష్టము వచ్చినట్లు నన్ను బాధింపుడు" అని చింతించుచుండెను.

తండ్రి:- ఇంకను నాలోచించు కొనుము. ఇంకొకనెల గడువున్నదికదా యని వెడలిపోయెను.

శ్యామకారోజునుండి యేమియు తోచుట లేదు. తనకష్టము బాపువారు లేరని విచారించు చుండెను. అన్నము సరిగా తినుటలేదు. నిద్రించుటలేదు. దినదినము కృష్ణపక్ష చంద్రునివలె కృశించి పోవుచుండెను. చదువు విషయము మందు శ్రద్ధగానున్నను నామె మనస్సు తన భవిష్యద్విషయముల నాలోచించుచుండెను. ఆ విషయమితరులకు తెలియజేయక దిగులు పడుచుండెను. "నానాటికి తీసికట్టు నాగంభట్టు" అనురీతినామెకళా విహీన యగుచుండెను. ఆమె యితరుల కంటబడక ఎప్పుడును తన పఠనమందిరమందె కాలము గడుపుచుండెను. రోజులు గడచిపోవుచుండెను. కాలమెవ్వరి కొరకు నాగదుకదా? దాని పని నది తీర్చుకొని పోవుచుండును.

శ్యామ యొకనాడు తానోడిపోయినందువలన విచారపడుచుండెను. ఇంతలో వసుంధర వచ్చి యామెయొద్ద కూర్చుండెను. కుమార్తెను చూచి అమ్మాయీ! నీవిట్లు విచారించుటెందులకు? నిను రాళ్లుమోయమంటిమా? గుండ్లు మోయమంటిమా? దీనికింత విచారమెందులకు అనెను.

శ్యామ:- నన్ను రాళ్లు మోయమనినను, గుండ్లుమోయమనినను సంతోషముగానే యుందును గాని నానిశ్చితాభిప్రాయమును విడనాడుట కష్టముగదా?

వసుం:- దీనికింత పట్టుదలయెందుకు పెద్దల మాటలను తిరస్కరింపవచ్చునా? ప్రపంచమునకైనను వెరువవలయునుకదా? మేము నీకోరిక తీర్చుటకుచూచిన బయట నలుగురిలో తిరుగు

కెట్లు? నీపట్టు విడువుము. వివాహ మైదురోజులున్నది. ఇక విచారము మాని సంతోషముగా నుండుము. నీవెంతో మంచి దానవని, చక్కనిదానవనియు మనబోటి మధ్యస్థులనైనను అంతగొప్ప వారు సంబంధమున కొప్పుకొనినారు. నీవదృష్టవంతురాలవు రేవు నిన్ను చూచెదరట, ఇంకను విచారముతో, వాడినట్లుండిన వారేమైన నను కొనెదరు. ఉషారుగానుండుము. వివాహానంతరము చదువుకొనెదవుగాక. ఇప్పుడు మాత్రము సంతోషముగానుండుము'' అనిచెప్పి వెళ్లెను.

కేశవరావు గారాయూరిలో నున్న ధనవంతులలో నొకరు. ఆయన కుమారుడు మధుసూదనరావు. ఇతడే శ్యామకు కాబోవుభర్త, ౨౦ సంవత్సరములుండును. ప్లీడర్ వృత్తికిచదువుచుండెను. సుగుణవంతుడు. హిందూ మతమునందు విద్యయందును నభిమానము మెండు. స్త్రీలేమియు చదువుకొనక మూర్ఖులవలెనుండవలయు ననెడివాడు కాడు. వరదక్షిణయనిన సహ్యము తండ్రి మాత్రము ౧౧౧౬ రూపాయిల కట్నమిచ్చువారికే తన కుమారుని యిచ్చెద ననియు లేనియెడల నెన్ని యేండ్లయినను నట్లే యుంచెదనను పట్టువిడువనివాడు. ఉపేందర్ రావుగారికి నొక్కతే కుమార్తెగావున నెట్లో తంటాలుపడి ౧౧౧౬ రూ॥ల కొప్పుకొనెను.

మరునాడు పిల్లను చూచుటకు వచ్చిరి. శ్యామ తన కోరికలు భగ్నమైనందులకు చింతించుచుండెను. ఆత్మహత్యచేసికొనెదమనిన నాత్మహత్య మహాపాతకము తల్లిదండ్రుల యుద్దేశ్యములను మార్చుట కశక్యముగానుండెను. ఎచ్చటికైనను వెళ్లిపోవుదమనిన నబల యెచ్చటికేగ గలదు? తుదకు భగ్నహృదయమైనది, తాను బ్రతికియుండగా తన యుద్దేశమును మార్చుకొనని పట్టిన ప్రతినయిప్పుడు విడువక తప్పినది కాదు. అసహాయురాలు, పాపము! నిశ్చితాభిప్రాయములు భగ్నమైనవని చింతించుచుండెను.

శ్యామను చూచిరి. వారికి తగినరీతి మర్యాదలు చేయబడినవి. పిమ్మట గృహమునకు బ్రయాణమైరి. చైత్రశుద్ధ నవమి రోజున వివాహ లగ్న మేర్పరుపబడెను. మంచిరోజు చూచి యిరు పక్షముల వారును వివాహ ప్రయత్నములు నిర్విఘ్నముగ చేయసాగిరి. బంధువులందరు క్రమక్రమముగా వచ్చిరి. పెండ్లికుమార్తెను చేసిరి. ముఖ్యులందరును భోజనమున కాహ్వానింపబడిరి. సాయం సమయమున కొందరిని పసుపు కుంకుమమునకు పిలిచిరి. ఆరోజు మహా విభవముగా గడచెను. మరునాడు ముహూర్త సమయమునకు వివాహ మతివైభవముగా జరిగెను. మేళములు, సన్నాయి మేళము తెప్పింపబడెను. కట్నము నిచ్చువేళకుమధుసూదనరావు వద్దనినాడు. అంత మందిలో కుమారునేమియు ననజాలకపోయెను కేశవరావు. తరువాత కూడ మధుసూదనరావు కట్నము తీసికొనలేదు. వివాహము కడు సంతోషముతోను మహావైభవముతో ఐదురోజులు జరిగెను.

మధుసూదనరావు కూడ స్త్రీ విద్యాభిమానియే కావున తన భార్య శ్యామను ఆమె విద్యాపిపాస తీరువరకు చదివించెను. ఎల్లరు క్షేమముగానుండిరి.

# ఆంధ్ర భాషాభివృద్ధి కొఱకు

శ్రీమతి నందగిరి ఇందిరాదేవిగారు బి. ఎ.,

దేశభాషలందుఁ దెలుగులెస్స'యని శ్లాఘింపబడిన దాంధ్రభాష కృష్ణరాయలంతటివానిచేత. విదేశ భాషలు ఆంధ్రదేశములో అడుగు పెట్టినప్పటినుండి అంతటి ప్రేమ జూపించ లేకపోయినా రాంధ్రులు. కనుకనే ఆంధ్రభాషా మతల్లిపాదములు కడిగి శిరసావహించు దినములు పోయి దుర్దినములు వచ్చినవి. భాషాసేవకులు. ఆంధ్రుల హృదయమునందున్న ఆ తెరను తొలగించి తమ భాషను ప్రేమించ నేర్చుకొనుటకు ప్రబోధము చేయుచుండుట మోదావహము. ఆంధ్రులలో ప్రవహించుచున్న ఆంధ్రరక్తమునందు పూర్తిగా ఆంధ్రోత్తేజము తగ్గలేదు కనుక తమ పొరబాటును తెలిసికొని ఎప్పటివలె భాషా మతల్లిని గౌరవించవచ్చునని యాశగల్గుటాశ్చర్యముకాదు. అసలు తత్త్వమందుకూడ ఆంధ్రభాష అదృష్టవంతమైన భాష. నుడికారపు సొంపుతో అక్షర సౌందర్యముతో జిగిబిగి అల్లికతో ముద్దులు మూటగట్టునట్టి భాష నెవరు ప్రేమింపకుండ నుండగలరు?

ఆంధ్రభాష ప్రత్యేకత్వమెంతయు శ్లాఘింపదగిన విషయము. ఇందు సంపూర్ణ వికాసమునొందిన యక్షర సమామ్నాయ మలరారుచున్నది. వ్యాకరణ సిద్ధమైన జక్కదన ముట్టిపడుచున్నది. ఇందలి శబ్దములన్నియు అజంతములు. సంస్కృతమునందున్న ద్వివచనము దీని యందగుపడదు. లింగము అర్థాశ్రయము కాని శబ్దాశ్రయముకాదు. దీర్ఘతర సమాసములుండక చక్కని కూర్పుతో మూడు నాలుగు పదముల సమాసములు మాత్రమే భాషకొక వన్నె దెచ్చుచున్నవి. వీనితోబాటు, అక్కచెల్లెండ్రు, అత్తమామలు, వేళపాళ, నగానట్రు మొదలయిన జంటమాటలు భాషకు చేవకూర్చి ఆకర్షణీయముగా చేయుననుటలో సందియములేదు. ఈ విధముగా అనేక ప్రత్యేక లక్షణములు ఆంధ్రభాషకు వ్యక్తిత్వమున్నదని ఋజువుచేయుచున్నది.

ఆంధ్రభాషోత్పత్తిని గూర్చి సంస్కృత భాషాజన్యమని ద్రావిడ భాషాజన్యమనియు వాదోపవాదములు పెక్కులు ప్రబలియున్నవి. ఉభయ పక్షములవారును సమబలములైన యుపపత్తులను జూపించుచున్నారు. కాని ఇంకను భాషాపరిశోధనలు పెక్కులు ఒక పూర్ణమైన సిద్ధాంతమునకు వచ్చువరకును ప్రస్తుతము ఇద

మిశ్రమని నిర్ణయించుటకు వీలున్నట్లు గన్పట్టదు ఆంధ్రభాషపై సంస్కృత భాష తత్సమరూపమున స్థిరముగా ముద్రించుకొనియున్నది. అంతేగాక మన ప్రాచీన విజ్ఞానమంతయు సంస్కృతములో నిమిడియున్నది. కనుక సంస్కృతము నిరసించి ఆంధ్ర భాషాభివృద్ధి చేయించుట సాహస మనవలసి వచ్చును. సంస్కృత భాష ఆంధ్రులలో అంతర్వాహినిగా ప్రవహించుచున్నది. సంస్కృత ప్రాకృతజన్య శబ్దములు తత్సమ రూపమున దేశ్యములతో గలసి అచ్చ తెనుగని యొక పరిణీత స్థితిని పొందినవి. ఇట్లాంధ్ర భాష సంస్కృత ప్రాకృత భాషలలతో బాహ్యాభ్యంతరములయందును స్పష్టమైన సంబంధము గలిగి సజీవముగా ప్రకాశించుచున్నది.

రానురాను విదేశములతో సంబంధము లెక్కువ యేర్పడి నాగరికత వృద్ధి యగుచున్న కొలది భాషావసరము ఎక్కువ యగుట వలన ఇతర దేశముల మాటలు మన భాషలో ఇముడుకొనుట గర్హ్యముకాదు. అట్లు మన భాషలో నిల్చిన పదములు అన్యదేశ్యములని పిలునబడినవి. జర్మనీదేశమందు తమ స్వంతభాష తప్ప మరొకభాష నుపయోగింపకూడదని శాసనము చేసిరట. వారి జాతీయత మూర్తీభవించుచున్నది భాషలోకూడ. మనముకూడ తక్కిన భాషల నుండి మాటలుతీసికొనినప్పుడు జాతీయతను గమనించి నుడికారమును మనసు నందుంచుకొని భాషలో జీవము పోకుండునట్లు మార్చుకొనవలయును.

సాధారణముగా నాగరికతాభివృద్ధికి భాషాభివృద్ధికి సంబంధముండును. నాగరికత హెచ్చిన కొలది అవసరము మెండగును. భాషాభివృద్ధిని బట్టి నాగరికతాభివృద్ధిని నిర్ధారణచేయవచ్చును. సారస్వతము ఉదాత్తహృదయుల ఉదాత్తభావములసంపుటి. తరచుగా సారస్వతము మానవుని అభ్యున్నతినిగూర్చి పాడుశాశ్వతగీతమై యొప్పుచున్నది. భాషకును భావమునకును అవినాభావసంబంధముకలదు. కావున శరీర రూపమగు భాషాభ్యుదయ మూలమునను, ఆత్మరూపమగు సారస్వత మూలమునను ఆంధ్రభాషను సేవింపవలసియున్నది. మునుముందుగా భాషామూలకమగు కర్తవ్యము నాలోచింతము. భాషకు స్థిరతలేదు. పరిణామవాద సిద్ధాంతము భాషకుగూడ అనువర్తించును. విదేశీయులతో సంబంధములేర్పడినప్పుడు భాషలో క్రొత్త శబ్దజాలము సృష్టించు నవసరము తప్పనిసరి యగును. అందుకు పండితులు తోడ్పడ వలసియున్నారు. పూర్వకవులు భాషాస్వాతంత్ర్యమును తీసికొనినట్లుగా గ్రంథ ప్రమాణము లనేకములుగలవు. కల్పనా మూలమున భాషా సంచారమునకు విశాల రంగస్థలమేర్పరుచుటయే యగును.

కావ్యనిర్మాణముద్వారా సూక్ష్మతమ భావములను రసానుగుణముగా సౌందర్య రూపమిచ్చుచు సామాన్యులకు కావలసిన భాషకాక రసజ్ఞులకు మాత్రమే అర్థమగునట్లుండును. భాష కవిత్వలక్షణముతోగూడి సొగసునిచ్చును.

వాఙ్మయమునందు ప్రస్తుతమున్న శాస్త్ర గ్రంథములు చాలతక్కువ. వాని యావశ్యకత యెంతేనిజాలదు. విజ్ఞానము శాస్త్రములవలననే కనుక సంస్కృతమునందు, ఆంగ్లమునందు రెండింటియందు పాండితి సంపాదించినవారు పెక్కుశాస్త్రములను వ్యర్థముగా పోనీయక మాతృభాషలోనికి భాషాంతరీకరణముచేసిన గొప్పసేవ చేసినవారలగుదురు. ఎక్కువ వ్యాప్తిలోనున్న చిన్నకథలతోనే కాలక్షేపము చేయుచు తృప్తినొందక వానియందలి కళాభివృద్ధికి తోడ్పడుటతోబాటు శాస్త్రీయజ్ఞానమును తెనుగుపరచి విద్యాగంధరహితమగు జనసామాన్యమునకు విద్యాభిరుచిని శేకరించుటకు గూడ ప్రయత్నించుట నేడు చాల అవసరము.

ఇంతేకాక ఇంకను మనలోనున్న పురాణములనన్నిటిని తెనుగుచేయవచ్చును. సాంఘిక జీవనము ప్రతిబింబించునటుల నవలలు నాటకములు క్రొత్తపక్కిని వ్రాయవలెను. కనుక ఇతర గ్రంథరచన ద్వారాకూడా భాషాభివృద్ధిచేయవచ్చును.

శైలీభేదమును పురస్కరించుకొని భాషను కొన్ని అంతస్థుల క్రింద విభజించి లోకమునకు ప్రసాదించుటవసరమే. రచయితయొక్క లక్షణములవలన వివిధ పాత్రోచిత సన్నివేశములను దన ప్రకారము వెల్లడించబడును. తద్వారా భాషాపరిస్థితియందు మార్పులు కలుగకతప్పవు. అట్టి మార్పులు వివిధశైలీ విభేదమును వ్యక్తిత్వమును బోధపరచుచున్నది. గనుకనే Style is man అని చెప్పబడియున్నది. ఆ పరిస్థితియందు కూర్పు మార్పులులేని గ్రామ్యభాష మొదలుకొని దీర్ఘ సమాసభూయిష్టములైన తత్సమాంధ్రము వరకును కవిత్వ వ్యక్తిత్వమును బట్టి శైలీద్వైవిధ్యమేర్పడుచున్నది. వివిధ శైలీ పద్ధతులను పాకములని, వృత్తులని, రీతులని తెలిపియున్నారు. వ్యక్తిగతమగుటవలన శైలికి భిన్నత గలదు. ఆభిన్నతను సమంజసముగ సాధించుకొనుటయే భాషాభిమానుల కర్తవ్యము దీని మూలమున భాషకెంతయు మేలుచేకూరును.

సాధారణముగా జనసామాన్యము నాకర్షించునని పత్రికలు ఇతర భాషలందున్న పత్రికలతో పోల్చిచూడ మనదగ్గరనున్నవి చాలకొద్ది. చరిత్ర భూగోళము ఖగోళము సైన్సు మొదలగు శాస్త్రవిషయములపై ప్రత్యేకముగా నెలకొల్పబడినపత్రికలను చాల చూచుచున్నాము. అట్టివి ఆంధ్రదేశమున ప్రతిష్టింపబడి విజ్ఞానవ్యాప్తికి తోడుగా నుండినచో బాగుండెడిది. కేవలము కథలతో నిండింపబడు చున్న పత్రికలద్వారా దేశసేవ ఎంతవరకు జరుగగలదో పెద్దలకు తెలియని విషయముగాదు.

ఇది గద్యయుగము. భాషను సానపట్టి మెరుగుపెట్టుట కవకాశములు మెండుగలవు. భాషలో గ్రామ్యగ్రాంథిక వాదములు సనాతనాధునిక కవిత్వము మొదలైన సమస్యలు బయలుదేరి అవి పరిష్కారము గాకుండ నిల్చిపోవుట సంభవించుచున్నది. దీనిలోనైన వ్యక్తిత్వమును బట్టగలిగిన విభేదమును పాటించి

ఐక్యము సంపాదించి సామరస్య పరిష్కారముచేసిన మంచిది. ఈ విధముగా భాష సారస్వతమునకు తోడ్పడి నాగరికతౌన్నత్యమును ప్రదర్శించుచున్నది. జీవితములో వివిధ సమస్యలను అన్ని రసములలో చిత్రించు బాధ్యత భాషా సేవకులు వహింపవలసియున్నది. ప్రతి జాతీయత ప్రత్యేకాదర్శమును దృష్టియందుంచుకొని యందభివృద్ధి జెందుటాచారము కనుక ఆంధ్రజాతీయాదర్శమును గమనించి భాషా సేవకు గడంగుట ఉత్తమము.



# ఆదర్శ మాత

శ్రీమతి యం. సి. సత్యమ్మ. ఏడవ తరగతి

సాయంకాలమయినది. సూర్యుడు దినమంతయును కష్టపడి తనయొక్క కర్తవ్యమును నెరవేర్చుకొని యస్తాచలమునకు పోవుసమయమైనది. మందమారుతములు వీచుచుండినవి. నదియందలి జలము సూర్యుని తామ్రకాంతిచేత తామ్రముగా నగుపడుచుండెను. పక్షులు కిలకిలారావములనుచేయుచు ఆకాశమున నెగురుచుండినవి. చంద్రుడు అప్పుడే కొంచెము కొంచెముగా పైకివచ్చుచుండెను. నదీతీరమునందొక కుటీరముండినది. అదొక తోటలో నిర్మింపబడిన కుటీరము. తోటలోనివృక్షము లన్నియును వసంతకాలమగుటచేత ఫలపుష్పాదులచే అందముగా కనబడుచుండెను. అనేక పుష్పములుండినవి. వానియొక్క పరిమళము కొంతదూరమునకు వ్యాపించియుండెను. ఆకుటీరము చిన్నదియైయున్నను అందముగా నిర్మింపబడియుండెను. అచ్చట ఒక స్త్రీ తన శిశువునుచెట్టు క్రిందపరుండబెట్టి ఈ చెట్లకునీరుపోయుచుండెను. ఆశిశువు చంద్రుని చూచుచు పుష్పములచూచి నవ్వుచు క్రీడలు సల్పుచుండెను. తల్లికి ఆవిషయమునుచూడ పుష్పముతో తనకుమారుడు ఏమో చెప్పుచున్నట్లుతోచినది. ఆమె తన కుమారుని చూచి ఒకసారి స్మితమొనర్చెను. ఆశిశువు ఎంతో యందముగా నుండినది. ఆశిశువు నేత్రములలో నుండు తేజమే అతని సౌందర్యమును కెక్కువ తోడ్పడుచుండినది. ముంగురులు గాలికి నిటునటు కదలుచుండినవి. గౌరవర్ణము చక్కనిముక్కు చిన్ననోరు బోసినవ్వులు ఇవన్నియును సౌందర్యమును తెలియజేయుచుండినవి. ఆ శిశువుతల్లి

కూడ అందముగానేయుండెను. ఆమె ఇరువది ఎనిమిది యేండ్ల తరుణి ఆమెకు పుష్పములమీద కలప్రేమ యింతింతయని చెప్పరాదు. ఆమె ఒక మాలాకారుని భార్య ఆమె భర్తయున్నకాలములోనే వారిరువురు కలసి ఆ తోటలో వృక్షములను వేసి యుండిరి. ఇప్పుడవి బాగుగావృద్ధిజెంది పుష్పముల నొసగుచుండినవి.

ఆతరుణి వృక్షములకు నీరుపోయును. క్రొత్తగా వికసించిన పుష్పములనుచూచి సంతోషించుచుండెను, ఆమె పుష్పహారములను చేసి అమ్మి జీవించుచుండెను. భర్తమృత్యుముఖమున బడునప్పు డాతరుణి ఎనిమిదినెలల గర్భవతిగా నుండెను. తరువాత పుత్రుడు జన్మించెను. ఆమె పడినబాధ లామెకే తెలియును. ఆమెకు సహాయము చేయవారెవ్వరును లేరు. భగవంతుడేయామెకు దిక్కు. ఆమె నివసించు ప్రదేశము నదీతీరమందుండెను. ఆమె ఏకాంతవాసిని. అచ్చట చుట్టుప్రక్కలెవ్వరును లేకుండిరి. ఆమె వృక్షములను తన పుత్రునివలెపెంచుచుండెను. ఆమెప్రతిదినము సాయంకాలము పుష్పహారముల నమ్ముటకై పట్టణములోనికి పోవుచుండినది. దినమునకెనిమిది అణాలు లేక రూపాయి సంపాదించుచుండినది. ఆమె తనభర్త పోయినతర్వాత చాలాదుఃఖించి విరక్తిపొందినది కాని తనకుమారుని కొరకని దుఃఖమును వదలి అతనిని ఒక గొప్పవానినిగా జేయుటకు నిశ్చయించినది. ఆశిశువునకు నాలుగు నెలలయినవి. ఆమె ప్రతి దినమును పుష్పహారముల నమ్ముటకు పోవునప్పుడు కుమారుని తీసుకొనియే పోవుచుండినది దీపములు పెట్టుసమయమునకు తిరిగి కుటీరమునకు వచ్చుచుండినది. ఆమె ఆ ప్రదేశమునందు ఒకతయే నిర్భయముగా నివసించుచుండినది, ఆమెత్యాగబుద్ధిగలది. ధైర్యసహసములుగల సమర్థురాలు. కష్టసుఖములను సమముగా చూచు సమభావనగల స్త్రీ. అవసరమువచ్చిన నవనీతమువలె కరుగు హృదయముకల దయాస్వరూపిణి. లేనిచో పాషాణముకంటెను కఠినముగా నుండు హృదయముకల ఉగ్రస్వరూపిణి. ఆమెకున్న ధ్యేయము కుమారుని దేశమాత కర్పించెదననుటయే ఆధ్యేయముకొఱకే యామెజీవించినది. ఆమెభర్త చాలానిస్వార్థి అతడు నియమనిష్ఠలు కలిగియుండిన సత్ప్రవర్తకుడై యుండెను. తానుపుష్పహారములనమ్మి జీవనము గడుపుచు బీదజనులకొఱకై కష్టపడు చుండెను. ధర్మగుణము కలిగియుండెను. అతనికి సాటియతడే. అతనిపేరు చంద్రశేఖరుడు అతడెల్లప్పుడును భజనచేయుచుండెడివాడు. కాని పాపము కుమారునిచూచుటకు ముందేమృతి నొందెను. అతనిభార్య పార్వతి కిప్పుడు కుమారుని పోషించుటలో తండ్రిబాధ్యతను తల్లిబాధ్యతను రెండింటినికూడ నిర్వహింపవలసి యుండినది అట్లే కష్టపడి పార్వతి బాధ్యతలను నిర్వర్తించుచుండినది.

# పతిభక్తి

శ్రీమతి వి. జయలక్ష్మి, మెట్రికు.

“ఆచార్యా! నేనింక సెలవుగైకొనుచున్నదానను. మీ సహాయమున నేనింతవరకు విద్యనేర్చితిని, కాని మిమ్ముఁను నా సోదరీమణులనుగూడ విడువవలసి వచ్చినందులకెంతయు విచారించుచున్నాను. నన్నెప్పుడును మఱవకుఁడు. నేనెల్లప్పుడును మిమ్మేదైవముగా భావించి మీ మాటకు జవదాటలేదు. నాకిక సెలవు దయచేయుడని దేవకి తనయుపాధ్యాయ పాదపద్మములకు బ్రణమిల్లెను.

ఉపా:- దేవకీ! ఆదర్శగృహిణివి ఆదర్శమాతవు దేశభక్తురాలవై వర్ధిల్లుము, చిరాయురారోగ్యైశ్వర్యాభివృద్ధులఁ బరమేశ్వరుడు నీకుఁ బ్రసాదించుగాక యని కంట తడిపెట్టెను.

సహాధ్యాయినులు:-అక్కా పోయెదవా! అప్పుడప్పుడుత్తరముల వ్రాయుచుందుము. మఱవవుగదా? దుఃఖింతురు.

దేవకి:- నేనింక వెళ్ళుచున్నాను. దయయుంచుడు మఱవకుఁడు.

దేవకి అత్తవారియూరు అమలాపురము. వారు చాల ధనవంతులుగారు. ఆమె భర్త పేరు శంకరరావు అత్తయున్నదికాని మామలేఁడు. శంకరరావుగారొక పాఠశాలలోఁబనిజేయు చుండిరి. నెలకు ఏబది రూకలు. అతనికిమాతృభక్తియమితము. ఎల్లప్పుడు నామెయాజ్ఞలేనిదే యేపనియు జేయువాడుకాఁడు. కాని యాతఁడు వేశ్యాలోలుఁడు. ఇట్టి సందర్భమున మాతృయు తల్లియాజ్ఞనుల్లంఘించుటయేగాక యెవ్వరికిని లొంగువాడుకాఁడు.

దేవకి వారి తల్లిదండ్రులకేకపుత్రిక. వారామెను బహుగారాబముతోఁబెంచి మంచిచదువుజెప్పించిరి. వివాహమైన తరువాత మరల తన మాతాపితరులను చూడలేదు.

దేవకి యత్త యామెనెల్లప్పుడును బాధించుచుండెను దేవకి యెన్నడును బనిచేసియెరుగదు. కావున నామెయత్తచే దిట్లుకొట్లు తిననిదినమే లేదు. ఆమెభర్తకూడ ఆమెను మిక్కిలి బాధించు చుండెను.

ఇట్లుండనొకనాడు శంకరరావు భోజనము చేయుచుండ దేవకి వచ్చెను. అప్పుడామెయత్త పొరుగింటికి బోయియుండెను. దేవకి ఇంచుక ధైర్యమువహించి భర్తతోనిట్లనియే.

దేవకి:- నాథా ! మీరెల్లప్పుడును నా వేశ్యయింటనే యుండినయెడల సంసారమెట్లుగడచును, ? అయ్యో ! ఇంట నొక్క గింజైనను లేదే ?

శంకర:- సరేలే ! నన్ను ఎవరనితలంచుచున్నావు. మాయమ్మవచ్చిన చెప్పిబాగుగా దన్నించెదను. ఆసంగతితో నీకేల యావశ్యకత గలిగెను. ఇంక మాటలాడక వెడలిపొమ్ము.

దేవకి:- (తనలో) నేనుమొదటనే యనుకొంటిని. మాయత్త చెప్పిననే వినని సమయమున నే జెప్పిన విందురా ? ప్రాణేశ్వరా! నేను మీ సేవఁజేయుటకైనను నర్హురాలను గానా ? నేను మీకా వేశ్యకంటె నధమురాలనా ?

శంకర:-(ఆర్ధ్రోక్తితో) వెళ్ళెదవా ? లేదా యని మెడబట్టి గెంటి వెడలిపోవును. దేవకి మూర్ఛిల్లియుండ నత్తవచ్చి ఓసీ ! ఇంత త్వరగా నేనానిద్ర ! మధ్యాహ్నమైనను గాలేదే ? లేచెదవా ! లేదా ! పద అబ్బాయికి వంటచేసితివా లేదా లెమ్ము, దేవకీ ! దేవకీ ! యని రెండు మార్లు తలపై మోది వెళ్లిపోవును.

దేవకినిగెంటి శంకరరావు మెల్లగా సానివీధిలోబడి యొక యింటినిజేరెను. ఆయింటియజమానురాలిపేరు మధురవాణి. ఆమె యీవృత్తి వలన మిక్కిలి ధనార్జనము జేసినది. శంకరరావామె యింటికిజేరగనే యామెయొక యున్నతాసనమున నాసీనుంజేసెను.

మధుర:- శంకరరావుగారూ ! నేను మిమ్మొక కార్యమున నియోగించెదను. చేసిపెట్టెదరా ?

శంకర:- మధురా ! నీవు చెప్పినదిగాక మరియింకెవరు చెప్పినది జేయుదును? చెప్పుము సందేహమేల ?

మధుర:- అదికాదు. నిన్నటి దినమున నొక సేటువచ్చినన్ను మోహించినమాటలాడెను చూచితిరా ! దీనిని మీరెట్లు సహింపగలరు.

శంకర:- (కోపములో) ఎవరది. వాడెప్పుడిచటికి వచ్చునో తెలియునా.

మధుర.- అతడొక గంటలో వచ్చునను కొందును. మీరిచ్చట దాగియుండుడు.

ఒకగంటకాక పూర్వమే సేటువచ్చెను. వచ్చియురాకపూర్వమే శంకరరావు మధురవాణి చెప్పినరీతిగా సేటును బాడిచిచంపెను. తరువాతనాతడు తనయింటికి వెడలిపోయెను. ఇంతలో పోలిసువారికి తెలిసి మధురవాణి గృహమునకు వచ్చియడిగిరి. ఆమెయు శంకరరావే హంతకుడని చెప్పెను వారు శంకరరావింటికి వెడలిపోయిరి

శంకరరావింటికి వెళ్లగానే దేవకికి తెలిసిపోయెను. ఇంతలో పోలీసువారు వచ్చుట తెలసికొని శంకరరావు భయమున దేవకితో నిట్లనెను. దేవకీ నీ మాటయును మాయమ్మమాటను విననందుకు నాకుతగినశాస్తియయినది. నీవికనమ్ము

తో చెప్పియుండుము. దేవకీ నాథా మీారే లయిట్లనిథమెదరు. మీారేయుండుడు నేనుహంతకు రాలనని జెప్పి వారి శిక్ష ననుభవించెదను. అనెను. ఇంతలో పోలీసువారు వచ్చి శంకరరావును దేవకిని న్యాయస్థానమునకు గొనిపోయిరి. శంకరరావునకే యురిశిక్షవిధించినను ఆ దేవకీ తనంతటతానే కంబముపై కెక్కి యురివేసుకొని భగవత్ప్రార్థన జేసికొనుచు ప్రాణముల విడిచెను. శంకరరావు దానిని సహింపజాలక మనః ఖేదమొంది కత్తితో వక్షస్థలమున బొడుచుకొని యసువులబోసెను. భయంకర దృశ్యముగాంచి పురజనులందరును భయవిహ్వలులయిరి.





# నిరాశ

శ్రీమతి పి. ప్రభావతి, ఆరవ ఫారము.

రామయ్య:- నాయనా! శ్రీనివాసరావు నేనెన్ని దినములిట్లుండగలనురా? నీతో ఎన్ని సార్లు చెప్పినను వినలేదు. రేపు కాలో చెయ్యో నొప్పికలిగిన నీవు నీ భార్య నాకుచేయుదురా? నాకు నావా రుండవలయును.

శ్రీనివాసరావు:- సరే నీగోల. ఎనుబది సంవత్సరములు వచ్చినవి. ఇంకను నీకు పెండ్లీ ఎందుకు? మేము లేమా చేయుటకు. నీకెందుకు పెండ్లి? అది నీ ప్రాణమునకు ఏమ్పుటకు వచ్చిన మాకుచాల విచారము.. ముసలివారికి భార్య ఎందుకు? నీకు మేమందరము లేమా? మేము తెచ్చుడబ్బుచేత నీ ఇష్టము వచ్చినట్లు తినుచు హాయిగా కూర్చుండవలయును.

రామయ్య:- నాయిష్టమా? నీ యిష్టమా ఇంత మాత్రము నీకు చెప్పిన వినకూడదా? నాకు చాకిరి చేయువారు లేరు కావున వారము దినములలో శుభకార్యము కావలసినదే తప్పదు. నీకు చేతకాదని చెప్పరాదు. నేను విచారించుకొనెదను.

శ్రీ. రా:- సరే నీయిష్టము, నాకు తెలియదు. మనుమలతో సంతోషముగా కాలయాపనము చేయక ఎందుకనిన వినవు

రా:- సరే నీగొడవ. నాయిష్టము నాది.

శ్రీ. రా:- మరి పిల్ల యెక్కడ? డబ్బు చూచి ఈ దినములలో పిల్లనిచ్చుటలేదు.

చదువుచూచి ఇప్పటివారు యిత్తురు. కాని డబ్బు చూచికాదు. ముసలితనమువచ్చినది. నాకు యిష్టములేదు. నీ ఉద్దేశము ఎట్లున్న యట్లుచేసుకొనుము.

రా:-నేను త్వరగావెళ్లి వెంకయ్యశాస్త్రిగారితో విచారించి వచ్చెదను. నీవు భోజనము చేసి పనిమీదికి వెళ్లుము.

రామయ్యకు ఎనుబది సంవత్సరములు. ఇప్పుడిట్టి బుద్ధి పుట్టినది. మెల్లగా భోజనముచేసి వెంకయ్యశాస్త్రి వద్దకువెళ్లి వారికి డబ్బు యిచ్చి సంబంధము విచారింప వలయునని బుద్ధిపుట్టినది. భోజనము చేసి బయలు దేరెను ముసలపెండ్లికొడుకు. అప్పుడే వెంకయ్యశాస్త్రిగారు పంచాంగము చూచుచు కూర్చొని యుండిరి. ఇంతలో రామయ్య వచ్చి కూర్చొనెను.

రా:- ఏమండి వెంకయ్యగారు! ఏమి విశేషము? ఇప్పుడులగ్నాలున్నవా? మాఘములు వెళ్లినవా? ప్రస్తుతము ఒక పదమూడు సంవత్సరముల పిల్లకావలెను, ఎక్కడయినన్నున్న విచారించెదవా? ఒక వారము దినములలో కావలయును. మీకొక నూరు రూప్యములు నిచ్చెదను. అందులకు జంకను త్వరగా కావలయును.

వెంకయ్య:- ఎవరికండీ? సంబంధమునకేమి లెండి. పిల్లలున్నారు. సొమ్ము పెట్టవలయును మూడవ కుమారునికా ఏమి? ఇప్పుడేమి తొందరండి? చదువనీయరాదు? బి. ఎ. అయిన తరువాత చేయకూడదు, మన సుందరరావు కుమార్తెయున్నది. నాల్గవఫారము చదువుచున్నది. చాలచక్కనిది ఇష్టమేనా? చూచెదము గాక పదండి. మీఅబ్బాయికే బాగుండును. నేను మాటలాడెదను.

రామయ్యగారు అటునిటుచూచి మెల్లగా చెవిలో చెప్పినారు. వెంకయ్యగారు తలయూపుచు "సరే మంచిది. ఇక్కడ మనకు ఎవ్వరును ఇయ్యరు. ఉన్నది ముసలితనము. ఏ పరాయిఊరికో వెళ్లి కొనుక్కొని వచ్చిన బాగుండును."

రా:-ఎట్లయినను సరే మీదయ మీకు నేను అన్యాయము చేయను. మీ ఋణముతీర్చుకొందును. ఇంతమాత్రము సహాయము చేయండి మరువకండి నేను ఎప్పుడు రావలయును? నన్ను సాయంకాలము రమ్మనెదరా?

వెం:- వలదండి సాయంత్రము. ఇప్పుడు వైస్రాయిగారు వచ్చినారు. త్రోవలన్నియు జనులతో క్రిక్కిరిసియున్నవి. నాలుగు దినములు నిలువకూడదా! వైస్రాయిగారి అడావిడి తగ్గిన తరువాత మనము మొదలు పెట్టెదము. త్వరపడకండి త్వరపడిన పనులుజరుగునా! ముసలి తనములో కృష్ణా, రామా యనక ఎందుకీ పిచ్చి? ఒకపిల్లగొంతు కోయుటకా?

సరే నాలుగు దినములకు వచ్చెదను. మిమ్ములనే నమ్ముకొనెదను. కావున దయయుంచండి అనుచూ రామయ్యగారు వెళ్లినారు.

నాలుగు దినములు గడచినవి. వృద్ధుడగు రామయ్యకు ఆనందము ఎక్కువగు చుండెను. వెంకయ్యగారికి యేమియు తోచుటలేదు. మెల్లగా రామయ్యగారు వెళ్లినారు.

వెంకయ్యగారు మెల్లగా తాంబూలము నమలుచూవచ్చి రామయ్యగారివద్ద కూర్చొనెను. మెల్లగా చెవులో ఏమో చెప్పినారు.

రా:- మనము రైలెక్కుటకు ఎప్పుడు వెళ్లవలయును? తమరుకూడ రండి. ఎంతడబ్బయి ననుసరే. డబ్బునకే యిబ్బందియును లేదు.

వెం:-నేనురాను. మీరువెళ్లి కొనుక్కొని రండి. వేయి రూపాయలిచ్చిన చాలును. నాకు నూరు రూపాయ లియ్యవలయును. సొమ్ముకూడ పెట్టి ఇంటికి తేవచ్చును.

సాయంత్రము నాలుగు గంటలకు బయలుదేరి రామయ్య వెంకయ్యగారు ఇచ్చిన యుత్తరముతో ఊరుచేరినారు. వారిబంధువుల యింటికి వెళ్లినారు, అచ్చట భోజనమయినపిదప కుమారునికని చెప్పినారు. వెంకయ్యవ్రాసిన యుత్తరము చూపుచూ తనకుమారుని గూర్చి చెప్పినారు. బి. ఎ. చదువుచున్నడని చెప్పినాడు.

సరే మా బంధువులు కలరు. అక్కడికి వెళ్లెదము. ఇక్కడ చూడవలసిన ప్రదేశములు చాల కలవు. ఒక కారు చేసికొందము.

కారులో అందరుయెక్కినారు. రామయ్యగారు యేమనుకొనెదరో అది మాట్లాడక కూర్చున్నారు. సాయంకాలమువరకు పదిరూపాయలు కర్చయినవి. మరునాడు ఉదయమున మరల వారికి చెప్పెను. వారు సరేనన్నారు,

మధ్యాహ్నము పదునాలుగు సంవత్సరముల బాలికను తెచ్చి చూపినారు. చాల సంతోషముతో వేయి రూపాయ లిచ్చుటకు ఒప్పుకొన్నారు. వారు బాలికను లోపలికి తీసికొనిపోయి యేమో చెప్పినారు.

వారికి ఆడపిల్లలులేరు. వేయిరూప్యములు వచ్చునుగదా యని మొగవానిని ఆడపిల్లవలె చీరకట్టి రామయ్యగారిచ్చిన సొమ్ము పెట్టి పంపుటకు సిద్ధపడిరి. వెయ్యి రూపాయలసొమ్ము పోయిన పరవాలేదు కాని భార్య దొరికినది కదా యను సంతోషముతో వారు పిల్లను పంపునపుడు తల్లియేడ్చినది, మరల నెలలో పంపుతానని భార్యతోబయలుదేరినారు సంతోషముగా రైలెక్కినారు. రయిలులో చాలమంది కుమారైకు పెండ్లి అయినదా? అత్తవారు ఏయూరు అని అడిగిరి. కాని తనకే యనియు వేయి రూపాయలు కర్చయిన దనియుచెప్పిరి.

గుంటకల్ స్టేషను వచ్చినది. వారుభయులుదిగిరి.

భార్య:- నాకు కడుపునొప్పిగా నున్నది. మరల వచ్చెదను ఇచ్చటనే యుండుడు.

రా:- నేనిక్కడనే యుందును భయములేదు.

మరుగు ప్రదేశమునకువెళ్లి సొమ్ములన్నియు తీసి స్త్రీ వేషము మాని పురుష వేషముతో

వచ్చినాడు. టిక్కెట్టు తీసికొని మరల మద్రాసు రైలెక్కెను.

ఇంకను వచ్చును కదాయని చూచుచు కూర్చొని యుండెను. హైద్రాబాదు రావలెనని వెదకుట మొదలుపెట్టెను. విసుకుపుట్టినది మోసముచేసినదని తలచి మరల తానుకూడ వారి యింటికివెళ్లి తనభార్యసంగతి యడిగినాడు. కాని వారికి ఆడపిల్లలు లేరనియు, ఈయన ఎవరో తెలియదనియు చెప్పిరి. డబ్బుపోయినది. ఇంటికి మరల నొంటరిగా వెళ్లవలయును. చాల విచారము కలిగినది. వారందరును పోట్లాడుటకు మొదలుపెట్టిరి. అతడు దిగులుతో వెడలెను. ఇల్లంతయు పెండ్లి పందిరితోను చుట్టాలతోను యున్నది. మెల్లగా తన కుమారునితో జరిగిన విషయమును చెప్పినాడు. అందరును విచారపడిరి

శ్రీనివాసరావు:-నాయనగారు నేను చెప్పిన మాట వినలేదు. ఆశ నిరాశ యయినది.

అతడు చింతపడినాడు. రామయ్య జరిగిన విషయములను వెంకయ్యతో చెప్పెను. వారును కండ్లవెంబడి నీరు కార్చుచు ఊరకున్నారు. " వినాశకాలే విపరీతబుద్ధిః " అని తలచి తృప్తి పొందెను. " ఏమి చేయగలము తానొకటి తలచిన దైవమొకటి తలచును " అని రామయ్య అనుచు ఇంటికిపోయెను.



# బాలికల ఉన్నత పాఠశాల.

శ్రీమతి. జి. జయ, ఆరవ తరగతి.

హైద్రాబాదు పట్టణమునందలి పబ్లిక్ గార్డను వివిధములైన జంతువులు సర్పజాతులు పక్షులుకలిగి చూచుటకు ఆనందముగ నుండును. ప్రతిదినము సుమారు నాలుగయిదు గంటలనుండి పట్టణపు జనులందరును ముఖ్యముగా ఉద్యోగులును విద్యార్థులును వివిధములైన దుస్తులతో ఒకరితో నొకరు మాటలాడుకొనుచు నవ్వుకొనుచు దినమంతయు పడినశ్రమ తీర్చుకొనుటకై ఆ తోటకువచ్చి అన్ని విధములైన జంతువులను చూచుచు చల్లనిగాలిలో తిరుగుచు విశ్రాంతి గైకొనుచుందురు. నాటి సాయంకాలము అయిదు గంటలప్పుడు సుమారు ఇరువదిమూడేం

ద్లుగల యువతి యొకతె ఏమియో ఆలోచించుకొనుచు తోటయందు చల్లనిగాలిలో తిరుగుచుండెను. ఆమె చక్కదనమునకు ఆమె ధరించిన దుస్తులును సొమ్ములును ఒక విధమైన వికాసమును కలుగజేసినవి. అప్పుడు బాలికల ఉన్నత పాఠశాల విద్యార్థినియగు సరస్వతి టాంగాపై వచ్చి మన యువతి యున్నచోట దిగి నవ్వుచు 'నమస్కారమక్కా' క్షేమమా యనియడిగెను.

శ్యామల:- ఓహో! సరస్వతి! బహుకాల దర్శనము. క్షేమమా? విశేషములేమి ఎక్కడను కాన్పించుటలేదు.

సరస్వతి:- కాన్పించక పోవుటకేమున్నదక్కా? స్కూలునుండి వచ్చేవరకే సాయంకాలమగును తరువాత కొంచము టీ త్రాగి చదువుకొనుచు కూర్చుందును. ఇట్లె గడచిపోవుచుండును. నేడాదివారము సెలవుదిన మగుటచే దినమంతయు ఇంటనుండ విసుగెత్తి చల్లగాలిలో తిరుగుటకై వచ్చుటచే నీ దర్శనము లభించినది.

శ్యామల:- సరస్వతీ! ఈ బెంచీలమీద కూర్చుందము రమ్మా (అని యిరువురు కలసి కూర్చుందురు).

సరస్వతి:- అక్కా మీ విమల యేబడిలో చదువుచున్నది? అయినను నీవు విద్యావతివేకదా. ఇంటిలోనె చెప్పుచుండవచ్చును.

శ్యామల:- ఆ! యేమి! చదువుచెప్పుటయే! నాకుతీరిక ఎప్పుడుండును.

సరస్వతీ:- అదేమక్కా! బి. ఏ. ప్యాసయి హైకోర్టు ప్లీడరు భార్యవై ఇంట వలయునంత మంది పనిమనుష్యులుండి అన్ని పనులు నిర్వర్తించుచుండినను ఒక్క పిల్లకు చదువు చెప్పునంత తీరికలేదా!

శ్యామల:- ఎందరుండిననేమి! మావారి స్నేహితులు దినమంతయు వచ్చుచునేయుందురు వారికి కాఫీ ఫలాహారములు తయారు చేయించుటయు ఎక్కడయిన మీటింగుల కేగుటయు అప్పుడప్పుడు పత్రికలకు వ్యాసములు వ్రాయుచుండుట ఇట్లె అనేకములయిన పనులతో సరిపోవుచుండును. ఇవిగాక మా విమలకు నేనన్న భయము కొంచమైనను లేదు. ఏదైన పాఠము చెప్పిన ఒక మాటకు పది ప్రశ్నలువేసి విసుగెత్తించును. ఏదోయొక బడిలో చేర్పించవలెనని ఆలోచించుచున్నాను.

సరస్వతి:- అట్లైన మాబడికి పంపరాదా?

శ్యామల:- మీ పాఠశాలలో చదువు సరిగా లేదందురు.

సరస్వతి:- అదియే పొరబాటు. ఇతర బడులవలె మా బడియందు విపరీతమగు పాశ్చాత్యవ్యామోహము లేదుగాని భారత నారీమణికి కావలసిన యావద్విద్యను సక్రమముగా నేర్పుదురు.

శ్యామల:- మీ స్కూలునందు ఎన్ని క్లాసులవరకు గలదు.

సరస్వతి:- ఓనమాల తరగతినుండి స్కూలు ఫైనల్ వరకునున్నది.

శ్యామల:- మీ పాఠశాలయందు ఏయే భాషలు నేర్పుదురు?

సరస్వతి:- సంస్కృతము, తెనుఁగు ఆంగ్లేయము, ఎవరికేది గావలసినది నేర్పుదురు. ఇవిగాక గృహనిర్వాహణపద్ధతి కుట్టుపని అల్లికపని చిత్రలేఖనము, సంగీతము ఇటువంటి వన్నియు నేర్పుదురు. అప్పుడప్పుడు పిల్లలచే నాటకములు వేయించియు హరికథలు చెప్పించియు బాలికలచే నాట్యకళ నభివృద్ధి పరచుచుందురు.

శ్యామల:- సరే స్కూలు పద్ధతి యంతయు బాగుగనున్నది. మన గృహిణికి యుండవలసిన దంతయు నేర్పునట్లున్నది. ఇప్పుడు నన్ను చూడుము. బి. ఎ. చదివితినేగాని ఇంటి పనులు నాకేమియు చేతగావు. పని మనుష్యులను ఇవి అవి చేయుడని చెప్పి చేయించుటయేగాని స్వయముగా నాకేదియు చేయరాదు. కర్మ వశమున ఎన్నడైన వంటమనిషి రాకుండిన హోటలుకు పరుగెత్తవలసినదే కదా.

సరస్వతి:- మా స్కూలునకు సంబంధించిన బోర్డింగుకూడ అక్కడనే యున్నది. ప్రస్తుతము కొంతమంది పిల్లలుకూడ కలరు. స్కూలు బిల్డింగుకూడ విశాలముగ కట్టించుచున్నారు. ఇదియేగాక విద్యార్థినుల బుద్ధి వికసించుటకై అయిదవ తరగతినుండి మెట్రికువరకుగల విద్యార్థినులచేతను ఉపాధ్యాయులచేతను వివిధ విషయములకు సంబంధించిన వ్యాసములను వ్రాసి మాతృభారతి' యను పత్రికను పాఠశాల తరపున వెలువరించుచున్నారు. చెప్ప మరచితిని విద్యార్థినులనుండి ఫీసుకూడ తీసికొనరు. ఉచితముగ విద్యనేర్పి ఆదర్శమాతగను ఆదర్శగృహిణిగను నొనర్చుటయే ఉన్నతపాఠశాల ముఖ్యోద్దేశము.

శ్యామల:- సరేసుమీ! బడి ఉద్దేశములన్నియు చాలబాగున్నవి. మొన్న నెవరో బడి చదువు బాగులేదనుటచే నిజమనుకొంటిని. నేను నీనుండి అక్కడి పద్ధతులన్నియు వినుటచే నా సందేహము తొలగినది. ఆ పాఠశాల విషయము మిగుల ఆనందముగనున్నది.

సరస్వతి:- అక్కా నీ సందేహము తీరినదా! మీ విమలను పంపెదవా?

శ్యామల:- తప్పక రేపటినుండియే పంపెదను. నీవుకూడ అక్కడనే యుందువుగనుక చిన్న పిల్లయను భయములేదు.

సరస్వతి:- మంచిదక్కా రేపుపొద్దున ౯-౩౦ గంటలకు నేను బడిలో నుందును. విమలనుకూడ సరిగా అదే వేళకు పంపుము.

శ్యామల:- తప్పక పంపెదను.

సరస్వతి:- ఇక నేను వెళ్లిపోయెద నక్కా ఇంటికి వెళ్లి చదువుకొనవలెను.

శ్యామల:- అప్పుడే ఎనిమిది కావచ్చినది. వెన్నెలరాత్రి కాబట్టి తెలియుటలేదు. నేను కూడ వెళ్లెదను (లేచి యిరువురును కలిసి తోట గేటువరకు మాట్లాడుచువెళ్లి శ్యామల కారులో సరస్వతి టాంగాలోను ఒండొరులు సెలవుపుచ్చుకొని వారివారిండ్లకు వారేగిరి. మరుసటి దినమునుండి విమల తన స్నేహితులగు నలుగురు పిల్లలతో కలిసి హైదరాబాదు నందప్పుడు సుల్తానుబజారులోనుండిన బాలికల ఉన్నతపాఠశాలలో చదువుకొనుచుండెను.



వం. రాజేస్వరీ. నాల్గవ ఫారము.

తూర్పుదిక్కింకను ఎఱ్ఱబడలేదు. ప్రతి స్థలమునందు గుక్కుటము లాగియాగి కూయుచున్నవి పక్షులు కిలకిలా రావములతో నటునిటు పరుగెట్టుచున్నవి. జనులు వారి కాలకృత్యములను నెరవేర్చుకొనుచున్నారు. బాలురు వారి పాఠముల జదువుచున్నారు. అపుడొక బీద కన్యయయగు చింతామణి చాల విచార భావముతో అటువైపు నడువసాగినది. ఈ ప్రొద్దుటి దృశ్యములచే పక్షుల రావములచే అశీతల పవనములచేతను కష్టముతో నిండియున్న యామె మనమున కొంకింత యూరటగల్గెను. ఇంతలో ఒక ధ్వని వినబడినది. ఆమె ఆ శబ్దమును వినినంత మాత్రమున నిర్విణ్ణురాలై అటునిటు బెంగతో చూడసాగినది. ఒక మేడమీది ఆడపడుచును చూచెను. తిన్నగా ఆగుమ్మము దాక పోయినిలుచుండి ఆమె ఆ పిల్లనుజూచి చాలా జాలిపడి లోనికి పిలిచినది. పిల్ల ఆమెను చూడగానే కండ్లనుండి నీరు కారసాగినది. వెంటనే ఆ యజమానురాలు ఎందుకమ్మా నీవు ఏడుస్తున్నావు. అని ప్రశ్నించినది ఏమిలేదు నాకు మిమ్ములను చూచుటతోడనే మాయమ్మ జ్ఞాపకమునకు వచ్చుచున్నది. మరి మీ యమ్మ ఎచ్చటనున్నదని ఆ గృహిణి యడిగినది. అమ్మా నీవు ఆ కథ అంతయు చెప్పుమనెదవు అదియొక దుఃఖ సముద్రము, ప్రేమతో నడుగుచున్నారు గాన వినుఁడు.

మరి భోజనము జేసావాయని అడిగినది ఆ యిల్లాలు.

నా కష్టాలన్ని చెబుతుంటే కడుపునిండి పోవునండి అన్నది ఆ పిల్ల.

గృహిణీ:- నీ ముఖము చూచినచో నాకెంతో జాలిగా నున్నదమ్మా.

బాలిక:- నేను దేవుని దగ్గిర తెచ్చుకొన్నది యింతే తల్లి! మాతల్లి నన్నెంతో గారాబముగా చూస్తుండేది? మంచి స్థితిలో మా తండ్రి బియ్యము వర్తకము చేసేటప్పుడు మేము గొప్పగా నుండేవారము.

గృహిణి:- అయితే మరి మీ నాన్న లేరన్నమాట.

బాలిక:- "అవును".

గృ:- మరి నీవు ఎట్లు జీవనము గడపుచున్నావు?

బా:- మీలాంటి వారి దయయుండ నాకేమి ?

గృ:- సరే నీతల్లి యేమి చేయు చుండినది ?

బా:- మాతల్లి వంటసాలలో వంట వండుచుండెడిది.

గృ:- మరి ఎంతడబ్బు గడించేది ?

బా:- పది రూప్యములు దీనితోనే మేము కాలక్షేపము చేసేవారము. మా నాన్న పోయిన పిదప.

గృ:- అయితే నీకిప్పుడెన్ని యేండ్లుంటాయి.

బా:- అమ్మా! ఒకటి తక్కువ పది అనినది పిల్ల.

గృ:- మరి మీ నాన్నను నీవు ఎరుగుదువా ?

బా:- నిక్షేపంలా ఎరుగుదును.

గృ:- అమ్మా! నీవు మంచి తెలివి తేటలుగలదానివలె యున్నావు చిన్న వయస్సు యినప్పటికిన్ని గృహసంబంధమైన విషయము లు తెలుసుకొన్నావు,

బా:- మరి మాతల్లి మా నాన్న పోయిన పిదప ఆమె కష్టాలన్నింటిని యిరుగు పొరుగులతో చెప్పుకొని యేడ్చుచుండ నాకును ఏమి తెలియకుండగనే కండ్లవెంట నీళ్లు బొట బొట కారేవి. గనుక ఈ విషయాలన్ని తెలిసి కొని నేను అమ్మనోదార్చేదాన్ని.

గృ.- అయ్యో పాపమింత చిన్నతన ములో దేవుడింత కష్టముల పాలుజేసెనుకదా ? మరి మీ యమ్మ యిప్పుడెక్కడ యున్నది ?

బా:- తల్లి మాయమ్మ మా నాన్న పోయిన కొన్నాళ్లకు పోయినది.

గృ:- మరి నీవెచ్చట నున్నావు.

బా:- ఇచ్చట పొన్నూరనే గ్రామ ములో ఒక తాశీల్‌దారుగారి ఇంటిలో ఒక కొట్టులో నేను మా యమ్మ మా నాన్న పోయి న పిదప మాగంజి మేము త్రాగుచుండేవా రము వారు మమ్ములను కన్న బిడ్డలవలె కాపాడు వారు పాపము ఆయన ఈ గ్రామమువదలి వేరే గ్రామమునకు వెళ్లిపోయినారు. అప్పటినుండి మాకు సముద్రములో మునిగి పోయినట్లయినది.

గృ:- మరి ఆయన యే గ్రామములో నున్నారు.

బా:- ఆయన యేదో చెప్పినారు గాని యిప్పుడా పేరు తలంపులోనికి వచ్చుటలేదు.

గృ:- మరి ఎల్లా కాలంచేసింది మీ యమ్మ,

బా:- అమ్మా! మాతల్లి మానాన్న పోయిన పిదప తిండిలేక అష్టకష్టములకు పాలై వంటమని షిగా నేర్పడినది. ఆ యింటియిల్లాలు బహు క్రూరురాలు మా యమ్మను చాలా కష్టబెట్టునది. మరియు మా నాన్న మరణమును తలంచుకొని భవిష్యత్తును దలచి క్రుంగి కృశించి చనిపోయినది.

ఇక నేనేమని చెప్పుదును తల్లీ. అని గుర్లిడ్ల నీరు నించినది. ఆకంత అంతే.

గృ:- కంత అంటావేం ఏమి సంగతి?

బా:- కంతంటే మాకాలగునున్యాముగా మాకుసచ్చే అవస్థలున్నా అలాంటివే.

గృ:- అయ్యో! పాపము యింత చిన్న తనములో ఈ మోత దేవుడు నీ తలపై వైచనా? (అనుచుండగా)

బా:- కంటెుంబడి నీరు బొట బొట రాసాగినది.

గృ:- అమ్మాయీ! నీవు ఏమి చింత పడకుము. పడినంత లాభములేదు.

బా:- అమ్మా! నీవు తల్లికంటె ఎక్కువగా ఒదార్చి నాకు ధైర్యము చెప్పు చున్నావు. ఈ మధ్య యీలాటి హృదయంగమ మయిన మాట వినలేదు.

గృ:- నీవు నావద్దనే యుండుము. నాకు పిల్లలెవరులేరు. నాకు నిన్ను చూడడముతోనే ఎంతో జాలికలుగుచున్నది.

బా:- అమ్మా ఆనాటినుండి మమ్ము లను తండ్రిలాగు తాశీల్ దారుగారు కాపాడిరి. ఈ నాడు భగవంతుడు మిమ్ములను చూపినాడు

గృ:- దానికేమిలే నీవు నావద్దయుండి మంచి బుద్ధితో చదువునేర్చుకొని ఒక ప్రయోజకురాలవుగానైనంత నాకు చాలును నాకదియే ఒక కోరిక.

బా:- అట్లాగేతల్లి నేను మీకు చేయ వలసిన సేవనుజేసి మంచి చదువునేర్చుకొని నేను మీ కీర్తికి కారణమయ్యెదను.

గృ:- సరే ఏమి పరవాలేదులే. నీవు సుఖపడినంత మాత్రము నాకుచాలు. మరి నీ నామధేయమేమి?

బా:- తల్లి! నాపేరు చింతామణి

గృ:- అయ్యో నీ పేరునకు తగినట్లు చింత లోనే మునిగియున్నావుగదా? చిట్టితల్లి!

బా:- నా యదృష్టము తల్లి నేనేమని చెప్పను.

అప్పటికి రాత్రి ఎనిమిది ఘంటలు టాం టాం అని కొట్టినది భోజనముచేసిరి. అందరు గదులలోపోయి నిద్రించుచున్నారు. చింతామణికి మాత్రము అప్పటి కింకను నిద్రపట్టలేదు. ఏవేవో తలంపులు వచ్చుచున్నవి. అప్పటికి పదునొకండు ఘంటలు. పట్టి పట్టని నిద్ర వచ్చుచున్నది. ఆమె స్వప్నములో ఆమెను గారాబముగా పెంచినటువంటి తాశీల్ దారు గారు ఎక్కువ కాయలాగానుండి ప్రాణము బోవుస్థితిలినుండి కండ్లబడిరి. అంతట చింతామణి దబ్బున ఉలికిపడిలేచి అటునిటు బెంగతో చాలా సేపు చూచుచు కూర్చుండినది. అప్పటికి ప్రొద్దున కోడిపుంజు గ్రామాధికారులకు మేలుకువ గావించుచున్నది. అప్పుడా గృహిణి చింతామణిని మేల్కొల్పుటకు ఆగదిలో ప్రవేశించి చింతామణి బెంగతోయుండు స్థితినిజూచి ఏమని ప్రశ్నింప జరిగినదంత దెలిపి

నది. ఏమిాలేదు అంతా కలవరముగాని వేరేమి యపాయము కలుగదులే లేచి ముఖము శుభ్రపరచుకొని కాఫీ త్రాగుదు వమ్మా అని నది గృహిణి. అప్పటికి చింతామణి ౧౮ వ సంవత్సరములో ప్రవేశించినది. చక్కగా చదువుకొనుచున్నది యిల్లా కొన్ని సంవత్సరములైన పిదప మంచి రూపలావణ్యము తెలివితేటలు హెచ్చయినవి. గృహిణి ఒక బడిలోని టీచరుగా నియమించినది. మొదట౧౫ రూప్యములలో ప్రవేశించినది. పిమ్మట అచ్చటనుండు హెడ్ మిస్ట్రెస్ ఆమె చాకచక్యమునకు మెచ్చి జీతము హెచ్చించినది. ౩౫ రూ. ఇట్లే చివరకు ౫౦ రూపాయీల వరకు హెచ్చించిరి. మంచి తెలివి మర్యాదలతో ఆమె వద్దనే యున్నది. ఆగృహిణికి వృద్ధాప్యమువచ్చినది. చింతామణి అణకువతో తెచ్చిన జీతమును ముందు గృహిణికిచ్చి వేరు పనిచూచేది. ఇట్లుండుటచే గృహిణి చింతామణి గుణమునకు మెచ్చి అమ్మా చింతామణి నాకు వృద్ధాప్యము నచ్చినది గనుక నాకు ఒంట్లో బాగులేదు. నీకొక దారి చెయ్యవలయునని నా యభిప్రాయము నీవు దానిని అంగీకరించ వలయునని వివాహ ప్రయత్నములు గావించినది. ఆ గృహిణికి సంబంధించిన బంధువులలో ఒక అబ్బాయి పాతిక సంవత్సరములు. అందచందము మంచి చదువును గలవాడు. ఈడు సరిగా వున్నది. మంచి స్థితిలోనేయున్నాడు చింతామణి గుణమునకు మంచివారే దొరికినారని ఎంతోసంతోషముతో వారిద్దరికి జనవరి నెల ౧౯వ తారీఖునాడు వివాహము జరిగించినది. వారు మంచి సుఖముల ననుభవించుచుండ, గృహిణి పట్టలేనంత సంతోషముతో వారిరువురను ఆశీర్వదించి మనుమల నెత్తి కొన్నాళ్లకు కనులు మూసినది. చింతామణి ఆమెకు మంచి కీర్తినినిలువ బెట్టినందులకు ప్రజలు ఆమెను మెచ్చుకొనసాగిరి వారిరువురును సుఖముగా కాలము గడుపుచుండిరి.

చింతామణి యాదర్శగృహిణియై భర్త సేవా పరాయణయై స్త్రీజన సేవ గావించుచు నుద్యోగమున లభించిన ధనముతో దనను కాపాడిన యాయుత్తమ యిల్లాలిపేర నొక మహిళా విద్యాలయమును స్థాపించి యద్దానికి దానె ప్రధానోపాధ్యాయినియై యహర్నిశములు బనిచేసి కీర్తిగాంచినది. చింతామణీయనిన ఆ నాటి ప్రజలకు చింతామణియే! ముండ్లలో బుట్టిన గులాబి పూవుజూచి యాదరించినచో దలపై కెక్కి ప్రకాశించును, లేకున్న ముండ్ల పొదులలో బడి మాయమగునుగదా!





# భక్తి

మ. సావిత్రి. మూడవ ఫారము.

అది వేకువజాము. మలయమారుతములు వీచుచున్నవి. దేవకి అప్పుడే తులసికి నీరుపోయుటకు తోటలోనికి వచ్చెను. ఇంటినుండి ఏదో శబ్దము వినబడెను. లోపలికి వెళ్లి ఎవరైయుండ వచ్చునని అంతట వెదకెను కాని ఎవరునులేకుండిరి. ఏమైయుండ వచ్చుననుచు అన్నము తినక నీళ్లు త్రాగక ఆలోచించుచుండెను. అప్పుడు అమ్మా ! అమ్మాయని మాటవినవచ్చెను. ఆ మాటలు దేవకియొక్క కుమారునివిగా వినవచ్చెను. ఆమాటలు వినగానే దేవకి తత్తరపడుచు లేచి కొంతసేపు నిశ్చేష్టయై నిలచెను. కొంతకాలమైన తర్వాత ఇట్లనమొదలిడెను.

దేవికి:- హా కుమారా ! హా కుమారా ఎచ్చట నుంటివయ్యా ఎంత వెదకినను చిక్కవు. ఇది ఒక చిత్రములాగా కనిపిస్తుంది. ఏలయన రెండు నెలలక్రింద నీవు లాహోరుకు వెళ్లయుంటివికదా ? నీవు వెళ్లిన పదిహేనుదినములకు నీవు ఏదో రైలుక్రింద బడి చనిపోయినావని ఎవరో ఉత్తరము వ్రాసియున్నారు. అది ఏమై యుండ వచ్చును ? నీమీద పగవారు వ్రాసిరో లేక నిజముగా వ్రాసిరో ? ఆదయామయుడగు భగవంతునికే తెలియును అని పెద్దగారోదనము చేయసాగెను. ప్రక్క ఇండ్లలోని వారందరు పరుగులిడి అందరు ఆమె భక్తికి, ఆమె ఉదారగుణమునకు ఆమె శాంతస్వభావమునకు తెలివితేటలకు, ఆమె నడతకు, దాన ధర్మమునకు, ఆమెయొక్క దయార్ద్ర హృదయమునకు వేయేల ఆమె యింతింతయనరాని సద్గుణములు కలిగియుండుటచేత మా దేవకమ్మకు ఏమైనదో, ఏ మైనదో, ఏమైనదో. అనిఅరచుచు ఊరిలోని వారందరు వచ్చిచూడగనే, అచ్చట ఎవరును లేకుండిరి, ఎచ్చటికి పోయెనో యని అందరు వెనుకసాగిరి. ఇట్లు చాలా గొప్పదగుటచేత ఎంతో సేపైన తర్వాత నిండుగా ముగ్గులు వేసి చక్కగాను శుభ్రముగాను ఉన్న ఒక పాలవెల్లిక్రింద కృష్ణునిదగు ఒక చిన్న విగ్రహము ఆ విగ్రహమునిండ పువ్వులచే అలంకరింపబడి దాని ముందర పూజసామాగ్రిలు ఉన్నట్లును వాని ముందర దేవకియు వారికంటబడెను. ఆమెను చూచి ఎందుకబ్బా అట్లుఏడ్చి ఇట్లు ప్రార్థనము చేయుచున్నది. ఏదైన ఈమెకు ఆపదవచ్చెనాయేమి ? మన మందరముకూడ ఈమె కోర్కె నెరవేర్పుమని భగవంతుడగు శ్రీకృష్ణుని ప్రార్థింతనునుకొని ఇక్కడనే మనమందరము వుండిన

పెద్ద శబ్దమగును. కావున మనమందరము ఆవలకు వెళ్లి కృష్ణమహానుభావుని ప్రార్థింతమని తమలో తామనుకొని అందరు బయటికి వెళ్లిరి. ఇంతలో ఎవరో మూడేండ్ల బాలుడు వచ్చి నీ కేమికష్టము వచ్చెనమ్మా, ఎందుకిటుల ప్రార్థించుచున్నావు. నీ ప్రార్థనము నేనంగీకరించితిని. ఏలయింక ప్రార్థించెదవు, వలదు. నీ భక్తికి నేను సంతోషించితిని ? ఏమికావలయునో కోరుకొనుము, ఇచ్చెదనని ముద్దుమాటలతో చెప్పెను. ఈమాటలు ఆమెకు వినబడడములేదు మనస్సంతయు ప్రార్థనమీదనే యున్నది. మరల ఆ బాలుడు అమ్మా ఎందుకమ్మా మాట్లాడవు ? నీ కొరకై మనయూరిలో ఉన్నట్టి జనులందరును ఎంతగా ప్రార్థనము చేయుచున్నారో, చూడు పలుకవా ? ఇక పలుకవా ? ఎట్లు పలుకవో చూచెదను. అని చెప్పి శ్రీకృష్ణుడు తన భక్తి బలముచే ఆమెను కండ్లు తెరిపించెను. ముందర చూచేవరకు విగ్రహములేదు, విగ్రహమున్న చోటున మూడేండ్ల బాలుడు నిలిచియుండెను. అతనినిచూచి సాష్టాంగ నమస్కారములు చేసి నిలువబడెను. అప్పుడు కృష్ణునికి దేవకికిని ఇట్లు సంభాషణ జరిగెను.

కృష్ణుడు:- అమ్మా దేవకి ఎంత పిలచినను ఎందులకు పలుకలేదమ్మా.

దేవకి:- ఎప్పుడు పిలచితివన్నా.

కృ:- ఎప్పుడు పిలచితినా ? ఇప్పటివరకు పిలచిన మాటలేమి, నీవైతె పలుకకనేపోతివి.

దే:- హా కృష్ణా మీరుపిలచిన పలుకక మీానోరంతయు నొప్పించితిని దయచేసి నా తప్పును క్షమించుము. నాకు వినబడలేదు.

కృ:- క్షమించుటకు నీవడుగవలెనా ? నీమనస్సంతయు భగవంతుడగు నామీాదనేయుండెను పలికిననేమి ! పలుకకున్ననేమి ! ఎట్లులైనను నన్నుధ్యానించుటలోనే ఈదుచుండెను.

దే:-కృష్ణా నీవు నాకంట బడినందులకు నేను ధన్యతనొందితిని. నా మీాద అనుగ్రహించి అప్పుడు వినబడిన (నేను ప్రార్థనమునకు రాకముందు ) అమ్మా అమ్మా యను ఆ శబ్దము నాకుమారుడగు మురళి మాటలవలె వినబడెను. ఆతడు అతనితండ్రివెంబడి నేను లాహోరుకు వెళ్లెదనని ఏడ్చి యెంతవద్దనినను విన లేదు. విననందున తండ్రివెంబడి ఒకదాని ఇచ్చి మా మురళిని ఎత్తుకొనుటకు పంపించియుంటిని. అతడువెళ్లిన తదుపరి పదిహేనుదినములకు ఎవరో కుమారుడు చనిపోయినాడని వ్రాసియుండిరి అదియేమైయుండవచ్చునునా కేదియు తెలియుట లేదు. కావున నన్ననుగ్రహించి నాకోర్కెను నెరవేర్చుడు. వాడు రెండేండ్లవాడు మీారు మూడేండ్లవారు. మీారు నన్ను అమ్మాయని పిలచితిరి. మీారు అమ్మాయని పిలచినందున నాకు మీారిద్దరు కుమారులవలె యున్నారు.

కృ:- అమ్మా నిజముగా నేను మీాకుమారుడే యనుకొనుము. నీ కుమారునివలెనే మీాకింటనుండి యికముందు మీా కేయాపదలు రానివ్వను

తమ్ముడగు ముద్దు మురళీని నేను దాచిపెట్టి యున్నాను, నేనే వాడుచనిపోయినాడని జాబు వ్రాసియుంటిని. అందరకును చనిపోయినాడనియే తెలియును. మాతండ్రి మిక్కుటమగు పనివలన ఇల్లుచేరలేదు. అతనికిగూడా చనిపోయినాడనియే తెలియును. అప్పుడు పిలచినవాడు మురళే. ఇదంతయు ఎందుకుచేసితిననగా నీ భక్తి పరీక్షించుటకు, నీ భక్తికి చాలా సంతోషించితిని, నిజముగా నీయంతటి భక్తులు ఇప్పుడు లోకములో లేరు యిక ముందునుండరు ఇంతకు వెనుకకూడ లేకుండిరి. నాపాదములయొక్క దుమ్ముచే నేటికి మనయిల్లు పూజనీయమయ్యెను, చూచితివా ? నీయొక్క యేడ్పుధ్వనివిని మనయూరి ప్రజలందరు ఏమైనదో ! యని దిగులుచేవచ్చి నిన్ను వెదకి వెదకి తుదకు కనుగొనిరి. ఈమెకు యేమైన ఆపద వచ్చెనేమో ఈమె భగవంతుని ప్రార్థన చేయుచున్నది, మనము ఆమె శుభమునకై ప్రార్థింతము. ఒకవేళ మనమిచ్చట ఉన్న యెడల ఈమె ప్రార్థనము భంగముకాగలదని వెరపుచే అవతలికి వెళ్లి అందరు ఇంకను ప్రార్థనము చేయుచున్నారు. మనమురళీని మనతో తీసుకొని వెళ్లెదమని చెప్పి మురళీ మురళి అని పిలిచెను. పిలిచినంతలోనే అన్నయ్యా వచ్చితిని వచ్చితిని అనుచు ఒక మూలనుండి పరుగెత్తుకొని వచ్చెను. రాగానే తల్లియు మురళీని ఎత్తుకొని ముద్దాడి దింపెను, చెరి ఒక చెంబు పట్టుకొని ముగ్గురుకలసి అవతలికి వెళ్లిరి. వెళ్లెవరకు ప్రజలందరు కన్నులు మూసికొని భగవంతుని ప్రార్థించుచునే యుండిరి. అప్పుడు కృష్ణుడిట్లనెను.

కృ:- మీభక్తికి మెచ్చితిని. ఆమె కోర్కె నెరవేర్చితిని. ఇక మీరు ఆమెకొరకు ప్రార్థింపకుడు ఇదియే చాలును. మీరు మీయిండ్లకు వెళ్ల వచ్చుననగానే వారందరు కండ్లుతెరచి చూచిరి చూడగానే వీరు ముగ్గురు వారికంటబడిరి. అప్పుడు ప్రజలట్లనిరి.

ప్ర:- ఓ కృష్ణమహానుభావా ? మిమ్ము చూచు మహాభాగ్యము మీ మాటలు విను మహాభాగ్యము మన దేవకీదేవి వలననే లభించినందునకు ఆమెకు మేమెప్పుడును హృదయపూరితంబగు కృతజ్ఞతను చూపింతుము. నేడు మాకు గొప్ప సుదినము. ఈ దినమేకాక యిక ముందువచ్చు దినములన్నియు సుదినములే. మేము ఇంతకుముందు చేసిన పాపములన్నియు క్షమింపుడు.

కృ:- ఓ పురజనులారా ? మీకు అభయమిచ్చితిని. ఇంతవరకు చేసిన పాపములను క్షమించితిని. ఇకముందుమీకేమియు కష్టములు కలుగనేరవు. మీకందరకును ముక్తిదొరుకును. మీకేమియుభయములేదు. మీరిక ఇండ్లకు వెళ్లవచ్చును.

ప్ర:- మహాభాగ్యము మహాభాగ్య మనుచు ఇండ్లకువెళ్లిరి. తర్వాత ముగ్గురుకలసి భోజనముచేసిరి. పిదప కృష్ణుడు తండ్రికి యిట్లు త్తరము వ్రాసెను.

తండ్రి నేను నాతమ్ముడగు మురళీని నెల క్రిందట నీయొద్దకువచ్చి నీకు తెలియకుండ దాచిపెట్టితిని. దానిని నీవు తెలిసికొనలేక

పోతివి. ఇంతవరకును వానిని మాయచే దాచి యుంచితిని. ఈ దినమే నాతల్లి భక్తికిమెచ్చి వానిని విడుదలచేసితిని. ఇంత వరకును నీకు హెచ్చుగా పనియుండెను. ఇప్పుడు పని తగ్గి పోయినది. ఇంకను నీకు పని కొద్దిగానున్నది అది చెడిపోవునేమోయని భయపడకుము. ఆపని నీవు చేయకున్నను నష్టములేదు. కావున యిప్పు డు నీవు తప్పక రావలయును.

ఇట్లు మీ పెద్దకుమారుడు.

కృష్ణుడు

మరియు మురళియు దేవకియు ఈక్రింద వ్రాసెదరు. మొదట మురళీ ఇట్లు వ్రాయును.

తండ్రీ !

ఇన్ని దినములు నేను అన్నదగ్గెర దాగి యుంటిని. ఇప్పుడుఅమ్మభక్తిచే నేను వెలువడితిని ఇన్ని దినములు అన్న నన్ను ఎందుకు దాచిపెట్టె ననగా ? మాయమ్మ భక్తి పరీక్షించుటకు. నీపను లలో కొంత తగ్గినదని అన్న చెప్పినాను. కావున నీవు తప్పక రమ్ము.

ఇట్లు,

చిన్న కుమారుడు మురళీ.

తర్వాత తల్లి ఇట్లువ్రాయును. దేవా !

మనకుమారుడు ఇన్ని దినములు మహ భగవంతుడగు కృష్ణునిదగ్గెరదాచబడి యుండెను. ఇప్పుడు నా భక్తికిమెచ్చి ఆ కృష్ణమహానుభావు డు మనపుత్రుని మనకు దయచేసినాడు. అట్టి కృష్ణుడు ఇప్పుడు మన దగ్గెరనే యున్నాడు, ఇది ముందుకూడ మన దగ్గెరనేయుండును. మన పెద్ద కుమారుడగు కృష్ణునిచే మీపనితగ్గినదనివిన్నాను. కావున మీరు తప్పక రావలయును. ఇట్లు,

దేవకీదేవి

వీరు ముగ్గురును ఒకటే కవరులో పెట్టి మాధవునికి పంపిరి. ఈ వుత్తరములు అతనికి అందగానే ఇంతింత యనరాని సంతోషముతో ఆ ముగ్వురికి అనేక గొప్ప వస్తువులను లాహోరు నుండి కానుకలుగా తీసికొని వచ్చెను. రాగానే వారందరు కలుసుకొనిరి. అప్పటి వారిసంతో షము బ్రహ్మకైన వర్ణింపతరముకాదు. అప్పటి నుండియు వారికుటుంబ మంతయు అభివృద్ధిలోని కి వచ్చెను. చూచితిరా ! భక్తివలన ఎంతలాభ మున్నదో ? ఇది భక్తి చేతనే గదా ? భక్తి యున్నచో భగవంతుడు మనయధీనమందుండును



# ప్రాచీన హిందూనాగరికత.

శ్రీమతి ఆర్. లలితాదేవి. మెట్రిక్.

నాగరికతయనగా యభివృద్ధి. ప్రాచీన హిందూ నాగరికతయనగా పూర్వకాలములోని హిందువులు చెందిన అభివృద్ధి. అభివృద్ధి పొందుటకు మూడు స్థితులు బాగుగా నుండవలయును. ఆరోగ్యము, మనసు, విద్య, ఈ మూడింటిలోను ఆరోగ్యము ముఖ్యమైనది. అన్ని సంపత్తులలోను శరీర సంపత్తి ముఖ్యమైనది 'శరీర మాద్యంఖలు ధర్మసాధనం' అని పెద్దలు చెప్పుదురు. మొదలు దేహమును ఆరోగ్య స్థితిలోయుంచి పిదప గొప్ప కార్యములు చేయుటకు ప్రయత్నింపవలయును. దేహబలము మాత్రముండి మనోబలము లేకుండిన ప్రయోజనములేదు. మనస్సుగూడ కలతలేకుండ ఎల్లప్పుడును సంతోష వృత్తిని కలిగించుటకు సమర్థమై యుండవలయును. మానస బలము సమకూర్చుకొనిన పిదప విద్యను సంపాదించుట ఉచితము. సంతుష్ట హృదయమున్నప్పుడు విద్య సులభసాధ్య మగును. స్వర్ణపుష్పము పరిమళమునిచ్చిన ఎంత హాయిగానుండునో అంతే హాయిగా మానస శారీరక బలములుండిన విద్యయునుండును. విద్యయనగా విజ్ఞానము అట్టి విజ్ఞానముండి పై చెప్పబడిన యంశములు గూడ యున్న అభివృద్ధిపొందుట సులభము. ఒక మానవుడిట్లు అభివృద్ధిపొందిన అందరును ఒకరిని చూచి ఒకరు నేర్చుకొని అభివృద్ధి పొందుదురు. అప్పుడు దానిని నాగరికతయని చెప్పవచ్చును. ఈ కాలపు నాగరికత ప్రాచీనపు నాగరికతకంటె చాల భిన్నమైనది. ఈ కాలములో నాగరికత అంత ఫ్యాషన్సులోనే యున్నదిగాని నిజమైన నాగరికత అంతరించినది. నాగరికతయనగా ఒక విషయములో అభివృద్ధి పొందుటయేకాదు కాని ప్రతి విషయములోను అభివృద్ధిపొందుటయే నాగరికత యనిపించుకొనును.

ప్రాచీనకాలపు హిందువులు పైన చెప్పినట్లుగా నాగరికులై యుండిరి. వారందరు శారీరక మానస బలములు కలిగియుండుటయే గాక విద్వాంసులై యుండిరి. ఈ కాలములో నున్న ప్రతి విషయమునకు మన పూర్వులైన ఆ హిందువులే ఆదర్శకులు.

ప్రాచీన హిందువులు నాగరికులని చెప్పినాను అది మీకు తెలిసియేయున్నది. ఏ విష

యమునస్త్రైన యభివృద్ధి పొందుటకు పూర్వము హీనస్థితిలో యుండును. అదే విధముగా మన హిందువులుకూడ క్రమక్రమముగా నభివృద్ధి పొందిరి. వారు అభివృద్ధి పొందుటకు పూర్వము ఏ ఏ స్థితిలలోనుండిరో అది మొదలు తెలిసికొన దగినది.

హిందువులు హీనస్థితినుండి క్రమక్రమ ముగా అభివృద్ధి పొందిరని తెలుసుకొంటిమి. వారి పూర్వపు పరిస్థితులను రెండు భాగ ములుగా చేయనచ్చును. మొట్ట మొదలు మన పూర్వులైన ఆర్యులు హిందూ దేశ మునకు వచ్చి ద్రావిడులను పార ద్రోలిరి అను సంగతి అందరికి తెలిసియే యున్నది. గాని దీనికంటే పూర్వమే రెండు యుగములుండినవి. మోటురాతి యుగమునందు మన పూర్వజనులు రాతితో మోటుగా ఆయుధములు చేయుటకు నేర్చుకొనిరి. వారప్పుడు స్థిర నివాసులై యుం డక దేశ దిమ్మరులై యుండిరి వస్త్రములు నేయుట తెలియక తోళ్లు మొదలగు వానిని వస్త్రములుగా ఉపయోగించుచుండిరి. ఆహార ము వండుట తెలియక పచ్చి మాంసమునే భుజించుచుండిరి. మోటుగా రాతితో పనిముట్లు మాత్రము చేయుచుండిరి. చచ్చిన శవములను కాల్చక పక్షులు తినునట్లుగా పారవేయుచుండిరి. ఇట్లు చాలా కాలము అయిన పిదప మెల్లమెల్ల గా అభివృద్ధి గలిగి నునుపురాతితో పనిముట్లు చేయుటకు నేర్చుకొనిరి. కుండలు మొదలగునవి చాల అందముగా చేయగల్గిరి. అహారము వండుటకు మొదలుపెట్టిరి. వస్త్రములు నేసిరి. దేశ దిమ్మరులై యుండక స్థిర నివాసము లేర్పరచుకొనిరి. చచ్చిన పీనుగులను పక్షులు తినునట్లు పారవేయక మృతిచెందిన మనిషి పరలోకమునందును సుఖమననుభవించు నను ఆశతో వారి కుండలు, బానలు, ద్రవ్యము మొదలగు వాటితో పూడ్చి వేయుచుండిరి. అప్పుడు కొంచము అభివృద్ధి దశలోకి వచ్చియుం డిరి. మొదలున్న అజ్ఞానమంతయు తొలగి విజ్ఞానము కలిగెను. మొదలు చెప్పినట్లు వారు అప్పటినుండి ఆరోగ్యము, మనసు, విద్య మొద లగు వానిని తమలో ప్రవేశపరచి నాగరికతను సంపాదించుటకు మొదలుపెట్టిరి. ఇప్పుడు ఒక్కొక్క దానిని తీసికొని వానిని గూర్చి తెలిసికొందము.

నిజముగా చూచిన మన పవిత్ర భారత దేశము పొందిన అభివృద్ధి మరి ఏ దేశము లేక ఏ రాష్ట్రము పొందలేదు. ఇంత వరకుగూడ పొందలేదని చెప్పవచ్చును. మొదలు మానసిక బలమును తీసికొందము మానసిక బలముండిన ఆలోచనాశక్తి వృద్ధిపొంది మనో పావిత్ర్యము కలుగును. ఎందుకనగా Character is the back bone of a man అని చెప్పబడియు న్నది. మంచి నడతయున్న ఏ పనియైనను చేయవచ్చును. మన పూర్వులుగూడ అట్టి మంచి నడతగలవారై యుండిరి గనుకనే గొప్ప గొప్ప కార్యములు చేయకల్గిరి. గొప్ప కార్య ములు చేసినవారిలో మంచి నడతలేనివారెవ్వరు లేకుండిరి. ఆరోగ్యముగూడ వుండవలయునని చెప్పినాను. పూర్వులగుమన భారతీయులందరును

శక్తి సామర్థ్యములు గలవారై యుండిరి గాని రోగముతో బాధపడు వారెవ్వరును లేకుండిరి.

విద్య:- వీటి కన్నిటికి తోడుగా విద్య యుండవలయును. హిందువులందరును విద్వాంసులై యుండిరి. స్త్రీలుగూడ చాలవరకు విద్య నభ్యసించినవారై యుండిరి వారు గణిత శాస్త్రమునందు చాల నిపుణులై అంకగణితము బీజ గణితము, దశాంక గణితము మొదలగు వానియందు గూడ అసమాన పాండిత్యమును గడించియుండిరి. వారు నాలుగు వేదములను చక్కగా నేర్చియుండిరి ఈ విద్యయే గాక, చిత్రకళ, నాట్యకళ, సంగీతము మొదలగు కళలయందు విజ్ఞానమును సంపాదించియుండిరి, స్త్రీలందరు వేదములనేర్చికొని పతివ్రత ధర్మముల చక్కగా నెరింగియుండి గృహనిర్వాహణమునందు సమర్థురాండ్రై దేశమాతను ఉద్ధరించు వారలై యుండిరి పురుషులును స్త్రీలును కవిత్వ కళలో నిపుణులై పెక్కు గ్రంథములను వ్రాయు చుండిరి. కవిత్వకళ శ్రీకృష్ణదేవరాయల కాలములో అభివృద్ధి చెందియుండెను. చిత్రకళలు అభివృద్ధి దశయందుండెనని అశోకుని బౌద్ధ విగ్రహములు స్తూపములు మొదలగు వానియందు చెక్కించిన చిత్రముల వలనను అమరావతి, ధరణికోట, జగ్గయ్యపేట, మొదలగు పరిదేశములలోని దేవాలయములను చూచిన తెలియును. సంగీతము గుప్తసామ్రాజ్యములోని రెండవ చక్రవర్తియగు సముద్రగుప్తుని కాలములో అభివృద్ధి దశలోనుండెను. ఏలయనగా రాజు స్వయముగానే సంగీతము నేర్చుకొని అభిమానముంచినట్లు తెల్పుటకుగాను వీణ వాయించుకొనునట్లు నాణెములను ముద్రించెను.

ద్రావిడులుగూడ మన పూర్వ హిందువులే. వారి కాలములోగూడ భారత దేశము అభివృద్ధి దశయందేయుండెను. ద్రావిడులు చాల నాగరికులై యుండిరి. వారి రాజులును గ్రామాధికారులును వంశ పారంపర్యముగా వచ్చుచుండిరి. రాజులు కోటలలోనుండిరి. కోటలు బలముగను అందముగను ఉండినది. కోట చుట్టు గోడలుండినవి. కోటచుట్టును లోతైన కందకము గూడ యుండెను. ఇనుప ఆయుధములను ఉపయోగించుచుండిరి. పట్టణములనుగూడ నిర్మించిరి. కందులు మొదలగు ధాన్యములను పండించిరి. ఓకుకలవి ధాన్యము సన్న నూలుబట్టలు మొదలగు సరకులను తమ పడవలలో, పారసీకము అస్సిరియా, బాబిలోనియా మొదలగు దేశములకు కొనిపోవుచుండిరి. ఉత్సవములు చేయుచుండిరి. వీరిలో కులభేదములు లేకుండెను. దేవుడొక్కడేయని నమ్మినవారుండిరి. స్త్రీలు గృహములను చక్కగా అలంకరించుచుండిరి.

ఈ కాలముకంటెను ఎక్కువ అభివృద్ధిని క్రీ. పూ. ౨౦౦౦--౧౫౦౦ లలో పొందియుండిరి ఆ కాలము అనగా క్రీ.పూ. ౨౦౦౦ సం॥ ముందు ఋగ్వేదమును రచించిరి. అందుచేత ఈ కాలమునకు వేదకాలమని పేరువచ్చినది. ఇప్పుడు హిందువులు గ్రంథములు, వేదములు మొదలగు

నవి వ్రాయుటకు సమర్థులైయుండిరి. ఈ ఋగ్వేదముకంటె పురాతనమైన గ్రంథము మరియొకటిలేదు. దానివలన గ్రంథరచనగూడ ఇతరులకు హిందువులే నేర్పిరని తెలుచున్నది. యుద్ధమునందు రథములు, కవచములు, బల్లెములు, కత్తులు మొదలగునవి ఉపయోగించుచుండిరి. స్త్రీలు చాల గౌరవము నడయుచుండిరి. గార్గెయి మొదలగువారు గ్రంథములను రచియించి మంత్రములను వ్రాసి ఋగ్వేదమున ఋషులుగా వర్ణింపబడిరి. అందువలన స్త్రీలుగూడ ఆ కాలములో గౌరవనీయులైయుండి విద్యనభ్యసించి గ్రంథములను రచియించు చుండిరని తెలియవచ్చుచున్నది. ఆ కాలములో బాల్య వివాహములు లేకుండెను. స్త్రీలు పురుషులవలెనే బ్రహ్మవిద్యను నేర్చి శాస్త్రచర్చలు చేయుచుండిరి. స్వతంత్రముగా అగ్నిహోత్రములను చేయుచుండిరి. దీనివలనగూడ స్త్రీలు, పురుషులతో సమానముగా పనిచేసి గౌరవమును బడయుచుండిరని తెలియవచ్చుచున్నది. మన పూర్వులైన ఆర్యులకు సంగీతమునందు అభిమానముండుటచేసి గానమే ప్రధానముగా తీసికొని సామవేదమును వ్రాసిరి. ఈ వేదములకు వ్యాఖ్యానములను వ్రాసిరి. ఇవియే వర్ణన గ్రంథములు.

ఇంతటికంటె ఎక్కువ అభివృద్ధి బౌద్ధమత ప్రచారమయిన పిదప గల్గినది. బుద్ధుడు అందరికి ఆదర్శప్రాయుడై భూతదయను అందరి హృదయములలోను ప్రవేశపెట్టెను. దానిని అనుసరించిన రాజులు అశోకుడు, కనిష్కుడు, శ్రీహర్షుడు మొదలగు మహనీయులైనవారు. కావున ఆరాజుల రాజ్యపరిపాలనాపద్ధతిని గురించి తెలిసికొనుటవలన పూర్వకాలపు హిందూ నాగరికత రాజ్యపాలనములో గూడ ఉండినదని తెలియవచ్చును. అశోకుడు తన రాజ్యమును 5 పరగణాలుగా విభజించి నాలుగు పరగణాలకు సరుదారుల నియమించి మధ్య పరగణాను తాను స్వాధీనములో ఉంచుకొనెను. పంచాయతీలను చంద్రగుప్తుడే నియమించెను కాని అశోకుడు బౌద్ధమత ప్రచారముకొరకు ఒక ప్రత్యేక పంచాయతీ నియమించెను. బౌద్ధమత వ్యాప్తికై ఎక్కువ పాటుపడెను. పశువులకొరకు వైద్యశాలలను స్థాపించెను.

స్తూపములను, బుద్ధుని చరిత్రములను రాగిరేకులపై వ్రాసి ప్రచారకులను పంపి చాల విధముల బౌద్ధమతమును దేశమంతటను వ్యాపింపజేయుటకై ప్రయత్నించెను. కనిష్కుని కాలములో బౌద్ధమతము రెండు శాఖలుగా భాగింపబడియుండెను. ఒకటి హీనయానము రెండవది మహాయానము. శ్రీహర్షుడు సభలను చేయించి అందు అన్ని మతములవారును మత చర్చలు చేయునట్లు ఏర్పాటుచేసెను. ఇట్లు అందరు బాగుకొరకై పాటుపడిరి. చాలమంది రాజులు పరదేశీయులు దండెత్తిరాగా వారిని ఖండించి దేశమును కాపాడుకొనిన శూరులుండిరి. దేశాభిమానముగల హిందూ రాజపుత్రధీరులు అనేకులుండిరి. తమ భారతమాతకై ప్రాణములను నోల్పోవుటకు సిద్ధపడు శూరులుండిరి.

ఆకాలమున విద్వాంసులకు గౌరవముండినది. ప్రతిరాజు ఒక మంచికవిని ఆస్థానకవిగా నియమించుకొని తాము గ్రంథముల వ్రాసి కవీశ్వరులను ప్రోత్సహించుచుండిరి. శ్రీహర్షుడు తాను స్వయముగా నాగానందము, ప్రియదర్శికా, రత్నావళియను మూడు సంస్కృత నాటకములను రచించియుండెను. శ్రీకృష్ణదేవరాయల కాలమున అష్ట దిగ్గజములును, చంద్రగుప్త విక్రమాదిత్యునియొద్ద నవరత్నములును ఉండినవి. ఆకాలమున కవి చాల గౌరవింపబడుచుండెను. విద్యకు గౌరవముండెను. ఇట్లు ప్రతి హిందూరాజు నాగరికతకు పాటుపడెను. మన హిందువులు రాజ్యపరిపాలనా పద్ధతి చాల బాగుగా జరిపిరి. చంద్రగుప్తమౌర్యుడు తన రాజ్యములోని గ్రామముల పరిపాలనము పట్టణముల పరిపాలనము వేరువేరుగా చేసెను. అతడు ఆరు పంచాయతీలను నియమించెను. ఒక పంచాయతీవారు పరదేశీయులను ఆదరించి వారికి ఆవసరములైనవాటి నిచ్చుటయు వారిలో నెవరైన చనిపోయిన వారి ద్రవ్యము వారి వారసుల కిచ్చుట మొదలగు పనులను చేయుచుండిరి. రెండవ పంచాయతీవారు కొలతలు, తూనికలలో మోసము జరుగకుండ, అంగళ్లలో విక్రయింపబడు వస్తువులమీద పన్ను వేయుట మొదలగు పనులను చేయుచుండిరి. మూడవ పంచాయతీవారు నీటిని శుభ్రపరచి అందరికిని సమముగా నీళ్లు పోవునట్లు చూచిచుండిరి. నాల్గవ పంచాయతీవారు జననమరణ సంఖ్యల పట్టీలను వ్రాయుచుండిరి. అయిదవ పంచాయతీవారు వర్తకులకు సదుపాయములను చేయుచుండిరి. ఆరవ పంచాయతీవారు అశ్వసైన్యమును కాపాడుచుండిరి. చంద్రగుప్తుడు చాల సైన్యమును కాపాడుచుండెను. మొత్తముమీద రాజులు రాజ్యపరిపాలనము బాగుగనే చేయుచుండిరి 'కఱవు లెన్నడు లేవనియు బలకరమగు ఆహారమునకు కొదువలేద'నియు మేగస్తనీసు వ్రాసెను. ఇతర దేశీయులుగూడ మన భారత దేశము నీవిధముగా పొగడిరి. చంద్రగుప్తమౌర్యునివలెనే చాలరాజులు ప్రఖ్యాతిగాంచిరి. ఇవి రాజ్యపరిపాలనకు సంబంధించినవి. ఇక వారు కనిపెట్టిన నవీనశోధములగూర్చి తెలిసికొందుము.

పౌరాణిక యుగము హైందవ నాగరికతకు ప్రసిద్ధికాంచినది. దానినే స్వర్ణయుగమని యందురు. ఈ కాలములోనే వారు సంస్కృత భాషలోనున్న పురాణములను రచించిరి. వీరు ఈ కాలముననే శ్లోకరూపమున స్మృతులను వ్రాసిరి. ప్రస్తుతము హిందువులు తమ ధర్మతత్వములను ఏ పుస్తకములవలన తెలియునట్లు చేయుచున్నారో ఆ పురాణములు, స్మృతులు శాస్త్రములు మొదలగునవి ఈ యుగమున రచియింపబడినవి. హిందూ మతముతో పాటు, సంస్కృతమును సంస్కృతముతో పాటు హిందూమతమును అభివృద్ధి చెందుచుండెను. విక్రమార్కుడు, హర్షుడును సంస్కృతమును పోషించిరి. అమరసింహుడను మహారాజు అమరకోశమును వ్రాసెను. అమరము మహా

ప్రఖ్యాత దివ్యగ్రంథము. పంచతంత్రములను కథలు రచింపబడినవి. అవి సంస్కృతభాషలో వ్రాయబడినవి. గాని దానిని చదివి కొందరు బాగున్నదని చెప్పి ఆంగ్లేయభాషలోనికి మార్చిరి. అట్టి నీతికథలు రచించుటకు హిందువులే తక్కినవారికి మార్గదర్శకులు. కాళిదాసను కవి వ్రాసిన అభిజ్ఞాన శాకుంతలమను నాటకముకూడ అన్ని భాషలలోనికి మార్చబడినది. ఈ కాలమున సాంకేతిక విద్యకూడ యభివృద్ధిగాంచినది. గ్రీకులకును భారతీయులకును చాల కాలమునుండి రాకపోకలు జరుగుచుండినందువలన ఒకరి యభిప్రాయముల నొకరు గ్రహించుచుండిరి. కాశ్మీరము, తక్షశిల కాశీ, ఉజ్జయినీ, నలంద, శివద్వీపము విద్యకు కేంద్రస్థానములై యుండెను. ఆర్య భట్టను నతడు భూగోళమును వ్రాసి గ్రీకులను మించెను. వరాహమిహరుడు బృహత్సంహితను రచించి వర్షపాతము భూకంపము, శిల్పవిద్య రత్నశాస్త్రము జంతుశాస్త్రములోనగు విశేషములను చర్చించెను. గణిత శాస్త్రమును వివరించెను. భాస్కరాచార్యులు పండ్రెండవ శతాబ్దమున సిద్ధాంత శిరోమణి యను భూగోళశాస్త్రము రచించెను. వీరి సందరిని వీరి వ్రాతలను అదర్శప్రాయముగా పెట్టుకొనియే ఐరోపావారు భూమి గుండ్రముగా నున్నదని ౧౬వ శతాబ్దమున కనుగొనిరి. దశాంశభిన్న పద్ధతిని హిందువులే కనిపెట్టిరి. వారినుండి అరబ్బులు అరబ్బుల నుండి ఇతర దేశీయులు నేర్చుకొనిరి. హిందువులు వ్రాసిన ఆయుర్వేదముకంటె పురాతన వైద్యశాస్త్రము లేనేలేదు. కనిష్కుని ఆస్థాన వైద్యుడగు చరకు డెనిమిది గ్రంథములను వ్రాసెను. నాల్గవ శతాబ్దమున సుశ్రుతుడను వాడు శస్త్రచికిత్సను రచియించి ౧౨౭ శస్త్రములను కనిపెట్టెను. తొమ్మిదవ శతాబ్దమున హరూన్ ఆల్ రషీద్ యొక్క ఆస్థానమున బగ్దాదులో ఇద్దరు ఆయుర్వేద వైద్యులుండిరి. వారు ఆయుర్వేద గ్రంథముల నరబ్బీ భాషలో మార్చిరి. అసలు "ఈనాటి పాశ్చాత్య వైద్యుల వస్తుగుణ పరీక్షకును శస్త్ర చికిత్సకును ఆయుర్వేదమే మూలాధారము" అని హరవిలాసు శారదాగారు వ్రాసినారు. ఈ కాలములోనే శిల్పవిద్యగూడ అభివృద్ధిగాంచినది. అప్పుడు బౌద్ధమతము అభివృద్ధిదశలోయుండెను. అజంతా మొదలగు విహారములన్నియు హిందువుల శిల్పకళలతో నిండినవి. వానిని చూచిన వారందరు విస్మయమొందకపోరు. అందరి స్త్రీ పురుషుల ముఖములందు సత్వగుణము మూర్తీభవించి యున్నది. ఆ రంగులన్నియు నేటికి మెరయుచు నున్నవి.

ఈ కాలమున భారతవర్షమునకును, చీనా, త్రివిష్టప, మధ్య అసియా కామరూప, యవన, రోమక, అస్సీరియా, ఈజిప్టు దేశములకును వర్తకము జరుగుచుండెను. హిందువులు సింహళము, బలి, జావా, సెలిబర్ మొదలగు ద్వీపములకువెల్లి వర్తకము చేయుచుండిరి.

ఇంకేమి కొదువ? అన్ని దేశముల కన్నను అన్ని విషయములలోను మన భారత

మాతయే ముందడుగిడి యితర దేశములను నాతో పోటికిరండి, యనునట్లు సిద్ధపడియుండెడిది. కుమాళ్లను కూతుర్లను నాగరికులుగా చేసినది. మన బాలబాలికలే ఇతరులకు ఆదర్శపాత్రియులుగా నుండవలెనని ప్రయత్నించినది. ప్రయత్నములు కొనసాగినవి. అన్నియు బాగుగనే యుండినవి. ఇప్పుడు మీకందరికిని ప్రాచీన హిందూనాగరికత తెలిసినది. ఈ కాలమున కొందరు అంటారు "అన్ని కనిపెట్టిన హిందువులు Steam Ships ఎందుకని కనిపెట్టలేదు? ఈ టెలిఫోనులు మొదలగునవి యెందుకు కనిపెట్టలేదు?" ఇది వారికొక గొప్ప సందేహము. కాని హిందువులు ఆ విషయమును కనిపెట్టలేక పోయిరి అని ఎవ్వరు తలంపగూడదు. వారికిప్పుడు Steam Ships అవసరము లేకుండెను. అది అట్లుండ వారు ఇన్ని పనులు చేసిగూడ పరమార్థమును పొందుటకు ప్రయత్నించుచుండిరి. చాల హిందువులు మోక్షమార్గమును పొందినారుగూడ. ఈ పాశ్చాత్యులు ఇప్పుడు Steam Ships కనుగొనినారంటే హిందువులు కనిపెట్టిన Ships నే ఆధారపరచుకొని వానిలో కొన్నిమార్పులను కలిగించి కనుగొనినారు. అందులో అంత గొప్పతనమేమియులేదు.

ఇంక ప్రాచీనకాల హిందువులయొక్క సాంఘిక పరిస్థితులను తెలిసికొందుము. మొదలు వారి దుస్తులనుగూర్చి తెలిసికొందుము. స్త్రీ పురుషులు చాల భారీదుస్తులను ధరించువారు కారు. Simple living high thinking అనినట్లుగా వుండిరి. పురుషులు ఒక దోతి ఒక వస్త్రమునే ధరించువారు. కాని ఈ కాలమువలె దుస్తులకొరకే డబ్బంతయు ఖర్చుపెట్టక పోవువారు. స్త్రీలు మామూలు దుస్తులనే ధరించుచుండిరి. కుంకుమ వారికి ముఖ్య అలంకారమైయుండెను. ఇట్లుండి వారు గూడ విద్యల నభ్యసించి, సమయము వచ్చిన భర్తలతో యుద్ధరంగమునకు వెళ్లి, యుద్ధము ధైర్యముతో చేయగల మహావీరవనితలై యుండిరి.

ఆ కాలమున బాల్యవివాహములు లేకుండెను, స్వయంవరములుండెను. అందరు జనులు ఒకరితో నొకరు స్నేహముతో నుండిరి. బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య, శూద్ర అను నాలుగు తెగలుండినవి. ఈ నాల్గు తెగలవారు తమ తమ పనులను కర్తవ్యములను చేయుచుండిరి. అందరును ధర్మసంబంధమైన కట్టుబాటునకు లోనై రాజభీతిగల్గి మెలంగుచుండిరి. అందరు ఈశ్వర ప్రార్థనము చేయుచుండిరి. ఆకాలమున స్త్రీలకు స్వాతంత్ర్యముండెను. వారు మహా పతివ్రతలై యుండిరి. స్త్రీలకు తులసీపూజ వ్రతములు మొదలగునవి జేయుట కర్తవ్యమైయుండెను. ఆకాలములో మూఢాచారములు మూఢనమ్మకములుండెనని కొందరందురు గాని అవి మూఢనమ్మకములుకావు. వానిలో సత్యముండక పోదు. వారు రెండవ జన్మయున్నదని తలంచువారు. మరియు దానిని రూఢిపరచువారు. ప్రతి స్త్రీయందును పురుషునియందును జాతీయత మూర్తీభవించియుండెను. నా దేశము, నా భాష, నా వేషమని వారు చాల అభిమానము కల్గియుండిరి. అందుకే భారతమాత సంతోషపడినది. అశ్వ

మేధము మొదలగు యాగములను రాజులు చేయుచుండిరి. రాజులు ప్రజల బాగుగాను చూచుకొనుచుండిరి. ఇట్లుండుటవలన దేశము చాల అభివృద్ధి పొందినది.

ఇక ఈ కాలపు నాగరికతకును ఆ కాలపు నాగరికతకును గల తారతమ్యములను చూచుకొందము.

ఈ కాలమున అందరును పాశ్చాత్య వ్యామోహముగలిగి జాతీయత అనునది కొంచమైనను లేక అభిమాన రహితులై యున్నారు. గనుక దేశమిట్లున్నది. కాని ప్రాచీన కాలములో ఒక చిన్న బాలుని నీవెవరవు? అని ప్రశ్నించిన 'నేను భారతమాత పుత్రుడను, అని నొక్కి చెప్పు సామర్థ్యము గలిగియుండెను. ఈ కాలమున తండ్రిని తండ్రియనని వారు దేశముపై యభిమానమెట్లుంచెదరు? వారికి ధర్మమన్న పరిహాసము కాని ప్రాచీనులకు ధర్మమన్న అభిమానము.

ఈ కాలమున విద్యయున్నదిగాని దానిని మంచి పద్ధతిలో జనులు గ్రహించకయున్నారు. ఇట్లుండ విద్యయున్ననేమి లేకున్ననేమి? ఇవియే కావు ఇంక చాల లోపములు హిందువులలో యున్నవి. హిందువులకు హిందువుల మీాదే ద్వేషము. ఐకమత్యములేదు. ఇందతయు ఈ కాలపువారిని నిందించుటకాదు గాని వారందరును ఇట్టి లోపములులేక భారతమాతను మన పూర్వజనులు సంతోషపెట్టినట్టే పెట్టగలరను ఉద్దేశముతో అనుచున్నాను. నేనేకాదు పెక్కు విద్వాంసులుకూడ యనుచున్నారు. కావున సోదరీమణులారా! మీారందరును పూర్వ స్త్రీలను ఆదర్శముగా పెట్టి వారివలెనే యగుటకు ప్రయత్నింపుడు. దేశమును ఉద్ధరించువారము మనమేయని తలంచుడు. అప్పుడు భగవంతుడు సంతసించును. కావున నేటినుండి ప్రయత్నింపుడు.



# కొన్ని వింత ప్రశ్నలు.

శ్రీమతి టి. అంబుతాయి. మెట్రిక్.

“ దూరమునుండి కొండలు నీలముగా యేల కనబడును ?

ఏదయిన నొక వస్తువును మనము ఒక పొరగుండ చూచినట్లయిన ఆవస్తువు పొరయొక్క వర్ణము కలిగియున్నట్లే తెలియును. అనగా పొరయొక్క వర్ణమునుబట్టి ఆవస్తువుయొక్క వర్ణము కూడ మారుచుండును. దీని ననుసరించి కొండలునీలముగా నేలయుండునో తెలిసికొనవచ్చును. మనకును మనము చూచు కొండలకును మధ్య చాలస్థలముండును. అప్పుడు అచ్చటనుండు వాతావరణములోని గాలి పొరలు దట్టముగా నుండును. అందులోఁగొంత నీలవర్ణము కలిసియుండును. అందువలననే మనము చూచునప్పుడా పొరలలోని నీలవర్ణమే కొండలకును ఉన్నట్లు బోధపడును.

మనకు సంతోషముకలిగినప్పుడు కన్నులలోఁ దేజము కనబడుటకుఁగారణమేమి ?

మన కానందమయినప్పుడు కంటిలోని కొన్నికండరములు వేగముగాఁ జలించుచుండును ఆసమయమున మనము కనులుమూయుచు తెరచుచుండుదుము అనగా కనురెప్పలకుఁ జనలమేర్పడును. అప్పుడు నీరు కనులలోఁ జేరును. ఆ నీరు సంతోషమున్నంత వరకు వచ్చుచునే యుండును. కావున మనకన్నులు తేజోవంతములుగా నుండును.

ధ్వని గోడనుకూడ దాటి గదిలోనికెట్లు వినబడును ?

ప్రథమమున శబ్దము గోడమీదపడును. ఆగోడ దళసరిగా నున్నయెడల శబ్దము లోపలివారికిఁగొంచము అస్పష్టముగా వినబడును. శబ్దము గాలిలోఁగలిసినప్పుడు ఆగాలి ఎటువీచిన అచటనుండువారికి వినబడును. ఆదిచాల అస్పష్టముగానుండును. ఆ శబ్దముగాలితోఁగలిసి గోడమీఁద పడినప్పుడు లోపలివారికి స్పష్టముగానో అస్పష్టముగానో గోడయొక్క మందమునుబట్టి వినబడుచుండును.

నక్షత్రములు పగలెచ్చట ఉండును ?

నక్షత్రములు రాత్రి ఎచ్చట నుండునో పగలుకూడ యచటనేయుండును. కాని సూర్య

ప్రకాశములో నవి మరుగుపడును. మనము సూర్యప్రకాశము నాపివేయగలిగితిమేని నక్షత్రములు పగడెపూటగూడ అగుపడగలవు. గనులుమొదలగు లోతుస్థలములలోఁ బనిచేయువారికి పగటిపూటకూడ నక్షత్రములు కనబడుచుండును దీనికికారణము అచట యంధకారముండుటయే. కాన దీనినిబట్టి నక్షత్రములు రాత్రియున్నచోట నే పగలుకూడ నుండుననియు సూర్యప్రకాశము వలన కనబడకుండుననియు తెలియ వచ్చుచున్నది.

ప్రపంచములో భూకంపమన్ని భాగములలోను కలుగక కొన్ని భాగములలో మాత్రము కలుగుచుండును ఏల ?

భూకంపమనగా నేదోయొకభాగము కదలుట, కాని భూమి గుండ్రముగా నుండుటచేత అన్నిభాగములోకే పర్యాయము కదలుటయని యర్థముకాదు. భూమిగుండ్రముగా నుండుట చేత భూకంపము అన్ని భాగములలోను ఒకే పర్యాయమేల కదల గూడదని సందేహము వచ్చుట సహజమే. కాని అట్లు జరుగకుండుట కొకకారణము కలదు. భూమిచాలవిశాలముగా నున్నది భూమియొక్క భాగములు చాలకలవు. ఏ భాగమును మరియొకభాగము ఢీకొనునో యాభాగములోనే యీ భూకంపము కల్గును కాని యన్ని భాగములలో కలుగనేరదు.

ఆలోచన చేయుటయు తలంచుటయు నొకటి కాదు. ఆలోచనచేయుట యనగా నేదయినయొక యనుభవమును గూర్చి తలంచుట. ఇట్టి ఆలోచనచేయుశక్తి జంతువులలో నుండుటరుదు కుక్కలకు మాత్రము ఈ జ్ఞానముకలదు దీనినిబట్టిచూడ జంతువులలోనే జ్ఞానము కుక్కలకయినను కలదని తెలుచున్నది.

(Ear rings) ఇయర్ రింగ్సువలన కంటి కేమయిన లాభము కలుగునా ?

ఈచెవిలో వేయు ఆభరణమువలన కండ్ల కేవిధమైన లాభమునులేదు. ఇవి చెవులకు శోభనిచ్చుటకుగాను వేయుదురు. కాని దీని వలన ఇతర విధములైన లాభములు కలుగనేరవు ఇదే విధముగా ముక్కుకు శోభనిచ్చుటకుగాను ముక్కుపోగులు వేయుదురు.

చిన్న జీవములను రెండుభాగములుగా కోసినను అవి బ్రతికియుండుటకు కారణమేమి ?

సామాన్యముగా నన్నిజీవముల నాడీమండలముయొక్క చలనము మెదడుమీద ఆధారపడి యుండును. ఈనాడీమండలము మెదడులోనేయుండును కాని చిన్నజీవములలోనిది వ్యతిరిక్తముగా నుండును. వాని నరములు దేహమంతయు వ్యాపించియుండును. కావుననే వానిని రెండు భాగములుగా తెగగొట్టినను నరములు రెండుభాగములలోను సమముగా విభజింపబడి నంతకాలమయినను బ్రతుకగలవు. ఇట్లే పెద్ద జంతువును కోసిన అన్నినాడులు తెగును ఏలయన దాని సంబంధము మెదడులో యుండును.

ఆకాశము క్రిందపడునా ?

మానవుడు ఆకాశమునుకూడ ఒకగోళముపలె భావించును. కాని నిజమాలోచించిన ఆకాశమనగా శూన్యప్రదేశము కావునయది క్రిందపడ నేరదు.

మనమీ విషయమును సూక్ష్మముగా నభ్యసించిన ఒక ఆకాశమేకాక కొంత కొంత దూరములో కొన్ని కొన్ని గోళములు కలవని బోధపడును. మనము దేనిని ఆకాశమందుమో యదియునిట్టిదే.

భూమివలెనే సూర్యునికి సొంత వెలుగు కలదా ?

కొన్నియుగములక్రింద భూమికి కూడ సొంత వెలుగుడుండినది. అది యిప్పుడు క్రమక్రమముగా చల్లబడుచున్నది. భూమికంటెను సూర్యుడు పరిమాణమున పెద్దగా నుండుటచేత నిప్పటికి కూడ సూర్యుడు ప్రకాశించుచున్నాడు. కాని భూమి చిన్నదగుటచేత వెలుగు క్రమక్రమముగా తగ్గిపోయినది. భూమివలెనే చంద్రుని వెలుగు గూడ తగ్గిపోయినది. క్రమక్రమముగా సూర్యుని వెలుగుకూడ తగ్గుట సంభవింప వచ్చును. దీనినిబట్టి చూడ సూర్యుడు ఇంక కొంతకాలమయినను ప్రకాశము నిచ్చుచుండును.

టెంకాయలో పాలేల ఉండును ?

టెంకాయలోనుండునవి పాలుకావు. అవి మనకు పాలవలెకనబడి నప్పటికిని అవిపాలు కావు. టెంకాయలో నుండునవి పాలేఅయిన యెడల యిదియొక పెద్దప్రశ్నగా పరిణమించి యుండెడిది. ఏలయన కొన్నిజంతువులు మాత్రమే పాలనిచ్చును. మనపాలకును టెంకాయలోని పాలకును చాలభేదముకలదు. మనమొక శిశువును ఆటెంకాయ పాలమీదనే పోషింప ప్రయత్నించిన ఆ ప్రయత్నము నిష్ఫలమయి కొంత కాలములోనే శిశువు మరణించును. ఈ టెంకాయలోని పాలు కొన్నివ్యాధులను కలుగజేయును.

సబ్బులోని వర్ణము మనకేల విడదీయరాదు

మనముకొన్ని వస్తువులయొక్క రంగులను ఆవస్తువులనుండి వేరుపరుచగలము. ఏలనన అవి ఆవస్తువుయొక్క పృష్ఠభాగము మీద నేయుండును కాని కొన్ని వస్తువుల రంగులోపల నుండియు నొకటిగానే యుండును. దీనికి ఉదాహరణములు వెండి పాత్రము బంగారు ఉంగరము మొదలగునవి. దీనిరంగును మనము వేరుచేయలేము కదా? అట్లే సబ్బుయొక్కలోపలను ఆరంగును మనము వేరుపరుపలేము.



# కొన్ని ప్రశ్నలు.

శ్రీమతి ఎ. సావిత్రి.

కొన్ని రాత్రులలో నక్షత్రము లెందుకు ఎక్కువ యుండును ?

మనము బాగుగా పరీక్షించి చూచిన నక్షత్రములు కొన్ని రాత్రులలో తక్కువగను మరి కొన్ని రాత్రులలో ఎక్కువగను యుండుట లేదు. కాని శీతోష్ణ పరిస్థితిని బట్టి మనకు కొన్ని రాత్రులలో ఎక్కువగను కొన్ని రాత్రులలో తక్కువగను కనుపించుచున్నవి. కొన్ని రాత్రులలో మేఘము లెక్కువగా నుండుటవలన మనకు నక్షత్రములు ఎక్కువగా కనబడుట లేదు. అవి ఒకసారి తగ్గి ఒకసారి హెచ్చుట లేదు. చాల దుమ్ముయుండిన నక్షత్రములు ప్రకాశమానముగా కనబడవు. ఒక్కొక్కసారి గాలియొక్క ఒత్తిడిని బట్టి కూడ మనకు నక్షత్రములు కనబడుటయు కనబడకపోవుటయు తటస్థించుచున్నది.

జంతువులు ఒక దానితో నొకటి మాట్లాడు కొనునా ?

సృష్టిలో మానవుడు తప్ప ఇంకే జంతువులును మాట్లాడజాలవని జనులు తలచెడివారు జంతువులుకూడ మన భాషలో గాకున్నను అవి యెరిగిన భాషలో తమ భావములను వెల్లడించుకొనుచున్నవని యెవ్వరును యెరుగరు. ఉదాహరణముగా కోతులను దీసికొందము. అవి వాటి నోరుతో ఎన్నియో శబ్దములు చేయుచున్నవి. ఆ శబ్దముల కర్థము లేకపోలేదు. ఒక చంటిపిల్ల తాను మాట్లాడకున్ననూ తన భావములను వెల్లడిజేయుట లేదా అట్లే ఒక జంతువు తన భావములనింకొక జంతువున కెరిగించుచున్నది జంతువులు తమ ధ్వనితో వాటి సంతోషమునేగాని దుఃఖమునేగాని భయమునేగాని తెలియజేయుచుండును. ఆయాధ్వనులను బట్టి ఆ భావములను వాటి పిల్లలు గ్రహించుచుండును. ఇది కూడ ఒక విధముగా పరస్పరము మాట్లాడుకొనుటయే జంతువులేకాదు చిన్న చిన్న పురుగులు ఒకటితోనొకటి తమ భావములను చెప్పికొనగలవు. ముఖ్యముగా ఈగలు మొదలగు పురుగులు మాట్లాడ లేకున్న ఒక్కొక్కచోట అంత గుంపులు గుంపులుగానుండి కలిసి మెలసి మెట్లుండును. ఈ చిన్న పురుగులకు

ఫిలర్స్ fealers యుండును. వాటితోనే అవి ఒకటి నొకటి తాకి తమ భావములను ఒకటితో నొకటి చెప్పికొనును. జంతువుల భాషను జంతువులే గ్రహించగలవు. అవి చేయు శబ్దములు మనకు శబ్దములవలె నుండును కాని ఆ శబ్దములే వాటి భాష. అది మనకు తెలియదు. అవి మాట్లాడుటలేదని యనకూడదు.

అందమనగా నేమి?

అందమనగా నిది యని మనము గట్టిగా చెప్పజాలము. ఒక వస్తువును జూచిన మనకది అందముగా కనబడవచ్చును. అదియె ఇంకొకరికి చెడ్డగా కనబడవచ్చును. అందమనగా నేమియు లేదు. ఏది యెవరికండ్లకింపగునో అది వారి కందమైనది. అందమనగా మనస్సునకు కండ్లకును ఇంపుచే కూర్చునది. మనస్సున కాహ్లాదమును కండ్లకింపును చేకూర్చు వస్తువు అందమైనదని చెప్పవచ్చును.

చెట్లుపైకే ఎందుకు పెరుగవలెను?

చెట్టు అంతయు పైకే పెరుగుటలేదు కొంతభాగము లనగా వేళ్లు కిందికిని పైకిని పెరుగుచున్నవి. మానవ శరీరములో కొంత భాగము వలెనే చెట్లలోకూడ సెల్స్ యున్నది. కొన్ని సెల్స్ గాలిలోను వెలుతురులోను పెరుగును. మరికొన్ని సెల్స్ చీకటిలోను భూమిలోను పెరుగును. విత్తనము పెట్టగానె గాలిలోను వెలుతురులోను పెరుగవలసిన సెల్స్ గాలిని వెలుతురును వెదకికొనుచు పైకివచ్చును. అందువలన చెట్లు పైకి పెరుగుచున్నది. ఆకులు పువ్వులు మొదలగువాటిని వృద్ధి చేయు సెల్స్‌కు గాలి వెలుతురు కావలెను కాబట్టి అవి పైకి పెరుగుటచే ఆకులు పువ్వులు కాయలు పైననే కలుగుచున్నవి. వేళ్లకు గాలి వెలుతురు అవసరములేదు కాబట్టి అవి భూమిలోకి పెరుగుచున్నవి.

మనకు అరచేతిలో గీతలెందుకుండును?

కొన్ని విధములగు నరములు (nevres అరచేతిలో ముగియుటచే ఆ గీతలు ఏర్పడినవి. అంతియేకాని ఇవి మానవుని గుణములను అదృష్టమును దెల్పు గీతలుకావు. అరచేతిలోనున్న nerves కు వస్తువులను పట్టుకొను శక్తియున్నది అందువలననే మనము వస్తువులను చేతిలో పట్టుకొనగలము.

మనము ఎల్లప్పుడు యెందుకు పెరుగుచుండగూడదు?

మన దేహమంతయు సెల్స్ Cells తో చేయబడియున్నది. సెల్స్ పెరిగిన మనము పెరుగగలము. మనము తిను ఆహారమువలన సెల్స్ పెద్దవై విభజింపబడి ఎక్కువ సెల్స్ అగుచుండును. ఇట్లు విభజింపబడుటయె సెల్స్ యొక్క అభివృద్ధి. ఇట్లు సెల్స్ పెరుగుచుండిన మనమును పెరుగుచుందుము. ఈ cellsకు కొంతవరకే పెరుగు శక్తికలదు. అటు తరువాత మనము ఎంత బలకరమైన యాహారము తీసికొన్నను ఆ సెల్స్ పెరుగవు? చిన్నగానున్నప్పుడు త్వరత్వరగా పెరుగుచువచ్చి ఆ సెల్స్ పెరుగ

వలసిన అవధివరకు పెరిగి ఆగిపోవును.

దేనివలన మనకాకలి కలుగుచున్నది?

మనకు ఆకలిగానున్నప్పుడు 'నీకు ఇప్పుడు అకలిగానున్నది అని ఒకరు చెప్ప నక్కరలేదు ఎవరి యాకలి వారే తెలిసికొందురు. చంటి బిడ్డలు సహితము వారి యాకలిని వారు గుర్తె రుగుదురు. ఇది పుట్టుకతో వచ్చినదని చెప్ప వచ్చును.

కొన్ని సెల్సుచేత మన శరీరముచేయబడి యున్నదికదా. ఆ సెల్సే మనకు ఆకలిని పుట్టిం చుచున్నవి. మనము తిన్న యాహారము జీర్ణ మైపోగానే కడుపులో ఒక విధమైన Sinking feeling ఏర్పడును. ఆ భావనను ఆకలి యందురు. ఈ ఆకలిని గుర్తెరుగు గుణము మనుష్యునికి ఒకరు చెప్పకుండనే వచ్చినది.

చేపలు భూమిమీద యెందుకు బ్రదుక జాలవు?

ఏ ప్రాణికైనను గాలి అత్యవసరము. చేపలు భూమి మీదవేసినప్పుడు మనము నీళ్లలోమునిగి నప్పుడు ఎట్లు ఉక్కిరి చిక్కిరి (Saffocate) అగుదుమో అట్లే అగును. భూమిమీద గాలియున్నదని తెలిసిన విషయ మేకదా అట్లయిన నివసించుటకు గాలియే ముఖ్యావసరమైనప్పుడు చేప భూమిమీద ఎందుకు బ్రతుకజాలదు? అది భూమిమీదనున్న గాలిని యెందుకు పీల్చుకొనదు? గాలిని గాలినుండి పీల్చు కొనవలెనన్న ఊపిరి తిత్తులుండవలయును. చేపకు ఊపిరి తిత్తులులేవు గాని వాటి బదులు Gills యున్నవి. మనకు గిల్సులేవు కాని ఊపిరి తిత్తులున్నవి. గిల్సుయుండుటవలన చేపనీళ్లలో కలసియున్న గాలిని నీళ్లలోనుండి తీసికొనగలదు గాని గాలినుండి గాలిని పీల్చుకొనజాలదు. అందులకే చేప భూమిమీద బ్రతుకజాలదు.

వర్షబిందువు ఏల గుండ్రముగానుండును?

నీటి అవిరియే ఘనీభవించి మేఘములై ఆ మేఘములద్వారా వర్షము పడుచున్నది. మనుష్యులు ఒక గుండ్రముచేయుటకు ఒకరిచేయి ఒకరు పట్టుకొని ఎట్లు గుండ్రముగా నిలువబడు దురో అట్లే వర్షధార క్రింద పడునప్పుడు ఆనీటి యణువు (particles) లన్నియు ఒక దానికొకటి యంటుకొనుటచే వర్షపు బిందువు గుండ్రముగా కనబడుచున్నది. కొన్ని నీటి యణువులు చేరిన ఒక వర్షబిందువగును.

మనము మాటలు లేకుండ విచారింప గలమా?

కొన్నికొన్ని సమయములందు మాటలు ఆలోచింపవచ్చును. ఎట్లు? Algebra మొద లగు లెక్కలు చేయునప్పుడు మాటలు అవసరమే యుండవు. ఎ బి ఎ అని అలోచించి పెద్ద పెద్ద లెక్కలు కనుగొనవచ్చును. ఎ బి ఎ అనునవి మాటలుగావు. కొందరు గీతలలోను గుండ్రి ములలోను వంకర గీతలు మొదలగు వాటిలోను ఆలోచించి గొప్ప గొప్ప విచిత్రములను కని పెట్టుచున్నారు. కొందరు పాటగాండ్రు శబ్దము లతో ఆలోచించుచున్నారు. కాబట్టి మనుష్యులు మాటలతోనే గాక ఇతరమైన వాటితో నైనను ఆలోచించి గొప్ప విచిత్రములను కని పెట్టవచ్చును. కనిపెట్టుచున్నారు.

నమ్మండి! ఈ ప్రశ్నలన్నియును వాటిజవాబులతో శాస్త్రజ్ఞు లంగీకరించినవే.

# కాల ప్రవాహము.

శ్రీమతి ఎ. సావిత్రి

చి॥ సరళను ఆశీర్వదించి వ్రాయునది

బిడ్డా !

నీకు హాస్టలులో దినములు బాగుగా జరుగుచున్నవా. సుఖముగానున్నావా. నీవు వెళ్లినప్పటినుండియు నాకన్నులలో తిరుగుచున్నావు సుమా. నిన్ను విడిచియుండ వలసివచ్చినదను విచారము తప్ప నాకేచింతయులేదు. అయినను ఇంటి జీవితమునకంటె హాస్టలు జీవితమే మంచిది అక్కడే నీకు జ్ఞానాభివృద్ధి కాగలదు. ఇక్కడ ఒక్కదానవు చదువు కొనుటకంటె అక్కడ పదిమందితో కలసిచదివిన యెంత హాయిగా నుండును. హాస్టలుజీవితమువలన పదిమందిలో యెట్లు దిరుగువలెనో నేర్చు కొందువుగదా! అచ్చట యునికివలన ప్రపంచస్థితిగతులన్నియు దెలియును హాస్టలు యజమానులు పిల్లల యెడ దయగలిగి యుందురు. అందరితో ఒకతల్లిపిల్లలవలె సోదరీ ప్రేమతో కలిసి మెలసి యుండు పద్ధతి నేర్చుకొనుము. మంచి ప్రవర్తన గలిగియుండి పిల్లలందరకు తలలో నాలుకవలె మెలంగు చుండుము. పూర్వపు భారతనారీ మతల్లులను మనసునందుంచుకొని ఆదర్శమైన జీవితమును గడప నేర్చుకొనుటకై చదువు చున్నానను సంగతి మరువకుము. తల్లి నీవు వెళ్ళునప్పుడు నేచెప్పిన సంగతులన్నియు మనసు నందుంచుకొని మెలంగుచుండుము. నీ కష్ట సుఖములను వెంట వెంటనే తెలియ జేయు చుండుము. మీనాయనగారు చెల్లెండ్రు ఆది గాగలవారందరికి క్షేమమే, ఆదర్శ బాలికవై నీ తల్లిదండ్రులకును దేశమునకును కీర్తిదెమ్ము దేవుడు నీకు ఆయురారోగ్య ఐశ్వర్యములనిచ్చు గాత జవాబు త్వరగా వ్రాయగలవు.

ఇట్లు,

మాత అన్నపూర్ణ.

---

అమ్మా !

మీయుత్తరము అందుకొని సంతసించితిని మీరు చెప్పిన ప్రకారము నడచుకొనుచున్నాను నాకిచ్చట ఏవిధమైన కష్టములేదు. అందరము సోదరిప్రేమతో కలసిమెలసి యుందుము. అందరు నాయెడల దయ జూపుచుందురు.

నీ వన్నట్లే హాస్టలులో నున్నవారినిబట్టి ప్రపంచ పరిస్థితులు తెలియు చున్నవి. నీకు నేనొక వింత విషయము చెప్పెదను.

మా హాస్టలులో విమలయను పిల్లయున్నది. ప్రతిదినము ఒకాయన వచ్చి ఆమెతో మాట్లాడిపోవుచుండును. వారిద్దరిమధ్యప్రేమయేర్పడినట్లు నాకు ఆపిల్లవలననే తెలిసినది. వారిద్దరికి యుత్తర ప్రత్యుత్తరములు జరుగుచున్నట్లు కూడ కనిపెట్టగలిగితిని. విమల నాతో కలసిమెలసి యుండును కాబట్టి నాకు వారియుత్తర ప్రత్యుత్తరముల సంగతి అప్పుడప్పుడు చెప్పుచుండును. అతనిపేరు మోహనరావట.

పాపము నాకాపిల్లను జూచిన జాలి యనిపించును. తల్లి దండ్రులు దగ్గరలేకున్న మంచి త్రోవకు త్రిప్పువారు లేకున్న ఇట్టివారి సంగతి యేమి కావలసినది. తల్లి దండ్రిలా సంబంధమున కొప్పుకొననిమెడల ఆపిల్ల యేమి కావలసిది ఆమెకు సరియైన బుద్ధి గరపువారు లేకపోబట్టిగదా ఇట్లు జరుగుచున్నది. యని యప్పుడప్పుడు నేను తలంచుచుందును. నేనామెకిది మంచిదికాదని చెప్పదలచితిని కాని యేమను కొనునోయని వెనుదీసితిని.

స్నేహలతయను ఇంకొక పిల్ల. పాపము తల్లి చనిపోయి కొద్దిరోజులే యయినదట. ఆపిల్ల యేడ్చుచుండ నాగుండె నీరగుచుండును. పాపము యెందరు కష్ట జీవులున్నారో ఈ ప్రపంచమునందు.

అమ్మా ! ఇక్కడ అందరముకలసి ఒకె సమయమున ఆడుకొనుటయు చదువుకొను పద్ధతియు చాలబాగుగా నున్నది. మమ్మందరునెవరైన నిజముగ ఒకతల్లిపిల్లలాయనునంత స్నేహముతో నుందుము. నీవు నాకొరకు చింతింపవలదు. నేను సుఖముగానే యున్నాను. చెల్లెలికి నా ముద్దులు నాయనగారికి నమస్కారములు.

ఇట్లు,
కూతురు సరళ.

---

కుమారా !

చి॥ మోహన్‌రావును ఆశీర్వదించి వ్రాయునది.

నిన్ను పట్టణమునకు పంపినది చదువుకొనుటకే యని మరచి పోతివా ? ఈమధ్యనీ నడవడిక యంతయు చెడిపోయినట్లు విన్నాను ఈ కష్టదినములలో కూటికి కరవగు ఈ దినములలో కర్షకవృత్తి ద్వారా సంపాదించిన కొద్ది డబ్బును నీచదువుకొరకు పంపుచుండ నీవుదానిని దుర్వినియోగము చేయుచు చెడు ప్రవర్తనములో మెలగు చున్నావని తెలసికొనుటకు చింతించు చున్నాను. ఇట్టి నడవడికలు పనికిరావు. మాణిక్యమువంటివంశమును మన్నుపాలు చేయుచుంటివిగదా ? నీపిలోకములో పుట్టినదెందముల కో ఇసుమంతయైన యాలోచించితివా !

ఎందులకు పుట్టితివి ? ఏమి చేయుచుంటివి ? నీవు పుట్టినది చెడునడవడికలు నడుచుకొనుటకు గాదు. దేశమునకు ఆదర్శపుత్త్రుఁడవై తల్లిదండ్రులకు నీ వంశమునకు కీర్తి దెచ్చుటకు. చీ ! ఇట్టి నడవడిక గల నిన్ను లోకమేమనును? నీవే పిల్లను ప్రేమించుచున్నావో ఆపిల్ల వంశము సంగతియ్యంతయు నాకును తెలియును ఆమె తలిదండ్రుల స్థితిగతులు బాగుగాలేవు. వారికిని మనకును సరిపడదు. ముఖము జూచి మోసపోవలదు. ఇప్పటి కుఱ్ఱవాళ్లకున్న జబ్బేయది. ఆమె గుణము యెట్టిది ? ఆమె నడనడి యెట్టిది ? ఆ వంశస్థులెట్లుండిరి ఇవన్నియు ఆలోచింపవలెనే గాని పైకి సౌందర్యముగా కనబడినంతనే గుడ్డి ప్రేమలో పడిపోకూడదు. నాకుమాత్రము నీకు చెడ్డపిల్లను చేయవలెనని యుండునా ? నా కోడలు మంచిగుణము గలిగి సౌందర్యవతియై యుండవలయునని నాకుమాత్రముండదా! నీ కొరకు నేను పిల్లను చూడలేనా! ఇప్పుడే నీ కాచింత యెందులకు? ఇకమీదనైనను మంచి ప్రవర్తన గలిగి నడచికొనుము. లేకున్న చివరకు నీవే పశ్చాత్తాప పడుదువు. నీవు నీచదువు పాడుచేసికొనకుము. నా మాట వినుము' పెద్దల మాట విననివాడు చెడిపోవును.

ఇట్లు,

నీశ్రేయోభిలాషియగు

తండ్రి శంకరరావు.

---

రామేశ్వరరావుకు నమస్కరించి వ్రాయునది మిత్రమా !

ఇచ్చట అందరికి క్షేమమే. నీదగ్గర నుండి ఉత్తరములు వచ్చుటలేదు. ఊరికి వెళ్లి యుంటివని విన్నాను. మీ చిన్ననాయన గారిప్పుడు కులాసాగా నున్నారా.

మన స్నేహితుడగు మోహన్‌రావు స్థితి చూచిన జాలివేయును. అత డిప్పుడిచ్చట కనబడుట లేదు. అతడు ఒక పిల్లను ప్రేమించినాడట. తండ్రి కాపిల్ల నీతనికి జేయుట కిష్టము లేదట. తండ్రి కొడుకును మందలించుచు ఇదివరకే ఒక యుత్తరము వ్రాసియుండెనట. కాని మోహన్ తండ్రి చెప్పిన మాట వినలేదట. అందుచే కోపమువచ్చి తండ్రి కొడుకును ఆస్తినుండి డిస్‌మిస్ చేసినాడట. ఈ విషయము ఎవ్వరో యనుకొనుచుండ వినియుంటిని.

డిస్‌మిస్ చేసినట్లు ఈ దినము పత్రికలో కూడ పడినది.

అతనికి ఏదైన ఒక మంచి పద్ధతిపై నడుచుకొనుమని వ్రాయదలంచితిని కాని నాకేమి వ్రాయవలయునో తెలియుటలేదు. ఇటు తండ్రి మాట ప్రకారము ప్రవర్తించుమని వ్రాయుదామా యనిన అతడు ప్రేమించినామెను వదలిపెట్టుమని యెట్లు చెప్పగలము. పోనీ

ఆమెనే పెండ్లి చేసికొని సుఖముగా నుండుమం దామా ఆస్తిని గోల్పోవు నుక దా. నా కేమి వ్రాయవలెనో తోచుటలేదు. చివరకు మోహన్‌రావు పశ్చాత్తాప పడకపోడు.

అక్కడ మీకందరికి క్షేమమేనా. జవాబు త్వరగా వ్రాయుదువని నమ్ముచున్నాను.

ఇట్లు,
స్నేహితుడు రామారావు.

---

రామారావుగారికి నమస్కరించి వ్రాయునది.

మిత్రమా !

సంగతులన్నియు నీ యుత్తరమువలన విశదమైనవి. నీకు మోహన్ రావు సంగతి కొద్దిగనే తెలిసినది. నాకు మొన్న ప్రత్యక్షముగా మోహన్‌రావువద్ద నుండి ఉత్తరము వచ్చినది. ఆస్తినుండి తీసివేసినది నిజమే క్రిష్టియన్ లాప్రకారము ఆ అమ్మాయినే ఆ హాస్టలులోనున్న అమ్మాయినే వివాహము చేసికున్నాడు. మన స్నేహితునిది తప్పుగాని ఒప్పుగాని ప్రోత్సహించుటవదలి సెట్టి యేమో పెద్ద వేదాంతశాస్త్రజ్ఞునివలె యేమి వ్రాయవలెనో తోచుట లేదందువేల. సరే అతనికి నేను ఉత్తరము వ్రాసెదనులే. నీ కాబెంగ ఏలదు. నీ పరీక్షా ఫలితములు తెలిసినవా. గెల్పొందినచో మాకందరకు టీపార్టీ ఇయ్యవలె సుమా !

ఇట్లు,
మిత్రుడు రామేశ్వరరావు.

---

అమ్మా !

నీవద్దనుండి ఈసారి ఉత్తరము ఆలస్యముగా నచ్చిన దెందుచేతనో. ఆయినను నేను జవాబు వ్రాయుట కాలస్యము చేయుటలేదు ఇక్కడ నేను క్షేమముగానే యున్నాను. నా స్నేహితులందరికి క్షేమమే నీవు విమల సంగతి యేమైనదని వ్రాసితివి. నేను నదియే తెలుపవలయునని యుంటిని. విమల కొద్ది రోజుల క్రింద చదువు మానుకొని వెళ్లి ఇదివరకు నేను జెప్పిన ఆ మోహన్‌రావునే పెండ్లి చేసికొనినది.

నేను ధైర్యముచేసి అట్లు ఆమె చేయుచున్నపని మంచిదికాదని చెప్పియుంటిని. నా మాట పెడచెవిని బెట్టును కాని పిదప పశ్చాత్తాప పడగలదని నేను యూరకుంటిని.

ఎండకాలపు సెలవులలో అచ్చటికి రాగలను. చెల్లెలికి బొమ్మలు మొదలగు ఆట వస్తువులు తీసికొని వచ్చెదను, చెల్లెలికి నా ముద్దులు. నాయనగారికి నా నమస్కారములు నాయనగారు నాకీమధ్య ఉత్తరములు వ్రాయుటలేదు.

ఇట్లు,
కూతురు సరళ.

సరళకు నమస్కరించి వ్రాయు ఉత్తరము.

సోదరీ!

నీకు ఉత్తరము వ్రాయుటకు నా కలమాడుటలేదు. నీవు చెప్పిన మాటలు పెడచెవినిబెట్టి తుదకు ఈ దశకు వచ్చితిని. దుఃఖముతోను పశ్చాత్తాపముతోను నా మనస్సు నిండిపోయి యున్నది ఏమియు తోచుటలేదు. ఈ ప్రేమలోకములో పడిపోకపోయిన నేనింత వరకు చదువైన నేర్చుకొనెడిదానను. రెంటికి చెడిన రేవడినైతిని. తుదకు తల్లి దండ్రిలను ఆప్తబంధువులను బాసిపోతిని. ఈ అంధకార కూపములో పడిపోయితిని. అప్పుడు నీహితోక్తులు నాకు కఠోరవాక్కులుగా కనబడినవి. ఇప్పుడవియే నాకు శరణ్యము. ఇంతంతయనరాని పరితాపముచే నా మనస్సు దగ్ధమైపోవుచున్నది. అయ్యో! స్వతంత్రిత యనగా నేమియో అర్థము చేసికొనక ఆ స్వాతంత్ర్యమును దుర్వినియోగము చేసికొంటిని, చిన్న చిన్న పోలయలుక యందును నా మాట నెగ్గవలెనని చూచితిని. మొదట మా కిరువురకు షేక్స్పియర్ గొప్ప మిల్లను గొప్పయనితగాదా వచ్చినది. అయన షేక్సపియర్ గొప్పయనియు నేను మిల్లను గొప్పయనియు వాదించుకొంటిమి. మాట పట్టింపుతో చివరకు ఇంత చిన్న సంగతి విడాకులకు త్రోవతీసినది. అందుకు మొదట నేనే తొందరపడితిని, తరువాత నా భావములతో ఏకీభవించిన వానిని పెండ్లిచేసికొంటిని. ఆయనతో ఇట్టివి రావుగదాయని తలచితి. నాకు అతడు మోహన్‌రావు ఇచ్చినంత స్వాతంత్ర్య మిచ్చుటలేదు. నన్నడచిపట్టి యుంచుచున్నాడు. నా కెంతయో కష్టముగా నున్నది. హితముగోరి చెప్పినవారి మాటల వినకపోవుట కిదే ఫలము. పాపము, పుణ్యము, ఏమి యోచింపక నా జీవితము నిట్లు పాడు చేసికొంటిని. నాకట్టి స్థితిలో ఆత్మహత్యయే మేలని తోచుచున్నది. ఈ భారత దేశములో పుట్టిన పతివ్రతామతల్లులను తలచుకొనిన నాలోవారి రక్తమిసుమంతయైన నున్నదా యని పించును అయ్యో అట్టిపతివ్రతలు పుట్టిన దేశములో నా యట్టి పాపికి దేవుడు స్థానమేల యిచ్చెనో. అట్టి పాపమొనర్చిన నాకు ఒక్కసారి గుండె పగిలిపోగూడదా! సోదరీ ఇట్టిస్థితిలో నున్న సోదరికి సరియైన సలహా నిచ్చి ఈ కష్టముల నుండి గట్టెక్కించెదవని నమ్ముచున్నాను. నాస్వయంకృతాపరాధమున కెవ రేమిచేయగలరు.

ఇట్లు,

సోదరి విమల.

---

సోదరీ విమలా !

నీ యుత్తమువలన సంగతులన్నియు తేటమయినది. నీవట్టి కష్ట దశలోనుండుట కెంతయు విచారము. నీకు నేనెన్నిసార్లు చెప్పితిని అట్టి గ్రుడ్డిప్రేమలో పడిపోవఁగలదని నామాట వింటివా! పాణిగ్రహణమనగా నేమొ తెలిసికొంటివా. ఇట్లు విడాకులిచ్చుకొనవలెనన్న మన పూర్వులట్టి పవిత్ర నియమమేల యేర్పరచి యుందురు. ఏక పత్నీవ్రతస్థుడు పతివ్రత అను పేర్లేలవచ్చినవి. ఇప్పుడందరు పశుసుఖమువిూద నే యాధారపడియున్నారు, పాపములేదు పుణ్యములేదు దేవుడులేదు దయ్యములేదు. దేనిని నమ్మరు. వారికిష్టమువచ్చి చేసిన పనులెల్ల పుణ్యము క్రిందికిజేరుచున్నవి. మనము పశువులముకామే మనుష్యులమే. బుద్ధిగల మనుష్యులమే మంచిచెడుగులు తెలిసికొను శక్తి మనయందున్నదే. అట్టి శక్తియుండికూడ పశువులకంటె నన్యాయమై పోవుచున్నామే. పశువులైనను ఒకసారి కొట్టిన మంచి త్రోవకువచ్చునే. మరల చెడుపని చేయవుగదా. మనవారందు అట్లు ఒకసారికాదు వేయిసార్లు చెప్పి చూచినను వినరే. పూర్వము అట్టి పతివ్రతలు పుట్టిన దేశములో పతియే వ్రతముగా గలిగి పూజించిన దేశములోనే పతిని ఒక ఆటబొమ్మవలె చూచుట యెంత యన్యాయము! ఎంత నీచము! అగ్నిసాక్షిగా చేసికొనిన భర్తనుకూడ విడిచిపెట్టిన జీవితమేమి జీవితము! అప్పుడు భార్యాభర్తయను మాటలెట్లు వాడుదురు.

విమలా నీవట్టి మోహములోపడి పోయితివి. నీవిప్పుడు బాగుపడ్డను జీవితములో ఒక మెట్టు దిగిపోయితివి. అయినను ఇప్పుడైనను పశ్చాత్తాప తప్తురాలవై మంచి త్రోవ నడుచుకొనుము. నీవు ఆత్మహత్యచేసికొనినంత నిరాశపడవలదు ఒకసారి వచ్చిన చెడ్డపేరు యెట్లైనను పోజాలదు కాని ఇప్పుడైనను నీజీవితమును దేశసేవకై వినియోగపరచి కొంత తృప్తిపడుము నీ స్వాతంత్ర్యమును చెడు త్రోవలో బెట్టకుము ఇప్పుడు దేశసేవకై యెంతోమంది యాహుతి కావలసి యున్నది. నీయట్టిదానికి దేశసేవయే శ్రేయస్కరము.

నేను నీవలెకాదు కాని యేవిధముననైనను దేశసేవచేయుటకు ప్రయత్నించుచున్నాను నాతలిదండ్రులుకూడ అందుల కనుకూలురైయున్నారు. కావున సోదరీ నీవిప్పుడు పశ్చాత్తాప తప్తురాలవై నీ భావిజీవితమును దేశసేవ కర్పింపుము

ఇట్లు,
సోదరి సరళ.



# దురదృష్టము.

శ్రీమతి క. అనసూయాదేవి. ఐదవ ఫారము.

ఒక యుద్యానవనములో ఒక చిన్న పెంకుటిల్లు గలదు. ఆ యింటికి సమీపముననే ఒకచిన్న కోనేటికాలువ పారుచుండెను. ఆయేటి కాలువగట్టున అనేక పూలచెట్లు పొదలు మొలచి మరింత దానికి సొగసు కల్పించుచుండెను. దాని నీరు నిర్మలముగా పారుచున్నప్పుడు దూరమునుండి చూచువారికి ఒక పెద్ద వెండి ఖడ్గీ పెట్టినట్లు ప్రశాంతముగా నుండెను. సమీపమున చెట్లపైనున్నవి హంగముల కలకల నాదముల వలనమరింత శోభాయమానముగ నుండెను. ఇంటిముందు చెట్లు వరుసలు వరుసలుగా చిత్రవిచిత్రముగా నుండెను. ఇంటి ముందు రెండు విశాలమైన తిన్నె లుండెను. ఇల్లు మిక్కిలి విశాలమైనది కాకున్నను చాలా బాగుండెను. దానిని చూచిన ప్రతివారికి నిజముగా అక్కడ సౌఖ్య మనుభవింప బుద్ధి పుట్టక మానదు. అది సాయంసమయము. పిల్లలు ఆటలు మాని యింటి కరుదెంచుచుండిరి. పశువుల కాపరులు పశువులను తిరిగి యింటికి తీసుకొని వచ్చుచుండిరి. పొలములలో పని చేయు కాపులు యింటికి వచ్చుచుండిరి. ఒక కాపు ఆ యింటిలో ప్రవేశించెను. అంతలో ముగ్గురు పిల్లలుకూడ వనమునుండి పరుగెత్తుచు వచ్చి లోన ప్రవేశించిరి. వారిని ఆ కాపు యిట్లు మందలించెను.

కాపు:- రామా! నేడు ఇంత కాలము వరకు మీరు ఎటు వెళ్లియుంటిరి.

రాముడు;- నాయనగారూ! యేమి ఈ యుద్యానవనములో ఆడుకొనుచుంటిమి. మేము ఆటలో మగ్నులమై యుండి పొద్దును కనుగొనజాలమైతిమి.

కాపు:- గోపాలా! నీవు పెద్దవాడవై నీవైన చెప్పి వీరిని తీసుకొని రావలదా? ఇప్పుడు దొంగల భయమెక్కువగ నున్నది. కొలది రోజుల మునుపేకదా మన యింటి దగ్గర వారి పిల్లవాని నెవరో అపహరించిరి.

గోపాలుడు:- నాయనా! క్షమింపుడు ముందు మేము ఆలస్య మెప్పుడు చేయము.

రాముడు:- మఱి; నాయనగారూ యన్నట్టు మరచితిని. ఆ పిల్లవాడు దొరుకునట్లు కన్పట్టుచున్నదా! లేదా! ఆయిన మన పత్తే

దారు నారాయణరావుగారు ఎక్కడన్నాడు. వారాపిల్లవానిని గురించి విచారింపడా ?

కాపు:- అబ్బాయీ! ఏమో పాపము రంగయ్యను చూచినప్పుడెల్ల నాకు చాలా విచారమగుచున్నది. అతడు పిల్లవాడు పోయినప్పటినుండి మహా దుఃఖములో మునిగిపోయినాడు. ఏమిచేయగలడు అతనికి లేకలేక పుట్టిన ఒక్క కుమారుడు. వానిని అల్లారు ముద్దుగా పెంచుచు నేటికి ఎనిమిది యేండ్ల వానినిగాచేసి గోల్పోయెను. దీనినే దురదృష్టమందురు. పిల్లవాడు పాపము మంచి వాడురా. ప్రతిరోజు నా దగ్గరకు వచ్చి ఏదో విధముగ నాతో మాటలాడుచు ఉల్లాసనముగా ఆడుచు వుండేవాడు. నాకు ఈ రెండు దినములనుండి బాగుండలేదు.

రాముడు:- నాయనగారూ నేనేమి చెప్పుదును. ఆ పిల్లవాడు మమ్ము నెట్లు నవ్వించువాడో చెప్పతరముకాదు. విశాల హృదయుడు ఎప్పుడు ఏదో ఒక హాస్యముచేసి కడుపుబ్బ నవ్వించువాడండీ. ఈ రెండు దినములు ఆటలలో వాడు పాల్గొనలేదు. ఆట అంతయు నీరులేని బావివలె, నక్షత్రములులేని ఆకాశము వలె, రాజులేని రాజ్యమువలె నుండెను. పిల్లలందరు ఈ రోజు విచారహృదయములతో మా ఆటకాడైన మురళి కొరకు వెతుకుచు ఈ వనమంతయు తిరిగి విసిగి యొకచోట కూర్చొని మాట్లాడుకొనుచుంటిమి.

గోపాలుడు:- నాయనగారు అసత్యము చెప్పితిని. అప్పుడు మీరు కోపగించెదరని అపద్ధము చెప్పితిని. కాని ఇదేకారణము మేము రానందుకు ఇంతవరకు అతనిని గురించి మాట్లాడుచు కూర్చుంటిమి. పాపము అతడు ఈ రోజూ నన్ను అన్నయ్య అని పిలుచుచు నా వెంబడి వచ్చువాడు.

రాముడు:- నాయనగారూ! ఈ రోజు ఎందులకోగాని శ్యామల మాటలాడక ఊరొకన్నది తెలియదు.

గోపాలుడు:- పాపము మురళి శ్యామలలు రోజు ఇద్దరే ఆడుకొనుచుండిరి. ఎటువైపున్నప్పటికి చెల్లెలు శ్యామల మురళీ తప్పైవుండేది. ఈరోజు ఆమె ఆటకూడ ఆడలేదు. ఇల్లే విచారముగా నున్నది.

ఇంతలో బయట నేదోచప్పుడు అయినది. కాపు దీపముపట్టుకొని బయటవచ్చి ఇటునటుచూచెను. ఏమీ కనబడలేదు తిరిగిలోనికి పోయెను, అంత తిరిగి ఏదోఒక శబ్దమువినబడెను. అంత నతడు బయటికివచ్చి తిరిగి ఏమియు కానక లోనికివెళ్లి తలుపు మూసికొనెను. ఇంతలో రామమ్మ వంట సిద్ధమయినది వడ్డనచేసెదను రండు ఈరోజు ఆలస్యమైనది పిల్లలకు ఆకలియగు చుండవచ్చును రండి అనిలోనుండి పిలిచినది. కాపుకుకూడ ఆకలి అగుటవలన అనివినగానే ఒక నిట్టూర్పువిడచి లోనికి బోయెను. రాముఁడు గోపాలుఁడు లేచి తమ చెల్లెలు శ్యామల లేవ నందువలన ఆమెను బుజ్జగించి లేప ప్రయత్నించిరి. కాని విఫలమనోరథులయి శ్యామలా మాటలాడవుకదూ! మంచిది మేము నీతో

రేపటినుండి ఆడుకొనము. మన పంతులు ఈ రోజు ఏమని చెప్పెను జ్ఞాపకములేదా ! వారము లో తల్లి దండ్రులమాట వినుము అని రాలేదా ! మరి ఈరోజు చెప్పినది ఈ రోజేమరచి ఇట్లు చేసిన ఏలాగో చెప్పుము.

శ్యామల:- అన్నయ్యా ! నన్ను బాధించకుడు మీరు వెళ్లి భోంచేయుడు నేను తర్వాత చేసిన చేతును.

గోపాలుడు:- చెల్లె నీవులేనిది మేమెప్పుడైన ఏదైన నోటపెట్టితిమా ఇట్లు ఏలచెప్పెదవు నీవులేనిది నేను తినను.

రాముడు:- నాకు ఆకలియగుచున్నది కాని అన్న తిననట్లయితే నేను తినను.

శ్యామల:- ఎందుకు అన్నయ్యా నేను వచ్చెదను రండి. నేను ఇప్పుడి మిమ్ములను కూడ బాధపెట్టిన దాననౌదును. ముగ్గురులోనికి వచ్చిరి. తండ్రి కాళ్లు చేతులు కడుగుకొని దీనముగా కూర్చొని యున్నారు. ముగ్గురువెళ్లి కాళ్లు చేతులు కడుగుకొని తమ తమ ఆసనము పై కూర్చొనియుండిరి, ఇంతలో రామమ్మ వచ్చి వడ్డించినది అప్పుడు తినుటకారంభించిరి. కాని ఈరోజు మాటలులేవు ముచ్చటలులేవు శ్యామల నిర్విణ్ణగ కూర్చొనియున్నది. వారు తినుచుండిరే కాని వారిమితుర్లడే కండ్లకు కట్టినట్లు నబడుచుండెను. వారందరు తినిలేచిరి వారు కొంత సేపు వనములో యిటునటుతిరిగి మతమక పడకలకు పోయినిద్రించిరి. శ్యామలకు మాత్రము నిద్రపట్టుటలేదు దొంగల భయమగుచుండెను. ఇంతలో బయటనుండి ఒక మనిషివచ్చి తలుపుతట్టినట్లు వినబడెను. అంత కాపు బయటి కివచ్చి చూడ తన మిత్రుడు రంగయ్యవచ్చి అతని సహాయముకొరకై కాపును తనయింటికి పిలుచుకొని పోయెను పాపము రామమ్మ ఇంటిలో ఒక్కతె ఉన్నది శ్యామలమాత్రము ఒకతే భయపడుచు పండుకొని యున్నది. శ్యామల యింతలో నిద్రపట్టక తోటలోనికి వచ్చి చల్లని గాలిలో పండుకొన్నది. తల్లియామెనుచూడలేదు తెల్లవారుచున్నది. పక్షులు కిలకిలమను ధ్వనులు చేయుచున్నవి కోనేటిపైనుండి చల్లనిగాలి సుగంధపుష్పముల సుగంధముతో నిండి వీచుచుండెను. తల్లిలేచి తన పని తీర్చుకొనుచుండెను. ఇట్లు అంతయు శుభ్రపరచి పిల్లలను లేపుటకై వచ్చెను. గోపాలుడు రాముడు అక్కడనే పండుకొని యుండిరి. వారిని వారి తల్లి మేల్కొల్పినది. శ్యామల కొరకు ఇటునటు చూచినది. కాని ఆమె ఎక్కడను కనబడలేదు. వనములోపలికి వచ్చి చూచినది. కాని అక్కడ ఆమె బట్టలు మాత్రమున్నవి. ఆమె లేదు. అది చూచినంతనే తల్లి గుండె లవిశిపోయినివి. గుండెలు బాదుకొనుచు అయ్యో ! శ్యామలా ! ఓ చిన్న బిడ్డా ! నిన్నుకూడ నేను గోల్పోతిని గదా ! మీ నాయన యితరుల సహాయము కొరకు పోయి నిన్ను పోగొట్టుకొనెను. ఈ వార్త విన్న ఒక్క కూతురును గోల్పోయి మీ తండ్రి బొందెలో జీవితముండునా ! మీ అన్న లు నిన్ను విడచి నిమిషముకూడ నుండరుకదా. వారు బ్రతుకగలరా. గోపాలుడు రాముని కంటె ప్రేమించునుకదా. అతడు యిక వుం

డునా? నిన్ను ఎడబాసి నేను జీవింపగలనా! బిడ్డా! ఇట్లు నీవు మా కుటుంబ నాశనమునకై పోతివా తల్లి! ఇక నిన్ను నేనెక్కడ కనుగొనగలను. ఇక నీవు పోయిన నన్ను యమ్మాయని యల్లారుముద్దుగా పిలుచువారెవ్వరే శ్యామలా. నీ చక్కదనము చూచి నిన్ను చంపిరో ఏమో తల్లి వాడు. కసుగాయనుచంపి పాప మొశిగట్టుకొన్నాడాతల్లి ఇక నిన్ను మేము చూడమా! హా! హా! యని మూర్ఛిల్లి పడిపోయినది. లోనుండి గోపాలుడు తల్లి అని వచ్చి తల్లిని చూచి ఏదో జరిగినదని వచ్చి చూచినంతనే గ్రహించి అమ్మో మా కాళీపండుగలొచ్చుచున్నవి. దొంగలు బహుశా వచ్చిరేమో వారిని చూచి తల్లి భయపడినదని తల్లిని సమీపించి ఆమె కుపచారముచేసి తల్లి లేవగానే "శ్యామల" లేదేమే అని అడుగ అమ్మో నాయనా శ్యామలను నేను నా పొట్టబెట్టుకొంటిని. నిన్న నేను అది చాలా విచారముగా నుండెననియే అది యెక్కడ పండుకొన్నదో అని ఊర్కొంటిని. ఉదయమే చూడ ఆమె కనబడలేదు. హా! శ్యామలా! అని పడిపోయినది. అంత గోపాలుడు చెల్లే! అని గట్టిగా అరచి పడిపోయినాడు. రాముడు వచ్చి చెల్లెలిని కానక తల్లిని అన్నను చూచి విచారించి చెల్లె నెవరో ఎత్తుకొని పోయిరని తెలుసుకొని అతడు మూర్ఛిల్లి పడిపోయెను. హా! వారి ప్రేమ నిజముగా వారి ప్రేమయే. నిజమైన ప్రేమ ప్రపంచములో ప్రేమ వింత ఘనకార్యము చేయునో అంత నీచపు పనులు చేయును ఆ సోదరులకు చెల్లెలన్న ఎంత ప్రేమ పాపము. వారు నిస్సహాయులై చూడ వారు ఎల్లప్పటివలె నిద్రించిరో లేక శ్యామలను పరలోకములో వెదక వెళ్లిరో? సూర్యుడు తన ప్రయాణము సాగించి అర్ధప్రయాణము చేసినాడు. తల్లి కొడుకు పూలచెట్లవద్ద పడియున్నారు. పాపము వారిని చూచి వారెవ్వరు లేరు. వారి తండ్రి తెల్లవారుజామున రంగయ్యతో కలసి వారింటికి పోయి మురళీని వెదకుటకు పోయియుండెను. అంత ఒకడువచ్చి వీరినిచూచి చాలా దుఃఖించి వెళ్లిపోయెను. ఇట్లు ఒకరొకరుగా అక్కడికి పోగైరి. ఇంతలో పత్రేదార్లు డాక్టర్లువచ్చి వారిని పరీక్షించి దహన సంస్కారముచేసిరి. పాపము యిక వారిని చూచువారెవ్వరు. వనమంతయు బీడుపడినట్లున్నది. కోనేరు తాను దుఃఖించుచున్నట్లు మరింత నీరు పారించుచుండెను. చెట్లన్నియు వెలుపలపడెను. పూవులన్నియు చెట్ల కన్నీటిబొట్లవలె జలజల రాలజొచ్చెను. ఇల్లంతయు నిర్మానుష్యమాయెను. హా దైవమా! దురదృష్టమున్న ఎప్పుడు ఏది సంభవించునో మానవుడు తెలుసుకొనజాలడు కదా. ఎంత ఘోరకృత్యము జరిగెను. అమ్మో బిడ్డమీది ప్రేమవలన తల్లి చెల్లెలిమీది ప్రేమవలన ఇద్దరు సోదరులు పోయిరి. శ్యామలకు ఇంతేనియు దయలేదు ఎక్కడనున్నదో యింతమందిని ఆ మాలతి తీసుకొనుచున్నది అమ్మో పాపము ఎవరు ఆమెను దొంగలించిరో? ఈరోజు ఆమె శృంగార గానములు వినబడుట లేదు. గోపాలుడు రాముడు బడికి వెళ్లి వచ్చుట లేదు. వారు నిన్నటిరోజున మురళికొరకు విచారముగా నుండిరి. తండ్రితో మాట్లాడుచుండిరి

నేడు తల్లితో మాట్లాడుచు శ్యామలవిచారమును బాపి మురళిని వెదకుటకై వెళ్లిరే పాపము... కాపు మురళిని వెదకి వెదకి సకల ప్రయత్నములుచేసి వేసరి యింటికరుదెంచు చుండెను. అంత కాలుజారి బండి క్రిందనుండి క్రిందబడెను. కాలు విరిగెను. ఆయాసపడుచు అక్కడనే పడెను రంగయ్య ఆయనను ఎత్తుకొని బండిలో నుండి ఇంటికి తీసుకొనివచ్చెను. అయ్యో కాలము ఎటువంటి కార్యములు చేయునో ఎవరికి తెలియదు. ఇప్పుడు ఆ కుంటికాపు యేమిచేయును. లోనికేగి ఒక్కమారు పిల్లలను భార్యను పేరుపెట్టి గట్టిగాపిలచి వారి సంగతిని వారి మరణమును తెలిసికొని తాను మంచముపై కాలి బాధపడుచు కొడుకులను బిడ్డను భార్యను గోల్పోయిన దుఃఖముతో కొలది కాలములోనే కాపు వారిని వెంబడించెను. శ్యామల అసలు దొంగలపాలై కాళీకాదేవికి మహంకాళి పండుగకు బలిగానివ్వబడినది. దురదృష్టమనునది ప్రతి మనుష్యుని జీవితములో అనుభవింప వలసియుండును. అది మనకు తెలియకుండ నెప్పుడేకాలమందు వచ్చునో చెప్పజాలము. పాపము వారి కుటుంబము నాశనమైనది.



# కృతకృత్యుడు.

శ్రీమతి సే. భారతి.

ఉ॥ దారక! రేపటీవు నెలతాలుపు సామికిపూజ భక్తిపెం
పారనొనర్పఁ బొమ్మనెగదా జనకుండిలు వీడువేళనే
నారజతాచలేశు శివునర్చితుజేయఁగఁబోదుగాన సం
భారములెల్ల యిచ్చినను బంపగదేజనయిత్రి యంచనన్ ॥

ఉ॥ అజ్జవరాలు వల్లెయని యర్భకుస్వచ్ఛ జలాశయంబునన్
మజ్జనఁజేయఁబెట్టి వసనంబులగట్టి విభూతిపెట్టి పూ
సజ్జను రుచ్యమాతములె సంగనుపళ్లెము చేతగల్గి నే
సజ్జన జాలమెంతో వుది సంతసమొందగ బంపెబాలకున్ ॥

కం॥ మెడనిడిన నిడుదసరములు
కుడియెడముల జిందులాడ గుడికభిముఖుఁడై
వడినడుగులిడిచు జనెనా
వడుగడుగడుగునకు నెడద భవునిఁదలచుచున్ ॥

చం॥ చనిచనికాంతదవ్వటు పరిశాంతిమయింబు పురాంతకాలయం
బును నటనున్న నందిని సుపుష్పలతాపరిణద్ధమ ధ్వజం
బును తరుణార్కమండలము పోల్కిరుచుల్ వెదజల్లు గోపురం
బునుగని సంభ్రమాద్భుతసముద్ధతి డెందము సందడింపగన్ ॥

ఆ॥ లోని కేగియచట లోకేశుముంగటఁ
బరికరంబులెల్ల వరుసబెట్టి
ద్విజకుమారుఁడంత దీరనిభక్తిని
మీలితాక్షుఁడగుచు శూలిఁదలఁచి ॥

కం॥ తా దెచ్చిన సుమముల గం
గాదరు శిరస్సందుబెట్టి గంధాక్షతల నీ
ఆదేవు మెయినలందిన
మీఁదటనై వేద్యమిచ్చి మెల్లనిటులనున్ ॥

కం॥ బాలేందుమౌళి! యివిగో
పాలుం భక్ష్యములు చూతఫలములు నీ
లీలగ దిన కేభంగిం
గాలక్షేపమ్ము చేయఁగా నేల శివా ॥

కం॥ అనిబాలుఁడెంత బిలచిన
జను దేరకయున్న జాడగనిలింగము దా
పున కేగి కదపి గని శిర
మును నివురుచు ననియెనిట్లు బుడుతడు నెత్తిమె ॥

మ॥ కినుకం జెందితొ నాదుజాప్యమునకై క్షేమంకరుండయ్యనీ
వనుమానించితొ! నాదు సర్వాతనునీయాహారముం మెచ్చవో!
తనువస్వస్థతనొందెనో! పరులు నిందావాక్యముల్ పల్కరో!
వినిపింపంగదవయ్య! ఫాలనయనా! వేవేగనీభావమున్ ॥

ఆ॥ నీవువచ్చుదనుక నీలకంఠాయిట । గాచి యుందుగాన గదలిరమ్మ
వేళమిగిలెనది గొవినువీథిభానుండు । దుర్నిరీక్ష్యుడగుచు దోచెఁగంటె!

ఆ॥ కొంతతడవు వేచి యెంతకు రాకున్న । నెతనుబొంది వెక్కివెక్కి యేడ్చి
“ నిన్నుఁదృప్తి జేయనేరని నేనేల ” । నని శిరంబు గొట్టుకొనగనుండ ॥

సీ॥ చంద్రికాధవళునిఁజంద్ర శేఖరుని మ । హేంద్రవందితుని మహేశుహరుని
నీలకంధరుని గపాలపాణిని నాగవలయితగళుని త్రిశూలధరుని
జర్మాంబరుని ఫాలనిర్మిత నయనుని ధర్మావతారుని నిర్మలాత్ము
గంగాధరుని భసితాంగ శోభితుని శివాంగనా మణిహృదయాబ్జరవిని

గీ॥ “ బాలకా! ఇంత సాహసంబేల నీదు । సచ్చరిత్రంబునెద చాలమెచ్చినాడ”।
యనుచు ముంగిటనున్న సమ్మోహనైకమూర్తి గనులార గనుగొని మ్రొక్కరించి॥

కం॥ ఇంతతడవేల చేసితి । పంతమువిడివిడతి వెదను భంజనమనియా
వంతయరమరక లేక ప్రు । రాంతకుపాదముల బట్టి యాశ్లేషించెం.

కం॥ చెక్కిలిముద్దిడి బాలకు । ప్రక్కన గూర్చుండియపుడు భవుడోగిరమున్
మెక్కి “ ఇఁకఁబోదునేనిఁకఁ జక్కగనీవేగు ” మనుచుఁజయ్యనవెడలన్.

కం॥ సుతుడాడు చిత్రకథవిని । సతపతులు నిర్వ్వరణిక సంభ్రమవతులై
ప్రీతియక్కరంబు నవ్వా । రతి నయమున తలచి తలచి యడిగిరి వినుచున్

ఆ॥ మరుదినంబునను గుమారకురి దేవునిగొల్వనంపివారు కొడుకు వెనుక
నరిగి బాలుడన్నయది నిక్కవముకాదో । తెలియ దలఁచియొకటనిలచికనిరి ॥

గీ॥ పూజలన్నిటి ముగియించి “ భూతనాథ ! భోజనంబున కరుదేరబోలుననుచు”
ప్రేమతోడుత బాలుండు పిలచినంత । లింగమందుండి వచ్చెనాజంగమయ్య ॥

ఆ॥ వచ్చి మధురఫణితి ముచ్చటలాడి నా డిచ్చువాని నెల్లమెచ్చియార
గించి చనుటమెల్లకాంచి తన్మయులరై కొంతమెడకుఁదెల్విఁగొన్న వారు

ఉ॥ గ్రక్కున లోని కేగితమగాదిలి పట్టినిఁగౌగలించికెం
జెక్కులు కందముద్దిడి విశేషతపంబులు పూర్వజన్మలో
జెక్కలొనర్చియుండుట కుబేరస ఖుఁసఖు జేసికొన్నయీ
చక్కని యయ్యనేముగన జాలెడిభాగ్యము గల్గెమాకిఁగన్.

కం॥ సూనుని చర్యలగూరిచి । మానినియును మగడు పెక్కుమార్లు దలఁచుచుఁ
ఆనాఁటినుండి ద్విగుణం । బైనట్టి సుభక్తిఁగొల్చిరనయము హరునిన్ ॥



# నా జీవితము.

శ్రీమతి. జి. ఆండాళు. ఆరవ తరగతి

మా తల్లిదండ్రులకు సంతానము లేకుండెను. అందుచే వారి మనసు మనసులో లేకుండెను. కొన్ని రోజులకు నేనుపుట్టితిని. సంతానము గలిగిన సంతోషముచేత బీదలకు అన్నదానము చేసిరి. ఇరువది యొకటవ రోజున నాకు సువర్ణ యనిపేరుపెట్టిరి. నన్నుచాల ప్రేమగా చూచుచుండిరి కాని నేను చాలమట్టుకు దాదులవద్దనే యుండెడిదానను సంవత్సరమువరకె అన్నిమాటలువచ్చినవి. కాని నేను మా యమ్మను ప్రొద్దు నొకసారి సాయంత్రమొకసారి పిలిచెడిదానను. నాకొఱకు ఒకచిన్న కోచిబండి తెప్పించి నన్ను సాయంత్రముకాగానే బండిలో కూర్చుండబెట్టి త్రిప్పెడివారు. అయిదవ సంవత్సరముననన్ను బాలికల ఉన్నతపాఠశాలలో చేర్చిరి. నేను అక్కడ బాగుగనే చదువుకొనెడిదానను. నేను పాఠశాలలో చేరిన రెండు నెలలకే మాయమ్మ చనిపోయినది. అందరు యేడుస్తుంటే నేను యేమనక ఊరకుండేదాన్ని అందరు 'సువర్ణా

మీయమ్మ పోయింది మరలరాదు' అని అంటే 'మరల మా యమ్మ వస్తుంది' అని వూరకుండే దాన్ని. ఒకసారి నేను అమ్మాయనిపిలిచితే నన్నుచూచి అందరు ఏడ్చినారు కాని నాకేమి బోధపడలేదు. కొన్ని రోజులకు మానాయన రెండవ పెండ్లి చేసుకొనిరి. త్వరగానే మాచిన్నమ్మ కాపురానికి వచ్చినది. నన్ను ప్రేమగాన చూచుచుండెది. నేను పాఠశాలలో ఉపాధ్యాయులు చెప్పినపని చేయుచు నిత్యకృత్యములు సరిగానె చేయుచుంటిని పాఠశాలలో నాటకాలు వేస్తె పాల్గొనెడిదానను. నాకు మాయింటి ప్రక్కనున్న అమ్మాయికి చాల స్నేహితముండెను. నన్ను చూచిఆయమ్మాయి రెండుపూటలు ప్రార్థనచేసెడిది. చక్కనిపాపట తీసెడిది. నిత్యకృత్యములు సరిగాచేసెడిది. నేను వారి యింటిలో ప్రతిదినము కొంచము సంగీతము నేర్చుకొనెదాన్ని. కొన్ని రోజులకు మాచిన్నమ్మ గర్భిణిఅయినది. ఆడపిల్లపుట్టెను. ఆపిల్లకు సుశీల యని పేరుపెట్టినారు. ఆయమ్మాయి పుట్టినప్పటినుండి మాచిన్నమ్మకు నాపైప్రేమ తగ్గుటకారంభించినది. ఆ యమ్మాయికి నాచే నీళ్లుపోయించేది. కొంచము కొంచము వంటపని గూడనాచే చేయించమొదలు పెట్టినది. ప్రతిదినమునాచే బట్టలుతికించేది. అన్నిటిలో నీళ్లు పట్టిపోయుమనెడిది. చలిది యన్నము పెట్టెడిది. తిట్టెడిది కొట్టెడిది కూడాను. మా పాఠశాలలో మాతృభారతి ఉత్సవము అయినది ఆరోజు నేనింటికి ఆలస్యముగావెళ్లితిని. ఎక్కడ తిరుగపోయినావు. ఇంతవరకు ఏమిచేయుచుంటివి అని రెండు దెబ్బలుకొట్టినది మాచిన్నమ్మ. దాసిదానివలె అంతపని నేనే చేసెడిదానను. సుశీలకు అయిదు సంవత్సరములు వచ్చినవి ఒకనాడు మానాయన మామిడిపండ్లు తెచ్చి సుశీలా సువర్ణలిద్దరికి ఇవ్వమని చెప్పినారు సువర్ణకు ఎందుకు ఏమివద్దు. సువ్వీ యనిపిలువక సువర్ణాయని పిలుచుచున్నారేమి అనిఅన్నది మాచిన్నమ్మ. కోపముతో పండ్లునాకివ్వలేదు సుశీలకే యిచ్చినది సుశీలనాకు కొన్నిఇచ్చినది. నేను తినుచుండగా చూచి ఎందుకిచ్చితివని కోపపడినది సుశీలను. నేను ఒకనాడు నాస్నేహితురాలి యింటికి వెళ్లితిని. నాకథయంతయు చెప్పికొని ఏడ్చితిని. తరువాత ఇంటికివచ్చితిని నా పెండ్లిప్రయత్నములు జరుగుచుండినవి. కొద్ది రోజులలో పెండ్లికూడ అయిపోయెను. అత్తవారు నాచదువు నాపివేసిరి. నేను అయిదవ ఫారములో ఉత్తీర్ణురాలనై యుంటిని. నాతో మాయత్తగారు చాలాపని చేయించెడిది.

తల్లిలేనియెడల యెంతకష్టమో నాకిప్పుడుబోధపడినది. మాయమ్మ చనిపోయినప్పుడు నన్ను చూచి అందరు ఏడ్చుచున్న నేను ఎందులకో యనుకొనుచుంటిని ఇప్పుడన్నియు తెలినసినవి.

# నిర్భాగ్యురాలు.

శ్రీమతి. జి. తయ్యా. ఆగవ ఫారము

" అక్కా అక్కా మన అమ్మయుండిన మనచెల్లెలు ఏడువదు కదా " అని సరసఅనెను;

" అవునమ్మా ఏమిచేయగలము అదిగో వంట ఇంటిలోనికి వెళ్ళి అమ్మ యున్నదాయని చూచుచున్నది చూడు " అని సరస్వతియనెను.

రామరావుగారు ఒక గుమాస్తా. మంచి వారు వారికి సరస, సరస్వతి, కమలయను ముగ్గురు పుత్రికలుండిరి. అందులో సరస్వతి పెద్దది, కమలచిన్నది, కమలకు సంవత్సరము నిం డకమునుపే తల్లిఆమెను విడిచిపోయినది. సరస్వతి యే వీరికంతయు చేయుచుండెను. రామరావు గారికి ముప్పది రూప్యములు నెలకువచ్చును.

రామరావుగారు ఒకరోజు బయటవసార లో కూర్చొనియుండగా రఘునాధరావు గార చ్చటికి వచ్చి కూర్చొనిరి

రఘునాధరావుగారు:- ఏమండి రామ రావుగారూ. మీ సరస్వతికి ఎప్పుడు పెండ్లి చేస్తారు.

రామరావుగారు.- ఏమండి ఎవరైనా డ బ్బుయెక్కువ అడుగుతారు. నారాబడి తక్కువ నాకేమి చేయుటకు తోచకున్నది.

ర. రా:- నాకొక పిల్లవానిని తెలుసును వానికి అరువదియేండ్లకంటె ఎక్కువలేదు చాలా సిరిసంపద గలవారు. తల్లిలేదు, అన్నలేదు, చెల్లెలులేదు ఎవ్వరునులేరు. మీపిల్లకు బాధ ఏమి యునుండదు వంటమనిషి వండి పెట్టితే తిని వొంటి నిండ సొమ్ములుపెట్టుకొని మీపిల్లదర్జాగా కాల ముగడుపవచ్చును. మీరొక పైసకూడ కర్చు పెట్టనక్కరలేదు.

రా. రా:- యేమండి అంత ముసలివాని కెట్లుయివ్వగలను.

ర. రా:- అయ్యో ముసలివాడేమిటండీ యేండ్లయితేనేమి. చిన్నవానుగూడ అట్లుండరు మీరేమి సందేహించకుండ పిల్లనిచ్చి పెండ్లి చేయవచ్చును.

రా. రా:- ఊం. సరే. పిల్లవానిని రేపు చూడవచ్చునా ?

ర. రా:- దానికేమి ఇప్పుడంటే యిప్పు డే చూడవచ్చును. రేపు సాయంకాలము నాలు గు గంటలకు తీసికొని వచ్చెదను. వెళ్లెదను.

రా. రా:- మంచిది వెళ్లిరండి.

మరునాడు సాయంకాలము రఘునాథరావుగారు ఆయరువది యేండ్ల ముసలివానిని తీసుకొని వచ్చెను.

ర. రా:- ఏమండి విశ్వనాథంగారూ (సరస్వతిని చూపి) ఈమెనే పెండ్లి కూతురు.

విశ్వనాథంగారు:- మ. మ. మం. మంచిది

ర. రా:- ముహూర్తమెప్పుడు పెట్టమనెదరు.

వి:- సో. సోమ. వార. వారము, ఒక మూహుర్తి, ముహూర్తమున్నది.

ర. రా:- ఏమండి రామరావుగారు సమ్మతమేనా.

రా. రా:- తరువాత చెప్పుతానండి ముహూర్తమెప్పుడు పెట్టవలయునో. వారిద్దరు వెడలిపోయిరి. విశ్వనాథం గారికి చెవుడు, కాలు కొంచెము కుంటి, నోరు పూర్తిగా నత్తి, ఈ సంబంధము రామరావుగారికి యిష్టము లేకుండెను. వారు దానిని వదలిపెట్టిరి.

* * *

మధ్యాహ్నము రెండు గంటలాయెను. ఆరోజు ఆఫీసునకు సెలవు కాబట్టి రామరావుగారు ఇంటిలోనే యుండిరి.

రఘునాథరావుగారు వచ్చి యింకొక సంబంధమున్నదనియు పిల్లవానికి ఇరువది అయిదేండ్లయినదనియు కొంచెము డబ్బు కర్చుపెట్టిన చాలుననియు చెప్పిరి. ఒక మంచి రోజున సరస్వతికి వివాహమాయెను. కొలది దినములయిన పిదప ఆమె అత్తగారింటికి వెడలిపోయెను.

సరస్వతి భర్త మొదటమంచివాడు గానే యుండెను. కాని కొన్ని దినములు గడచినపిదప చెడ్డవారి స్నేహమువలన చెడిపోయెను. సిగరేటు కాల్చడము కల్లుత్రాగడము మొదలకు దుర్గుణములలవడెను. వీటినన్నిటిని సహించుకొనుచు సరస్వతి భర్తను మంచి త్రోవలో నుంచుటకు ప్రయత్నించెను కాని అతడు మారలేదు.

* * *

రాత్రి పదిగంటలయినది. సరస్వతి భర్త భోజనమునకు రాలేదని కాచుకొని యుండెను. రాత్రి రెండు మూడు గంటలు కొట్టినవి, కాని యింకను ఆమెభర్త యింటికి రాకుండెను. ఆ రాత్రియంతయు నామె ఎదురు చూచుచునే యుండెను. మరునాడుకూడ అతడు రాలేదు. ఇట్లు పదిహేను దినములుగడచినవి. సరస్వతి శుష్కించిపోయినది, ఇట్లే ఆమె కాలము గడుపుచుండెను. ఒకరోజు మధ్యాహ్నము ఆమె భర్త యింటికి వచ్చెను. ఆరోజుననే సరస్వతి తండ్రికి ఎక్కువ జబ్బుగానున్నట్లు జాబువచ్చినది. సరస్వతి భర్త పోకూడదని చెప్పెను. పాపమామె ఏమి చేయగలదు ! మరునాడె చనిపోయెనని తంతివచ్చెను. ఆమె దుఃఖించుచున్న సమయములో భర్తఆమెనువిడిచి వెళ్లిపోయెను. ఇట్లు ఒక నెలదినములు గడిచెను. ప్రొద్దున ఎనిమిది గంటలయినది. సరస్వతి తలుపు మూసియే యుండినది. ఇరుగు

పొరుగు వారందరు వచ్చి తలుపుకొట్టి పిలచిరి కాని జవాబేదియును రానందున తలుపు విరుగ గొట్టి చూచిరి. సరస్వతి క్రిందపడియుండుటను చూచిరి. ఆమెచనిపోయినదని గ్రహించి వెంటనే దీనిని పోలీసు వారికి తెలియజేసిరి. డాక్టరుగారు వచ్చిమనోవ్యాధి ఎక్కువయి అకస్మాత్తుగా ప్రాణములు గోల్పోయినదని చెప్పిరి.

పోలీసు వారు ఆమె భర్త కొరకు వెదకిరి కాని ఎక్కడను కనబడలేదు. ఇరుగు పొరుగు వారందరు ఆమెను కాల్చి వేసిరి.



# మద్యపానము.

శ్రీమతి. యం. సి. సత్యమ్మ మూడవ ఫారము

అది ఒకనాటి సాయం సమయము. వెన్నెల రోజులు. సాయంకాలము కాగానే కాఫీ క్లబ్బుకు వెళ్లువారి కేమిజ్ఞాపకము వచ్చును? కాఫీయని చెప్పవచ్చును. అదే రీతిగా మద్యము త్రాగువారికి మద్యము జ్ఞాపకము వచ్చును. రాముడు అను ద్రాక్షారసపానము చేయువానికి తననెచ్చెలిదామోదరుఁడు కనుబడెను.

"రామా! క్షేమమా'

"క్షేమమే"

"ఇంట నా చెల్లెలు క్షేమముగా నున్నాదా"

"అందరు సౌఖ్యముగానే యున్నారు"

"మీ తల్లి ఎచ్చటనున్నది?"

"ఆమె యిక్కడలేదు నాల్గు మాసములైనది తన కూతురింటికి వెళ్లి

తిరిగి ఎప్పుడు వచ్చును"

అదేమో నాకు తెలియదు.

"అయితే యిప్పుడు నీ వ్రియాణమెచ్చటికి"

"అచ్చే యెక్కడికిలేదు"

"అదేమి రామా! చెప్పిననిన్నడ్డగింతునుగా?"

"ఎక్కడికిలేదు ఆ వైపు తిరిగివచ్చెదను.

"నేను నీతో రావచ్చునా"

" అక్కరలేదు లెండి మీపని చెరచు కొని నావెంబడేల వచ్చెదరు. "

మనమిద్దరము స్నేహితులము గనుక నీ కుండు కష్టములను నేను నాకు సాధ్యమైనంత వరకు తీర్చెదను " అబ్బే ఆలాంటి కష్టములు మన కేల కల్గును దైవ సంకల్పము, దానిని మన మడ్డు చేయగలమా "

" నాకింత డబ్బు వచ్చునుగదా "

" అది అట్లుండనిమ్ము నీ ప్రయాణ మెచ్చటికి ? "

" నా వెంబడి వచ్చెదవా "

" తప్పక "

" అయిన వెళ్లెదము "

" రామా ! మొదటనేను వచ్చెద నన గా ఏల సంశయపడితివి ? నాకు అనుమానము గల్గెను. చెప్పదగనిదా ? లేదు. సంశయ మేల చెప్పుము.

ఆ కనుబడు గృహముసందిద్దరును ప్రవే శించిరి.

ఇరువురును గృహములోనికి వెళ్లగనే వారికి ఒకవిధమైన వాసనగొట్టను. అది ఏమో రామునికి తెలియును గనుక అతనికి ఏమియు లేదు. దామోదరునకు చాలా వాసన వచ్చు చుండెను. ఆ గృహమంతయు అచ్చటచ్చట బల్ల యును దానినలుప్రక్కల కుర్చీలును దానిమీద చిన్న చిన్న 5-6. గ్లాసులును బీడీలునుండెను. దామోదరుడు ఎరుగని వాడగుట చేతను అవి యెన్నడు చూడని వాడగుటచేతను అది ఏమో తెలియనందున రాముని అడిగెను.

రామా ! ఇదియేమి ?

ఇది ఏమో నీకు తెలియదా ?

తెలసిననిన్నెట్లడుగుదును 'ఇది ద్రాక్షా రసము కంపెని. అయితే యిటకేలవచ్చితివి, పని యుండి వచ్చితిని ఇంతలో ఒక సేవకుడు వచ్చి రమ్మని పిలిచెను. అంత వారిరువురిని ఒకగదిలో నికి తీసికొనివెళ్లెను ఇదెందుకు. త్రాగుటకు. ఎవరికి. మనకొరకే. నేను దానిని త్రాగను.

బావా ! ఏల నీకింతకోపము దాని రుచి చూచి మాట్లాడుమని యెంతనో బ్రతిమాలెను. అతనిని బలవంతముగా త్రాగించెను వెంటనే యతని మెడలు తిరుగ మొదలుపెట్టెను. అతని నౌకకారు యందుంచుకొని యతనియిల్లుచేర్చెను. ఇది మొదలుప్రతిదినమును యథావిధిని వెళ్లుచు తన దారాపుత్రులగతిని చూడకయున్న ఆ స్త్రీని వ్యయపరచి తినుటకన్నమును కట్టుటకుగుడ్డయు లేక యుండెను, కొన్ని దినములు అప్పుచేసికొని జీవించుచుండెను కాని అప్పుకూడ ఎవరు యివ్వ నందున దొంగిలించుటకు మొదలిడెను.

దొంగ : దొంగ

పట్టుకొండి. ఎవరురా నీవు ? ఓహో దామోదరుడా ?

ఓరీ : నీకిట్టి దుర్బుద్ధి యేలకలిగెనురా ? నీవు సురాపానములు చేయ మొదలిడి సర్వస్వము

ను గోలుపోయినాడండి. ఓరీ శ్రేష్ఠమైన బ్రాహ్మణ జాతియందుద్భవించి యిట్టి నీచపుచేష్టలను చేయుట ధర్మమా ?

అయ్యా:- నా పతిని రక్షించి నాకు పతి భిక్ష పెట్టుడు.

అమ్మా:- సువర్ణమాల ! దుఃఖించియేమి ప్రయోజనము ? వానికర్మమెట్లున్నదో యట్లే కాగలదు దానికి నీవేమిచేయుదువు.

అయ్యా:- ఎరుగనివాడు తప్పు చేసినను క్షమించి బుద్ధులు గరపవలెను

అమ్మా:- నీ భర్త ఎరుగనివాడు ఎరిగి తప్పులు చేసినవానిని క్షమించుట ధర్మముకాదు

ఈదీనురాలిని అనుగ్రహింపుము. మేమెంతవారము నిన్ననుగ్రహించుటకు ? హా ! దేవా ఆర్తజనావనా ! నాయెడ కరుణింపుము, కరుణించువాడు నీభర్త నీగతికేల పంపును. పోలీసువారేరి ? సంకెళ్లువేయండి పోలీసువారతనిని బంధించి తీసుకొని పోయిరి. మద్యపానము వలన ఎంతటి స్థితి గట్టించెను. ఈతడు నేను ఎన్ని భోధించినను వినక మీదు మిక్కిలి నన్ను గొట్టుచు తిట్టుచుండెను. ఇక ఎన్నియని ఓర్వగలను, దగ్గర బంధువులురారు. మమ్ములనెవరును ఆదరింపరు ఎవరిని వేడిన మమ్మును దూషింతురుకాని ఆదరించు వారొక్కరునులేరు. బిడ్డలకు తినుటకు అన్నము లేక ఆకలిచేమలమలమూర్ఛిల్లినారు. భర్తచూచె దమన్న చెరపాలైనాడు, ఇప్పుడు నేను దేనిని చూచియోర్తును. ఓ పరమేశ్వరా ! దయామయా ! కరుణా సముద్రా ! అప్పుడు కుచేలుని దారిద్ర్యమునుండి కాపాడితివి ఇప్పుడు మమ్ము బ్రోవగ దయరాదా ! మామొరవినవా ఆర్తజనావనుడవని బిరుదువహించితివి నీ బిరుదు సార్థకమగునెట్లు ? ఇకనైనను దయగనుము నేను జీవించిగావించు లాభమేమి ? నాకు నేటితో దైవము ఆయుస్సును ముగించినాడు. ఈ పిల్లలను పరమేశ్వరుడే కాపాడగలడు అనుచు వగచివగచి నూతిలోపడెను. లక్షాధికారి భిక్షాధికారి యాయెను. ఇది దేనివలన కలిగెను మద్యపానము వలనగదా ! మనము దానిని త్రాగువారిని త్రాగకూడదని నివారించవలెను.



# ఒక అంకెను కోరుము!

శ్రీమతి. జి. తయ్యా. మెట్రిక్.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 3 | 5 | 7 | 9 | 11 | 1 |
| 13 | 15 | 17 | 19 | 21 | 23 |
| 25 | 27 | 28 | 31 | 33 | 35 |
| 37 | 39 | 41 | 43 | 45 | 47 |
| 49 | 51 | 53 | 55 | 57 | 59 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 5 | 6 | 7 | 13 | 12 | 4 |
| 14 | 15 | 20 | 21 | 22 | 23 |
| 28 | 29 | 30 | 31 | 36 | 37 |
| 38 | 39 | 44 | 45 | 46 | 47 |
| 52 | 53 | 54 | 55 | 60 | 13 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 9 | 10 | 11 | 12 | 13 | 8 |
| 14 | 15 | 24 | 25 | 26 | 27 |
| 28 | 29 | 30 | 31 | 40 | 41 |
| 42 | 43 | 44 | 45 | 46 | 47 |
| 56 | 57 | 58 | 59 | 60 | 13 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 3 | 6 | 7 | 10 | 11 | 2 |
| 14 | 15 | 18 | 19 | 22 | 23 |
| 26 | 27 | 30 | 31 | 34 | 35 |
| 38 | 39 | 42 | 43 | 46 | 47 |
| 50 | 51 | 54 | 55 | 58 | 59 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 17 | 18 | 19 | 20 | 21 | 16 |
| 22 | 23 | 24 | 25 | 26 | 27 |
| 28 | 29 | 30 | 31 | 48 | 49 |
| 50 | 51 | 52 | 53 | 54 | 55 |
| 56 | 57 | 58 | 59 | 60 | 31 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 33 | 34 | 35 | 36 | 37 | 32 |
| 38 | 39 | 40 | 41 | 42 | 43 |
| 44 | 45 | 46 | 47 | 48 | 49 |
| 50 | 51 | 52 | 53 | 54 | 55 |
| 56 | 57 | 58 | 59 | 10 | 46 |

మనము పైననుండు పట్టికలవలె ఆరు కాగితములను తీసుకొని ఆ అంకెలను గుర్తించి మన స్నేహితుని యేదైన ఒక సంఖ్యను తలంచుకొనుటకు చెప్పవలెను. అతడు, తలంచుకొనిన పిదప ఈ ఆరు పట్టీలను అతనికి చూపి వీటిలో యేయే పట్టికలలోనుండు సంఖ్యను అతడు తలంచుకొనునో ఆ పట్టికల నన్నింటిని చూపమన వలయును. అప్పుడు మనము అతడు తలంచుకొనిన సంఖ్యను సులభముగ చెప్పగలము.

ఆ సంఖ్యను కనుగొనుట చాల సులభము. మన స్నేహితుడు తలంచుకొనిన అంకె గల పట్టికలలోని కుడిప్రక్కలో పై భాగములో నుండు సంఖ్యలను కూడుకొని చెప్పిన సంఖ్యయే అతడు తలంచుకొనిన సంఖ్యయగును. మన స్నేహితుడు ౪౭వ సంఖ్యను తలంచుకొనిన యెడల ఆ సంఖ్య ఒకటి, రెండు, మూడు, నాలుగు, ఆరవ పట్టికలలో కలదు. ఆ పట్టికలలో కుడిప్రక్కలో పై భాగముననుండు సంఖ్యలు ౧, ౪, ౮, ౨, ౩౨, వీనిని కూడిన యెడల ౪౭ అగును. ఈ ౪౭వ సంఖ్యయే అతడు తలంచుకొనినది. ఇటువంటి సంఖ్యల వలన మనుష్యులయొక్క వయస్సునుగూడ కనుగొనవచ్చును.

కొంతమంది కొన్ని పట్టికలలో యెడమ వైపున పై గదులలోనుండు అంకెలను కూడుకొనుచుందురు.

కాని ఈ పట్టికలయందు కుడివైపున పై గదులలో నుండు సంఖ్యలనే కూడుకొనవలెను.



# సరిపోయినదా?

శ్రీమతి. సీతారత్నము. పాఠిత విద్యార్థిని.

స్నేహలత బడికిరాలేదు. కారణము తెలియలేదు. ఎంత యిబ్బందిగనున్నను రాక మానదు. ఎప్పుడైన నేను రాకపోయిన కోపించుకొనును. నేడు తానే సెలవు చీటియైనను లేకుండ మానినది అని శ్యామల తన స్నేహితురాలైన స్నేహలత కొరకు విచారించి నాదినము బడిలోనుండుట కిష్టములేకున్నను "బలవంతపు బ్రాహ్మణార్థ" మన్నట్లు సాయంకాలము వరకు కాలము వెళ్లబుచ్చినది.

శ్యామల పేదయింటి బిడ్డ. కనుక తల్లి పనిచేయుచున్నప్పుడు తానుకూడ తల్లికి సాయపడి తల్లినడిగి తొందర తొందరగా స్నేహలతే యొద్దకు పరుగెత్తినది.

స్నేహలత గొప్పయింటి బిడ్డ. వివాహమై ఆరు నెలలయినవి. అత్తవారు కాకినాడయం దుండెవారు. ఒకసారియైనను అత్తగారింటికి పోలేదు. ఒక్కతే బిడ్డ కావున రామారావు ఇన్నినాళ్లయినను పంపకుండ వారు వచ్చినప్పు డెల్ల నేదో యొకవంకఁబెట్టి పంపకుండెను. కాని ఈసారి రామారావు ఆటలు సాగక బలవంత మున తీసికొనిపోయెదమని కూర్చున్నారు.

శ్యామల వచ్చినతోడనే స్నేహలత ఎదుర్కొని కూర్చుండబెట్టి తానును యెదురుగా విచారముతో కూర్చుండెను.

శ్యామల:- స్నేహా! ఈ రోజు బడికి రాలేదు ముఖమంతయు చిన్న బోయినది. ఈ హడావుడి యంతయునేమి!

స్నేహ:- ఏమిచెప్పను శ్యామా! మీ నుండి వీడిపోవుచున్నాను నేను దురదృష్టవంతు రాలను. మీ యందరితోను హాయిగా కాల క్షేపము చేయుచు చదువుకొనుటకు నాకు ప్రాప్తి లేదు. ఈవేళ కాకినాడకు బోవుచున్నాను. మరచిపోకుడు. అందరికి నమస్కారములని నన్ను చెప్పుము. ఉత్తరములు వ్రాయుచుండుము.

శ్యామ:- స్నేహ! నిన్ను విడిచి మేమెట్లుం డగలము ఒకనాడు నిన్ను చూడనట్లయిన మా మనసూరకుండదుకదా? సరే కాని యెన్నా ళ్లుండెదవు?

రామారావు:- స్నేహలతా! బండి వచ్చి నది. త్వరగారమ్మా. వర్జ్యము వచ్చును.

స్నేహలత చిన్న ముఖముతో వాకిట్లోకి వచ్చి నిలువబడినది. అదివరకే సామానంతయు బండికెక్కించినారు. స్నేహలత తల్లి లలితాంబ కూతురునుగాంచి కంటతడిపెట్టి అమ్మా! ఎన్నాళ్లయినను ఆడుపిల్లలై పుట్టిన నింతేకదా! తల్లి స్నేహలతా! నీకు తెలియనిదేమున్నది' పుట్టి నింటికి మెట్టినింటికి పేరుతెచ్చి ఎవరికి నెదురా డక పతినే దైవముగా నమ్మి ఇరుగు పొరుగు వారితో స్నేహముగానుండి యాంధ్రుశీలమనిన మాట మరువక నిత్యము వేళతప్పక ప్రార్థన చేయుచు మెలగుచుండుము అని బుద్ధులుచెప్పెను

స్నేహ:- అమ్మా! నన్ను మరువకుము త్వరగా తీసికొనిరండు (అనుచు బండిలోనెక్కి) శ్యామలా మాస్టర్ల కందరికి నా నమస్కారము లనిచెప్పుము.

శ్యామ:- సరే మన స్నేహము మరువక యుత్తరములు వ్రాయుచుండుము.

బండి కనుమేర దూరము దాటినది. శ్యామల ఖిన్నవదనయై నెమ్మదిగా నింటికి నెళ్లెను.

స్నేహలత భర్త గోపాలరావు నవనాగ రికతగానుండిన గౌరవముగా నుండునను రకము వాడు. మన స్నేహలతకివి గిట్టవు. అత్తగారో చద్దికూటి పెద్దమ్మ పొద్దున లేచుటతోడనే చద్ది యన్నము మ్రింగుట నాలుగూళ్లు వినునట్లు తేన్పుచు లోకాభి రామాయణముతో కాలము గడుపునది. ఇక గోపాలరావు స్నేహలతను

హోటలులకు, క్లబ్బులకు, పికార్లకు రమ్మని వేధించువాడు. పాపము స్నేహలత ఇది భారత స్త్రీలకు తగనిపని ప్రాచీన హిందూ నాగరికత నుపాసించుచు, నిరాడంబర జీవనములోనుండు యందరిని తెలుపుచు పెద్దలముందర పిన్నలిట్లు చేయుటతగదు అని యెన్నియో విధముల భోదించుచుండెడిది కాని యవి యతనితలకెక్కు-చుండెడివికావు. ఆమెపై నెప్పుడును అగ్ని వర్షములు కురిపించుచుండువాడు. ఇట్లొక సంవత్సరము గడపినది. ఆమె తల్లిదండ్రులెన్నిసార్లు వచ్చి తీసుకొని పోయెదమనినను పంపకుండెను. గోపాలరావు స్నేహితుడైన కృష్ణరావునకు శ్యామలనిచ్చి పెండ్లి చేసిరి.

కృష్ణరావునకు గూడ గోపాలరావునకు పట్టిన పాశ్చాత్య దయ్యమే పట్టినది ఎట్లైనను ఆడువారి నింట్లోనుండి బయటికి రప్పించ వలయు ననియును, దొరసానుల రకములో దింపవలయు ననియు, పాశ్చాత్యులవలె వారు గూడనుండ వలయునని వారి యుద్దేశ్యము.

స్నేహలతకును, శ్యామలకును గోపాలుని యొక్కయు కృష్ణునియొక్కయు ఉద్దేశ్యములలో మార్పు గల్పించవలయుననియును, దారిలోనికి తీసికొనిరావలయుననియును యుద్దేశ్యము.

గోపాలరావు తల్లి బెజవాడ వెళ్లనది ఇదియే సమయమనుకొన్నాడు కాఫీ త్రాగుచు.

గోపా:- స్నేహ! అమ్మలేదు అమ్మ యుండిన పెద్దది అడ్డున్నదన్నావు ఈ వేళ రాక తప్పదు. ఏమనెదవు ?

స్నేహ:- ఏమనెదను ? మీరన్నియు తెలిసిన వారు మీ మాటకెదురాడను. అన్నియు నాలోచించి మనః పూర్వకముగా రమ్మనిన వచ్చెదను.

గోపా:- సంతోషముతో మనఃపూర్వకముగా రమ్ము.

స్నేహ:- ముమ్మాటికి ?

గోపా:- ఆ ముమ్మాటికి.

స్నేహ:- సరే ఈరోజునకు క్షమింపుము రేపు తప్పక వచ్చెదను.

గోపా:- సరే నీమాట నమ్ముచున్నాను. రేపును వాయిదా వేసిన బాగుండదు.

అనిగోపాలరావు కృష్ణరావుతో కలిసి క్లబ్బునకు వెళ్లెను.

స్నేహలత శ్యామలను పిలిపించి జరిగిన దంతయు చెప్పి యిద్దరు నేమో మాట్లాడుకొనిరి శ్యామల యింటికి వెళ్లినది.

మరునాడు సాయంత్రము ౭ గంటల య్యెను. గోపాలరావు స్నేహలతను క్లబ్బునకు తీసుకొని పోవు సంతోషముతో గబగబ నింటిలోనికి వచ్చెను. ఇల్లంతయు నిశ్శబ్దముగా నున్నది. తలుపులన్నియు మూసియున్నవి. కాని మేడమీది తలుపు ఓరగా వేసియున్నది. మాటల చప్పుడు వినబడుచున్నది. నెమ్మదిగ మెట్లెక్కి గదిలోనికి తొంగిచూచి నిర్ఘాంతపోయెను. ఏమున్నది స్నేహలత యొక యువకునితో

చేతులు చేతులుకలిపి చీట్లాడుచున్నది. గోపాల రావునకు కోపమూపాద మస్తకము మండిపోయి నది. ఏమనుటకును తోచక గభాలున తలుపు తోసి స్నేహాయని యనెను. స్నేహాలత భయముతో నులికిపడినది. గోపాలరావును చూచి యానూతన యువకుడు వెనుకకు తగ్గెను.

గోపా:- (ముందునకడుగిడి) ఎవడు వీడు?

స్నేహా:- ఇతడు మన స్నేహితుడగు శ్యామలరావు.

గోపా:- ఛీ నీచురాలా! క్లబ్బునకు రమ్మనిన దొంగ వేదాంతములు దొంగకబుర్లు చెప్పి నీవు చేయునవిటువంటి పనులా? చూడు నిన్నేమిచేసెదనో (అని టేబిలు మీదనున్న బత్తాయిచాకును దీసి పొడువబోయెను.)

ఆ నూతన యువకుడు తన మీది కోటు టోపి తీసివేసి "నేను శ్యామలరావును కానండి శ్యామలనండి" యనెను.

గోపా:- (నిర్ఘాంతపోయి) స్నేహా! యేమనుచున్నాడు?

స్నేహా:- ఇంకేమిటి? మీరు నన్ను క్లబ్బుకురమ్మని దొరసానిని కమ్మని నిర్బంధ పెట్టితిరికదా! పది మందితో మీ యెదుట నేనిట్లుచేయుటకు మీ మనస్సెట్లొప్పుకొనునో చూతమని పరీక్ష చేసితిని.

గోపా:- స్నేహా! ఇప్పుడు బుద్ధివచ్చినది. ఇంకెప్పుడును నిర్బంధపెట్టను.

కృష్ణరావు శ్యామల చేసినపనికి తనకు బుద్ధి చెప్పినందులకు సంతోషించి యింటికి వెళ్లెను



# ఔదార్య

ఎ. సావిత్రి.

గీ॥ సంజకెంజాయ దీప్తివిస్తారశోభ
కనులకింపయి హృదయమ్ము గలచునట్టి
ప్రకృతిలోనిండు సౌందర్య ప్రతిభగాంచి
సంతసించుటలేదేల సరళహృదయ

చిన్న మామిడిగున్న నీచిన్ని గృహము
అందమగునింటి దీపంబు చందమామ
యెంతగొప్ప మేడలయిన నేమి ? సాటి
వచ్చునే నీతలంగాచు వసతికెపుడు

పిండి యారఁగఁబోసిన విధముదోఁచి
భూమియంతయు నునువెండి పూతఁబూసి
కమ్రతరమైన వెన్నెలకాయుచుండ
వలపు గాడ్పులు జోకొట్టి పాటపాడ

ప్రకృతియొడియందు నిద్రింప వలఁతివీవు
పొందు సుఖమును ధనికుఁడు పొందగలడె ?
కానబీదనే యనుచింత గాంచఁదగునె
యీవెప్రకృతి కుమారుఁడ వింతనిజము,





# ప్రార్థన.

శ్రీమతి నేమాని. భారతీరత్నాకరాంబ.

సీ॥ అవిరళకవితా సుధాసారపూర వ
ర్ధనమైన భాగవతము కిరీట
ముత్కృష్టభావ రత్నోజ్జ్వలంబై యొప్ప
హారవిలాసమ మూల్యహారమాను
జిలిబిలిపలుకులచే రమణీయమా
మనుగాథ యుంగరమునకు గుదుర
యమునాతరంగిణీ విమలవాహినిబోలు
భారత కథయె కస్తూరిబొట్టు

గీ॥ పారిజాతాప హరణంబు పాండురంగ
నాథు మహిమయుకర్ణ కుండలయుగముగ
నమరనుజ్వలమైన కల్యాణమూర్తి
చేతులెత్తి నమస్కరించెదను నీకు.

చం॥ సముచిత భూషణావళులఁజాలఁ వెలింగెడి నీకుభక్తినీ
కొమరులుపుత్రికామణులు గ్రొత్తయలంకరణాల దెచ్చినీ
సముఖమునందు నుంచి రవిసాదరతన్ ధరియించి మేనియం
దముతొలుకాడ నాకనులధన్యమొనర్పుము మాతృభారతీ !

సీ॥ ఆంధ్రప్రజల హృదయంబు చూరగొన్న
మొల్లమాంబిక యొక్క ముద్దుపలుకు
స్వాతంత్ర్యయుద్ధాన జయశీలయైన
వీరాబాయిచిలుకు శౌర్యంపువెలుగు

రాజతంత్రచణులరై రాణించు పల్నాటి
రమణీలలామల లక్షణమ్ము
దేశసేవకునై నిజేశు బాసినభార
తీదేవి దైనట్టి తెగువతనము

సీ॥ నేటికాంతలు పరధర్మనియతినిలచి
తొంటిపెంపున తేజానగుంటునడిరి
వాడువారి నవీరిప్రభావలతల
తేసుకొనునట్టు లాశీర్వదింపుడమ్మ






శ్రీమతి వి. రాజేశ్వరి.

ఒకగ్రామమందు భార్య భర్త లిరువురు గలరు. భార్యపేరు కనకలత భర్తపేరు సకలేశ్వరరావు.

కనక:- ఏమండోయి, నేనుతలంటి పోసుకొని 15 రోజులైనది. ఈరోజుకొంచము తలనొప్పిగానున్నది తలంటిపోసికొనెదను శ్రమఅనుకొనక ఆగూటిలోనున్న తైలముసీసా నిట్లివ్వండి.

సకాలే:- (తనలో) మళ్లి ఈరోజు ఈమె తలంటి పోసుకొనడము వచ్చింది ఆఫీసుకి ఆలస్యము వచ్చినట్లు ఈమెచెప్పిన పనిఅంతా చేయవలెను అని అనుకొనుచు తైలము సీసాఇచ్చును. అసలు ఆడవారికి చనువిచ్చిన అరచేతిలోనే ఆడించెదరు.

కనక:- ఇంతలో నేను తలంటుకుంటాను కానిమీారు కొంచెము కష్టమని తలంచక ఆనీళ్లు కాగుటగాను రెండుకట్టెలువేసి మీాయగ్గిపెట్టెతో రెండు కట్టెలు తగలెయ్యండి.

సకాలే:- మొదటిపని చెప్పింది చేసితిని మరల ఇది రెండోపని. స్త్రీలకు లొంగిన పురు

షుల బ్రతుకింతేయని యనుకొనుచు నీళ్లపొయ్యి క్రింద మంటవేయును.

కనక:- సరేకాని సామానుకొట్టులో ఆ గుండ్రిటి డబ్బలో కుంకుడుకాయలున్నవి. ఒక గప్పెడు కాయలుకొట్టి వేడినీళ్లలో వేయండి.

సకాలే:- ఈ వ్యవహారమంతా చూచిన ఈదినము హేడ్డాఫీసరుతో దెబ్బలు ప్రాప్తమవు నటులున్నది అనిగొణుగు కొనుచు కుంకుడు కాయలు కొట్టివేయును.

కనక:- ఏమండోయి నీళ్లు కాగినటులు న్నది అదిదింపి మనకు ఒకపావుశేరు బియ్యము పెట్టిన తలంటిపోసుకొనగానే తినవచ్చును సకాలే శ్వరరావు పావుశేరు బియ్యము పెట్టును.

కనక:- (తలంటి పోసికొనుచు) అన్నము ఆయినటులున్నది ఆబుట్టిలోనున్న నాలుగు వం కాయలుతీసి నింపుడు చెయ్యండి లేకపోతే వట్టి అన్నము ఎట్లుతినగలము.

సకాలే.- (కోపముతో) సరే! అని వం కాయనింపుడు చేసి పొయ్యిలో నిప్పుయుండిన ఇంకేమైన చెప్పుననని కట్టెలుచల్లార్చును.

కనక:- కూర అయినటులున్నది కట్టెలు చల్లార్చినారు పోనీలే కానిమీజేబులో మనీపర్సు లో చిల్లరవున్నట్లు చూచితిని ఒక్కఅణా పెట్టి చెక్కపెరుగు తీసుకరండి.

సకాలేశ్వరరావు బజారుకు వెళ్లి అణా పెరుగు తెచ్చును.

కనక:- (తల తుడుచుకొనుచు) నేను తల తుడుచుకొని వచ్చువరకు ఆలస్యమవును కావున మీరు పీటలువేసి మంచినీళ్లు పెట్టి రెండువెండి కంచములు పెట్టి వడ్డిన చెయ్యండి నేనింతలో వచ్చెదను.

సకాలే:- (వడ్డనపూర్తిచేసి) వడ్డించితిని అని కేకవేయును.

ఇద్దరుపోయి భోజనము చేయుచుందురు. సకాలేశ్వరరావు తొందరగా తినిలేచును.

కనక:- ఈదినము మీరునాకంటె తొం దరగ తిన్నట్లున్నారు కావున ఆగదిలో గూటి యందున్న తమలపాకులకు సున్నము రాచి, రెండులవంగాలు, రెండు యాలకులు, రెండు పోకచెక్కలు ఇట్లాఇయ్యండి అన్నముతిని తరు వాత ఏమిపనిచెయ్యలేను అందుకని అడుగు చున్నాను.

సకాలేశ్వరరావు వినుగుతో తములపాకుల కిల్లి కట్టిఇచ్చును.

కనక:- ఏమండోయి మీ ఆఫీసువేళ మించినటులున్నది పాపము! చాల కష్టపడితిరి మీరు ఆఫీసుకు వెళ్లినపిదప హెడ్డాఫీసరు కోప పడిన మీరు ధైర్యంగా ఉండవలెను. భయపడ వలదు మీకొచ్చినభయము నాకేమియులేదు. అని. ఇన్నినీతులు బోధించి భర్తను ఆఫీసుకుపంపి ఇంటికితాళముపెట్టి పొరుగిండ్లకు బయలుదేరింది.

# స్నేహితము.

శ్రీమతి యస్. లోపాముద్ర. మెట్రిక్.

అది యొక చిన్నయిల్లు. దూరమునుండి చూచిన ఆయిల్లు చిన్నదైనను చాల రమణీయముగా కనబడుచుండెను ఆ యింటిలోనుండు వారి పరిశుభ్రత ఆయిల్లు చూచినంతనే గుర్తింపవచ్చును. మనమిక యాయింటిలోనికి పోవుదము. ఒక వంటిగదియు దాని తర్వాత ఒక వసారయును దానినంటియే ఒక గదియునుగలవు. ఆ యింటి వెనుక భాగమున చిన్న వనముకలదు అందు సరళచే పెంచబడిన పలువిధముల పూల మొక్కలును లతానికుంజములును చూపరకాహ్లాదము కలిగించుచుండెను.

అది ప్రాతఃకాలము అరుణకిరణములా గృహమునకు బంగారు పూత పూయుచుండెను. సరళ ఏదియో పాటపాడుకొనుచు గృహకృత్యముల నెరవేర్చుచుండెను. సరళ పదినొకండు సంవత్సరముల సరళ హృదయ. కొద్దిసేపటిలో ఆ బాలిక ఒక బిందెను చేతపట్టుకొని నీళ్లకై బయలుదేరెను కొద్ది దూరమునడచి ఒక గృహమువద్ద నిలిచి 'కమలా' యనుచు తలుపుతట్టెను. 'సరళా! ఉండుము నేనిప్పుడే వచ్చెదననుచు చేతిలో బిందె పట్టుకొని కమలవచ్చెను.

కమలకూడ ఒక సామాన్య గృహస్థురాలే! సరళా కమల లిరువురును ప్రాణ స్నేహితులు కమల కించుమించు పదిహేను పదహారు సంవత్సరములుండవచ్చును. ఆమెకాపురమునకు వచ్చి నాలుగైదు సంవత్సరములు కావచ్చినది. ఆ నాలుగైదు సంవత్సరములలోనే ఆమెకు సరళతో గాఢమైత్రి యైనది. కమల భర్త ఉదార హృదయుడు. కమల తనకాపురము చక్కపెట్టుకొనుటయందు నేర్పరి. సరళపెండ్లి చాలా చిన్నతనమునందే యైనది. ఆమెకు పెండ్లియైనదికూడ సరిగా జ్ఞాపకములేదు. ఆమె పితృహీన. ఆమెకు తల్లియొక్కతయే యుండెను. ఇప్పుడు సరళా కమల లిరువురును మాటలాడుకొనుచు నదీముఖులై బోవుచుండిరి. సరళా కమలల శరీరములు వేరుకాని మనస్సులొక్కటియేయని చెప్పవచ్చును. సరళ వచ్చునప్పుడామె తల్లి యింటివద్ద లేదు. పూజకై దేవాలయమునకు వెళ్లి యుండెను.

కమల నవ్విన వికసించిన కమలమువలెనే గనబడును కాని ఆదినమేలకో కమల ముఖము

వాడియుండెను. సరళకు వాడియుండిన కమల ముఖమునుచూడ కష్టముగానుండెను. ఆమె యెప్పుడును వికసించిన కమల ముఖము చూచుటకే యిష్టపడుచుండెడిది. వాడిపోయిన కమల ముఖముచూచి సరళ ముఖముకూడ వాడిపోయెను కొంతసేపు ఎవ్వరు మాట్లాడలేదు.

సరళ;— కమలా! ఈ దినము నీ ముఖము విచారమును సూచించుచున్నది. నీముకిలీత ముఖమునునే చూడలేను. కారణమేమి చెప్పవా

కమల;- సరళా! నీతో దాచియుంచునదేమున్నది. నీవు కాపురమునకు వెళ్లువయస్సు వచ్చినది. మీ యత్తవారు కొలది రోజులలోనే రావచ్చును. ఈ విషయము జ్ఞాపకము వచ్చినప్పుడెల్లను మనము విడిపోవుదమను విచారము కలుగుచున్నది. చిన్ననాటినుండి కలసిమెలసి యుండి ఒక్కసారి విడిపోవుట యెంత కష్టము.

సరళా కమలల కన్నులనుండి జొటజొట కన్నీరు కారజొచ్చెను. సరళ (గద్గద స్వరముతో) ఇప్పుడు అమ్మకూడ అందులకే విచారముతో నున్నది కాబోలు. ఆమెకు నన్ను విడిచియుండుట కష్టము. నేను మిమ్ములను నాపూల మొక్కలను విడిచిపోజాలను.

కమల;- అమ్మా! సతులకు పతితోడిదె ధర్మము కావున నీవు తప్పక పోవలసియే యుండును. మనము దుఃఖించి లాభమేమి? యూరడిల్లుమని ఇంకేమేమో మాట్లాడు కొనుచు నదీ సమీపమునకు బోయిరి.

సరళా కమల లిరువురు బిందెలలో నీళ్లు నింపుకొని గృహోన్ముఖులైరి. సరళ తల్లి విశ్వేశ్వరి సరళ కొరకెదురు చూచుచుండెను. సరళ రాగానే 'బిడ్డా ఇంత యాలస్యమైన దేమి? అని తల్లియడిగెను. అమ్మా! కమలనేను మాట్లాడుకొనుచు వచ్చుసరికింత సేపైనదని. నేను చెప్పి నీళ్లబిందెనట దింపి తల్లికి వంటయందు సహాయ పడుటకై వంట యింటిలోనికి వెళ్లెను. తల్లి బిడ్డ విచారముగానుండుట గుర్తించి కారణ మడిగినది కాని జవాబు రాలేదు. మధ్యాహ్నము కాగానే సరళా కమలలకు చెట్లక్రింద కూర్చొని బుట్టలల్లుటయు భారత భాగవతములు చదువుటయు నాసుకమైయుండెను. సాయంత్రము కాగానే కమల తన గృహకృత్యములు తీర్చుకొనుటకును, సరళ తన పూల మొక్కలకు నీళ్లు పోయుటకును వెళ్లిపోయెడివారు. ఇట్లు కొన్ని దినములు గడిచెను. ఒక దినము సరళయింటిలో యలజడిగానుండెను సరళ అత్తవారు ఆమెను తీసికొనిపోవుటకై వచ్చియుండిరి బిడ్డను విడువవలసినచ్చెగదా యని తల్లి దుఃఖముతోనున్నను అత్తవారింటికి పంపుటకై సిద్ధముచేయుచుండెను ఆదినము సరళ ముఖమెట్లుండెనో చెప్పజాలను. ఆమె మూర్తీభవించిన శోకదేవతవలె కనబడుచుండెను. ఆమెకుతల్లిని కమలను విడిచిపోవుట కష్టముగానుండెను. తీరా సిద్ధమైన తర్వాత

సరళ కమలకు చెప్పివచ్చుటకై వెళ్లెను. కమల సరళ కండ్లనీరు కారుటజూచి అదియేమి అని అడిగి సమస్త వృత్తాంతమును తెలిసికొనెను.

కమల సరళను దగ్గర కూర్చుండబెట్టుకొని తన పైటచెరగుతో ఆమె కన్నీళ్లను తుడుచుచు ఓదార్పు మాటలు చెప్పుచుండెను కాని కన్నీరు ఆగలేదు. ఆమెయు నేడ్చుచునే యుండెను.

సరళ:- అక్కా పోయివచ్చెదను మరువ వలదని కమల పొంగిపొరలివచ్చు దుఃఖముతో ఆమెను కౌగిటజేర్చి ఓదార్చుచు అమ్మా నిన్ను మరతునాయని చెప్పెను.

అప్పటివారి స్థితినిజూచిన ఎంత కఠిన హృదయులకైనను గుండె నీరు కాకపోదు. అంతలో ఒక మనిషివచ్చి సరళను రమ్మని ఆత్రపెట్టసాగెను. సరళ తల్లిదగ్గరనుంచి లాగబడినట్టి లేగవలె కమలను విడువలేక విడిచి బయలుదేరెను. కమల తన జ్ఞాపకార్థము ఒక సువర్ణ హారమును సరళమెడలో వేసిపంపెను. కమలయు సరళ తల్లియు సజలనయనులై సరళను వీడ్కొల్పిరి స్నేహితురాలిని విడుచుట ఎంత కష్టముగానుండును.

సరళ అత్తవారింటిలోకూడ సుఖముగానే కాలక్షేపము చేయుచుండెను, కాని కమలయు తల్లియుజ్ఞాపకము వచ్చినప్పుడు ఆమె మనసునకు కష్టముగానుండెడిది. ఇట్లుకొన్ని యేండ్లుగడచెను కమల వీలైతె సరళను చూడవలెనని యనుకునెడిది. ఒకసారి యామె సరళయుండుపూరి మీదుగాపోవుట తటస్థించెను. ఆమె భర్తసెలవు గైకొని సరళ యింటికి వెళ్లెను, కమల వెళ్లునప్పటికి సాయంత్రమైనది సరళ గృహకృత్యములు దీర్చుకొని యింటి వెనుకనున్న పూలమొక్కల వద్ద అన్యమనస్కయై కూర్చునియుండెను.

అప్పుడు కమల వెనుకనుండి వెళ్లి కండ్లుమూసి ఎవరో చెప్పుచూతము అనెను. సరళ 'విమల' అనెను. విమల సరళకు అత్తవారింటిలో కలిగిన స్నేహితురాలు. కమల విమల ఎవరు నన్ను మరచితివా యని ముందరికి వచ్చెను. సరళ తలవని తలంపుగా వచ్చిన తన పూర్వ స్నేహితురాలిని జూచి సంతోషాశ్చర్యములు పెనగొన నోటమాటలేక అట్లె కమల యొడిలో పడిపోయెను. కమల సందర్శనమువలన సరళకెంత యానందము కలిగెనో చెప్పజాలము, ప్రాణస్నేహితును విడచియుండి యిక చూడమనుకున్న తరువాత చూచిన యెంత యానందముండును, ఆ యానందముచేతనే సరళ నైమరచిపోయినది,



# బాల గీతికలు.

## మాతృభారతి.

మాయన్నతోఁగూడ ♦ మాటాడుకొనుచు
బడికిపోయెదనమ్మ ♦ పంపవేనన్ను
ప్రొద్దుప్రొద్దున వేడి ♦ బువ్వారగించి
బడికిపోయెదనమ్మ ♦ పంపవేనన్ను
తలదువ్వుకొని ♦ దుస్తుధరియించి నేను
బడికిపోయెదనమ్మ ♦ వంపవేనన్ను
పలకబల్పము చేత ♦ బట్టుకొని రేపు
బడికిపోయెదనమ్మ ♦ పంపవేనన్ను
అఆలు దిద్దుకొని ♦ అన్నంతవాఁడు
బడికిపోయెదనమ్మ ♦ పంపవేనన్ను
చెల్లెలికి నేనేర్చి ♦ చెప్పగల్గుదునే !
బడికిపోయెదనమ్మ ♦ పంపవేనన్ను
చదివిపెద్దప్పకు ♦ జాబువ్రాసెదనే
బడికిపోయెదనమ్మ ♦ పంపవేనన్ను
పెద్దపుస్తకము నే ♦ వినిపింతు నీకు
బడికిపోయెదనమ్మ ♦ పంపవేనన్ను
నాన్నవద్దన్నను ♦ నావైపుపలికి
బడికిపోయెదనమ్మ ♦ పంపవేనన్ను



# వినరూ నా కథ.

శ్రీమతి మేర్సి. ఐదవ ఫారము.

నేను పుట్టినవెంటనే మొదటి మెట్టునుండి చివర మెట్టువరకు దొర్లుచు పోయినప్పటికిని నా చాపుగండము మాత్రము తప్పిపోయినది. నా చిన్నతనములో నేను అసాధ్యమైన పనులను చేయుచుంటిని. మా నాన్నగారి కచ్చేరిలో వెంకయ్యాయను పేరుగల యొక నౌకరియుండెను. అతనిని నేను వెలక్కాయ అని పిలిచెడిదానను. పనికి మాలిన కాగితములను తెచ్చి చదువు చున్నట్లు నటించెడిదానను. అందువలన మా నాన్నగారు నన్ను చదివించవలయునను ఉద్దేశ్య ముతో ఐదేండ్ల ప్రాయమందే నన్ను ఒక బడికి పంపిరి. చదువక పోయినను మూడు పైసలు ఇచ్చునంతవరకు భల్లూకపు పట్టుపట్టి మూడు పైసలు ఇచ్చినతోడనే బడికి వెళ్లెడి దానను. చదువు శూన్యమైనప్పటికిని మూడు అనే అంకె మాత్రము చక్కగా తెలసియుండెను. బడికివెళ్లినరోజు నామీద చాలా పిర్యాదులు వచ్చేవి. మా తల్లిదండ్రులకు ఇవన్ని తెలిసి వారికి యేమితోచకపోయేది. ఉపాధ్యాయురాలు నీవు ఈ విధముగా అల్లరిచేయుచున్న నీకు చదువురాదని నాపై కోపగించి కొట్టేదికూడ. అందువలన నేను మామిడిపండ్లను మా అన్నయ్యకు పెట్టకుండా తినుచుండెడిదానను. మా అన్నయ్యా నాకు పెట్టవమ్మ అని అడిగిన అలలు తప్పలేక వారియించుకొనిన తరువాత గోరంత పెట్టే దానను. మా పిన్నికూతుళ్లదగ్గర పైసలుండిన. వారి కడుపులో రాళ్లున్నప్పటికిని కరిగిపోవు నట్లు మాటలాడి ఆ పైసలను లాగుకునెదానను కొంతి కాలమైన తర్వాత వారుకూడ చమ త్కారముతో నాకు పైసలివ్వకయుండిరి. అందు వలన నేను వారికి సినిమా చూపించెదనని వారి యొద్దనుండి పైసలు తీసుకొని ఒక మంచము చుట్టు ఎర్రని శాలువకట్టి మంచము క్రింద అందరిని లోపలికి రమ్మని తీసుకొని వెళ్లి ఒక పెద్ద పటముగల పుస్తకము నాచేత పుచ్చు కొని చమురుదీపమును నాసమీపమున పెట్టుకొని వారికి సినిమాయని చూపించెడిదానను. వారు ఇది సినిమాకాదోయని ఏడ్చేవారు. ఇది సినిమా నే అని నేను ఏడ్చేదానను ఒక దినము ఇదే విధముగా చమురు దీపము పెట్టుకొని వారికి సినిమా చూపుచుండగా శాలువకు మంట తగులుకొలి సగము మంచము కాలిపోయెను.

ఇంతటిలో సినిమా వృత్తి అంతరించెను. నాకు చిన్నతనములో లెమ్‌నేడ్ అంటె ఎంతో ఇష్ట ముగా నుండెడిది. ఎన్నిమార్లు త్రాగిన తనివి తీరకపోయెడిది. మా పిన్ని కూతురుకు ఒక దినము తేలుకుట్టినది. లెమ్‌నేడ్ త్రాగగా తేలుకుట్టినట్లగునని ఆమెతో చెప్పగా నామె నమ్మి ఇదివరకు లెమ్‌నేడ్ ఎంతో ఉత్సాహముతో త్రాగినను వద్దని ఏడ్చెడిది. అందువలననే నేను ఆపనిని ముగించెడిదానను. సరే ఇంటి వ్యవ హారములిట్లుండగా బయటి వ్యవహారములు ఇంత కంటె అనర్థముగా యుండినవి. మా యింటి దగ్గర ఒక పెద్ద తోటయుండెను. ఆ తోటవారు పండ్లను డబ్బు యిచ్చెదననినను ఇవ్వక పొయ్యెడి వారు. అందువలన నలుగురైదుగురు పిల్లలను పోగుచేసికొని తోటకు వెళ్ళుదామని పోత్సా హించుదానను. వారు అమాయకులు అందు వలన నన్ను వెంబడించెడివారు.

ఆ తోటలోనికి ప్రవేశించుటకు వెనుక ప్రక్క ఒక పెద్ద కిటికియుండెను, వాస్కొడి గామ ఇండియాకు దారి కనిపెట్టినట్లు నేను తోటలోకి దారి కనిపెట్టితిని. ఆ తోటలోకి వెళ్ళినతోడనే అందరికంటె ముందు పండ్లను కోసుకొని నేను బయటికి వచ్చి వారిని రానివ్వక ఆ కిటికిని మూసివేయుచుంటిని. వారు అచ్చట వారితో దెబ్బలతోపాటు చీవాట్లుతిని యింకొక ద్వారముగుండ వచ్చి నాతో పోట్లాడెడువారు. చిన్న పిల్లలయొద్ద పైసలున్నయెడల లాగుకొని ఎట్టని పెప్పరమెంట్లు నీళ్లలో కలిపి లెమ్‌నేడ్ అని చెప్పి ఇచ్చెడిదానను వారు ఇది లెమ్‌నేడ్ కాదో అని ఏడ్చెడివారు. ఇది లెమ్‌నేడ్ అని నేను ఏడ్చెడిదానను. చిన్న పిల్లలు మంచి ఆటలలో పాటలలో మగ్నమైయుండు సమయ మున నా డబ్బు పెట్టి కొనిన పండ్లను ఆ పిల్లల నాన్నగారే కొనిచ్చారని చెప్పెడిదానను. ఆ పిల్లలు వారి తండ్రివచ్చిన వెంటనే పండ్లు మాకు కొనిపెట్టక మీరే కొనుక్కొని తిన్నారని ఏడ్చె వారు. అతనేమో నేను కొనుక్కొని తినలేదని కసిరేవాడు. ఒక రోజు చిన్న పిల్లలతో దాగుడు మూతలాడుకొనుచు ఒక చిన్నపిల్లను తెలిసియో తెలియకనో ఒక పెట్టెలో దాక్కొమ్మని ప్రోత్స హించితిని. ఆపిల్ల అట్లే దాగుకొని ఊపిరి యాడక మరణించెను. నేను అసాధ్యురాలనని మా యమ్మ గ్రహించి ఆ రేండ్లు వచ్చిన వెంట నన్ను ఒక వసతి గృహమునకు పంపినది. అచ్చట చిన్న పిల్లలు నిద్రించుటకు ఒక గది ఏర్పరచి యుండిరి: అచ్చట పడుకొని మధ్యరాత్రి అందరు గాఢనిద్రలో నుండునపుడు నేను లేచి గట్టిగా అరచుచు పరుగెత్తెడిదానను. తక్కిన పిల్లలంత ఏడ్పులతో, సంగీతములతో అరుపులతో నన్ను వెంబడించెడివారు. ఆ కళాశాల అధ్యక్షుల నిద్రకుకూడ భంగము కలుగునట్లు అరిచే వారము.

ఈ విధముగా నేను చిన్నపిల్లలను, భయ పెట్టుట ఆమె విని నన్ను కఠినముగా శిక్షించెను. క్రొత్తగా బడియందుచేరిన పిల్లలతో ఉపాధ్

యురాలనని చెప్పి బాగాపని చేయించుకొనే దానను. వారు నాకు నాలుగు రోజులవరకు అతి వినయముగా పనులు చేయుచుండిరి. కొంత కాలమైన పిదప ఉపాధ్యాయురాలు కానని గ్రహించి నాతో మాట్లాడెవారు.

మా యుపాధ్యాయురాలు నా క్లాసు పిల్లలను ప్రశ్నలడిగిన వారు ఒక్కొక్కప్పుడు ప్రశ్న తెలియక నన్ను దానికి ప్రత్యుత్తరము చెప్పుమని అడిగెవారు. నేను పుస్తకములో లేని మాటలు వారికి అందించెడిదానను అనూయకులు అట్లు చెప్పి చీవాట్లు పడెడివారు. పొట్ట పొడిచిన ఒక అక్షరమురాని పిల్లల యొద్దకు పోయి A. B. C. D. తర్జుమాచేసి లేనిపోని అర్థములు చెప్పుదానను. పదిరెండు సంవత్సరముల ప్రాయము వచ్చినవెంటనే చదువుమీద విరక్తి పుట్టి హైదరాబాదు మీద అంతకంటె విసుకు జెంది మరియొక దేశమునకు వెళ్లవలయునని తలంచితిని. ఆ రోజులలో నందరును చెన్న పట్టణము బాగుండునని చెప్పెడివారు. ఎరుగని అంగినాచివలె నేను వినుచుంటిని. అది నా మనస్సులో జాల పీడించెడిది. ఎప్పుడు వెళ్లుదునా యని వేచియుంటిని. పోవడమెట్లని మాయమ్మ ఒక గూటిలో నాలుగు రూపాయిలు దాచిపెట్టుట నేను చూచితిని. మరునటి దినము మా యింటిలో ఎవరులేని సమయమున ఆ నాలుగు రూపాయలు దొంగలించి స్టేషనుకు వెళ్లితిని. స్టేషను మాస్టరు నాలుగు రూపాయలకు టికెట్టురాదని నాల్గు చీవాట్లుపెట్టి పంపివేసెను. ఎట్లాగు భగవంతుడాయని యోచించి. త. థ, ద, ధ, ల తరగతిలో జేరిన యొకాయనతో స్నేహము చేసితిని. ఆయనకూడ చెన్నపట్టణము వెళ్లు నని తెలిసి ఆయనతో మైత్రిచేసిన రెండు విధముల లాభము కలుగునని నమ్మి అచ్చటకి వెడలి ఆయనతోనే బండి ఎక్కితిని. మేమిరువురమును కులాసాగా ముచ్చటించుచుండ టికెట్టు కలెక్టరు ధ్వనివినబడినది. నాతో వచ్చిన ఆయన మంచి శాలువ కప్పుకొనియుండెను నా దుస్తులు నతని శాలువ యొక్కే వర్ణము కలిగియుండెను. కాన టికెట్టు కలెక్టరు ధ్వని వినినతోడనే అతని శాలువలో దాగి నన్ను నేను కాపాడుకొంటిని.

కష్టముల ననుభవించియో సుఖముల ననుభవించియో చెన్నపట్టణము జేరితిని. అచట నేర్చిన ఆంగ్లేయములోని పాండిత్యము ను దాసికి జూపుదానను. ఆంగ్లభాష నేను మాటలాడగనే యామె జిఱ్ఱుమని నా మీదకి లేచెడిది. ఒకరోజు ప్రాతఃకాలమున లేచి యామెకు Good morning అని మర్యాదగా జెప్పితిని. ఆమె యేమో యీ విధముగా పలికింది చూడుచూడయ్యా నాకు గిందుకనే కోపం అస్తది ఆంగ్లెజిలో గట్లుంగుకు మాట్లాడు తావు అని నాతో నొక చిన్న పోరాటము పెట్టుకొని కోర్టులో పిర్యాదుచేసినది. అంత వారు నన్ను పిలిపించి విచారణచేసిరి. పని మనిషి మాయింటికి వచ్చుట మానివేసినది.

వంట నామీదపడినది. వంటచేసికొనిన నాగరికతకు భంగము కావున నా స్నేహితురాలికి నాకు చాలా ఆస్తియున్నదని చెప్పి ఒక పిల్లను వివాహ మాడితిని. వివాహము జరిగిన రెండు నెలలకే నేను హైదరాబాదులో నొక యుద్యోగము కొరకు ప్రయత్నించితిని. నా యదృష్ట వశమున నాబోటి విద్యావిహీనునకు గూడ యుద్యోగము లభించినది. సంపాదించిన మొత్తముతో మూర్ఖ ప్రవర్తనలను మాని తల్లిని పోషించుచుంటిని. నావంటివారు భారత దేశమున లేనిచో ఏమైయుండెడిదో మీరే యూహింపుడు.





# బాలికల ఉన్నత పాఠశాల ప్రచురణములు.

| గ్రంథములు | రచయితలు |
|---|---|
| ౧. మాతృభారతి (ప్రథమ సంపుటము) | బాలికా సంఘము |
| ౨. ,, ద్వితీయ ,, | ,, |
| ౩. ,, తృతీయ ,, | ,, |
| ౪. ,, చతుర్థ ,, | ,, |
| ౫. పండిత కేశవరాయ జీవితము | రాపోలు లలిత, కమల |
| ౬. ఘోషయాత్ర | సం. ఇందిరాదేవి బి. ఏ. గారు |
| ౭. భారతీ నక్షత్రమాల | నే. భారతి |
| ౮. నిర్మల | ,, |
| ౯. రాజాబహాదురు వేంకటరామారెడ్డి, ఓ. బి. ఇ. గారి జీవితము. | సు. ప్రతాపరెడ్డిగారు, బి. ఏ., బి. ఎల్. |

